మూర్ఛపోయెను. కృపాచార్యు డాతనిని దూరమున గొనిపోయి సేదతీర్చెను. ఆనాటి మధ్యాహ్నసమయమునకు శల్యుడు యుధిష్ఠిర ప్రయుక్తమైన శక్తిచే నేలగూలెను.

అప్పటికిని రారాజు ధైర్యమును వీడక సైన్యముల కుత్సాహము చెప్పుచు పోరుచుండెను. పాండవబలము అల్పముగా నున్నది. కృష్ణార్జునులు డప్పి చెంది యున్నారు. జయముగొనవచ్చును. మనము బెండువడనేలయని యాతడు మూకలను ఎచ్చరించెను. ఇంతలో ఆశ్వికసహాయుడై శకుని పాండవసైన్యములను వెనుకనుంచి తాకెను సుబలనందనుడు ఆశ్వికబల సంచాలనమునందు నేర్పరిగా కాన్పించును. పాండవపక్షమున అశ్వవిద్యయందు నిపుణుడు నకులుడు మాద్రేయులిరువురును గుఱ్ఱపు దళమును ప్రయోగించు నేర్పు కొంతకలవారు. దీనిని వారు మేనమామల దేశమున అలవరచుకొని యుందురు కృష్ణార్జునులు దుర్యోధనుని మౌర్ఖ్యమునకు ఆశ్చర్య పడు చుండిరి. యుద్ధారంభమునందు పదునొకండక్షౌహిణులు కలిగి మహాసాగరము వలె వ్యాపించి యున్న సైన్యము నేడు గోష్పాదమంతయైనది. ఐనను ధార్తరాష్ట్రుడు మత్సరము నీడడాయెనని వారు చింతించిరి. శకునికుమారుడు ఉలూకుడును శకునియు సహదేవునిచే చచ్చిరి. కౌరవసైన్యములు నిలువక పారిపోవుచుండెను. తనచుట్టును గుప్పెడు మందియైనను లేకుండుటచే దుర్యోధనుడు నిరుత్సాహుడై ఇప్పటికి తొలగి పోయి, సేదతేరి మరల విజృంభింతునని తలపోసి, గుఱ్ఱమునుదిగి, గదాదండము భుజ మున దాల్చి యేకాకియై రణాంగణమునుండి తొలగిపోయెను. ఏకాదశాక్షౌహిణీపతి పరివారశూన్యుడై వెడలిపోయి ద్వైపాయన హ్రదమునందు దాగుకొనెను.

ఇప్పటినుండియు దుర్యోధను చరిత్రము వటి తెగింపుతోను దైన్యముతోను సాగి యాతని మరణముతో ముగిసినది. హతశేషులలో సంజయుడును, కృపాశ్వ త్థామ కృతవర్మలును ద్వైపాయన హ్రదము చెంత గాంధారేయుని రహస్యముగ కలిసి కొనిరి, పాండవులు దుర్యోధనుని వెదకికొనుచు వచ్చి, మడుగులో దాగియున్నాడని తెలిసికొని వానిని మానభేదకములగు మాటలచే నొప్పించి నీరు వెడిలించిరి. అప్పు డును ఆతడు ధీరత్వమును వీడకుండెను. తమలో ఒకనిని కోరుకొని వానితో ద్వంద్వ యుద్ధము చేయుమని ధర్మరాజు పలికినదానికి భీమునివరించి వానితో భయంకర గదా యుద్ధము సాగించెను. శ్రీకృష్ణుని సూచన మేరకు అర్జునుడు చేసిన సంజ్ఞను గుర్తించి భీముడు గాంధారేయుని తొడలు విరుగ గదా దండముతో మోదెను. తొడలు విరిగిపడి పోయిన రారాజును భీముడు ఎడమకాలితో తలదన్ని తన లఘువృత్తిని చూపెను. ధర్మ రాజు చాల నొచ్చుకొనెను. బలరాముడు మహాగ్రహము చెందెను. దుర్యోధనుడు తనకు

అన్యాయము జరిగెనని వాపోవ శ్రీకృష్ణుడు ఆబాల్యము వాని దుర్ణయములను పేర్కొని యూరకుండుమనెను. సుయోధను డట్టి దీనావస్థయందును పేదమాటలాడక పరమ ఆత్మ విశ్వాసముతో నిట్లుపలికెను.

చదివితినెల్ల వేదములు జన్నము లొప్పఁగజేసితిన్ రమా
స్పదమగు వృత్తిఁ బొల్చి నర పాలకులెల్లను గొల్వఁగంటి దు
ర్మదరిపు గాఢగర్వపరిమర్దనకేళి యొనర్చి తిందగం
దుదినని మిత్రబాంధవులతోఁ ద్రిదివంబునకేఁగు టొప్పదే

శ్రీ కృష్ణుడును పాండవులును దుర్యోధనుని వీడి కౌరవశిబిరమునకు నడచిరి ధృష్టద్యుమ్నాదులును కొందరు రాజులును విశ్రాంతికై పాండవ శిబిరమునకే వెడలిరి. ఇదియే వారి దుర్మరణమునకు మూలమైనది. ఇంతలో అర్జునునకు అగ్నిదేవు డిచ్చిన రథము, తురగములతోగూడ అద్భుతముగ కాలిపోయెను. పాండవులు దుర్యోధనుని భాండా గారమును వశముచేసికొనిరి. కౌరవస్కంధావారము పాడువడి శ్మశానమువలె నుండుటచే ఆరాత్రి యిచ్చట విశ్రమించుట క్షేమముగాదని శ్రీ కృష్ణుడు పాండవులను ఓఘవతీ నదీ తీరమునకు గొంపోయెను. కుమారుల నందరను రణమునందు చంపుటచే మహాపతివ్రతయైన గాంధారి కుంతీతనయులను శపించునని వెరచి, యుధిష్ఠిరుప్రార్థనపై శ్రీకృష్ణుడు స్వయ ముగా హస్తినాపురమునకు పోయి గాంధారీ ధృతరాష్ట్రులను నేర్పుతో ఓదార్చెను. ఈ దారుణ సంగ్రామము సుయోధనుని మూర్ఖత్వఫలమని మెల్ల మెల్లగా వివరించెను. వారును తత్కాలోపశమనము చెందిరి. కోపనుడైన యశ్వత్థామ పాండవుల కేమి యపకారము చేయునోయని చింతించుచు శ్రీ కృష్ణుడు ఓఘవతీతీరమునకు మరలెను.

పాండవులు తొలగిపోవగనే సంజయుడును, రథికత్రయమును తొడలు విరిగి మరణవేదన చెందుచున్న దుర్యోధనుని చేరి యాతనికై కడు విలపించిరి. నేల నాలుగు చెఱగులు ఏలినవానికి ఇట్టిదుర్దశ కలిగెను 'కాలసంప్రాప్తమేరికిఁ గడపవచ్చు' అని వాపోయిరి. పాండవులు కపట ధర్మకంచుకము ధరించినవారు కాని నిక్కపు ధర్మపరులు కారని దుర్యోధనుడు వారి నుద్బోధించెను. ఈ సన్నివేశమంతయు కరుణరసపరాకాష్ఠను ప్రదర్శించును. భీముని అధర్మగ దారణమునకును, పడిపోయినవానిని తలదన్ని నందుల కును అశ్వత్థామ నితాంతక్రోధోజ్జ్వలుడై పాండవులపై ప్రతీకారము సలుపుదునని ప్రతి జ్ఞచేసెను. దుర్యోధనుడును ప్రహృష్టుడై కృపాచార్యునిచే సరస్వతీ నదీజలములు తెప్పించి అశ్వత్థామను సేనాధిపత్యమునం దభిషేకించెను. అంతనారథికత్రయము తమ దారుణ సంకల్పమును కార్యరూపము నందించుటకై వెడలిపోయిరి.

# సౌప్తికపర్వము – కథాసారము

అట్లు వెడలిన కృపాశ్వత్థామ కృతవర్మలు పాండవ శిబిరమువైపు నడచిరి. అక్కడ విజయోత్సాహము కోలాహలముగా సాగుచుండెను. తాము గుర్తింప బడుదు రను భయముచే రథికత్రయము చీకటియగు నంతకు సమీపారణ్యమున గడపిరి. కృప కృతవర్మలు పరిశ్రాంతులగుటచే నిద్రాభిముఖులైరి. పరాభవ దందహ్యమానమానసుడగు అశ్వత్థామకు రెప్పవాలుటలేదు. పాండవులపై నెట్లు పగదీర్చుకొనుట యను నాలో చనలోపడి యాతడు సతమతమగుచుండెను. ఇంతలో నాతడు మేనువ్రాల్చిన వటవృక్ష శాఖల యందొక క్రూరదృశ్యమాతనికంట బడెను. అక్కడ భయంకరమైన యొక గుడ్లగూబ చెట్టుమీద ఆదమరచి నిద్రించుచున్న వాయసములు మొదలగు పక్షులను నిద్రలో ఆక్రమించి కంఠములు కొరికి, పెక్కులుచీల్చి దారుణముగ సంహార మొనర్చు చుండెను. ఇది యే శత్రుసంహారమునందు తన కుపదేశమని గురునందనుడు సంతో షిత స్వాంతు డయ్యెను. నిద్రాముద్రితులైన పాండవవీరుల నాక్రమించి చంపవలెనను నిశ్చయమునకు ఆకఠోరవ్రతుడు వచ్చెను. వెంటనే తనమిత్రులను మేల్కొల్పి తన క్రూరనిశ్చయమును ప్రకటించెను. వృద్ధుడును పార భీరువునగు కృపాచార్యుడు దానికి సమ్మతింపక మేనల్లునకు నీతులు చెప్పెను.

> వినుము కురుక్షితీశుఁడు వివేకవిదూరుఁడు క్రోధలోభముల్
> మనమునఁ బేర్చినఁ దురభిమానమునన్ హితులెంత చెప్పినన్
> వినక బహుప్రకారముల నిందకు నోర్చి పరాభవించె స
> జ్జనులగు పాండు పుత్రులన సత్పథవృత్తికి జేటు తప్పునే.

ఇప్పుడు మన కర్తవ్యము ధృతరాష్ట్రుని గాంధారిని సందర్శించి వారెట్లు చెప్పిన నట్లు చేయుట అని గురుపుత్రుని పాప వ్యవసాయమును నిలువరింప యత్నించెను. కాని మత్సరగ్రస్తుడగు నాతడు వినకనే నొక్కరుడనే ఈ కార్యము నిర్వహింతునని పట్టుదల పట్టగా విధిలేక ఆ యిద్దరును వాని ననుగమించిరి.

ఇట్లు పోవు అశ్వత్థామ స్థిరసంకల్పమును పరీక్షించుటకు కాబోలు మహాదేవుడు ఒక భయానక భూతరూపమున ఆతనిమార్గము నరికట్టెను. గురునందనుడు ఆ పెను భూతముపై విడిచిన బాణములన్నియు వ్యర్థమాయెను తుదకా తీవ్ర స్వభావుడు ఆత్మోప హారమునకు సంసిద్ధుడు కాగా శివు ప్రత్యక్షమయి వానికొక మహనీయ ఖడ్గమును

ప్రసాదించెను. అశ్వత్థామ సంతోషించి అప్రతిహతమైన ఆ ఖడ్గ సహాయముతో పాండవ సంహారమున కుద్యమించెను. ఆస్కంధావారము గుట్టుమట్లు ఇంతకు ముందే తెలిసికొనిన వాడగుటచే మున్ముందు ద్రోణవధా పాతకియైన ధృష్టద్యుమ్నుని శిబిరము చొచ్చి, నిద్రించువానిని తన్ని లేపి ఆక్రమించి ధనుస్సు అల్లె త్రాడును వానికంఠమునకు బిగించి ఉరిపోసి చంపెను. పిశాచోన్మత్తుడైన యావీరుడు క్రమముగా పాంచాలురందరను, ద్రౌపదేయులను అసంఖ్యాకయోధులను నిద్రావశులైన వారిని నిర్దయుడై ఖండించెను. మేలుకొని పారిపోవజూచు అభాగ్యులను కృపకృతవర్మలు శిబిరముఖమున నిలిచి ప్రిదిలిపోనీకుండ చంపివేసిరి. అశ్వత్థామ చెప్పినట్లు 'మాటలు పెక్కేల మానిసిగుజ్జుమేనుంగను పేరెల్లఁద్రుంగె' పాండవులును కృష్ణసాత్యకులును మాత్రము ఆ శిబిరములో దొరకనందుకు గురుపుత్రుడు విచారించెను వాని రాక్షసావేశమునకును నీచపరాక్రమమునకును కుందుచు కృపకృతవర్మలు తలలు వాంచి యూరకుండిరి.

అంత నా ముగ్గురు యోధులును తాము నడపిన సంహార వృత్తాంతమును దుర్యోధనునకు వినిపించుటకై పరుగెత్తిరి. ఆతడును ఆసన్నమరణుడై తీవ్రవేదన పొందుచుండెను. ఆతని దీనస్థితిచూచి వారు మరల బిట్టుశోకించిరి. అశ్వత్థామ కురురాజు నిట్లు ఉద్బోధించెను.

> కౌరవ నాయక నీదు గ
> దారణ గౌరవము సకల ధరణీజన చే
> తో రంజనమై నిర్మల
> సారయశోధనము నీకు సంపాదించెన్.

నీకునై వగపు పుట్టదు. పుణ్యలోకమునకు పోయినపుడు ద్రోణుని చూచి ద్రోహియైన ధృష్టద్యుమ్నుని నీ తనయుడు వధించెనని చెప్పుము'. అని విన్నవించెను. ఉపపాండవ పాంచాలాది మరణమును విని దీర్ఘక్రోధియైన గాంధారేయుడు సంతసించి వారి నిట్లభినందించెను. భీష్మద్రోణులు కాని కర్ణశల్యులు కాని మీరుచేసిన మేలు చేయరైరి. "మీరు కృతకృత్యులరు సుఖులరై యుండుఁడు. పునర్దర్శనంబు త్రిదివంబున నయ్యెడు గాక పొండు" అని పల్కి ధృతరాష్ట్రనందనుడు ప్రాణములు విడిచెను. రథికత్రయమును దుఃఖముతో ఆతనికి ప్రదక్షిణముచేసి 'మరలి మరలి చూచుచు' రథారూఢులై వెడలిపోయిరి.

మరునాడు సూర్యోదయ సమయమునకు ధృష్టద్యుమ్నుని సారథి పాండవుల కడకు వచ్చి రాత్రి జరిగిన దారుణవధ క్రమమును తెల్పెను. ధర్మరాజాదులు మూర్ఛ మునిగి, తెలిసి మిక్కిలి పలవించిరి సముద్రమంతయు గడచివచ్చి చిన్న క్రయ్య యందు మునిగిపోయె నట్లయ్యెనని యారాజు దుఃఖించెను. ద్రౌపదికి ఈ దుఃఖవార్తను తెలుపుటకై నకులుని పంపిరి. ఆమెయు ద్రుపద విరాటులు మరణించిన నాటిరాత్రి వారి భార్యలను ఓదార్చుటకై సుభద్రతోను ఉత్తరతోను కలిసి మాత్స్యనగరమునకు పోయియుండెను. నకులుడు ఉపప్లావ్యమునకు పోయి ద్రౌపదికీ దురంత వార్త చెప్పి ఆమెను ఇతర స్త్రీజనమును గొనివచ్చెను. క్షత్రియకాంత సంతానము సంగ్రామనిహతు లగుట యుక్తమే కదా అని పలువురు ఆమెను ఆత్మపుత్ర నాశనమునకై ఊరడించిరి. దురాత్ముడైన అశ్వత్థామను వధింతుమని క్రోధముతో పలికిరి. ద్రౌపదియు గురునంద నుని శిరస్సు నందలి రత్నమును తెచ్చి చూపినచో జీవముతో నుందునని భీముని హెచ్చరించెను. వెంటనే యాతడు నకుల సహాయుడై రథమెక్కి అశ్వత్థామను వెదకు టకు బయలుదేరెను గురునందనుండు దుస్సాధ్య విక్రముడు. క్రూరుడు. వానివద్ద బ్రహ్మశిరోనామకమను లోక సంక్షయకరమైన మహాస్త్రమున్నది. భీము నొక్కనిని పంపుట క్షేమము కాదని శ్రీకృష్ణుడు ధర్మరాజునకు చెప్పెను. అంత సహదేవ సాత్యకు లను స్కంధావారరక్షణకై నియోగించి ధర్మరాజును శ్రీ కృష్ణుడును అర్జునుడును భీమ సహాయమునకై వెడలిరి. పలాయితుడై ద్రోణపుత్రుని కృష్ణద్వైపాయ నాశ్రమ సమీప మున తపస్సును పూనియుండ పట్టుకొనిరి. పాండవవీరులను జూచి భయక్రోధములతో వాడు తన తండ్రి యిచ్చిన బ్రహ్మశిరోనామకాస్త్రమును ఒక గడ్డిపరకయందు ఆవహించి ప్రయోగింపగా అది భయంకర జ్వాలలతో పాండవుల నాక్రమింపవచ్చెను. శ్రీకృష్ణ ప్రేరితుడై పార్థుడును ఆత్మరక్షణకై అదే యస్త్రమును ప్రయోగించెను. నారద వేద వ్యాసులు ఆ మహాస్త్రములచే లోకసంక్షోభము గాకుండ ఎవరియస్త్రము వారుపసంహరించు కొనవలెనని బోధించిరి. సత్త్వస్వభావుడును గురుభక్తియుక్తుడును అగు పార్థుడు తన యస్త్రముపసంహరింప గలిగెను. తామసవృత్తియగు అశ్వత్థామయట్లు చేయలేకపోయెను. ఆయస్త్రము లక్ష్యము లేనిదైనచో ప్రయోగించిన వానినే సంహరించుననుు నియమము కలదు. క్రూరుడైన యశ్వత్థామ దానిని పాండవ స్త్రీగర్భములపై విడుతుననెను. పాం డవ వంశాంకురము నిల్పుటకై యొక్క గర్భమును మాత్రము వదలుమని శ్రీ కృష్ణా దులు ఎంతచెప్పినను వినక సకలగర్భ విధ్వంసకముగా ఆతడు తన యస్త్రమును విడ చెను. వాసుదేవుడలిగి అశ్వత్థామ యస్త్రప్రభావమున ఉత్తరాగర్భ గతశిశువు మరణించి నను తన తపశ్శక్తిచే వానిని జీవింపచేయుదుననియు వాడు పరీక్షిన్నామము ధరించి

ధర్మోత్తరముగా దీర్ఘకాలము భూమినేలుననియు శపథము చేసెను. అంతట పాండవేయులు అమోఘ ప్రభావము కల శిరోరత్నమును అశ్వత్థామ వద్దనుండి గ్రహించి వానిని వెడల నడచిరి. గురు నందనుడగుటచే వానిని చంపగూడదని అర్జునుడు విడిచి పుచ్చెనవి చెప్ప నైనది. చూడారత్నమును దెచ్చి భీముడు ద్రౌపది కీయ ఆమె దానిని ధర్మరాజున కర్పించెను శ్రీకృష్ణుని అభయము కల్గుటచే ఊరడిల్లియు ఉత్తర గర్భమున కేమి కీడుకలుగునోయని వారు భీతిల్లజొచ్చిరి.

## శివ మాహాత్మ్యము

అప్పుడు యుధిష్ఠిరుడు మహాయోధులైన శిఖండి ధృష్టద్యుమ్నాదు లందరను ఒంటరిగానైన అశ్వత్థామ యెట్లు సంహరింప గలిగెను. వాని కట్టి శక్తి యెట్లు వచ్చెనని శ్రీ కృష్ణు నడుగగా నాతడు రుద్ర ప్రభావముచే గురునందనున కట్టి శక్తి కలిగెనని ఉపన్యసించెను.

యుద్ధపర్వములందు ఎడనెడ శివునిమహాత్మ్య కీర్తనము మహాభారతములో చేయబడినది. మహేశ్వరుడు అనాది కాలము నుండియు శివశంకరుడుగను, భయంకరుడుగను సంభావింప బడెను. ఆయన దయామయుడై సర్వ శోభనముల నిచ్చును. అలిగినచో రుద్రుడై సంహారక్రియ యొనరించును. నిగ్రహానుగ్రహములు రెండును పరమేశ్వర లక్షణములుగ వర్ణింపబడినవి. ఇది వేదకాలమునుండియు ఉన్నది. 'నమస్తే రుద్రమన్యవ ఉతోత ఇషవేనమః' ఓ రుద్రుడా నీ కోపమునకు నమస్కారము. నీబాణమునకు నమస్కారము. అని ఆయన వందనము లందుకొనెను. యుద్ధ విజయమును కలిగించుట మహేశ్వరుని పరమప్రసాదము. అర్జునుడు ఎంత నారాయణభక్తుడో అంత ఈశ్వర భక్తుడు. మహేశ్వర ప్రసాదముచే ఆతనికి పాశుపతాస్త్రలాభము కల్గుట ఆరణ్యపర్వమునందె చెప్పనైనది. ఈశానుడు పౌరాణికులైన త్రిమూర్తులలో నొక్కడై, సంహార క్రియ మాత్రము చేయు పాక్షికమూర్తి కాడని నన్నయ భట్టారకుడు భావించెను. కిరాతార్జునీయ ఘట్టమునందు ఆతడు పార్థునిచే చేయించిన శివస్తోత్ర దండకమునందు మహేశ్వరుడు లోకేశుడనియె స్తుతి చేయించెను. "శ్రీకంఠ లోకేశ లోకోద్భవ స్థాన సంహారకారీ పురారీ మురారీ ప్రియా" మహేశ్వరుడు లోకము యొక్క సృష్టి స్థితి సంహారములు చేయువాడు.

సైంధవ వధకు శపథము చేసిన నాటి రాత్రి కృష్ణార్జునులు మహేశ్వరానుగ్రహము వడయుటకై యత్నించిరి. స్వప్నమునందు కైలాసమునకు పోయి ప్రమథ

గణపరివృతుడైన శంకరుని సందర్శించి ఆయన ప్రసాదించిన అమోఘములగు బాణా సనములను పాండవేయుడు గ్రహించెను. పాశుపతాస్త్ర ప్రభావముచేతనే యాతడు మరునాడు కౌరవసేనా సముద్రమును తరించి సూర్యాస్తమయ సమయమునకు జయద్రథుని సంహరింపగల్గెను ద్రోణపర్వాంతమున తిరిగి మహేశ్వర ప్రభావము ప్రసక్తమైనది. తండ్రి మరణమునకు కుపితుడై అశ్వత్థామ పాండవులపై ఆగ్నేయాస్త్ర ప్రయోగముచేసెను. దివ్యాస్త్రవేది అర్జునుడు బ్రహ్మాస్త్రముచే దానిని శమింపజేసెను అశ్వత్థామ ఖిన్నుడై వేదవ్యాసమునీంద్రుని కడకుబోయి తన యస్త్రముల వ్యర్థ త్వమునుగ్గడించి, కృష్ణార్జునులు తనకంటె యెట్లధికులైరని దీనుడై యడిగెను. అంత నామహర్షి యాతనికి పరమేశ్వర ప్రాభవమును తెల్పి, ఆయన యనుగ్రహపాత్రు లగుటచే వారంతవారు అయిరని వివరించెను. ఒకప్పుడు విష్ణువు మహేశ్వరుని గూర్చి తపస్సుచేసి సర్వదేవతలకంటె అధికుడగునట్లు శివునిచే వరము వడసెననియు, నరనారా యణు లజేయులనియు కృష్ణద్వైపాయనుడుచెప్పెను. ఇంకొక సూక్ష్మమును తెలియ బరచెను. అశ్వత్థామయు శివారాధకుడే. ఆతడు పరమేశ్వరుని ప్రతిమను మృత్తికతో చేసి యారాధించెనట నరనారాయణులు లింగాధిష్ఠానమునందు పరమశివుని కొలిచిరి. అన్యరూపారాధనములకంటె లింగనిష్ఠారాధన మేల్తరమని వేదవ్యాసుడు నుడివెను ఇదేసందర్భమున ధనంజయుడు సాత్యవతేయ మునీంద్రునితో నిట్లనెను. మహాత్మా! నేను యుద్ధము చేయుచుండగా నా ముందొక దివ్యపురుషు శూలపాణియై పాదము లతో నేలనంటక నడచుచు శత్రువులను సంహరించుచున్నట్లును, ఆ వెనుక నేను బాణ ముల ప్రయోగించి వారిని కడతేర్చినట్లుండును ఆ మహాపురుషుడెవ్వరో ఆనతిండు. "దీనికి కృష్ణద్వైపాయనుడు సమాధానము చెప్పెను." అర్జునా! నీవు అదృష్టశాలివి. అట్లు నీ ముందు శూలపాణియై రిపుసంహారము చేయువాడు భక్తవత్సలుడైన మహే శ్వరుడు.

ఆదికి నాదిలోకముల కన్నిటికిం బ్రభుఁడవ్యయుండవే
దాది పవిత్ర వాచక సహస్ర పరిస్ఫుట వాక్యరూపుఁడం
హోదశన ప్రకారక శుభోదయ కారణ దివ్యనాముఁడం
బాదయితుండు దృఙ్మహిత పాలుఁడు లోలుఁడు భక్తియుక్తికిన్.

ద్రోణ. 5. 425

నీతపస్సునకు మెచ్చి నీకు దివ్యాస్త్రములొసగి, భక్తవరదుడు నీకై శత్రుసంహార మును చేసెను అని తెలిపెను.

మహేశ్వర సంస్మరణము కర్ణపర్వమునందు తిరిగి జరిగినది. రాధేయునకు సారథ్యము నిర్వహింపుమని కోరగా శల్యుడు కుపితుడై మూర్ధాభిషిక్తుడనగు నన్ను ఇట్టి నీచ కృత్యమునకు నియోగింతువా యని దుర్యోధనునితో అసమ్మతి పూర్వకముగా పలికెను. సారథి కృత్యము అల్పము కాదు. అది మహత్తర నియోగమని విన్నవించుచు ఈశ్వరుడు త్రిపురాసుర సంహారము చేసిన వృత్తాంతమును ప్రసంగించెను. తారకాసురుని కుమారులు పరమేష్ఠి వరముచే దుర్భేద్యములైన త్రిపురములను సంపాదించుకొనిరి. వారిలో నొక్కని కుమారుడు బ్రహ్మను గూర్చి తపస్సుచేసి మృతులైన వీరులను బ్రతికించు జలములు గల యపూర్వపు బావిని సాధించెను. ఇట్లు వర గర్వితులైన రాక్షసులు సురలను నిర్దయగా బాధింప వారు వారిజాసను నగ్రేసరుని చేసుకొని ఈశ్వరుని శరణు వేడిరి. మహేశ్వరు డిట్లనెను.

> అమరులకు నసురులకు నె
> సముడ శివంబఖిల భూతజాలంబులకున్
> సమత నొనరింప శివనా
> మము నాకుం జెల్లు లోకమాన్యం బగుచున్.

అయినను ధర్మవర్తనులైన మిమ్ము బాధించు చుందురు గావున అసురులను వధింతునని బాసయిచ్చెను. దేవతలు రుద్రునకై అపూర్వరథము కల్పించి తెచ్చిరి. విష్ణువు బాణమయ్యెను. కాని రథమును నడపుటకు సమర్థుడైన సారథి లభింప డాయెను. నాకంటె నధికుడైన వానిని మీరు వెదకి సారథిత్వమునకు ఒప్పింపుడని శివుడు కోరగా వారు బ్రహ్మదేవుని ప్రార్థించి శివసారథ్యమున కొప్పించిరి. అట్లు సర్వసన్నద్ధుడై మహేశ్వరుడు త్రిపురముల దహించి దేవతలకు రాక్షసబాధ తొలగించెను. రథికుడైన కర్ణునికంటె నీవు కొండొకవిధమున అధికుడవను వ్యంగోక్తిచే సుయోధనుడు శల్యుని ప్రశంసించి కర్ణసారథ్యమున కంగీకరింప జేసెను.

కర్ణార్జునుల చరమ యుద్ధసందర్భమున తిరిగి రుద్రుని ప్రశంస వచ్చినది. లోకోత్తరులైన ఆవీరుల సంగ్రామమును చూచు కుతూహలముతో పరమేశ్వరుడు బ్రహ్మతో కూడ సన్నిధి చేసెను. ఇంద్రాదులును వచ్చిరి. నరనారాయణుల జయము తథ్యమని లోకహితకరమని శివుడు ప్రకటించెను. బ్రహ్మయు వల్లెయనెను. శల్యపర్వము ద్వితీయాశ్వాసమునందు బలరాముడు తీర్థయాత్రలు చేయుచు సోమతీర్థమను ప్రదేశమునకు వచ్చెను. ఇచ్చట దేవతలు కుమారస్వామిని దేవసేనాధిపత్యము

వందభిషేకించిరి. ఈ సందర్భమున కుమారస్వామి జన్మవృత్తాంతము వివరింప బడినది. హరుడు తన కుమారున కర్హమైన పదము ప్రసాదింపుమని విష్ణువును వేడెనట ఆతడు బాలుడైన కుమారునకు దేవసేనానిత్వమును కటాక్షించెను. శివకేశవులు ఒండొరుల గూర్చి తపస్సుచేయుటయు ఒండొరులకు వరప్రదానము చేయుటయు కథలలో విన వచ్చును. దీనివలన నామభేదమే కాని ఈ దివ్యమూర్తులయందు వస్తుభేదములేదనియు వారిద్దరును ఏకమూర్తియేయని వేదవ్యాస మునీంద్రుని భావముగా తోచును. వీరి ఏకత్వము కంఠోక్తిగా చెప్పిన స్థానములును మహాభారతమున గలవు కుమారస్వామి దేవసేనా సమన్వితుడై వెడలి తారకాసురుని సంహరించెను.

సౌప్తికపర్వము నందు మహేశ్వరుడు భూతనాథుడగుట సూచింపనైనది. కృపకృతవర్మలును అశ్వత్థామయును నిశాసమయమున పాండవ శిబిరముపై బడి వారిని చంపుటకు పోవుచుండిరి. మార్గమునందు గజశోణితముతో తడిసిన చర్మమును ధరించి, పాములు జందెములుగా వైచికొని భయంకర దంష్ట్రలతోడి ముఖము తెరచుకొని యొక ఉగ్రసుందరరూపము అశ్వత్థామ నెదుర్కొనెను. గురునందనుడు మనస్సులో ఆవంతయు భయపడక యా ఘోరమూర్తిశరములను ప్రయోగించెను. పదునములైన యా బాణము లా భూతము నేమియు చేయలేకపోయెను. ఆ భూతము నుండి పెక్కు జనార్దనరూపములు ప్రభవించి యశ్వత్థామను అలతపెట్టెను ఇదియసాధారణ దివ్య మూర్తికాని సామాన్యభూతముకాదని గ్రహించి ద్రోణనందనుడు మహాదేవుని ధ్యానించి శరణువేడెను. శివుని ప్రసన్నునిజేసికొనుటకై ఆత్మోపహార మిచ్చుటకును ఉద్యుక్తుడాయెను. కృత్తివాసుడైన భూతనాథుడు అనుగ్రహముతో వానికి దర్శన మిచ్చి ఇట్లు సెలవిచ్చెను. "కృష్ణుడు నాకు నిశ్చలభక్తి సేయును నేను మురారిప్రియు డను అతనికి సన్మానము చేయుటకై నీవు పాంచాలురపై పోకుండ అడ్డుకల్పించి తిని అయినను పాంచాలురకు కాలమాసన్నమైనది. పొమ్ము అని యొక మహానీయ ఖడ్గమును దయచేసి వానిని విజయుని కమ్మనిపంపెను. మహేశ్వరుడు కాలస్వరూపు డనుట దీనిభావముగా తోచును.

సౌప్తికపర్వము చివర యుధిష్ఠిరుడు శ్రీకృష్ణుని ప్రశ్నించెను. ధృష్ట ద్యుమ్నుడలోక వీర్యుడు. వానిని అశ్వత్థామ ఎట్లు సంహరింపగల్గెను అని. అది యంతయు లోకనాధుడగు పరమేశ్వరుని అనుగ్రహఫలమని వివరించుచు శ్రీకృష్ణుడు సృష్టివృత్తాంతమును వర్ణించెను. జగత్సృష్టి చేయదలచిన వారిజాసనుడు పరమేశ్వ రుని కడకుపోయి సృష్టినిర్మాణ సూత్రమును పృచ్ఛించెను. మహేశ్వరుడు తపస్సు

చేసి సృష్టియారంభింపదగునని తపోమగ్నుడయ్యెను ఆయన యెంతకును రాకుండుట గని బ్రహ్మదేవుడు దక్షుడను వానిని సృజించి సృష్టినిర్మాణము నందు నియోగించెను. ఆతడును భూతసృష్టి చేసెను. తాను తపస్సు నుండి రాకుండగనే సృష్టి జరిగిపోవుటకు శంకరుడు కోపించి మరల తపోమగ్నుడయ్యెను. దక్షుడును దేవతలును యజ్ఞము తలపెట్టి మహేశ్వరుని నుపేక్షించిరి. చంద్రశేఖరుడు దక్షాధ్వర ధ్వంసముచేయ రుద్రుని పంపెను. దేవతలందరును ప్రార్థింపగా కరుణించి యజ్ఞ సంరక్షణము చేసెను.

## స్త్రీపర్వము– సంక్షేపవృత్తాంతము

నూరుగురు కుమారులను శత్రుహస్తముల పోగొట్టుకొని కొమ్మలు నరుక బడి మోడై పడియున్న వృక్షమును బోలిన ధృతరాష్ట్రుని విదురసంజయాదులు శోకము విడిచి కర్తవ్య పరుడవగుమని పెక్కు విధముల ప్రబోధించిరి. వృద్ధుడును దీనుడును అగు నా మహారాజు పశ్చాత్తాపముచే దహింపబడుచుండెను. జ్ఞానియగు విదురుని పలుకులు ప్రశాంతములై వేదాంత బోధకములుగ ఉండెను. స్త్రీ పర్వము రాబోవు శాంతి, అనుశాసనికము మొదలగు ధర్మోపదేశ సంభరితములైన పర్వములకు గడపవంటిది. ఇచ్చటినుండియే వైరాగ్య బోధకములగు ప్రసంగములు తరచగును. విదురుడు సంసారపు అసారతను బహుభంగుల చెప్పుచు ఇట్లనెను.

తేరు శరీరము దానికి
సారధి సత్త్వంబు, తురగచయ మింద్రియముల్
దారుణతర బుద్ధి వ్యా
పారము లొనరంగ గనప పగ్గము లధిపా.

సంజయుడు రాజనీతిజ్ఞుడగుటచే ఈ నాశనమంతయు నీ యుపేక్ష వలనను నీ కుమారుని దుర్మార్గత్వము చేతను సంభవించినది. ఎవ్వరేమి చేయుదురు అను ధోరణిలో నుండెను.

అంతవారందరును యుద్ధమృతులను చూచుటకై పాలికలనికి పోయిరి. కృపాచార్యుడు మున్నగు వృద్ధులు గాంధారి నోదార్చిరి. ఈ లోపులో యుధిష్ఠిర మహారాజు కూడ శ్రీకృష్ణాదులతో గూడి చనిపోయిన బంధువులను చూచుటకై యుద్ధభూమి కేగెను. విగత భర్తృకలు హత పుత్ర బాంధవులును అగు కౌరవ స్త్రీల

రోదన ధ్వనులు మిన్నుముట్టెను. వారు ధర్మరాజును చూచి మా బంధువులందరను క్రూరుడై యుద్ధములో చంపించెను. ఇతడేటి ధర్మాత్ముడు అని ఆయన ముందరనే నిందించిరి. ఆ రాజు నిరుత్తరుడును దుఃఖితుడును అయి మిన్నకుండెను. పాండవులు ధృతరాష్ట్రుని చూడబోయిరి. అంధ నృపతికి భీమునిపై ఆరని క్రోధము రగులుచుండెను. ఆలింగనము పేరుపెట్టి వాయునందనుని నలిపి చంపుట కా వృద్ధరాజు వెనుదీయ లేదు. ఆతని దుర్వృత్తి నెరిగిన శ్రీకృష్ణుడు భీముని స్థానములో ఇనుప విగ్రహము పెట్టించి పాండవేయుని కాపాడెనట. తనకుమారుల నందరను సంహరించి నందులకు కుపితయై గాంధారి ధర్మరాజును శపించుననని ఎఱిగిన కృష్ణద్వైపాయనుడు సన్నిధిచేసి ఆమహాపతివ్రతను ఊరడించెను. వాస్తవమునకాసతీ తిలకము వృద్ధ రాజుకన్న ధర్మశీలయు ధర్మపక్షపాతనియుగా కాన్పించుచున్నది. కురుక్షేత్రమునకు వెడలుచు తన కుమారుడు సుయోధనుడామె యాశీస్సుల గొనుటకై వచ్చెను. అప్పుడా వనితా రత్నము పలికిన పలుకులు అమూల్యములు.

'కొడుక యెక్కడ నుండు ధర్మ మక్కడకు జయము సేరు'

స్త్రీ –1–151

గాంధారి కోపము తనపై పడకుండుటకై భీముడెన్నియో వినయోక్తులు పలికెను. నిజమునకు ఆబాల్యము పాండవులు ధార్తరాష్ట్రుల వలన పడిన బన్నములను ఎవరు కాదందురు. పక్షపాతబుద్ధి లేని గాంధారి అది యంతయు ఒప్పుకొని విధివిలసితమట్లుండెనని భీముని క్షమించెను.

గాంధారిదేవి యుద్ధభూమికి తరలి ధూళిధూసరిత గాత్రులై పడియున్న కుమారులను చూచి ఎంతయో దురపిల్లెను. తన కోడండ్రు సౌభాగ్యము పోగొట్టు కొనుటకు వగచెను. ద్రోణాది మహావీరుల శవములను చూచి పలపించెను. ఆచార్యుని మరణముచే భూమి 'అపగత శరవిద్య యయ్యెను' అని ఆమె శోకించెను. తుదకు ఆ మహాపతివ్రత శ్రీకృష్ణుని వంకకు మరలి "కౌరవవంశమునకు జరిగిన ఈ వినాశనము నాతను సమర్థుడ వయ్యును నీవు తప్పింపని వాడవైతివి. కురురాజును చెఱచుటకే కృషిచేసితివి. దీనిఫలముగ మీజ్ఞాతులును ఇట్లే అన్యోన్య కలహముచే తెగుదురు. నీవును దిక్కులేనిచావు పొందుదువు" అని శపించెను. యాదవవంశోన్మూలనమునకై మహర్షుల శాపముండనే యున్నది. నీవు వేరే శ్రమపడి శపింపనేల? ఖనను నీకుమారులు చేసిన దుర్నయములు స్మరింపుము. భీష్మాదులగు పెద్దలును నేనును ఎంతచెప్పి

వను సీతనయుడు పెడచెవినిపెట్టి తన్నును వంశమును దురంతదుర్గతికి లోనుకావిం
చెను అని సమాధానము చెప్పెను.

ధర్మరాజు యుద్ధమృతులందరకు అగ్నిసంస్కారమును కొందరకు జలాం
జలులను ఆదేశించెను. పురోహితుడగు ధౌమ్యుడు వేదోక్తముగా పెద్దలకు అంత్య
క్రియలు చేయించెను. ఉదకదాన సమయముగ కుంతీదేవి వరుగెత్తివచ్చి కర్ణుడు
కౌంతేయుడగుట అందరిముందర ప్రకటించెను. ధర్మనందనాదులు నిర్విణ్ణులయిరి.
ఆ మహారాజు పశ్చాత్తాపము ఇనుమడించెను. రాధేయుని అవరోధజనమును రప్పించి
వారిని గారవించి కర్ణునికై ఎన్నియో ధర్మములు చేసెను.

స్త్రీపర్వమునందు తిక్కన సోమయాజి పెక్కువిశేష ఛందస్సులను వాడెను.
వీనిని మేము పట్టికచేసి క్రింద ప్రదర్శించుచున్నాము. ఇందు కొన్ని దేశీయవృత్త
ములు పెక్కువృత్తములు మార్గసంప్రదాయమునకు చెందినవి. దేశీయ ఛందములగు
తరువోజ, ఉత్సాహ, వంటివి అపురూపము కాకపోయినను వానిని కూడ పట్టికలో
చేర్చితిమి. తిక్కన సోమయాజి ఎన్నడును లేనిది ఈ పర్వమునందే ఇంత ఛందో
వైవిధ్యమెందుకు ప్రదర్శించెను అని విమర్శకులు ప్రశ్నించుకొని తమ తమకు తోచిన
సమాధానములు చెప్పుచున్నారు. ఇతరపర్వము లందన్నిటను పరిచితమైన మార్గదేశీయ
వృత్తములనే వాడుటచే విశేషవృత్తరచన యందాతని కౌశల్యమును సమకాలిక పండి
తులు శంకించిరనియు, ఆయపకీర్తిని బాపుకొనుటకై స్త్రీపర్వము నందాతడు వృత్త
వైవిధ్యమును ప్రదర్శించెననియు ఒక కథ చెప్పబడుచున్నది. ఈ కథకు బాళ్ళులేవు.
ఉభయకవి మిత్రుడని సమకాలము వారిచే సంభావింపబడిన సోమయాజి వృత్తరచనా
కౌశలమును ఎవరో శంకించిరనుట విశ్వాసార్హము కాదు. దీనికొకలోతైన కారణమే
ఉండి యుండదగును అదియేది అనియే మనము అన్వేషింపవలెను.

తిక్కన సోమయాజి కవితాశిల్పమును సూక్ష్మముగ ఎఱిగినవాడనుట
అందరును అంగీకరించిన విషయమే. 'శిల్పమున్ పారగుడన్ గళావిదుఁడ' అని
యాయనయే వాకొనెను. స్త్రీపర్వము ఒక విశిష్ట సన్నివేశము కౌరవ స్త్రీలందరును
దుఃఖనులై తమ భర్తలను, సోదరులను, బాంధవులను పోగొట్టుకొని రోదన ధ్వనులతో
రణాంగణమునకు వచ్చిరి. అక్కడ దృశ్యము హృదయ విదారకముగా నుండెను.
వారి ఆప్తజనుల శరీరములు గుర్తించుటకు వీలు లేనంతగా ఖండితములై పడియున్నవి.
ఒక్కొక్క కళేబరము శిరస్సు ఎచ్చటనో నిరస్తమై యున్నది. దానిని వెదకి తెచ్చి శరీర

మునకు చేర్చి ఒక వనిత దుఃఖించు చున్నది. ఒక కళేబరమునకు చేతులు లేవు. ఒక దానికి కాళ్ళు లేవు. ఇట్లు బీభత్సమై యున్న జన్యావనియందు హతభాగినులైన ఆ స్త్రీలు తీరుతీరుల మృతులతో తమ అనుబంధములు స్మరించుకొనుచు రోదించుచుండిరి. గజాశ్వ శవములను మానవకంకాళములను తినుటకై మాంసాశనములైన మృగ పక్షి సంకులము వికృత రావములు చేయుచుండెను. యుద్ధరంగము పెక్కు విధములైన అమంగళ ధ్వనులతో సంక్షుభితమై యున్నది. ఈ విరావ సంఘాత విశ్లేషములను కవిత్వము ద్వారా వ్యంజితము చేయుటకై శిల్పి మూర్ధన్యుడగు సోమయాజివృత్త వైవిధ్యమును సాధనముగా గైకొనెనని యూహింపదగి యున్నది. ఒక్కొక్క శోక భావము యొక్క సంకీర్ణత, సంక్షిప్తత—వీనిని బట్టి వృత్తములు చిన్నవియు పెద్దవియు నిక్షిప్తములైనవి. వృత్తనామౌచిత్యముతో తిక్కన సోమయాజి చమత్కారములు చేయలేదు. కరుణరసబహుళమైన సాంద్ర సన్నివేశము నందిట్లు చేయుట శిల్పవైయర్థ్యమగును. లఘు కవి వ్యాపార మగును. కావుననే మంగళ మహాశ్రీవంటి విపుల వ్యాసము గల వృత్తములును వచ్చినవి. మితవ్యాసము గల తోదకమువంటి వృత్తములును విన్యస్తమైనవి. అన్నియు శోక వ్యక్తీకరణమునకే సాధనములైనవి. చెప్పదలచిన భావము యొక్క సంకీర్ణతా సంకీర్ణతలు. సమాస వ్యాసస్థితులు మాత్రమే మహాకవి హృదయమున భాసించెను. వర్ణనాత్మక దృశ్యములకు మంగళమహాశ్రీ, సరసిజ వృత్తము, లయగ్రాహి, లయవిభాతి మున్నగు విస్తృత ఛందములను కవి యుపయోగించెను. చిన్న చిన్న సంభాషణలు, వేదాంత భావములు ఆవిష్కరించుటకు చిన్న వృత్తములు ప్రయోగింపనైనవి. దుర్యోధనుని శవము చూచి శోకించుచు గాంధారి దీర్ఘవృత్తములలో భావ ప్రకటన చేసినది. విదురుడు ధృతరాష్ట్రునకు దుఃఖోపశమనము చేయుచు ఇట్లు తత్వచింతనమును ప్రేరేచెను.

ఇంద్రవజ్ర

> చింతా పరత్వంబునఁ జెందు దుఃఖా
> క్రాంతత్వ ముర్వీశ్వర కానఁ గీడుం
> జింతింపఁ డార్యాత్ముఁడ చింతనుండై
> యతః పరీతాపము నార్పఁ జాలున్.

## స్త్రీపర్వము – విశేషవృత్తము

| వృత్తము | గణములు | ఆశ్వా—పద్య |
|---|---|---|
| అంబురుహము | భ,భ,భ,భ,ర,స,వ. | 1 — 177 |
| ఇంద్రవజ్ర | త,త,జ,గ,గ | 1 — 29 |
| ఉత్సాహ | 7 సూర్య 1 గురువు | 1 — 48 |
| ,, | ,, | 1 — 66 |
| ,, | ,, | 1 — 85 |
| ,, | ,, | 2 — 94 |
| ,, | ,, | 2 — 101 |
| ,, | ,, | 2 — 142 |
| ,, | ,, | 2 — 153 |
| ఉపజాతి | సరిపాద జ,త,జ,గ,గ, | |
| | బేసి త,త,జ,గ,గ, | 1 — 64 |
| ఉపేంద్రవజ్రము | జ,త,జ,గ,గ | 1 — 136 |
| కవిరాజవిరాజితము | న,జ,జ,జ,జ,జ,జ,వ | 1 — 51 |
| ,, | ,, | 1 — 55 |
| ,, | ,, | 2 — 84 |
| ,, | ,, | 2 — 132 |
| క్రౌంచపదము | భ,మ,స,భ,న,న,న,య | 1 — 166 |
| జలదము | భ,ర,న,భ,గ | 1 — 148 |
| ,, | ,, | 1 — 164 |
| తరలము | న,భ,ర,స,జ,జ,గ, | 1 — 4 |
| ,, | ,, | 2 — 27 |
| ,, | ,, | 2 — 64 |
| ,, | ,, | 2 — 80 |
| ,, | ,, | 2 — 175 |

| | | |
|---|---|---|
| తరువోజ | 3 ఇంద్ర 1 సూర్య 3 ఇంద్ర 1 సూర్య | 1 — 43 |
| ,, | ,, | 2 — 59 |
| ,, | ,, | 2 — 148 |
| ,, | ,, | 2 — 182 |
| తోటకము | స,స,స,స | 1 — 45 |
| ,, | ,, | 2 — 122 |
| తోదకము | న,జ,జ,య | 1 — 81 |
| దోదకము | భ,భ,భ,గగ | 1 — 62 |
| ,, | ,, | 1 — 71 |
| ద్రుతవిలంబిత | న,భ,భ,ర. | 1 — 119 |
| నర్కుటము | న,జ,భ,జ,జ,వ. | 1 — 118 |
| ,, | ,, | 2 — 146 |
| పణవము | మ,న,య,గ | 1 — 145 |
| ప్రహారణకలిత | | 1 — 185 |
| బంధురము | న,న,స,న,స,భ,భ,భ,గ | 1 — 115 |
| భాస్కరవిలసితము | భ,న,జ,య.భ,న,న,స,గ. | 2 — 50 |
| భుజంగ ప్రయాతము | య,య,య,య. | 1 — 88 |
| ,, | ,, | 2 — 107 |
| మంగణమహా(శ్రీ) | భ,జ,స,న,భ,జ,స,న,గగ | 2 — 29 |
| మంజుభాషిణి | స,జ,స,జ,గ. | 1 — 63 |
| మందాక్రాంతము | మ,భ,న,త,త,గగ | 2 — 185 |
| మణిగణనికరము | న,న,న,న,స. | 2 — 3 |
| మణిమాల | త,య,త,య. | 1 — 108 |
| మత్తకోకిల | ర,స,జ,జ,భ,ర. | 1 — 21 |
| ,, | ,, | 1 — 41 |
| ,, | ,, | 1 — 175 |

ఖండవల్లి లక్ష్మీరంజనం

# శ్రీమదాంధ్ర మహాభారత సంశోధిత ముద్రణము

# ఉపోద్ఘాతము

## తిక్కన సోమయాజి ఇతివృత్త నిర్వహణము, రసపోషణము

"ఇతివృత్తం తు కావ్యస్య శరీరం పరికీర్తిత"మ్మని భరతాచార్యుఁడు. ఆయన మతమునఁ గావ్యమున కాత్మ రసము, ఇతివృత్తము శరీరము. దేహాత్మలకు వలెనే వస్తురసముల కాధారాధేయ భావమున్నది. రసపోషణమున కితివృత్త మవలంబము, భిత్త్యభావమునఁ జిత్రరచన కవకాశము లేనట్లే వస్త్వభావమున రసపోషణమున కవకాశముండదు. అందుచేఁ గవులు రసపోషణమున వలెనే యితివృత్తనిర్వహణము నందును అవహితచిత్తులై యుండవలసిన యావశ్యకమున్నది.

జగత్ప్రసిద్ధమైన మహాభారతేతివృత్తమునకు సౌష్ఠవోపేతమైన రూపుదిద్దినవాఁడు వ్యాసభగవానుఁడు. కవిత్రయమువారు సంస్కృతభారతము నాంధ్రీకరించు పట్ల నితివృత్తవిన్యాసమున నెట్టిమార్పులను గావింపక మూలమునే యథాతథముగా ననుసరించి యుండిరి. కాని భారతమూర్తిని భావించుటలో వ్యాసునికిని గవిత్రయము వారికిని ఇంచుక దృష్టిభేద ముండుటచే మూలానువాదములను బోల్చిచూచునప్పు డెడనెడఁ గొన్ని సంకోచవ్యాకోచములు కానిపించుచుండును. వ్యాసునిది ప్రధానముగాఁ బౌరాణిక నైతిక దృష్టి; కవిత్రయము వారికి కావ్యకళాదృష్టి. ఈదృష్టిభేదముచేఁ గవిత్రయమువారు ధర్మనీతి తత్త్వ ప్రధానములైన కొన్ని ఘట్టములను సంకోచపఱిచిరి; రసపాత్ర పోషణానుకూలములైన కొన్ని ఘట్టములను విస్తరించిరి. కీచకవధాభిమన్యువివాహాది ఘట్టములు వ్యాకోచమునకును, భగవద్గీతా సనత్సుజాతీయాదులు సంకోచమునకును నిదర్శనములు. ఇట్టి స్వల్పములైన కొన్నిమార్పులు తప్ప మూలానువాదములందుఁ బ్రధానకథాప్రవర్తన విధానమున గణింపఁదగిన వ్యత్యాస మేమియుఁ గానరాదు. అందుచే మహాభారతేతివృత్త నిర్మాణమునందలి కౌశలమంతయు వ్యాసభట్టారకునిదే.

మహాభారతేతివృత్తమునకు బీజములు వేదవాఙ్మయముననే గోచరించునని యభియుక్తుల యభిప్రాయము. సుమారు ముప్పదియైదు సంవత్సరములకుఁ బూర్వము కీ. శే. కావ్యకంఠ గణపతిశాస్త్రిగారు మహాభారతేతివృత్తమునందలి కొన్ని సన్నివేశములు వేద

వాఙ్మయమున విశదముగా వర్ణింపఁబడియున్నవని తెల్పుచు నుదాహరణపూర్వకముగా మహో పన్యాస మొసంగియుండిరి. చరిత్రజ్ఞులు కూడ వేదకాలమున కురుపాంచాలాది రాజ్యములు విలసిల్లియుండెనని చెప్పుచున్నారు. అప్పుడు కురు పాంచాలవంశములు ప్రముఖములై యుండె ననియు, ఆసందీవతము, కాంపిల్యము అనునవి వారికిఁ గ్రమముగా రాజధానులై యుండెననియు, కురువులు కాలక్రమమున సరస్వతీ దృషద్వతీనదులనడుమ నుండిన కురుక్షేత్రమను ప్రదేశమును, ఇప్పుడు ఢిల్లి మీరట్ మండలములున్న ప్రదేశములను ఆక్రమించిరనియు, పూరు భరతాద్యన్య వంశములవారి కలయికచే కురువంశము విస్తరిల్లి యుండుననియు వారి యభిప్రాయము. బాహ్లిక ప్రతిపీయ, పరీక్షిజ్జనమేజయాదులగు సుప్రసిద్ధకురువంశరాజులు కొందఱు వేదభాగము లందుఁ బేర్కొనఁబడియున్నారు. అథర్వవేదమందలి యొక మంత్రమున పరీక్షితుఁడు మహావీరుఁ డుగా స్తుతింపఁబడియున్నాఁడు. అతఁడు విశ్వజనీనుఁడైన రాజనియు (రాజా విశ్వజనీనః) నతని రాజ్యము మధుక్షీరసమృద్ధమై యుండెననియు నందు వర్ణింపఁబడియున్నది. అతని కుమారుఁ డైన జనమేజయుఁడన్ని దిక్కుల రాజులను జయించుచుఁ బ్రపంచ జైత్రయాత్ర కావించెనఁట! అతని తరువాత వచ్చిన రాజులంత సమర్థులు కాకపోవుటచే కురుక్షేత్రమును విడిచిపోవలసి వచ్చెననియు, నందొకఁడు కౌశాంబిలో రాజ్యమును స్థాపించి బౌద్ధమత మభ్యుదయము చెందు వఱకును బాలించెననియుఁ దెలియుచున్నది.

వీరావదానములస్తుతియు, రాజులయు మునులయుఁ గథలును వేదవాఙ్మయమునఁ గానిపించును. రాజసూయాశ్వమేధాదులగు మహాయజ్ఞములు జరుగు సమయమున నారాశంసు లనఁబడు నీ స్తుతులను బఠించుటయుఁ గథలను జెప్పుటయుఁ బరిపాటిగా నుండెను. పరీక్షుజ్జనమే జయాదులగు కురువంశరాజులయు, నిక్ష్వాకు హరిశ్చంద్రాదులగు సూర్యవంశ రాజులయుఁ గథలట్టి వానిలో ప్రాముఖ్యము వహించి యుండు ననుటలో నాశ్చర్యములేదు. రాజసూయ యాగ సమయములం దిక్ష్వాకు హరిశ్చంద్రకథయు, గురువంశచరిత్రకథయుఁ జెప్పఁబడు చుండెనఁట ; అల్లే పాండువంశీయుల కథ జాతకకథలందు గోచరించుటయే కాక క్రీ. పూ. 4వ శతాబ్దియందలి గ్రీకుల రచనలలో గూడఁ బేర్కొనఁ బడియున్నది. పాణిని కాత్యాయను లును పతంజలియు నాకథను సూచించి యుండిరి. అశ్వలాయన గృహ్యసూత్రము లందును పాణిని అష్టాధ్యాయి యందును మహాభారతము పేర్కొనఁ బడియున్నది. అప్పటికందు శత సహస్రశ్లోకము లుండెనో లేదో చెప్పఁజాలము. నీతిధర్మబోధకములైన యుపాఖ్యానంబులు కొన్నియందు దరువాతి కాలమునఁ బ్రక్షేపింపఁ బడియుండునని కొందరు విమర్శకుల యభి ప్రాయము. యజుర్వేదమునందును శతపథ బ్రాహ్మణమునందును అర్జునుని పేరు కానవచ్చు చున్నది. ఆ బ్రాహ్మణమునందతనికిని ఇంద్రునికిని అభేదము చెప్పఁబడినది. ఛాందోగ్యోప నిషత్తునందును, శ్రౌతసూత్రములలో నొకదానియందును కురువుల వినాశము సూచింపఁ బడి నది. శృంజయులు కురువులకుఁ బ్రధానశత్రువులై యుండిరను విషయము శతపథ బ్రాహ్మణ మునఁ గానవచ్చుచున్నది. వేదభాగములందు కురుక్షేత్రసంగ్రామ మెచ్చటను బేర్కొనఁ బడక పోయినను కురువంశీయులకును ఇతరవంశముల వారికిని గల వైరము బ్రాహ్మణము

లందును ఉపనిషత్తులందును శ్రౌతసూత్రములందును సూచింపఁబడినది. ఇట్లే పాండువంశమునకుఁ జెందిన అర్జున పరీక్షిజ్జనమేజయుల నామములు వేదవాఙ్మయమున గోచరించును. టోలెమీ పాండువంశమువారు పంజాబునందలి కొంతభాగమును బాలించుచుండిరని చెప్పియుండుటచే వారి చారిత్రకతను గూర్చి సందేహింపనవసరము లేదు.

మహాభారతమునకు జయమను పేరున్నది. జయమనఁగా జయసూచక కావ్యమని యర్థము. అది పురాణసంహిత యనికూడఁ జెప్పఁబడుచున్నది. అందుఁ బ్రాచీనములైన గాథలును, మహనీయులైన రాజులయు మునులయు, పూజనీయలైన పతివ్రతలయుఁ గథలును ఉండుటయే యందుకుఁ గారణము. ఉపనిషత్సారభూతమైన భగవద్గీత యందంతర్గతమై యుండుటయు ధర్మనీతి తత్త్వబోధకములైన కథోపాఖ్యానములందుఁ బ్రపంచింపఁ బడుటయు దానికిఁగల మోక్షశాస్త్రమను నామమును సార్థక మొనరించుచున్నవి. అది చతుర్వర్గ ఫలప్రాప్తికి సాధనమని పెక్కుచోట్లఁ జెప్పఁబడియున్నది. వేదబ్రాహ్మణాదులందు బీజప్రాయములుగా నుండిన కథలను గాథలను ఇతివృత్తములను గ్రహించి నడుమనడుమఁ బురుషార్థప్రాప్తి సాధనములైన ధర్మనీతి తత్త్వ విషయములను సందర్భానుగుణముగాఁ జేర్చుచు వ్యాసభట్టారకుఁడు మహాభారతమును నిర్మించియుండెను.

మహాభారతము నందలి యితివృత్తము జగత్ప్రసిద్ధము. ద్యూతమునందేర్పఱుచుకొనిన సమయము ననుసరించి పాండవులు ద్రౌపదితోఁ గూడఁ బండ్రెండేండ్లు వనవాస మాచరించి పదమూఁడవయేఁట నజ్ఞాతవాస మొనరించుటకై విరాటునగరము చేరుటతో విరాటపర్వ మారంభించు చున్నది. అజ్ఞాతవాసానంతరము పాండవుల కర్ధరాజ్యమను మాట యటుండ నైదూళ్ళైన నొసంగుటకు దుర్యోధనుం డంగీకరింపక పోవుట కురుక్షేత్ర సంగ్రామమునకుఁ గారణమయ్యెను. పదునొకొండక్షౌహిణులతో కౌరవులును ఏడక్షౌహిణులతో, బాండవులును యుద్ధమునకుఁ దలపడిరి. ఆకాలమున భారతదేశమునందుండిన రాజులెల్లరు నేదో యొకపక్షము నవలంబించి భారతయుద్ధమునఁ బాల్గొనియుండిరి. యుద్ధము పదునెనిమిదిరోజులు జరిగెను. ఇరుపక్షములందును మహావీరులు పలువురు మడిసిరి. తుదినాఁటిరాత్రి అశ్వత్థామ కోపోద్దీపితుఁడై ధృష్టద్యుమ్నపురోగములైన పాంచాలురను ప్రతివింధ్యాది ద్రౌపదేయులను పాండవామాత్యులను సుఖసుప్తులైన వారిని వధించెను. శ్రీకృష్ణుని యనుగ్రహమున పాండవులేవురును సాత్యకియు రక్షితులైరి. ధృతరాష్ట్రునితో గాంధారియు స్త్రీ జనమును బోలిక లని కేగి మృతులైన వీరులకై దుఃఖించిరి. ధర్మజుఁడు రణనిహతుల యథావిధి సంస్కరింపఁ దగువారలఁ బంపి భాగవతవీరుల కుదకదాన మొనరించెను. కుంతి కర్ణుఁడు గూఢోత్పన్నుఁడని యెఱిఁగింప ధర్మజుఁడు దుఃఖించెను. బంధుజన మరణ నిర్వేదన పరుఁడై కృష్ణు వచనములనూఱడిల్లిన ధర్మజునకుఁ బట్టాభిషేకము జరిగెను. శరతల్పగతుడైన భీష్ముఁడు ధర్మరాజునకు రాజధర్మములు, ఆపద్ధర్మములు, మోక్షధర్మములు; దానవిధులు, ఆచారవిధులు నెఱిఁగించెను. భీష్మస్వర్గారోహణానంతరము ధర్మరాజశ్వమేధ యాగముచేయ నారంభించెను. అశ్వత్థామాస్త్రదగ్ధుఁడయ్యు శ్రీకృష్ణుచే సంజీవితుఁడై ఉత్తరగర్భమున పరీక్షిత్తు జన్మించెను. అర్జునుఁ డశ్వ

మేధాశ్వము ననుసరించి యేగుచు నెడనెడఁ బలువురు రాజులతో యుద్ధమాచరించెను. గాంధారీ ధృతరాష్ట్రులు విదుర సంజయ సహితముగా నాశ్రమవాసమునకుఁ జనుచుండ కుంతీదేవియు గురుశుశ్రూషాపరయై వారితోఁ జనెను. ధృతరాష్ట్రుఁడు వ్యాసప్రసాదమున సమరనిహతులైన పుత్త్రపౌత్త్రులనెల్లఁ గాంచి విగతశోకుఁడై గాంధారీ కుంతీ విదుర సంజయులతోఁ బరమసిద్ధికిఁ జనెను. యాదవులెల్ల మదిరాపానవశులై శాపవశమున సముద్రతీరమందుఁ దమలోఁ దాము పోరిపొడుచుకొని పరలోకగతులైరి. అర్జునుఁడు ద్వారకకరిగి, వసుదేవాది యాదవులనెల్ల సంస్కరించి, యాదవకళత్రములను దోడ్కొనివచ్చుచు గాండీవ దివ్యబాణముల శక్తి తఱుఁగుటచే వనచరభయమువలన వారిని రక్షింపనోపక ధర్మరాజు కడకు వచ్చి వ్యాసవాక్యప్రబోధితుఁడై సన్న్యసించెను. తరువాతఁ బరీక్షిత్తునకు రాజ్యపట్టాభిషేక మొనరించి పాండవులు ద్రౌపదితోఁ గూడ మహాప్రస్థానము గావించిరి. ధర్మరాజు నరకమున నున్న యన్నదమ్ములఁగని పరితపింప నింద్రుఁడును యముఁడును అతని నుచితవచనముల నూఱడించి సంభావించిరి ధర్మజుఁ డాకాశగంగావగాహన మొనరించి దేవభావము నొందెను. ఇంద్రు డాతనికి దేవత్వ మొందిన స్వజనములఁ జూపి సంతోషము కలిగించెను.

మానవ జీవిత క్రమమునకును మహాభారతకథా విధానమునకును జాలసాదృశ్యము గోచరించును మానవజీవితమున దైవీశక్తులకును ఆసురీశక్తులకును నిత్యము పోరాటము జరుగుచుండును. ఈశక్తులనే ధర్మాధర్మములకుఁ బ్రతిరూపములని చెప్పవచ్చును. అధర్మ మప్పుడప్పుడు ధర్మమునడంచి విజృంభించునట్లు కనిపించినను జివరికి ధర్మమునకే విజయము లభించుననుట నిర్వివాదము. మహాభారత కథలో నట్లేజరిగినది: అధర్మపరులైన కౌరవులు ధర్మమార్గానువర్తులైన పాండవులను బెక్కిడుముల పాలుచేసిరి ; అనేకవిధముల నవమానించిరి; చంపుటకుఁగూడ యత్నించిరి. దైవము వారిని గాపాడెను అంతమున జరిగిన మహాయుద్ధమున దైవబలసంపన్నులైన పాండవులు కౌరవుల సంహరించి జయలక్ష్మితోపాటు రాజ్యలక్ష్మిని గూడఁ జేపట్టిరి దైవమెప్పుడును ధర్మమునకును సత్యమునకును విజయము చేకూర్చుననుట కిది నిదర్శనము. శ్రీకృష్ణుఁడు పాండవులు చెప్పినమాటలు ధృతరాష్ట్రునితోఁ జెప్పుచు వారు సభ్యులకుఁ జెప్పుమనిరని యీక్రిందిపద్యమును వినిపించెను.

> సారపు ధర్మమున్ విమల సత్యముఁ బాపము చేత బొంకుచేఁ
> బారముఁ బొందలేక చెడఁబాఱినదైన యవస్థ దక్షులె
> వ్వారలుపేక్ష చేసిరది వారల చేటగుఁగాని ధర్మని
> స్తారక మయ్యు సత్యశుభ దాయకమయ్యును దైవముండెడిన్.
>
> ఉ; 2- 273

ఇది ధర్మసత్యములు చివరికి విజయము పొందునని చెప్పుటయే కాక వానికి భంగము వాటిల్లునప్పుడు శక్తులయ్యు నుపేక్ష వహించువారు తామును జేటుపొందుదురని నిరూపించుచున్నది. ధృతరాష్ట్రుఁ డధర్మము నాపుటకు దక్షతకలవాఁడయ్యు నుపేక్షించి యపారమైన దుఃఖము

నకు గుఱియయ్యెను. కృష్ణుఁడు ధర్మపక్షము నవలంబించి యధర్మపక్షమును వారించుటకు యత్నించి కృతకృత్యుఁ డయ్యెను. అతఁడు మానవమూర్తిని ధరించిన భగవంతుఁడే.

"ఇది ధర్మము -- ఇదధర్మము" అని నిర్ణయము చేయుట అత్యంత కష్టసాధ్యము. ఎవరుచేయుచున్నది వారికి ధర్మముగాఁ గనిపించును. ఆదృష్టితోడనే వారు తీవ్రముగా వాదించుచుఁ గార్యమునకుఁ గడంగుచుందురు. దుర్యోధనాదు లట్లే వర్తించిరి. శ్రీకృష్ణుఁడు సంజయుని రాయబారమంతయు విని, దుర్యోధనాదులే క్రిందుమీఁదెఱుఁగక చెడుతెరువునఁ బోవుచుండుట నిరూపించి.

రోషమయమహాతరువు సుయోధనుఁ డుగ్ర
స్కంధమందులోనఁ గర్ణుఁ డలరుఁ
గొమ్మసౌబలుండు గుసుమఫలములు దు
శ్శాసనుండు మూలశక్తి తండ్రి.
ధర్మజుండు ధర్మతరువర్జునుఁడు ఘన
స్కంధ మనిలసుతుఁడు శాఖ లవలు
పుష్పఫలములేను భూసురులును వేద
ములుఁ దదీయమైన మూలచయము. ఉద్యో ౧-౩౫౫ ; ౩౫౬

అని యిరుపక్షముల తత్త్వమును విశదీకరించెను. భారతారంభమున దేవదానవ ప్రముఖుల యుత్పత్తిక్రమమును వారియంశములచే భూమియందుఁ బుట్టినవారిక్రమమును వర్ణింపఁ బడినవి. వానినిబట్టి కూడఁ బై యిరుపక్షముల తత్త్వమును గ్రహింపవచ్చును. ధర్మాధర్మములకును, దైవాసురశక్తులకును మాఱుట రూపులని చెప్పఁదగిన యా యిరుపక్షములకుఁ దీవ్రమైన పోరుచేకూరుటయు నందుధర్మపక్షమునకు జయము వాటిల్లుటయు మహాభారతేతి వృత్తమునందలి సారాంశము. ఈవృత్తాంతమును విశదముగా వర్ణించుచు వ్యాసుఁడు ప్రసక్తానుప్రసక్తముగా ధర్మనీతి తత్త్వబోధకములైన యెన్నో యుపాఖ్యానములను గథలను గూడఁ జెప్పియుండెను.

అనుశాసనిక పర్వమున భీష్ముఁడు ధర్మరాజునకు దైవపౌరుషముల తెఱంగెఱిం గించుచు

వినుపౌరుషమును దైవము
నన రెండును గార్యఫలము నందింపఁగ నె
ట్టన కారణములు గావున
జననాయక సదృశములు విచారింపంగన్. అను ౧-141

పౌరుషమ్ము దైవంబు తోడ్పాటు లేక
ఫలముఁ బొందంగ నేరదు పార్థివేంద్ర
విత్తుసహకారి గాకున్న రిత్తనేల
వంధ్యమగుఁగాక తా ఫలవంతమగునె. 142

అని తెల్పియుండెను. దైవపౌరుషములు రెండును గూడినఁగాని కార్యము సాఫల్యము నొందనేరదు. మహాభారతకథలోఁ గౌరవు లపారమైన పురుషకారము నొనరించిరి. కాని దైవబలము లేమిచే వారభీష్టప్రాప్తి నొందఁజాలక పోయిరి. పాండవుల విషయమునఁ బౌరుషమునకు దైవము తోడ్పాటు కూడఁ జేకూరియుండుటచే వారు విజయమును బొందఁజాలిరి. శ్రీకృష్ణుని యవతారమునకుఁ గారణములలో భూభారమును తగ్గించుట కూడ నొకటి. అందుకుఁ గురుక్షేత్రసంగ్రామ మొక సాధనమయ్యెను. ఆ సంగ్రామ మెట్లైనఁ జరుగునని కృష్ణుఁ డెఱుంగును. ఎఱిఁగియుండియు ధర్మజుని ప్రీతి కొఱకును లోకముకొఱకును అతఁడు సంధికిఁ బురుషకార మొనరించెను. దైవానుకూల్యము లేని కారణమున సంధియత్నము సఫలముకాలేదు. మహాభారతేతిహాసము కార్యవిజయమునకు దైవపౌరుషముల కూడిక యెంత అవసరమో చక్కగా నిరూపించును.

తిక్కన విరాటపర్వారంభమున ''ఈ ప్రబంధమండలి కధినాథునిఁగానే పురుషునిఁ జేర్కొను వాఁడనొయను తలంపు గూరిన మదితోఁ'' దా నించుక నిద్రించుసమయమున హరిహరనాథదేవుఁడు కలలోఁ బ్రత్యక్షమయ్యెనని వ్రాసియుండెను. దీనినిబట్టి యాతఁడు తాను రచించు భారతమును ప్రబంధమండలిగను, అందలి యొక్కొక్కపర్వము నొక్కొక్క ప్రబంధముగను భావించినట్లు తెలియుచున్నది. ఆయాపర్వములం దంతర్గతములై యున్న కీచకవధాది ఘట్టములను గూడ నాతఁడు ప్రబంధములుగా భావించి యుండిన నుండవచ్చును. ఇచ్చటఁ బ్రబంధమనఁగాఁ గావ్యమని యర్థముచెప్పు కొనవలయును. ఈ ప్రబంధపదమునకును తరువాత నల్లసాని పెద్దనాదులు రచించిన మనుచరిత్రాది ప్రబంధములకును లక్షణ స్వరూపస్వభావము లందుఁ గొంత భేదముకానవచ్చును. పెద్దనాదులు ప్రబంధశబ్దమును ప్రత్యేకమును రూఢము లైన యర్థమున వాడియుండిరి. తిక్కన దాని నిచ్చట సామాన్య కావ్యవాచిగా వాడియుండెను. ఈ ప్రబంధమండలి యనువాదమే కావున నిందలి యితివృత్తము ప్రఖ్యాతమని వేఱుగాఁ జెప్పనక్కఱలేదు. దీని యందొక్క శృంగారమేకాక యన్నిరసములును వర్ణింపఁబడినవి; ధీరోదాత్తులే కాక యన్య నాయకులును గనిపింతురు; ఎడనెడ నష్టాదశసంఖ్యగల వర్ణనలలోఁ గొన్ని చూపట్టును. ఇవి చంపూరూపమున రచింపఁబడినవి. ఇందచ్చటచ్చట నప్రయత్న సిద్ధము లైన శబ్దార్థాలంకారములు కనిపించును. తిక్కన కథాప్రారంభమునకు ముందు ప్రవేశ పెట్టిన షష్ఠ్యంతములను బలువురుకవులు తరువాతఁ దమకావ్యములందుఁ గూడఁ జొప్పించి యుండిరి. దేవుఁడు కవులకుఁ గలలోఁ గనఁబడి తనపేరఁ గృతిరచింపుమని యాదేశించుట

యాంధ్రప్రబంధములలోఁ బెక్కింట గోచరించును. అట్టి సన్నివేశమును బ్రశస్తముగాఁ గావ్యారంభమున వర్ణించినవాఁడు తిక్కన సోమయాజియే.

పాంచాలీ పాండవు లజ్ఞాతవాసమునఁ దామెట్లెట్లు సంచరింపవలయునో నిశ్చయించు కొని విరాటుని కొలువునకేగుటతో విరాటపర్వ మారంభించి యుత్తరాభిమన్యుల వివాహ వృత్తాంతముతో ముగియుచున్నది. ఇందు జరిగిన సన్నివేశములన్నియు విరాటునగరముతో సంబద్ధములై యున్నవే. కీచకవధ, గోగ్రహణము, అజ్ఞాతవాసపరిసమాప్తి, అభిమన్యు వివాహము ఇందలి ముఖ్యఘట్టములు. ఉద్యోగమనఁగాఁ బ్రయత్నము. దీనినధికరించి వ్రాయఁ బడినది ఉద్యోగపర్వము. పాండవులు తొలుత సంధిని తరువాత యుద్ధమునగును గావించిన ప్రయత్నమిందు వర్ణింపఁబడుటచే దీనికుద్యోగపర్వమను నామము సార్థకమగుచున్నది. కురు క్షేత్ర సంగ్రామము పదునెన్మిదిరోజులు జరిగెను. అందుఁ పదిరోజులు భీష్ముఁడును, ఐదుదిన ములు ద్రోణుఁడును, రెండుదినములు కర్ణుఁడును, పదునెనిమిదవనాఁటి పగలు శల్యుఁడును కౌరవసేనకు నాయకులుగా నుండిరి. నాయకత్వమును బట్టి యాయాపర్వములకు నామ ములు పెట్టఁబడినవి. పదునెనిమిదవ నాఁటిరాత్రి అశ్వత్థామ సుఖసుప్తులైన ధృష్టద్యుమ్నాది సర్వ పాంచాలురను, ప్రతివింధ్యాది ద్రౌపదేయులను, పాండవామాత్యులను వధించిన వృత్తాంతమును వర్ణించు పర్వమునకు సౌప్తికపర్వమని పేరు. సౌప్తికమన నిద్రితులపైఁబడి మార్కొనుట. స్త్రీలకు సంబంధించినపర్వము స్త్రీపర్వము. గాంధారియు నితర స్త్రీలును ధృత రాష్ట్రునితోఁ బోలికలని కేగి తమతమ వారిని గాంచి విలపించుట యిందలివృత్తాంతము. తరు వాతిరెండుపర్వములు శాంత్యాను శాసనికములు యుద్ధమున జరిగిన బంధుమిత్ర వధయును గాంచి విషణ్ణుఁడైన ధర్మజుని వ్యాసాదులను నయవాక్యములచే నూఱడించి పట్టాభిషేకమును కంగీకరింపఁ జేసిరి. రాజైనవాఁడు సకల లౌకిక పారలౌకిక ధర్మములఁ దెలియవలసిన యావశ్యక మెంతైన నున్నది. ధర్మజుఁడీ రెండుపర్వములలో భీష్మునివలన సకలధర్మములఁ నెఱింగి యాదర్శప్రాయుఁడైన రాజు కాఁగలుగుటయే కాక యపారమైన మనశ్శాంతినిఁ గూడఁ బొందెను. అనుశాసనికమనఁగా (అనుశాసనాయహితం) ననుశాసనమునకు సంబంధించినదని యర్థము. అనుశాసనమన ధర్మబోధ. భగవద్గీతా సనత్సుజాతీయాది తత్త్వప్రతిపాదకములైన భాగములతో పాటీ రెండుపర్వములునుకూడ మహాభారతమునకు శాస్త్రకావ్యమనియు మోక్ష శాస్త్రమనియుఁ బంచమవేదమనియు నామములు కలుగుటకుఁ గారణములైనవి. ఇవి భారత కథాగతికిఁ గొంత యాటంకము కలిగించినమాట వాస్తవమేయైనను ఆధ్యాత్మికముగా దాని కప్రతిమానమాహాత్మ్యము నావహించినవనుటలో సందేహములేదు. ధర్మజుని యశ్వమేధ యాగాచరణమును వర్ణించునది యశ్వమేధపర్వము. ఇది ధర్మజుని చక్రవర్తిత్వమును సూచిం చును. సమ్రాట్టైనవాఁడె యశ్వమేధయాగాచరణమున కర్హుఁడనుటయు నది సకల పాపౌఘ నిబర్హణమగుటయుఁ బురాణప్రసిద్ధము. వార్ధకమున వానప్రస్థాశ్రమము స్వీకరించి ముని వృత్తి నుండుట పూర్వపురాజుల సంప్రదాయము. ఆ సంప్రదాయము ననుసరించి ధృతరాష్ట్రుఁ డడవికేగి యాశ్రమవాసమును గావించుటను వర్ణించు పర్వమాశ్రమవాసపర్వము. మౌసల

పర్వము ముసలచూర్ణ ప్రభూతమైన తుంగకాడలచే యాదవులు పరస్పరోపహతులై మరణించుటయు కృష్ణబలరాముల నిర్యాణమును వర్ణించును. ఇందలికథ పూజ్యులయినవారి నవహేళనము చేయుటవలని దుష్ఫలమును విధిబలీయస్త్వమును జక్కగా వివరించును. మహాప్రస్థానికపర్వము ద్రౌపదీ భీమార్జున నకుల సహదేవులందలి యల్పదోషములను సూచించుచు పాండవుల మహాప్రస్థానమును వర్ణించును. ధర్మరాజనన్య సామాన్యమైన తన మహానుభావత్వముచే సశరీరముగా స్వర్గమున కరిగి యాకాశగంగా జలావగాహనమున దివ్యత్వముఁ బొందెను. అతఁడు కించిత్కాలమైన నరకమును దర్శింపవలసివచ్చుట "రాజ్యాంతే నరకం ధ్రువ" మ్మను నార్యోక్తిని దృఢపఱుచుచున్నది. స్వర్గారోహణపర్వమునఁ జివరఁ బాండవులు స్వర్గారోహణము కావించుటయు నితర కౌరవవీరులు తమ మూలప్రకృతులందు వీనమగుటయు వర్ణింపఁబడినది.

మానవ జీవితమున బాల్య యౌవనాది వయోఽవస్థలు నాలుగు గోచరించునట్లే భారతకథాక్రమమునఁ గూడ ముఖ్యములైన నాలుగుదశలు గోచరించును. పాండవుల జననము మొదలు ద్యూతాంతమువఱకును ప్రథమదశ. అరణ్యాజ్ఞాతవాసములు ద్వితీయదశ. ఉద్యోగయుద్ధములు తృతీయదశ. ధర్మజుని పట్టాభిషేకము మొదలు పాండవుల స్వర్గారోహణము వఱకును జతుర్థదశ. దశరూపకాదులయందు రూపకవస్తువునఁ బంచసంధు లుండవలెనని నిర్దేశింపఁబడినది. దృశ్యకావ్యములందే కాక ఐక్యముతోఁ గూడిన యేకావ్యమందైనను ఈ పంచసంధి విభాగము ప్రస్ఫుటమగుచునే యుండును. ముఖాదిసంధులను దశరూపకాదులందు నిర్వచింపఁబడిన విధముగా భారత కథయందు నిరూపించుట క్లేశకరమేయైనను అందు స్పష్టములైన యైదు పరిణామదశలను గుర్తింపవచ్చును. ధర్మజుని యౌవరాజ్యప్రాప్తి, ద్యూతద్రౌపదీపరాభవములు, అరణ్యాజ్ఞాతవాసములు, యుద్ధము, ధర్మజు పట్టాభిషేకము, అనునవి యాయైదుదశలందలి ముఖ్యాంశములు. వీని నవలంబముగాఁ జేసికొని వ్యాసుఁడు జగద్ధితకాంక్షతో ధర్మనీతి తత్త్వోపదేశకములైన కథోపాఖ్యానముల నెన్నిటినో చేర్చి మహాభారతమును విశిష్టమైన శాస్త్రకావ్యముగాఁ బరిణమింపజేసెను.

వైశంపాయనుండు వ్యాసాజ్ఞానుగుణముగా జనమేజయునకు భారత కథ నంతను వివరించి చివర.

> వినుము పాండవ కౌరవ విషయమైన యిట్టి యితిహాసమే నుపాఖ్యాన జాత
> సహితమగునట్లుగా సమస్తంబు మహితవిస్తరంబుగఁ జెప్పితి విశదభంగి
>
> స్వ. 74

అని తెల్పియుండెను. అతఁడెఱింగించిన కథలోఁ బ్రధానమైన కౌరవ పాండవ వృత్తాంతమే వివిధములైన యుపాఖ్యానములుకూడ నున్నవి. వీనిలోఁ గొన్ని ధర్మమునకుఁ గొన్ని నీతికిఁ గొన్ని తత్త్వమునకు సంబంధించినవి. భారతవీరుల జీవితముతో సంబంధించిన యుపాఖ్యానములు

కూడఁ గొన్నికలవు. వీని నన్నిటిని వ్యాసుఁడు ప్రసక్తాను ప్రసక్తముగా ప్రధానకథలోఁ జొప్పించి దానికి గాంభీర్యమును విస్తృతిని గల్గించి యుండెను. తిక్కన ప్రధానకథా భాగమునేకాక యుపాఖ్యానములందలి కథలనుగూడ రచించుటలో మిక్కిలి నేర్పు ప్రదర్శించెను. మూల కథకును ఉపాఖ్యానములకును గల సన్నిహిత సంబంధము నాతఁడు నిపుణముగా నిర్దేశించి యుండెను.

ఉద్యోగపర్వ ప్రథమాశ్వాసమున శల్యుఁడు ధర్మరాజున కెఱింగించిన పురందర విజయోపాఖ్యానమున్నది. "కౌరవనాథుఁడా నహుషుకై వడి నాశముఁబొందు వాసవ శ్రీ రమణీయుఁడై జయము చేకొని ధర్మజుఁడు — — — సన్నుతికెక్కెడుఁ దాను దమ్ములున్" అను పద్యము దీనికిఁ బ్రధానకథతోఁ గల సంబంధమును వ్యక్తీకరించుచున్నది. మఱియు ధర్మజుఁడు శల్యుని యుపచార ప్రియత్వమెఱిఁగిన వాడగుటచే నీకథ నాతనివలన వినుట ద్వారా అతనిని దనయెడఁ బ్రసన్నుని గావించుకొని యున్నాఁడు. ఉద్యోగపర్వము నందలి తృతీయాశ్వాసమున జామదగ్న్య కణ్వులు దుర్యోధనునికిఁ దెల్పిన దంబోద్భవ గరుత్మచరిత్రలు గర్వము కొఱగాదనుటకు దృష్టాంతములుగాఁ జెప్పఁబడినవి. అవి యతి సంక్షిప్తములుగా నున్నవి. చతుర్థాశ్వాసమునందలి అంబోపాఖ్యానము భీష్మునికి సంబంధించినది. దానివలన నతఁడు శిఖండిని జంపమికిఁ గారణము వెల్లడియగుచున్నది. భీష్మపర్వారంభమున సంజయుఁడు భూపరిమాణమును, భారతవర్షముఁగల విశేషములను ధృతరాష్ట్రునికిఁ దెల్పియుండెను. "పార్థివులు సంతృప్తులైనచో నష్టులగుదు" రను న్యాయము ననుసరించి రాజులు తండ్రి. యన్న. తమ్ముఁడు అను నాలోచనలేక యొండొరులపై నెత్తిపోయి భూమిఁగొందురని తెల్పి సంజయుఁడాతనికి దుఃఖోపశమనము కావింపనెంచుటయే యిచ్చటి యీవివరణమునకుఁ గారణము.

ద్రోణపర్వ ద్వితీయాశ్వాసమున నభిమన్యు మరణానంతరము ధర్మజుఁడు దుఃఖించుచుండఁగా వ్యాసుఁ డరుదెంచి మృత్యువుననివార్యత నెఱింగించుటకై నారదుఁడకంపనునికిఁ దెల్పిన మృత్యుప్రకారము వివరించెను. తరువాత నతఁడు సృంజయ సువర్ణష్ఠీవుల వృత్తాంతమును దానికంగముగా నారదుఁడు సృంజయునికిఁ దెల్పిన షోడశమహారాజ చరిత్రమును విశదీకరించెను. అభిమన్యుఁ డెట్టి పుణ్యాపరులకుఁగూడఁ బడయనలవిగాని యుత్తమపదంబు గొనెనని సూచించి ధర్మజునికి దుఃఖోపశమనము కావించుటకై యీవృత్తాంతములు తెల్పఁబడినవి. ద్రోణపర్వాంతమున వ్యాసుఁడు తన యాగ్నేయాస్త్రంబు కృష్ణార్జునులయందు వృథయయ్యెనని దుఃఖించు నశ్వత్థామకు కృష్ణార్జునుల మహిమానుభావముల నెఱింగించెను. తరువాత నతడర్జుననకుఁ బరమేశ్వరుని మహిమను; అతనికి భక్తుఁడైన యర్జునునిపైఁగల యపార కృపాతిశయమును వివరించెను.

కర్ణపర్వ ప్రథమాశ్వాసమున శల్యుని కర్ణరథసారథిగా నుండ నంగీకరింపఁ జేయుటకై దుర్యోధనుఁడతనికిఁ ద్రిపురాసుర సంహార సందర్భమున బ్రహ్మపరమేశ్వరునికి సారథియైన

తెలిపెను, పరశురాముఁడు కపటాత్ముఁడై శిష్యుఁడు తనకుఁ బ్రసాదించిన దివ్యాస్త్రము లెల్లఁ గర్ణుని కుపదేశించిన విధమును వివరించెను. శల్యుఁడు కర్ణునికి సుప్రసిద్ధమైన హంసకాకీయోపాఖ్యానము చెప్పి యొంటి కాకమునకు నెక్కుడువారల ధిక్కరింపవలదని మందలించినది కూడ నీయాశ్వాసముననే. శల్యపర్వ ద్వితీయాశ్వాసమున భీమదుర్యోధనులు గదాయుద్ధమొనరింప నుద్యుక్తులై యున్న సమయమున బలరాముఁ డచ్చటికి రాగ కృష్ణుఁడు పాండవులయెడఁ బక్షపాతము కల్గియుండు టెఱిఁగి తీర్థయాత్ర కరిగెను. ఈసందర్భమున నతఁడు సేవించిన ప్రభాసాది తీర్థముల మహిమయు, మంకణముని మాహాత్మ్యమును, సోమతీర్థ మహత్త్వమును, కుమారస్వామి ప్రభావమును, ప్రభావతి యను ముని కన్య మహిమయు, కురుక్షేత్ర ప్రభావమును వర్ణింపఁ బడినవి. వీనికి ప్రధాన కథతోఁ గల సంబంధ మత్యల్పము. సౌప్తికపర్వారంభమున కృప కృతవర్మలు వట విటపము క్రింద నిద్రపోవుచుండ నశ్వత్థామ మేల్కని యుండి యొక యులూకము మరుదెంచి యా చెట్టు శాఖల నిద్రించుచుండిన కాకముల వధించుటగాంచెను. ఈ వృత్తాంత మశ్వత్థామను నిద్రపోవు శత్రువుల నిగ్రహించు పనికిఁ బ్రేరేచెను. స్త్రీపర్వమున విదురుఁడు ధృతరాష్ట్రునకు సంసార గహనము తెలియఁగలిగించుచు దుర్గమారణ్యమున నరుగు నొక భీకర మృగముల చేతను జోరులచేతను నాక్రమింపఁ బడిన విప్రుని వృత్తాంతము తెలిపెను. ఈ కథ చిన్నదయ్యు తత్త్వ విషయ గర్భితమై గంభీరార్థ స్ఫోరకముగా నున్నది.

యుద్ధానంతరము బంధుమిత్ర మరణ ఖిన్నుఁడైన ధర్మజునకు నుత్సాహము కలిగించుటకై వ్యాసుఁ డతనికి దండనీతిచే నపవర్గంబు వడసిన సుద్యుమ్నుని చరిత్రము తెల్పెను. ఈసందర్భముననే కృష్ణుఁ డర్జున ప్రేరితుఁడై ధర్మజునకు మున్నభిమన్యు మరణానంతరము నారదుఁడు వివరించిన షోడశ మహారాజ చరిత్రమును మరలఁ జెప్పెను. అచ్చటి పద్యములే మరల నిచ్చటఁ బునరుక్తము లైనవి. తరువాత ధర్మజుఁ డడుగఁగా నతఁడు పర్వత నారదుల వృత్తాంతము కూడ వివరించెను. శాంతి పర్వ ద్వితీయాశ్వాసమున కృష్ణుఁడు ధర్మజునకు పరశురాముఁడు పృథివిని నిఃక్షత్త్రము గావించిన వృత్తాంతము తెల్పెను భీష్ముఁడు ధర్మజునకుఁ బెక్కునీతి ధర్మ తత్త్వము లుపదేశించుచు ననేకములైన సంవాదములు, ఇతిహాసములు వివరించెను. వీనిలో లుబ్ధకపోతోపాఖ్యానమును, గృధ్రజంబుకోపాఖ్యానమును ముఖ్యములైనవి. వీనిని రచించుటలో తిక్కన ప్రదర్శించిన నేర్పప్రతిమానమైనది. లుబ్ధక పోతోపాఖ్యానము శరణాగత సుకృతమును బోధించు కథా రత్నము. ప్రభువున కార్తజన బాష్ప ప్రమార్జనము కర్తవ్యమనుటకును నిజ కార్యార్థులగు కపటుల నేర్పు మాటల తెరువు తెలియంగుట యావశ్యక మనుటకును నుదాహరణమైన గృధ్రజంబుకోపాఖ్యానము ప్రబంధధ్వనికి నిధానమై మిక్కిలి హృద్యముగా నున్నది.

అనుశాసనికపర్వమందలి యుపాఖ్యానములలో గరుత్మంతుని చరిత్రమును, నృగచరిత్రమును ముఖ్యములైనవి. అందుఁ జతుర్థాశ్వాసము చివర నారంభించిన ఉమామహేశ్వర సంవాదమను నితిహాసము పంచమాశ్వాసమున నర్థభాగమునకుఁ బైగా వ్యాపించినది. ఇందు పార్వతి

యడుగ శివుడనేక ధర్మతత్త్వ ప్రకారముల తెఱంగెఱింగించెను. అశ్వమేధపర్వము తృతీయాశ్వాసమున ముంగుని చరిత్రమున్నది ఆపర్వము హింసాత్మకమైన పశుయజ్ఞముకంటె నహింసామహితమైన తపోయజ్ఞమే యధికమని సూచించు నక్తుప్రస్థుని చరిత్రముతో ముగియుచున్నది. ఈయుపాఖ్యానము ధర్మబోధన ధురీణతచేత నేకాక కథాకథన కామనీయకముచేఁ గూడ నతిప్రసిద్ధిగాంచినది. ఈవిధముగా తిక్కన ప్రధాన కథారచనమందేకాక యుపాఖ్యాన నిర్వహణమందుఁగూడ నఖండమైన నేర్పుప్రదర్శించెను. శాంత్యానుశాసనికాశ్వమేధపర్వము లందలి ధర్మనీతి తత్త్వబోధకములైన సంవాదేతిహాసములు ప్రధాన కథాగమనమున కాటంకములైన విషయము నిజమేయైనను అన్యవిధమున నవి భారతమునకుఁగలిగించిన వైశిష్ట్యము నిరుపమానమైనది.

కురుక్షేత్రమున కౌరవపాండవసేనలు రెండును విడిసి కయ్యమునకుఁ గాలుద్రవ్వు సమయమున సంజయ ద్వితీయుఁడై నిర్వేదించు ధృతరాష్ట్రుని కడకు వ్యాసుఁడరుదెంచి దానినాలోకింపఁ దలఁచినచో దివ్యదృష్టి నొసంగెదనని పలికెను. ధృతరాష్ట్రుఁడు తనకు వినుకోరికయే కాని క్రూరమైనపోరు చూచు కోరిక లేదని చెప్పెను. అంతవ్యాసుఁడు సంజయునకు రెండు తెఱంగులవారి దివారాత్ర వర్తనములును, రహస్యప్రకార భాషణములును, మనోవృత్తములును ఎఱుఁగునట్లుగా వరమిచ్చి యతనిని యుద్ధక్రమమంతయు ధృతరాష్ట్రునికి వినిపింప నియోగించి యరిగెను. తిక్కన యుద్ధపర్వములైదింట కథాకథనమునఁ గ్రొత్తమార్గము నవలంబించెను. సంజయుఁడు యుద్ధభూమినుండి వచ్చి యాపర్వముల మొదట భీష్ముఁడో, ద్రోణుఁడో, కర్ణుఁడో, శల్యుఁడో యుద్ధమున మడిసెనని చెప్పును. ధృతరాష్ట్రుఁడా దుఃఖవార్తవిని బిట్టుశోకించి యాయావీరుల పరాక్రమముల నగ్గించి యట్టివారు మడియుట యెట్లు సంభవిల్లెనో తెల్పుమని యడుగును, సంజయుఁడు వివరముగా, జెప్పఁదొడంగును. ఈ విధముగా సౌప్తికపర్వ ప్రథమాశ్వాసాంతమున దుర్యోధనుఁడు ప్రాణములు విడుచువఱకు జరిగిన వృత్తాంతమును సంజయుఁడు ధృతరాష్ట్రుని కెరిగించెను. సౌప్తికపర్వ ద్వితీయాశ్వాసము నారంభమున ధర్మరాజు సోదర శౌరిసాత్యకి పరివేష్టితుఁడై యుండ ధృష్టద్యుమ్నుని సారథియరుదెంచి కృపకృతవర్మలతో నరుదెంచి రాత్రి యశ్వత్థామ వీడెల్లఁ బీనుఁగు పెంటగావించిన యుదంతము నెఱింగించెను.

యుద్ధపర్వము లందు తిక్కన చూపిన వర్ణనపాటవమును, సూక్ష్మాంశ పరిశీలనమును అప్రతిమానములైనవి. అతఁడు కేవలకవియే కాక దండనాథుఁడు కూడనైన కతమున యుద్ధమునందలి వ్యూహములను, అస్త్రశస్త్ర ప్రయోగక్రమమును విశదముగా వర్ణించి ఆయాయుద్ధ దృశ్యములను బఠితల మనోనేత్రములకు సాక్షాత్కరింపఁజేసి యుండెను. వ్యూహనిర్మాణము సంస్కృత భారతమునందుఁ గంటెఁ దెలుఁగున నెక్కువ స్పష్టముగను హృద్యముగను వర్ణింపఁబడియున్నది. తిక్కన యిరుపక్షములందలి ప్రధాన వీరు లెవరెవరితో తలపడి

యెట్లు యుద్ధము సాగించిరో నిపుణముగా వర్ణించియుండెను. అతఁడు ఏకైక వీరవిజృంభణ మును, జంట వీరుల యుద్ధక్రమమును సంకులసమరమును, ద్వంద్వ యుద్ధమును, సౌప్తిక వధను, శస్త్రాస్త్రగదా యుద్ధములను ప్రత్యేక నిపుణతతో విశదీకరించి యుండెను. ప్రతిదిన యుద్ధారంభావసానముల నతఁ డొక్కొక్క యెడ సూర్యోదయాస్తమయముల వర్ణనతో సూచించుట రమణీయముగా నుండును. మహావీరులయస్తమయము నాతఁడు సాధారణముగా సూర్యాస్తమయముతో సూచించుచుండును. మఱియును అతఁడు ఘోరమును భయావహమును బీభత్సాకరమునునైన యుద్ధదృశ్యములను వర్ణించు నప్పుడుకూడ లలిత సుందరోపమావస్తు వర్ణన సాహాయ్యమున నొకసౌందర్యమయి వాతావరణమును గల్పింప యత్నించుచుండును. అందుచేతనే యాతఁడు తఱుచు యుద్ధములు దారుణ రమణీయములను రెండింటిని సూచించు చుండును. ఆంధ్రవాఙ్మయమున కవితాకౌశలము నందువలెనే యుద్ధవర్ణన చాకచక్యము నందును తిక్కనతో సాటి చెప్పఁదగిన కవులెందరో కానిపింపరు.

కథాకథనమున మూఁడు ముఖ్యవిధానములున్నవి. అందొకటి కవియే కథను వివ రించుట. రెండవది యాయాపాత్రలచేఁ జెప్పించుట. మూఁడవది నాటకమున వలెఁ బాత్రల సంభాషణము ద్వారముగఁ గథను సాగించుట. తిక్కన భారతమున నీ మూఁడువిధములును గానిపించును. యుద్ధపర్వము లన్నియు వర్ణనాత్మకములు. ఇచ్చట వైశంపాయనుఁడో సంజయుఁడో కవిస్థానము నాక్రమింతురు. శాంత్యానుశాసనిక పర్వములం దధికభాగమున భీష్ముఁడో, కృష్ణుడో, వ్యాసుఁడో, శివుఁడో ధర్మజునికో, పార్వతికో మఱెవ్వరికో ధర్మతత్త్వా దులు వివరించుచుందురు. ఈవివరణ సందర్భమునఁదొల్లినివసించిన వ్యక్తులకు జరిగిన సంవాద ములు విశదీకరింపఁ బడుచుండును. విరాట మౌసల, మహాప్రస్థాన స్వర్గారోహణ పర్వములు ప్రాయికముగాఁ గథనమార్గమున నడచినవి. ఉద్యోగపర్వమందలి కథాభాగమంతయుఁ గొంచె మించుమించుగా సంభాషణలద్వారా సాగినది. ఇందు మూఁడు రాయబారములు వర్ణింపఁ బడి నవి. సంజయుఁడును కృష్ణుఁడును రాయబారముల సందర్భమున చూపిన వాగ్మితావైభవ మద్వితీయ మైనట్టిది. సంజయునితోఁ బ్రసంగించు సందర్భమున ధర్మజుఁడు చూపిన వాక్చా తుర్యము సాటిలేనిది. ఈ పర్వమునందలి సంభాషణలలోఁ గొన్నిచోట్ల రమ్యములును బరి మితములునైన సంవాదములును, గొన్నిచోట్ల పద్యమయములైన దీర్ఘోపన్యాసములును, గొన్ని చోట్ల చమత్కారముతోఁ గూడిన యుత్తర ప్రత్యుత్తరములును గానిపించును. ఈఘట్టము లందు తిక్కన హేతువాదముతోఁ గూడిన చర్చాకౌశలమును; వ్యాఖ్యాన వైదగ్ధ్యమును, ఉపసంహరణ కళాప్రాగల్భ్యమును బ్రకటించుచునే సంభాషణలద్వారా కథాభాగమును సాగించి యున్నాడు.

నన్నయ రోమహర్షణపుత్త్రుఁడైన యుగ్రశ్రవసుఁడు శౌనకాది మహర్షులకుఁ దెల్పి నట్లుగా భారత కథను వక్కాణించెను. వ్యాసుఁడు భారతమును రచించి దానిని మనుష్యలోక

మున జనమేజయున కెఱింగింప వైశంపాయను నియోగించెను. ఉగ్రశ్రవసుఁడు వైశంపాయన మునివలన నాకథ విని శౌనకాదుల కెఱింగించెను. తిక్కన వైశంపాయనుఁడు జనమేజయునకుఁ జెప్పినట్లే కథ సాగించెను. కాని స్వర్గారోహణ పర్వాంతమున,

> పూతాత్ములార! ఈ పుణ్యేతిహాసంబు జనమేజయుఁడు సేయు సర్ప ముఖము
> కాలంబు నందట్లు కారుణి కోత్తముం డైన వేద వ్యాసుఁ డాదరమున
> నాజ్ఞాపనము సేయ నతని శిష్యుఁడు లోక నుతుఁడు వైశంపాయ నుండు చెప్పె
> నన్న రేంద్రుఁడు విన నా సభ నిలిచి సవినయ భక్తి కముగ వినిన వాఁడఁ
> గథన శక్తియు నమ్ముని కరుణ వలనఁ కలిగె నా కిత్తెఱంగున గారవించి
> మీరు వినుచుండఁ జెప్పెడు మేటి పదము గంటి మంటి మీదయ పెంపుకతనఁ జేసి.

అని యుగ్రశ్రవ శ్శౌనకాదుల వృత్తాంతము నుటంకించెను. సర్పయాగ సందర్భమునఁ గృష్ణద్వైపాయను నాజ్ఞచే నతని ప్రియ శిష్యుఁడైన వైశంపాయనుఁడు భారతేతిహాసమును జనమేజయునికిఁ దెల్పెను. మహాభారత కథ తక్షకాప కృతుఁడైన యుదంకుఁడు జనమేజయుని కడ కరిగి యాతనికి సర్పయాగాచరణ బుద్ధి పుట్టించుటతో నారంభించు చున్నది. ఆ సర్పయాగ మాస్తీక ప్రార్థనచే నడుమనే యాగిపోయెను. తిక్కన జనమేజయుఁ డాస్తీకు నభ్యర్చనమున నత్యంత సంతుష్టునిఁ గావించి, ఋత్విజులాదిగా నఖిల బ్రాహ్మణులకు బహు ధనము లొసంగి యామంత్రితులఁ జేసి, వైశంపాయను సవిశేష పూజనము లఁ బరితోషితు నొనర్చి, సకల జనములు ప్రస్తుతింప వైభవమునఁ బురము ప్రవేశించెనను వృత్తాంతముతో భారత కథ ముగించెను. సర్ప యాగోపక్రమణముతో నారంభించిన కథ నిట్లు ముగించుట యౌచిత్య శోభితమై యొప్పారు చున్నది.

## రసపోషణము :

కాశీఖండమునఁ గృతిపతి శ్రీనాథుని కవితాకౌశలమును గూర్చి ప్రశంసించుచు "వాక్రుత్తు తిక్కయజ్వప్రకారము రసాభ్యుచిత బంధముగ నొక్కొక్కమాఁటని చెప్పియుండెను. దీనినిబట్టి తిక్కన రచనయందు రసాభ్యుచితబంధత్వము ప్రధానగుణమని శ్రీనాథుఁడు భావించి నట్లు స్పష్టమగుచున్నది. అదిగాక తిక్కనయే విరాటపర్వారంభమున "హృదయాహ్లాది చతుర్థ మూర్జిత కథోపేతంబు నానారసాభ్యుదయోల్లాసి విరాట పర్వ''మని యాపర్వమును బ్రశం సించి యుండెను. ఇందలి విశేషణము లొక్క విరాటపర్వమునకే కాక భారతమున కంతటికిని అన్వయించును. తిక్కన తానురచించిన పదునైదు పర్వములను రసమయముగా నిర్వహించు టకు యత్నించి కృతార్థుండయ్యెను''. రసే నైవ జీవతికావ్యం. నహిరసశూన్యం కావ్యం కించిదస్తి, రసఏవవస్తుతః ఆత్మా. వస్త్వలంకారధ్వనీతు పర్వధార సంప్రీతి పర్యవస్యేతే'' అని అభినవగుప్త పాదుఁడు త్రివిధధ్వనులలో రసధ్వనికే యెక్కువప్రాధాన్యము నొసంగియున్నాడు. ఈసిద్ధాంతమే విశ్వనాథుని'' వాక్యం రసాత్మకం కావ్యమ్మను నిర్వచనమునకు మూలమైనది.

విరాటపర్వమందలి కథాభాగములలో కీచకవధయు దక్షిణోత్తర గోగ్రహణములును ముఖ్యములైనవి. ఇందు కీచకప్రణయమేకపత్ర నిష్ఠానురాగముతోఁ గూడినదగుటచే శృంగార రసాభాసమున కాలవాలమై యున్నది. కీచకవధఘట్టము వీరరౌద్ర రససంకలితము. ఉత్తరాభిమన్యుల వివాహవృత్తాంతము శృంగార రసపూరితము. దక్షిణోత్తరగ్రహణములందలి యుద్ధఘట్టములందు వీరరౌద్రభీభత్సములను, ఉత్తరుఁడు కౌరవవీరులను జూచి పాఱిపోవు ఘట్టమున భయానకహాస్యములను తిక్కన చక్కగాఁ బోషించియుండెను. పాండవులను ద్రౌపదియుఁ దాము ధరింపవలసిన వేషములను నిర్ణయించుకొని విరాటుని కొల్వున కేగు సందర్భమునను, గోగ్రహణ సందర్భమునను వీరమును, అర్జునుఁ డుత్తరునకుఁ దన్నెఱింగించిన సందర్భమున నద్భుతమును గోచరించును. ద్రౌపది తన భంగపాటు భీమునితోఁ జెప్పి పరితపించు ఘట్టమునఁ గరుణమును, ధర్మజుఁడుసన్న్యాసి వేషమున విరాటునికొల్వు ప్రవేశించు ఘట్టమున శాంతమును బోషింపఁ బడినవి. ఈ విధముగాఁ దిక్కన విరాటపర్వమును నానారసాభ్యుదయోల్లాసిగా సంతరించెను.

ప్రబంధ రస స్వరూపమును వివరించు సందర్భమున మహాభారతమునందు శాంతమంగిరసమని యానందవర్ధనాచార్యులవారు ధ్వన్యాలోకమున నిశ్చయించి యున్నారు. వారందుఁ జూపిన యుపపత్తులే యిచ్చట సంగ్రహింపఁ బడుచున్నవి. అవి సంస్కృత భారతమునకు వలెనే యాంధ్ర భారతమునకును అన్వయించును "మహాభారతము శాస్త్రకావ్యము. అనఁగా నిందు శాస్త్రమునందు వలెఁ బురుషార్థ నిరూపణమును, కావ్యమునందువలె రసస్ఫోరకత్వమును గానవగును. వ్యాసుఁడు మహాభారతమును వృష్ణిపాండవ విరసావసానముతోఁ బరిసమాప్తి నొందించి దానికి వైరాగ్య జనకత్వమే ప్రధాన తాత్పర్యమనియు, మోక్ష పురుషార్థమును శాంత రసమును వివక్షావిషయములనియు సూచించెను. వృష్ణులు ముసలచూర్ణోద్భూతమైన ముయ్యంచుల తుంగతో నొండొరులఁ బ్రహరించుకొని మడిసిరి. పాండవులు మహాప్రస్థానక్లేశ మనుభవించిరి. శ్రీకృష్ణుఁడు వ్యాధునివలన విధ్వంసమును బొందెను. ఈవిధముగా భారతావసానము విరసమే యనుటలో సందేహము లేదు. దీనిని పఠించినప్పు డెంత బలమున్నను ఎంత సంపద యున్నను అవి యవసానకాలమున నుపయోగింపవనియు, మహానుభావులైన వృష్ణికృష్ణ పాండవుల గతియే యిట్లైనప్పుడు మన గతి వేఱవచింప నక్కఱ లేదనియు, ధన కనకవస్తువాహనాదులును వాని యందలి తగులమును వ్యర్థములనియు వైరాగ్య బుద్ధి పుట్టక మానదు. ఈ వైరాగ్యమున కనుబంధియైన పురుషార్థము మోక్షము; రసము శాంతము. వ్యాసుఁడు తన కావ్యమున వీనినే సూచించెను. ఇతర వ్యాఖ్యాతలు కూడ నీ యంశమునే వివరించి యుండిరి. అది యటుండ వ్యాసుఁడే

యథా యథా విపర్యేతి లోక తంత్ర మసారవత్
తథా తథా విరాగోఽత్ర జాయతే నాత్ర సంశయః

అని లోకులచేఁ బ్రయత్న పూర్వకముగా సంపాదింపఁబడు ధర్మార్థ కామములును, దత్సాధనములును ఆర్జన రక్షణ క్షయాది ప్రకారములచే తుచ్ఛమైన యింద్రజాలమువలె వైపరీత్యమును బొందుకొలంది లోకతంత్రమునందు విరాగముకల్గుననుటలో సందేహములేదని చెప్పియున్నాఁడు. అతఁడొకవిధముగా విరాగపదముచే తత్త్వజ్ఞానోత్థితమును శాంతరసస్థాయియునైన నిర్వేదమును సూచించి యున్నాఁడు. ఎంతగా వర్ణితములైనను ఇతర రసము లంగములుగానే యుండుననియు శాంతమే అంగియనియుఁ, బురుషార్థాంతరము లుపసర్జనములుగా మోక్షము ననుసరించి యుండుటచేఁ దన కావ్యమున మోక్షమే ప్రధాన పురుషార్థమనియు నతని యభిప్రాయము.

“శాంతోరసశ్చ ముఖ్యతయా వివక్షా విషయత్వేన సూచితః” అను మూలమునందలి ముఖ్యతయా అను వదమును వివరించుచు లోచనకారుఁడు “ధర్మే చార్థేచ కామేచ మోక్షేచ భరతర్షభ యదిహాస్తి తదన్యత్ర యన్నేహాస్తి నతత్ క్వచి”త్తను భారతశ్లోకము నందలి చకార చతుష్టయము వలన ధర్మార్థ కామముల సర్వస్వ మన్యత్ర లేని దిచ్చట లేకున్నను పర్యంత విరసత్వ మిచ్చటనే యవలోకింపఁ బడుచున్నదనియు, మోక్షరూపముయొక్క సారవత్వ మిచ్చటనే విచారింపఁ బడవలెననియు వ్యక్తమగుచున్నదని తెల్పియున్నాఁడు.

మహాభారతానుక్రమణిక యందీ విషయము చెప్పఁబడి యుండకపోవుటయే కాక దానికి విరుద్ధముగా భారతమున నన్ని రసములును అన్ని పురుషార్థములును ఇమిడి యున్నవని తెల్పఁబడియుండుటచే నందు శాంతరసమునకును మోక్షపురుషార్థమునకునుగల ప్రాధాన్యమును గూర్చి శంక యుదయింపవచ్చును. కాని యందు శాంత మోక్షములకుఁ గల ప్రాధాన్యము స్వశబ్దములచే వాచ్యముగాఁ జెప్పఁబడకున్నను వ్యంజనామార్గముచేఁ జెప్పఁబడియున్నది. చరిత్రాను కీర్తనానంతరము “భగవాన్ వాసుదేవశ్చ కీర్త్యతేఽత్ర సనాతనః” అను వాక్యము వ్రాయఁబడినది. ఈ సందర్భమున నన్నయ

భక్తియుక్తులైన భాగవతులకు శ్రీ
వల్లభుండు భక్తవత్సలుండు
భవభయంబులెల్లఁ బాపియిష్టార్థ సం
సిద్ధికరుణతోడఁ జేయుచుండు.

అని వ్రాసియున్నాఁడు. వీనివలన మహాభారతమున కీర్తింపఁబడు పాండవాది చరిత మవసానవిరసమును అవిద్యాప్రపంచరూపముననియు, పరమార్థసత్యస్వరూపుఁడైన వాసుదేవుడిందు కీర్తింపఁబడుచున్నాఁడనియు, నందుచే ఓలోకులారా! మీరు పరమేశ్వరుఁడైన యీవాసుదేవునందే భావితము చేతస్కులుకండు. నిస్సారములైన విభూతులందుఁగాని నయవినయ పరాక్రమాది గుణములందుఁగాని యభినివేశము నొందకుఁడనియు వ్యంగ్యముగాఁ దెల్పఁబడుచున్నది. ఇవి సంసారము యొక్క నిస్సారతను జక్కగా వ్యక్తము చేయుచున్నవి. “సహిసత్య” మిత్యాద్యనంతరశ్లోకములు సహితము గర్భీకృతమైన యీయర్థమునే వెల్లడిచేయుచున్నవి.

మహాభారతావసానమున హరివంశమును వర్ణించి కృష్ణద్వైపాయనుఁడు నిగూఢ రమణీయమైన యీయర్థమునే స్ఫుటీకరించి యున్నాఁడు. సంసారాతీతమైన తత్త్వాంతరము నందు భక్త్యతిశయమును బ్రవర్తింపఁజేయు నీయర్థముచే సకలమైన సాంసారిక వ్యవహారమును సంపూర్ణముగా పూర్వపక్షీకృతమై ప్రకాశించు చున్నది. దేవతాతీర్థ తపః ప్రభృతుల యొక్కయు ప్రధానాతిశయవర్ణన మా పరబ్రహ్మప్రాప్త్యుపాయమును దద్విభూతియునై యున్నది. పాండవాది చరితవర్ణనము వైరాగ్యము మోక్షమూలమగుటచేతను, మోక్షము భగవత్ప్రాప్త్యుపాయమని గీతాదులందు ప్రదర్శింపఁబడియుండుటచేతను పాండవాది చరితవర్ణ నము కూడ పరంపరా సంబంధముచే మోక్షప్రాప్తి సాధనముగాఁ బర్యవసించుచున్నది.

వాసుదేవుఁడైన శ్రీకృష్ణుని మహత్త్వము భారతమున వర్ణింపఁబడినంతమాత్రమున నందు పరబ్రహ్మతత్త్వమును తత్ప్రాప్త్యుపాయమును ఎట్లు సూచితములగునని కొందఱు సంశ యింపవచ్చును. అట్టి సంశయమునకుఁ దావులేదు. అపరిమిత శక్త్యాస్పదమైన పరబ్రహ్మము పరంపరా గతవాసుదేవాది సంజ్ఞాభిదేయత్వమును గలిగియున్నది. గీతాదిగ్రంథములందు వాసు దేవాది శబ్దములు పరబ్రహ్మాభిధానములై ప్రసిద్ధినందియున్నవి. వాసుదేవునికి వాడఁబడిన సనాతనాది విశేషణములు మాథురప్రాదుర్భావానుకృత సకల స్వరూపమగు బ్రహ్మమునే కాని మాథురప్రాదుర్భావాంశ మాత్రమును వివక్షించుట లేదు. (మధుర యందుఁ గృష్ణుఁడుగాఁ బుట్టుట మాథుర ప్రాదుర్భావము) రామాయణాదులందు రామాది శబ్దములు భగవన్మూర్త్యంతర మందు వ్యవహరింపఁ బడుచున్నట్లిచ్చట వాసుదేవశబ్దము పరబ్రహ్మ మందే వివక్షితమగుచున్నది.

భారతానుక్రమణి యందు భగవద్వ్యతిరేకమైన దంతయు ననిత్యమని వ్యక్తముచేయు వాక్యముచే శాస్త్రమార్గమున మోక్షలక్షణమైన పరమపురుషార్థమును కావ్యమార్గమున తృష్ణా క్షయ సుఖపరిపోష లక్షణమైన శాంతరసమును బ్రధానముగా వివక్షితములైనట్లు ప్రతిపాదింపఁ బడినది. అత్యంత సారభూతమగుటచే నీయర్థము వాచ్యముగాఁ గాక వ్యంగ్యముగాఁ జెప్పఁ బడినది. సారభూతమైన యర్థము స్వశబ్దానభిదేయత్వ రూపమునఁ బ్రకాశితమైనచో మిక్కిలి శోభను వహించును. అభిమతతరమైన వస్తువు వ్యంగ్యముగనే కాని సాక్షాచ్ఛబ్ద వాచ్యముగా ప్రకాశింపఁ జేయఁ బడదని విదగ్ధ విద్వత్పరిషత్తులందుఁ బ్రసిద్ధమైన విషయమే. ఈ విధముగా నానందవర్ధనుఁడు మహాభారతమున శాంతమే అంగిరసమని ధ్వన్యాలోకమునందు నిపుణముగా నిరూపించి యున్నాఁడు.

మహాభారతము నందలి శాంత్యానుశాసనికపర్వములును అశ్వమేధపర్వ మందలి కొంతభాగమును నీతి ధర్మ తత్త్వోపదేశములతోఁ గూడి మోక్ష పురుషార్థమున కనుగుణముగా నున్నవి. ఆశ్రమవాస పర్వాంతమున నారదుఁడు పాండవులకు ధృతరాష్ట్రాదుల నిర్యాణము నెఱింగించెను. విదురుఁడు యోగమార్గమున ధర్మరాజునందుఁ గలిసిన వృత్తాంతముకూడ నందే చెప్పఁ బడినది. మౌసలపర్వము వృష్ణివీరుల యొక్కయు మహానుభావులైన కృష్ణబల రాములయొక్కయు మరణమును వర్ణించు చున్నది. ఈ భాగములను బఠించునప్పుడు పఠితల

మనస్సులం దాయా పాత్రల మహత్త్వమును వారు చివరికిఁ బొందిన విరసావసానమును దలంపునకు వచ్చి వైరాగ్యముతోఁ గూడిన నిర్వేదము కలుగక మానదు. మహాప్రస్థానిక పర్వము కూడ నిట్టి భావమునే కలిగించును. ఈ విధముగా నీ చివరిపర్వములన్నియు మహాభారతమున నంగిరసము శాంతమే యను విషయమును బలపఱుచు చున్నవి.

కల్హణుఁడు రాజతరంగిణి యందనేక భూమిపతుల యుచ్ఛ్రియ పతనములను వర్ణించి యుండుటచే నా కావ్యారంభమున నదియు మహాభారతమువలెఁ బలువురు రాజవరేణ్యుల విరసానమును వివరించుచు శాంతరసప్రధానమై యున్నదని తెల్పి యున్నాఁడు.

ఉద్యోగపర్వమున మూఁడు సంధి రాయభారములు నడచినవి. కౌరవులకును పాండవులకును సంధి పొసగించి జగత్ప్రళయమునకు దారిచూపు యుద్ధమును నివారింపవలెనను నుత్సాహము రాయబారుల యందుఁ గనిపించును. అందుచే నీ పర్వమంతయు వీర రసమయమై యున్నదని చెప్పవచ్చును. శ్రీకృష్ణుఁడు విశ్వరూపము ప్రదర్శించిన ఘట్ట మద్భుతభయానకముల కాలవాలమై యున్నది. ద్రౌపది కృష్ణునితోఁ దన భంగపాట్లు చెప్పుకొనునప్పుడు కరుణరౌద్రములును కర్ణుఁడు భీష్మునితోఁ గలహించి యస్త్రసన్న్యాస మొనరించు సందర్భమున రౌద్రమును గోచరించును.

యుద్ధపర్వములైదును వీరరౌద్ర బీభత్స భయానకరస సమయములై కన్పట్టును. యుద్ధమునకుఁ బోవు వీరుల యుత్సాహ వాక్యములు వీరరసాకరములై యుండును. తిక్కన యుద్ధ భూమి యందు నిహతులైన వీరుల ఖండితములైన యవయవములను, నెత్తురుకాల్వలను వసామాంసాదులను వర్ణించుపట్ల బీభత్సము గోచరించును. శ్రీకృష్ణుఁడర్జునునకు గీతబోధించిన ఘట్టము శాంతరస ప్రచురమై యొప్పారును. అభిమన్యునికై ధర్మజుఁడు విలపించు ఘట్టము కరుణరస నిలయము. అట్లే స్త్రీపర్వమునందలిది ద్వితీయాశ్వాసమున గాంధారి మృతవీరుల కళేబరములను జూచి విలపించిన ఘట్టము కరుణరసనిర్భరముగా నుండును. దుఃఖితులైన వారిని వ్యాసుఁడో నారదుఁడో, మఱెవ్వరోవచ్చి యోదార్చు సన్నివేశములు తాత్త్విక విషయమయములై శాంతరసమును స్ఫురింపఁ జేయును.

అశ్వమేధమున కృష్ణుఁడు మృతజాతుఁడైన పరీక్షితుని లబ్ధజీవు నొనరించుట, ఆశ్రమవాసమున వ్యాసుఁడు ధృతరాష్ట్రాదులకు భారతరణమృతులను రావించి చూపుట, స్వర్గారోహణమున ధర్మజుఁడు గంగావగాహన మొనరించి దివ్యత్వమునొందుట మున్నగు ఘట్టము లద్భుతరసమున కునికిపట్టులై యుండును. ధర్మరాజు ధృతరాష్ట్రాదులు మృతులగుట విని శోకించుట, తనసోదరులు నరకమున నుండుట యెఱింగి తపించుట మున్నగు ఘట్టములందుఁ గరుణరసము గోచరించును. ఈవిధముగా భారతమునందలి యాయాపర్వములం దాయారసములు స్ఫురించుచున్నను మొదటినుండి తుదిదాఁక మోక్షపురుషార్థమును, శాంతరసమును

వివక్షితములై యే యుండును. శాంత్యాదిపర్వములందది పరోక్షములందది పరోక్షమును గర్భితమునుగాక ప్రత్యక్షముగనే స్ఫురించుచుండును.

తిక్కన ప్రసక్తానుప్రసక్తముగా భారతమునఁ బెక్కుపాఖ్యానములను రచించి యుండెను. వస్తుపాత్రముల స్వభావమునుబట్టి యందలి రసములు మాఱుచుండును. తిక్కన యెచ్చట నేరసమును వర్ణించినను దదనుగుణమైన విభావానుభావ సాత్త్వికవ్యభిచారి భావములను నిపుణముగా వర్ణించి పఠితల కాయారసముల నాస్వాద్యమానములు కావించును. అంగిరసమునకు భంగము రాకుండఁగను, సూక్తిమంతముగను, రసపోషణము కావించుటలో నాతఁడు మిక్కిలి సమర్థుఁడు. అందుచేతనే శ్రీనాథుఁడాతని రచనమున రసాభ్యుచిత బంధత్వమును బ్రముఖ గుణముగాఁ బేర్కొని యుండెను.

దివాకర్ల వేంకటావధాని.

---:o:---

# విషయ సూచిక

-—:౦:—

## కర్ణపర్వము - ప్రథమాశ్వాసము



## కర్ణపర్వము — ద్వితీయాశ్వాసము

## కర్ణపర్వము — తృతీయాశ్వాసము

## శల్య పర్వము — ప్రథమాశ్వాసము

విషయము. పుట

శల్యపర్వము — ద్వితీయాశ్వాసము



సౌప్తికపర్వము — ప్రథమాశ్వాసము

| విషయము. | | | పుట |
|---|---|---|---|


## సౌప్తికపర్వము — ద్వితీయాశ్వాసము



## స్త్రీపర్వము — ప్రథమాశ్వాసము

విషయము.



## స్త్రీపర్వము — ద్వితీయాశ్వాసము



—→o←—

# శ్రీమదాంధ్ర మహాభారతము

## కర్ణపర్వము - ప్రథమాశ్వాసము

1 శ్రీపరిణామ [1]స్థితి వి
ద్యా పారీణ[2]త్వ కారితానిరతా పాం
గా పరమనైష్ఠికత్వ
వ్యాపార ప[3]రానుషక్త హరిహరనాథా.

*-: సంజయుఁడు ధృతరాష్ట్రునకుఁ గర్ణుని తెగుటం జెప్పుట :-*

సం. 8-1-25

2 వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు మహాప్రాజ్ఞుండగు సంజయుండు దండుననుండి హాస్తిపురంబున కరుగుదెంచి ధృతరాష్ట్రు మందిరంబు ప్రవేశించి యంతఃపురంబున నున్న యన్నరనాథుం గనుంగొని కృతప్రణాముం డగుటయు నతం డాదరించిన నాసీనుండై.

3 క. బలవిక్రమములు వినుతం, బులుగా మనమొనలుఁ బాండు పుత్రానీకం
బులు [1]రెండునాళ్లు పోరుట, దెలియంగాఁ జూచి వచ్చితిం గురునాథా.

4 వ. అని పలికి కర్ణునిం బ్రశంసించి.

5 చ. సరకు గొనండు పాండు సుత సైన్య నికాయము నించుకేనియుం
గరులు రథంబులుఁ హరులుఁ గాల్బలముల్ దనవీఁక విచ్చియున్
మరలియుఁ దూలియుం బిలుకు [1]మాఱియు నల్గడఁ బాఱియుఁ వియ
చ్చరులకు వేడ్కసేయ భుజసారము [2]శౌర్యముఁ జూపె నేపునన్.

---

1 — 1. స్థిత - ఏ.డ. 2. ప్రకాశితా - అ.ఆ.ఏ.ఐ.ఝ,డ.ల. 3. రానురక్త - పెక్కుప్రతులు.

3 — 1. రెన్నాళ్ళును (లు) - ఉ.ఏ.ఐ.ఘ.జ.ట.డ.త.ద.ల.వ.

5 — 1. మాలియు - ఖ.బ.ర.ల.శ. శర.ష. 2. పెంపును -- అ.ఆ.ఏ.ఐ.ఝ.డ.ల ; నేర్పును - వ.

6 వ. చూపి యక్కౌంతేయులం గలంచి యాడి పదంపడి.

7 తే. తనకుఁ [1]బిమ్మిటియైన యర్జునుని బాహు
లీల నెమ్మెయిఁ ద్రోవంగలేక [2]తెగియె
నధిప యాఁబోతు బెబ్బులి కగ్గమైన
పగిది[3]యై పాండవులకును బగ యడంగె.

8 వ. అనుచు [1]శోకోపహతుండై సూతసూనుండు నిట్టూర్పు నిగిడించి డగ్గుత్తిక వెట్టి యిట్లనియె.

9 చ. అది యొకఁడేల కౌరవచయంబు జయాశ యడంగిపోవ బె
ట్టిదుఁడగు భీమసేనుఁడు గడింది మగంటిమి దుస్ససేను దు
ర్మదమడఁగించి పేరురము వ్రచ్చి మహోగ్రతఁ ద్రావె నెత్తు ర
[1]య్యది దుదినింత పుట్టునని యాప్తజనంబులు మున్న చెప్పరే.

10 తే. కొడుకులంత రాజ్యంబును గొనఁగశక్తు
లను దురాశ[1]ను వారల యవినయములు
నీవుపేక్షింతు మానునే యావిరుద్ధ
కర్మ[2]మున ఫలమొందక కౌరవేంద్ర.

11 వ. అనినవిని యాంబికేయుండు దుర్యోధనుండును దెగియెనకాఁ దలంచి [1]విహ్వలించి మూర్ఛిల్లినం దల్లడిల్లి [2]యార్తనాదంబులతో వివశం[3]బులయి వనితాజనంబులు గన్నీరు[4]గ్రమ్మ వసుంధర నొఱగిన నంతకుమున్న వచ్చియున్న విదురుండును నా సూతనందనుండును జేరి చేసేత శీతలజలసేచన మృదు

---

7 1. బిమ్మటయైన – పీ ; మిక్కుటమైన – ఆ.ఉ.ఘ.జ.ఝ.ణ.ద.స ; మిమ్మటమైన – ల.వ. 2. యీల్గె – ఈ.త.వ. 3. యయ్యెపాండవులకుబగ – కొన్ని ప్రతులు.

8 1. శోకదందహ్యమానమానసుండగుచు – కొన్ని ప్రతులు.

9 1. య్యదియును – ట.

10 1. ల – కొన్ని ప్రతులు. 2. ఫలమొందకిప్పుడు – కౌరవేంద్ర – ఝ.ల ; ఫలమున బొందక – కొన్ని ప్రతులు ; ములు ఫలమొందక – వ ; మను భవమొందక – వ.

11 విహ్వలుండై – జ. 2. హాహానినదంబులతో – ఈ.జ.త.వ. 3. బై నవనితా – అ.ఆ.ఏ ; వివశయై వనితా – కొన్ని ప్రతులు. 4. దొరుగ – అ.ఇ.ఎ.ఏ.ఐ. ఇతర

వ్యజన[5]వీజనంబుల నన్నరనాథుని నారీసముదయంబును సేదదేర్చిన నాసీనుండై
[6]యతండు దీర్ఘనిశ్వాసంబు లడరం జింతిల్లి యంతర్గతంబున దైవంబు
గర్హించి పాండవుల నగ్గించి తన బుద్ధియు శకుని వెరవును నిందించి తన్నుం
దాన యుపశమించుకొని ధైర్యం[7]బు సిక్కం బట్టి.

12 క. తెలియ విన నీవు సెప్పిన, పలుకులు దుర్యోధనుండు వడఁడుగదా వై
రుల విక్రమమున సంజయ, కలరూపెఱుఁగంగఁ జెప్పు క్రమ్మఱ నాకున్.

13 చ. అనుటయు నాతఁడిట్లనియె నమ్మనుజేంద్రున కాజిఁ గర్ణుఁడుం
దనయులుఁ దమ్ములుం బడిరి దారుణ విక్రమకేళి సల్పి నె
ట్టన బలుపారఁ బట్టి వికటంబుగ వక్షము వ్రచ్చి దుస్ససే
నుని రుధిరంబు మారుత తనూజుఁడు ద్రావె మదం బెలర్పఁగన్.

14 క. [1]అనిన విని యంత [2]కేమియు, నన కూరకయుండు సంజయా నీమాటల్
విననేరదు విభ్రాంతిని, మునిఁగినయది చిత్తమని విమూఢాత్ముఁడై.

15 వ. ధృతరాష్ట్రుండు మూర్ఛపడి యుండి కొండొకసేపునకు సేదదేఱి యాసూత
నందనున కిట్లనియె.

16 క. నా దుర్ణయమునఁ జేసియు, నా దుర్యోధనుని బుద్ధి హీనివలననుం
గాదె యిటులగుట మర్మవి, భేదన మగుశోక మింత పెల్లయియున్నె.

17 వ. దుఃఖంబు నిస్తరింప నోపుదునొకో యని తలంచుచున్న నాదు సంశయంబు
వాయ నింతకుమున్ను కయ్యంబునం గడచనిన మనవారిని వారి వారిని
నేర్పడం జెప్పు మనిన నతనికి సంజయుం డిట్లను మనయందు భీష్మద్రోణ
కర్ణ వికర్ణ వృషసేన దుశ్శాసన లక్ష్మణాదులును వారలలోన విరాట [1]శతా
నీక ద్రుపద ఘటోత్కచాభిమన్యు [2]పాండ్య ప్రముఖులును వేరువేర నిట్టిట్టి

---

ప్రతులు ; దొరంగ – పీ. 5. విలసనంబులు – అ.ఆ.ఘ.ఝ.ల ; 6. యతండు కుంభ
నిక్షిప్తంబైన భుజగంబు చందంబున నిశ్వాసంబులడర – ఎ.గ. 6. బవలంబించి –
ఊ.జ.పీ.వ.

14 1. అనవిని యంతటనేమియు – శ ; అనవిని యింతకు నేమియు – పీ.ప ; అనవిని
యుత్తరమేమియు – ఈ.ణ.త.వ. 2. కేనియు – వ.స.

17 1. శతానీక – పెక్కుప్రతులు ; శంఖోత్తర – వా. 2. పాండవ – కొన్ని ప్రతులు.

వారిచేత నిట్టిట్టివారు దెగిరని [3]యేర్పడ నెఱింగించిన నమ్మహీపతి గురుసేన నింక నెవ్వరు గలరని యడుగుటయు నతం డశ్వత్థామ కృతవర్మ శల్య శకుని కృపాచార్యులం బేర్కొని బ్రదికియున్న కురుకుమారులను గర్ణుకొడుకులలో నున్నవారలను మఱియుంగల యోధులను జెప్పి వీరలంగాని [4]యనికి నుత్స హించి పొనుఁగువడ్డ యగ్గివేఁడిమి వోని వాఁడిమితో దుర్యోధనుండు ధైర్యం బవలంబించి జయార్థియై యున్నవాఁడనిన విని కొడుకుకడిమికి వెడవెడ యూఱడిల్లిన యుల్లంబునం దనవారు పెక్కండ్రు వొలిసిన యల మట మునింగి యొక్కింత ప్రౌఢ్దూరకుండి రాధేయు దగుట దలపోసి యమ్మనుజనాథుండు.

18 తే. ఆలలోని యాఁబోతుబోలె నొప్పు, గురుబలంబులో [1]నున్మదద్విరదమూర్తి సింహసంహననుండు నిస్సీమవిక్ర, మాభిరాముండు [2]వోయెనే యక్కటకట.

19 వ. అని తొడంగి హాహాకారంబు లెసంగ రోదనంబు సేయుచు.

20 క. సంజయ మురభంజనుని ధ,నంజయునిం జీరికిం గొనఁడు కర్ణుం డిం ద్రుం జెనకినైన గెలుతున, నుం జచ్చెనె యట్టివాఁడునుం గయ్యమునన్.

**—: ధృతరాష్ట్రుఁడు గర్ణ మరణంబు విని పలవించుట :—**

సం. 8—5—10

21 సీ. పాండుసూనులతోడి పగకోర్చె నెవ్వని యుత్సాహ మూఁది సుయోధనుండు వైదేహపౌండ్రాదివసుధేశు లెవ్వని కడిమి సొంపున నరిగాఁపు లైరి మనమూఁక లెవ్వని పెనుఁ బ్రాపు గాంచి గర్వితములై సంగరక్రీడ సలుపు నద్భుతం బొనరించు నమరుల కెవ్వని యసమాన వివిధ దివ్యాస్త్ర మహిమ

ఆ. యట్టికర్ణుఁ డీల్గె [1]నట్టె యింకెక్కడి, బ్రదుకు మనకు నేటి ఖండనంబు దీని వినియు నాదు మానసం బేమియుఁ, గాదు వజ్రమయము గాఁగనోపు.

---

3. నిరూపించిన — ఊ. 4. యునికి — ల.పి.

18 1. నున్నతద్విరద — ట.వ, 2. వాలిసెనే — కొన్ని ప్రతులు.

21 1. నంటివింకెక్కడి — పి.శ.ష.

22 వ. అని [1]విలాపించి మఱియును.

23 క. పౌరి బంధుపుత్త్రమిత్త్రుల, [1]పరిభవములు వించునిట్లు ప్రాణముతో నె
వ్వరు [2]నుండుదురే యేనో, క్రూరుఁడును దక్కంగ నింత [3]కష్టంబగునే.

24 వ. అని పలికి మరణోద్యుక్తుండై జలాగ్ని విషప్రాయోపవేశాదు లుగ్గడించిన విని సంజయుం డతని కిట్లనియె.

25 చ. కులమును శ్రీయుఁ దేజము నకుంఠితకీర్తియుఁ జూడఁ దొంటి రా
జులకెనవత్తు నీ విటులు శోక సమాకుల చిత్తవృత్తివైఁ
గలఁగుట యొప్పునే శ్రుతము గౌరవముం బొగ డొందు నట్లుగా
నిలుపుము ధీరతాతిశయనిష్ఠఁ జలింపక యుండు ఘనావరా.

26 వ. అనుటయు నాంబికేయుండు సంజయున కిట్లనియె.

27 తే. శోకవారిధిపారంబు నాకుఁ బొంద, నేల వచ్చుఁ జిత్తంబునఁ గీలుకొని య
సహ్యమై కర్ణమరణోపజనితమైన, పరిభవం బను శల్య మాతురతఁ జేయ.

28 క. పౌరుష మేటికి దైవం, బేరూపునఁ జూడ ఫలదమే[1] మందము దో
స్సారనితాంతోజ్జ్వలుఁ డగు, నారాధేయుండు సచ్చె [2]నర్జునుచేతన్.

29 క. అలఘుతరాయువు నాకుం, గలదది యెట్లనినఁ బోరఁ గర్ణునిపాటేఁ
దెలియవినఁగ నాడెందము, పలువఱియలు గాక యున్న భంగి నెఱిఁగితిన్.

30 క. మును లోకముచే సత్కృతి, గని నెగడెడు వాఁడ నాకుఁ గలవారెల్లం
జన [1]శోచ్యుఁడనై దుర్దశ, ననికి మనికి యగునె దీని కోర్వఁగ వశమే.

---

22 1. పలవించి, శోకమగ్నుండగుచు — అని పాఠములు.

23 1. పరాభవము వించు — కొన్ని ప్రతులు. 2. నుండఁగలరె యే। నొక్కరు — వ. 3. కష్టముకలదే — కొన్ని ప్రతులు.

28 1. మేమందును — కొన్ని ప్రతులు — శ.ష. మున్నగు 2. నటియర్జునుచేన్ — వ.పీ.స.

30 1. శూన్యుఁడనై — ణ.త.వ.

31 సీ. దుఃఖ పరంపర [1]ద్రొక్కున( బెట్టె నా
చిత్తంబు ననిమిషసింధు తనయు
పడుటయు( ద్రోణుండు పరలోకమున కే(
గుటయు సూత[2]జుని తెగుటయును వినియు
నందు( [3]గర్ణు(డులేమి యత్యంత దుఃఖంబు
సేసె దుర్యోధను నాస [4]మానె
నత( డేడుగడయును నైయుండు నతనికి
నెవ్వరు గలరు దిక్కింక( జెపుమ

ఆ. మనబలంబుచేవయును వైరిసైన్యంబు
భయము( జెడ(గ రాధపట్టి గొంతి
పట్టిచేత సమసి పడియున్న వా(డె వా
సవుని కడిమి( బడిన జంభునట్లు.

32 క. విను [1]పిచ్చుకకుం టతిరయ, మున( బోకకు( బడుట పేదముదుక(డు వేశ్యా
జనముం గోరుట దుర్యో, ధను(డింక జయంబు గొన(గ( దల(చుట యరయన్.

33 క. మనలో( గయ్యం [1]బేటికి, నని ధర్మసుతుండు నెప్పె నది మీ పతి గై
కొన(డయ్యె [2]రోగి పథ్యా, శనమునకుం జొరని భంగి సంజయ యెట్లున్.

34 సీ. శరతల్పముననుండి శాంతనవుండు బీభత్సు దివ్యాస్త్ర వైభవము దెలుప(
దివిరి జలంబట్లు [1]దెప్పించుకొని యప్డు పాండుసూనులతోడి బాంధవంబు
నడపుము సిరి పంచి కుడుచుట మే లింతతో( గయ్యముడిగి శాంతు( డవుగమ్ము
బ్రదుకుము నీవన్న పనుపు సేయ(డు సుయోధను(డిప్డు శోకాబ్ధిమును(గకున్నె

ఆ. పడుచు లీ(కలూడ్చి పట్టియాడెడు నట్టి, పులు(గు చందమయ్యె( దల(ప నాయ
వస్థ యెందు( జొచ్చువా(డ నీయలమట, దీర్ప నెవ్వరింక దిక్కు గలరు.

---

31 1. ద్రొక్కున బడియెనా చిత్తమయ్యనిమిష — ఈ.ఉ.వ.పీ. 2. సుతుడీల్గుటయు — కొన్ని ప్రతులు. 3. గర్ణునిలేమి — కొన్ని ప్రతులు. 4. మాలె — కొన్ని ప్రతులు.

32 1. పిచ్చుకగుం టతిరయమున — ఇ.గ.ఘ.త.వ ; పిచ్చుగుంటి యతిరయమున — స.

33 1. బేమిటికని — వ. 2. వెడ (ఐ) గు — కొన్ని ప్రతులు.

34 1. దెప్పించికొని — పీ.శ.ప.

35 వ. అని పెక్కు భంగుల నివ్వటిలు నెవ్వగలు బయలు పడం బలు మాట లాడి
రాధేయు తెగిన తెఱంగు తెలియ వినం దలంచి యిట్లనియె.

36 మ. విజయుం దాఁకి పెనంగుచో నతని దోర్వీర్యంబు సైరించెనో
భుజ దర్పోద్ధతిఁ జూప నోపెనొ చలంబుం జేవయుఁ సైన్యయు
గ్మజనంబుల్ వినుతింపఁ జేర్చెనొ తొలంగం బాఱెనో తెంపున
క్కజపుం బెంపును [1]దీఱడింపఁడు గదా కర్ణుండు దీనాకృతిన్.

37 క. [1]తక్కటి సైనికు[2]లనిన, యొక్కని దిగ విడిచి పాఱిరో లావుం బే
ర్కున మెఱయఁగఁ దోడ్పడి, [3]పెక్కండ్రుదురు వడిరొ[4]బెరసుఁ బీనుంగులుగాన్.

38 వ. అని మఱియును.

39 క. ముందర శిఖండి నిడి సం, క్రందన నందనుఁడు సేరి గంగా తనయుఁ
మ్రిందించెఁ గపటమున నా, చందమొకటి కర్ణునందుఁ జర్పించిరొకో.

40 క. సామజము వడిన నశ్వ, త్థామవడియెననఁడె ధర్మ తనయుఁడు గురు నిం
దా మడియించుటకై యు, ట్టె[1]మేని యొనర్చి రొక్కొ యితఁడు వడుటకున్.

41 క. మాయోపాయంబుల గాం, గేయుండును గురుఁడు ననిఁ [1]దెగిరకాక రణ
న్యాయంబు దప్పకుండఁగ, నా యిరువుర నోర్వ[2]నెవరికైనను వశమే.

42 సీ. పరశురామునిచేతఁ బడసినవాఁడు బ్రహ్మాస్త్రంబు సర్పముఖాస్త్రములఁ తిఁ
బోవునె దివ్యాస్త్రములు పెక్కు మఱియును గలవు రాధేయున కలవు మెఱసి
యభిమన్యు విల్ దునుమాఁడె నాగాయుత త్రాణు ననిలనందనుని బాడు
దలఁబట్టె సహదేవుఁ జులుకన మర్దించి మందల విడువఁడే మాయలాని

తే. మేటిమగని ఘటోత్కచు గీటడఁపఁడె, యట్టి జెట్టికిఁ బోరఁ జావెట్టి భంగి
నయ్యెఁ దేరికి సూతునకంచితాస్త్ర, ములకు దైవోపహతిఁ జేటు మూఁడెనొక్కొ.

---

36 1. తెంపు – ఉ.పి.శ.శర.ప. 2. పీఱడింపడుగదా – శర ; పిరడింపడుగదా– ఆ .ల.

37 1. తక్కిన – కొన్ని ప్రతులు. 2. లాతనినొక్కని – స. మున్నగు ప్రతులు.
3. పెక్కెండ్రటవడిరో–శ.ప. 4. బెరసి, పెనగి, పోర, పెనచి, బిరుసు–అనిపాఠములు.

40 1. మేనినొనర్చి - పి ; మైననొనర్చి – ఇ.గ.ద ; మేమేమి – ల.

41 దెగిరిగాక – కొన్ని ప్రతులు. 2. హరునకైనను – ఇ.ఊ.పి, వశమె హరునకు
నైనన్ – కొన్నిప్రతులు ; నేరికైనను వశమె – శ.ప.

43 క. [1]రథ మవితథమైనను సా, [2]రథిపని [3]నెఱసిన మహాస్త్రరాజి [4]విధి కృతికిఁ
వృథగాకున్నను గర్ణునిఁ, బ్రథనంబున [5]గెల్వ దేవపతికిని వశమే.

44 ఉ. సారథి యెవ్వఁడాతనికి శల్యుఁడు ద్రోణ తనూభవుండు గాం
ధార విభుండునుం గృపుఁడుఁ దత్సమయంబున నేమి భంగిఁ దో
డై రి సుయోధనుండు హృదయంబునఁ దాఁ గృతవర్మ దర్పము
న్వీరము నచ్చియుండుఁ దగ నెయ్యము సూపెనె యాతఁ డత్తఱిన్.

45 క. [1]వారలు గెలఁకుల నడవఁగ, రారాజు పిఱుందఁ గదిసి రా నెబ్భంగిం
గారణము లేదు చావఁగ, నారాధేయునకుఁ జోద్య మయ్యెడుఁ [2]దలఁపన్.

46 ఉ. పాండవ[1]కోటి సూతసుతుపై నడతెంచిన చంద [2]మెట్టు లా
ఖండలసూతి సర్వముఖ కాండము తాఁకున రూపు మాసి పో
కుండుట యెట్లు కల్గె సమరోద్ధతి దక్కటి నల్వురందు నె
ట్లుండె [3]బలద్వయంబు నెటు లోపి పెనంగె దిన ద్వయంబునన్.

47 వ. అనిన విని సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియెఁ గయ్యంబు తెఱంగు మొదలుకొని చెప్పెద నాకర్ణింపుము. ద్రోణుండు దెగిన నశ్వత్థామ దనయోపి [1]నంత సమరంబు సేసి చాలించి [2]సేనలఁ దివియించి మరలి వచ్చిన దుర్యోధనుం డప్పుడు గొలువిచ్చియుండి యశ్వత్థామ లోనగు దొరలం గలయం గనుంగొని మనకు నిటమీఁదఁ [3]జేయం గల పని యెయ్యది యని యడుగుటయు నగ్గురుసుతుండు.

---

43 1. రథమువితథ — సారథి......గెడసిన — అ.ఆ.జ.ఝ ; రథమువితథ......సారథి ధరగూలిన — ట. 2. రథినెరసిన నస్త్రశస్త్రరాజి — ఇ. 3. సమితియున్ — క ; యుదనకుఁ — ఊ. నెఱసిన మరచిన, దెరలిన, సమసిన — గెడసిన — అని పాఠములు. 4. మిగుల — అ.ఆ.ల.వ ; మిగుల నమరపతికిన్ .... ఈ.జ్.ఙ.ణ.త.వ ; గూల్ప — ఇ.

45 1. వారిరు గెలకుల — క.వ ; వారు గెలంకుల — జ.వ. 2. నాకున్ — కొన్ని ప్రతులు.

46 1. సేన — ఇ ఊ.ట.వ. 2. మెట్టిదాఖండల — కొన్ని ప్రతులు. 3. ళపద్బలంబు లెటు — ఇ.

47 1. నంతయుజేసి సమరంబు చాలించి — కొన్ని ప్రతులు. 2. సేనలనెల్ల దివియ నియమించి — ఆ.ఉ.ఝ.ద.న. 3. జేయవలయుపని — కొన్నిప్రతులు.

48 క. విను సూదర ముత్సాహం, బనూన [1]ధార్ష్ట్యంబు నీతి యను సద్గుణముల్
[2]పని సఫలం బగునట్టుగ, జననాథ యొనర్చు దైవ సాహాయ్యమునన్.

49 చ. తలఁపఁగ [1]సద్గుణంబులకుఁ దావలమై పెనుపొందు నుజ్జ్వలా
త్ములు [2]పనిరైన [3]చేఖరము దోఁపఁగ నీదగు దొంటి శౌర్యముం
దలకొని నిర్వహింపు ముచితంబుగ దైవము తోడుపాటు నుం
గలిగెడుఁ గాక యున్న రథికప్రవరుల్ దలపోయ నల్పులే.

50 క. మనము బల శౌర్యఘనుఁ గ,ర్ణుని సేనాముఖము సేసి నూల్కొని యరిమ
ర్దన [1]మొనరింత మితనియం, దనూనతం బొల్చు సద్గుణావలియు నృపా.

51 క. వైవస్వతు చందంబున, నీ వీరుఁడు [1]రిపుబలంబు నెల్ల [2]నడంపం
గావలఁతి దివ్యశర శి, క్షావైభవ పరమ[3]నిష్ఠ కలిమి నరేంద్రా.

52 వ. అని సూతపుత్త్రుం జూపిన భవత్పుత్త్రుండు ప్రీతుండయి యతండు పాండవుల
[1]జయించు నను నాస యగ్గలంబైన యంతరంగంబుతో నయ్యంగపతి కిట్లనియె.

53 శా. నీవిక్రాంతియు నావయిం గల యతి స్నేహంబుఁ బ్రఖ్యాతముల్
గావే భీష్ముఁడు ద్రోణుఁడుం దెగుట [1]నీ కౌరవ్య సైన్యంబు లం
గావంగాఁ దగు నీకు వారల యుపేతుం గాక యిన్నాళ్లు లే
లా వైరం [2]బడఁగింప నీవయిన లీలం గెల్తు కౌంతేయులన్.

---

48 1. సహతయునీతి — కొన్ని ప్రతులు. వాక్యంబు నీతియు — అ.ఇ.ఘ.ఝ.వ. 2.
2. గనిసఫలంబగు — ఎ.ఏ.ఐ.ఖ.గ.వ.వీ.

49 1. నగ్గుణంబులకు—జ్.చ.ద. పద్గుణంబులకు—జ. 2. దెగిరైన - ఉ.ఘ.ణ.న.శ.ష.
3. చేఖరము దోపగనక తొడంగి / కార్యమున్ — ఉ.ఏ.ఖ.గ.స. (కడంగి); నీభరము తోఁపఁగ నీఁదగనోపి కార్యముం — ష ; పామరము దోఁపఁగనీదగ దోపి కార్యమున్ — శ ; దెప్పరముదోపగ నీకను — ఊ ; దెప్పరముదోపక యుండగనోపి — క ; దెప్పరముదోపగ నీనగుతొంటి — వ.వ ; నెప్పగలదోపగనీదగదోపి — జ.

50 1. మాచరింతమితని కనూనతం — ఉ.న.

51 1. పాండుపుత్త్రుని కరముబొడువం —— అ (ఇచ్చట అఖండ యతిగా చూడవలెను)
2. ఓర్వన్, పొడువన్ — అనియు పాఠములు. 3. నియతి — ఇ.క.ప.వ.

52 1. గెల్చునను — కొన్నిప్రతులు.

53 1. యీ కౌరవ్యులం — కొన్నిప్రతులు. 2. బుడిగింప — ద.న.

54 వ. నీవు ప్రాజ్ఞుండవు ప్రబలుండవు విశేషించి నాకేడుగడయు నీవ కావున నీకు మదీయ హితం బవశ్యకర్తవ్యం బట్లుం గాక మన మా భీష్మద్రోణుల నవమానింతుము వారలు ఖండనంబునం బడిన నోదిఁగి యుండ నేర్తుమే కడంగుము పగఱకు నీకడంక చీఁకటికి సూర్యునుదయం బెట్టిదట్టి [1]దయ్యేడుంగాక బృందారక సేన సేనాని నడపిన కైవడిం గౌరవసైన్యంబు నడపి నన్ను [2]గెలిపింపుము నిన్ను నీవ సర్వసేనాధిపత్యంబునకుఁ బట్టంబు గట్టికొమ్మనినం బ్రీతుండయి రాధేయుండు గాంధారేయునకుం బ్రహర్షంబుగా భూవల్లభు లెల్ల నాకర్ణింప నిట్లనియె.

55 మ. విను నీ కిచ్చిన బాస యే [1]మఱతునే వీరంబు బాహాబలం
బును ధైర్యంబును నస్త్రవీర్యమును నీ భూలోక సంచారు లె
ల్లను గీర్తింపఁగఁ బాండుపుత్రుల మదోల్లాసంబు మర్దింతు నీ
వనుమానింపక నిల్చి చూడుము మదీయంబైన సంగ్రామమున్.

—: *దుర్యోధనుఁడు గర్ణునకు సర్వసేనాధిపత్యంబు గట్టుట* :—

56 వ. నన్ను సర్వ సేనాధిపత్యంబునకుఁ బట్టంబు గట్టు మనవుడుఁ బొంగి రారాజు దగు రాజులుం దానును శాతకుంభకుంభంబులం బవిత్రజలం[1]బులు దెప్పించి మహనీయమణి కుసుమౌషధి[2]గంధాక్షత మంత్రకలనం బాచరించి సమున్నతౌదుంబరపీఠంబునం బరమాస్తరణం [3]బొనర్చి యంగపతి నందు నిలిపి పుణ్యాహఘోషంబులుఁ దూర్యనినదంబులు వందిజనస్తుతులును జెలంగ నభిషేకించి యలంకరించి పట్టంబు గట్టిన నతండు [4]భూసురోత్తములకు నర్థిజనంబులకును వివిధార్థంబులు దాన త్యాగ రూపంబున నొసంగుచు వెలింగె నప్పు డుబ్బిన [5]శూర యోధుల జయ జయ శబ్దంబులును భూపతుల యభినందన వాక్యంబులును గృష్ణ సమేతులగు పాండవుల గెలువుమని దీవనలిచ్చు మాగధుల యెలుంగులును నింగిముట్ట [6]నవోదితుండైన భానుండునుం బోలె శోభిల్లు నాకర్ణుండు సముదీర్ణుండై యక్కురుపతి యాననం బాలోకించి.

---

54 1. దయగుంగాక — ఞ. 2. రక్షింపుము — ఎ.ఖ.గ. (ధీరోచితముగ లేదు)

55 1. మరువదోర్వీర్యంబు — ఆ.ఏ.ఐ.ఝ.డ.

56 1. బులు నినిచి శ.ష. మున్నగు ప్రతులు. 2. మంత్రాక్షత—ఔ. 3. బాచరించి—కొన్ని ప్రతులు. 4. సురసమూహంబులకు—కొన్ని ప్రతులు. 5. భూసురుల జయజయ—శ.ష ; దుర్యోధనాది సకల యోధుల—వ. 6. నభోదీపితుండయిన—వ; నభోవిరహితుండైన—శ.ష.

57 తే. బంధుమిత్ర యుతంబుగఁ బార్థురూపు, మాపి యే నిత్తు నీకు సామ్రాజ్యలక్ష్మి
ధాత్రిఁ బాలింపు సుస్థితిఁ బుత్త్రపౌత్త్ర, గాఢ భోగార్హ్యమగునట్లు గాఁగ నధిప.

58 క. విను [1]సత్య ధర్మ రతుఁడగు, మనుజునకుం గార్యసిద్ధి మసలక యగు చా
డ్పున శౌర్య బాహువిక్రమ, ఘనుఁడగు నాకాజి జయము గలుగుం జులుకన్.

59 వ. అని పలికె నిత్తెఱంగున రాధేయు సర్వసైన్యముఖ్యుం జేసి యతని మందిరం బునకు మహావిభవసమేతంబుగాఁ బుచ్చి సమస్త పరిజనంబులను నిజ నివాసం బులకుఁ బోవం బనిచి సంతోషం బంతరంగంబు నిండి వదనంబున వెల్లిగొన నీ కొడుకభ్యంతరావాసంబున కరిగె. రాత్రి యే నిట వచ్చి ద్రోణు వృత్తాంతం బంతయు నీకుం జెప్పి నీ వనుప మగిడి చని సూర్యోదయ సమయంబున మన శిబిరంబు ప్రవేశించితి నయ్యవసరంబున.

60 సీ. [1]తళతళ మని యెడు [2]దంతప్రభలతోడ ఘనకేతువున హస్తికక్ష్య మెఱయ
హంసవర్ణములైన హయముల పటుగతి నర్కుపరిభం బగు నరద మొప్ప
దీప్తకాంచనరసలిప్తమై చెలువొందు సజ్యకార్ముకము హస్తమున వెలుఁగ
[3]పిటకి సమర సమాటోప మొదవ నాభీలశంఖము దనమ్రోల [4]మ్రోయ

తే. రణసముత్సాహలక్ష్మి వక్త్రమున వింత, చెన్ను [5]వెలయింప నాప్తులుసేరి రెండు
పక్కియలయందు బవరంపుఁబలుకు లెసఁగ, నడవ సొంపాఱి కర్ణుండు వెడలె నధిప.

61 వ. అతండు పడవాళ్ళం బనిచి వెడల నియమించిన నెల్ల దొరలును దురంబునకు వెడలి రట్లు సకల బలంబులు కలనికి నడవం దొడంగిన.

62 సీ. తురగ రింఖాముఖోద్ధూతధూళీపటలములు నల్దిక్కు లలంకరించె
మాతంగ [1]కటిగళన్మదజల బహుల ప్రవాహ విలాసంబు వాని నడఁచె
బహువిధవాదిత్ర భైరవారావంబు పెల్లంబరము పిక్కటిల్లఁ జేసె
శింజినీటంకార సింహనాదంబుల పెక్కువ యామ్రోఁతఁ [2]బిలుచుకొనియె

---

58 1. మాతిధ్య రతుండగు — స.

60 ధళధళ—కొన్ని ప్రతులు. 2. ధవళప్రభల—పెక్కుప్రతులు. 3. పిరరసాటోప విభవంబు లెసగనాభీల — ఇ.ఉ.క.ద.న.వ. 4. మెరయ — కొన్ని ప్రతులు. 5. నెలయింప — పెక్కు ప్రతులు.

62 1. ఘట — శ.ప. మున్నగు ప్రతులు. 2. బిల్చుకొనియె — ఝ.శ.

ఆ. రథిక భూషణముల రశ్ములఁ గేతన, చ్ఛత్త్ర చామరోపసక్తమణుల
రుచుల సుభటహేతి రోచులఁ బవలింటి, దివియచందమయ్యె దినకరుండు.

63 వ. అట్టియెడ.

64 క. జనములు భీష్మద్రోణులు, సనిన వగలు డిగ్గఁ [1]ద్రావి సంతోషము నె
క్కొనియెడు మనములతోఁ గ, ర్ణునిఁ గనుఁగొని [2]రతివికాసరుచిరనయనులై.

—: కర్ణుని మొదటినాఁటి యుద్ధము :—

సం. 8–7–14

65 వ. ఇవ్విధంబున బలంబులకుం బ్రమోదం బెసంగ నడచి రాధేయుండు [1]దుస్సహం
బుగా మకర వ్యూహంబు సమకట్టునెడ నందుఁ దుండంబునఁ దాను నిలిచి
నయనంబుల శకునియు నులూకుండును శిరంబున నశ్వత్థామయుఁ గంఠంబున
దుర్యోధనానుజులును [2]నుదరంబున దుర్యోధనుండును ముంగటి వామపాదం
బున నారాయణ గోపాలయుతుండై కృతవర్మయు దక్షిణపాదంబునఁ ద్రిగర్త
దాక్షిణాత్య సంవృతుండై కృపాచార్యుండును వెనుక [3]డాకాల నానాదేశ
సేనతో శల్యుండును [4]వలకాల ననేకరథకరితురగసమేతుండై సుషేణ జననా
థుండును బుచ్ఛంబున మహాసైన్యసమగ్రుండయి చిత్రుండను ధాత్రీపతియు
నతని తమ్ముండగు చిత్రసేనుండును నిలుచున ట్లొనర్చి [5]తక్కిన వారల నెడ
[6]నెడం బన్నించె నటమున్న యుధిష్ఠిరుం డుద్దామసామజాది చతురంగోల్లాస
భాసితుండయి నడతెంచె నట్లు నడతెంచి యమ్మనుజ విభుండు మనమొనం
జూచి సవ్యసాచి కిట్లనియె.

66 చ. కనుఁగొనఁ జుల్కనైన యది కౌరవసైన్యము గంటె సూతనం
దనుఁ డొక యొడ్డుగా నిలిపి తాను ముఖంబున నిల్చె కయ్య మె
ల్లను దనమీఁదఁ బెట్టికొని లావును బీరముఁ జూపఁ బూని యే
పున [1]నటిమెఱ భవద్విశిఖ పుంజములం దెగటార్చు మీతనిన్.

---

64 1. ద్రోచి — కొన్ని ప్రతులు. 2. రథికహర్షరుచిర — శ.ష.

65 1. దుస్సాధంబుగా — అ.ఆ.ప.గ.శ.ష. 2. మధ్యంబున — పెక్కు ప్రతులు. 3. డాకేల — ఎ.గ.శ.ష. 4. వలకేల — ఇ.ఎ.శ.ష ; వలకెలన — ట. 5. తక్కటి వారల — కొన్ని ప్రతులు. 6. నెడనిలువంబంచె — పీ.ప.ఖ.గ.

66 1. దరిమెన్ — కొన్నిప్రతులు.

67 క. వనమునఁ బండ్రెం[1]డేఁడులు, మనముత్కట దుఃఖవార్ధి మగ్నుల మై యి
ట్లునికికిఁ దగ నితని భవ, త్సునిశిత బాణాబ్ధి ముంపు [2]దుర్దమ లీలన్.

68 ఉ. [1]వీఁడొకరుండె యింక బలవిక్రమ సంపద గల్గి పోరిలో
వాఁడిమి [2]సొంపు సూపఁ గల వాఁడు సుయోధనుపాలఁ బేర్చు నీ
వేఁడిమి సూపి రూపడఁపు వీనిఁ బురందరపుత్త్ర యంతతోఁ
బోఁడిమి [3]మాలు నాతఁడు ప్రభూత జయోన్నతి [4]నిల్చు నీకడన్.

69 వ. నీకుం బోలిన మొగ్గరంబు గావింపు మనవుడు నర్జునుం డర్ధచంద్రవ్యూహ విధానంబున మోహరించి తాను మధ్యప్రదేశస్థుండై వామదక్షిణ శృంగంబుల భీమ ధృష్టద్యుమ్నుల నిలిపి యుధిష్ఠిర నకుల సహదేవులం బింగలిగా నొనర్చి నతని చక్ర రక్షకులగు యుధామన్యుండును నుత్తమౌజుండునుం గయ్యంపువేడుక మొగంబులం జిగురొత్తఁ బొలిచిరి తక్కిన యోధులుం దగినచోట్ల నిలిచి రిట్లిరువాఁగును బన్ని యున్న సమయంబున.

70 చ. హరియును బాండునందనులు నాజి నవశ్యము నేఁడు [1]గూడఁ బో
దురు జమునంచు నాత్మఁ బరితోషముఁ బొందె భవత్తనూజుఁడున్
దురమునఁ గర్ణయుక్తముగఁ ద్రుంగు సుయోధనుఁ [2]డన్ తలంపుతోఁ
[3]బరమ సముద్యమస్ఫురణఁ బాండవముఖ్యుఁ డెలర్చె భూవరా.

71 ఆ. ఒకటి కొకటికంటె నుబ్బుచు వర్తించు, చాడ్పుదోఁప రెండు సైన్యములను
[2]బొలిచె నపుడు సెలఁగె భూరి భేరీముఖ, తూర్యములు నభంబు దూఁటుకట్ట.

72 వ. చిందంబుల మ్రోఁతకు నిందు నందునుం దమకించి భటులు గెలంకులం దాఁకఁ [1]దోడ్తోనెఱపిన యగ్గలిక నొండొంటి బెరయ మొగ్గరంబులు రవడించి.

---

67 1. డేండ్రును — శ.ప. మున్నగు ప్రతులు. 2. సుఖతరలీలన్ — ఖ ; సుస్థిరలీలన్ — గ.

68 వీఁడొకరుండు దక్క..... .... సుయోధను పాలలేమి — ఈ.ఊ.ఒ.ప.వ. 2. యొప్పు ఎ.ఖ.గ. 3. దూలు — అ.ఏ.ఐ.క.చ.శ.ష. 4. నీకు బేకురున్ — ఏ.

70 1. గూడబోదురు — పెక్కుప్రతులు. 2. డంచువేడ్కతో — ఙ.ణ.త. 3. బరుష సముద్యమ — కొన్నిప్రతులు.

71 1. నుభయసైన్య — ఈ.చ.జ.ణ.త. 2. బొదలినట్లు — స.

72 1. దోడ్తోడ నేచినయగ్గలిక — కొన్నిప్రతులు.

73 సీ. నిబిడ ఘంటా[1]వళి నిక్వణంబులతోడ భీషణ బృంహిత ఘోషములును
ఘననేమి నిష్ఠుర ధ్వనుల [2]పొందులఁ గేతు నిర్భర కింకిణీ నినదములును
జటుల ఖురవ్రాత పటురవంబులతోడ నాఖిలహేషా మహాస్వనములు
భూరిభుజాస్ఫాలనారావములతోడ మేదురతర సింహనాదములును

ఆ. బరఁగి దిక్తటములఁ బగిలింప ననిమిష, ఖచర సిద్ధ యక్ష గరుడ గణము
లంతరంగములు నితాంత కౌతుకభరి, తములుగాఁగఁ జూడ్కి గములు వఱపె.

74 వ. ఇట్లు దలపడి యిరువాఁగును [1]బేరువాఁడిఁ [2]బోరునెడ గరుడ ప్రహారంబుల [3]నొచ్చిన పంచాస్య పన్నగంబులం బోని బాహువులను గాంతిస్ఫురుచి సౌరభం బుల [5]పెంపున సంపూర్ణ చంద్రార్క కమలంబులం గేరిణిసేయు నాననంబులను సంగ్రామరంగం బలంకృతం బయ్యె వాహనంబుల మీఁద నుండి భూషణకిరణం బులు మెఱయ సైనికులు నేలం గూలునప్పుడు పుణ్యావ[5]సానకాలంబున నాక లోక పరిభ్రష్టంబగు మహాత్మలోకంబు చందంబు దోఁచెఁ జతురంగంబులు నుం దమ తమ జాతిచేతం బడుటయు నేనుంగు లడరిన నరదంబులు నదియు టయు నాశ్వికులు వోదివినం గరులు ధరం దొరంగుటయు భటు లురవడించినం దురంగంబులు గడికండంబు లగుటయు రథంబులు గవిసినం [6]గాల్బురు దుము రగుటయుఁ గ్రిందున నెల్ల తెఱంగులు నన్ని దెఱంగులం గలయ బడలువఱు చుటయు రౌద్రరసంబుఁ [7]బెనిచె నాసమయంబున సాత్యకి ధృష్టద్యుమ్న చేకి తాన ద్రౌపదేయులు ప్రభద్రక చేది పాండ్య చోళ మగధ వంగాది దేశంబుల బలంబులతోడ బరవసంబు సేసి తఱిమి రట్టియెడ.

75 ఉ. దంతిఘటల్ మహోగ్ర సముదగ్రతతో నడతేర దర్ప దు
ర్దాంత గజాధిరోహణ నితాంత సముజ్జ్వల భంగిఁ బ్రౌఢ వి
క్రాంతి విలాస మొప్పఁగ నఖండిత పౌరుషుఁ డైన భీముఁ డ
త్యంత సముద్ధతిం గవిసె నస్మదనీకము సంచలింపఁగన్.

---

73 1. రవ (రావ) నిక్వణంబు — ఈ.ఊ.జి.ణ.ద.వ. 2. పొందిన — పెక్కు ప్రతులు; పొందున — పీ.ష; మున్నగు ప్రతులు.

74 1. బేరువాడుచు — ఈ.జ.త.స. బేరువారుచు — వ. 2. బోరాడ — ఊ.క.ఖ. 3. నోర్చిన — ఏ ఒ.క.త.వ. 4. సొంపున — పెక్కు ప్రతులు. 5. సానంబున — కొన్ని ప్రతులు. 6. పదభ్రష్టంబగు — ఈ.ఒ.జ.ణ.త.వ; పరిభ్రష్టంబగు — వా. మున్నగు ప్రతులు. 7. గాల్బలంబులు — కొన్ని ప్రతులు. 8. బువేర్చె — పీ; బున వేర్చె — ఊ.ట; బునిగుడ్చె — వ.శ.ష.

76 క. ఉదయాచలమున రుచి సం, పదఁబొలుచు పతంగు పగిదిఁ [1]ప్రసరత్తీవ్ర
ప్రదరములు నెఱయ మెఱయఁగ, మదావళముమీఁద వెలిఁగె మారుతి యధిపా

:— క్షేమధూర్తియను రాజు భీమునితో యుద్ధము సేసి చచ్చుట :—

సం. 8—8—25

77 వ. అమ్మహావీరు నాలోకించి కులూతదేశాధీశుండయిన క్షేమధూర్తి నిజబలంబులం బురికొల్పికొని యేచి త్రోచి యాహ్వానంబు సేసి తన [2]కరటిం గొల్పిన నది గిరి గిరిం దాఁకు తెఱంగున నతని మాతంగంబునకు మార్కొనియె నయ్యిరువురు నొం[3]డొరులపై దోమర స్తోమంబు లడరించి యార్చుచు నుద్దండ [4]పరాక్రమంబులగు వేదండంబుల పటు ప్రచారంబులు చారు భీషణంబులుగా నొక్కళ్లొక్కళ్లం జుట్టుకొని వచ్చుచుం జెనంగి.

78 క. కోదండంబులు గొని శా, హోదర్పము లెసఁగఁ బోరి యన్యోన్య ధను
శ్ఛేదంబులఁబోరిఁ బోరినా, పాదించిరి [1]రయము జనులు ప్రస్తుతి సేయన్.

79 వ. దానం గోపం బగ్గలించి.

80 తే. శక్తులను దోమరంబుల సరభసముగఁ, బోరుచో భీమసేనుని పేరురమున
క్షేమధూర్తి సముజ్జ్వల తోమరంబు, లేడు నాటించె దర్పంబు [1]రూఢికెక్క.

---

76 1. ప్రస్ఫురిత శితప్రదర — పీ.ఈ.ణ.త.శ.ష ; ప్రస్ఫురతీవ్ర — కొన్ని ప్రతులు.

77 1. యులూక — అ.ఆ.ఇ.ఈ.శ.ష. మున్నగు ప్రతులు ; కరూశ — ఐ.ఘ.జ.ట.డ. ఇచ్చట మూలమునందును, సోరన్నను భారత నామానుక్రమణిక యందును క్షేమధూర్తి కులూతాధిపతి యనియె యున్నది.
"తం హతం నృపతిమ్ దృష్ట్వా కులూతానాం యశస్కరమ్'' చిత్రశాలా ప్రతి – కర్ణ– 12–45.
కుంభకోణ ప్రతియందు ఈ సందర్భమున కరూశాధిపతియని కలదు "తం హతం నృపతిమ్ దృష్ట్వా కరూశానాం యశస్కరమ్" కర్ణ – 9–46.
2. కరింగొల్పిన — కొన్ని ప్రతులు. 3. డొరువులిపె — కొన్ని ప్రతులు. 4. పతాకంబులగు — ఇ.ఈ.ఉ.ఒ.ఔ.ద.న ; ప్రచారంబులగు — క.గ.

78 1. రణము జనులు — కొన్ని ప్రతులు ; ఖచరజనులు — ఈ.జ.ణ.త.

80 1. నేపు దక్క పీ.ఎ.గ.ద.శ.ష ; వేడు — రూఢి (రూడి) చూ. 1–1–69 (నన్నయ)

81 చ. అనిల తనూభవుండు [1]దపనాంశు నిభంబగు తోమరంబు వై
చిన నడుమం గరూశపతి చిత్రముగాఁ దునుమాడి పిఁక నా
తనిఁ బటుపష్టికాండపరితాడితదేహునిఁ జేయ మేటవిల్
గొని యతఁ [2]డక్కులూతపతికుంజరమున్ వెసఁ[3]గప్పె నమ్ములన్.

82 వ. అట్లు భీమసేనుండు గరూశపతి విక్రమంబు [1]సరకుసేయక యతని దిక్కునుం జూడక క్షేమధూర్తి సామజంబును సాయకమయంబుఁ జేసిన నది మొగ తిరిగి పఱచినం బోవనీక యప్పావని వెనుకొనుటయు [2]నక్కులూతపతి ప్రయత్నంబున నమ్మాతంగంబు మరల్చి యతని యంగంబునను ధ్వజంబు శరీరంబునను నిశాత శరపరంపరలు [3]వఱపిన.

83 చ. ఉఱక సమీరసూనుఁడు దదుగ్ర ధనుర్దళనం బొనర్చి యే
డ్తెఱఁ గరి నొంప నాతఁడు గడిందిమగంటిమి నొండువింట ను
న్మెఱుఁగులు గ్రమ్మ[1]కోల నతనిం గడునొంచి తదీయహస్తి పా
ల్పఱి మహి[2]మ్రొగ్గనేసిన ధరాధిప నీబలమార్చె నుబ్బునన్

84 మ. గదసేతంగొని దంతి డిగ్గి చని యా కౌంతేయుఁ డవ్వీరు ను
న్మద మాతంగముఁ గూల నేసినఁ గృపాణస్ఫార దోర్దండుఁడై
కదియన్ వచ్చె నతండు నిష్ఠురగదా ఘాతంబునం గూల్చె నే
పు దలిర్పన్ వెస నామరుత్తనయుఁ డాభూమీశు భూమీశ్వరా.

---

81 1. తరుణార్క నిభంబగు — ఏ. 2. డక్కరూశపతి — ఐ.ఘ.డ ; డయ్యులూకపతి — పెక్కుప్రతులు. 3. ముంచె — ఈ.ణ.త వ.

82 1. సరకుగైకొనక — పెక్కుప్రతులు. సైరాపక — ట. 2. నయ్యులూక దేశాధిపతి — శ.ష. కొన్ని ప్రతులు. 3. పరపినదాన కోపంబగ్గలించి — ఇ.ఊ.ఒ.ఖ.ప.వ.

83 1. కోనతనిమేన్గడు — స. 2. మ్రొగ్గనేసిన — కొన్ని ప్రతులు ; మ్రగ్గనేసిన — ణ.న. 3. నుబ్బుచున్ — ల.

84 1. వ్రేసిన — కొన్ని ప్రతులు.

85 వ. ఇవ్విధంబున నేనుంగు పీనుంగుకడన పడిన క్షేమధూర్తి వజ్రప్రహారంబునం గూలిన కులశైలంబు సమీపంబున నిర్ఘాతపాతపతితంబయిన కంఠీరవంబు [1]కరణి నొప్పె నతనిం గనుంగొని మన మొన వెఱచఱచి పఱచినఁ బాండవ బలంబులు వెనుకొనుటయు.

86 మ. పటు [1]బాణప్రకరంబు లంబరముఁ గప్పం గర్ణుఁ డాసేనఁ దాఁ
కుటయుఁ సైన్యము దైన్యముం దొఱఁగి మార్కొన్నఁ భుజాసంపదు
త్కటగర్వోద్ధురభంగిఁ బాండుసుతులున్ దర్పంబు సొం పేర్పరిం
చుటకుం జొచ్చినఁ బేర్చెఁ బోరనిమిషస్తోమాద్భుతాపాదియై.

87 వ. అందు.

88 క. సూతతనయ నారాచ, స్యూతములై వారణంబు లొఱలును సొగయున్
భూతలమునఁ బొరలు దెరలు, వే తూలును జిఱ్ఱఁ దిరుగు విచ్చుం జచ్చున్.

89 వ. అప్పుడు నకులుం డతని మార్కొనియె భీమసేనుం డశ్వత్థామను, సాత్యకి కైకేయు లగు విందానువిందులను, జిత్రసేనుండను రాజు [1]శ్రుతకర్మను, ప్రతివింధ్యుండు చిత్రుండను మనుజనాథుని, ధర్మపుత్రుండు దుర్యోధనుని, ధనంజయుండు సంశప్తకులను, ధృష్టద్యుమ్నుండు కృపాచార్యుని, శిఖండి కృతవర్మను, శ్రుతకీర్తి శల్యుని, సహదేవుండు దుశ్శాసను[2]నిం దలపడి రట్టియెడ.

90 సీ. శైనేయుతోడ విందానువిందులు మహాహవము సేయంగ నయ్యాదవోత్త
ముఁడు పేర్చి వారి కార్ముకములు రెంటిని దునిమి యంగంబుల నినిచెఁ దూపు
లవ్వీరు లన్య [1]శరాసనోద్ధారులై యతనిపైఁ బఱపిరి శితశరంబు
లతఁడును వారు నన్యోన్యచాపచ్ఛిదావైచిత్రి నొప్పారి రేచి దొడ్డ

తే. విల్లు గొని యతిరయమున భల్లనిహతి, నాతఁ డనువిందు తల ద్రుంప నది ప్రదీప్త
రత్నకుండలశోభాభిరామపతన, భంగిఁ దదనీకశోకసంపాదియయ్యె.

---

85 1. కైవడింగూలిన — ల. కొన్నిప్రతులు.

86 1. భల్ల — ఇ.వ.

89 1. శ్రుతవర్మను — పెక్కు ప్రతులు. 2. నియుయుత్సుం డులూకుని, శతానీకుండు శ్రుతవర్మను, శ్రుతసోముండు శకునిని దలపడిరి — వ.శ.ష.

90 1. రాసనధారులై ; రాసనోదారులై అని పాఠములు.

91 మ. కని విందుండు ప్రదీప్తచాపధరుఁడై కాండప్రసారంబులన్
శినివీరుం గుసుమాఢ్యకింశుకసముం జేయంగ నయ్యోధుఁ డా
తని యంగంబులఁ బంచవింశతిశితాస్త్రంబుల్ వడిం గ్రుచ్చి నే
పున వారొండొరుసూతులం దునిమి నిప్పుల్ రాలు కన్దోయితోన్.

92 తే. ఒకళు లోకళులహాయముల నుర్వింగూల్చి
యొండొరుల కార్ముకమ్ములు ఖండితములు
సేసి తేరులు డిగ్గి రుద్భాసితాసి
చర్మశోభిత హస్తులై సరభసముగ.

93 వ. [1]ఇట్లు పాదచారులై మండలప్రచారంబుల మెఱయుచు.

94 క. చేరి బహుచిత్రగతులం, బోరంగా నొడ్డనములఁ బొలిచెం బలకల్
నేరిమిమై [1]గెళవున శిని, వీరుం డిరు[2]వఱియగాఁగ విందుని వ్రేసెన్.

95 వ. ఇత్తెఱంగున నయ్యిరువురం జంపి సాత్యకి యుధామన్యు తేరెక్కి యుక్కున వేఱొక్కరథంబు సన్నద్ధంబు గావించుకొని కైకేయబలంబులం బఱపెఁ జిత్రసేనుండును నీమనుమండగు శ్రుతకర్మయుం బెనంగునెడ నాశ్రుత కర్ముండు.

96 క. ఆరాజు నైదువాలిక, నారసముల నొంప నతఁడు నవశరముల న
క్కౌరవుని నేసి నొంచెను, సారథి నైదింట నధికసంరంభమునన్.

97 సీ. శ్రుతకర్మ కోపించి క్రూరనారాచ మజ్జననాథుజత్రుదేశమున నాటఁ
బడి [1]మూర్ఛవోయినఁ బైపయి వెండియు నేయఁ దెప్పిఱి [2]యతండెనక మెసఁగ
నుక్కునఁ దునుమాడె నక్కుమారుని శరాసన మతఁ డొండొకచాప మెత్తి
తఱచుటమ్ముల నేదు వెఱిగినచందంబు సేసె రయంబునఁ జిత్రసేను
తే. నాతఁ డాతనియురమున శాతశరము, దూఱ నేయ నట్టాలుండు [3]తోన వివిధ
బాణముల నాన్నృపుని ముంచి శోణితమున, భల్లమొక్కటఁ దల నేల డొల్లనేసె.

---

93 1. ఇత్తెఱంగున — వీ.శ.ష.

94 1. వాలున — వీ.శ.ష ; గెడపున— స. కొన్ని ప్రతులు. 2. పఱియలుగను — వీ.శ.ష.

97 1. బీరుపోయిన — త.వ. 2. విభుండు — పెక్కు ప్రతులు. 3. లోనవివిధ .... ములనాన్నృపుని ముంచి — వీ.శ.ష.స.

## —: ప్రతివింధ్యుఁడు చిత్రుఁడను రాజుం జంపుట :—

సం. 8—10—15

98 ఉ. ఏలినవానిపాటు గని యేత్తెఱఁ దద్బల మొక్కపెట్ట యా
భీలతఁ జుట్టు ముట్టుటయుఁ [1]జేర్చినయుద్ధతిఁ దీవ్రసాయక
జ్వాలల నేర్చి యుద్భటభుజావిభవం బలరంగ నగ్గడం
దోలె నుదాత్తవిక్రమకుతూహలి నీ మనుమండు భూవరా.

99 సీ. అప్పుడు ప్రతివింధ్యుఁ డైదుబాణములఁ జిత్రుని మేను నొంచి తత్సూతు వక్ష
మునఁ గ్రూరశరములు మూఁడు నాటించి యొక్కమ్మునఁ గేతువల్లార్చి పేర్చి
యతఁడు దన్నుఁ గనవాస్త్రపీడితుఁ జేయ విల్లుద్రుంచి వెసఁబంచ విశిఖనిహతుఁ
గావించి శక్తి యుగ్రమ్ముగ వైచినఁ దెలుచ నాలుగుదునియలుగఁ జేసె
తే. నలిగి యాతండు గద వైచి యక్కుమారు, ఘోటకంబుల సూతునిఁ గూల్చెనదియ
పట్టుకొని వైచె మగుడ నప్పాండుపౌత్రు, చేయి వడి నుచ్చిపోవ నచ్చిత్రుఁ డధిప.

100 ఉ. బాహువు నొచ్చినం గినిసి భాసురతోమర మెత్తి కౌరవ
వ్యూహము సంచలింప నతఁ డుగ్రత వైచినఁ గంకటంబుఁ ద
ద్దేహము నుచ్చిపోవుటయుఁ ద్రెళ్లె నరేశ్వర యవ్విభుండు వ
జ్రాహతిఁగూలు పర్వతమునాకృతి నుత్కటవైకృతంబుగన్.

101 వ. ఇట్లు [1]చిత్రుండు దెగటాఱినం గనుంగొని మనయోధులు ప్రతివింధ్యు పై నడరి యనేకాస్త్ర శస్త్రంబులం బొదివినం బొలివోని [2]కలితనంబున [3]నేలకుటికి యక్కుమారుండు గోదండటంకారంబున నంబరంబు పూరించుచు బాణాసారంబు వరగింపఁ బాండవసైనికులు బెట్టిదంపుటురవడిం గదిసి యతనికిం దోడ్పడుటయు మనవారలు విచ్చి వెన్నిచ్చి పఱచి రప్పు డశ్వత్థామభీమసేనుల సంగ్రామం[4]బు భీమంబయి చెల్లె నందు.

---

98 1. చేర్చినసముద్ధతి — అ.ఆ.ఝ.ట డ.ల.

101 1. చిత్రుం దెగటార్చిన — ఆ.ఐ.ఒ.ఝ.డ; దెగటారి — శ.ష. 2. బీరంబున — డ. కర్మితనంబున — ద. 3. నిలకెరిగి — కొన్ని ప్రతులు. 4. బభిరామంబయి — ఔ.జ;

102 క. గురుపుత్త్రుఁడు దొంబదిశిత, శరములఁ బావని[1]రథంబు సంవృతముగఁ జే
సె రయం బారఁగ సాయక, పరంపరలు [2]వఱపె నతనిపై నతఁడలుగన్.

103 వ. వాని మగిడించి.

104 క. అనిలజుఫాలము గురునం, దనుఁడు పటుప్రదరకీలితము సేయుడు నా
తని నిటలంబున నతఁ డేపున బాణత్రయము నాఁట భూవరముఖ్యా.

105 వ. మఱియును.

106 చ. గురుసుతభీమసేను లతిఘోరవిధంబులఁ బోరి యొండొరుం
దెరలుపలేని [1]సామ్యమున దీపితులై లయకాల విస్ఫుర
త్తరణియుగంబుఁ బోలె శరధామసముగ్రతఁ బ్రజ్వరిల్లి యొ
ప్పిరి రథచిత్రచారులఘు భీషణసంచరణంబు లొప్పఁగన్.

107 తే. వారి వీక్షించి ఖచరులు పోరులెందుఁ
జూడమే దీని కెన యని యాడఁ[1]గలరె
కలుగ వింకను వీరలబలముఁ జలము
నలవు వెరవు నిట్లుండునే యనుచు[2]నుండ.

108 ఉ. ఒండొరుకేతువుల్ దునిమి యొండొరుసూతుల నొంచి యేపుమై
నొండొరుతేరివాహముల యుబ్బడఁగించి నిశాతవిస్ఫుర
త్కాండచయంబు లొండొరులకాయములన్ వడిఁగ్రుచ్చి వాత్రి ర
ప్పాండుసుతుండుఁ గుంభజునిపట్టియు మూర్ఛలు దమ్ముఁ[1]గ్రమ్మినన్.

109 వ. ఇట్లు రథంబులపై నొఱగి మూర్ఛిల్లిన.

---

102 1. యురంబు సంశ్రితముగ — త.వ. 2. గురిసె — ఇ.గ.వ.

106 1. శౌర్యముల (న) — ద.వ.ల.స.

107 1. గలమె — కొన్ని ప్రతులు. 2. బొగడ — ఖ.ఘ.ఝ.ద.ల.

108 1. గప్పినన్, ముంచినన్ — అనియు పాఠములు.

110 క. అనిలజుసారథియును గురు,తనయునిరథచోదకుఁడు నతని నాతనినిం
[1]గొని యుల్లంబుల బలితపుఁ [2]దునుకుసొరఁగ ననికిఁ దొలఁగఁ దోలిరి రథముల్.

111 ఉ. క్రీడితనూజుఁడైన శ్రుతకీర్తియు శల్యుఁడు నేచి దిక్కుల
ల్లాడఁగఁ బోరుచోఁ శరము లాఱయిదుల్ శ్రుతకీర్తి శల్యుమై
గాఁడఁగ నేయ మూఁడుపటుకాండము లాతనిమేనఁ గ్రుచ్చి సం
తాడితుఁ జేసె సూతు నిశితప్రదరంబున నాతఁ డుద్ధతిన్.

112 చ. నరతనయుండు దత్తనువు నాటఁగఁ దొమ్మిదియమ్ములేసి స
త్వరముగ సూతునంగమున వాలికతూపులు మూఁడు నాటి ని
ష్ఠురశరపంచకస్ఫురణ సూపినఁ [1]గోప మెలర్ప నమ్మహీ
శ్వరుఁడు గడంగి విల్ దునిమి సప్తశరంబుల నొంచె నాతనిన్.

113 వ. అట్టియెడ.

114 సీ. వేఱొక్క విల్లెత్తి విప్పచ్చుకోఁడు కఱువదినాలుగమ్ములు వఱపె మద్ర
పతిమేన నతఁడు దొంబదితూఁపు లడరించి యేసె నవ్వీరుశరాసనంబు
ఖండంబులుగ వాఁడు గండడంగక గద వైచినఁ బొడిసేసి యేచి శక్తి
నిగిడింపఁ దునుమాడె నిశితభల్లంబునఁ ద్రుంచెఁ దదీయసూతునిశిరంబు

ఆ. వాయు[1]జవములైన వాహంబు లప్పుడు, గలఁగి యరద మనికిఁ దొలఁగ [2]నీడ్చెఁ
దెఱపిగాంచి శల్యుఁ డటిముటిఁ జొచ్చి క, లంచెఁ బాండుసుతుబలంబు నధిప.

115 సీ. కమలాకరములీలఁ గలఁచి యాడెడు గంధదంతావళము సముద్దండతయును
దరమిడి మృగసముత్కరము ఘోరంబుగా వధియించు కంఠీరవంబునేర్పు
నీరసారణ్యంబు నిర్భరాటోపతఁ గాల్చుదావాగ్నియుగ్రక్రమంబుఁ
బ్రకటవిక్రాంతిఁ బురత్రయంబును సమయించు ఫాలాక్షునియేడ్తెఱయును

ఆ. బోల్పఁ [1]బట్టు నయ్యె భుజగర్వశౌర్య, పరితాపదుర్దమపరికోపములకు
మద్రవిభుఁడు గోలుమసఁగి శాత్రవసైన్య, హననకేళి సల్పునవసరమున.

---

110 1. గనుగొని యుల్లంబులబలుఁ దొనఁకు సొరఁగ — పీ.శ.ప.సూ.శర.ప. 2. తునియలుగా — డ.

112 1. చూపుదలిర్ప — వ.

114 1. వేగులైన, వేగమైన — అని పాఠములు. 2. విపిచె — వ.

115 1. బడియె నపుడు — పి.గ.వ.

—: దుశ్శాసనుఁడు సహదేవునితో యుద్ధంబుసేసి మూర్ఛిల్లుట :—

సం. 8—17—30

116 ఉ. ధీరజనోత్తముండు సహదేవుఁడు [1]మైగలి దుస్ససేనుఁడున్
వీరులు పిచ్చలింపఁ బ్రజ విన్నద్రువం బోరి[2]నార్వఁ బోరుచో
వారక సాయకత్రయము వాఁడిమి నయ్యువరాజు నొంచె వి
స్తారమనోజ్ఞహారలసితం బగు [3]నాఘనబాహువక్షముల్.

117 చ. ధృతి వొగడొంద నేచి సహదేవుఁడు నీసుతు శాతదీప్తస
ప్తతిశరవిద్ధు జేసి వడిఁ దద్రథచోదకు మార్గణత్రయా
హతుఁడుగఁ జేయ నల్గి వెస నాతనిచాపము ద్రుంచి యాతఁ డు
ద్ధతి యలరంగ డెబ్బదిశితప్రదరంబుల మేను నొంచినన్.

118 సీ. నకులానుజుఁడు గృపాణంబున వైచిన దుస్ససేనునివిల్లు [1]దునియలయ్యె
నెడగని యవ్వీరుఁ డేచి బల్వింట మంటలుగ్రమ్మ నమ్మేయుటయు నతండు
గడువెస నెత్తిన కరవాలమునఁ ద్రుంచి యతనిపై లక్షించి యదియు వైవ
నడుమన యాతండు నఱికినఁ బ్రస్ఫీతచాపంబుగొని చతుష్షష్టినిశిత

ఆ. కంకపత్త్రములను గడఁక నయ్యువరాజు
పరగఁ జేయుటయును బాండుతనయుఁ
డడఁచె నొక్కటొకటి నైదైదుతీవ్రశి
లీముఖముల బాహులీల మెఱయ.

119 వ. ఇట్లు విక్రమవిజృంభితుండై సహదేవుండు శతశాతశిలీముఖంబు లడరించిన.

---

116 1. మైగరి — కొన్ని ప్రతులు ; మైగలి — శూరుడు — సూ. చూడు — కర్ణ — 2. 186. శూరుడు — వీ.ష.స ; వేగమ — శ ; డమేయుడు — ణ.వ ; డజేయుడు—వ ; మైగల — క. 2. పోరొనర్చుచో — డ.ల. 3. నాతని — ఎ.ద.న.వ.

118 1. దునుకలయ్యె—ఇ.ఖ.డ.వ.

120 చ. రయమున వాని నన్నిటి శరత్రితయంబునఁ ద్రుంచి సాయక
ద్వయమున నాతనిం బటునవప్రదరంబుల సారథిన్ భవ
త్ప్రియతనయుండు నొంచి దివి [1]దీటుకొనంగఁ జెలంగి యార్వ న
త్యయసమవర్తిచాడ్పున నతం డుదితభ్రుకుటీవిలాసుఁడై.

121 మ. పటునారాచముదీప్తిజాలము నభోభాగంబునం బర్వ ను
త్కట వేగంబున నేయఁ గంకటము వక్షఃపీఠముం దూఱి నె
త్తుటిపొం దేమియు లేక యుచ్చి చనినం దూగాడి యాతండు ప్రా
లుటయుం దేరు దొలంగ సూతుఁడు భయాలోలాకృతిం దోలినన్.

122 క. అమ్మాద్రీపుత్రుఁడు వా, లమ్ముల దుశ్శాసనుని మహాసైన్యము రౌ
ద్రమ్ముగఁ గలంచె దివిజగ, ణమ్ము వినుతిసేయఁ దమమొనలు [1]నతి నార్వన్.

123 చ. నకులుఁడు సూతపుత్రుఁడుఁ బెనంగునెడన్ నకులుండు సూతపు
త్రకునకు నిట్లనుం దలఁచి దైవము నేఁడు నిజప్రసన్నదృ
ష్టికి ననుఁ బాత్రభూతుఁడుగఁ జేయుట గానఁగవచ్చె నాదుచూ
డ్కికి నిను [1]గోచరంబుగ ఘటించిన యాచతురత్వసంపదన్.

124 క. కౌరవ పాండవులకు నీ, వైరము నీవలనఁగాదె వచ్చెను నిను మ
ద్ఘోరశరనిహతిఁ బడఁగ, న్నారఁ గనుంగొనక కోప మాఱునె యొంటన్.

125 చ. అనవుడు రాజసూతివి మహాస్త్రవిదుండవు నైన నీకు ని
ట్లనుట దలంప నర్హమగు నైనను జెన్నఁటిపల్కులేల నె
ట్టన [1]భుజశక్తి మార్తురకడంక యడంచినఁ బల్కు టొప్పుఁగా
క నిలిచి [2]చూపు నీచలముకల్మియుఁ జేతులబల్మియుం దగన్.

126 వ. అని పలికి కర్ణుఁడు.

---

120 1. పిక్కటిలింగ—ఇ.ఎ.ఐ.ట.వ.

122 1. గనియార్వన్ — శ.ప.

123 1. గోచరుండుగ — వ.

125 1. నిజశక్తి — ఖ.వ. 2. చూపుమాచలము — గ.వ.

127 సీ. ఉబ్బి మాద్రిసుతు డెబ్బదిమూఁడుదూపులఁ గప్పుటయు నతఁ డలిగి యతని
[1]పైడెబ్బదినిశితబాణంబు లేసిన నా సూతనందనుఁ డక్కుమారు
ధనువు నుగ్గుగఁ జేసి తనువున ముప్పది కాండముల్ సొనిపిన నొండువిల్లు
గొని డెబ్బదింట నాతని నొంచి మూఁడుమార్గణముల సూతునంగమునఁ బఱపి

తే. భల్లమున విల్లుదును మాడి యెల్లజనులు, నద్భుతంబందఁ [2]ద్రిశతసాయకపరీతుఁ
జేసి నకులుండు నిష్ఠురహాస [3]భాసి, తాననాంభోజుఁడై పొలుపొందె నధిప.

128 క. సూతసుతుఁడు బలువిలు గొని, యాతని [1]వక్షమున నాఁటు నైదమ్ములు ని
ర్ఘాత [2]సమస్తశరముల, నాతఁ డతని నొంచివిల్లు నఱిముఱిఁ ద్రుంచెన్.

129 వ. మఱియు నొక్కమహనీయకార్ముకంబు గొని కర్ణుండు గడంగె నప్పు డయ్యిరువురు నొండొరులతూపులు ద్రుంచుచు నిజమార్గణంబుల నొక్క ళ్లొకళ్ల నెత్తుట ముంచుచుం బేర్చి వివిధవిశిఖజాలంబు లడరించిన నంబరంబు శలభపటల [1]సంవృతంబునుంబోలె నుండె నా సమయంబున నకులునగ్ర భాగంబునకు వచ్చిన సోమకబలంబులు గర్ణకుమారనారాచాది బహువిధ బాణపాతంబులఁ బలాయితంబులయ్యెఁ గర్ణునకు బాసటయై తఱిమిన కౌరవసైనికులు మాద్రేయు రౌద్రవిజృంభణంబున దూరవిఘటితులై రట్లిరువాఁగును నెడగలిగి చూచుచుండ సారథికోత్తము లుదాత్తఘోరా కారంబుల నుల్లసిల్లి భల్లప్రముఖ ప్రదరంబులఁ బరస్పరాంగంబులం బొదివి యంబుద[2]పిహితమూర్తులగు మార్తాండ శశాంకుల చందంబునొంది యన్యోన్యదివ్యాస్త్ర తేజోవిలాసంబుల నయ్యైయస్త్రంబుల వారించుచుం బోరి రట్టియెడ.

---

127 1. పైడెబ్బదినిశిత — ణ.త.వ ; పైనశీతినిశిత — పైనవతినిశాత — స ; పైనధికనిశిత — ద.న. పైనూరు సునిశిత — ట; పైనిశితనిశాత — వా. 2. త్రిదశ — ర.జ.డ. 3. భాసురాననాంభోజ — ఏ.గ.ణ.త.ద.న.

128 1. యశ్వముల — పీ.ట.శ.ష.న. 2. పటుశక్తి — ల.

129 1. పరివృతంబును — కొన్ని ప్రతులు. 2. విరహితమూర్తులు — వ ; యంబరవిహార మూర్తులగు — ద.

130 క. అలుక వోడమి కర్ణుండు న, కులు చాపము[1] ద్రుంచి సూతుఁ గూల్చి తురంగం
బులఁ జంపి చక్రరక్షుల, తలలు నటికి సిడము ద్రుంచి దరహాసముతోన్.

131 వ. మఱియునుం గుపితచిత్తుండై.

132 చ. పలకయు వాలునుం గొనియెఁ బాండుకుమారుఁడు [1]రెండుచెక్కలై
యిలఁ [2]దొరఁగంగ నేసె గదయెత్తినఁ ద్రుంచె రథంబు డిగ్గి యు
జ్జ్వలపరిఘాభిరాముఁడయి వచ్చిన నప్పరిఘంబు రూపుమా
పి లసితలాఘవస్ఫురణ పెంపునఁ గర్ణుఁడు [3]నొంచె నాతనిన్.

133 ఆ. మర్మ[1]భేదులైన మార్గణంబుల కోర్వ, కించి సిగ్గుఁ జలము డిగ్గ[2]ద్రావి
యెల్లజనులుఁ జూడఁ బోల్లఁదనంబున, కోర్చి యక్కుమారుఁ డోడిపాఱె.

—: కర్ణుఁడు నకులుని విరథుం జేసి యవమానించుట :—

సం. 8—17—91

134 క. వెనుకొని రాధేయుఁడు నిజ, ధను వాతనికంధరమునఁ దగిలిచి నలిఁ బ
ట్టిన నిందిరాంప[1]పరిగత, ఘనాకృతిని బొలిచె నతఁడు కౌరవనాథా.

135 వ. ఇట్లు పాండుతనయు బాండుదలఁ బట్టి మందస్మితసుందరాననుండై.

136 క. పలుకులు వృథగా నన్నుం, బలికితి మున్నింక నెన్ని పలుకవలసినం
బలుకుము నీకేఁ దగనా, యలవుఁ జలము నీ వెఱింగి తంతియ చాలున్.

137 క. అలవెఱిఁగి పెనఁగు పెనఁగం, దలఁచిన నదిగాక సిగ్గుదలకొని యనికిం
దొలఁగుట యింకిట దగు వి, చ్చలవిడి నర్జునునికడకుఁ జనుము కుమారా.

---

130 1. దునిమి—కొన్ని ప్రతులు.

132 1. పెక్కు చెక్కలై — వా ; రెండు చెక్కలై — పెక్కు ప్రతులు. 2. దొరుగంగ— కొన్ని ప్రతులు. 3. ముంచె — ఖ.వ.

133 1. భేదికర్ణ(ర్ణు) మార్గణంబుల — ఉ.క.ఞ.త.న.ప.వ. 2. నాడి — ఝ.డ.ల.వ.

134 1. పరివృతఘనా — ఏ.ద.న.వ.; పలసిత — బ.

138 క. అని విడిచె నకులుఁ గుంతీవ,చనములు దృఢవృత్తి చిత్తసంకలితములై
యునికిం గర్ణుం డతఁడును, జని ధర్మజునరద మెక్కె సవ్రీడముగన్.

139 వ. ఎక్కి నిట్టూర్పు[1]నిగుడం గుంభనిభీ_స్తభుజంగంబుచందంబున నుండె నవ్విధంబున మాద్రీపుత్ర మాన [2]మథనవిజృంభితుం డగునవ్వీరుం డప్పుడు మధ్యందినగతంబైన మార్తాండబింబంబునకుం బ్రతిబింబంబునుంబోలెఁ బ్రదీప్త మూర్తియై వెలిమావులును దెలి[3]పడగయు నుల్లసిల్ల శోభిల్లు తన రథంబు [4]రయంబున దర్శనీయంబుగాఁ బాంచాలబలంబు దఱిసి పెక్కు తెఱంగుం మెఱుంగుటమ్ములగములు [5]గదియించి.

140 సీ. సూతులఁ దెగటార్చి కేతనంబుల పీటతాటంబుసేసి రథ్యములఁగూల్చి
చామరచ్ఛత్త్రిభూషణములు పొడిసేసి [1]రథికజనములశిరములు దుంచి
కొమ్ములునఱికి యంకుశములుదునిమి తొండములుఖండించి కుంభములువ్రచ్చి
జోదులతనువులు భేదించి మోరలు గళ్యాలతోడఁ జెక్కలుగఁ జేసి

ఆ. [2]కంధరములుదుల్చి కాళ్లులుదెగ్రించి యా, శ్వికులఁజంపి చర్మవిశిఖకుంత
ముసలముద్గరప్రముఖసాధనములు[3]భ, గ్నములు సేసి భటుల సమయఁ జూచి.

141 వ. బాహు[1]విలాసంబు మెఱయ నెఱయంబొలిచె భవత్సుతుఁడగు యుయుత్సుండు పర్వతప్రతిముం డగు నులూకునయిం గవిసి కులిశనిభం బగు విశిఖంబుననొంచినఁ గోపించి యాబల్లిదుండు విల్లువిఱుగ సేయుటయు నక్కుమారుండు.

142 తే. మేలువిలుగొని యఱువది నాలుగమ్ము
లతని మెయిఁ గ్రుచ్చి సాయకత్రితయనిహతి
సూతు నొప్పించి మఱియు నిశాతశరచ
యమ్ము [1]వరగించె నధికరయమ్ము మెఱయ.

---

139 1. నిగుడించి — ల. 2. మర్దన — త.ద.న.ల.వ. 3. గొడుగు — ల. 4. రయంబ దర్శనీయంబుగా—వ. 5. గవియించి—కొన్ని ప్రతులు ; నినిచి—డ ; పరగించి— ఊ.ఖ.

140 1. రథికశిరంబులు. పృథివిగూల్చి — క.స. 2. కంధరములుదుల్చి — పీ.ర.శ.స ; కందములు వగిల్చి — వా. 3. భంగములుసేసి — ఖ.వ.

141 1. బలంబు — కొన్ని ప్రతులు.

142 1. నిగుడించె — ఈ.చ.జ.ణ.త.

143 వ. దానం గనలి.

144 క. బలువిడి నులూకుఁ డిరువది,శిలీముఖము లొడలఁ జొనిపి సిడము రయమున్మై
నిలఁ గూల్చిన నీసుతు డు, జ్వలవిశిఖము లయిదునాటె వానియురమునన్.

145 వ. ఇట్లు [1]నాటించిన నొచ్చి యాసౌబలనందనుండు రౌద్రంబు రూపంబు
దాల్చిన రుద్రువిధంబున విజృంభించి.

146 శా. ఖల్లం బొక్కటఁ [1]జంపె సూతునిఁ జతుర్బాణాహతిన్ వాజులన్
డొల్లం జేసె నిశాతపంచవిశిఖాటోపంబునం జించె [2]వీ
రోల్లాసంబు వికాసముం బొరయ మే నుక్కడి నీనందనుం
డెల్లం జూడఁగఁ బాటి యొండొకరథం బెక్కెం గురుగ్రామణీ.

147 క. గెలుపున మెయివొదలఁగ సౌ, బలసూనుఁడు రథమువఱపి పాంచాలబలం
[1]బలుగులపడఁ బలుదెఱఁగుల, [2]యలవుల [3]విహరించె నుద్భటాటోపమునన్.

148 సీ. [1]శ్రుతకర్మ నకులునిసుతుని శతానీకుఁ
దాఁకి యశ్వంబుల ధరణిఁ గూల్చి
సూతునిఁ [2]బరిమార్చె నాతఁడు గదవైచి
రథవాహనముల సారథిని గేత
నముఁ బొలియించె భూరమణ యిమ్మెయి నీదు
తనయుండు నకులనందనుఁడు విరథు

---

145 1. నాఁటించిన — ప. (అరసున్నలో రూపము)

146 1. ద్రుంచె — వా. 2. ధీరోల్లాసము — వి.ప.

147 1. బలుగూలగఁ బలు—ఇ.ఈ.గ.ఘ.ణ.వ ; బలుగలగ బలుదెఱంగుల—కొన్ని ప్రతులు.
బిలపై బడబలుదెఱంగుల — వ. 2. యలుగుల విహరించె — వి.శ.ష.సూ.న.వ.
మరియు కొన్ని ప్రతులు. 3. బొలియించె — అ.

148 1. శ్రుతకర్మ — వా ; శ్రుతవర్మ — శ.ష. కొన్ని ప్రతులు. 2. బొరివుచ్చె—ఈ.త.వ ;

లై యొండు[3] దేరుల కరిగిరి [4]శుభ్రితసోముఁ
దలపడి కడిమి గాంధారనాథుఁ

తే. డతని యడరించి వివిధసాయకములెల్లఁ
దునిమి బాణత్రియంబునఁ దనువునొంచి
తురగముల నరదమ్ముఁ గేతువుఁ దెలిపి
మాణశకలంబులుగఁ జేసి మద మెలర్ప.

149 మ. విరథుండై పొలివోని [1]ధీరమునఁ బృథ్వీభాగసంచారియై
శరజాలంబుల భీమసేనసుతుఁ డాశ్చర్యంబుగా నీసుఅం
దిరథం బేర్తైఅఁ గప్పినం దునిమె నుత్సేకో[6]గ్రుఁడై యపస్మారి
వరుఁ డబ్బాలునిచాపదండము భుజావష్టంభ మేపారఁగన్.

150 చ. అతఁడు పరిదీప్తఖడ్గము రయంబుమెయిం గొని యాస్యలాలుఁ డు
ద్ధతిఁ బరగించు సాయకశతంబులు దుంచుచు నుల్లసిల్ల న
వ్వతి పటుఖల్లఖండిత కృపాణునిఁ జేసిన [1]నీడఁబోక చే
తితునియ బెట్టువెచె జగతీవర యాశనివిల్లు రెండుగన్.

151 వ. ఇట్లు కోదండంబు [1]దుండంబులుసేసి తొలంగి యగ్యుమారుండు శుభ్రితకీర్తి
స్యందనం బెక్కె సౌబలుండు వేఱొక్కవిల్లెత్తి యత్తెఱఁగు నుగవడించి
పాండవరథికులం గలంచెఁ గృపాచార్యధృష్టద్యుమ్నులు పనుగునెడ
గౌతముండు పాంచాలవరుం బోదువునాటసేసిం బాణకోరించి యుక్కం
తేయసైనికులు దమలోన.

---

బోరిమార్చె — అ.ఉ.ప.బ.వ. 3. తెగవుల — వ. 4. శ్రుతసోముడలపడి — శ.మ.
మున్నగు పెక్కు ప్రతులు ; సితసోము — వా.

149 1. ధైర్యమున — ప.గ.వ.

150 1. నంతబోక — ఆ.ఝ.

151 తుమురుసేసి — వ ; ఖండంబులు — ణా.త.

## —: ధృష్టద్యుమ్నుఁడు గృపాచార్యునితోఁ దలపడి యోడిపోవుట :—

సం. 8—18—41

152 ఉ. ద్రోణు పరాభవం బధికరోషము సేయఁగ నున్న యీషఁ డ
క్షీణ పరాక్రమంబు విలసిల్లఁగ నీ ద్రుపదాత్మజున్ గత
ప్రాణునిఁ జేయ కే లుడుగుఁ బైకొను నంతటఁ [1]బోక విస్ఫుర
ద్బాణవిలాసముల్ నెఱపుఁ దా మనసైన్యము దల్లడిల్లఁగన్.

153 వ. అని వెండియు.

154 మ. వరదివ్యాస్త్రవిదుండు బాహుబల గర్వ[1]స్థేమ నిర్వాహకుం
డరులం జీరికిఁ గైకొనం డితఁడు [2]క్రోధాత్తాత్ముఁడై నేఁడు ని
ర్భరశౌర్యంబు నుదాత్తధైర్యము నుదగ్రస్ఫూర్తి శోభిల్ల దు
స్తరదర్పోద్ధతిఁ దేక యున్నె మనలం దా నేలకుం గోలకున్.

155 వ. ధృష్టద్యుమ్నుండును బెండువడి యున్నవాఁడనుచు నుండి రట్టియెడ బెట్టిదంబు[1]లగు గృపాచార్యులతూపులయేపు రథ్యంబుల నొంచి సారథి గ్రొవ్వడంచి యాద్రుపదనందనుతనువు నెత్తుటం దోఁచి యుల్లంబు గలంచె నప్పు డాతనిసూతుం డతనితో నిట్లనియె.

156 చ. వినుము కుమార విప్రభుజవీర్య మపార్యతఁ దేజరిల్లెడుం
జనవు భవత్సమగ్రశరజాలము లీతనిమీఁద దైవసం
జనితము నువ్వె యయ్యెడరు సంగర మిట్టిది తొల్లి యెందు నా
కనినది లేదు తేరు దొలఁగం గొనిపోవుట కార్య మిత్తఱిన్.

---

152 1. బోఁడు — పెక్కు ప్రతులు.

154 1. స్థేమ — ఇ; శేము — వా. కొన్ని ప్రతులు. 2. క్రోధావిష్టుడై — పీ.న.స. క్రోధాంధాత్ముడై — ఇ.ఎ.హ.చ.న.శ.ప; క్రోధానీకుడై — కొన్ని ప్రతులు.

155 1. గా గృపాచార్యుండు దేవునూకి రథ్యంబుల నొప్పించి — పీ.శ.ప.స. 2. జొత్తిల్లి — జ.

157 వ. నీయట్టివాని విక్రమంబునుం దిట్టినయట్లు [1]సమయుటంజేసి యిమ్మహాత్ముం డవధ్యుండని నిశ్చయించితి నామాట [2]కియ్యకొను మనవుడు నాపృషత పౌత్రుం డిదియట్టిద యని నిశ్చయించి పలికి మఱియు హీనస్వరంబున నిట్లనియె.

158 చ. చరణములుం గరంబులును [1]సంచలభావము నొందఁజొచ్చె మేన్
విరవిరఁబోవుచున్నయది విహ్వలమయ్యె మనంబు నీతలం
పరయఁగ మేలు మారుతసురాధిపసూనులలోన నల్ల నొ
క్కరుదెసకై రథంబు దొలఁగం గొని[2]పొమ్మడిబీర మేటికిన్.

159 చ. అనవుడు సూతుఁ డెంతయు రయంబునఁ దేరు వృకోదరాంతికం
[1]బున కెగవంగ శంఖరవమున్ గుణనిస్వనమున్ నిగిడ్చి యే
పునఁగృపుఁ డుజ్జ్వలప్రదరపుంజములం బరగంగఁ జేయుచున్
వెనుకొనిపొల్చి నిల్చె గిరి వెన్కొని నిల్చిన వజ్రికైవడిన్.

160 తే. కడఁగి కృతవర్మతోడ శిఖండి పెనఁగు, చుండి శరపంచకంబున నురము నొంప
నతని నయ్యాదవోత్తముఁ డలఘుషష్టి, విశిఖవిద్ధునిఁ జేసి విల్ విఱుగ నేసె.

161 క. ఒండు శరాసనమెత్తి శిఖండి గురియు నవతి సాయకమ్ములు పెలుచన్
ఖండించె నతఁడు తత్కో, దండం బాద్రుపదనృపతితనయుఁడు నఱకెన్.

162 క. ధనువు దునిమి కొమ్ములు [1]మురిసినవృషభము చందమగుడు శీఘ్రస్ఫురణం
దనువున శితశరములు వడిఁ, జొనిపి యతం డతని గళితశోణితుఁ జేసెన్.

163 చ. అలుక మనంబునం గదిరి యాదవసత్తముఁ డొందువింట దో
ర్బల మెసఁగంగ డెబ్బదిశరంబుల [1]నాతని మేన రక్తధా
రలు [2]దొరఁగించి పెక్కుప్రదరంబులు పైపయి నేయు చుండ న
గ్గలికఁ బెనంగె వెండియు శిఖండి విచిత్రరథప్రచారుఁడై.

---

157 1. సమయంజేసెనిమ్మహా — పీ.శ.ష. 2. వినుము — కొన్ని ప్రతులు.

158 1. జంచలభావము — అ.ఐ.చ.ణ.ద.ల. 2. పొమ్మికబీర — కొన్ని ప్రతులు.

159 1. బునకు దొలంగ దోలిన ప్రభూత గుణస్వనమున్ — అ.ఆ.ఐ.ఒ.ఖ.ఝ.ల.

162 1. దునిసిన — ఉ.ఏ.గ.న.

163 1. వాడిమి—వా. కొన్ని ప్రతులు; నాతనిమేన—అ.ఆ.ల.పీ.శ.ష.స. 2. వెడలంగ — ఇ.

164 వ. ఆ ద్రుపదనందనుండు జత్రుదేశంబున నంబకత్రయము నాటించిన.

165 శా. క్రూరోల్లాసము పల్లవింపఁ గృతవర్ముం డుగ్రదీప్తిస్ఫుర
న్నారాచంబులు పెక్కు లొక్కమొగి మేనం[1]గ్రువ్వ మూర్ఛిల్లె న
వ్వీరాగ్రేసరుఁ డప్డు సారథి భయావిర్భావదీనాత్ముఁడై
తేరచ్చోటు దొలంగఁ దోలుటయు భీతిం బాఱెఁ దత్సేనయున్.

166 వ. వివ్వచ్చు విక్రమవిహారంబున కోర్చి శిబి[1]త్రిగర్తసాల్వసంశప్తకసైన్య నారాయణ గోపాలోపేతుండై సత్యసేన [2]చంద్రదేవ మిత్రదేవ [3]మిత్రవర్మ సౌశ్రుతి సువర్మ సుశర్మాదు లగు సోదరసుతులు బాసటగాఁ ద్రిగర్తపతి పెనంగునప్పుడు.

167 సీ. సత్యసేనుఁడు మూఁడు సాయకంబుల మిత్రదేవుండు షష్టిసందీప్తమార్గ
ణంబులఁ గ్రూరబాణంబులు మూఁటను జంద్రదేవుఁడు శరసప్తకమున
మిత్రవర్ముఁడు గంకపత్త్రత్రిసప్తతి సౌశ్రుతి యేడునిశాతవిశిఖ
ములను శత్రుంజయుఁ డలఘువింశతికాండములను సుశర్ముఁ డుజ్జ్వలనవాస్త్ర

తే. ములను గప్పి రపార్థు నాబలియుఁ డంబుదములధారలు వొదువనుదాత్తరేఖ
గరము పొలుపారు మేదినీధరముభంగిఁ, దలఁపఁ బట్టగుధీరతఁ బొలిచె నధిప.

168 వ ఇట్లు సుస్థిరుండై మిత్రదేవు నంగంబునఁ గంకపత్త్రశతంబును సత్యసేను తనువున మార్గణత్రయంబును [1]సుశర్మమిత్రవర్మల శరీరంబుల శిలీముఖాష్టకనవకంబులను బఱపి శత్రుంజయు [2]శిలాశితశరంబులం బడవైచి సౌశ్రుతిం బంచవింశతికాండంబుల గీటడంగించియుఁ జంద్రదేవుని నెనిమిదియమ్ములం దునిమి యుల్లసిల్లిన.

169 చ. కనకపుఁగామతోమరము గర్వ మెలర్పఁగ నెత్తి పద్మనా
భునిభుజశాఖ యుచ్చిచన భూరిబలుం డగుసత్యసేనుఁ[1] డు
క్కున నిగిడింపఁ జేతిమునికోలయుఁ బగ్గములున్ మహీతలం
బున నొగలందునుం బడిన భూవర పార్థుఁడు గ్రోధదీప్తుఁడై.

---

165 1. గప్ప — ఆ.త.వీ.శ.ప.

166 1. వసాతి — కొన్ని ప్రతులు. 2. సత్యకీర్తి, మిత్రసేన — పెక్కు ప్రతులు. 3. మిత్రవర్మ, సౌశ్రుతి, సువర్మ — పెక్కు ప్రతులలో లేదు.

168 1. మిత్రవర్మ సుధర్మ — కొన్ని ప్రతులు. 2. బహుశరంబుల — పెక్కు ప్రతులు.

170 క. హరిదెసఁ గన్గొని యాతని, యరదముఁ గదియంగ నడపు మరద మనుఁడు పె
చ్చెర నొండొక మునికోలం, గరముద్ధతిఁ దవె ఘోటకంబుల నతఁడున్.

171 క. తేరతని యరదమునకుం, జేరువ యగుటయును గ్రీడి శితబహుభల్ల
స్ఫారగతుల గాత్రశిరో, దారణ మొనరించి యొప్పె దరహాసముతోన్.

172 వ. ఇట్లు సత్యసేనునిఁ జిత్రవధంబు చేసి.

173 చ. ఘనతర[1]వత్సదంతశరఘాతమునం బడవైచి మిత్రవ
ర్మని రథసూతు [2]నట్టిదొక క్రూరపుఁదూఁపున నుర్విఁ[3]గూల్చి నా
తని సముదీర్ణ[4]మై పెలుచఁ బాఁకి త్రిగర్తబలంబు సుట్టు ము
ట్టిన వివిధోగ్రసాయక పటిష్ఠత[5] నొప్పి కలంచె నేపునన్.

174 వ. వెండియు [1]సుశర్మనిజ్ఞాతులు వోక పెనంగిన.

175 ఆ. వెండిపింజఁ బోలుచు వెడఁదయమ్మున మిత్త్ర, సేనధరణినాథుశిరముఁ ద్రుంచి
వాఁడినారసము [1]సువర్మవక్షంబున, నాటె నయ్యమర్త్యనాథసుతుఁడు.

176 వ. అట్టియెడ సంశప్తక గణంబులన్నియు నార్పులు నింగిముట్ట నలుదిక్కులం గిట్టి బెట్టిదంబులగు నస్త్రశస్త్ర పరంపరలు గురిసిన నమ్మేటివిలుకాఁడు దలఁక మానిన యలంతి నవ్వుచెలువంబు మొగంబునకు వింతచెన్నొసంగ విజృంభించి యైంద్రాస్త్రంబు ప్రయోగించిన నది ప్రదీప్త భల్లాంజలిక ప్రముఖ [1]విశిఖరూపంబులం బరగుటయు.

---

173 1. వత్స, వర్ప — అని పాఠములు. 2. బిట్టదుర క్రూరపు — స; బెట్టిదపు — ఒ.క; నట్లతన + క్రూరశరంబున — ఈ.జ.త.వ. 3. గూల్ప — పీ.శ.ష; గూల్చి — కొన్ని ప్రతులు. 4. తంబెలుచ — ఆ.ఒ.ఝ.పీ.శ.ష. 5. నూపి — పెక్కు ప్రతులు.

174 1. త్రిగర్తజ్ఞాతులు — ఇ.ఊ.ణ.ల.

175 1. సువర్మ వక్షంబున నాటి—ఆ.ఝ.పీ.శ.ష ; కుత్తుక—స ; యలికము—ఇ.ఎ.ఔ.వ ; నట్టిరు — అ.ల ; పెడతల — ఖ.గ.వ ; సువర్మనికునికిట — వా. ఇట్టిశబ్దము శ.ర. సూ. నిఘంటువులలో కానరాలేదు.

176 1. ఖశిలీముఖంబులం — పీ.శ.ష ; ఖంబులం బరగుటయు — వా ; విశిఖరూపంబులం — పెక్కు ప్రతులు

177 సీ. తేరుల [1]చెక్కులు వారణంబుల ఖండ
ములు భూషణంబుల పొడియు ఘోట
కంబుల తునియలుఁ గరవాలతోమర
శరపరిఘాదుల శకలములును
రథికజనంబుల వ్రయ్యలుఁ జామర
చ్ఛత్రకేతువుల యంశములు భటుల
తుమురును రౌతుల తుండంబులును గంక
టముల భాగములుఁ జిందములనుఱుములుఁ

తే. గలసి నెత్తుటమునిఁగి ప్రేవులఁ బెనంగి
మెదడు బ్రుంగి వియచ్చర హృదయములకు
నద్భుతంబు బీభత్సంబు [2]నావహింప
సంగరాంగణ మతిఘోరభంగియయ్యె.

178 వ. అప్పుడు.

179 క. కరిహయశవముల పిఱిగిన, యరదంబుల విషమమైన యాజిక్షితి నె
త్తురు రొంపిలోన [1]రథ్య,స్ఫురణకతనఁ దవులఁబడక శోభిత[2]గతిదైఱె.

—: దుర్యోధనుఁడు ధర్మజునితో యుద్ధంబుసేసి విరథుఁడగుట :—

సం. 8—19—35

180 తే. నరుఁడు దివ్యశరార్చులు వరగఁ జేయఁ
గలఁగి హతశేషసంశప్తకవ్రజంబు
పలుగడల విచ్చుటయుఁ బొంగ వాసి [1]మెఱయు
నగ్నియునుబోలె [2]వెలుఁగొందె నాతఁ డధిప.

---

177 1. చెక్కులు — పి.శ.ష. 2. నావహిల్ల - కొన్ని ప్రతులు.

179 1. రథవిస్ఫురణంబునదవుల - వ. 2. మతిదైఱె - ఆ.వ.

180 1. వెలుగు - కొన్ని ప్రతులు. 2. వెలుగారె, పొలుగారె - అని పాఠములు.

181 ఉ. కౌరవరాజు ధర్మజుఁడు గయ్యము సేయుచెడం గడంకమైఁ
గౌరవరాజు ధర్మజునికాయమునన్ నవసాయకంబులన్
సారథిమేన నొక్క పటుసాయకమున్ నిగిడింప నాతఁడు
ఘోరతరాతుఁడై యతని నొంచెఁ ద్రయోదశ[1]సాయకాహతిన్.

182 వ. నొంచి తోడన.

183 తే. తునియలుగఁ జేసె హరులఁ జతుశ్శరముల
సూతుఁ బంచమమున ఘనకేతుయష్టి
షష్ఠమునఁ జాపదండంబు సప్తమమున
నలిగి యెత్తినకరవాల మష్టమమున.

184 క. ఆలోకనన యజ్ఞసపతి, వాలికనారసములైదు వక్షమున వడిం
గీలించి ధైర్యసారము, దూలించినఁ దొలఁగి నీసుతుం డిల [1]కుటికెన్.

185 చ. వికల[1]రథప్రయత్నుఁ బృథివీపతిఁ గన్గొని ద్రోణపుత్రక
ర్ణకృపులుఁ దక్కనుం గలుగు నాయకులున్ రయమార వచ్చి కూ
డికొనుట సూచి [2]యెంతయు వడిం జనుదెంచిరి ధర్మసూనుపొం
తకు సముదగ్రులై యతనితమ్ములు సంగరకౌతుకంబునన్.

186 వ. ఇత్తెఱంగున నపరాహ్ణంబున దొరలమొత్తంబు లొక్కదెసకుం దార్కొనిన నుభయబలంబులు నురవడించి కలయఁ బెరసినం గ్రందుకయ్యం బయ్యె నందుఁ [1]జిందంబుల మ్రోఁతయు నార్పుల యులివును బాణకృపాణాది హేతి సంఘట్టనంబునం బుట్టు రణనంబును [2]రథావయవాస్థికపాలభంజనంబున నెసంగు నినదంబునుం గూడి పరగిన దిక్కులుపిక్కటిల్లెఁ గరులకొమ్ములం జిక్కి వ్రేలు తురంగంబులును [3]సందుకొని చొచ్చిన సుభటులు [4]సెరివిన

---

181 1. మార్గణాహతిన్ - అ.ఆ.ఐ.ఝ.డ.ల.

184 1. కొరగెన్, కెరగెన్ - అని పాఠములు.

185 1. తరప్రయత్ను — కొన్ని ప్రతులు. 2. యంతయు వడిన్ — కొన్ని ప్రతులు.

186 1. తూర్యంబుల—ఖ.ఘ. 2. దాశ్వావయవహస్తి—కొన్నిప్రతులు. 3. గ్రందుకొని—పీ.ష. 4. వాచవిన - పీ.శ.ష; చేరినరికిన - కొన్ని ప్రతులు.

నొఱిగి కూలు కుండాలంబులును నాశ్వికుల మొగంబునంబడి లులాయం బులు సొచ్చిన సరోవరంబులచందం బగు కాల్బలంబులును రథికులు వ్రీక పెనంగిన నవఱలయిన యరదంబులును నెత్తురుకాలువలును గండల తిట్ట లును శ్రేవులప్రోవులును నెమ్ములరాసులును నత్యంతరౌద్రంబు నావ హించె ననుటయు నాంబికేయుండు.

187 చ. సమరము [1]పెంపు సెప్పెదవు సంజయ చెప్పవు నీవు మీమహీ
రమణునిభంగి ధర్మజుశరంబులచే విరథత్వ మొంది మా
నముఁ జలముం [2]దెగం దొలఁగెనా మగుడం బురికొంట లేదె ని
క్కము సెపుమా తనూజు భుజగర్వవిహీనత నొంచెఁ జిత్తమున్.

188 వ. అనిన నాసూతనందనుం డమ్మానవపతి కి ట్లనియె.

189 తే. విరథుఁ డయ్యెనకాని యప్వీరుఁ డాహవంబు [1]దక్కక యొండురథంబు వన్ని
కొని సముద్ధతివచ్చి సక్రోధమైన, మనముతో సూతునకు నిట్టు లనియె నధిప.

190 ఆ. తెల్ల[1]సివిరులును వెల్లనిగొడుగు నై
యల్లవాఁడె పాండవాగ్రజుండు
మెఱసియున్నవాఁడు వఱపు మచ్చోటికి
రథము ఘోటకములరయము మెఱయ.

191 వ. అనుటయు నతండు నట్లచేయ నయ్యుధిష్ఠిరుండు నిజసారథి నాలోకించి యహి[1]కేతుమహితంబై వచ్చుచున్న ధృతరాష్ట్రనందనస్యందనంబునకు నమ్ముఖంబుగా మనరథంబు నడపు మనుటయు నాతం డవ్విధం బాచరింప నయ్యిరువు రతిరథికులకుఁ బ్రకట ప్రధనంబయ్యె నట్టియెడ.

---

187 1. సొంపు, భంగి — స. 2. దిగందొలగెనా — కొన్ని ప్రతులు.

189 1. దక్కడొండొక్క — ఇ.ఈ ఉ.న. కొన్ని ప్రతులు.

190 1. తెల్లహారులరథము—ఊ.గ.పి.శ.ష.స. తెల్లనైన సిడము— తెల్లని—స ; పెల్లుమిగుల హారులు తెల్లని — ణ.త.

191 1. కేతుమంతంబై — వ.

192 సీ. పాండవుచాపంబు ఖండించె నీకొడు కొండకధనువెత్తి యుఱక యాతఁ
డక్కురునాథువిల్ గ్రక్కునఁ దునుమాడె నతఁడు వేఱొకవింట నతని నేయ
నయ్యుధిష్ఠిరుఁడు నానాస్త్రంబు లేసిన నాచ్ఛాదితంబయ్యె నంబరంబు
వారొండొరుల రక్తధారా[1]ప్లుతులఁ జేసి పుల్లకింశుకభంగిఁ బొలిచి రేచి

ఆ. ఘోరశక్తివైచెఁ గౌరవపతి యది, నడుమఁ దునిమి ధర్మనందనుండు
నొంచె నిశితవిశిఖపంచకమ్మున నమ్మహీశు నురము దర్పమెసక మెసఁగ.

193 వ. ఇట్లు కౌంతేయముఖ్యుచేత నొచ్చియు గాంధారీనందనుండు.

194 చ. బరవస మొప్పఁ గ్రూరనవభల్లవిదారితుఁ జేసె నమ్మహీ
శ్వరు నతఁ డల్గి బల్పిడుగుచాడ్పు [1]శిలీముఖ ముచ్చిపోవ న
క్కురుపతి నేయఁ గయ్యమునకుం దుది యప్పుడ చేయువాఁడు గా
నరదము డిగ్గె నాతఁడు గదా కలనోద్భట బాహుదండుఁడై.

195 క. [1]డిగి రయమునఁ గదిసిన నా, జగతీపతి యేచి యుగ్రశక్తి నురము బె
ట్టగ వైచిన నీతనయుఁడు, [2]మగుడఁగ రథ మెక్కె వింటమూర్ఛొనువాఁడై.

—: దుర్యోధనుఁడు ధర్మజుతో యుద్ధముచేసి మూర్ఛిల్లుట :—

సం. 8—20—30

196 క. అత్తఱిఁ గడుఁ జెల్లుగఁ[1] గ్రొన్నెత్తురు వడియుటయు నతఁడు నిర్భరమూర్ఛా
యత్తుఁ డగుడుఁ గృతవర్ముఁ డుదాత్తత నెదసొచ్చె బాహుదర్పము నెఱయన్.

197 ఉ. ఆతనిఁ దాఁకె వీఁక ననిలాత్మజుఁ డప్పు బలంబు మారుతో
ద్ధూతపయోధిపోలె వడిఁ దోడ్పడియెం గృతవర్మ కంత ను
ద్ద్యోతితభంగి వచ్చి విజయుం[1]డు వెసం దునుమాడె లీలమైఁ
జేతులతీఁటవోవ రథసింధుర[2]వాజి భటోత్కరంబులన్.

---

192 1. వ్రుతుల - పెక్కు ప్రతులు.

194 1. నసాయక - ఈ.ణ.త.వ.

195 1. దిగి - కొన్ని ప్రతులు. 2. మగుడి (డ) రథంబెక్కి - కొన్ని ప్రతులు.

196 1. మైనెత్తురు - ఎ.వ.

197 1. డెలమిం దునుమాడె - ఇ.క వ. 2. ఘోటభటో - కొన్ని ప్రతులు.

198 వ. అంత.

199 క. కురుపతి దెప్పిటి బాహు,స్ఫురణంబు దలిర్ప నింద్రజుని మార్కొని ని
ష్ఠురవివిధవిశిఖవినిహత,శరీరుఁ జేయుటయు నతఁడు సక్రోధుండై.

200 తే. కార్ముకముఁ గేతువును ఘోటకముల సూతు
వెడఁదబలుతూపు లేడింటఁ బుడమిఁ గూల్చి
భల్ల మొక్కట నతని [1]పెన్విల్లు దునిమి
ప్రాణముల్ గొనఁ జాలెడు బాణ మేసె.

201 క. కని యాఱమ్ముల నెడనడి
దునియలు గావించె గురుసుతుం డాతనివి
ల్లును హరులఁ దునిమి పార్థుఁడు
దనుమార్కొను కృపుని చాపదండము [1]ద్రుంచెన్.

202 చ. వడిఁ గృతవర్మ దాఁకిన నవారణఁ దద్ధనువున్ హయంబులన్
సిడమును రూపుమాపి విలసిల్లి యెదిర్చిన దుస్ససేనువిల్
నడిమికిఁ ద్రుంచి గాండివగుణధ్వని దిక్కులు పిక్కటిల్ల నె
క్కుడు మదమొప్పఁ గర్ణుఁ దెసకుం జన సారథికుం డుదగ్రుఁడై.

203 క. అన్నరుని మూఁడుశరముల, వెన్నుని నిరువదినిశాతవిశిఖముల వేసెన్
భిన్నాంగులఁ జేసి విజయు, మున్నేసినయన్ని బాణముల [1]బిట్టేసెన్.

204 వ. అంతకుమున్న సాత్యకితోడం బోరిపోరి యారాధేయుండు దనదెస కడరిన కవ్వడిం గని యక్కడ మొగం బయి యిటు పరాక్రమించినం జూచి యేచి యాసవ్యసాచి కడ్డపడి యక్కేశవానుజుండు

205 తే. నవతిశరముల నవమార్గణముల శతశి,లీముఖంబుల నేసి దోర్లీల మెఱయ
సారథిధ్వజహయరథసహితముగ ను,దీర్ణదర్పుఁడై కప్పె నక్కర్ణుఁ డధిప.

---

200 1. తేరెల్ల — ఙ.ణ.త.న.వ.

201 1. దునిమెన్ — క.ఙ.త.వ; నరికెన్ — ట.ణ.

203 1. బెల్లేసెన్, బెట్టేసెన్ — అనియు పాఠములు

206 వ. అప్పుడు యుధామన్యుండును శిఖండియు ద్రౌపదేయులు [1]నుత్తమౌజుం డును యుయుత్సుండును గవలును ధృష్టద్యుమ్నుండును జేకితానుండును బ్రభద్రకచేదికరూశమాత్స్యకేకయవత్సబలసమేతంబుగా ధర్మనందనోత్సాహ దీపితాటోపశోభితులయి కవిసి వివిధాస్త్రశస్త్రవ్రాతము లాసూతసూను పయి నడరించి[2]న నవ్వీరుండు

207 మ. అవి వేగంబ మరల్చి భూరిపవనవ్యాపారనిర్మర్దితా
టవులం బోలఁగఁ జేసి దంతిభటఘోటస్యందనశ్రేణులన్
దివిజవ్రాతము పిచ్చలింప రభసోద్రేకంబు రౌద్రంబుఁ బెం
ప విజృంభించె ధనుర్గుణధ్వని నభోభాగంబు భేదింపఁగన్.

208 మ. కని గాండీవధరుండు దర్ప మెసఁగం గర్ణాస్త్రజాలంబు నీ
సున వారించి శిలీముఖార్చులు పరిస్ఫూర్జత్ప్రభం బర్వఁ బే
ర్చినఁ గార్చిచ్చడరన్ మృగంబులు భయోద్రేకంబునం బాఱుచా
డ్పున నీమూఁకలు నల్గడం బఱచె [1]నుదూ్భతభ్రమాత్తంబులై.

209 వ. అంత నంశుమంతుం డపరగిరియవ్వలకుం జనుటయు ధరాధూళికిఁ దోడు సంధ్యారాగ మిళితంబైన తిమిరంబు గవిసిన నెద్దియుం గానరామిం జిత్తంబులు గలంగ రాత్రియుద్ధంబునకు నోహటించుటం జేసి ఘనదోరలఁ బాండవసైనికులు దఱిమినం దాల్మి వాటింపక తిరిగిపోయిరి జయంబు సేకొని [1]వీరి నవ్వుచు వారు గవ్వడిం గమలనాభునిం బ్రశంసించుచుం జని రవ్విధంబున నుభయసైన్యంబులు నిజశిబిరంబుల కరిగి విశ్రామంబు నొందె నని చెప్పుటయు సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

---

206 1. నుత్తమోజుండును - శ.ప. పెక్కు ప్రతులు. 2. ననవ్వి యవ్వీరుండు - అ.ఆ. ఏ.ఐ.డ.

208 1. నిర్ధూతాంబుదాభంబులై - ఈ.ఘ.వ; నుద్ధూంతాంబుదాభంబులై - ప(యతిభంగము) నిష్ఠూతాంబుదాభంబులై - స.

209 1. వావిరినవ్వుచు - త.వ.

210 ఉ. తెల్లము మిమ్ము నందఱ వధింపఁగ నయ్యమరేంద్రనందనుం
[1]డొల్లక [2]పోక వాఁడు [3]దనయుగ్రత సూపెద నన్న మీమహీ
వల్లభు [4]వారికేల యమవహ్నుల కైనను రూపుతోడఁ బోఁ
[5]జెల్లదు గాన తద్భుజవిశేషము రూఢము గాదె సంజయా.

211 సీ. యాదవ వీరచయంబు నాటోపసముద్రేక ముడిపి సుభద్రఁ దెచ్చె
ఖాండవం బాహుతిగా లీల నొనరించి సప్తార్చి నత్యంత తృప్తుఁ జేసె
శబరవేషముఁ దాల్చి చనుదెంచి తొడరిన శివునితోఁ బెనఁగి [1]మెచ్చించె నతని
గంధర్వుచే పడ్డ కౌరవసత్తము విడిపించె లావును వెరవు మెఱయఁ
ఆ. గాలకేయకులముఁ గాలునిప్రోలికి, ననిచె నఖిలనృపుల [2]ననికి నియ్య
కొలిపెఁ గ్రీడి జగము గొనియాడ నేకకో, దండచండవిల[3]సితమునఁ గాదె.

212 వ. కావున మనవారికి నోటమి యక్కిరీటివలనం గలిగె నను కలుచ వారి గర్హింపం దగ దట్టి జెట్టితోడం బెనంగుటఁ బ్రశంసకుం దగుదురు పదంపడి వారేమి సేసి రనిన ధృతరాష్ట్రునకు సంజయుం డిట్లనియె.

213 ఆ. అట్లు [1]దివిసిపోయి [2]యాటుఁ బోటు నొడళ్లఁ
గలయఁగలిగి డప్పి గదిరి [3]సొలయు
దొరలుఁ దాను నపుడు దుర్యోధనుఁడు విచా
రాభి యుక్తినున్న యవసరమున.

214 వ. పార్థుదెసఁ బలుకుపుట్టినం గ్రోధంబున నూర్పులు సందడింపఁ గర్ణుఁడు భగ్నదంష్ట్రంబయి విషంబులేని భుజంగంబునుం బోల్పం దగి పరాజయంబు నొంది దీనదశకు వచ్చి యున్న యారథికవరులం గలయం గనుంగొని కౌరవేశ్వరున కిట్లనియె.

---

210 1. డొల్లఁడు గాక వాఁడు - స. 2. పోయెగాక - క.ఖ.జ; యుండె గాక - ఉ.స; పోయెవాడు - స; మానెగాక తనియుగ్రత - శ.వ. 3. ధనుపుగ్రత - ల.వ. కొన్ని ప్రతులు (సంధి చింత్యము). 4. డొప్పునే, శమనవహ్నులకైన. శ 5. జెల్లునె - స.

211 1. మెప్పించె-కొన్ని ప్రతులు. 2. నరికినియ్యకొలిపె-అ.ఈ.ఎ.ద.బ.ల. కొన్ని ప్రతులు; ననికి నియ్యకొలిపె - వా. మున్నగు ప్రతులు. 3. సముందుగాదె - కొన్ని ప్రతులు.

213 1. విడిచిపోయి, విరిగిపోయి, దిగి(వి)చిపోయి - అనియు పాఠములు. 2. యేటుపోటు - స. మున్నగు ప్రతులు. 3. సొలయు - బి.శ.వ. మున్నగు ప్రతులు; సురియు - వా.

215 ఆ. అలవు ¹వెరవుఁ దలఁపఁ గలఁ డితం డన²వాసి, కెక్కినట్టి రథికుఁ డక్కిరీటి
వలయు నెడల నతని వాసుదేవుండు బో,ధించు నెల్లతెఱఁగుఁ దేటపడఁగ.

216 క. అనిమిషనాథుం డిచ్చిన, ఘనశక్తికి నసుర నొడ్డి గాండివిఁ దొలఁగిం
చినహరి వంచన పదపడి, మన యెల్లను దెలియ వినమె మనుజాధీశా.

217 క. అగుఁ గాక యతని నాతని, మగఁటిమియును నేర్పునెల్లి ¹మాన్పెద నీకుం
బగ యనియెడుమాటయు ని,జ్జగమునఁ గలుగంగ నీను జగతీనాథా.

—: కర్ణుని రెండవనాఁటి యుద్ధము :—

సం. 8—22—10

218 వ. అనినం బ్రియం బంది నీనందనుం డతనిం దగువారలను నిజనివాసంబులకుం బోవం బనిచి తానును నభ్యంతరమందిరంబున కరిగె నా రాత్రి సుఖనిద్ర సేసి రేపకడ సమస్తజనంబులు సంగ్రామంబునకు నడచి రంత నక్కడ నుక్కు మిగిలి పాండవబలంబులుం దోతెంచె ధర్మనందనుండు బృహస్పతి మతంబున దుర్జయవ్యూహంబు పన్నించినం జూచి మనవారును దానికిం బ్రతిగా మోహరించుటకై రాధేయు రాకకు ¹నెదురుచూచుచు నొకభంగిం ²బన్ని రనిన విని యాంబికేయుండు.

219 క. ¹శీతార్తజనంబులు ప్ర,ద్యోతను నుదయంబు గోరు²చున్న కరణి తా
³నేతేరఁ గోరుజనులకు, నాతఁడు నిజతేజమునఁ బ్రియం బొసఁగెనొకో.

220 ఉ. అమ్మెయి ధర్మనందనుని యగ్గలికం దొలునాఁడు రాజు బ
న్నమ్ములపాటు సూచుచు రణంబుకడంక దొఱంగి చన్న బం
టెమ్మెయి ¹నద్దినంబున నహీనపరాక్రమ²లీల సూపెనో
తమ్ము నెఱుంగ రేమియు నతండును నాతఁడు నేమిసేయుదున్.

---

215 1. జలము, వెరవు - అ.ఆ.ఐ.ఝ.డ.ల. 2. రాసికెక్కినట్టి - కొన్ని ప్రతులు.

217 1. వెల్లమాన్పెద - డ.వ.

218 1. నెదుళ్ళు చూచుచు - కొన్ని ప్రతులు. 2. బన్నించిరి - వ.

219 1. శీతార్తి - కొన్ని ప్రతులు. 2. నోజను వెసతా - అ.ఆ.ఝ.ల. 3. దోతెంచుట గోరుజనుల కాతడు - గ.వ; * నేతెంచుటగోరు - పెక్కు ప్రతులు.

220 1. నట్టియుబ్బున - ఇ.త. 2. కేలి - ఖ గ.వ.

221 తే. [1]కర్ణుఁ డట్టి కలనఁ గౌంతేయవర్గంబుఁ, గృష్ణయుతము గాఁగ గెలువఁ జాలు
నేమి సెప్పఁగలదు మీ మానవేంద్రుని, చిత్తమాంధ్య మతనిఁ జెఱుపకున్నె.

222 క. సౌబలు నీతియుఁ గర్ణు భుజాబలమును గూడి తనకు సామ్రాజ్యం బీఁ
గా బలసి వెలయువాఁడై, యాబేలాఱడు మనంబునం దేప్రొద్దున్.

223 క. జూదంబు[1]నాఁడు మొలచిన, యాదుర్దశ పెరిగి సంజయా [2]నిర్భరదుః
ఖోదయపరంపరాసంపాదిని యై మనసు నిట్లు పఱిగొనియెడినే.

224 క. దుర్యోధను చేసిన యన, కార్యంబున వచ్చినట్టి కష్టంబులు దా
త్పర్యంబున వినియెదఁ బ్రతి, కార్యంబులు గామి మనసు గందుచు నుండన్.

225 క. పాండునృపసుతులలో[1]నొ, క్కండైనను నొవ్వఁ డింతయును మును వనితా
మండలి [2]చేరువ మెలఁగెడు, గండున మెఱసెదరు కురునికాయము[3]నడుమన్.

226 వ. [1]దైవంబు బలవంతం బనిన విని సంజయుం డజ్జననాథునితో దేవా వినుము
వగచినం గృతపడిన కార్యంబు గ్రమ్మఱం బోదు మునుపె యెందును గుందు
నంతియ కాక యట్లుం గాక నీవు సేసిన యదియ [2]చూపె ఫలించె నందనంబు
వలదని యెన్నిభంగులం జెప్పినం బాండవులకుం గీడు దలంచి యప్పలుకులు
గైకొనవైతివి వారల[3]వలన మున్న నేకపాపంబు లాచరించితి నీవల[4]న జన
క్షయంబు వాటిల్లెం గావునఁ గడపంబడిన దానికి వగపం బనిలేదు దారుణం
బైన గణప్రకారంబు వినుమనుటయు నతండు కర్ణుం డట్లు వడసిన కారణంబుఁ
దొడంగి యెఱింగింపు మనుటయు నమ్మానవేశ్వరునకు నా సూతనందనుం
డిట్లనియె.

---

221 1. కర్ణుఁడెట్లు (డట్టి) కలన - అనియు పాఠములు.

223 1. నందు మొలచి - అ.ఆ.ఐ.ఝ.ల ; నందు మోచిన - వ. 2. దుర్భరదుఃఖ - కొన్ని ప్రతులు.

225 1. నొక్కండైనను నొవ్వఁడింతయును - అ.ఆ.ఇ.వ.పీ.వ. మున్నగు పెక్కు ప్రతులు నొకఁడుండైనను నొవ్వఁడంతయును - శ. 2. నడుమ మెలంగెడు - జ.వ.శ.మ;పీ. 3. నెదుర్ - అ.ఆ.ఇ.ఈ. మున్నగు ప్రతులు ; మునుముఁ - స.

226 1. దైవబలం బె బలవంతం బని - ఊ.చ.జ.ద. 2. సూఫలించె - ఈ.వ. 3. యెడ - పీ.శ. మున్నగు పెక్కు ప్రతులు. 4. నసంగ్యజన, ననీజన - అని పాఠములు.

227 క. రేపకడ సకలబలములు, భూపాలురు వెడలి నడువఁ బోరికి విదపన్
నీపుత్త్రుఁడు వెడలెను సాటోపతఁ దమ్ములును గర్ణుఁడును దో నడవన్.

228 వ. అయ్యవసరంబున.

229 సీ. రథము రథమ్ముఁ జేరఁగఁ దెచ్చి యమ్మేదినీశ్వరుతోఁ గర్ణుఁ డిట్టు లనియె
నాకుఁ గృత్యంబు లనేకముల్ గలిగె ము న్నాధనంజయునకు నట్ల కాన
యీరసంబున మాకు నిద్దఱ కొండొరు విడువక పెనఁగఁ జొప్పడద యింకఁ
గల[1]హ మెుక్క మొగంబు గావున నేఁ డేను దలపడి పోరుదు మలపుఁ జలము
ఆ. నుల్లసిల్ల నొక్క[2]రొకరుని నొంపను, జంపఁ జూతు మానిలింపశాఖు
వలనఁగన్నశక్తి వొలియుట నామీఁద నలుకు లేక తలుము నాతఁ డధిప.

230 వ. అప్పుడు చే నెత్తురు గా కుండ నక్కిరీటి గీ టడంగించు విధం బూహింపుము.

231 చ. సరి యగు నాకు దివ్యశరజాలములం దలపోసి చూడ న
న్నరుఁడు దృఢత్వ లాఘవగుణంబులఁ దక్కువ దూరపాత వి
స్ఫురణఁ గరంబు [1]వట్రపడు భూవర సౌష్ఠవరేఖ నేమియున్
దొరయఁడు ధైర్య[2]శౌర్య పటు దోర్విభవంబుల హీనుఁ డెంతయున్.

232 క. మును విశ్వకర్మ [1]దేవేంద్రునకై నిర్మించె మహిత రూపము విజయం
బను చాపము దానను బహు, దనుజుల మర్దించె నతఁ డుదగ్రస్ఫూర్తిన్.

233 చ. పరిచయసక్తచిత్తుఁ డయి భార్గవరాముఁడు నాతఁ డిచ్చినం
బరుష పరాక్రమమ్మున నృపాలుర నెల్లను నమ్మహాభుజుం
డిరువదియొక్కమాఱు సమయించెఁ దదీయ నితాంత శక్తి న
ప్పరమదయాపరుం డొసగెఁ బార్థివ నాకది గూర్మి పెంపునన్.

---

229 1. మొనమొగియదు — వీ. 2. రొకళుల — ఉ.ఒ.వ.

231 1. తొట్రుపడు —పిస ; పట్టువడు — శ.వ. 2 సార — ఈ.ణ.త.వ.

232 1. యుకుమారునకై — ఐ.ఒ.క.ఖ. విజయమనుధనుస్సును విశ్వకర్మ ఇంద్రునికొఱకై నిర్మించినట్లు మూలమున కలదు.
"ఇంద్రార్థం ప్రియకామేన నిర్మితం విశ్వకర్మణా" — చిత్రశాలాప్రతి - 8 - 031-42.

234 ఉ. ఆ మహనీయ చాపమున నర్జును దర్పమడంచి నేఁడు సం
గ్రామము [1]నుజ్జగించెద నకంటక సుస్థితి గల్గ మేటినై
భూమి [2]యమర్చెదం గొనుము భూవర నీదగు పుత్త్ర[3]పౌత్త్రులన్
శ్రీమహి[4]మన్ సమస్తజన సేవ్య మహోన్నతిఁ బొందు నట్లుగన్.

235 వ. అని పలికి వెండియు నిట్లను నా విజయంబును విజయు గాండీవంబును నొక్కరూప యతనికి నక్షయతూణీరంబులు నగ్నిదేవుం డిచ్చిన యభేద్య రథంబును [1]ననధ్య రథ్యంబులుం గల వవి యెక్కుడయినను దానికంతఁ జింతింప.

236 క. నారాచము లాదిగఁ గల, ఘోరప్రదరములు బండ్లఁ గొని వచ్చెద బల్
తేరులు దృఢవాజులు నా, తేరివెనుకఁ బెక్కుమర్చి తెచ్చెద నధిపా.

237 వ. మఱియు నొక్కం డాకర్ణింపుము భువనప్రవర్తకుం డయిన కృష్ణుండు సారథ్యంబు సేయుట నపార్థు పరాక్రమం [1]బసాధ్యంబై యుండు నట్లగుటం జేసి.

238 తే. ఖండనము నేర్పుమెయిఁ గృష్ణుపాటియనఁగ
మహిఁ బొగడ్తకు నెక్కిన మద్రనాథు
నాకు సారథిగాఁగ నొనర్ప వలయు
గెలుతు నట్లైన నన్నరు నేను మఱియ.

239 క. హరి కెక్కుడరయ మద్రేశ్వరుఁ డశ్వజ్ఞానమున నసంశయ మేన
న్నరునకు మిక్కిలి బలవి, స్ఫురణంబునఁ గర్మకుశలబుద్ధిఁ దలంపన్.

240 క. కావున నవ్వర [1]మిమ్మటు, గావించుట యెల్లహితముఁ గావించిన య
ట్లైవెలయు నింత సేసి మహీవరననుఁ జూడు పోర [2]నె ట్లేచెదనో.

---

234 1. నంజరించెన, నంజయించెద — అని పాఠములు. 2. యొనర్చెద — ఇ.ఊ.ఎ.ప.ల.ౘ.. 3. పౌత్రులున్ — కొన్ని ప్రతులు. 4. మోన్నతిన్ వెలయ జేయుము రాజ్యమఖండధీరతన్ — ఒ.

235 1. రనవథ్యథ్యంబును — కొన్ని ప్రతులలో లేదు.

237 1. బుసర్ధమంబై యుండు — స.

240 1. మిమ్మెయి గావించుట — కొన్ని ప్రతులు. 2. నెటుచేసెదనో — త.వ.

241 క. విను[1]మిత్త్రుఁడగున నేన, య్యనిమిష వర్గంబునైన నాజి జయింతున్
మనుజులు పాండుతనూజులు, జననాయక నాకు నొక్క సరకే తలఁపన్.

242 వ. అనిన విని నీపుత్త్రుండు ప్రీతుం డయి రాధేయు నగ్గించి నీకెల్ల భంగిని
శల్యు సారథిం గావించెద నని పలికి యుత్సాహదీప్తుం డై.

243 క. అమ్ముల బండ్లును రథర,థ్యమ్ములునుం బెక్కు దెత్తు నవనీశులు నా
తమ్ములు నేనును నీపా,ర్శ్వమ్మున నడచెదము బర[1]వసంబు గ్రముగన్.

244 క. అని చెప్పి ప్రీతుఁ డగునా,తనిఁ దోడ్కొని నడచి సముచితంబుగ శల్యుం
గని భక్తిఁ బ్రణతుఁడై యి,ట్లను దుర్యోధనుఁడు సవినయముగ నతనితోన్.

—: దుర్యోధనుఁడు శల్యునిఁ గర్ణునకు సారథ్యంబు సేయు మని ప్రార్థించుట :—

సం. 8—23—1

245 సీ. సత్యవ్రతంబును శాత్రవదుర్దశాపాదనంబును మహాభాగతయును
నీకు నైజంబులు నాకుఁ బెద్దయుఁ గూర్తు గావున నిన్నేను గారవించి
వినతుండనై వేఁడికొని యెద రాజుల నడుమ నీ దగు సౌమనస్య మెఱిఁగి
యర్జును ననిఁ దెగటార్పఁగ వలయుట యూహించి [1]సంభృతోత్సాహశీలఁ
ఆ. గావు మితని ననుచుఁ గర్ణునిఁ జూపి యీ, తనిరథంబు గడపు మనఘ యిట్టి
లైన నితఁడు వగఱఁ బో నీక పొదివి య, స్ఖలితగతుల నొంపఁ జంపఁ జాలు.

246 చ. గురుఁడును భీష్ముఁడుం [1]జనినఁ గొంచెపు మూఁకలతోడ నేను సం
గరవిజయంబు గోరి భుజగర్వమునన్ నడి నన్న పాండుభూ
వరసుత[2]వర్గముం [2]దొడరు వాఁడన[3]కా మది నిశ్చయించు టె
వ్వరిగొని యింత నీ వెఱుఁగవా నినుఁ గర్ణునిఁగాదె [3]నమ్మితిన్.

---

241 1. మిత్త్రుఁ డగ్గైనను నే (ననిమిష — న ; వినుమటు లైనను నే )నయ్యనిమిష - వ.

243 1. వసముదగ్రముగన్ - ఊ.వ.పి.శ.మ ; వసముగ్రమ్మంగన్ - వ.

245 1. సంగరోత్సాహ - ఊ.వి.

246 1. జడిన, దెగిన — అనియు పాఠములు. 2. గర్వముం దొడరు — వ. 3. దునుము వాఁడనకా — ఉ.న. 4. నమ్మితిన్ - ల.

247 క. [1]ఇమ్మిమ్మవ్వరమ్ముమ్మ సారథ్య మిమ్మతనికిఁ జేయు [2]మినున కరుణుఁడు సాహా
య్యమొనరించినట్లుగఁ దివిరమ్ముక్రియఁ రూపుసెడి యరాతు [3]లడంగన్.

248 క. [1]అనిన విని కెంపుసొంపునఁ
గనుఁగవ యుగ్రముగ బొమలు గదియఁగ ఫాల
మ్మునఁ జెమటవోడమ నీసుతుఁ
గనుఁగొని యిట్లనియె నతఁడు [2]కటము లదరఁగన్.

249 సీ. ననునింత నీచపుఁ బనికిఁ [1]బంపఁగ నీకుఁదగునె భూవర [2]వర్ణధర్మవిధము
లెఱుఁగవే శూద్రుల కేనాఁటఁ బరిచర్య సేసిరి మూర్ధాభిషిక్తులైన
రాజులు సూతజు రాధేయు దొరఁ జేసికొని యేను సారథ్యమునకు జొరఁగఁ
జాల నీతని [3]బల[4]శాలిఁగాఁ దలఁచెదు [5]నాకంటె నిట్టిబన్నంబుఁ గలదె

ఆ. పగఱలోననొకనిఁ బాల్పెట్టు [6]మెట్టివాఁ, [7]డైన నసముఁ జూచి యరుగువాఁడ
నట్టిభంగి [8]సాలదం[9]చేనిఁ దరవాయి, గొని వధింతు శత్రుకోటి నెల్ల.

250 క. విను నేను విక్రమింపఁగఁ, గనుఁగొనియెడు[1]నంతవాఁడుఁ గలఁడే కుల్యశై
లనికాయం[2]బుల వగలుతు, వననిధులు గలంతు ధరణి [3]వ్రత్తుం గలయన్.

---

247 1. ఇమ్మిమ్మవ్వరమితనికి నహాజమ్మగ నినునకు ననూరు సారథ్య సహాయ మొ్మదవి – న. 2. వినత తనయు సహాయత్వ మొ్మనరిన గరిగతి – న. దేను నమ్ములు సహాయ మ్మొనర నర్కుఁ గని తిమిరమ్ము – న ; మిత్రునర్కుని సహాయ్యమొనరినట్లుగా – పి. 3. లుసరగాఁ – కొన్ని ప్రతులు.

248 1. అన విని రూక్షపు పెంపున (గెంపున) – త.వ. 2 కటకటబడుచుఁ – అ.ఆ.ఒ. ఝ,జ.ల ; గర్వస్ఫూర్తిఁ – త.వ.

249 1. జెప్పగ – ద. 2. వినుధర్మ – ఆ.ఝ ; ధర్మతత్వవిధము – ఈ.త.వ. 3. బహు శాలి – పెక్కు ప్రతులు. 4. శాలినలంతె నాకంటెను నీతండు ఘనుడె చెపుము – ల ; 5. నాకింతకంటె బన్నంబుగలదె – న. 6. మేవాని కైన – ద. 7. డై ననము య జూచి కొనియుడుగ – క.డ. 8. పోలి – న. 9. చేనితరువాయి – శ.ష (ఏనిని పిరుద్రుతాంతముగా గొనలేదు).

250 1. వాడొకండు గలడే – త.వ ; నంతవారు గలరే – కి.శ.ష. 2 బువగుల్తును – శ.ష.వ. మున్నగు ప్రతులు. 3. వ్రక్కలు జేతుఁ – వ.

251 చ. నరవర చూడవే తెలియ నాదగు[1]బాహుబలంబు మద్బలంబు నీ
వరయక పల్కితే నొకని కక్కట సారథినై [2]రథిత్వ వి
స్ఫురణము [3]దక్కనోపుదునె సూతతనూజుఁడు షోడశాంశముఁ
దొరయఁడు నాకు వాసవసుతుఁ ముర[4]మర్దనుఁ జీరికిం గొనన్.

252 వ. ఇట్లగు పెలుంగక చెప్పితి వెఱింగియుం గర్ణుపక్షపాతంబున నన్నవమానించె
దేని మాభూమికిం[1]బోయివచ్చెద ననిపలికి రాజమధ్యంబుననుండి వెడలిపోవం
జూచినం గురు[2]పతి సప్రణయబహుమానంబునం జని [3]నిలువరించి సాంత్వన
స్వరంబున మధురాక్షరవిన్యాసంబుగా నతనితోఁ గర్ణుండ యేల [4]తక్కు
నీకెక్కుడయిన రథికులుం గలరే కడిందిపగఱకు హృదయ[5]శల్యం బగు[6]టఁ
గాదె నీకు శల్యుండను నభిధానం బయ్యె నాయభిప్రాయంబు వినుము
ధనంజయునకు రథికగుణంబులం గర్ణుండు [7]మిక్కిలి కృష్ణునకు నశ్వ
హృదయజ్ఞానంబున నీ వధికుండవు ధనంజయునకుఁ బ్రతివీరుంగా మనము
కర్ణుం జాలించితి మది కృష్ణుండు సెల్లనీ కునికిం జేసి కృష్ణువర్తనంబునకుఁ
బ్రతివిధానం బాచరింప నిన్నుం [8]గోరితి నింతపని నీకుందక్క నొరులకు
శక్యం బగునే యనిన విని ముదితహృదయుం డయి మద్రేశ్వరుడు.

253 క. ననుఁ గృష్ణుకంటె నధి[1]కుం, డని యిమ్మనుజేంద్రకోటి యాకర్ణింపం
గొనియాడితి విమలయశో,ధనుఁ డగు [2]కర్ణునకు రథము గడపెద [3]నధిపా.

254 వ. అని యాసూతనందను నుద్దేశించి వెండియు నిట్లనియె.

---

251 1. శౌర్యము — ఈ.జ.ణ.త.వ. 2. రథాంధ్యవిస్ఫురణ — అ.ఆ.ఒ.ల ; భుజాగ్రవి
స్ఫురణ — శ.ష. 3. లేక ద(త)క్కుదునె — అ.ఒ.ఝ.ల. 4. భంజను — అ.ఆ.
ఒ.ఝ.ల ; ఘస్మరు — ఎ.వ.

252 1. బోయెద — ఖ.గ.జ.వ. 2. పతిప్రణయన బహుమానంబు — ల ; పతిప్రణామ
బహుమాన పూర్వకంబున — జ. 3. నూరడించి — ఈ జ.చ.త.వ. 4. తక్కువ —
కొన్ని ప్రతులు. 5. శల్యం బవగుట — కొన్ని ప్రతులు. 6. టం జేసి — ఇ.ఒ.క.
ఝ.డ.ల ; టగదానీకు — ఊ. 7. డెక్కుడు — ఖ.గ. 8. కోరుకొని వచ్చితి
నీ పనికి నీవు దక్క — జ.

253 1. కుడువని యిమ్మనుజేంద్ర — అ.ఆ.న.ల. మున్నగు ప్రతులు. 2. రాధేయు
రథము — ద. 3. ననఘా — ఇ.జ.ట.వ.

255 క. జనవల్లభ యొకసమయము, విను మీతనితోడ నేను విచ్చలవిడిఁ దోఁ
చినమాట లెల్ల నాడుదు, ననునెగ్గులు [1]వట్టు కుండినం [2]బొందొనరుణ్.

256 క. అనుటయు [1]గారవముననీ,తనయుఁడు రాధేయుఁ జూచి తగు నిట్లగుఁ గా
కని పలికి శల్యునిం గనుఁ,గొని యిది గడుతెప్ప యనియెఁ గురువంశనిధీ.

257 వ. ఇట్లభినందించి యన్నరేంద్రుం డమ్మ[1]ద్రపతి మనం బురియాడునో యని శంకించి యతనితో మఱియు నిట్లను నివ్విధం బాచరించుటకు విచారంబు వలవదు తొల్లింటిపెద్దలవృత్తాంతంబు వినుము మార్కండేయమహాముని మాతండ్రి [2]కేనువిను చుండఁజెప్పిన యది నీకుం జెప్పెద సురలతోడి దురంబున నసురవరుం డగు తారకుండు దెగినపిదపఁ దదీయతనయులు విద్యున్మాలియుఁ దారకాక్షుండును [3]గమలాక్షుండును ననువారలు వారిజాసను నుద్దేశించి.

-: దుర్యోధనుఁడు శల్యునకుఁ ద్రిపురాసురుల వృత్తాంతంబు సెప్పుట :-

సం. 8-24-1

258 క. దమమున నియమంబున ను,త్తమమును ఘోరంబు నైన తప మతినిష్ఠం
బ్రముదితులై చేయఁగ నక్కమలభవుఁడు [1]దోఁచి పరమకారుణ్యమునణ్

259 వ. వరంబులు [1]గోరికొం డనవుడు వా రందఱు నొక్కమాటయకా సకల భూతంబుల వలనను సర్వకాలంబుల యందును నవధ్యత్వంబు మాకు నీయ వలయు నని యడుగుటయు నయ్యజుండు.

260 క. ఆ చంద మెందుఁ గల దది, గోచర మే [1]యిచ్చుటకును గొనుటకుఁ దగుమై
నూచి యడుగుండు శుభదం, బై చెల్లెడునట్లుగాఁ బ్రియంబున నిత్తున్.

---

255 1. వల్కకుండినణ్ — వ.స. 2. బోరడతుణ్ - ఐ ; బొందమరుణ్ — వ.

256 1. గారవమున — పెక్కు ప్రతులు ; గౌరవమున — వా.

257 1. ద్రేశ్వరుచిత్తంబురియాడు — పీ.శ. 2. కినేము — కొన్ని ప్రతులు. 3. కనకాక్షుండు — ఐ.

258 1. వారి మెచ్చి (జూచి) - అనియు పాఠములు.

259 1. వేడికొనుం డనవుడు — కొన్ని ప్రతులు.

260 1. యిచ్చువరముగొనదుతగవుమై — స.

261 వ. అనపుడు నయ్యసుర లట్లేని మాకు ముప్పురకు మూఁడు పురంబు లెల్ల సుఖంబులుం గలిగి కామగమనంబులై దేవదానవయక్షోరగాది జాతులకుం జెలుపరాక విలసిల్లునట్లుగా నొసంగు మేము భవత్ప్రసాదంబు సొంపున నిర్భయులమై పెంపొంది సంచరించెద మటుటయుఁ బద్మభవుం [1]డిదిలెస్స దీనికిఁ దుది యిట్టిద యని నుడివి యిట్టిది గా కుండ నప్రమత్తులరై వర్తిలుం డనిన నద్దనుజేంద్రు లప్పురంబు లెప్పు డొక్కెడం గూడె నప్పుడు బలియుం [2]డగువాఁడు సెలుపం దలంచినం జెడునదిగా నొదంబడితిమి త్రిపురంబులు సంగతంబులుగాకున్న నసాధ్యంబులై వెలయవలయు నని పల్కిన నద్దేవుండు మీరు పురత్రయంబు[3]ను సంపాదించు కొనుం డేనమ్మహానుభావంబులం బొందునట్లుగానిచ్చితి నని నిజస్థానంబునకుం జనియె నిత్తెఱంగున.

262 తే. వరము వడసిన యాదైత్యవరులు దమకుఁ
బురము లొనరింప దానవపూజ్యు మయుని
వేఁడికొనుటయు నాతఁడు [1]విపులతపము
కలిమి [2]సొప్పారు పురవర్మములు ఘటించె.

263 వ అవియుం బ్రాకార గోపురప్రాసాదప్రముఖ [1]వివిధావయవంబులు పసిండియు వెండియు నినుమును నై నాల్గుదిక్కులు నూఱేసి యోజనంబులు గలిగి యుండు నందుఁ బసిండిం జేసినయది దివంబునను వెండి నొనరించిన యది యంతరిక్షంబునను నినుమునం గావించిన యది భూమిని [2]సంచరింపను వరుసన వానికిం దారకాక్షుండును గమలాక్షుండును విద్యున్మాలియు రాజు లయి దివ్యంబులగు నంబరంబులను నాభరణంబులను మాల్యానులేపనంబు లను మఱియు ననేకవిభవంబుల నుజ్జ్వలులై నెగడుదురిట్లు పురత్రయ విహారంబున జగత్త్రయంబును నాక్రమించి యసురత్రయం బప్రతిహత విభూతిమై వర్తించు నమ్ముప్పురుం దన్ను నాశ్రయించుటం జేసి వారల యోగ క్షేమంబు లరసికొని యెవ్వరికి నెయ్యది యిష్టం బయ్యది యెల్లం దన

---

261 1. డిట్లనునిదిలెస్స — కొన్ని ప్రతులు. 2. దెవ్వాడు, దైనవాడు — అనియు పాఠ ములు. 3. గావించుకొనుండేనప్పుడు — అ.ఆ.డ.ల.

262 1. విమల — వ. 2. సొంపారగా పురంబులు ఘటించె — కొన్ని ప్రతులు.

263 1. వివిధోపవనయుతంబులంజేసి పసిండి — ఊ; వివిధోపమాన భవనంబులు — కొన్ని ప్రతులు ; వివిధోపేతంబులం జేసి — ఇ. 2. సంచరించునట్లుగా వరుస — ఎ.ఐ.ఒ.శ.ష.

మాయాబలంబున మయుం [3]డొదవించుచుండు నవ్విధంబునఁ బరమ
[4]సౌఖ్యంబు లనుభవించుచుండ బహుకోటి సంవత్సరంబులు సనియె
నట్టియెడ.

264 సీ. తారకాక్షున కొక్క తనయుండు హరియన
[1]జనియించి వారిజాసను గుఱించి
తపము సేయంగఁ బ్రత్యక్షమై యద్దేవుఁ
డడుగుము వరమన్న నతఁడు త్రిపుర
ములవార లాయుధంబులు దాఁకి చచ్చినఁ
బీనుఁగుల్ నీరిలోఁ బెట్టి నడుప
నొక్కఁడు వదుగురై యెక్కుఁడు లావును
బీరంబు మెఱయ సంప్రీతి నుల్ల

ఆ. సిల్లునట్టి బావి నిరసరతోయమై
మా పురములఁ జిత్రమహిమ [2]వెలయ
నావహిల్ల వలయు ననిన నిచ్చితి నని
యమ్మహాత్ముఁ డరిగె నదియుఁ గలిగె.

265 వ. ఇట్లు మహాప్రభావంబైన [1]యబ్బావి వడసి యప్పురంబులవారు పోరికి శంకింపక నిర్జర భయంకరులగుచు భువనంబులన్నియు బాధించుచుం బెఱిఁగి లోభ మోహ వశతం బొంది విచ్చలవిడిం దిరుగం దొడంగిన దేవపితృముని జనస్థానంబులకు హానిపుట్టినం బురందరుం డఖిల బృందారకులుఁ బరివేష్టింప నప్పురంబులపై నెత్తిచని పెనంగి భేదింపంజాలక విషణ్ణుం డయ్యె నంత నతండు దివిజులుం దాను సంయమి [2]సహితుండై చతురానను పాలికిం బోయి ప్రణామపూర్వకంబుగా నద్దానవుల తెఱంగెఱింగించి తద్వధోపాయం బడిగిన నతండు వారలకిట్లనియె.

---

3. డొసరించు — కొన్ని ప్రతులు. 4. సుఖంబుల — కొన్ని ప్రతులు.

264 1. జన్మించి — అ.ఆ.ఐ.ఒ.ఛ. 2. మెఱయ — ణ.త.వ.

265 1. యప్పురంబువడసి — ఏ.జ.గ.వ.స. మున్నగు ప్రతులు; యవ్వాపివడసి — ట.బ.
2. సహితుఁడై చతురానన — శ. మున్నగు పెక్కు ప్రతులు. చూడు. బాల. వ్యా. క్రియ. 120.

266 ఉ. ఏచిన యా పురత్రయము నేకశరంబున రూపుమాపఁగాఁ
జూచినఁ బోవుఁగాని పెఱచొప్పునఁ బోవదు సంగరోన్ముఖుం
డై చనుదెంచె నేని మదనాంతకుచేనది సెల్లు [1]నొండ్లకు
[2]న్గోచర మెట్లగుం జనుఁడు గొబ్బున నమ్మహితాత్ము పాలికిన్.

267 ఆ. అనిన నట్లకాక యని దివ్యవర్ష సహస్రకంబు వారలధిక నిష్ఠ
నతుల తపముసేసి యత్యంత శుద్ధాత్ములై మహేశుకడకు నరుగు నపుడు.

268 వ. అవ్విరించి బ్రార్థించి పురస్సరుం జేసికొని యరిగి

269 క. వరదు శరణ్యు శశాంక, స్ఫురితశిరోభాగు సర్వభూతేశ్వరు శం
కరు సాంఖ్యయోగనిష్ఠా,పరసులభు ననంగ[1]దమనుఁ బరమాత్ము శివున్.

*—: త్రిపుర సంహారము కొఱకు బ్రహ్మాదులు రుద్రుని బ్రార్థించుట :—*

సం. 8—24—37

270 వ. కని ఫాలంబులు భూమిసోఁకఁ బ్రణమిల్లిన నద్దేవుండు లెండు మీరాకకుం
గారణం బేమి యనవుడు లేచి నిలిచి వారు కరకమలంబులు భక్తి మొగిడ్చి.

271 క. స్తుత్యానుభావ నిర్మల, నిత్యానందస్వరూప నిగమవిరోధి
స్థిత్యపనయనోన్ముఖ చిత్సత్యాత్మక భక్తలోక దౌర్గత్యహరా.

272 వ అని మఱియు ననేక ప్రకారంబుల బ్రస్తుతించినఁ బ్రసన్నుండై భవుండాద
రించి మీకు భయంబు వలవదు మీచెప్పినయట్ల చేసెద వలయుకార్యం
బెయ్యది యనిన దేవమునిసంఘంబులు ప్రహర్షంబు నొందె నరవిందభవుం
డప్పరమేశ్వరున కిట్లనియె.

---

266 1. నొడ్లకున్ — పెక్కు ప్రతులు; నొర్లకున్ — త.వ. 2. న్గోచరమెట్లగుంజనుడు గొబ్బున మీరు మహాత్ము పాలికిన్ — స. మున్నగు పెక్కు ప్రతులు ; న్గోచగ మట్టి యింతలు పనుల్ సనుడమ్మ — వా.

269 1. మథను — కొన్ని ప్రతులు.

273 సీ. ప్రజల[1]కుఁ బతిగాఁగఁ బనిచితి నీవు నన్నట్లు పదస్థుండ నగుటఁ జేసి
విచ్చలవిడి వరం బిచ్చితి [2]నసురత్రియమునకు దుర్గత్రియంబు గలిగి
యిమ్మువ్వురును దారుణాక్రమమున భువన[3]త్రయ సంబాధనం బొనర్చు
చున్నారు [4]వారల నోరులకు నుడుప శక్యముగాదు నీవు శీఘ్రంబ చెఱుప

ఆ. వలయు మునులు దేవతలు నేను శరణుచొ, చ్చితిమి నిన్నుఁ గరుణ జేకొనంగ
వలదె [5]మమ్ము నోరులు గలరె [6]జగంబులు, గావ భూతనాథ నీవుదక్క.

274 వ. అనవుడు నద్దేవుం డయ్యసురులు సెఱు[1]పవలయువా రగుదురు వారల బల
వంతు లేనొంటిమై నాపనికి సుత్సహింపనేర మదీయంబులయిన తేజోబలంబు
లం దర్థంబు పుచ్చికొని మీరందఱుం గూడి యాదుష్టదైత్యుల మర్దించుట
కార్యం బనిన నద్దివిజులు మాకందఱకుం గల తేజోబలంబులకు న[2]ద్దనుజుల
తేజోబలంబులు రెట్టియయి యుండు నట్లగుటం జేసి మాచేతం జెడరదెయు
నుం గాక భవదీయ తేజోబలంబులు భరియింప మేము శక్తులముగాము మా
యందఱ తేజోబలంబు[3]లలో సగంబు పుచ్చికొని నీవ యాశత్రుల సమయింపు
మెల్లభంగిని నీకు రక్షణీయుల మగు మమ్ము రక్షింపు మనుటయు నజ్జగన్నా
థుండు.

275 క. అమరులకు నసురులకు నే, సముఁడ శివం బఖిల భూతజాలంబులకున్
సమత నొనరింప శివనా, మము నాకుం [1]జెల్లు లోకమాన్యం బగుచున్.

276 వ. అయినను.

277 చ. అనయముఁ గ్రూరకర్ములగు నట్టి విమూఢులఁ బిల్కుమార్పఁ బూ
నన తగు ధర్మ[1]వర్తను లనంజను మీయెడ ద్రోహులైన య
ద్దనుజులఁ ద్రుంచి మీకుఁ బ్రమదం బొనరించెదఁ దేజమున్ బలం
బును [2]సగపాలు వెట్టి ననుఁ బొందఁగఁ జేయుఁడు మీరలందఱున్.

---

273 1. సుస్రుజియింప — ఇ. 2. నేనసురత్రియంబునకు దుర్గత్రియంబు — శ.వ. 3. త్రయంబును బాధ నలుచుచున్న — కొన్ని ప్రతులు (అఖండవడి చూడవలెను); 4. వారలనుడుప, నెవ్వారికి శక్యంబు తరిగాదు శీఘ్రంబ చెరుప నిపుడ — ఆ.ఔ. క.ఖ.గ.ల.స. 5. యింక — ఎ.గ.వ. 6. యీ త్రిజగంబు గావ — కొన్ని ప్రతులు.

274 1. పందగినవారలు — ఆ. 2. ద్దితిజుల — ఎ.ఖ.గ. 3. లందర్థంబు — ఊః.

275 1. జెల్ల — ల. మున్నగు కొన్ని ప్రతులు.

277 1. వర్తులరునాజను — ఇ.ఐ.క.ల. 2. సగబాలు — కొన్ని ప్రతులు.

278 వ. అని మఱియు నొక్కటి సెప్పెద లోకంబులకెల్లను బశుత్వంబును నాకుం బశు[1]పతిత్వంబునుం గావలయు నట్లయినఁ బశుహననంబునం బాపంబు లేకుండు.

279 క. ఒనరింపుఁడు దివ్యరథంబును దచ్చోదకుని నశ్వముల విల్లును న
మ్మును నాకు నట్టులైనను, దనుజుల దుర్గములు వినిహతములగు నా చేన్.

280 ఆ. అనిన విని పశుత్వమునకు శంకించి విషణ్ణులైన సురల చందమెఱిఁగి
భయము గొనఁగవలదు పశుభావమోక్షణ, [1]విధియుఁ గలదు దాని వినుఁడు మీరు.

281 వ. అని పలికి హరుండు వారలతోఁ బాశుపత వ్రతానుష్ఠానంబునం బశుత్వ మోక్షణంబగు నదియును ద్వాదశాబ్దంబులు నడపవలయు నిష్ఠానురూపం బుగా సంవత్సరంబునఁ దదర్ధంబున ఋతువున మాసంబునఁ బండ్రెండు దినంబుల మాత్రను ఫలించుననుటయు నట్లకాక యని వారలందఱును లోకంబులకు లోకేశ్వరునకుఁ బశుత్వంబుఁ బశుపతిత్వంబు గలుగుటకు నొడంబడి యమ్మహాత్మునిఁ బశుపతివని పేర్కొని నిజతేజో బలార్ధంబులు సమర్పించినం గైకొని యత్యధిక బలుండై తొల్లింపకంబై వెలింగె నప్పు డద్దేవునకు దేవతలు విభవం బెసఁగఁ బురహననంబునకయి యభిషేకంబు సేసి త్వష్ట నాలోకించి మహాదేవునకు దివ్యరథంబును దగియెడు సాధనంబులను గల్పింపు మనవుడుఁ దపఃప్రభావమహనీయుం డగు విశ్వకర్మ యుప హితుండై.

282 సీ. సామర్థ్య మొప్ప విశ్వంభరా చక్రంబు రథముగఁ జేసి చంద్రుని నుష్ణ
కరునిఁ జక్రంబులుగాఁ బెట్టి [1]వారిధి నక్ష మొనర్చి హిమావనీధ
రంబున వింధ్యనగంబున నస్తాచలంబున నుదయ[2]శైలమున బలుప్ర
టవయవంబులు దీర్చి యగ్నులమూఁటఁ ద్రివేణుకరచనఁ గావించి మేరు

---

278 1. వశిత్వంబు — ద.

280 1. మనఁగగలదు — అ.ఆ.ఐ.ద.ల.

281 1. పశుత్వంబు లోకేశ్వరునకు పశుపతిత్వం బొసంగుటకు — శ.ష.

282 1. యిరుసుగానబ్ధినొనర్చి — ఊ.ప ; మందర పర్వతము అక్షముగా చేయబడినదని మూలము. "మందరః పర్వతశ్చాక్షో జంఘాతస్య మహా నదీ" 8-34-20 చిత్రశాలా ప్రతి. 2. శైలంబునవయ / వంబులు దీరిచి వర్గత్రయము నం ద్రివేణూ — పీ.స.

ఆ. పర్వతమున నాతపత్త్రింబుఁ గల్పించి, హరులు వేదములు శరాసనంబు
వత్సరంబు శరము [3]వాసుదేవుండును, గాఁగ సంఘటించె గౌరవమున.

283 వ. ఇట్లు చరాచరాత్మకంబై తేజరిల్లు నత్తేరు వీక్షించి ఫాలాక్షుండు గ్రహ మండిత వ్యోమ మండలం బు[1]పాదాన కారణంబుగా విశ్వకర్మ గావించిన కవచంబు దొడిగి శరాసనంబు ధరి[2]యించి శరంబు పుచ్చికొని దానవ సంత్రాసనోత్సాహుం డగుచు రథారోహణంబు సేసి వృషభధ్వజంబునం బొలుపొందె.

284 ఆ. అప్సరోగణంబు లాడుచుఁ బాడుచు, సంతసమునఁ జెలఁగ సకల మునులు
బహువిధములఁ దన్నుఁ బ్రస్తుతి సేయంగ, నమరవరులఁజూచి యల్లనగుచు.

285 క. సారథి యెవ్వం డనుటయు, వారలు నీ చిత్తమునకు వచ్చినవానిం
గారుణ్యంబునఁ గైకొని, తేరునడపఁ బనుపుమనిరి ధీరవిచారా.

286 వ. అనవుడు నద్దేవుండు.

287 తే. అరయనెవ్వాఁడు నాకంటె నధికుఁడతని
మీరయెఱిఁగి యొనర్పుఁడు సారథిత్వ
మునకు నని చెప్పుటయు మహామునులఁ గూర్చి
కొని యమర్త్యులు [1]సంభృత వినయు లగుచు.

---

3. వాసు సోమాగ్నులు — పి.స. వాసుదేవుడనుటకు 'వాసు' అను ప్రయోగము నూతనముగా నున్నది. ఇచ్చట మూలము "ఇషుశ్చా పూభ వద్విష్ణుర్జ్వలన స్సోమ ఏవచ" 8-34-49 — చిత్రశాలా ప్రతి.

283 1. ప్రధానకార (క) ణంబుగా — ఎ.ఐ.వ.
2. యించి విష్ణుసోమాగ్ని సంభవంబై వెలుంగు శరంబు. — పి.స.

287 1. సంజాతవినయు — ఎ.ఖ.గ.వ.

288 వ. కమలాసను కట్టెదిరికిం జని భక్తిం బ్రణమిల్లి దేవా నీవలన నీలగ్రీవుండు ప్రసన్నుం డయ్యె భవదాజ్ఞ నేమితనికి రథంబుం దగు సాధనంబులు సమకట్టితిమి సారథి దొరకకున్న వాఁడది[1]యెట్లనిన సారథ్యం బాచరించు పురుషుండు బల[2]సత్త్వంబుల రథికునకధికుండు గావలసియుండు రథంబు పృథ్వి రథ్యంబులు వేదంబులు రథికుండు రుద్రుండు రథచోదకుండు సులభుం డగునే గుణాధికుండ వగు నీ విప్పనికిం బూనవలయు దానవ భయభ్రాంతుల మైన మమ్ము రక్షింపుము మా కేడుగడయు నీవ భవదీయ ప్రసాదంబున బ్రదికెద మని చాఁగిలి మ్రొక్కినం బరమాదరంబున నెత్తి యప్పరమేష్ఠి వారలం గారుణ్యంబునం గనుంగొని.

289 ఉ. మీరు నిజంబ చెప్పితిరి మిక్కిలి నేర్పును లావుగల్గినన్
సారథి పోరులన్ రథికసత్తముఁ డాగెలిపించు బుద్ధి దో
స్సార విలాస భంగులకు శర్వుఁడు మెచ్చఁగ నాగమాత్మకో
దార హయంబులన్ నడపెదన్ దనుజుల్ [1]వెఱఁగందు నట్లుగన్.

290 వ. అని పలికి సురగణంబు ముదంబునం బొదలఁ దనచేతి కమండ[1]లు వొక్కెడ నిడి జడముడి బిగియించి [2]యజిన పరిధానంబు దృఢంబుగా బంధించి ప్రణవంబునం ద్వష్టయొనర్చిన మునికోల పుచ్చికొని నొగ లెక్కె నిట్లు లోకపితామహుని సురలు శంకరునకు సారథ్యంబు సేయించి రని చెప్పి దుర్యోధనుండు వెండియు నిట్లనియె.

291 క. హరులమ్మహోత్ము లిరువుర, భరియించుట కోర్వలేక పడుటయు నెత్తెన్
[1]వెరవున [2]లావున [3]వాగెలు, ధరియించుచుఁ బద్మభవుఁడు ధరణీనాథా.

---

288 1. యల్ల వినుము - అ ఆ.ఒ ఝ. 2. సత్త్వస్ఫురణంబుల - అ.ఆ. మున్నగు ప్రతులు.

289 1. వెగడందునట్లుగన్ — కొన్ని ప్రతులు.

290 1. లంబొక్కెడ — కొన్ని ప్రతులు. 2. యభినవ పరిధానంబు - త.వ.

291 1. ఉరుసత్త్వంబున వాగెలు — ఎ.గ. 2. వాఝుల - స. 3. వాగలు — ప.బ.ల.

292 వ. ఎత్తి యత్తురంగంబులకు వెండియు వీర్యశౌర్యంబులు గలుగ ననుగ్రహించి రథంబు [1]గడపం దత్కాలంబు గానియాడి కాసుదనుసుం దాదనుజుల దుర్గంబుల దెసకు నరదంబు పఱపుము నేఁడు జగంబుల యలజడి మాన్చెద నాచేతి [2]బలువు సూడుమని పలికిన నప్పరమ సారథి మనోమారుత జవ సత్త్వంబులు గలుగు నవ్వేదాశ్వంబులం బఱప [3]నథర్వాంగిరసులు చక్ర రక్షకులయి చనుదేర నత్తేరాపురంబుల [4]కడరిన నయ్యాదిమరథికుండు.

—: రుద్రుఁడు త్రిపురంబుల సంహరించి సురల సంతోషపఱచుట :—

సం. 8—24—117

293 సీ. కోపసందీప్తుఁడై చాపంబు సజ్యంబు గావించి మౌర్వి మార్గణముఁ గూర్చి
పాశుపతాస్త్ర [1]సంబద్ధంబుగాఁ జేసి పురములు మూఁటిని బుద్ధినిలుప
నవి యొక్కచోటికి నప్పుడకూడిన మునులును సురలును ముదము బొంది
గెలుగెలు మంచు నగ్గిం[2]ప నయ్యుగ్రుండు దెగవాపి యేసిన[3]దితిజయుతము
ఆ. గాఁ బురత్రియంబు కాలి నీఱై పడ్డ,మాద్రిఁ దొరఁగ నమ్మహాగ్ని లోక
ములు దహింపఁ జొచ్చెఁ బురహరుఁ డదిమాన్చె, సంతసిల్లె సకలజంతు[4]వులును.

294 వ. అప్పు డనిమిషమునిజనంబులు గృతకృత్యులయి భూతనాథుం బ్రణు [1]తించి యతం దనుమతిసేయ నంబుజాసనుండు లోనుగా నందఱు నిజ [2]స్థానంబులకుం జని రివ్విధంబున లోకహితార్థంబుగా నప్పరమేష్ఠి శివునకు సారథ్యం బనుష్ఠించె నీవు నట్లపోలెఁ గౌరవ రక్షణార్థంబుగా రాధేయు రథంబు గడపు మిక్కర్ణునకు నక్కిరీటికిఁ గృష్ణునకుఁ బలశౌర్యంబుల

---

292 1. నడపం - కొన్ని ప్రతులు. 2. బరువు - బలుపు అని పాఠములు. 3. నప్పుడాంగిరసులు — కొన్ని ప్రతులు. 4. (కడ) కరిగిన — అ.ఆ ఉ. మున్నగు ప్రతులు.

293 1. సంబంధంబు — పెక్కు ప్రతులు. 2. చిరయ్యుగ్రుండు - అ.ఆ.ఇ.ఈ. మున్నగు ప్రతులు. 3. దివిజరిపుయుతం బుగాఁ బురత్రియంబు నీఱై — స. 4. సమితి, చయము — అని పాఠములు.

294 1. తించి నమస్కరించిన — కొన్ని ప్రతులు. 2. నివాసంబులకు — కొన్ని ప్రతులు.

[3]నెక్కుడయిన వాఁడవు [4]మదీయజీవితంబును రాజ్యంబును భవదధీనంబులు వానిం గలిగింపను జయంబును [5]సుఖంబును గావింపను నీవ యొడయుండ విక్కార్యం బాచరించి నన్ను రక్షింపుమని ప్రార్థించి నీ పుత్త్రుండు మద్రపతికి మఱియు నిట్లనియె.

295 సీ. ఇదియొక్క యితిహాసమే నొద్దనుండ ధర్మప్రవీణుండగు బ్రాహ్మణుండు
ధృతరాష్ట్ర వసుమతీపతికిఁ జెప్పినయది వినుము భార్గవవంశమునఁ బ్రసిద్ధుఁ
డగు జమదగ్నికి నత్యంతనిర్మలమతి రాముఁ డుదయించె నతనిచేయు
తపమున హరుఁడు ప్రత్యక్షమైనిలిచిన నతఁడు దివ్యాస్త్రంబు లడుగుటయు

ఆ. నమ్మహాత్ముఁ డశుచు లైన వారలనవి, నిర్దహించుఁగాన నీవు పరమ
శుచివిగమ్ము నీకుఁ జొప్పడు నఖిల [1]మహాస్త్రవీర్య మనియె నాదరమున.

296 వ. అనినవిని జామదగ్న్యుండు వినతుండై నాకెప్పుడు [1]పాత్రత్వంబు గలిగె నప్పుడ [2]నీవుతలంచి దయ[3]సేతువు గాక నీకు శుశ్రూష సేయుచుండు నట్లుగాఁ బ్రసాదింప వలయునని విన్నవించిన విని కరుణాయుత్త చిత్తుం డగు భవుం డవ్వరం బిచ్చిన నమ్మహాత్ముండు నియమ నిష్ఠాపరుండై పూజోపహార ప్రముఖ విధానంబుల నద్దేవు నారాధించు చుండ ననేక సంవత్సరంబులు సన నొక్కనాఁడు పరమేశ్వరుండు [4]ప్రసాదలసితాననుండై గౌరీదేవికి నతనిం జూపుచు.

297 క. రాముఁడు [1]విమలవ్రతచ, ర్యామహితుఁడు [2]నాకు భక్తుఁడని పలుమాఱుం
దాముద్దుసేసి మృదువచ, నామృత సంసిక్తుఁ జేయు నాసమయమునన్.

---

3. మిక్కిలి యయిన – కొన్ని ప్రతులు. 4. మదీయాభిమతంబును – ఈ.ఓ.ఙ.ఠ.గ.వ.
5. యశంబును – త.వ.

295 1. దివ్యాస్త్ర వీర్య – ట.వ.శ్రీ శ.ష.

296 1. శుచిత్వంబు – అ.ఆ.ఐ.ఝ.డ.ల. 2. నీ తలంచినట్లదయ – శ్రీ. 3. సేసెదవు గాక – పెక్కు ప్రతులు. 4. ప్రమోదవికసితాననుండై – ఔ.త.వ ; ప్రహృష్ట లలితాననుండై – ప.

297 1. నియమవ్రత — క.ట. 2. మాకు భక్తు – ల.

305 వ. కావున వరప్రతిగ్రహంబున కిది[1]య సమయంబు.

306 క. కోను మని ది[1]వ్యంబగు నస్త్రనికాయము శస్త్రచయము దద్దయు దయని
చ్చిన నవి యాతఁడు సాష్టాంగనమ[2]స్కారంబు సేసి కైకొనియె నృపా.

307 వ. తదనంతరంబ లోకగురుండగు నా హరునిచేత ననుజ్ఞాతుండై యతండు నిజస్థానంబునకుం జనియె నయ్యితిహాస ప్రకారం బిట్టిది యివ్విధంబున వివిధదుష్కరసత్కర్మానుష్ఠాన [1]ఫలంబులై వచ్చిన సర్వ [2]దివ్యాస్త్రంబులు నారాముండు రాధేయునకుఁ బ్రీతచేతస్కుండై యొసంగె నట్టి మహాత్ములు [3]హీనకులజాతుల నాదరింతురే యప్పుణ్యపురుషుండు గయికొనుటఁ గర్ణుం డుత్కృష్టయోనిజాతుండని తలంచెద వదన వక్షో బాహు ప్రముఖాంగంబులు సూడ దేవకుమారుండుంబోలె నున్నవాఁడు ప్రకృతి కాంత కాంచనకుండలవజ్రకవచంబులతోడ నాదిత్యసన్నిభుండగు కొడుకుం గాంచునే సింగంబు లేడి [4]కెట్లు పుట్టు నితనికి సూత[5]సంవర్ధితుండైన కీడుదొడరె నింతియ కానోపు రుద్రశిష్యత్వంబున విశ్రుతుండగు భార్గవ రామునకుఁ బ్రియశిష్యుండగు సంగరాజు ననంగ దమునుం బరిగ్రహించిన విరించిభంగిఁ బరిగ్రహించి నీవు సారథ్యం [6]బాచరింపు మఖిల గుణంబులను సారథి రథికున కధికుండు గావలయు నను నీతి కలదు నీవు ప్రసన్నుండ వగుటం జేసి [7]నాకోర్కె సిద్ధించె ననుటయు.

308 తే. క్రుచ్చి మద్రవిభుండు నీకొడుకుఁ గౌఁగి
లించి ప్రియ మాననమునఁ దలిర్ప నృపకు
మార నీవు నాకొలఁది యిట్లరయ వెలుఁగు
దేని యిది లెస్స నీకోర్కి యేను దీర్తు.

309 వ. అని మఱియును.

---

305 1. యవసరంబు – అ.ఆ.ఐ.ఝ.డ.ల.

306 1. వ్యరథమునస్త్ర – ట. 2. స్కృతిసేసి వేడ్కఁ గైకొనియె – ఈ.జ.ణ.త.వ.

307 1. ఫలదంబులై – కొన్ని ప్రతులు. 2. విద్యాస్త్రంబులు – చ.త. 3. హీనకులుల – గ.వ. 4. కడుపునం బుట్టునే – పి.శ.ష.వ. మున్నగు ప్రతులు. 5. సంభవుండను – ఖ.వ; తనూభవుడను – కొన్ని ప్రతులు; సంవర్ధితంబైన – జ.శ.ష; సంవర్ధితుండను – ఇ.పీ. 6. ఖచరియింపుము – కొన్ని ప్రతులు. 7. నాకు జయంబు (శుభంబు) – కొన్ని ప్రతులు.

## —: శల్యుఁడు కర్ణునకు సారథ్యంబు సేయ నొడంబడుట :—

సం. 8–25–6

310 క. వీనులకుం బలుకులు సేఁ,దైనను జెప్పుదు హితంబులగు [1]కార్యంబుల్
దానికి నోర్వఁగ వలయుం, గాని [2]యలుక వలదు నీకుఁ గర్ణ నరాధిపా.

311 ఆ. అనినఁ గర్ణుఁ డిట్టు లను మద్రపతితోడ, హరున కజుఁడు నరున కచ్యుతుండుఁ
బోలె హితుఁడ వగుము బుద్ధిపరాక్రమ,శాలి నాకు నీవు సంగరమున.

312 వ. అనవుడు నట్ల కాక యని శల్యుండు వెండియు.

313 క. తగువార [1]లొరుల దెగడుట, పొగడుట యగు పలుకుపొంతఁ బోవరు హితకా
ర్యగతుల సెప్పఁగఁ [2]దెగడగుఁ, బొగడగు నెదురొర్వవలయు బుద్ధిగలిగినన్.

314 తే. [1]శత్రుతేరైన నడపంగఁ జాలువాఁడ
[2]నుఱవు సెప్పుదు రథికునేమఱఁగ నీను
గృష్ణసారథ్యమునుఁ దగుక్రీడి గెలువఁ
దలఁచు నీ కేను గడపుట దగురథంబు.

315 చ. అన విని ఘూవిభుండు ప్రియమారఁగఁ గర్ణునిఁ జూచి దేవకీ
తనయుఁడు మద్రనాథునకుఁ దక్కువ మాతలియుం దలంప నీ
నని కెన[1]రాఁడు భాగ్యము కతంబున సారథియయ్యె నీకు [2]నీ
యనఁ గొని నీవు పార్థునియహంకృతి మాన్పుము ధీరమానసా.

316 క. అని యతఁడు శల్యుఁగనుఁగొని, వినతుండై [1]నీవు లావువెఱవునుమెఱయుం
దనుఁగావ నంగపతి యర్జునుఁ గలన జయించువాఁడు రూఢిగ ననుడున్.

---

310 1. వాక్యంబుల్ — కొన్ని ప్రతులు. 2. కనల నగదు — పెక్కు ప్రతులు.

313 1. లొరులదెగడుట – శ.ష. మున్నగు ప్రతులు ; లొరులు దెగడుట – వా. 2. దెగ
డగ బొగడగ — కొన్ని ప్రతులు.

314 1. శత్రులెదురైననడపగజాలు — కొన్ని ప్రతులు ; శత్రుప్రతియైన నడుపంగ — ల ;
2. నొఱవు సెప్పుదు — ఇ.ఈ.ల.శ.ష.శర.సూ.

315 1. గాదు — అ.ఆ ; గాఁడు — కొన్ని ప్రతులు. 2. నియ్యకొనగొని — ఈ.ణ.శ.వ.

316 1. నీదులావు — వ.

317 వ. అట్లయ్యెడుం గాక యని పలికి మద్రేశ్వరుండు సారథ్యంబున కనురూపం
బగు సన్నాహంబున నుత్సాహంబు వాటించినఁ బ్రీతుం డగుచు సూతనంద
నుండు దన సూతు నాలోకించి తగు రథంబునకుం గల్పన యొనర్పు మని
సత్వరంబుగాఁ బనిచిన వాఁడును రయంబున దృఢ సుందరంబగు స్యంద
నంబు సుకల్పితంబు సేసి తెచ్చి దీవించి యిచ్చిన నయ్యరదంబుఁ బూజింపఁ
బురోహితు నియమించి తదీయమంగళ విధానాంతరంబ తాను నర్చించి
కృతప్రదక్షిణుండై ప్రణమిల్లి భాస్క[1]రోపస్థానం బాచరించి సవినయంబున
శల్యు నారోహణంబు సేయు మనుటయు నతం డచలతటంబునకు లంఘించు
సింగంబు చందంబున నొగ లెక్కిన.

318 ఆ. మెఱుఁగుతోడి [1]లలిత మేఘంబుమీఁదికి, బోయి వెలుఁగు భాను పోలుపుదోఁప
మద్రరాజసహితమై యొప్పు న, త్తేరు కర్ణుఁ డెక్కి తేజరిల్లె

319 వ. అని యిట్లు కర్ణసారథిత్వంబు శల్యుండు మెయికొనుట సంజయుండు ధృత
రాష్ట్రునకుం జెప్పె ననిన విని యటమీఁది వృత్తాంతం బెఱిఁగింపు
మనుటయు.

320 చ. [1]అవిరళ దర్శన[2]స్థిర మహాముని [3]మానస[4]వాస ఖేలనో
త్సవరసికా రసాత్మక నితాంతకృపాకర దివ్యచిత్తస
త్త్వ విభవ సంభృతైక్య సుఖతామయదేహ నిరామయా పున
ర్భవ పరిహార [5]హారి[6]పద బద్ధయుగ స్తవ హృద్యసంస్తవా.

321 క. కమల[1]వన సదృశదృగ్రుచి, సముదయశమితార్తి భక్త [2]సంఘాలక్ష్మీ
రమణత్వ శివాప్రియతా, సముపా[3] యాలంబ్యమాన సౌందర్యనిధీ.

---

317 1. భాస్కరోపాస్తి — శ.ష.

318 1. యసిత, నీల — అని పాఠములు.

320 1. అవిరత — జ జౌ.క.ఖ. 2. స్థిత — ఏ.ద వ. 3. వాఙ్మనసః సుశీలన(?) — ఐ.ఒ.
ఝ.ల. 4. ఖేలనోజ్జ్వలోత్సవ — స. 5. మూర్తి — ఊ.వీ; సార — శ.ష. మున్నగు
ప్రతులు; హేతు — ఉ.న. 6. హార — చ.

321 1. దళసదృశ — వీ.ఫ.ణ. 2. సంభృతలక్ష్మీ — వీ.శ.ష.స.ల. మున్నగు ప్రతులు.
3. యాలంబమాన — కొన్ని ప్రతులు; యాలంఘ్యమాన — శ.ష.స. మున్నగు ప్రతులు.

322 మాలిని. అనుభవశమరమ్యా [1]హంస భావైకగమ్యా
వినమదఘవిదారీ విశ్వలోకోపకారీ
దినకరశశినేత్రా [2]ధీపరిస్పందచిత్రా
దనుజమథన[3]లీలా ధర్మ తత్త్వానుకూలా.

గద్యము

ఇది శ్రీమదుభయకవిమిత్త్రి కొమ్మనామాత్యపుత్త్ర
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబయిన
శ్రీమహాభారతంబున కర్ణపర్వంబు నందుఁ
ప్రథమాశ్వాసము.

---

322 1. యాశ్రితాత్మైకసౌమ్యా — ఈ.ణ.త. 2. దివ్యలీలా విచిత్రా–ప ; దివ్యసంపూజ్య గాత్రా — ట. 3. శీలా — కొన్ని ప్రతులు.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## కర్ణపర్వము - ద్వితీయాశ్వాసము

1. శ్రీనిష్పాదన [1]నిపుణ కృపా నిరతి [2]శయార్ద్రి భావ భావాతీతా
భానుసహస్ర ప్రభరమ్యానంతవపుఃప్రకాశ హరిహరనాథా.

-: శల్యుఁడు గర్ణు నుత్సాహంబునకు విఘ్నకరంబులగు వాక్యంబులు సెప్పుట :-

సం. 8-26-16

2. వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు దన సుతుండు సూత సుతు[1]కోర్కి దీర్పం బూనియతిప్రయత్నంబు సేయుట [2]యాకర్ణించి యాంబికేయుండు.

3 ఆ. ఎట్లు ప్రియ మొనర్చె నట్లు సంప్రార్థితుం, డైన మద్రనాథుఁ [1]డంతఁ గోరి
తేరు [2]గడప నతని తెచ్చికొన్నట్టి య, వ్వీరుఁ డేమి భంగి విక్రమించె.

4 వ. అని యడిగిన సంజయుం డిట్లనియె నట్లు రథికసారథులు విలసిల్లి వందిమాగధ ప్రస్తూయమానులగుచుఁ దనవలను గౌరవంబునం గనుంగొనుటయుఁ గురు రా జయ్యంగరాజు నుద్దేశించి.

5 చ. గురుఁడును భీష్ముఁడుం నరునకుం బక వైరికి నగ్గలంబు [1]పి
రిరువురు వారి నిద్దఱ నహీన పరాక్రమశీల గీటడం
తురు ధ్రువ మంచు [2]నాత్మఁ బరితోషముఁ బొందుదు నట్లు[3]గాక ని
ర్భర బలశౌర్యముల్ [4]మెఱయ గ్రక్కున నా పని నిర్వహింపుమీ.

---

1 — 1. నిష్ఠాపద — ఈ.జ.చ.త.ల.వ. 2. శయప్రభావ — ఈ.జ.ణ.త.స.వ.

2 — 1. కోర్కె — పెక్కు ప్రతులు. 2. యు సంతసించి — కొన్ని ప్రతులు.

3 — 1. డంతకోరి — న.స.ల ; 2. నడప — కొన్ని ప్రతులు ; నడపబూని — శ.మ.

5 — 1. న/ల్లగు నటువారి నిద్దరి నఖండిత విక్రమశీల గీటడం / చి దిక జయంబటంచు దుది చేరుట గాగ దలంతుగాన ని/ర్భరబల — ఈ.త.న.వ. 2. భూరి పరితోషము — పెక్కు ప్రతులు. 3. గాన నిర్భర — కొన్ని ప్రతులు. 4. నెరయ — కొన్ని ప్రతులు.

6 తే. [1]బాడుదలనొందెఁ బట్టుము పాండుతనయు
[2]ముఖ్యు వీరువారన నేల మునుముట్టి
వైరివర్గంబు నెల్లను బారి[3]సమరి
సైన్యయుతముగ నద్భుత జయము గొనుము.

7 వ. నడపుమనుటయు నమ్మాటఁ గైకొని కర్ణుండు శల్యునిం దేరు నడపు మనిన నతం డట్లచేసె నప్పుడు శంఖభేరీప్రముఖతూర్యనాదంబులు రోదసీగహ్వరంబు విహ్వలంబు గావించె నవ్విధంబునం జని చని గర్వాగ్రహావిధేయుండగు రాధేయుం డమ్మద్రపతి కిట్లనియె.

8 శా. [1]నారాచాది మహోగ్రబాణపటలీ నానా విధోల్లాసముల్
సైరింపఁ ధృతి లేక పాండుతనయుల్ సంభ్రాంతి నొందంగ వి
స్మేరంబై ఖచరవ్రజంబు వొగడఁ మెచ్చంగ నీచూడ్కి దు
ర్వారోదగ్రత నేఁడు సూపెద భుజావష్టంభ[2]సంరంభినై.

9 సీ. అన విని మద్ర రాజాతని కిట్లను
సత్యపరాక్రముల్ శౌర్యఘనులు
భుజవీర్య మహితులు భూరి తేజోధను
లఖిలాస్త్రవిత్తము లార్యు లమర
పతికైన రణమున భయము పుట్టింపంగ
నోపుదు రప్పాండుభూపతనయు
లేల వారల నింత దూల పోఁబలికెద
విప్పుడు వల్కరా దెట్లు నీకు

తే. గాండివజ్యానినాదమ్ము గ్రమ్మి కర్ణ
విదళనము సేసినను భీముగద మెఱుంగు
లొలసి చూడ్కులు మిఱుమిట్లు గొలిపినను భ
యంబు పెల్లున నపుడు వా యడఁగుఁ గాక.

---

6 1. పాడుదల — శ.ష. 2. ముఖ్యుడెదిరించినను మొగమోటలేక (ఇచ్చట అఖండ యతిగా చూచుకొనవలెను). 3. సమరు — ఒ.చ.జ.ల. మున్నగు ప్రతులు.

8 1. 'న' ప్రతిలో నీ పద్యము లేదు. 2. మేపారఁగ — ఊ.

10 వ. అని వెండియు.

11 చ. నరుని శరంబులన్ రథగణంబులు గూలఁగ భీమునుల్లస
త్పరిఘమునన్ [1]గజవ్రజము భగ్నముగాఁ బెఱతమ్ములున్ యుధి
ష్ఠిరుఁడును దాఁకినం జలము డించి దొరల్ గలఁగంగఁ జూచియుం
దిరమయి నీవు నాలుకకుఁ దెచ్చినమాట గదా వినందగున్.

12 క. అను పలుకులు వినియుం దా, వినని చెవులుసేసి మద్రవిభుతో రాధా
[1]తనయుఁడు నా చేతి బరువు, గనుఁగొని యెద విపుడ యనియె గండమరంగన్.

13 వ. ఇట్లు సంగరోత్సాహదీప్తుండై [1]నడతెంచు నతని నుపలక్షించి.

14 చ. కురుబల ముబ్బియార్చెఁ బటుఘోటక హేషిత నిస్వనంబులుం
గరివరబృంహిత ధ్వనులు గాఢములై విలసిల్లె [1]నెత్తురుల్
గురిసె నభంబు [2]మ్రోయఁ బిడుగుల్ మొరసెం బొరి నుల్క లెల్లడం
దొరఁగెఁ బ్రదీప్తమారుతము ధూళిఁ [3]గడున్ వడిఁ జల్లె భూవరా.

15 వ. మఱియు బహువిధోత్పాతంబులు గౌరవులకు నాశంబగుటం [1]దెలుపుచుం
దోఁచెఁ దోఁచిన నవి యెల్ల సరకుగొనక వారు [2]దైవ మోహితులు గావున
శల్య సహితుండైన కర్ణుం గనుంగొని కుంతీనందను లతనిచే నిర్జింపఁ [3]బడు
దురకాఁ దలంచి సంతోషించి రతండు భీష్మద్రోణుల దోర్వీర్యంబులు పాండు
తనయులచేతఁ గోలుపోయెనని మనంబున వారల మెచ్చక [4]ముఁగలియై
మెఱసి నడచుచుండి పార్థపరాక్రమస్మరణంబునం గ్రోధంబు జనియించి
యూర్పులు సందడింప మానదర్పోన్మాదంబున మద్రపతి కిట్లనియె.

---

11 1. కరివ్రజము — పెక్కు ప్రతులు.

12 1. తనయుండు మాట లేటికిగను — పీ.శ.ష.స.

13 1. తనర్చు — శ.ష.

14 1. నత్తురిన్ — కొన్ని ప్రతులు. 2. నందు బిడుగుల్ — కొన్ని ప్రతులు. 3. వడిన్ వెసగప్పె — కొన్ని ప్రతులు.

15 1. దెలుపుచుండినను సరకుగొనక. 2. దైవోపహతులు గావున — అ.ఆ.ఊ.ఎ.ఏ.ఐ.ఝ. 3. బడువారుగా — పెక్కు ప్రతులు. 4. వెంగలియై నడచుచుండి — ఆ; మగటిమిమై నడచుచుండి — ఇ. ముంగరి, మొగరి అనియు పాఠములు. అర్థము విచార్యము.

16 మ. అరదం బెక్కి శరాసనంబుగొని [1]తెంపారంగ నే నేచి సం
గర సంక్రీడకుఁ జొచ్చినం దృణసముం గాఁ గొందు నద్దేవతా
వరునైనన్ గురు నాపగాతనయుఁ జావం [2]జూచుటన్ వైరు [3]లే
తరు చెండాడెద నుగ్రతం దలలు నాదోర్దర్పముం జూడుమీ.

17 వ. అని పలికి యనంతరంబ గాంగేయకుంభసంభవు [1]లంతటి మానసులు నిట్లు రిత్తసావు సత్తురేయని యుగ్గడించి మఱియు నిట్లనియె.

18 ఉ. వారల లోకవీరుల [1]నవధ్యుల గీటడఁగించి పల్వురన్
వారల యట్ల యెందు [2]నని వార్యులనం[3]జను మేదినీశులం
బోర వధించి రౌద్రమునఁ బొంగి క్రమాగత మృత్యువో కొ్క నాఁ
గా రణకేళికిం గడఁగు గాండివి [4]నేన యెదిర్చి [5]యోర్చెదన్.

19 ఉ. పాండు[1]నృపాగ్రనందనుఁడుఁ బావనియుం గవలుం జలంబు మై
నొండొరు [2]మూదలించుకొని యొక్కటఁ దాఁకినఁ దీవ్రవిస్ఫుర
త్కాండవిదారితాంగకులఁగా నొనరించి యలంచి లీలమై
గం డడఁగింతుఁ బోకపెనఁగం గలచంద మెఱింగి చెండుదున్.

20 క. [1]అని పలికి వెండియును నిట్లను భీష్ముఁడు దెగిన ద్రోణు నతులిత దివ్యా
స్త్రనిచయము దోర్విలాసంబును జాలం గలిగియుండె ఘనూనత మగుచున్.

---

16 1. పెంపారంగ — ఈ.క.ఖ.జ.ఝ. 2. జూచియ వైవ్వరులే — కొన్ని ప్రతులు. 3. వేఁతురు — స. సార్థబిందు రూపము. ఏచు = విజృంభించు అను నర్థమున దీనియందు శర. లో అరసున్న లేదు.

17 1. లంతంత మానుసులు — కొన్ని ప్రతులు.

18 1. నవంద్యుల — కొన్ని ప్రతులు. 2. బలవంతులనం — ఔ.ణ. 3. దగు మేదినీశులం — కొన్ని ప్రతులు. 4. కేన యెదిర్చి — ఇ.వ.శ.ష. 5. యార్చెదన్ — కొన్ని ప్రతులు.

19 1. నృపాల — ఇ.ఐ.ద. 2. మూకలేర్చుకొని – జ.

20 1. పై పద్యము వి.శ.ష.స. మొదలైన పెక్కు ప్రతులందు కలదు. దీని స్థానమున వావిళ్ళ ప్రతిలో నీ క్రింది వచన మున్నది.
వ. "అని వెండియు నిట్లను భీష్ముఁడు దెగినను ద్రోణుదుర్విలాసంబు నానగలిగియుండె"— వా. కొన్ని ప్రతులు.

21 సీ. ద్రోణుండు బహుదివ్యబాణ[1]దీప్తుఁడు భుజా
బలశాలి శౌర్యసంపన్నహృదయుఁ
డక్షీణవిక్రముఁ డతిరథశ్రేష్ఠుఁ డ
ప్పీరుండు పార్థుచేఁ బోరఁ [2]బడిన
ధార్తరాష్ట్రుల యేపు దఱిఁగెఁ దదాప్తులై
నికులుగం డడఁగిరి [3]నీ వెఱుంగ
నైనను రాముకృపాతిశయంబునఁ
గనిన యీ రథమును గార్ముకాది

ఆ. దారుణాస్త్రశస్త్రతతులును గలిమినే
నతనిఁ దొడరి దివిజు లడ్డపడినఁ
గూల్తు నెల్ల భంగిఁ గురురాజు మన్నన
యప్పు దీర్తుఁ బ్రాణ మాసపడక.

—: శల్యుఁడర్జును పరాక్రమం బుగ్గడించి కర్ణునిఁ దూలం బలుకుట :—

సం. 8—26—61

22 వ. అనిన విని శల్యుండు గర్ణున కిట్లనియె.

23 చ. వినినజనంబు లీతఁ డవివేకియనన్ వలదింత రజ్జు ల
ర్జును బలశౌర్యసంపదలు సూచి యెఱుంగమె మున్ను నిన్న నా
తనిఁ గలనన్ జగం బెఱుఁగదా యతఁ డద్భుత విక్రమోజ్జ్వలుం
డెనయుదె నీవు పౌరుషవిహీనుఁడ వద్దివిజేంద్రనందనున్.

24 సీ. రాత్రిమైఁదాఁకి క్రూరతఁబోరి మగఁటిమి వాసిన యంగారపర్ణుకంటె
ఘోషయాత్రావిధిఁ గురురాజుఁ జెఱపట్టి మాన[1]మేదిన చిత్రసేనుకంటె
ఖాండవోద్యానంబుఁ గావ [2]నేఱక సిగ్గువడి చన్న నిర్జరప్రభునికంటెఁ
గ్రీడాకిరాతుఁడై క్రోడంబునకుఁ గాఁగఁ బెనఁగి చిక్కిన త్రిలోచనునికంటె

---

21 1. సందీప్తుండు భుజ బల శాలి — కొన్ని ప్రతులు. 2. దెగయె — కొన్ని ప్రతులు.
3. నీవెఱుంగు దైనను — కొన్ని ప్రతులు.

24 1. యెడలిన — ఆ.ఇ.ఏ.ఝు ; మిగిన — ఈ. 2. నేరక — ఆ.సీ.శ (సాధు రేఫతోడి రూపము) శ.ర. లో సాధు రేఫమే యీయబడినది.

ఆ. నెక్కుడైన వీరుఁడే నర్జునునితోడఁ
బోడుతు నోడుతువనినఁ బోలుఁగాక
వినుము సూతతనయ మనబోఁటు లాతనిఁ
జెఱుతుమనుట నోరి చేటుగాదె.

25 చ. నృపుఁడును భీష్ముఁడుం గృపుఁడు నీవు గురుండును దత్సుతుండు ను
గ్రపు బలమేచి తోనడవఁగా [1]బెనుదాడిగఁ బోయి మత్స్య నా
థు పసులఁబట్టి యద్దొరలతోఁ జెడి పాఱితికర్ణ యప్డు క
య్యపు బలు[2]పాడె[3]దిప్డు మన యర్జును నమ్ములు ద్రుప్పువట్టె[4]నే.

26 ఉ. ముంద[1]రి యట్లుగాదు జనముల్ దెగడన్ వెఱఁబాఱ నేఁడు సం
క్రందనసూతి మార్కొని తిరఁబయి[2]పోరెద దాఁపఁ బ్రాణముల్
నిందకుఁజాల నింకనను నిక్కపుఁ[3]బల్కులు పల్కుటొప్పు దా
వం దుదిఁ జచ్చినం జనుమొనన్ నరుఁదాఁకు రిత్తవోవునే.

27 వ. అనవుడు నలుకవోడమిన నడంచికొని రాధేయుండు మద్రపతి కిట్లనియె.

28 చ. నరునకుఁ [1]బూని పల్కితి వినం జవిమాలిన [2]దొడ్డపల్కు లే
నరగలి లేక బెట్టడరి నప్పుడు సూడుము [3]నన్ను నాతనిం
దిరమయి బాహుశక్తియును ధీరతయున్ వెరవుం జలంబు నె
వ్వరిదెసఁ [4]గాంచి తెక్కుడుగ వారి నుతింపుము మానుమంతకున్.

29 వ. అనుటయు నట్ల చేసెదనని పలికి శల్యుం డూరకుండెఁ దేరువోనిమ్మని రాధేయుఁడు దఱిమ పలికిన నమ్మద్రేశ్వరుండును దురంగంబుల సత్వరంబుగా నడపె నివ్విధంబునం జని మనమొన సొచ్చి సైనికులు సంతసిల్ల వారలం గలయం గనుంగొని కర్ణుండిట్లనియె.

---

25 1. వెస – పెక్కు ప్రతులు. 2. దీనిపుడు ; దీవుమన – కొన్ని ప్రతులు. పాడవిడ్డు – శ.ష (భావము స్పష్టము కాలేదు) 3. నే. అనిన కర్ణుం డిట్లనియె – ఎ.గ ; అయినను నది యట్లుండె – ఞ.

26 1. టి యట్ల – పెక్కు ప్రతులు. 2. నిల్చెద – ప. 3. భాషణలొప్పుగాక – అ. ఆ.ఐ.ఒ.జ.ఝ.డ.ల.

23 1. జాలి – వ. 2. యట్టిపల్కులే – శ.ష. 3. నరవయి – స (అరవాయిపరిచిత రూపము. 4. గాంచె దెక్కుడు – వీ.

30 సీ. వలను శోభిల్ల నెవ్వాఁడైన పేఁడె య
ర్జునుఁడని నాకిష్టు సూపెనేనిఁ
బసదనం[1]బేనిచ్చు భంగి యందఱకును
వివరించి చెప్పెద వినుఁడు మీరు
వొగడంగఁ దగు రథ్యములతోడి సౌవర్ణ
రథములు వలసిన రయములావు
బొలుపును గలుగు కాంభోజ హయంబుల
వలసిన [2]బేర్చు సత్త్వంబునందుఁ

తే. బరిణతములగు సుందర కరివరముల
వలసినను జారు లావణ్యవతుల వలసి
నను మహాగ్రామములు వలసినను గోర్కె
కెక్కు డమ్మేటి మగని కే నిచ్చువాఁడ.

31 క. మఱియొక్కటి సెప్పెద ని,ద్దఱు కృష్ణులఁ జంపి వారి ధనములు నాకి
త్తఱిఁ దద్రథ మిదియేయని, యెఱిఁగించిన[1]యతని కిత్తు నేను ముదమునన్

32 వ. అని వలికి శంఖం బొత్తిన దుర్యోధనుం డనుజసహితంబుగాఁ బ్రమోదంబు నొందె నప్పుడు నిస్సాణాది తూర్యని[1]స్వనంబులు దిక్కులం బిక్కటిల్లె మన యోధవరులును వరూథినియు నుబ్బునఁ బేర్చియార్చిన నినదంబులు నింగి ముట్టె నయ్యెడఁ బ్రహాసభాసురముఖుండై మద్రవిభుండు రాధేయున కిట్లనియె.

33 ఉ. ఎవ్వరు సూపనేల నరు నిప్పుడ కాంచెద రిత్తవారికిం
గ్రొవ్వున నుజ్జ్వలార్థములు గొండని యీవల దిట్టులిచ్చినన్
నవ్వ జనంబు మిక్కిలిధనంబులు గల్గినఁ జేయరాదె నీ
కెవ్విధిసైన సద్వ్యయము [1]లెందు నపాత్రపు టీవి యొప్పునే.

---

30 1. బేనిత్తు పట్టు డందరకును — జ. 2. బెక్కు శ్రవంబులందు — న.బ.వ.స; పెక్కు జవంబులందు — పెక్కు ప్రతులు.

31 1. మేటి మగని కిత్తు ముదమునన్ — ఙ.త.

32 1. క్వణంబులు — కొన్ని ప్రతులు.

33 1. లింతయపాత్రపు — వ.పి.ష.

34 వ. అని యంత నిలువక.

35 క. కొలఁది యెఱుంగక కృష్ణులఁ, గలన గెలుతునని యెదీవు గంటిమె సింగం
బుల నెత్తఱిసైనను నే, పొలమున నేనియును నక్క [1]పోరి గెలువఁగన్.

36 ఉ. అగ్గి పొరం దలంచునటు లర్జును నెక్కటి దాఁకఁ గోర్కి నీ
కెగ్గిది [1]మాను మీపలుకు లెవ్వరుఁ జెప్పఁగ లేరు రూపఱ
న్మ్రగ్గఁగఁ గాలమయ్యెనొకొ నా వచనంబు లొకింత కర్ణము
ల్దగ్గఱనిచ్చి యోధులు బలంబులుఁ దోడుగఁ బోరుటొప్పగున్.

37 ఆ. ఏను ధార్తరాష్ట్రహిత మాచరించుటకై [1]పెనంగి చెవుల కప్రియంబు
లైన [2]నిన్నిమాటలాడితి నాబుద్ధి, [3]విని దురాగ్రహంబు విడువవలయు.

38 చ. అనవుడు నల్గి సూతసుతుఁ డాతని కిట్లను మద్బలంబు న
మ్మిన నను నిత్తెఱంగునకు మేకొనకుండఁగ మాన్ప వజ్రహ
స్తునకు వశంబుగాదనినఁ జొప్పడునే నినుబోఁటి [1]కార్తి జె
ప్పిన క్రియఁ జెప్పి నీవు వెఱపించిన [2]నే వెఱపెక్కువాఁడనే.

39 వ. అనుటయు నతని నగ్గలంబు కోపింపం జేయుటకై శల్యుండు మఱియు నిట్లనియె.

40 తే. ఇప్పుడే నీకు బుద్ధులు సెప్పనేల, నరుఁడు గాండీవ గుణనిక్వణంబు సెలఁగఁ
గదిసి నీమెయి బలుతూపుగములునిగుడఁ, జేసి నిను బుద్ధిమంతునిఁ జేయుఁగాక.

---

35 1. పోరంగెలువఁగ – కొన్ని ప్రతులు ; పోతుగెలువగఁ – జ.ణ.శ.శర.ష.సూ.

36 1. మాను మప్పలుకు – ల.వీ.ష.స.

37 1. కడంగి – జ. 2. నిట్టిమాట – ఖ ; నన్న – ల. 3. విను – ఐ.ణ.న.

38 1. కాప్తుచెప్పిన – వీ.స ; వాని చెప్పిన – జ.త.న.వ ; కార్తి జెప్పిన – డ. 2. నేనిక మానువాఁడనే – వీ.శ.ష.స; నేనొక వెల్లువాడనే, నేనిక జిక్కువాడనే – అనియు పాఠములు.

41 వ. అని యంతం [1]దనివోక యతఁడు.

42 సీ. రోషమహోగ్రోపభీషణహరితోడ సమరంబునకు హరిణము గడంగి
దానధారాశ్లిల దంతావళము[1]తోడ సంగ్రామమునకు శశంబు గడఁగి
చండ స్వభావోగ్ర పుండరీకముతోడ నాజికి సారమేయంబు గడఁగి
దారుణతుండాతిఘోర గృధ్రముతోడఁ గలహంబునకు నురగంబు గడఁగి

ఆ. యడరునట్లుగాదె యస్త్రకళాసము, జ్జ్వలుఁడు పార్థుతోడ [2]సంగరమున
కీవు గడఁగి [3]యడరుటెల్ల రాధేయ నీ, కెట్టిబలము నమ్మి యెందుఁ గలదు.

43 వ. అనియె నివ్విధంబున [1]నధిక్షేపింపంబడి కర్ణుండు గోపించి కెంపారు కన్నుల
నాశల్యు నాలోకించి.

44 క. గుణవంతుల గుణములు ని, ర్గుణు డెఱుఁగమి యెల్ల మీవు గుణహీనుఁడ వీ
గుణ మితనియందుఁ గలదని, గణుతింపఁగ నైపుణంబు గలదే నీకున్.

45 సీ. అర్జును నస్త్రవిద్యా [1]ప్రమాణంబు నా యెఱిఁగిన యంత నీవెఱుఁగ వతని
కోలఁదియుపవమాలికోలఁదియుఁగాంచి నాకోలఁదియు నెఱిఁగి వారలమదీయ
దివ్యాస్త్ర బలమునఁ దెగటార్ప నగునని యే నిశ్చయించితి నెట్టు లనినఁ
గడుఁ బెద్దకాలంబు గంధపుష్పాదుల నర్చించుచున్నాఁడ [2]నను[3]దినంబు

ఆ. దొనఁ గరంబుశక్తి నునిచినదున్నది, యహి[4]మయంబు దారుణాస్త్ర మింత
యంతయనక యెదిరి నాహుతి గొనుదాన, జిష్ణునోర్తునొండెఁ గృష్ణు నోర్తు.

---

41 1. దనివిసనక - కొన్ని ప్రతులు.

42 1. తోడి - కొన్ని ప్రతులు. 2. సమరమునకు - కొన్ని ప్రతులు. 3 యెదురు టెల్ల - డ.

43 1. నాక్షేపింపంబడి - డ.ణ.న.ల. మున్నగు ప్రతులు.

45 1. ప్రభావంబు - ణ.న.వ; నైపుణంబునా యెరిగిన - ఋ. 2. గలంబు (పు) పెక్కు ప్రతులు. * నగ్గలంపు - ఊ.ఒ.బ. 3. శరంబు - ఈ.జ.వ. 4. దీర్ఘు - కొన్ని ప్రతులు.

46 వ. భార్గవాస్త్రంబున నొక్కనిం బొరివుత్తు నట్లుంగాక యాదవ పాండవ నివహంబులోనం గృష్ణార్జునులయందు లక్ష్మీవిజయంబులు సుప్రతిష్ఠితంబులై యుండు నయ్యిరువురం బొదివి పెనంగం గనుటకంటె మేలునుం గలదే వారల గరుడకపిధ్వజంబులుం జక్ర గాండీవంబులు బెండుమానుసులకు భీషణంబులు గాని నాకుం బరితోషణంబులు వేవురుగోవిందులుం బదివేవురు పార్థులుం బన్నినం బోరెద నీవు మహాయుద్ధకోవిదుండవు గామిం జేసి వెఱచఱచి కాఱు [1]లఱచెద వక్కడి పక్షపాతంబునం బ్రేలెదవో యెఱుంగ నింక నిట్టి మాటలాడి[2]తేని ప్రాణంబుల[3] కొఱయొల్ల వనిపలికి వెండియు.

-: *కర్ణుఁడు శల్యునిపైఁ గోపించి యతని దురాచారంబు లుగ్గడించుట* :-

సం. 8-27-68

47 సీ. వినుపాప[1]దేశ సంజనితుండ వగునీకు దుర్బుద్ధి గాక సద్బుద్ధి గలదె
క్షత్రియాధమ నీచ కలదు లోకంబున నాబాలగోపాలమైనవాక్య
మతికుటిలుండు సంగతుఁడుగాఁ డేమిటఁ జెలికిఁ గీడొనరించుఁ జెట్టవలుకు
దుష్టాత్ముకుఁడు గడుఁ గష్టుఁడు మద్రకుం డనునంతవట్టుఁ బ్రత్యక్ష మయ్యె
ఆ. వానిలేక యెల్లవనితలుఁ బురుషులుఁ, గలయమీకు [2]నెగ్గుగాక యుండు
మున్నుగల్లు పిదపఁ జన్నుఁబాలై పెరుఁ, గుదురు సెప్పనేల గుణములింక.

48 క. పలువురకుఁ బుట్టి నిచ్చలుఁ, గలుద్రావుచుఁ బెరిఁగి [1]యెట్లు గఱతురు శీలంబులు నుచితములగు భాషణములు నీ విమ్మాట లుడిగి పొదపొదమనికిన్.

49 చ. మఱియొకఁ డేను జెప్పెద నమానుష విక్రమలీల నగ్గడం
బఱపియు జంపియుఁ రిపున్నృపాలక సైన్యము రూపడంచి మై
దొఱఁగుట [1]యొప్పదే తనువు దూఁటులుగాఁ [2]బెఱవారి గెల్చుకో
లుఱ దొకొ నాదుపెం పుడుప నోపుదురే నినుబోంటు లెమ్మెయిన్.

---

46 1. లాడెద వక్కడి - కొన్ని ప్రతులు. 2. తేనిఁ బ్రాణంబుల — పీ. 3. లుకోఁగనెల్ల - గ.వ ; లొల్లవని — శ.ష.

47 1. జాలి - వ. 2. సిగ్గుగాక - ఙ.

48 1. యిట్లు గడుమశ్శీలం / బులునను చిత భాషణములు / బలుమరుబలుకంగనేల పద పదమనికిన్ - స.

49 1. యొప్పుగాక ననుదూరగబల్లుట పేరు వాడియె-జ. 2. గడుపేరువాడికోలురద్వైత.

50 వ. కినియించి గదం దల వగుల వ్రేటువడక యూరక తేరు వోని మ్మనవుడు మద్రపతి యతని నవలోకించి.

51 ఆ. హితము సెప్పఁ [1]దగనె యే నీకు నదియును, గాక నీ రథంబు గడపుచుండి
కౌరవాధినాథ కార్యార్థి నగు నాకు, నున్నరూపు [2]సెప్పకుండ నగునె.

52 ఉ. సారథి దక్షుఁడై రథి[1]కసారము రథ్యబలంబు నాయుధో
దారత మానముం రణవిధంబు నిమిత్తశుభాశుభత్వ ని
ర్ధారణముం మదిం గని హితం బెఱిఁగించుట నీతి గాన నీ
వీరస [2]మెత్తనోఁ బలికి తేనియుఁ జెప్పుదు సూతనందనా.

53 వ. ఏ నేమితప్పు [1]సేసిన గదం దల వగుల వ్రేసెదవు నీవి ట్లుంటివి గదా యని హితోపదేశంబు సేయ మానసేర్తునే యిది యొకదృష్టాంతంబు వివరించెద వినుము విని నీవు నాచెప్పినట్ల చేసితేనియు మేలు సేయ[2]కుండినం గడుమే లని యిట్లనియె.

54 సీ. అంబుధి[1]లో నొక్క యలఘుతరద్వీపమున ధర్మవర్తినాఁ జను నరేంద్రు
పురమున నొకవైశ్యవరుఁ డధ్వరాదిసత్కర్మ[2]రుఁడును శాంతిదాంతియుతుఁడుఁ
గరుణాపరుఁడు దాననిరతుండు ధనధాన్యశోభియు బహుపుత్రలాభ విలసి
తుండునై వర్తించుచుండఁగ నిలుసేర నొకకాకి యతని పుత్రకులు దాని

తే. కెంగిళులుపెట్టి కొనియాడ నెలమిఁ బెరిఁగి
[3]క్రొవ్వి కడు మీఁటి యెట్టి పక్షులును దన్నుఁ
బోల వనియెడు దుర్మానమునఁ దృణీక
రించి యది పెక్కు భంగులఁ గ్రీడ సలుపు.

---

51 1. దగుదు యేను నీ కదియును — కొన్ని ప్రతులు. 2. సెప్పకుంటపగునె - వ ; సెప్ప కుండఁ జనునె — శ.ప.

52 1. కుసారము - డ; కసాధ్యము - వ. 2. మెత్తి — ఆ.జ.త.వీ.

53 1. సేసితిగదం - పీ. 2. యకున్నను - డ.త.ద.న.ల.వ.

54 1. లోపల — న.వ. 2 పరుండును దాంతియుతుడు — ఉ.ఐ.క.ల ; రతుండును దాంతి — త.ద.వ ; నిరతుడును దాంతి — చ.జ.ణ.వ. 3. క్రొవ్వుపెంపున నెట్టిపక్షు లును దన్ను - డ.ల.

55 వ. ఇట్లు విహరించుచుండ నొక్కనాఁడు గొన్ని హంసంబులు పక్షిబలంబున సుపర్ణుతో [1]సరిసేయం దగునట్టివి సముద్రంబు చేరువఁ జనం గని యా కోమటి కొడుకు లక్కాకంబునకు వానిం జూపి యిట్లనిరి.

56 క. పులుఁగులలో నీ వెక్కుఁడు, విలసద్గతి నంచ లిట్లు వినువీథిఁ గరం
బెలమిం జని యెడు వీనిం, గలసి పఱచి గెలువవలదె [1]గతులబహులతన్.

57 వ అని తారతమ్యజ్ఞానహీనులగు నయ్యల్పబుద్ధులు చెప్పిన నుచ్ఛిష్టదర్పితంబగు నదియును మౌర్ఖ్యంబునం దా నంతవాఁడ నని తలంచి వానిదెసకుం జని మనంబున వీనిలో మేటి యెయ్యదియో యనుచుం జేరి తన చూడ్కికి వచ్చిన యంచం [1]బురుడించి పఱతము రమ్మని పిలిచిన నయ్యంచ లన్నియు నిలిచి బెలుచనవ్వి యవ్వాయసంబున కిట్లనియె.

58 క. మానససరసి [1]వసింతు మ, హీనబలముఁ జవముఁ బక్షులెల్లను బొగడం
గా నెందుఁ దిరుగుదుము ద, వ్వైనను ఖేదంబు లేదు హంసల మగుటన్.

59 వ. ఇట్టి మాయందును.

60 క. బలశాలియైన హంసముఁ, బిలిచితి పురుడించి పాఱ [1]బేలతనమునన్
గలవే యింతకు మును హం, సలతో బురుడించు వాయసంబులు జగతిన్.

61 సీ. అనుటయుఁ గాక మిట్లను హంసములతోడ గతులు నూటొక్కటి గలవు [1]వాన
నొక్కటొక్కట శతయోజనవ్యాప్తి నే నెఱయుదుఁ బొడవుగా [2]మీఁదికెగసి
చనుట యచ్చటనుండి చక్క నేలకుఁ జోడువట్టి డిగ్గుట దూరపాతభంగి
[3]సంగతి పరువడి చారులీలాగతి వక్రయానము వలయక్రమంబు

---

55 1. నొరయు నట్టివి – స.

56 1. గతిబహుగతులన్ – స.

57 1. నీక్షించి, రూపించి – అని పాఠములు.

58 1. జనింతుము – న.

60 1. బేలుతనమునన్ – కొన్ని ప్రతులు ; బెలుచదనమునన్ – ఐ.క.సం.గ.చ.జ.బ.త.ల.

61 1. దాన – కొన్ని ప్రతులు. 2. మింటికెగసి – ఝ. 3. సంగడి – ఉ.ణ.ద.న.ల.స.

ఆ. లోనుగాఁగ నెట్టులైనను మీకోరి, నట్లు పఱచి మేటి[4]యంచ యైన
దాని నిపుడ గెలుతుఁ దక్కటియంచలు, భయము వొందఁ గాకి[5]పదువు వొంగ.

-: కాకము హంసముతో సముద్రముమీఁదఁ బఱచి భంగపడుట :-

సం. 8-28-27

62 వ. అనుటయు విని మున్నాహూతంబైన హంసం బక్కాకంబు నాలోకించి.

63 ఆ. నూఱుగతుల నీవు వాఱు దే నన్నియు, నెఱుఁగఁ బలుగులెల్ల నెట్లువాఱు
నడరి యాకసమున [1]నిడుబాట నట్ల పా, ఱుదము రమ్ము జలధిచదల ననిన.

64 వ. అయ్యోరం గూడిన కాకంబు లపహసించి శతప్రకారగతి యగు దీనితో నేకయానపర్యవ[1]సానహీన సముత్సాహదోహలి వగు నీ వెట్లు మచ్చరించె దవు పఱచి భంగపడియెదవుగాక యనుటయు నమ్మరాళం బాగమిం బాసి పఱవఁదొడంగినం దోన యవ్వాయసంబునుం బఱచె నిట్లు రెండును మున్ని టి[2]పై మిన్ను దటిసి పాఱునట్టియెడ.

65 క. రాయంచ మందగతిఁజను, వాయస మతితీవ్రభంగి వలను మెఱసి లీ
లాయితము లొప్ప బహుగమ,నాయాసము నొంది పఱచు నగ్గలిక మెయిన్.

66 ఆ. ఎలమిఁ గడచిపోవుఁ బిలుచుఁ గ్రమ్మఱవచ్చి ముక్కు ముక్కుమీఁద మోపు బట్టు
నేచి తిరుగు నీఁక లీఁకలతో [1]రాయు నొరయుఁ జిత్రగతుల మురియు నవ్వు

67 వ. ఇవ్విధంబునం గాకం బనేకప్రకారపరిసరణచతురంబై సంచరించుటం జూచి ముదితంబులైన వాయసంబు లధికస్వరంబుల మెఱయుచు హంసంబుల గేలి గొని నవ్వుచుఁ దరువులపయిం దుళ్లిత్రుళ్లియాడుచు మరాళంబు పరాభ వంబుఁ బొందెడుఁ జూడుం డని పెద్దయెలుంగునం బలుకుచుండఁ దదీయ కలకలం బాలించి హంసంబు భరితోత్సాహంబై.

---

4. హంసయైన - పీ.శ.ప. 5. బలము పొంగ – ఱ.

63 1. నిడుపాఱు – స.

64 1. సానవైనసముత్సాహ – పీ. 2. మీనంబగచుచుండె – కొన్ని ప్రతులు.

66 1. రాయుఁ జిత్రగతుల మఱియుఁ జీరనవ్వు – పీ.

68 క. పొడవునకు నెగసి యెప్పటి, పడమటిదెస నిగిడి పెలుచఁ బఱచినఁ గూడం
గడురయమునఁ జని యంచం, గడ[1]వంగా కీలకఱచి కాకము పాఱున్.

69 వ. పాఱి పాఱి డయ్యుటయు నయ్యంచ యుదంచిత త్వరితగమన కళా వైదగ్ధ్యంబు మెఱయం బఱచిన[1] బీఱువడి కాకం బాకులాంతరంగంబును వికలాంగంబును నై యి ట్లని వితర్కించు.

70 క. నేరక తొడరితిఁ గాల్కొ, న, భూరుహములు లతలు[1]గిరులుఁ బొదలేమియు శే
వారయ బహుసత్త్వమయము, వారిధి డిగి సోఁకినపుడ వలయుం బొలియన్.

71 వ. అనుచు దీన మానసంబయి భయంబునం గడంగి డప్పి సొగసి యవశత నంతంతకు డిగుచు చున్న యక్కాకిం గనుంగొని కలహంసం బిట్లనియె.

72 ఆ. నీ వనేకగతులు [1]నే ర్తుదియేగతిఁ జనుట చెపుమ వాయసంబ యేను
గడవ నరిగి పిలువఁ గా నేల తడసెద, [2]వెఱక లేటి కిట్టు లెడల విడువ.

73 వ. అనియె నట్టియెడ.

74 క. [1]తలకొని జలములు పక్షం,బులు దుండము[2]దోఁక సోఁక బొరఁబొరి నెగయన్
బలనుఱి మెయిదిగఁబడఁగా, సొలసియెగయలేక వాయసుఁడు వెగడొందెన్.

75 వ. ఇట్లు మున్నీటి నీటిపయిం బడి [1]యగ్గలం బగు దురవస్థకు బెగ్గలంబు నొందు కాకంబు నాలోకించి పలుక నగుం గాక పలికినట్ల యెవ్వరికిఁ జేయఁ దీరుఁ బని తీరెంగదా యనిన రాయంచకు నక్కాకం బిట్లనియె.

---

68 1. వఁగలేక – పీ; వఁగఁ జనుకినుక నేచికాకము పాఱున్ — స.

69 1. నఁ బరువిడి – పీ.

70 1. గట్లు – డ.న.ల.

72 1. నేర్చితియేగతి – ప.ఐ; నేర్చితివేగతి – గ.డ. 2. వింతమాత్రనలయికెట్లుగలిగె — ఈ.న.ప.

74 1. తలరుచు — ఇ.ఊ.వ.శ.ష.పీ; తలరుజలంబులు — ద.ల. మున్నగు ప్రతులు.
2. సోకనీక — ఊ; సోకబారి — క; సోకిజోకి — ఘ; జోకజోక — కొన్ని ప్రతులు.

75 1. బెగ్గలంబగు — నగ్గంబగు — పీ.శ.ష.

76 క. [1]ఎంగిళులు గుడిచి క్రొవ్వునఁ, బొంగిన మెయితోడగర్వము[2]నఁ దిరుగుచునా
కుంగలదె యెందు నెదురు వి,హంగమపతి నైన గెలుతు నని మునుదలఁతున్.

77 క. నాకొలఁది యిప్పు డెఱిఁగితి, నీ[1]కరుణా లోకనంబు నిగిడించి శర
ణ్యా కావు నన్ను మగుడం, గాకులలోఁ గలుపఁ [2]దగవు గాదే నీకున్.

78 వ. అని యార్తుండగున.

79 క. ఆకులతఁ బొంది పలుకుచుఁ, గా కాయని చంచుఁ [1]దెఱచి కడు నఱచుచు నీ
రాకరమున మునిఁగెడు న, క్కాకింగని హంస పరమ కారుణ్యమునన్.

80 క. వెర[1]వునఁ దత్తనువుందన, చరణంబుల [2]నిఱికి యెత్తి చావుడిపి బల
స్ఫురణంబు మెఱయ వీఁపున, ధరియించుచు వచ్చెఁబక్షితతులు నుతింపన్.

81 వ. ఇవ్విధంబునం దెచ్చి యెప్పటి [1]నెలవున డించి రాయంచ యక్కాకికి దెప్పి ఱిన దానితో నచ్చటికాకులు పెన నింక నిట్టి యవినయంబు లెన్నండును జేయకుమని పలికి నిజసహచరంబులగు మరాళంబులుం దానును వలయు చోటికిఁ జనియె నీవు నా కోమటికొడుకుల యెంగిలికూటం బెరిఁగిన యక్కాకంబు చందంబునఁ గురుకుమారుల యెంగిళులు గుడిచి క్రొవ్వి యెక్కుడువారల ధిక్కరించెదవు నీకొలఁది యెఱుంగవు దీనం జేటు వాటిల్లుఁ గాన తేటపడ నెఱింగించెద నాకర్ణింపుము.

82 చ. విరటుని గోవులన్ మరల [1]వెల్చి మదంబున నీదు తమ్మునిం
బొరిగొనఁ బార్థుఁడాఁక కెటపోయితి నాఁడల ఘోషయాత్రలోఁ
గురుపతి డించి క్రీడి కృపకుం దగుపాత్రము సేసి యెక్కడన్
సురిఁగితి చెప్పుమా నిజము సూతతనూభవ నాకు నేర్పడన్.

---

76 1. ఎంగిళ్లు — పెక్కు ప్రతులు. 2. నమెలగుచు — ఈ.చ.త.వ; తిరుగుదు — ణ.

77 1. కారుణ్యామృతంబు వీ.శ.ష. 2. దరముగాదే — కొన్ని ప్రతులు.

79 1. నెఱపగానఱచుచు — వా; దెఱచికడు — వీ.శ.ష. పెక్కు ప్రతులు.

80 1. వానరదత్తనువు — కొన్ని ప్రతులు. 2. బట్టియెత్తి — జ.

81 1. బోటన — పెక్కు ప్రతులు.

83 వ. అని వెండియు.

84 చ. పనివడి జామదగ్న్యుఁడు సభన్ [1]వినిపింపఁడె మీకు నెల్ల న
ర్జును భుజవైభవంబు మధుసూదను పెంపును నాఁడ ద్రోణశాం
తనవులుఁ జెప్పరే బహువిధంబుల వారల గెల్వరామి [2]మున్
వినమె యెఱింగియున్ మఱియు వీఱిఁడి మాట[3]లు వేయునేటికిన్,

85 క. ఒంటిమెయిఁదాఁక నాము, క్కంటికి నళవుగునె కృష్ణగాండీవుల ని
ట్లంట యుడిగి తగురథికుల, జంటగొని రణమ్ము సలుపు శత్రులు దలఁకన్.

86 తే. గొంతికొడుకును దేవకికొడుకు మనము
గనియెదము దినకరనిశాకరులుఁబోలె
వెలుఁగ నయ్యెడ ఖద్యోత విలసితంబు
తోడి దగుఁగాక నీ [1]పెంపు దోఁపఁగలదె.

87 వ. అనినవిని కర్ణుండు గమలనాభుని పెంపును బార్థు బలిమియు నెఱుంగక
యేనేల వారిఁ దొడరెద నీవెట్లు చెప్పినను దొడరుదుఁ దొడరి వారొండె
నే నొండె నగుదు నింతియ నీవు వెడమాటలాఁడక యుడుగు మనిపలికి
యచ్చటి మహీపతులు విన నమ్మద్రపతి కిట్లనియె.

*-: కర్ణుఁడు శల్యునితోఁ దనకుఁగలిగిన శాపంబుల తెఱంగు సెప్పుట :-*

సం. 8-29-3

88 సీ. తలఁచిన నెదకు సంతాపంబు సేయఁగ జాలెడునట్టిని జామదగ్న్య
కోపంబు బ్రాహ్మణ శాపంబు గాక యే సరకుగొందునె మురహరుఁ [1]గిరీటిఁ
జెప్పెద వినుమస్త్ర శిక్షార్థినై మహేంద్ర నగంబునకు జమదగ్ని సుతునిఁ
గోరిపోయినఁ గృపాంభోరాశియగు నమ్మహాముని కులము నన్నడుగుటయును

---

84 1. వినుతింపడె — శ.ప. మున్నగు ప్రతులు. 2. నాడు మీకు నర్జును — వ.
3. మీ వినమి యెఱింగియున్—పెక్కుప్రతులు. 4. ల బుద్ధి సెప్పెదన్ - పెక్కుప్రతులు.

86 1. సొంపు — కొన్ని ప్రతులు.

88 1. నినరుని - ఆ.

తే. బొంకునకు నోర్చి బ్రహ్మాస్త్రమునకుఁ గాఁగ
బ్రాహ్మణుఁడ నని చెప్పి తత్పాదభక్తి
గలిగి మెలఁగంగ శిక్షించె నలఘుబహువి
ధాస్త్రశస్త్రసంవేదిఁగా నతఁడు నన్ను.

89 వ. భార్గవాభిధానంబగు [1]మహాస్త్రంబు లోనుగా ననేక దివ్యాస్త్రంబు లిచ్చెఁ బదంపడి బ్రాహ్మంబగు నస్త్రంబు నొసంగె నొసంగి సమరంబున నాపత్సమయంబున దీనిం బ్రయోగింపుమని యానతిచ్చె మఱునాఁడు తత్తపోధనసత్తముండు మదీయాంకతలంబున నొఱగి నిద్రించుచుండ నొక్కజంతువు నా [2]క్రిందితొడం దొలిచిన నమ్మహాత్మునకు నిద్రాభంగం బయ్యెడునని కదలకుండితిఁ దదనంతరంబ మేలుకని యతండు నెత్తుట [3]జెల్లువఁగని తత్ప్రకారం బడిగి యేను జెప్ప విని మద్ధైర్యంబున కచ్చెరువడి నీవు బ్రాహ్మణుండవు గాఁ జెప్పఁడవని యొత్తి యడుగుటయు వెఱచి సూతసుతుండనని చెప్పితిఁ జెప్పునప్పు డక్కీటకంబు నాలో[4]కించిన నది యదృష్టపూర్వ వికృతాకారం బై యుండె నర్జునహితంబుగోరి యింద్రుం డమ్మునీంద్రునకు నన్నుఁ దేటపఱచి యతనిం గోపింపం జేయువాఁడై కీటతనువు దాల్చి యట్లు సేసెంగానోపు నా సంయమి గోపించి కపటంబున బ్రహ్మాస్త్రంబుఁ బరిగ్రహించితివి నీకు వలయు కాలంబున దోఁపమియు మృత్యువాసన్నంబైనం దోఁచుటయు నాపద ముట్టినయెడ భార్గవాస్త్రంబు దోఁపకుండుటయుం గలిగెడుమని శపించె నిది జామదగ్న్య[5]కోపంబు తెఱంగు బ్రాహ్మణశాపంబు తెఱంగెఱింగించెద నాకర్ణింపుము

90 సీ. [1]శ్రమమునకై యేను సకలాంబ[2]కములు సెక్కుడు వెస సేయ నయ్యెడకునొక్క-
యాఁబెయ్య యుఱికి నా యజ్ఞానమున నంపతాఁకునఁ [3]గూలుడు దానిఁగలుగు
బ్రాహ్మణుం డధికకోపంబున నిది హోమధేనువత్స మిట్లు దీని శల్య
నిహతంబుఁ జేసితి నీవు [4]నావచన శల్యంబున నిహతుండ వగుము నీకు

---

89 1. నమ్మహానీయాస్త్రంబు లోనుగా — కొన్ని ప్రతులు. 2. పెందొడ — ఎ.గ. 3. జెల్లుగని — కొన్ని ప్రతులు. 4. కించిలి — పెక్కు ప్రతులు. 5. శాపప్రకారంబు — ఆ.ఇ.న.వ.

90 1. శ్రవమునకై యేను .... వివిధాంబకంబు లెక్కిడి — పెక్కు తాళపత్ర ప్రతులు; పిరుండనై యేను వివిధాంబకంబు — ఎ.గ. 2. కంబులు / సెక్కుడు వెస నేయునొక్క-చిరుత — ఈ.క.స. 3. గూలినదానికలిగి — కొన్ని ప్రతులు. 4. మద్వచనశల్యంబున — వ.

తే. సమర మేకాగ్రనిర్భరోత్సాహవృత్తి
నడవ నరదంబుచక్రంబు పుడమిఁ గ్రుంగ
వలయు నెవ్వరుమార్కొని గెలువఁగోరి
శ్రమము సేసెద వతనిచేఁ [5]జావుమీవు.

91 చ. అనుటయు భీతి వేఁడికొని యావులు వేయును [1]నెడ్ల నాఱునూ
ఱును రథముల్ శతంబును మెఱుంగుల మొత్తముఁ బోనియంగనా
జనశతకంబు దంతిశతసప్తకముం గొని శాంతిఁ బొందవే
యనినను మాన దయ్యె వసుధామరుకోపము తీవ్రరూపమై.

92 వ. మానక యున్న మఱియును.

93 క. నాకుఁ గలసొమ్ము లెల్లను, నీ కిచ్చెద ననుఁ బ్రసాదనిరతకటాక్షా
లోకితుఁ జేయు మనుఁడు నతఁ, డీకాఱులు మానుమనుచు నేఁగెం బెలుచన్.

94 వ. [1]ఇట్లరుగుచు నలుకపెంపునం గన్నుల నిప్పులు రాల మరలి కనుంగొని నా
పలుకులకు బొంకునుం గలదే నీ కీదుష్కర్మంబు పరలోకంబునకు బాధకంబు
గాకుండ నిదియ ప్రాయశ్చిత్తంబయ్యెడుంగాక పొమ్ము సూతనందనా యే
నెట్లంటి నట్లగుట దప్ప దరుగు మని యెం గావున నాజామదగ్న్యబ్రాహ్మ
ణుల శాపంబులకు వెఱతు సత్యంబ పలికితి నీయున్న రాజులును నాతోడి
సుఖదుఃఖంబులకుం [2]గలవారగుటం జేసి కృష్ణార్జునులకు నే వెఱవ నింద్ర
యమవరుణకుబేరులు వజ్రదండపాశగదాహస్తులై [3]బెట్టు ముట్టినను బెదర
నని యాడుదుఁ దక్కినవారిం జెప్పనేల యిప్పుడు బ్రహ్మాస్త్రంబునుం
దోఁచుచున్నది యన్నరుని [4]యున్నెడకు మనరథంబు నడపుము పుడమి
జనంబులు మదీయ కోదండపాండిత్యం బొండొరులకుం జెప్పికొని యచ్చెరు
వందు చుండునట్లు సేసెద నమ్మేటిమగని మృత్యు[5]నివాసంబు నొందించెద.

---

5. నిజము - ఇ.క.

91 1. నెద్దులా — పీ.శ.ప.శర.

94 1. ఇట్లారక యరుగుచు — కొన్ని ప్రతులు. 2. కియ్యకొని వారలగుట — ఇ. 3. బిట్టు ముట్టినను — కొన్ని ప్రతులు. 4. యున్నకడకు — ల. 5. విలాసంబు, నిలయంబు, వాసంబు - అని పాఠములు.

95 సీ. కాండమహాశరంగముల వైరుల ముంచు విజయాంబురాశికి వేల నగుదు
బాణరశ్ములఁ బరిపంథులఁ బొదివెడు నర్జునాదిత్యునకభ్ర మగుదు
విశి[1]ఖోగ్రశిఖల విద్విషుల [2]నేర్చు కిరీటిఘోరదావాగ్ని కాసార మగుదుఁ
బ్రదరవేగమున నరాతులఁ గూల్చు పార్థానిలాయువునకు నచల మగుదు
తే. విల్లువట్టెడువారికి నెల్ల నెక్కు,డనఁగ [3]నెగడిన గాండీవి నాహవమునఁ
దొడరఁ బ్రాణంబు[4]లకు నాసపడు,లఘుప్రకారులకు వచ్చునే నాకుఁ గాక శల్య.

96 వ. అని పలికిన విని యమ్మద్రపతి వీనియంతరంగంబు [1]గలంగెఁ దానర్జును[2]చేతం
జచ్చుట నిర్ణయించె నెట్లనిన నిట్టి యప్పుడు జనులు దనమీఁదం జాలిమివెట్ట
కుండుటకుం గాదె జామదగ్న్య బ్రాహ్మణులశాపంబులు భూపాలురు విన
నుగ్గడించె నిక్కలంకరయే నీరజ్జులానికి నర్జును గుణవిశేషంబు లెఱింగించి
మదం బడంచిన కసంబునం గలిగెఁ గౌంతేయాగ్రజునకు నాయిచ్చినవరంబు
సఫలంబయ్యెనని మనంబునం దలంచి సంతోషించె మనుజేశ్వర వినుమా
శల్యుండు సెప్పిన యాఖ్యానంబునం జిత్తం [3]బెరియు చునికిం జేసి యాసూత
నందనుం డతనితో గనలుచు మఱియు నిట్లనియె.

*—: కర్ణుఁడు హంస కాకీయోపాఖ్యానము విని కోపించి శల్యుని దూఱుట :—*

సం. 8-30-3

97 క. దృష్టాంతము సెప్పెదనని, కష్టాత్మా నీవు నన్నుఁ గాకము నరు న
త్కృష్ట మరాళము గాఁగ ని,కృష్టంపుఁ గథఁ జెప్పి తిది సఖత్వము తెఱఁగే.

98 ఆ. నీచులకు బలంబు నెట్టన పరుసని, కాఱు లఱచు చున్కి గాన యిట్లు
వలికి తింతఁ[1]జేసి భయ మయ్యెనే నాకు, నట్టిమాటలింక నాడ కుడుగు.

---

95 1. ఘోరాగ్నిశిఖల - అ.ఝ.ల. 2. నొంచు, నోర్చు — అని పాఠములు. 3. నెగడెడు (డి) — వ. 4. దీపనియెడులఘు — అ.ఆ.ఝ.డ.ల.

96 1. గలంగెఁదాన - వీ.శ.ష. మున్నగు ప్రతులు 2. చేతనొచ్చుటయుజచ్చుటయు - ల. మున్నగు ప్రతులు. 3. బురియాడుచునికి — ఈ.ఓ జ.ణ త.న.వ.

98 1. లోన - క.ఖ.

99 క. అడిగితి నే నిను నాక,వ్వడిభుజబల మెట్టిదని యవారణ నీ వి
ప్పుడు నృపులెల్లను విన వా, విడిచి పొగడె దిట్లు వందివిధమున నతనిన్.

100 చ. అని మొన శత్రులం బొగడు టారయ మూర్ఖతగాదె యిట్టి దు
ర్జనుల సహింతురే పెలుచఁ జంపక సైరణ సేయుకాల మై
నినుఁ దెగఁ జూడనైతి ధరణీపతి [1]కయ్యముపై భరంబునన్
గొనకొని సూతకృత్యమునకుం దగఁ బంచినవాఁడు గావునన్.

101 వ. అని వెండియు.

102 తే. అకుటిలుం డగు నాకు నత్యంతకుటిల
వృత్తి సహితంబు సేసెద వి త్తెఱంగు
మిత్త్రవంచన మారయ మైత్రి సప్త
పదకృతోద్భూతి యనియెడు పలుకు [1]వినవె.

103 క. జను లెట్టిది మిత్త్ర[1]విధం,బని చెప్పుదు రట్టిచంద మఖిలము దుర్యో
ధనునందుఁ గలదు నాయెడ, మన మూఱడియుండు నా కమందప్రీతిన్.

104 క. జను లెట్టిది శత్రు[1]విధం, బని చెప్పుదు రట్టిచంద మారయఁగా దు
[2]ర్జనుఁడవగు నీకు నాయెడ, వినుము కలిగె దీన మనసు విచ్చెం గుటిలా.

105 ఉ. కావున నీకు నప్రియముఁ గౌరవ[3]రాజునకుం బ్రియంబు[2]నుం
గా విధి మెచ్చ బాహుబలగర్వ మఖర్వము గాఁగ లక్ష్మికిం
జేవయుఁ గీర్తి [2]కున్నత విజృంభణముం గలుగన్ ముకుందగాం
డీవులఁ దాఁకి గెల్చెదఁ గడిందిమగంటిమి యుల్లసిల్లఁగన్.

---

100 1. కయ్యపునాదరంబునన్ — ఱ ; కయ్యపువైభవంబునన్ ; కార్యపువైభవంబునన్ అనియు పాఠములు.

102 1. వినమె - కొన్ని ప్రతులు.

103 1. పథంబని — ఏ.

104 1. పథంబని — ఏ. 2. ర్జనితుడగు — శ.ష.

105 1. నాథునకుం — వ. 2. గా/దావిధిమెచ్చ .... బలదర్పమఖర్వ - అ.ఆ.ల. 2. కిన్నవ విజృంభణము — పెక్కు తాళపత్రి ప్రతులు.

106 వ. అని పలికి మఱియును.

107 తే. ఖండనంబునఁ బార్థుచేఁ బడక నేఁడు, మేలుచే నైతి నేనియు మృత్యువునకు
నెన్నఁడును నగపడ నాకు నివ్విధంబు, సందియము లేక చిత్తంబునందుఁ దోఁచె.

108 చ. వినుత మహాస్త్రముల్ వఱపి విక్రమసంపద నాకుఁ జూపు న
ర్జునుభుజలీల కోర్చెద వసుంధరఁ జక్రము గ్రుంగి నారథం
బునకు [1]నవార్యమై యెడరు పుట్టక తక్కిన శల్య చూడు మి
నను విశిఖావలీవిలసనంబున నాతని యేపు మాపెదన్.

109 వ. నీకు వెఱపింప నయ్యెడు కొలంది [1]వారిని వెఱపింపుము కర్ణుండు విక్రమంబునకుం గీర్తికి నాస్పదం బగుటకు జనియించినవాఁడు గాని భయంబు గొనుటకుం గాదు కురుపతి[2]సన్నిధి నీవు సారథ్యంబునకుం బూనుచుండి పలికి కొన్న బాసకతంబున బ్రదికిపోయి తని విని శల్యుం [3]డీయనర్థప్రలాపంబులం బ్రయోజనం బేమి వినుము కర్ణ కరులు వేవురైనం గిరీటిని గెలువం జాలుదురే యనుటయు నతండు గినుక నెఱ్ఱనైన కన్నుంగవతోడి నవ్వు నవ్వుచు నిట్లను ధృతరాష్ట్రమహీపతి సన్నిధి నుత్తమద్విజుల గోష్ఠి నఖిల దేశాచారవిదుండైన వృద్ధబ్రాహ్మణుండు సెప్ప వింటి బాహ్లిక దేశంబున [4]వారు గోమాంసంబు నంజికొని మద్యపానంబు సేసి [5]నగ్నులై యసంగత దురాలాపంబు లాడుచుఁ దిరుగుదు రని తొడంగి యనేకప్రకారంబుల బాహ్లిక దేశనిందోపన్యాసంబు సేసె నట్టి బాహ్లికుల కొడయుండవు తత్కృతంబు లగు పుణ్యపాపంబుల నాఱవపాలు నిన్నుం [6]జేరు నట్లుంగాక వారి యనాచారంబులు వారింపమిం జేసి యాకల్మషంబు లెల్లను నిన్నుం బొందు బాహ్లికులకంటెను మద్రదేశ[7]జాతు లవినీతు లని యార్యులు సెప్పుదురు నిన్నేమి సెప్పంగల దింతవట్టు నెఱింగి నాలుక యడంచి యుండు మనవుఁడు నమ్మద్రేశ్వరుండు.

---

108 1. నపాయమై యెడరు — అ ఆ.ల. మున్నగు ప్రతులు.

109 1. వారి వెఱపింపుము — కొన్ని ప్రతులు; వారిన వెఱపింపుము — వ. 2. సన్నిధి యగుటను నీవు — కొన్ని ప్రతులు. 3. డీయనర్థప్రలాపంబులు — కొన్ని ప్రతులు. 4. బువారు — పెక్కు ప్రతులు. 5. యజ్ఞులై — ఈ.ఉ.ప.న.వ ; మత్తులై — వ. 6. జెందు — కొన్ని ప్రతులు. 7. రాజులు — ఉ. ప ఋ.ద.

110 క. లావులు రథాతిరథసం, ఖ్యావేళం దెలియఁ జెప్పెఁ గాదే భీష్ముఁ
డావచనమ్ములు మనమున, భావింపుము క్రోధమేల బలియుఁడ నీకున్.

111 తే. విడుతు రాష్ట్రుల బంధుల వెలలుగన్న, సమ్మదురు కులకాంతల నంగదేశ
జనితు లగువారు విభుఁడ వజ్జనుల[1]కిట్టు, లేలొకో నొడ్లచరితంబు లెన్న నీకు.

112 క. పరదోషము సెప్పఁగ నేర్తురు గా కాత్మీయమైన దోషంబు మదిం
బరికింపఁగ నధములు నేర్తురె తలఁపక యంటి వలుకతో నుండకుమీ.

113 వ. అని యుల్లసం బాడి మఱియును.

114 ఆ. సకలదేశములను [1]సన్మార్గవర్తులుఁ, గలరు దుష్టతతియుఁ గలిగి యుండు
మది నెఱుంగ నేర్చుమధ్యస్థు ల[2]దియును, నదియు నుగ్గడింతు రెదురు మెచ్చ.

115 వ. ఒకదేశంబు దాఁ[1]గీడయగుట కలుగునే యట్లుంగాక సదాచారదురాచారం బులు దైవం బెఱింగెడు నీ[2] వనాత్మజ్ఞుండ వూరకుండు మనియెడు నట్లయ్యిరు వురు వివాదంబు సేయుట యాలించి చేరి కౌరవపతి సఖభావం బుపన్యసించి [3]రాధేయు [4]రాజత్వగౌరవంబు గొనియాడి మద్రవిభుని వారించిన నాసూత నందనుండు నగుచు శల్యు నుద్దేశించి [5]పాదపాద రథమ్ము బోనిమ్ము బోని మ్మని పలికె నట్లరిగి శల్యుండు సస్మితుం డగుచు వెండియు నర్జును [6]నుగ్గ డించి కృష్ణుండు సారథియును గాండీవంబు సాధనంబునునై యప్రతిహత మనోరథుం డగు నారథికుతోడం బెనంగ [7]నోపితేని నీవ మాకెల్లను[8] రాజ వమ్మేటిమగని యరదంబు మనమొగ్గరంబు సొచ్చి చిక్కువలుచుట గలుగునని యెఱుంగ నయ్యెడు మన మేమఱక యుండవలయు నీతోఁచు దుర్ని మిత్తంబు లనుసంధింపుము.

---

111 1. కెల్లనొడ్ల చరితంబు లెన్న నీ కుచితమగునె — పీ.స.

114 1. న్మాన్యవర్తనులీఁగలరు — ల; న్మార్గవర్తనుల్ — అ.ఐ.బ.ఝు. 2. లెల్లెడ - ఎ.ణ.వ.

115 1. గీడగుట — పెక్కు ప్రతులు. 2. నీవు నూ తాత్మజుండవు — కొన్ని ప్రతులు. 3. ధేయును పరాజ్ఞత్వంబు — ఒ.క.ఖ.ల. 4. సఖత్వ - ఇ. 5. పదపద — ఆ.ఉ.డ. ణ.త.వ. 6. నగ్గించి - పెక్కు ప్రతులు. 7. నోపుదేని — పీ.శ.ష. 8. నయువ రాజువు — ఆ.ఏ.ఝు.ల.

## -: శల్యుఁడు గర్ణునితో నప్పుడు దోఁచు నుత్పాతంబులు సెప్పుట :-

సం. 8-31-38

116 క. [1]వఱళులు మసచేరువఁ బె, ల్లఱచుట బెట్టిదురు గాలి యడరుట గ్రద్దల్
తఱచయి యాడుట వికృతపు, టఱపులతో రేఁగి కాకు [2]లఱచుట గంటే.

117 వ. [1]అని వెండియు.

118 ఆ. సిడము[1] కామ సూడు పడఁకెడు మనతేరి, చుట్టుమెఱయఁ గట్టినట్టి చిఱుత
పడగలందుఁ గంటె వెడలెడు మంటలు, గ్రంబుగాఁగ నోపు రణము నేఁడు.

119 వ. అనియె నప్పుడు రాధేయుండు ధృష్ట[1]ద్యుమ్నాభిరక్షితం బయిన ధర్మ
తనయవ్యూహంబు గనుంగొని రథికవరులం దగిన యెడల నమర్చి తన
మోహారం[2]బాయితంబు సేసికొని యురవడింప నమ్మద్రపతి యత్తెత్తి
యాలోకించి.

120 ఉ. అల్లదె యర్జున ధ్వజవిహారము గానఁగ నయ్యెడుం గపిం
ద్రోల్లసనంబునన్ మెఱసి యుద్భటులైన త్రిగర్తు లేపు శో
భిల్లఁగ వారె యన్నరుని బెట్టుగఁ దాఁకి రతండు నంప పె
న్వెల్లి [1]నిగిడ్చి ముంచె నదె నింగి గణధ్వని వొంగ వారలన్.

121 ఆ. అనిన గర్ణుఁ డిట్టులనియె సంశప్తక, బలముచేతఁ బొదువఁబడి కిరీటి
మేఘపిహితుఁ డైన మిహిరునిచాడ్పున, వాఁడి లేక యున్నవాఁడు గంటె.

122 వ. అనుటయు శల్యుఁడు.

---

116 1. వఱడులు — అ.ఆ.ఈ.ఒ.వ. 2. లాడుట — పీ.శ.ప. మున్నగు ప్రతులు.

117 1. ఈ వచనము కొన్ని ప్రతులలో లేదు.

118 1. కర్ణ సూడు — వ.

119 1. ద్యుమ్నాది — ఖ.జ.ల. 2. బుమహితంబు — అ.ఆ.ఒ.ఝ.ల.

120 1. నిగుడ్చి — పెక్కు ప్రతులు.

123 చ [1]వరుణుఁడు నీళ్ళచేఁ జెడునె వాయుసఖుండు మహేంధనోత్కర
స్ఫురణ నడంగునే నరుఁడు పోరుల [2]నేపఱు చేలకల్లునె
వ్వరికిని వానిఁ గిఙ్ఞులుప వచ్చునె గాలిఁ బరాభవింపఁగా
దొర[3]కొనినం జలంబు మెయిఁ దోయధి యంతయుఁ ద్రావ వచ్చునే.

124 ఆ. దేవతలకునైన దేవేంద్రపుత్రుని, నాహవమున గెలువ నలవి గాదు
మనము గెలుతు [1]మిట్టిమాట లాతనిఁ జేరఁ. జనక యాడి దీన సంతసింపు.

125 ఉ. మేరువువోలె నొప్పిన సమీరణపుత్రుని పేర్మియుఁ మహో
దారుఁడు ధర్మనందను నుదాత్తతయుఁ విజయానుజన్మ తే
పారఁగ నున్న సొంపును నహంకృతి యేర్పడ ద్రౌపదీసుతు
ల్వీఁగల మీఱి పొల్పెసఁగు[1]లీలయుఁ జూడుము సూతనందనా.

126 వ. పాండవులు ధర్మపరు లెవ్వలన ధర్మంబు గలుగు నవ్వలనికి జయంబు గలు
గుట దప్ప దను సమయంబున సంశప్తక కులంబుం గనుంగొని మన సైన్యం
బును నవ్యసాచిం జూచి వారిసేనయును గడంగి యొండొంటితోఁ దాఁకిన
గంగాయమునల [1]సంపాతంబుచందంబు దోఁచె నట్టియెడం గురురాజు
రాధేయుని మద్రరాజుం దగురాజులను సాదరావలోకనంబున సంభావించి
యిట్లనియె.

127 ఆ. ఎద్ది ప్రియము సేయు నేపారుశూరుల
చిత్తములకు నది యుదాత్తభంగి
నొదవె మీకు బాహుమదమునఁ గొనియాడుఁ
డుగ్ర శౌర్యమహిమ యుల్లసిల్ల.

128 క. బలు పెనఁగఁ బాండుపుత్రులఁ, బొలియించిన నతులరాజ్యభోగంబును వా
రలచేతం బొలిసిన నుజ్జ్వలనాకసుఖంబు గలుగు ప్రాలుఁడు పోరన్.

---

123 1. ఈపద్యము 'వ' ప్రతిలో లేదు. 2. నేమరు చేలగల్గు — ఖ.ఙ. 3. కొను నేచలంబు....
వచ్చునే — పి స.

124 1. మనెడి — కొన్ని ప్రతులు.

125 1. పీకయు — వ.

126 1. బలంబులంగనుంగొని — వి.శ.ష. 2. సంవాదము — కొన్ని ప్రతులు,

129 వ. అనిన వార లందఱు నుబ్బి సింహనాదంబులు సేయఁ దూర్యనినదంబులు సెలంగ సైన్యంబులు సంతసంబునం బొదలె నప్పు డశ్వత్థామ రథికజనంబుల మనంబులం బ్రమదం బెసంగ నిట్లనియె.

130 క. ఆయుధము విడిచి యుండఁగ, సాయకగురు మీరు సూడఁ జంపినకష్టో
పాయుని ధృష్టద్యుమ్నుని, మాయించియ కాని [1]తొడిననుఱు వే నూడ్పన్.

131 క. కడువడి వడముడియును గ, వ్వడియు నతనిఁ గావఁ బూని వచ్చిర యేనిం
[1]జెడుదురు మచ్చాపంబున. వెడలు వివిధవిశిఖశిఖల వేఁడిమిచేతన్.

132 చ. అన విని యవ్వరిష్ఠ రథికావలి పెల్లుగఁ బాండుపుత్రయో
ధనులపయిన్ వెసం గవియు దర్పము వార లుదగ్రవృత్తి మా
ర్కొనిన మహోగ్రభంగియును ఘోరపులీలల విస్మయం బొన
ర్చె ననిమిషాంతరంగములఁ జెల్లె రణంబు నుదీర్ణ రౌద్రమై.

133 క. జనసంక్షయంబు పెల్లై, మనవచ్చుం బ్రళయకాల మయ్యెనొ కా కెం
దును నిట్టివి గలవె యని, మనమునఁ దలపోయ వలసె మముబోఁటులకున్

134 వ. అట్టియెడ.

135 ఉ. ప్రీతి యెలర్ప వీరుల వరించుటకుం జనుదెంచి యప్సరో
వ్రాతము గంధపుష్పపరివర్షణకేళి యొనర్ప సౌరభం
బాతటి సంచరించు [1]లలితానిలుఁ డెక్కుడు సేసి [2]పిచె సం
జాతనవీనఘర్మ[3]జలజాలకసైనికలలనీయుఁడై.

136 ఉ. ఆసమయంబునం గురుకులాగ్రణి భీమునిఁ దాఁకె భైరిసం
త్రాసనమత్తవారణకదంబసముద్భటుఁడై యతండునుం
జేసె రణంబు దప్పి బలసేన దలంకెడునట్లుగా సము
ద్భాసితదుర్ని[1]వార్యబహుబాణ[2]విసారణదారుణోద్ధతిన్.

---

130 1. యొసలిమరుస్ — వ.శ.ష. కొన్ని ప్రతులు.

131 1. బడుదురు — పెక్కు ప్రతులు.

135 1. మలయానిలుడు — ఇ.ఈ.ఊ.ఎ.వ.ఐ.గ.వ. 2. యిచ్చె — కొన్ని ప్రతులు. 3. కణజాల — వి.ద.శ.ష.

136 1. వారబహు - పెక్కుప్రతులు. 2. విహారణ - ఇ.ఈ.ఉ.ద.న.వ.శ.ష; విదారణ — క.జ.డ.త వ.

137 క. పదపడి రాధేయుం డు,న్మదవృత్తిం గవిసె గుణ నినాదంబును బె
ట్టిదమగు రథనిస్వనముం, జదల నిగుడఁ బాండవాగ్రజన్ముని దెసకున్.

138 వ. ఇట్లు గవిసిన మన సైనికు లిట్లని రివ్విధంబున ధర్మనందనుం గదియ నడరిన నరుండు వచ్చి యడ్డంబు సొచ్చునపుడు.

139 చ. నరునకు సూతసూతికి రణంబగు నేఁ డతి ఘోరభంగి నం
దరయ నితండు గీ టడఁచు నాతని నన్నటు లున్నవాఁడు దు
ర్భరరిపుబాధ దక్కి కురురాజు సుఖిత్వముఁ బొందు నిప్డు గం
డరదము సేరి [1]యీతని మహాస్త్రవిలాసము సూత మేర్పడన్.

140 క. గెలు పెల్లభంగి నితనికిఁ
గలుగుటను [1]తలంపు పుట్టఁ గా[2] నిపుడు మనం
బుల జనియించు మనోరథ
మాలనడుట[3]యుఁ బోర నెఱుఁగ నయ్యెడు నదియున్.

141 వ. అనుచుఁ గూడుకొని రథకరితురగ సమ్మర్దనిర్దళితభూభాగంబుగా నురవడింప రాధేయుం [1]దరిభీషణంబగు [2]రథంబున.

142 తే. మిగిలి యప్పాండవాగ్రజు మగఁటిమియును
[1]జలముఁ గోల్పుచ్చి తూలఁ బోఁ బలికి మెఱసె
నధిప యతనికి వీఁకమై నడ్డపడఁగఁ
గడఁగు నద్దెస యోధుల గర్వ మడఁచి.

---

139 1. యిద్దరి మహాస్త్ర - ఒ.క.ఖ.వ.

140 1. విధంబుదోఁచెఁగతమిపుడు — శ.ష. 2. యొఁపోరనెఱుఁగనయ్యెడునదియు - శ.ష.

141 1. దరిభీఁఇణంబగు - అ.ఇ.ఊ.క.వ. మున్నగు ప్రతులు; దదరిభీషణంబగు - ఆ.ఈ. ఒ.ఌ. మున్నగు ప్రతులు. 2. రణంబున - అ.ఆ.ఇ.ఈ. మున్నగు ప్రతులు.

142 1. బలము — కొన్ని ప్రతులు.

## * -: కర్ణుఁడు ధర్మజుపైఁ గవిసి విజృంభించుట :-

సం. 8-31-5

143 వ. అనిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియెఁ గర్ణుండు [1]దన మొన యెట్లాయితంబు సేసెఁ గౌంతేయముఖ్యసైన్యసన్నాహం బెట్టిదతం డతనిం బొదివిన యప్పుడు గవ్వడి యెవ్వలన నుండె నవ్వీరుం డన్నకడ నున్న నా సూతనందనున కట్లు సేయ వశంబగునే వాసవుండు సకలసురగణంబులతోఁ బన్ని యన్నరునిపై వచ్చి ఖాండవంబు గాల్పకుండఁ గావం జాలెనే [2]బ్రదుకున కాసపడు మగల కతని మార్కొనవచ్చునే రాధేయునకు వచ్చుంగాక యనుటయు.

144 తే. ఇట్టు లను సంజయుం డమ్మహీశ్వరునకు
నంగపతిమోహరంబు తెఱంగు ధర్మ
సుతునియొడ్డువిధంబు నర్జునుఁడు వారి
పోరునెడ లేమియును మీఁది పోరువినుము.

145 వ. కృపాచార్యుండును గృతవర్మయు మాగధులు వలపట శకునియు నులూకుండును గుఱ్ఱపు[1]దడంబులతో వారికెలనను సంశప్తకగణం బిరువది నాలుగువేలు రథికముఖ్యులగ్గలిక నుల్లసిల్లి దాపటను నీకొడుకులందుఁ గొందఱు కాంభోజశకయవనసైన్యసమేతంబుగా వారియపులను బహుబల భాసితుండై దుశ్శాసనుండు వెనుకనుం గతిపయసోదరపరివృతుండై కురురాజు పిఱుందను నశ్వత్థామప్రముఖయోధులు గరినికరకృతసన్నాహులై యన్నరపతి నియోగింప నతనిపజ్జ నిలువ నిజపుత్రులుఁ దనచుట్టునుఁ గదిసి యెసక మెసఁగు బరవ[2]శంబున మెఱయ సూతసూనుండు సేనాముఖంబునకుం దిలకంబై నిలిచి పొలిచె నట్లు మోహరించి మద[3]కల మాతంగంబుల తఱచుకతంబున [4]మొయిళ్ల మొత్తంబుల కైవడిం గాఱుకొను నమ్మోహరం నురవడి నడిపించు నాకర్ణునిం గనుంగొని కౌంతేయాగ్రజుండు గాండీవి రావించి యిట్లనియె.

---

* ఈ కథాసందర్భమున భండార్కరు ప్రతియందున్న క్రమమునకును తిక్కనసోమయాజి అనుసరించిన క్రమమునకును భేదము కాన్పించుచున్నది. తిక్కన కథన పద్ధతి కుంభకోణప్రతిక్రమమును సన్నిహితముగా ననుసరించినట్లున్నది.

143 1. మనమొన - త.వ. 2. బ్రతుకు - పెక్కు ప్రతులు.

145 1. దళంబులును - పెక్కుప్రతులు 2. సంబున - కొన్ని ప్రతులు. 3. గళన్మాతంగంబుల - ఊ. 4. మొగుళ్ళ - పెక్కు ప్రతులు.

146 ఉ. సూతతనూజు మోహరము సూచితె యెంతయు [1]గట్టియై సము
ద్ద్యోతితభంగిఁ దోఁచె నది యుక్కునఁ బైవడి యుబ్బలంబు ని
ర్ధూతముసేయకుండఁగ నెదుర్కొని యెమ్మెయి నిల్వరింత మ
న్నీతి విధింపుమా బలుపు నేర్పును దజ్జులు [2]పిచ్చలింపఁగన్.

147 వ. అనుటయు సంక్రందన నందనుండు.

148 తే. సారవంతమై కర్ణుని సైన్య మురవ
ణించుఁ గా కేమి దీనికి నృపవరేణ్య
పూనిచేయంగవలయుఁ బ్రధానకార్య
మతని [1]సమయించుటయ నాకు [2]నది భరంబె.

149 వ. అనినవిని యమ్మనుజపతి యతని కిట్లను నట్లేని నీవు రాధేయుని గెలు
వుము భీమసేనుండు సుయోధనుని నకులుండు వృషసేనుని సహదేవుండు
సౌబలుని శతానీకుండు దుశ్శాసనుని సాత్యకి గృతవర్మను ధృష్టద్యుమ్నుండు
ద్రోణపుత్రుని ద్రౌపదేయులు శిఖండియుం దారును దక్కటిధార్త
రాష్ట్రులం దలపడువారేను గృపాచార్యునితోడం బెనంగెద ననుటయు
నట్లకాక యని యతండు మున్ను దన[1]నిలిచిన [2]నెలవునకుం జనునెడ
నయ్యధిష్ఠిరు పనుపుతెఱంగు వారలందఱకు నెఱింగించె నతండు వల
పటివలన సైన్యాగ్రవర్తి యయ్యెను వృకోదరుండు వామపార్శ్వ
[3]వర్తియయ్యెను శైనేయద్రౌపదేయసమేతంబుగా నప్పాండవాగ్ర
జుండు మధ్యభాగస్థుఁడయ్యె నన్న యమ్మోహరం బాసూతనందను
మొన యురవడి సరకుగొనక మార్కొనియె ననవుడు నాంబికేయుండు,

150 మ. నరుఁ డమ్మె విని వచ్చె నన్నరునకు న్సంశప్తకశ్రేణికి
న్దర [1]మత్యుద్భటభంగిఁ జెల్లుటయు ము న్సూచించి తీ వయ్యధి
ష్ఠిరునిం గర్ణుఁడు దాఁకి యోర్చె ననియుం జెప్పంగ వింటిన్ రణం
బరయం జిత్రము సెప్పు మత్తెఱఁగు సువ్యక్తంబుగా సంజయా.

---

146 1. సూటియై - వ. 2. నిచ్చమెచ్చగన్ - చ.

148 1. మాయించుటయ — ద. 2 నభిమతంబు - ఊ.

149 1. విడిచివచ్చిన-బొ. 2. యెడకుం - కొన్ని ప్రతులు. 3. గతుడయ్యె-పెక్కుప్రతులు.

150 1. త్యద్భుత — కొన్ని ప్రతులు.

151 వ. అని యడిగిన [1]సంజయుం డమ్మానవపతి కి ట్లను నట్లు ధర్మజుండు [2]సెప్ప
కాని యయ్యిరువాఁగుం గదిపినప్పు డన్నియమంబు నడవక కయ్యంపు
[3]ఔచిత్యంబున నొండుదెఱంగు సెల్లె నది యెఱిగించెద నవధరింపు మవ్వి
ధంబున మొనలు రెండును నొండొంటిం దార్కొను సమయంబున సవ్య
సాచి గర్జునడచు చక్కటికి [4]నడరం గడంగినఁ గ్రాలు కపికేతనంబు గనుం
గొని తెంపుపెంపునఁ బొంపిరివోవుచుఁ ద్రిగర్తాది సంశప్తకులు సరభ
సంబుగా నడ్డపడి పైకొని తఱిమి పొంగినపయోనిధిం బోలిన నబ్బలి
యుండు సెలియలికట్టంబోలి నిలువరించి మాతంగప్రముఖ సేనాంగ
సకలాంగశకలంబుల నిలాతలంబు గప్పుచుండ నొండొండ పేర్చి యాబలం
బాబలమర్దననందను నరదంబు ముంచికొనిన నవ్వీరుండు విజృంభిత విక్ర
ముండై బడబాగ్ని కీలాకలాపంబుచందం బగు సాయకనికాయంబు నిగి
డించుచు నెక్కుడు మదంబున నమ్మూఁకలం [5]ద్రెక్కొనుచుండఁ దత్ప్రకా
రం బాలోకించి రాధేయునకు శల్యుం డిట్లనియె.

152 ఉ. అల్లదె యర్జునధ్వజవిహారము గానఁగ నయ్యెడుం గపీం
ద్రోల్లసనంబునన్ మెఱసి యుద్భటులైన త్రిగర్తు లేపు శా
ఖిల్లఁగ వారె యన్నరుని బెట్టుగఁ దాఁకి రతండు నంప పె
న్వెల్లి [1]నిగిడ్చి ముంచె నదె నింగి గుణధ్వని వోంగ వారలన్.

153 వ. అని చెప్పుచూపెఁ బదంపడి భారద్వాజపుత్రుని [1]బరవసంపుమాటల
నాటోపంబు మిగిలి మనరథికులు గవిసిన దారుణరణం బయ్యె నని
యాకర్ణించి తది యేర్పడ వినుము వివరించెద.

---

151 1. సూతనందనుడు, సూతసూనుండు — అనియు పాఠములు. 2. సెప్పుటయుఁ గాని — పెక్కు ప్రతులు. 3. విధంబొండు తెరంగు సెల్ల — కొన్ని ప్రతులు. 4. నడనంగ డంగిన — కొన్ని ప్రతులు. 5. దెరల్చుచుండ — ఱ.ణ.త ; నెదుర్కొనుచుండ — ప.

152 1. నిగుడ్చి — పెక్కు ప్రతులు.

153 1. బవరంపుమాటల — కొన్ని ప్రతులు.

154 సీ. కృపుఁడు సౌబలుఁడును గృతవర్మయును నలిఁ
జెలఁగుమూఁ కలతోడ బెలుచఁగవిసి
కాశ [1]కైకయ మాత్స్య [2]కోసల పాండ్యాది
బలములఁ దాఁకి రగ్గలిక మెఱయ
నారెండు వాగుల నాయుధంబులయెఱ
మంటలుఁ బొల్లుచు మింటఁ బుడమిఁ
జూడ నక్కజముగ శోణితధారలు
ప్రచురధూళీ[3]తిమిరముల నడఁప

తే. భగ్నరథములు నిపతితేభములు నిహత
హయములును మృతభటులును రయమునకు వి
ఘాత మొనరింప నున్మద గమనభంగు
లందు [4]వెరవులు మెఱయఁ బోరాడి రధిప.

155 వ. ఆలోన.

-: కర్ణుఁడు పాంచాలకుమారుల ననేకులం జంపుట :—

సం. 8—43 (కుంభ)

156 ఉ. మేలిమదావళంబులును మేటిహయంబులుఁ [1]దమ్ముపిండు నా
భీలతఁ జుట్టిరాఁగ రథబృందముతోఁ గురురాజు కర్ణుదో
ర్లీలకుఁ దోడ్పడం గ[2]డఁగె రేణువుదీర్ణముగా నతండు పాం
చాల బలంబుపై నడరె శౌర్య సముద్భట బాహువీర్యుఁడై.

---

154 1. కేకయ — పెక్కు తాళపత్ర ప్రతులు. 2. కాశ్మీర – ఎ.గ. 3. తమః పటల
మణప — ఞ.వ. 4. వెరవులు మెఱయ — పీ.శ.ష ; బలుపెరవోలయ — వా.

156 1. గాల్పులంబు – క.ఖ.ఘ. 2. రథరేణువు — త.

157 వ. అబ్బలంబునకు బాసట[1]యై చేదిసైన్యంబును బెనుఁ[2]బ్రాపై పాండవా
నీకంబునుం దఱిమినఁ బెఱిగిన దర్పంబునం బ్రదీప్తుం డయి యక్కర్ణుం
డాగట్టిమూఁకలం దఱిసి మెఱుంగు వాలమ్ములు వఱప నవి పీనుంగుపెంట
లగుచుండ నుఱక యుక్కునం బొదివిన బలుమగలకుం గీర్తియు స్వర్గం
బును నొసంగి తమవారికం బెఁ బ్రమోదభరితులం జేయుచు సాయకా
సారంబులు వఱఁగించుచు బహువిధరథప్రచారంబు లుల్లసిల్ల నాసేనలును
గృపకృతవర్మాది యోధబృందంబులతోఁ బెనంగు మొనలును నొక్క
టిగాఁ గలంచి యందు శోణితజలంబును మాంసమజ్జామస్తిష్కకర్ద
మంబులను బతితాతపత్రహంసంబులనుం బోలుచున్న నదీప్రవాహంబులు
వఱపె ననుటయు ధృతరాష్ట్రుండు ధర్మనందనుం గర్ణుండు గదియునప్పు
డతని కక్కడ నడ్డపడుట కెవ్వరు గడంగి రెక్కడ నితనికిఁ దోడ్పడ నెవ్వారు
[3]గలిగి రనుటయు సంజయుం డవ్విభున కి ట్లనియె.

158 తే. ఇవ్విధంబున సేనల గ్రొవ్వడంచి
సూతసూనుండు ధర్మజుకేతనంబు
దెసకు [1]నడర ధృష్టద్యుమ్నుఁ డెసక మెసఁగ
బంధులును దాను[2]వడి నడ్డ నడిచె నధిప.

159 క. వారలఁ గడచి ప్రభద్రకు లారాధేయుపయిఁ గవియ నాతండు మహో
దారుల నేడ్వుర భద్రా,కారుల నారాచసప్తకంబున గూల్చెన్.

160 క. కని పాంచాలురు [1]గోపం, బున దర్పము నెఱయఁ మెఱయఁ బొదివిన రాధా
తనయుం డిరువదియేవురఁ, దునిమె నిరువదేను పెడఁదతూపులఁ బెలుచన్.

161 క. వెండియు నేపునఁ బైకొని, చండ [1]శర[2]ప్రకరములు పెనం గురియఁగ ను
ద్దండతఁ బాంచాలురఁ గర్ణుండేవురఁ [3]జంపె నైదుక్రూరాస్త్రములన్.

---

157 1. యైనచేది — పి.శ.ష. 2. బ్రాపైనపాండవ — పి.శ.ష. 3. గదిసిరి — శ.ష మున్నగు ప్రతులు.

158 1. నరుగ — ఎ.ఔ.గ.వ ; నడువ — జ.డ. 2. వెస — కొన్ని ప్రతులు.

160 1. రోషంబున — ఉ.ద. 2. యేడ్వుర — ఎ.గ.వ.

161 1. తరప్రవర్షములు — ఇ ఎ.గ. 2. ప్రదరాశనులు — క.ఖ ; ప్రచయములు — ఉ.ద.శ.ష. 3. దునిమె — శ.ష.

162 వ. ఇట్లు భానుదేవ చిత్రసేన సేనాబిందు తపన శూరసేనులం గీటడంచి యా
టోపదీపితుం డయి చక్రరక్షకులగు సుషేణ సత్యసేనులు వెనుక బలసి వచ్చు
వృషసేనుండు నిమ్మువ్వురు గొడుకులుఁ గడిమి రూఢి కెక్కం దనకు రణ
క్రీడకుం దోడుపడి యెడు నుల్లాసంబున నుల్లంబు పల్లవింపం బాండవబలంబు
లం [1]గలంచు నయ్యంగపతిమీఁద ధృష్టద్యుమ్న శిఖండి జనమేజయ ప్రముఖ
పాంచాలకుమారులును సాత్యకినకులసహదేవద్రౌపదేయులును కేకయ
మాత్స్యయోధవీరవ్రాతంబును భీమసేన పురస్సరంబుగాఁ దోతెంచిన
బహుళ జలధరంబులు ధరణీధరంబు వయిం గురియు పెనుసోనచందంబు
దోఁప వివిధాస్త్ర[2]శస్త్రంబు లతనిపయిం [3]బరఁగింపం గనుంగొని కౌరవేశ్వ
రుండు దుశ్శాసనశకునితదీయతనయులు దసకెలఁకులం దఱుమం గరిఘ
టలతోడం గడంగి యవ్వడముడిని మార్కొని.

163 క. తానును వారును దూపుల, వాన పయిం గురియ నతఁడు వారించి గళ
దానాంబులోలమధుకర, మైనగజవ్రజముఁ బటుశరార్చులఁ బొదివెన్.

164 క. పొదివెడు నప్పుడు శౌర్యో
న్మదుఁడగు నయ్యనిలతనయు మార్గణములు బె
ట్టిదముగఁ [1]గవియుడు నోటమి
యెదురుపలేరైరి కురు[2]నరేంద్రుడు వారున్.

165 మ. బలుగాలిం నలుదిక్కులం జెదరు నభ్రశ్రేణి చాడ్పున్నను
జ్వల[1]సూర్యాంశులచేత విచ్చు నిబిడధ్వాంతంబు నందంబుఁ జూ
డ్కులకుఁ దోఁచెఁ బ్రచండసంగరపటిష్ఠుం డైన యాభీము తూ
పులమొత్తం బడరం గరిప్రకర ముద్భూతార్తియై తూలినన్.

---

162 1. గలగించు - కొన్ని ప్రతులు. 2. వ్రాతంబులు - ఓ.చ.ణ.వ. 3. దొరగింపం - పెక్కు ప్రతులు.

164 1. గవియుట - కొన్ని ప్రతులు. 2. నరేంద్రుండు - పీ.శ.వ. మున్నగు ప్రతులు.

165 1. సూర్యార్చుల - ఎ.త.వ.

166 వ. అట్టియెడం గృపప్రముఖరథికులు రాధానందననందనులకుం దలకడచి పవనసంభవు పార్శ్వంబులం దఱుము ధృష్టద్యుమ్నాదియోధులం దలపడిరి దుశ్శాసన[1]ప్రభృతులును వారిం గూడికొనిరి కర్ణనందను లక్కిమ్మీరమర్దనుం దాఁకి రందు సుషేణుండు.

167 క. ఖరభల్లంబున నాతని, శరాసనము ద్రుంచి నారసములు రయమునై
నురమున నేడు సొనిపి ని,ష్ఠురనినదం బెసఁగ నార్చె సురలు నుతింపన్.

-: భీమసేనుఁడు కర్ణనందనుఁ డగు సత్యసేనుం జంపి విజృంభించుట :-

సం. 8-43-24 (కుంభ)

168 సీ. కనలి యొండొకవిల్లుఁ గొని కీచకాంతకుఁ
దక్కుమారుని చాపయష్టి విఱుగ
నేసి పైఁ బల్లూఁపు [1]తిరిసేడు నాటించి
తన్నుఁ బట్టొడరు రాధాతనూజు
నుబ్బు వాలమ్ములు డెబ్బదిమూఁట వా
రించి తత్సుతుఁడు దోర్బలం మెఱయఁ
జెరిన నా సత్యసేను రథ్యంబుల
సూతుఁ గార్ముకమును కేతనంబు
తే. నేడు తూపులఁ దునుమాడి యేచి మూఁడు
నారసము లంగమునఁ గ్రుచ్చి నాకమునకు
వికసితాంభోరుహముఁ జాపు [2]వెరవు దోఁపఁ
దునిమె నెసఁగ గత్తివాతియమ్మున శిరంబు.

169 వ. తునిమి దోస్సారంబు [1]దుర్వారంబుగా నుక్కునం దక్కటిరథిక జనంబుల పయి నడరి కృపకృత[2]వర్మాది రథికవరుల కోదండంబులు దుండంబులు సేసి వారిం గ్రూరమార్గణంబుల మర్దించి దుశ్శాసనుని సాయకత్రయంబునను సౌబలునిఁ దద్ద్విగుణబాణంబులను గ్రుచ్చి యులూకుని నతని

---

166 1. ప్రముఖులును — ఊ.త.శ.సు.

168 1. తిరుపటి నాటించి — ఎ,గ ; తిరుగడినాటించి — ప. 2. వెరపు — కొన్ని ప్రతులు.

169 1. దుర్నివారంబుగా — తి.ఎ.గ. 2. కృతవర్మల కోదండంబులు — 'స' మున్నగు

తమ్ముని నొక్కమ్మడి విరథులం గావించి కర్ణుకొడుకుం గనుంగొని యోరి సుషేణా పొలిసితి పొమ్మనుచు బలునారసంబు నిగిడించిన నది నడుమన కర్ణుండు నఱకి మెఱుంగుటమ్ములు మూఁడు మేనంబఱప నుఱక మఱియు నట్టి మార్గణం బక్కుమారు నుపలక్షించి యేసిన నా సూతనందనుం డది యునుం ద్రుంచి యవ్వడముడిమీఁదఁ ద్రి[3]సప్తతి[4]తీవ్రప్రదరంబులు వరఁ గించెనప్పుడు నకులుండు గవిసిన.

170 ఆ. చిత్రచాపముక్తశితశరపంచకా, హతశరీరుఁ జేసె నాసుషేణుఁ
డేచి నకులుఁడతని నిరువది యమ్ముల, నొంచి కర్ణుమనము [1]నొవ్వనార్చె.

171 చ. అలిగి సుషేణుఁ డెంతయు రయంబునఁ దొమ్మిది దొడ్డ[1]వాఁడితూ
పులు మెయిఁ జొన్పి విల్ దునిమి పొంగిన నొండొక దీప్తచాప మ
గ్గలిక దలిర్పనెత్తి వెసఁ గార్ముక దండము ద్రుంచి నొంచె దో
ర్బలవిభవం బుదాత్తముగఁ బార్థునితమ్ముఁడు సూతు నాతనిన్.

172 ఆ. అన్యచాపలసితహస్తుఁ డై కడఁగి సు,షేణుఁ డతని [1]షష్టిబాణ[2]గాఢ
నిహతదేహుఁ జేసె సహదేవుఁ డడరిన, మేటితూపు లేడు మేనఁ గ్రుచ్చె.

173 క. అయ్యిరు[1]వుర యబ్బాలుని, కయ్య మమరదైత్యరణముకరణి మహోగ్రం
బయ్యె వృషసేనుఁ డత్తఱి, నియ్యాని సాత్యకి నెదిర్చె నిష్ఠురయ మడరన్.

174 సీ. సాత్యకి వృషసేను సప్త[1]సప్తతిమార్గణంబులఁ బొదివి బాణత్రయంబు
సూతుపైఁ బఱపిన నాతఁడాతని పెనుఁ[2]గడఁతవాలికయమ్ము గాఁడ నేయఁ
గోపించి మూఁడు బల్లూపుల సారథి నొకభల్లమున [3]విల్లు నుజ్జ్వలాస్త్ర
సప్తకనిహతి నశ్వంబుల నేకకాండ స్ఫూర్తిఁ గేతుదండంబుఁ దునిమి

---

పెక్కు ప్రతులు. 3. సప్తకదీప్తప్రదరంబులు — ఆ.ఝ. 4. ప్రదీప్తప్రదరంబులు — ఖ.ట.వ.

170 1. సునొవ్వ — శ.ష.వ. మున్నగు ప్రతులు.

171 1. నారసంబులు — వీ.

172 1. షష్ఠిబాణ — కొన్ని ప్రతులు. 2. ఘాతనిహత — ఒ.ట.వ.

173 1. వురునబ్బాలుని — పెక్కు ప్రతులు.

174 1. వింశతి — వ. 2. గణత — స. మున్నగు ప్రతులు. 3. తేరును — అ.ఆ ఝ.ల.

178 వ. వియచ్చరు[1]లు వెఱఁ గందిరి వెండియు నవ్వీరుండు వారల నందఱ నస్త్ర ధారలం బొదువుచు నెత్తఱం బెఱవారని బాణాంధకారంబునఁ గప్పినం [2]ద్రిప్పికొనియును దూలంగియు, దెరలియు మరలియు నారథిక[3]సంఘంబు దైన్యంబు నొందె నంత ధర్మనంద[4]నుని బాదింపఁ[5]దలం పెద్దిన.

179 క. ఆ రాధేయుం డాతని, పైరయమునఁ గవియు ఘోరభంగిఁ గని మహో దారంబుగఁ జేదిబలము, [1]బోరన నెడసొచ్చెఁ దూర్యములు మొరయంగన్.

180 ఉ. సూతతనూజుఁ డబ్బలము సొచ్చి శతత్రయయోధవీరులం
[1]జేతులతీఁట వో నుఱుము సేసి విశృంఖలదర్పదుర్దముం
డై తఱుమంగఁ గల్పిత[2]రథాక్రమ మొప్పఁగ వచ్చి ధర్మజుం
బ్రీతుని జేయుచుం గడిమిఁ బేర్చిరి సాత్యకియున్ శిఖండియున్.

181 క. వారికిఁ దోడ్పడి యక్కడి, వీరులు గొందఱు గడంగి వివిధోగ్రశరా సారము లంగాధీశ్వరు,పై రయమునఁ గురిసి రుగ్రభంగిఁ జెలఁగుచున్.

182 క. కురుపక్షయోధులును సత్త్వగురులై యారథికవరులఁ దాఁకి భుజావి స్ఫురణము సూపిన నద్భుత, కర మయ్యెఁ దదవసరమున కయ్యం బధిపా.

183 వ. ఆ సంకులసమరంబునందు.

184 శా. బాణజ్వాలలు బెట్టుపర్వ గగనప్రక్షోభణజ్యాలతా
క్వాణస్ఫూర్తిఘటచ్ఛటారవముగాఁ గర్ణోగ్రదావాగ్ని య
క్షీణోదగ్రతవైరిసైన్యవనభస్మీభావ[1]నిర్వాహపా
రీణం బై వెలుఁగొందె నిర్జరులు వర్ణింపంగ నే ముబ్బఁగన్

---

178 1. లచ్చెరువొంది — పీ.ఉ.ఊ.ద.శ.ష; లువెగడొంది — ట. 2. ద్రిప్పుకొనియును — పెక్కు తాళపత్త్రి ప్రతులు. 3. సైన్యంబు — ఉ.గ.డ.ల.శ.ష. 4. నుండు దలపడిన — పీ. మున్నగు ప్రతులు; నుం బాటింపఁ దలపేదిన — ఇ.ద.వ.శ.ష; ధర్మనందనుం దలపడం దరివేచి తరమిని — ఇ. 5. దలిపెత్తిన — క.ణ.ల.

179 1. భోరున — పెక్కు తాళపత్త్రి ప్రతులు.

180 1. ప్రీతిపురినివాసులుగబేర్చి — జ. 2. రథక్రమ మొప్పగ - శ.ష. మున్నగుప్రతులు; (యతిభంగము) రథావలి యొప్పగ — జ.

184 1. నిర్దాహ — అ.ప.ఐ.ఒ.డ.

185 వ. అమ్మహోగ్రవిజృంభణంబున.

186 క. ఆటోప [1]మడఁగి యచ్చటఁ, మేటిమగలు ఱిచ్చవడఁగ [2]మెయిగలి గర్ణుం
[3]డేటుపవికిఁ గవిసె ధను,ర్జ్యాటంకృతి సెలఁగఁ బాండవాగ్రజు [4]మీఁదన్.

187 వ. ఇత్తెఱంగునం గవిసిన నతనిమీఁద నప్పృతనీనాయకుండు సాయకజాలం
బులు వరగించిన నతండు నుఱక యతిరయంబున నవి వారించి.

188 సీ. నవ్వుచుఁ జాపంబు నడిమికిఁ ద్రుంచి మై[1]మఱువుఁ దొంబడిశితమార్గణముల
భేదింప రత్నప్రభాదీప్త మగునది సౌ[2]దామనీచారుజలద మంబు
జాప్తుని[3]తనువున కడ్డమై యుండి వాతాహతంబై పాయునట్లువోలెఁ
బడుటయు మణిమయాభరణసుందరమైన యతనిగాత్రము సతారాంబరంబుఁ

తే. బోలి యప్పుడ యాసూతపుత్రుచేత, రక్తమయమయి పల్లవోద్రిక్తకల్ప
తరువుచందంబు నొందె నతండు రాజ, ధర్మమూఁది చలింప కదల్చె[4]నధిప.

189 వ. ఇట్లు దల్చుచు.

190 క. చదల మెఱుంగులుపర్వం, గొదమపిడుగు నట్ల నిగుడఁ గుంతీసుతుఁ డు
బ్బు దలిర్ప శక్తివైచిన, నది కర్ణుఁడు సప్తభల్లహతి [1]నెడఁ [2]దునిమెన్.

---

186 1. ముడిగి — కొన్ని ప్రతులు. 2. మేఁగలి, మైఁగలి — అనియు పాఠములు; మెయిబడి — పి.ఎ.ఖ.గ.త. 3. డోటవిడిచి — ఎ.త.వ. 4. జుంబెలుచన్ — వా; మీఁదన్ — ఆ.ప.ఐ.ఒ.ఝ.ట.ల.

188 1. మైమఱువు — ఐ.డ.వ. 2. దామినీ — కొన్ని ప్రతులు. 3. తేరికి నడ్డమై — శ.ష. 4. బెలుచ — పెక్కు ప్రతులు.

190 1. వడి — కొన్ని ప్రతులు. 2. దుంచెన్ — ట.

191 సీ. పాండవాగ్రజుఁడు దర్పంబున వేగంబుఁ గొప్ప నవ్వీరుని యురమునందుఁ
గరముల ఫాలభాగంబున నాల్గుతోమరములు [1]సొనిపి నెత్తురులు వఱపి
యార్చినఁ జేర్చినయగ్గలికంబున నాసూతనందనుఁ డతని సూతుఁ
జంపి కేతువుఁ ద్రుంచి శాతశరంబుల నంగంబు నొప్పించె నపుడు సాత్య

తే. కియు శిఖండియు నెడ సొచ్చి రయము బలువు
మెఱయ రాధాతనూజుని మేన నమ్ము
[2]లొక్క మొగి నింప నయ్యోధుఁ డుఱక వారి
విరథులుగఁ జేసి విండులు విఱుగ నేసె.

192 క. తనువులఁ బటుబాణంబులు, నినిచి వెగడుపఱచి కడచి నిరతిశయరయం
బునఁ గదిసి ధర్మనందను, ననేకసాయకపరిక్షతాంగుం జేసెన్.

193 వ. ఇవ్విధంబున రాధేయుండు నొప్పించినం దదీయ సంరంభంబు [1]సైరింపం
జాలక యమ్మహీపతి హతసారథికంబగు నిజరథంబు డొలంగం దోలుకొని
పోయినం దోడనతవిలి పొదివి నిలువరించి హాసభాసితుండగుచు నయ్యంగ
పతి యతనితో నిట్లనియె.

-: కర్ణుండు ధర్మరాజు నొప్పించి యవమానించుట :-

సం. 8-44-72 (కుంభ)

8-33-36 [భం]

194 సీ. క్షత్త్రియకులమున జన్మించి యిది ధర్మ మిది యధర్మం బని యెల్ల నెఱిఁగి
నట్టి[1]నీ కిట్టి మహాహవమునఁ బ్రాణములు డాఁచికొన శాత్రవులకుఁ దొలఁగి
పోవుట దగునె నీబుద్ధి [2]గానఁగ నయ్యె నృపనీతి యెఱుఁగవు నీవు బ్రాహ్మ
ణాచారవేదివి యాగాధ్యయనముల వర్తింపు కయ్యంబు వలవదుడుగు

తే. మింక ననుబోఁటిఁ దొడరిన నింతకంటె నెడరు వాటిల్లు వేగ పొమ్మింటికడకు
హరియుఁ బార్థుఁడు నున్నెడకైన నరుగు మేను దెగ నీదుప్రాణాన కింతనిజము.

---

191 1. నాఁటి — పి.ఎ.శౌ.గ.వ. 2. లొక్క మొగిదొరగింప నయ్యోధువారి — శ.ప; నిగుడింప — కొన్ని ప్రతులు.

193 1. సహింపజాలక — పి.శ.ప.

194 1. కిట్లు మహా - ప. 2. విచారింపు — ఈ.ణ.న.వ.

195 వ. అనిపలికి కౌంతివచనంబులు మనంబున ననికించేసి వధియింప నొల్లనివాఁడై యప్పాండవాగ్రజు విడిచి యా పురుషసత్తముండు తదీయ సేనాసముదయంబు నానాస్త్రనిహనంబు సేసి లజ్జాకుల మానసుండగు నమ్మానవపతి యును దక్షిణదేశంబున నిలువక తొలంగిపోయెం బోవుటయు.

196 క. విను మత్తరియోధజనములు, [1]మొనయుఁ దిరిగెనట్లు సమరమున విముఖంబై
చను నబ్బలముం గని వెను,కొనియెం గర్ణుండు నీదుకొడుకులుఁ దానున్.

197 క. పటుసింహనాదతూర్యో,త్కటరవగుణనిస్వనములు గలసి యఖిలది
క్తటి[1]దారణకేలిసను, స్ఫుటము లగుచుఁ గురుబలమునఁ బరఁగె నరేంద్రా.

198 ఉ. ఇమ్మెయి సూతనందనుని యేడ్తెఱ కోడిన యోధవీరసం
ఘమ్ముఁ గాంచి పాండవాగ్రజుఁడు గన్గొని సేర్కొని పేరెలుంగునం
[1]గ్రమ్మఱఁ బేర్చి కౌరవనికాయము గర్వమడంపుఁ డన్న దై
న్యమ్మిగురోత్తమే తిరిగి రా రథికుల్ మరలెన్ బలంబులున్.

199 వ. ఇవ్విధంబున వృకోదర పురస్సరంబుగాఁ బాండవ[1]బలంబులు మార్కొనిన మన మూఁకలుం గూడికొని తిరంబై త్రోచి తలపడుటయు నయ్యిరువాఁగు నందు.

200 మ. కరిబృందంబులు ద్రెళ్ళెఁ బెల్లుగఁ దురంగస్తోమముల్ [1]పెక్కు గూ
లె రథానీకము లగ్గలంబు గెడసెన్ లెక్కింప బెక్కైన కా
ల్బ్వర మొత్తంబులు రూపడంగె నిడముల్నగ్గయ్యె నన్నేల నె
త్తుగు వెల్లిన్ మునిఁగెన్ మరుత్పథచర [2]పంక్తుల్ వెక్కసం బందఁగన్.

---

196 1. మునుకొని యెదురుచు సమరమున విముఖంబై – ఈ.ణ.వ.

197 1. దారుణ – శ.వ. మున్నగు ప్రతులు.

198 1. గ్రమ్మరి పేర్చి, గ్రమ్మర పేర్చి, గ్రమ్మఁగ దేచు, గ్రమ్మరుడంచు – అని పాఠములు; గ్రమ్మఱిమారు – శ.వ.

199 1. వానీకంబు – అ.ఆ.ఏ.ఐ.ఒ.ఔ.ఝ.

200 1. కుప్పగూలె – వ. 2. పంక్తుల్ – (వర్ణక్రమము) శ.వ. మున్నగు ప్రతులు.

201 వ. అట్టి సందడిగయ్యంబున భీమసేనుండును శైనేయుండును బెట్టిదంపు[1]టుర
వడిం గవిసిన ధృష్టద్యుమ్నాది రథికప్రకరంబును బరవసంబు సేయం
గురుబలంబు వెఱచఱచి పఱచినఁ గర్ణుం డదల్చి కరతలం బెత్తి నిలునిలుమని
[2]పలికిన నమ్మోహరంబు [3]నిలుపదయ్యె నవష్టంభవిజృంభితుండైన
యా సూతసూనుండు వెండియుం గౌరవుల [4]వేఱువేఱ పురికొల్పి మర
ల్చిన నమ్మొనయును మొగకట్టి నిలిచె నంతం బవమానసూనుం డాను
మార్గ్కాన నగ్గలించె నతం డతని నాలోకించి యంతకుమున్న శ్రుతకీర్తి
స్యందనం బెక్కి యున్న తమయన్న వలను సాత్యకి ధృష్టద్యుమ్నులకుం
జూపి వారలతో నిట్లనియె.

202 ఉ. ఈతఁడు దుర్దశంబొంసె నేను గనుంగొనఁగర్ణుఁడేచి దు
ర్నీతిపరున్ సుయోధనునిఁ బ్రీతునిఁజేయుటకై [1]కడంగెమి
చేతికినిచ్చి [2]యిట్లరువు సేసెద నిన్నరనాథు [3]నాకు నా
సూతతనూభవున్ సమయఁ జూడక పోదు విషాద మెమ్మెయిన్.

203 క. ఏ నొండెనతనిచే నా,చే నొండె నతండు దెగుట సిద్ధముగ మదిం
బూని కడంగెద మీరీ, భూనాథునిఁ గాచికొనియ పోరు నడపుఁడీ.

204 చ. అని పటుసింహనాదమున నంబరముం బగిలించి తేరు క
ర్ణునిదెసఁ బోవ నిచ్చినఁ గనుంగొని శల్యుఁడు కర్ణుతోడ ని
ట్లను మనమీఁద వచ్చుననిలాత్మజుఁ జూచితె యంతరంగ మే
ర్పునలుక కామిషం [1]బిడఁగఁ జూచినచందము గాన నయ్యెడుఁ.

---

201 1. టురువడి — (వర్ణక్రమము) — పెక్కుప్రతులు. 2. పురికొల్పిన — ఊ. 3. మగల దయ్యె — కొన్నిప్రతులు. 4. పేరువేర — ఆ.ఈ.ఉ ; పేరువారి — న; పెరపులు డిపి పురికొల్పి — న.వ.

202 1. కడంగి — కొన్నిప్రతులు. 2. యిల్లడము సేసెద — వీ.ష.స ; యిల్లెరవు — స. మున్నగుప్రతులు. 3. గావుడీ — జ.

204 1. బడుగఁజూచిన — ఇ.ఔ.ళ.స.

205 చ. అలిగిన సూనుఁడు లోకవంద్యులైనను జీరికిఁ గైకొనం డితం
డలఘుపరాక్రమస్ఫురణుఁ డర్జునపూర్వుఁడు నాత్మపుత్రుఁడుం
బొలిసిర కాని కోపమునఁ [1]బొంగఁడు [2]నాఁడును నాఁడు నింత దో
ర్బలము నుదగ్ర్యసాహసముఁ దిరం బయి చూపటు మెచ్చఁ జూపుమీ.

206 చ. అనవుడు భీముఁ జూచి యతఁ డాతని కిట్లను నట్టివాఁడ కా
కనిలజుఁ డల్పుఁ డెట్లు సమరాగ్ర[1]మునన్ భవదుక్తియట్లు [2]యిం
తను వగునే కిరీటిఁ బగటార్పఁగ నీతని బొంపఁ జంపఁ దాఁ
గని పెడ వచ్చునాతఁ డధికం బగు మద్బల మిప్డు సూడుమీ.

207 చ. తరమిడి చండ్రగీచకశతంబు నితం డది [1]యేల యెల్లెడన్
నిరుదఁగఁ జాలు ధర్మజునకుఁ బద్దయుఁ బేర్చినవాఁ డగున్ వృకో
దరుఁ డటు లైన నీతని మదం బడఁగించుట లీల నాకు నీ
వరదము [2]సమ్ముఖంబుగ రయంబునఁ బోవఁగ నిమ్ము సూతవరా.

208 ఉ. నావుడుఁ దేరు మద్రవరనాథుఁడు భీముని దిక్కు దగ్రతం
బోవఁగ నిచ్చెఁ దూర్యరవముల్ సెలఁగెన్ దివి పిక్కటిల్ల న
ప్పావని నవ్వుచున్ బలముపాయ వడం గడు బెట్టు గిట్టి నం
జీవ దలిర్ప సారథిసింహబలునిఁ గర్ణుఁడు గప్పెఁ దూపులన్.

209 వ. కప్పి యాలోన.

210 క. వెస ననిలజుఁ డమ్ములబలుసా, రసమున నొంచుటయు నతఁడు రాధేయతను
బ్రసరన్నవనారాచో, ల్ల[1]సితుండై మెఱసెఁ గురుబలంబు దలంకన్.

211 ఉ. సూతతనూభవుం డనిలసూనుని చాపము ద్రుంచి యేచి యు
ద్ద్యోతితమార్గణంబు మెఱుఁగు మిచ్చి చనన్ నిగిడింప నొండువి
ల్లంతఁడు పట్టి ధైర్యసారము రయంబును జూపటు మెచ్చ నెత్తి సం
ప్రీతశరోత్కరం బతని [1]పేరురము నాడఁగ నేసి యార్చినన్.

---

205 1. బొంగఁడు — శ.స. మున్నగుప్రతులు. 2. నాఁడు నితండు నంత — స.

206 1. సమరాగ్ర సముచ్చ్రిత శక్తి యట్టులిం — గ. 2. యింతనదగునే — స.

207 1. యెల్లభంగులన్ — ఉ. 2. సమ్ముఖంబునకు నాచట — ఘ.

210 1. సితుండై — పి.శ.వ.ద.

211 1. పెన్నురముస్సోఁకనాటి — అ.ఐ.ఒ.డ.ల.

212 తే. ఈడఁబోక రాధాసుతుఁ డేసె నిరువ
దేను నారాచములు పవమానతనయు
కత్తళము దూఱి యంగంబు[1] గాఁడిపాఱి
నిలువ కటచని మేదినీ తలమునొరఁగ.

213 మ. అలుకం గెంపు గనుంగవం గదుర(గా నప్పాండవుం డేసినం
గులిశంబో యనఁ బ్రజ్వరిల్లి నిగిడెన్ ఘోరంపుభల్లం బుర
స్థ్సలి భేదిల్లఁగఁ దేరిమీఁదఁ బడి మూర్ఛం బొందె కర్ణుండు ని
శ్చలతం జచ్చినయట్లు లుఁడె వెఱఁ దత్సైన్యంబుఁ దుంతెం గడున్.

—: *భీముండు గర్ణుని మూర్ఛితుంజేసి నాలుక గోయం బూనుట* :—

సం. 8-45-48

214 వ. అప్పు డయ్యనిలతనయుండు దనయరదంబు గదియం దెచ్చి యా సూత నందనుం గనుంగొని యున్నిచు నాలుకం గోసెద ననుచుం [1]గట్టినయలుఁగు వెఱికి యతనియరదంబుమీఁది కరుగ నుత్సహించిన జూచి మద్రవిభుండు వారించి యిది మూర్ఛ గాని మరణంబు గాదీ యవస్థ నాలుక గోసినం జచ్చు నితనిం జంపుటకుఁ బార్థుండు ప్రతినవట్టినవాఁడు నీవు సంపిన నతండు నెవ్వ గం బొందు ననిన విని యప్పీరుండు వీఁ డిప్పుడు పాండవాగ్రజుని బాధించి నం గ్రోధాంధుండ నై యది మఱచితిం గాని చావు గామియు నిట్టియెడ నాలుకగోయం దడవఁ జచ్చుటయు నెఱుంగుదు నిత్తెఱంగు [2]నీవు దలం పించి లెస్సచేసి తిద్దురాత్ముండు సభలోన నసహ్యంబు లగు మాటలు ద్రౌపది నుద్దేశించి యాడిన నుద్దీపించినకోపం బజాతశత్రునకుఁ బ్రియంబుగా నడంచికొని యుండితి నేఁడు తద్వేదన వెలార్పం జూచితి నట్లు చేసితినేని మానధనుం డైన ధనంజయుండు [3]దన చేసిన పూనిక నెఱపంగానక మనం బునం గుంది మడియుఁ గృష్ణయుధిష్ఠిరులు నాతనితోడివార యింత ప్రమాదంబు నీవు గలి[4]మిం దెలిసితి మే లయ్యె మాతులా నీయాజ్ఞ యుల్లం ఘింప నని పలికి నిలిచె శల్యుండును సంతసిల్లి తేరు దొలంగించె ననుటయు నాంబికేయుండు సంజయున కిట్లనియె.

---

212 1. గాడిపాటి — శ.ప.శ.ర. (నిరనునాసికము).

214 1. గట్టియలుగ — ఉ. 2. వెరింగించి — కొన్ని ప్రతులు. 3. దనచేసిన — పెక్కు ప్రతులలో లేదు. 4. మింజేసి తెలిపితి — ఉ.క.ద.న ; మింజేసి తప్పించితి — బ.

218 మ. పదిబాణంబుల నొంచి విల్లు దునుమం బ్రస్ఫీత[1]దీప్త్యుజ్జ్వల
ద్గదవైచెం బవనాత్మజుం డది యెడన్ ఖండించె నవ్వీరుఁ డు
న్మదుఁడై పాండవుఁ డొండువిల్లు గొని [2]నానాకంకపత్రంబు లం
బోదుసం గర్ణుఁడు [3]నొంచె దత్తను వతి స్ఫూర్జద్దశాస్త్రంబులన్.

219 వ. దానం గోపించి.

220 చ. పటుతర మైన నారసము పాండు నృపాత్మజుఁ డుగ్రుఁడై యుర
స్తటమున బెట్టుగ్రుచ్చ [1]బెడిదం బయి వీఁపున నుచ్చిపోవ ను
త్కట ధరణీప్రకంప[2]చలితం బగు శైలముఁ బోలి తాల్మి మి
క్కుటముగ రోషరంజితముఖుండయి కర్ణుఁడు ఘూర్ణితాకృతిన్.

221 చ. రయమునఁ బంచవింశతి శరంబులు మేన [1]నిగిడ్చి భల్ల సం
చయహతి విల్లు సక్కడఁచి సస్మితవక్త్రసహస్ర పత్త్రల
క్ష్మి యతిశయిల్ల రథ్యములఁ జెండిన మారుతి [2]యేచి పిడ్వి ష
డ్భయదగదారుచిస్ఫురితబాహు విలాసవిభాసమానుఁడై.

222 వ. అరదంబు డిగ్గనుఱికి కర్ణునిదెసం గవియం గురుపతిసేనంగల యేనుంగులం
బదియేడింటిం బురికొల్పిన నవి దివాకరు బొదువు నంబుదంబులచందం
బున నాజెట్టిమగనిం గిట్టిన నతండు జోదులతోడం గూడ నగ్గజంబులం
జదుపుటయు సౌబలునిఘోటకంబు లాటోపంబున మూఁడువేలొక్కట
నురవడించిన వానిప్రాపున నరదంబులుం గాలుబలంబులుం గవిసి కూడి
కొని పొదివిన మదంబొదవి యమ్మహాబలనందనుండు దారుణరణవిహా
రంబున నొండొండ పేర్చినయబ్బలం బుజ్జ్వలానలంబున వైచిన చర్మంబు
చాడ్పున ముడిఁగి యొదిఁగె నప్పు డాశకునియోధులు పంచశతరథికులు
రభసంబున నడరినవారల సూతాశ్వకేతుస్యందనసమేతంబుగా నఱిముఱి
నుఱుమాడి యగ్గలిక మెఱసినం గని యగ్గాంధారరాజు పనుపం గడంగిన
యవనదేశీయులగు నాశ్వికులం ద్రిసహస్రసంఖ్యుల నవ్వడముడి పొడసేయు

---

218 1. దీప్తోజ్జ్వలఘ — పెక్కు ప్రతులు. 2. తానానాస్త్ర ఖండంబులన్ — రా.వ ; నానాస్త్ర సంఘంబులన్ — త. 3. నాటె — అ.ఐ.ఒ.ల.

220 1. బెడిదంబయి.— ఎ.గ.ఘ.ణ ; సుగతంబయి — వా. మున్నగు ప్రతులు. 2. భరితంబగు — అ.ఐరఘ డ.ల.

221 1. నిగుడ్చి — పెక్కు ప్రతులు. 2. యోర్చి — ట.

చప్పుళ్లు గాఁగ్రచ్చువెదురుటడవి నేర్పుతెఱంగునం దోఁచె నిట్లుగదపండువు సేసి యొండురథంబెక్కి యక్కొంతేయుండు ఖండనంబుసేయ రాధేయుండు పాఁడవేయాగ్రజుం దాఁకి తీవ్రప్రకాండంబులం గప్పి సారథి సమయించినఁ దేరు తురంగంబులు దోలంగ నీడ్చికొని పాఱిన వెనుకొను నయ్యంగపతిం గనుంగొని.

223 ఉ. భీముఁ డదల్చుచుఁ రథము భీమగతిం గవియింప నాతఁడు
ద్దామత మాఱుకొన్న వివిధస్ఫురదస్త్రపరంపరాద్వయ
శ్రీమొన లప్పు డచ్చెరువుఁ జెంది నుతించె మురాంతకానుజుం
డామరుదాత్మజుం గడచి యంగపతిఁ వెసఁ దాఁకెఁ దాఁకినన్.

224 క. ఆయిరువుర నిబిడకన, త్సాయకపటలములు నిగుడ సరి మధ్యాహ్న
స్ఫాయత్రభాఢ్యుఁడయ్యుం దోయజబాంధవుఁడుమింటఁదోఁపకయుండెఁ.

225 వ. వా రొం[1]డొరుల శరపరంపర లడఁగించి రాసమయంబున.

226 చ తనకరముల్ నిగిడ్చి యుచితంపుమెయిం గొనియాడి యంతటం
దనియక లీలఁ జేరి [1]సముదంబుగఁ బద్మినిఁ బొందె భాస్కరుం
డనుటకుఁ దావలం బయి జనాధిప చూడ శమంతపంచకం
బున విరిదమ్మితేనియలఁ బొల్పెసఁగెం బ్రతిబింబ మెంతయుఁ.

227 వ అప్పుడు కృప సౌబల కృతవర్మాశ్వత్థామల యుద్దామ సాహాయ్యంబున సమధికోత్సాహుండగు నాసూతనందనుని సంరంభంబునం గౌర[1]వా నీకంబు దర్పోద్రేకంబునం గడంగినం బాండవబలంబునుం బొంగె నివ్విధం బున నిరువాఁగును గలయఁ బెరసిన నార్పుల నదల్పులం బొగడుటలం దెగడుటల నెసగు నులివు తూర్యరవంబుల గెలువ నమ్మేదిని నెత్తుటఁ జొత్తిల్లి కెంజాయరంజిల్లు పుట్టంబు ముసుంగువెట్టిన [2]యంగనచందంబు నొందె మస్తక ప్రముఖావయవంబులును గోదండాద్యాయుధంబులును మకుటప్రభృతి భూషణంబులును నాతపత్రధ్వజచామరంబులుం దునిసిపడి భీమాభిరామంబులగాఁ గరిహయనరసమూహంబులు రక్తసిక్తంబు లైన నకాల[3]బాలాతపలీల యావహిల్లం దక్కినసేనాంగంబుల మిగిలిన మాత్రం

---

225 1. డొరువుల — శ ష. మున్నగు ప్రతులు.

226 1 పశ్చిమదంబున బొందిసయట్టి — ఈ ; ప్రమదంబునఁబద్మిని — త.న.వ.

227 1. పనికాయంబు — ఈ. 2. దోచె — ఊ.శ.ష. 3. ఫాలలో చనులీల — అ.ఝ;

గంబులు పెనంగిన కనకలిప్తకాండంబు లూఁదికొనం దాఁకిన [4]నెరగళ్లు వోవు కొండలకై వడిం బోలుచునవియును నస్త్రశస్త్రపాతంబులం గ్రమ్ముారుధిరమ్ముల గైరికనిర్ఘరంబులతోడి ధరాధరంబుల ననుకరించు నవియును మెయిమఱువు లఱువుబళ్లై నానానిశితశరంబులు నాటినం జేష్టలు దక్కి ఱెక్కలుదెగియున్న శైలంబులం బోలునవియును నగు చుండఁ జెలంగి చతురంగంబులును బెరయఁ బెనంగు నుల్లాసంబున శోణి తం కడంగ మట్టువిసి రేణువు లెగసిన బూదుక్కులు నిగుడ కున్ననుం దఱియ నుఱికి నిజాభిధానంబులను జననీజనకనామంబుల బిరుదాంతంబులం దమ్మో ఱంగించికొనుచు వీరులు పోటుచక్కటికిం జొచ్చి ప్రాప్తై [5]వీరువాడు తదీయ బంధుమిత్త్రులం బొగడునమరుల యెలుంగులు నింగినిండం [6]బెల్లు దొరఁగు కీలాలం బాఘూళి నడంచినక్రొలది నిలువక యేఱులయిపాఱ నుబ్బి భూతబేతాళక్రవ్యాదంబు లోలలాడుచుం ద్రావుచు మదించి నృత్త్యంబులు సేయ నంబరంబున నట్టలాడ పెక్కనపాటొనర్పం జాలు నాసమయంబున మనంబు లెప్పటి తమకంబున ననిం దనివి ననమిం గవిసి కయ్యంబు సేయు సైనికోత్తముల సింహనాదంబులు దిక్కులం బిక్కటిల్ల నాకలని కెలన నట మున్న తన్నుఁ బొదివిన త్రిగర్తకోసలనారాయణగోపాలబలంబుల నబ్బలసూదనసూనుండు గాండీవారావం బాకసంబు [7]వగిలింప [8]ప్రోప్పించి

228 చ. తఱిమి సుశర్మఁ దాఁకిన నతండుఁ దదంగము[1]నఁ దశాస్త్రముల్
వఱపి మురాసురాంతకుని బాహువునం బటుమార్గణత్రయం
బఱిముఱిఁ జొన్ప బల్వెడఁదయమ్మున నుజ్జ్వల కేతుదండ మే
ద్దెఱఁ జలియింప నేసిన నుదీర్ణతఁ దత్కపి యార్చె నార్చినన్.

---

పాలాశ పుష్పకాంతి నాపహిల్ల — జ ; పాలాశ తరులీల — ఘ ; సంధ్యా సమయ లీల — శ.ప. 4. నఱువుళ్ళు — శ.ప. నెరగళ్ళు పి.అ.ఇ.ఈ.ద.వ. మున్నగు పెక్కు ప్రతులు ; నెరకళ్ళు — వా. 5. చెలువారు — బొ. 6. బెలుచందొరంగు — కొన్ని ప్రతులు. 7. నిండ — కొన్ని ప్రతులు. 8. నెదిర్చి — ఎక.ఖ.గ.వ.

228 1. నన్ నవాస్త్రముల్ - పెక్కు ప్రతులు.

-: సంశప్తకు లందఱు నొక్కపెట్ట యర్జును రథంబుపైఁ బడి యాఁగుట :-

సం. 8-37-11

229 సీ. వెగడునఁ [1]జెయ్యేది వేగంబ తేఱి
సంశప్తకు లర్జునుసాయకముల
కోహటింపక సముత్సాహంబు వదల కం
దఱు నొక్కపెట్టతద్రథము వొదివి
హారులతోఁ గాడియు హా కేలు నొగలును
[2]బలుగాఁడియును గండ్లుబట్టి మెలఁగ
మిడుక రాకుండ నవ్వేళ్మటివిల్కాని మే
నును నిగ్రహించుట గనుఁ గొనంగ

తే. నద్భుతం బయ్యె నపుడు సేయార్చి శౌరి
లీలఁ గొందఱ మత్తశుండాలభంగి
మెఱయఁ దూలించెఁ గాలను గుఱుచతూపు
గములఁ బార్థుండు పలువుర సమయఁ జేసె.

230 వ. అంతఁ గొంత [1]యూరువు వోయినం జిఱునవ్వు నవ్వి కవ్వడి కమలనాభున కిట్లనియె.

231 ఆ. తేరు గదల నీక వైరులు బలువిడిఁ
బొదివిపట్ట రాదపొల్ల నైన
యేను దక్క నృపతిసూనుఁ డిట్లొరుఁడు స
హించు నెట్లు విక్రమించుఁగాక.

232 క. అని పలికి చూడు మీ న,న్ననుచు భుజంగాస్త్ర మేయనది యరులకు గ్ర
క్కునఁ బాదబంధ మొసరిం,చిన ముంచె నతండు వారి శితవిశిఖములన్.

233 వ. ఇవ్విధంబున.

---

229 1. జేడ్పడి — ఈ.ఒ.ఖ.న. 2. పై బండి కండ్లును బట్టి తొలఁగ — స.

230 1. యూరటం బోయి — జ.త ; యులివోయి — ఎ.గ.త.ణ.వ ; తెరిపి యిచ్చినం జిఱునవ్వు — వ.

234 ఆ. నాగ[1]పాశబంధనంబుల[2]గుదివడి, వారు వివిధబాణదారుణాంగు
లై రథంబు విడిచి రప్పు డాసంశప్త, కవ్రజంబు గని త్రిగర్త విభుఁడు.

235 క. గరుడాస్త్రం బేసినన, చ్చెరువుగ గరుడములు గవిసి చీరెం జంచు
స్ఫురణము మెఱయఁగ [1]వెసన, య్యురగాత్మక బంధ మూడ నుర్వీనాథా.

236 క. తన కడిమి బంధమోక్షము, [1]గనిన రథికకోటి [2]గడఁగి గాండివిపయిన్ సే
పునఁ దూపులు [3]దొంఁగింపఁగ, ఘనభుజుఁడు సుశర్ముఁ జేసెఁ గనదస్త్రమునన్

237 చ. అది నరు[1]డెంద మాడుటయు నాతఁడు మూర్ఛ మునింగి తేరిపైఁ
జదికిలఁబడ్డ నుబ్బి యదె చచ్చె సుశర్మునియేటు దాఁకి బ
ల్లిదుఁ డగుపార్థుఁడంచు మదలీలల నార్చిరి నీదుసైనికుల్
సదలను దిక్కులం బరఁగె శంఖ[2]ముఖోద్భట[3]తూర్యనాదముల్.

238 సీ. అంతఁదెప్పిఱి విలయాంతకుకైవడిఁ గవ్వడి యేచి మార్గణచయంబు
పెల్లడరించిన బీఱువోయె సుశర్మ యాసేనమీఁద నైంద్రాస్త్ర మక్కి
రీటి నవ్వుచు సేయ నాటోపము న నది వివి[1]ధబాణాకృతిఁ గవిసి నుఱుము
గావింపఁగాఁ బదివేవురు సంశప్త [2]కాగ్రేసరులు దెగటాఱి రప్పు

ఆ. డుక్కుదక్కి [3]తలగి తక్కటియోధులు, చేష్టితంబు లెడలఁ జిత్రరూపు
లట్టులెరి ధూమమడఁగిన వెలుఁగొందు, నసలుచంద మయ్యె నన్నరుండు.

---

234 1. బాణ — వ. 2. సుడిపడి — కొన్నిప్రతులు ; బొందియు — అనిపాఠము.

235 1. నందఱయురగంబుల బంధ — పీ.శ.ష.

236 1. కనుగొని రథికాళి గడగి — వ. 2 కనలి — ట. 3. నిగిడింప — పీ ; నిగు డింప — అనియు పాఠములు.

237 1. మేననాటుటయు — పీ.ఈ.ణ.త.న.వ.స ; గాడిదూరుటయు — ఇ ; దూఱనాడుటయు — ష ; డెందమాడుటయు — వ. 2. రవోద్భట — త.న.వ. 2. సింహనాదముల్ — అ.జ.ట.

238 1. ధాస్త్రరూపత — శ.ష. 2. కాతిరథులు — ఈ.న. 3. తెరలి, తొలగి, పరచి — అని పాఠములు.

239 వ. హతశేషులైన సంశప్తకులు చతుర్దశసహస్రయోధముఖ్యు లవ్విజయు విజయంబు సహింపక యొండొరులం బురికొల్పికొని బలంబులతోడం గడం గిన నతం డతి దారుణంబగు రణంబు సేయ దక్కటి పాండవులదెసం బోరు కౌరవబలంబు దద్బలశౌర్యంబు లోర్వక భీతిం గలంగి పఱచినం గృతవర్మ కృపగురుపుత్రకర్ణులు నులూకసౌబలసుయోధనులు దుశ్శాసనాది కుమారులును బరవసంబు సేసి యాసైన్యంబు దైన్యంబు వాయ విక్రమించి రట్టియెడం గృపుని యపరిమితశరజాలంబు పాంచాలపుంజ బుం బొదివినం గనలి శిఖండి యమ్మ[1]హీసురవరుని మార్కొనియె నయ్యిరువుర సమరంబు రామరావణుల రణంబుకరణి నొప్పె నట్లు పోరిపోరి శారద్వతుండు

240 చ. హరులను సూతుఁ జంపిన నుదగ్రత నాద్రుపదాత్మజుండు వి
స్ఫురిత కృపాణచర్మపరిశోభితుఁడై యరదంబు డిగ్గి స
త్వరముగ నేఁగుదేర శరవాహినిపై [1]నిగిడించె నాతఁ డ
య్యరి వె[2]ఱఁగందుచున్ నిలుచునట్టుగ జోదులు పిచ్చలింపఁగన్.

241 వ. అట్లేచిన కృపాచార్యుపై [1]నురవడించిన ధృష్టద్యుమ్నుం గృతవర్మయు ధర్మతనయద్రౌపదేయుల నశ్వత్థామయుం గవలం గురుపతియును వృకోదరుం గర్ణుండునుం దలపడి నిలువరించి రగ్గౌతముండు శిఖండిపలక పఱియలు సేసిన నతండు [2]దెరలక కేవల కరవాలంబున విక్రమింపం గడంగిన నయ్యతిరథుండు.

242 క. వాలిక తూపులు మేనం, గీలుకొలిపి నొంపఁ గని సుకేతుఁడు బాణ
జ్వాలలు నిగుడ నడరి యా, భీలత నాకృపునితోడఁ బెనఁగె నరేంద్రా.

---

239 హాపీరు — పెక్కుప్రతులు.

240 1. నిగుడించె — అని పెక్కు తాళప్రతులు. 2. గడొందుచున్ — అ.ఆ.

241 1. నుర (రు) వడించిన — పెక్కుప్రతులు. 2. తెరలి తరవాలంబున — ఎ.ఖ.గ.ఞ.త.వ ; కేవలంబ కరవాలంబున — శ.ష.

243 తే. తనకు నెడ నొచ్చి యిట్టు లతండు వెనుఁగ
ద్రుపదనందనుఁ డల్లన తొలఁగి పోయె
నా సుకేతుండు కృపునిపై [1]నాఁట నిరువ
దాఱుశరములు వఱపి రయంబు మెఱయ.

244 వ. ధనువు దునిమి యొండుకోదండం బెత్తిన నదియును ఖండించి.

245 క. తోడన హయసూతుల [1]మెయిఁ
గాఁడఁగ నేయుటయు నతఁడు [2]గనలుచు బలువిల్
క్రీడయపోలెం గొని [3]మే
న్గాఁడఁగ నిగిడించెఁ ద్రిదశనారాచంబుల్.

-: కృపాచార్యుండు సుకేతుం డను పాంచాలకుమారునిం జంపుట :-

సం. 8—38—82

246 తే. అట్లు నొప్పింపఁ దూఁగాడు నా సుకేతు
కంధరము మెఱుఁ గారెడు కత్తివాతి
దొడ్డతూపున నేపునఁ ద్రుంచుటయును
శిరము ధర డొల్లెఁ గుండలస్ఫురణ మెఱయ.

247 వ. ఇట్లు సుకేతుండు సచ్చిన నతనిమూఁకలు విచ్చె ధృష్టద్యుమ్నుండు కృత వర్మయుం బోరు నెడ ధృష్టద్యుమ్నుండు కృత[1]వర్మ వక్షస్స్థలంబు విశిఖనవ కంబున నొప్పించుటయు నప్పాంచాల వరు నతండు సూతకేతు హయ స్యందన సమేతంబుగా నిబిడ శరజాలంబునం బొదివిన నవ్వీరుండు బలాహ కపిహితమూర్తి యగు మార్తాండు ననుకరించి తాను సైంధవవధదినంబు నం బారావత వర్ణంబు లగు రథ్యంబు లగ్గురు నరుణాశ్వంబులఁ బెరయం బఱపిన తెఱంగున.

---

243 1. నాఁటి నిరువ — పి శ.ష ; గాఁడ — చ జ ; నాఁడ నిరువ — వా.

245 1. మెయిగాడఁగ — ఆ.ఝు.ట. నోఁగాఁడఁగ — పి. మున్నగు ప్రతులు ; నోఁనాడఁగ — నలిగికడఁ కవిల్—ట.శ.ష.శర. (ఈ పాఠమున అఖండయతి) 2. గనలి కడిదివిల్—ద. 3. మెయినాడఁగ, మైనాడంగ — అనియు పాఠములు.

247 1. వర్మని — కొన్ని ప్రతులు.

248 తే. అలిగి నొగ నొగతోఁ దాఁక నతిరయమునఁ
దేరు వఱపి కృపాణప్రదీప్తపాణి
యగుడు గద వుచ్చికొనియును నలుమ లేక
చలము [1]డిగఁ ద్రావి కృతవర్మ యిలకు దాఁటె.

249 వ. అక్కుంభసంభవుచందంబు గాక వంచకుండై యప్పరుసున నబ్బలుమగండు దొలంగిన నయ్యరదంబుమీఁదికి లంఘించి యాధృష్టద్యుమ్నుండు.

250 క. ఆరథికు నచటఁ గానక, సారథితల దునుముటయును సంతసమునఁ బోం
గారి [1]తనశబ్ద మిచ్చిమ, హారవమున నిక్క డిక్క డనియె నతండున్.

251 చ. విని కృతవర్మఁ గాంచి పటువిక్రమకేలి యొనర్ప నాత్మవా
హనమున కేఁగి యేచి ద్రుపదాత్మజుఁ డాతఁడు లోనుగాఁగ న
మ్మొనఁ గల మేటిజోదుల సముద్ధతి యేర్తెఱ నిల్వరింప వి
గ్గొనెఁ బటుశౌర్యశోభితబలుం డగు నయ్యదుముఖ్యుఁ డొక్కఁడున్.

252 వ. అట్టియెడ నొక్కరథికుండు రయంబున నిజరథంబుమీఁదికిఁ గృతవర్మం దిగిచికొని యనికిం దొలం[1]గం గొనిపోయెఁ బాంచాలోత్తముండును దన మునుము బలంబు గలంగం బరాక్రమించుచుండె.

253 సీ. ధర్మపుత్త్రుఁడు గురుతనయుతోఁ బెనఁగుచోఁ బాసటయై శినిపౌత్త్రుఁ డడరె
నాయిద్దఱును ద్రౌపదేయులు వెఱఁగందు నట్లు వారలను సైన్యంబుఁ బొదివి
బహుళాంధకార మాపాదించి యమ్మేటి విలుకాని సాయకవితతి నింగి
[1]ఘనమయంబుగఁ బర్వ జననాథ వారల యొక్కొక్కరుం డనేకోగ్రబాణ
ఆ. నిహతుఁ జేయ నతఁడు ప్రహసితవదనుఁడై, యొకని నొకని బహుసముజ్జ్వలాస్త్ర
విద్ధుఁ జేసి కడఁగి విప్పచ్చుకొడుకుచా, పంబు దునిమెఁ గ్రూరభల్లనిహతి.

---

248 1. దిగఁద్రావి — [illegible].ఊ.ప ; దిగనాడి — ల ; దిగఁద్రోచి — ఎ.గ.

250 1. తలశబ్ద — కొన్నిప్రతులు.

252 1. గించెఁ బాంచాల — పెక్కు ప్రతులు.

253 1. చదలనిండగఁ బర్వ — ఈ.న.వ.

254 క. ధృతి నొండువిల్లుఁగొని యా, శ్రుతకీర్తి దటియతనువు నొనిపెం బదర
త్రితయంబుఁ గనలి యాతం, డతనిం దత్పార్శ్వచరుల నమ్ముల ముంచెన్.

255 క. ముంచు మహోద్ధతియాలో, కించి తనదుచూడ్కి [1]దట్టకెం పెసఁగం గో
పించి శరనికరములు గుప్పించుచు ధర్మజుఁడు గవిసె భీషణభంగిన్.

256 చ. కదిసిన నమ్మహోభుజుఁడు గార్ముకముం దునుమాడి మూఁడు పె
ట్టిదపు మెఱుంగు తూపులఁ బరిష్ఠత సూపిన నా నృపాలుఁ డు
న్మదుఁడయి మేటివింట బలుమార్గణముల్ వెస నేసి మూఁడు న
ర్వదియును నద్ధరామరునిపై శినివంశవరుండు [1]దొడ్పడన్.

257 వ. ఇట్లు పాఱిపై కడంగి.

258 ఆ. అర్ధచంద్రబాణహతి గురుపుత్రుని, ధనువు శినివరుండు దునుముటయును
శక్తి వైచి యతఁడు సారథిఁగూల్చెబల్, వింటఁగురిసె బహుళవిశిఖవృష్టి.

259 క. సారథిలేమిని సాత్యకి, తేరీడ్చెఁ దురంగములు [1]దిరటు వాఱన్
భూరమణ ధర్మనందను, వారు వొదివి రంపగముల వడి గురుతనయున్.

260 క. భీమాస్త్రశిఖల నశ్వ, త్థామాగ్ని దహించె ధర్మతనయానుచర
స్తోమాటవి నొకపెట్లిమిడి, నామెయి జనవిస్మయావహం బయ్యె నృపా.

261 వ. అప్పుడు కురురాజు పాండవుల నాచార్యనందనుచేతం దగిన వారలంగాఁ
దలంచె నంతఁ దఱిమి యుధిష్ఠిరుండు ప్రచండకాండంబుల నవ్విప్రవరుం
[1]బీడితుం జేసి.

262 సీ. అలవును [1]వెరవును గల[2]వు కృతాస్త్రుండ వని నిన్ను నెఱుఁగుదు నైన నెల్ల
సొంపుపార్థునకుఁ జూప నోపినఁదెల్లమగు నది యట్లుండె నరయనీకు
నెయ్యంబు వాటించు నేర్పు కృతజ్ఞత యనునివి లేవు బ్రాహ్మణుఁడు దపము
దమమును గల్గు వర్తనమున నుండుఁ గా కని సేయునే యెంత యడిచిపడినఁ

ఆ. బడితి గాని యడ్డపడలేవు కౌరవ, కులము నెల్లభంగి[3]గెలుతు మేము
నీవ చూడ ననుడు నావీరుఁ డేమియు, ననక నగుచుఁ బఱపె నంపవెల్లి.

263 వ. ఆవెల్లికి నోర్వలేక యాభూవిభుండు దొలంగె నిట్లంతటిమానిసిం గెలిచిన
వాఁడై నిలిచి నిజపార్శ్వంబులమూఁకలం గనుఁగొని గురుపుత్త్రుండు
క్రూరవిహారంబునకు నమరి మెఱసె మారుతితోడం బోరు కర్ణుండు దదను
చరంబులగు కరూశచేదిసృంజయ పుంజంబులుం దన్నుం బొదివిన నబ్బలం
బునకు బాహుబలంబు సూపుచుండ నతని విడిచి యాభీమసేనుండు గౌరవ
సేనపయిం గవిసి కనుపుగొట్టె నారాధేయవృకోదరులమునుములు ధనం
జయుమునుము భంగిం బ్రజాక్షయం బగుచుండె నీదు[1]ర్మంత్రంబున ననేకుల
కుం బొలియ వలసె నయ్యవసరంబున.

264 సీ. కవలతోఁ బెనఁగెడు కౌరవనాథుఁడ
న్నకులు నంగంబున నవశరములు
సొనిపి యాసహదేవు కనకపుసిడము ద్రుం
చినవార లిరువురు నెనిమిదింటఁ
బదితూపులను నొంపఁ బతి రెండు[1]విండులుఁ
దునుమాడుటయు నన్యధనువు లెత్తి
యన్నయుఁ దమ్ముండుఁ దన్నుఁ బెక్కమ్ములఁ
బొదివినఁ గనలి యాభూవిభుండు

తే. వారి [2]దివ్యాస్త్రములఁ గప్పు ఘోరభంగి
గాంచి జను లక్కుమారులు గాలవశతఁ
బొందుదుర కాఁ దలంప నప్పుడు గడంగి
యడ్డపడియె ధృష్టద్యుమ్నుఁ డతిరయమున.

---

262 1. జలమును — త.న.వ. 2. యుగ్రహాస్తుండవని — త.వ. 3. గూల్తుమేము — ఊ.

263 1. ర్మంత్రితంబున — ఈ.ఔ.న ; ర్మంత్రంబు కతంబున — క.ఖ.

264 1. విండ్లును — పెక్కుప్రతులు. 2. దీవ్యాస్త్రముల — ఉ.ఐ.ఔ.జ.గ.వ.

265 వ. ఇట్లు పాండవసేనాపతి భూనాథుం దాఁకి యేసిన నతండు.

-: ధృష్టద్యుమ్నుఁడు దుర్యోధనుం దాఁకి విరథునిఁ జేయుట :-

సం. 8-40-21

266 ఆ. ఇరువదేను నిశితశరముల నొప్పింప, నలిగి యాతఁ డతని యంగకముల
నఱువదేనుతూపు లడరింప నఱకె న, క్కౌరవేశ్వరుండు గార్ముకంబు.

267 మ. బలువి ల్లుగ్రత నెత్తియొక్క మొగి నప్పాంచాలవర్యుండు తీ
పులు గ్రమ్మం బదియేను మార్గణము లాభూమీశుపై నేసినం
గలయం బూచిన కింశుకంబు చెలు[1]వంగం బొందఁ దచ్చాపమున్
బెలుచం ద్రుంచి యతండు ఫాలమున గుప్పించెన్ దశోగ్రాస్త్రముల్.

268 క. కాలాయసనారాచము, లోలి నుదుట నాటి యున్న నొప్పారెం బాం
చాలవరుముఖము మధుకర, మాలికచేఁబొలుచు తమ్మిమాడ్కిం జూడన్.

269 సీ. కనలి యవ్వీరుండు గార్ముకాంతరమునఁ గ్రూరభల్లంబుల ఘోటకముల
సారథిఁ జాపంబుఁ దేరును గొడుగును దునుమాడఁగా భవత్పుత్రుఁ డేపు
గుందక శక్తి[1]నిగుడ్పఁగఁ ద్రుంచె పెద్దెఱుఁ గృపాణము గొన నుఱుముసేసి
గదయెత్తఁ బఱియలు గావించె నుబ్బి రత్నమయాహికేతువు నఱకెఁ బైచె
తే. నిట్లు హయసూతకోదండ హీను దళిత, రథుని విగతాంతపత్రు [2]నిర్భగ్నశక్తి
ఖడ్గముద్గరకేతువిభుం[3]డిత్తాపి, ధానుఁ జేసె నప్పార్షతుం డానరేంద్రుఁడు.

270 తే. వికలసాధనుఁడైన యవ్విభుని నతని
తమ్ముఁ డగు దండధారుండు దనదుతేరి
మీఁద నిడుకొని శత్రుసమీపభూమి
వాయఁగొనిపోయెఁ జూచి రాధేయుఁ డపుడు.

271 క. శినివంశవరునితోడం, బెనఁగిపెనఁగి యతని విడిచి [1]పెలుచ ద్రుపదనం
దనునిరథమునకు నెదురుగఁ, దనయరదము సనఁగనిచ్చె ధరణీనాథా.

---

267 1. వుంగావించె — కొన్ని ప్రతులు.

269 1. నిగుడ్చిన — పెక్కు ప్రతులు. 2. నిర్దళిత శక్తి — ఇ; నిరస్తశక్తి — వ.
3. డనాదిదీనుఁ — ఎ.గ.పి.శ.వ ; డిత్తాదిదీను — కొన్ని ప్రతులు.

271 1. బిట్టు — కొన్ని ప్రతులు.

272 వ. సాత్యకియును శరంబులు గురియుచుం [1]ద్రోణ తవిలె నుభయసేనాపతు లగు
నా సూతనందన ధృష్టద్యుమ్నులట్లు దార్కొనిన నయ్యిరువాఁగునందు
నొక్కరుండైన నోలమాసగొనక కడంగినం బోరు ఘోరంబయ్యె నట్టియెడఁ
బాంచాలకుమారులు వ్యాఘ్రకేతు సుశర్మ శుక్ల చిత్రోగ్రాయుధులును
జయ రోచమాన సింహసేనులును బలుదేరుల మొత్తంబులతోఁ దన్నుం
గవిసినం గర్ణుం డయ్యేనమండ్రువీరుల నెనిమిదిభల్లంబులం దునిమి తత్సహ
చరుల బహుసహస్రరథికుల సమయించినం జేదిరథికప్రవరులు జిష్ణు జిష్ణు
కర్మ దేవాపి భద్రులును దండ చిత్ర చిత్రాయుధులును హరి సింహకేతు
రోచమాన శలభులును సబలంబుగాఁ దలపడిన నాపదు[2]నొక్కండ్ర నొక్క
పెట్ట బెట్టిదంపుటంపఱ పాలుచేసి మఱియును బిరుదులయి పయిం బడిన
దొరలను వారిపరివారంబులను వసుధం గూల్చియు నలంచియుం గలంచి
యుం గడిమి మెఱయుచు నిట్టిచందంబు భీష్మద్రోణులయందుఁ జూడ మని
జనంబులు వెక్కసపడ వివిధసమరవిహారంబు సలిపి వెండియు.

273 సీ. సింహంబుబారిఁ జొచ్చిన గజంబుల భంగిఁ
బులికగ్గమైన జింకల విధమున
జ్వలనంబుఁ గిట్టినశలభంబులట్లుఁ బాం
చాలయోధులుఁ జేదిసైనికులును
దనుఁ దాకి పొలియ రాధాతనూభవుఁ డనిఁ
దనివోక ధర్మనందనుని యున్న
చక్కటి కడర ధృష్టద్యుమ్నుఁడు ద్రౌప
దీపుత్రులును సహదేవుఁడును శి

తే. ఖండియును సాత్యకియు నకులుండుఁ జేయఁ
గలమహీశులుఁ బొదివి రక్కర్ణు నతఁడు
పెక్కుపాములు వొదివినఁ బెనఁగు[1]గరుడు
ననువు దోఁపఁగఁ బోరాడె మనుజనాథ.

---

272 1. ద్రోడన తగిలె — కొన్నిప్రతులు. 2. నొకళ్ళ — కొన్నిప్రతులు.

273 1. తార్క్ష్యు — గ.త.న; గరుడియనువు — అ అ.ఐ.ఝ.ల.

274 వ. ఆసమయంబున భీమసేను బారింబడిన కౌరవ సైన్యంబునం బ్రబలచతురంగంబు లొక్కమొగిన్ బడలువడి రణాంగణంబు [1]మూసికొనియెం బెఱ మూఁకలు వెఱఁగునం జెయ్వోది కరళ్లడంగిన మున్నీటి యట్లుండె గాండీవి సంశప్తకుల ననేకుల మేటిమగల గీటడంచి హతశేషంబగు బలంబు విచ్చుటయు వాసుదేవు నాలోకించి.

275 ఆ. అమరులకు [1]నజయ్యు లగునట్టి సంశప్త, కులు మదీయ బాణ ఘోరభంగి
కోహటించి పాఱుచున్నారు భీముని, సునుము కౌరవులును మొనయ లేరు.

276 క. కర్ణుం డొక్కరుఁడును సము, దీర్ణుండై సిడము మెఱయఁ దిరిగి బలువిడిన్
ఘూర్ణితము సేసె మనసై, న్యార్ణవ[1]మున మంథనగము నను వమరంగన్.

277 చ. అరదము వోవ నిమ్ము రయ మారఁగ నాతనిదిక్కు నాపుడున్
దరహసితంబుతో నలిననాభుఁడు భీమునిచేతఁ బోదు నీ
శరముల[1]వేఁడిఁ గౌరవులసంగరవాంఛ యడంపు మన్న న
న్నరుఁడును నియ్యకొన్నఁ గురునాథుని యోధులు బెగ్గడిల్లఁగన్.

278 ఆ. అమ్మురారిధవళహయములు మెఱయ న, ద్దిక్కు సత్వరముగఁ దేరు వోవ
నిచ్చుటయును జూచివిచ్చె నబ్బలము సిం, గంబుఁ గనిన[1]లేడి గమియుఁ బోలె.

279 వ. అప్పుడు నీ కొడుకు సంశప్తకులం బురికొల్పిన రెండువేలరథంబులును మున్నూఱేనుంగులును జతుర్దశసహస్ర తురంగంబులును లక్షద్వయపదాతులును నప్పార్థుపయిం గవిసిన నతండు శింజినీటంకారంబునం బటుశరాసారంబున నింగి నించి పదివేవురు ద్భటక్షత్రియులం బొలియించి యక్కెలనం గాంభోజబలంబు దోఁచిన నం దుఱికి తదీయసైనికులకరంబులు శిరంబులు నఱికిన నది మహోవాతనిహతవిటపం బైన యారామంబుచందం బయ్యె నట్టియెడ.

---

274 1. ముసురుకొనియె ; ముసుంగుపడియె – ఒ.క.ఖ వ.స.

275 1. నజేయులగు – పెక్కు తాళపత్ర ప్రతులు.

276 1. మునుచేర్పు మంథరాద్రియుఁబోలెన్ – వ. కొన్ని ప్రతులు.

277 1. నేడు – ఇ.ఊ.

278 1. లేటిగమియు – ద.ల.శ.ష. కొన్ని ప్రతులు.

280 క. అడరి సుదక్షిణుతమ్ముఁడు, గడువ[1]డి నేయుటయు నతని కరశాఖలు గ
వ్వడి యర్ధచంద్రశరముల, వెడందతూపున శిరంబు ప్రేల్మిడిఁ[2]ద్రుంచెన్.

281 క. యవ[1]నశకసైన్యములపైఁ, గవిసినఁ దద్రుధిరజలము గాలువలై పా
ఱ వెసం బఱపెను వివిధా, స్త్రవితానము లక్కిరీటి ధరణీనాథా.

282 మ. కని సంశప్తకు లేచి యొక్కమొగి నాకౌంతేయునిం జుట్టు ము
ట్టిన సేనాంగచతుష్టయాంగములు ఖండీభూతముల్ సేసె నా
తనిబాణో[1]త్కరవేగ [2]ముత్కటమరుత్సంక్రీడజీమూతపా
టనముం జేసినభంగిఁ జిత్ర[3]బల గాఢస్ఫూర్తి శోభిల్లఁగన్.

283 క. హరివెరవున ధవళాశ్వ, స్ఫురణమున రథంబు మెఱయఁబోలుపాఱెడు న
న్నరు నత్యద్భుతవిక్రమ, పరిణతి [1]సూడఁ గనుదోయి పదివేల్వలయున్.

284 క. ననుబోఁటుల మనములు మెచ్చునఁ గరఁగె ననంగ నేల సురతతి[1] కృష్ణా
ర్జునులం గని దుందుభినిస్వనములతోఁ గురిసె[2]విరుల[3]వాన వొగడుచున్.

285 వ. [1]అయ్యవసరంబున నాకసంబున నశరీరవాణి [2]యయ్యిరువుర నుద్దేశించి యఖిలజనంబులు నాకర్ణింప వీరు చంద్రార్కులం గడచినకాంతి[3]దీప్తుల నుల్లసిల్లెదరు తొల్లి యేకరథస్థులైన బ్రహ్మేశానులవిధంబున వెలింగెదరు గంటిరే వీరలు పరమమునులగు నారాయణుండును నరుండును జుండీ యనియె నిట్లు మహనీయాశ్చర్యంబులు గనియును వినియును మాత్సర్య

---

280 1. డిఁదాఁకుటయు — శ.వ. 2. దునిమెన్ — అ.ఆ.ఝ.

281 1. నేశసైన్యములు — త ; నకురు — చ.

282 1. త్కట — ఒ.క.ఖ. 2. ముద్భట — పెక్కు ప్రతులు. 3. పటుగాఢ — కొన్ని ప్రతులు.

283 1. సూడంగ చోద్యపడి రావేల్పుల్ — ఒ.ఔ.క.ఖ ; చూడంగ వేడ్క పడుదురు జోదుల్ — కొన్ని ప్రతులు.

284 1. పతికృష్ణా — పెక్కుప్రతులు. 2. నలరు వాన — పెక్కుప్రతులు. 3. వానొక ఝూమున్ — చ.

285 1. ఇచ్చట యశరీరవాణి వాక్కులును, అశ్వత్థామ అర్జునుని సంగ్రామాతిథ్యము యిమ్మని కోరుటయు భండార్కరు ప్రతియందు కానరావు. కుంభకోణప్రతి 8-52-17 నుండి యీ ఘట్టము కాన్పించుచున్నది. 2. కృష్ణార్జునుల — పీ.శ.వ. 3. దీధితుల —

ధుర్యుండగు నాచార్యనందనుం [4]డరిగి యమ్మహాత్ముల మార్కొని మార్గ
ణోజ్జ్వలం బగు దక్షిణకరంబున నాఫల్గునుఁ బిలిచి హాసభాసితముఖుం
డగుచుఁ గుపితుండగు నతని కిట్లనియె.

—: అశ్వత్థామ యర్జునుం జేర్కొని మార్కొని సంగ్రామంబు సేయుట :—

సం. 8–40–110

286 క. ననుఁ దగియెడు నతిథింగా, మనంబునఁ దలంచి నీవు మన్నించెదవే
నిని వచ్చెద నీపాలికి, ననఘా సంగ్రామ మొసఁగు మాతిథ్యముగన్.

287 ఆ. అనినఁ గృష్ణుఁ జూచి యర్జునుఁ డాచార్య
తనయు గెలువ కునికి దైన్య మిప్పుడు
సమయఁ జూడ వలయు సంశప్తకులను నీ
మనసు వచ్చు పనికిఁ బనుపు మనుడు.

288 ఉ. తేరు మురారి ద్రోణసుతుదిక్కునకుం జన నిచ్చి మేలుమేల్
[1]పోరు ఋణంబు దీర్చు కురుభూపతికిన్ [2]నరబాహులీలకు
న్నేరణ గల్గి నిల్వు మనిరన్ విని యట్టుల కాక యంచు న
వ్వీరుఁడు షష్టిబాణముల వెన్నుని నేసె నుదగ్రుఁడై వెసన్.

289 ఉ. అమ్ము[1]లు మూఁడు పార్థునను [2]వాఁడగ నేసిన ద్రుంచి వైచెఁ జా
ప మ్మతఁ డమ్మహాద్విజుఁడు [3]భారవహమ్మగు నొండువిల్లు శీ
ఘ్రమ్మున నెత్తి చేతులను గాల్ల[1]ను మోమున వింటి[5]కొమ్మునం
గ్రమ్మినభంగిగా శితశరప్రతతుల్ [6]నిగుడించెఁ బైపయిన్.

290 క. కడుఁ బెక్కు [1]వేలు దూపుల, వడిఁ గృష్ణార్జునుల [2]సరథవాహంబుగ నె
క్కుడు మదమునఁ బొదివిన నె, వ్వెడలి వెఱఁగుపడిరి వారలిద్దఱు నధిపా.

---

అ.ఝ. 4. డలిగి — కొన్ని ప్రతులు.

288 1. పోర (ి) ఋణంబు — పెక్కు ప్రతులు. 2. నరుబాహులీలకున్ — పెక్కు ప్రతులు.

289 1. ల మూటఁ గ్రిడి — అ.ఆ. 2. నంటగనేసి — ఆ.చ.ఝ. 3. భాసుర లీలను నొండు
విల్లు — అ.ఆ ఒ.ఝ. 4. నురంబున — ఉ.ధ.వ. 5. కొప్పునం, కోపునన్ — అని
పాఠములు. 6. నిగుడించె – పెక్కు ప్రతులు.

290 1. మార్గణంబులు — అ.ఆ.ఐ.ఒ.ఝ.డ. 2. రథము వాహనముల — అ.ఆ.ఐ.ఒ.ల.

291 వ. ఇవ్విధంబున వివిధవిశిఖజాలంబులఁ గాలుసే యార్వురా కుండఁ గప్పి యార్చిన నప్పార్థుం డతనిచేతఁ దనవిక్రమం[1]బు ప్రతిహతం బయ్యె నని తలంపఁ దత్సైన్యంబున హాహాకారంబు లెసంగం జారణసిద్ధగణంబు లట్లు నిశ్చేష్టితులైన యాలోకరక్షకుల నాలోకించి లోకంబులకు బ్రదుకు గలుగునో యని పలుక నప్పద్మనాభుండు గనలి యక్కవ్వడి నుద్దేశించి.

292 క. గురుసుతుఁడు నిన్ను మిగులుట, గర మాశ్చర్యంబు ముష్టి గాండీవము దాఁ
దిరమయి యుండదొ బాహుల, వెరవు[1]బలుపు గుందెనో వివేకింపు [2]మెడన్.

293 క. గురుని[1]కొడుకను తలంపునఁ, బరుసఁదనంబునకుఁ గోరక భంగపడితో యు
ద్ధురతఁ గడుఁ జెడితె నవుడు, [2]సరోషసంరంభుఁడై విజయుఁడాతనితోఁన్.

294 క. వెసఁబెక్కమ్ములు మనపై, ముసుఁగువడం బఱపి యతఁడు మురభంజన సం
తస మందె[1]డు నింతన యేఁ, గసిమసఁగెదఁ జూడు నన్ను గాండీవంబున్.

295 మ. అని భల్లప్రకరంబులన్ గురుతనూజాస్త్రప్రతానంబుఁ ద
ద్ధనువుం గేతువు నాతపత్రమును జిత్రస్ఫూర్తిఁ దున్మాడి గ్ర
క్కున నవ్విప్రుఁడు శక్తియున్ గదయు నుక్కుం [1]దాల్మియుం దోఁప నె
త్తినఁ దోడ్తో నవి ద్రుంచి వైచె సమరస్థేమాభిరామాకృతిన్.

296 ఆ. ఇట్లు ద్రోణసుతునియేపు పార్థుఁడు దుహి
నంబుఁ జెఱుచు నినువిధంబు మెఱయ
జెఱచె నంతఁ బోదివె నుఱకయారథికు సం
శప్తకవ్రజంబు సరభసముగ.

---

291 1. బు ప్రతిహతంబయ్యెనని – ఎ.గ.ఘు.ణ వ ; బపహ్నంతంబయ్యెనని – వా. కొన్ని ప్రతులు.

292 1. బలిమి – డ ; బ్బలము – కొన్నిప్రతులు. 2. మెదన్ – పెక్కుప్రతులు.

293 1. సుతుండను తలపున–ఉ.చ.శ.వ. 2. సరోషుడై క్రీడియనియె జకారి యుధుతోన్– స.పీ ; నరుదారుననియె విజయుడాతనితోన్ – ణ.త.వ.

294 1. వవింతననేగిసి – గ.పీ.

295 1 తేవగురు ఊ.

297 క. ఎందఱు వొదివి[1]రి వారల, కందఱకును దమక తమక యర్జునచటుల
స్యందన మెదురై నట్లు మ,దిం దోఁచెఁ దదీయబాణతీవ్రబహులతన్.

298 క. అప్పుడు గురు[1]తనయాదిప్రిం, గప్పఁగ వజ్రోపమానకాండములు వెసం
గుప్పనఁగూర వఱప నరుఁ, డప్పరుసఁదనమున కోర్చి యతఁడుఁ బెనంగెన్.

299 వ. అట్లశ్వత్థామ పెనంగు చుండ సంశప్తక[1]వ్రజంబు నందు.

300 క. చేతులు దలలును బహువిధ, హేతులఁ దునియలుగఁ జేసి యిలఁదొరఁగించెం
జేతులకసి వోవంగ న,రాతులు బెగ్గిలఁగఁ గ్రీడి [1]ప్రకటస్ఫురణన్.

301 క. తురగద్విపరథతూర్యా,భరణధ్వజచామరాతపత్రశకలముల్
పొరిఁ బొరి ధరఁ గప్పఁగ నె,త్తురుటేఱులు వానిఁ దొలఁగఁద్రోచుచు వచ్చెన్.

302 వ. అట్టియెడ.

303 తే. అంగ[1]వంగనిషాదకళింగబలము, లర్జునునిమీఁదఁ బెల్లుగ నడరుటయును
గురుతనూభవుఁ డతనిని మురవిరోధి, నంపపెనువెల్లి ముంచి బెట్టార్చిపేర్చి.

304 వ. అ వ్విక్రమ[1]విశేషంబునకు రోషంబు నొంది.

305 క. అవ్వీరుం డవ్విప్రుని, క్రొవ్వును వాసైన్యసమితి కూర్రోద్ధతియుః
నివ్వటిల నీక ఖచరులు నివ్వెఱపడ సమరకేళి నిపుణత మెఱసెః.

306 వ. మెఱసిన నెఱసిన[1]రోషంబున మఱియును.

---

297 1. విన — కొన్ని ప్రతులు.

298 1. పుత్రాదిప్రింగప్పు — శ.ప.శర,కొన్ని ప్రతులు.

299 1. సైన్యంబునందు — పెక్కు ప్రతులు.

300 1. శౌదప్రిస్ఫూర్తిన్ — ఇ; ప్రకటస్ఫూర్తిన్ — అ.ఆ.ఒ.ఝ.

303 1. వంగనేపాళకళింగ — ల.

304 1. విహారంబునకు — ఊ.జ.ట వ.

306 1. కోపంబున — కొన్ని ప్రతులు.

307 మ. గురుపుత్త్రుం డసురాంతకుꠂ విజయునిం గ్రూరాస్త్రసంతానని
ష్ఠురపాతం[1]బున నొంప నాహరి దదాటోపంబు సైరింపక
న్నరుతో నౌషధ మూఁది చేసి తెవులు స్మర్దింప కున్నం దుది
న్నరమై యుండదె యే సడంపుము రిపు న్సంరంభివై నావుడున్.

308 వ. అతండు విజృంభించి గుణంబు సారించి.

309 చ. శిరమునఁ గంఠదేశమునఁ జేతులయందు నురస్థ్సలంబునం
జరణములꠂ శరంబులు వెసꠂ నిబిడంబుగఁ గీలుకొల్పుచుꠂ
వెరవునఁ బగ్గముల్ దునుమ వేగమ యీడ్చెఁ దురంగమంబు ల
గ్గురుసుతు తేరు గయ్యమునకుం గడుదవ్వు దొలంగ భూవరా.

310 వ. [1]ఆ భూదేవుండును భగ్నోత్సాహుం డై యల్లన సూతనందను సమీపంబునకుం జనియె నప్పుడు శౌరి సంశప్తకసైన్యంబు దెసకుం దేరు నడపుచుం దమసేన దిక్కు కోలాహలం బాకర్ణించి చూడ్కి యట నిగిడించి యర్జును నుద్దేశించి వేదండారూఢుం డైన దండధారుండు మనబలంబులం గలంచు చున్నవాఁ డమ్మ గధోత్తముండు భగదత్తు[2]నంతవాఁడ యతని మడియించి మఱిచేయంగలపని సూచికొంద మని పలికిన నక్కవ్వడి యొడంబడ నక్కడ కరదంబు వోవ నిచ్చె నట్టియెడ.

—: దండధారుం డను రాజు వేదండంబుతోడ నర్జునుచేఁ జచ్చుట :—

సం. 8—54—1 [కుంభ]

311 క. పాండవ సైన్యంబుల వేదండంబుల ఘోటముల రథంబుల భటులం
[2]జండగతి మగధపతి నిజ, శుండాలముఁ బఱపి యేపుఁ జూపి తెరల్చెన్.

312 వ. అవ్విక్రమ విహారంబు[1] వీక్షించి.

---

307 1. బులనొంప — పెక్కు ప్రతులు.

310 1. దండధారుడను మగధరాజుతో అర్జునునికైన యుద్ధము భండార్కరు ప్రతియందు కాన్పించ లేదు. దీనికి మూలము కుంభకోణ ప్రతియందు (8-54-1) కాన్పించు చున్నది. 2. నట్టివాఁడ - పెక్కు ప్రతులు.

311 1. ఘోటకముల తతుల సుభటులం — ఖ. 2. చెండాడి — ట.

312 1. బుపలక్షించి — ల.అ.ఇ.ఐ.ఒ.ఔ.డ.ణ.వ.

313 తే. మాగధుని కోల్తలకుఁ గాక మనబలంబు
విఱిగెఁ [1]బొదపొదమని తాను దఱిమెఁ దేరు
హరియుఁ బఱపంగ నర్జునుం డడ్డపడియెఁ
జండచేష్టితోద్దండవేదండమునకు.

314 క. అగ్గలిక దండధారుఁడు, దిగ్గజనిభ[1]నిజగజంబుఁ దీవ్రత [2]మెఱయన్
డగ్గఱఁగఁ బఱపి హయముల, నగ్గరుడధ్వజుని నరుని నమ్ములఁ [3]గప్పెన్.

315 చ. అలిగి కిరీటి మాగధనరాధిపు బాహులు [1]ద్రెంచి గ్రక్కునం
దలయును ద్రుంచి యేనుఁగు నుదగ్రతఁ బీనుఁగుఁ జేసె నప్డు గ్రొం
దల మొకయింత లేకతని తమ్ముఁడు దండుఁడు దాఁకి తోమరం
బులు వరగింప [2]గెలు శిరముం [3]గరటిం దునుమాడె [4]నుగ్రతన్.

316 క. [1]తదనీకం[2]బు గజంబులు, వొదివిన [3]బలుగాలి మేఘములఁ దీవ్రగతిం
జెదరించు [4]పగిది నరుఁ డున్మదుఁ డై నలు దెసలఁ దోలె మనుజాధీశా.

317 వ. ఇవ్విధంబున మగధసైన్యంబు మర్దించి సంశప్తకసైన్యంబుపైఁ గవిసి కపికేతనంబు మెఱుంగులు మెఱయ [1]మధుమథను వెరవున వెలిమావులగతు లక్కజంబుగా నుక్కున పార్థుండు భల్లనారాచప్రముఖప్రదరపరంపరల సొంపును బాహువీర్యధైర్యంబుల పెంపును నిలింపనికరంబు వర్ణింపనందుమహార్ణవంబునం దిరుగు మందరనగంబుచందంబున నిజస్యందనం బొప్పనప్పటప్పటి [2]కెక్కుడొదవు మదంబునం దిగర్తాదు లగు నమ్మార్తురు పై పయిం గ్రమ్మి కురియునస్త్రశస్త్రంబులు విదళితచ్ఛిన్నచూర్ణితంబులు సేయుచుఁ దదీయ

---

313 1. పదపదమని — ఈ.ఊ క.ఖ.గ.ఘ.ణ.త.న.వ.

314 1. గజముగొల్పి — ఈ.క.ఖ; మగుగజంబు — ఇ.వ. 2. తీవ్రరయమునన్ — పెక్కు ప్రతులు. 3 నొంచెన్, పొదివెన్ — అని పాఠములు.

315 1. దుర్ంచి — అ.ఆ.ఇ.ఈ. కొన్ని ప్రతులు. 2. వాని — ఇ.న.వ. 3. దునుమాడె గిరిటియుగ్రతన్ — ట. 4. నిగ్రహనన్ — కొన్ని ప్రతులు.

316 1. రథనికరంబులు గజములు — ఇ.బ. ఈ ప్రతులలో నిట్టి పాఠము కన్పట్టును. 'ద ధ పాఠసగా చూచుకొని యుందురు. కాని 'రథ' శబ్దమునందు త వర్గ ద్వితీయాక్షర ముండుటచే ఈ పాఠ నిరాకరింప దగినది. 2. బులగజములు — కొన్ని ప్రతులు. 3. పెనుగాలి — కొన్ని ప్రతులు. 4. మాడ్కి — వ.

317 1. మురమర్దను — అ.ఆ.ఇ.ఐ.ఒ.క.ఖ.వ. 2. కిసెక్కుడొదవు — కొన్ని ప్రతులు.

గాత్రంబులుం గరటిఘోటకతనువులుం దునియ లయ్యును నుగ్గు లయ్యును బఱియ లయ్యును గుదు లయ్యును ధరం దొరంగం దామర [3]వావిం గేలి సల్పు సామజంబుచాడ్పున విహరించి యవిహతధృతివ్రత[4]మహితు లగు నహితుల నత్యుత్తమ లోకంబులకుం బుచ్చినం గొంచెపు మూంక విచ్చినం బెద్ద వెను కొనక యరదంబు మరల్చి వచ్చునెడ నచ్యుతుం డర్జును నుద్దేశించి భవద్విక్రమ విహారస్థలంబు సూచితే యని పలికి వివిధాయుధఖండంబులను వేదండాశ్వ రథ పదాతి శకలంబులను భూషణాతపత్రకేతు చామ[5]రాంశంబులను జకుళ్ళ మత్కారణపరిణతం బగు రణస్థలంబు సూపె నప్పుడు గొఱప్రాణంబులతో నొఱలు నరతురగద్విరదంబులను గొందఱు దమ[6]వారిం గానక కన్నీళ్లు నిం చుచు నాలింగనరోదనప్రముఖంబు లైన కరుణాభాషణంబు లగు నవస్థావిశే షంబులం బొందువారలం [7]గృపాళు లై యాలోకించుచు నయ్యిరువురుం దమ మోహరంబున నెసంగు కలకలంబు విని యుదీర్ణగమనంబునం జను దెంచు చుండి రటమున్న [8]కౌరవ్యుల మొనయును గర్ణుని మొగ్గరంబును రెండుముఖంబులం బెనంగు చుండి కయ్యా పు[9]టుచితత్వంబునం గలసె నట్టియెడ రారాజు పురికొల్ప రాధేయునకుం బ్రాపయి పుళిందబాహ్లిక కేంకణాంధ్ర భోజానీకంబు గవిసినం గౌంతేయబలంబునకు భర్గం బగుటయు;

—: మలయధ్వజుండను పాండ్యమహారాజు అశ్వత్థామచేతం జచ్చుట :—

సం. 8—56— 1 (కుంభ)

318 సీ. [1]పాండ్యుం డాసేనలపై బెట్టిదంబుగ
నడరి బాహాబల మక్కజముగం

---

3. వారింగేలి, కొలనింగేలి – అని పాఠములు. 4. తమహితులగు నహితుల– పెక్కు ప్రతులు. 5. రాంకశంబులను – కొన్ని ప్రతులు; రమరాణంబులను – ఎ.గ.ఘు.వ. 6. వారికి నీళ్ళిచ్చుచు – కొన్ని ప్రతులు. 7. కరుణాపరులై – కొన్ని ప్రతులు. 8. కౌరవుల – కొన్ని ప్రతులు. 9. టుచితంబున – పెక్కు ప్రతులు.

318 1. మలయధ్వజుండను పాండ్య మహారాజు అశ్వత్థామచేతం జచ్చుట. ఈ కథా భాగము భండార్కరుప్రతియందు కాన్పించ లేదు. కుంభకోణప్రతియందు (8-56-1) కాన్పించు

[2]బేరిచి పీనుంగు పెంటగాఁ జతురంగ
ముల రూపుమాపె నయ్యలఘుభుజుఁడు
ద్రోణభీష్ములు దనతోఁ బాటి యనుపలు
కున కోర్వఁ డచ్యుతార్జునులు దనకు
నెక్కుడు నా విన్న నేవగించుచు నుండు
నవ్వీరుఁ డమ్మెయి నాక్రమింపఁ

ఆ. గని కడంగి యెదురు చని గురుతనయుండు
నగుచుఁ బగఱ నీవు మృగ[3]కులంబు
గలఁచుహరియుఁబోలెఁ [4]గలచెదు నాదిక్కు
మొగము సేసి యనికి మొనయు మనియె.

319 చ. అన విని మేను వొంగ మలయధ్వజుఁ డుగ్రపు నారసంబుఁ ద
త్తనువునఁ [1]గ్రుచ్చి మౌర్వినినదంబు నభంబునఁ బర్వ నంపవె
ల్లి నిగుడఁ జేయఁ దొమ్మిదిశిలీముఖముల్ వెస నమ్మహీశుపై
ననిమిషవర్ణనీయగతి నగ్గురునందనుఁ డేసె నేసినన్.

320 వ. అత్తొమ్మిదింటిలోన.

331 క. ప్రతిశరములు పాండ్యమహీ,పతియును బరగింప నైదు భగ్నము లయ్యెన్
గతి సెడక నిగిడి రథ్య,ప్రతతి ధరం గూలె నాలుబాణము లధిపా

322 తే. మఱియు గురుపుత్రుఁ డేయ నమ్మలయకేతుఁ
డాశరంబులుఁ దద్ధనుర్జ్యాలతయును
దునిమెఁ దునిమిన నతిరయంబున నతండు
నారి సంధించి యమ్ముల నభముఁ గప్పె.

---

చున్నది. 2. బేర్చిన — పెక్కు ప్రతులు. 3. గణంబు — పెక్కు ప్రతులు. 4. నల చెదునాదిక్కు — పెక్కు ప్రతులు.

319 1. గూర్చి, నొంచి — అని పాఠములు.

323 వ. అప్పాండ్యమహీపతి పరివారసామర్థ్యంబున రథ్యవంతుం డయి వాయ
వ్యాస్త్రంబున నయ్యంపపరంపరఁ బ్రతిహతంబు సేసి తదీయచక్రరక్షకులం
దెగటార్చి యార్చినం [1]గెరలి యగ్గురునందనుం దత్సహచరుల [2]నుఱుమాడి
రత్నమయాగురుచందనసుందరం బైన మలయగిరి ప్రకారంబునం బొలుచు
కేతనంబుఁ గూల్చి గుఱ్ఱంబుల గీ టడంగించి సూతుప్రాణంబులు గొని
చాపంబు ద్రుంచి తేరు దుమురు సేసి యతండు వోలివోని పౌరుషంబునం
బ్రయోగించు నస్త్రశస్త్రంబుల నుఱక నఱికి యగ్గ మై యున్నను గయ్యంబు
[3]వలని వేడుక నతని సమయింపనొల్లక యరవాయి గొనినయాలోనఁ
[4]బతితయోధం బైన సుకల్పిత మాతంగంబు నెక్కి గిరిశిఖరంబు నలంక
రించు కేసరియ ట్లొప్పి యాద్రవిడేశ్వరుండు సామజంబు నుద్దామగతిం
దఱిమి [5]భీమాభిరామం బైన తోమరంబు వైచిన మణిగణోజ్జ్వలం బైన
యాద్రోణిశిరోభూషణంబు ధరణిం బడినఁ ద్రొక్కంబడినభుజంగంబు
పోలికం గనలి యబ్బలుమగండు తత్పార్శ్వవర్తుల[6]నార్వురరథికవరులఁ
దద్వేదండంబుఁ దుండంబును చరణచతుష్టయంబును నమ్మేదినీపతి పాదం
బులుఁ గరంబులు శిరంబును నతితీవ్రభల్లంబులం దునుమాడిన నద్దిక్కుమూఁ
కలు విచ్చెం గురుభూవరుం డమ్మహీసురవరుం జేరంజని యగ్గించె నప్పుడు.

324 క. నిలు నిలు మని తమమూఁకల, నిలిపి వృకోదరుఁడు గవిసె నీబలములపైఁ
దలకొని ధృష్టద్యుమ్నాదులు [1]సంరంభోద్భటముగఁ దోడ్పడి రధిపా.

325 క. వారల[1]వడి కోర్వక య, క్కౌరవసైన్యంబు [2]దెరలఁ గర్ణుఁడు దర్ప
స్ఫారత [3]నదల్చి నిలిపియు, దారగతిఁ [4]వైరిరథికతతి మార్కొనియెన్.

---

323 1. గనలి — ఇ. 2. అందునుమాడి — ఇ.ఊ.ఒ. 3. మీది వేడుక — కొన్ని ప్రతులు.
4. భరితయోధం బైన — ఆ.ఝ.న ; ప్రతియొద్ధనంబు సుకల్పితంబు సేసి మాతంగంబు
నెక్కి — వ ; చతుర్దంత శుండాల సన్నిభంబగు వేదండంబు నెక్కి — ఊ ; హాతరథుం
డయ్యును సుకల్పిత — జ. 5. శోభాభిరామం బైన — వ.శ.స. ; యుద్ధామాభిరామం
బైన — క.ఖ.ఔ.ప. 6. నూర్వుర — కొన్ని ప్రతులు.

324 1. సంరంభోత్కటముగ — ఆ.చ.ఝ.డ; కరముద్భటముగాఁ — ణ.

325 1. అయురవడికోర్వక / కౌరవ — అ ఆ ఇ.ఐ.ఝ.డ.స. 2. దెరలె — ఊ.శ.ష.
3. నెదిర్చి — ఎ.గ.వ. 4. జెలగిరథికతతి — ఐ.ఝ.డ.

326 వ. అతనికి బాసటలై [1]యదరిన యశ్వత్థామచేతం బలువురు పాంచాలురు వ్రాలి
సిరి కృష్ణుండు గ్రీడికిం బాండ్యమహీపతి సమయుట సూపి సమీరనందన
కర్ణాదు లగు నిరువాఁగురథికుల పరాక్రమంబును వేఱువేఱ నిరూపించి
చూపిన నతండును రథంబు మనసేనలోనికిం బోవనిమ్మనిన నచ్యుతుం డట్లు
చేయ నుబ్బిన పాండవానీకంబునకును రాధేయగురుపుత్త్రుల రథసంబునం
బేర్చిన మనమొనకును సంకుల సమరం బయ్యె నందు గర్ణునకు ధృష్టద్యుమ్ను
నకుం బరస్పరశరకర్తనంబును నితరేతరచ్ఛత్త్రకేతుఖండనంబును నన్యోన్య
వర్మవిదారణంబును [2]మిథశ్శరీర[3]పాతంబును నగు సంగ్రామంబు సెల్లె నట్టి
యెడ నా సూతనందనునకుం దలకడచి గురునందనుండు ద్రుపదనందనుం
[4]గవిసి బ్రహ్మఘ్న నిలు నిలు మేను గలుగ నెట్లు బ్రదికెద వని పలికి వెండియు.

327 క. మాతండ్రి యె[1]డం జేసిన, పాతకము కతంబు గాఁగ బాంచాల నికృ
ష్టాతుని మెద నిను నరుఁ డీట, కేసరక [2]యున్నఁ [3]బాఱ కీవు నిలిచినన్.

328 వ. అన విని ధృష్టద్యుమ్నుం డతని కిట్లనియె.

329 క. మీతండ్రి [1]కుఱికి నఱికిన, హేతియ నీ[2]కొఱకు నునిచి తిపుడ నఱుకుదుఁ
నీతులువపలుకులకు నీ, కైతోఁచినయుత్తరంబు నదియ దురాత్మా.

330 వ. అని యంత నిలువక.

331 తే. వినుము బ్రహ్మఘ్నుఁ డన నీకుఁ జనునె బ్రాహ్మ
[1]ణబ్రువఘ్నుఁడ నై సమున్నతి వహించు
నన్నుఁ గిల్బిషపరుఁ డనునిన్ను జనకు
కడకుఁ బుచ్చెద వేగిరపడక నిలుము.

---

326 1. తరిమిన — కొన్ని ప్రతులు; వెఱలిన — వ. 2. నమిత శర పాతనంబును — కొన్ని ప్రతులు. 3. శాంతనంబును — ఔ.చ.బ. 4. సదిసి — కొన్ని ప్రతులు.

327 1. నట్లు జేసిన — కొన్ని ప్రతులు. 2. మున్న — చ.ట. 3. బోరనీవునిలిచినన్ — వ.

329 1. కోఁగ్రినరికిన, కోఁగ్రిసలిపిన — అని పాఠములు. 2. కోరికయును నిప్పుడనరకున్ — పెక్కు ప్రతులు.

331 1. ణాళికి ఘనుడనైసమున్నతి — ఔ.

332 వ. అనియె నట్లయ్యిరువురు నొండొ[1]రులం బరుషంబులు వలికి తలపడి వియత్తలంబు విశిఖశిఖాకలాపంబులం గప్పిరి రాధేయుండు యుధామన్యూత్తమౌజోద్రౌపదేయశైనేయులను మఱియుం జేయంగల పాండవపాంచాల యోధులను బొదివి ఖండనంబు సేయుచుండె నా ధృష్టద్యుమ్నుండు గురుపుత్రుకోదండంబు దుండంబులు సేసినం గుపితుండై యొండువిల్లు గొని యవ్వీరుండు.

333 క. సూతతురంగస్యందన, కేతనచాపములు నఱికి కేళిమెయిన్ ను
గ్గై [1]తొరఁగ నేసెఁ దోడ్తో, నాతతశక్తియును గదయు నతఁ డెత్తంగన్.

334 వ. అప్పాంచాలోత్తముండు వాలును బలుకయుం గొని కవియం గడంగిన నవియును దుమురు సేసి పెల్లేసి పడకున్న నశ్వత్థామ [1]వేగిరపడి పెలుఁ గందుచు చేతిబాణాసనంబు విడిచి కృపాణంబు గొని భుజంగంబు దెస కడరు విహంగపతివిధంబునఁ జనుట సూచి సవ్యసాచితో శౌరి ధృష్టద్యుమ్నుండు గురుపుత్రుబారిం బడియెం గావవలయు ననుచు నద్దిక్కు సూపిన నతండు సత్వరుండై యవ్వీరుం డాద్రుపదపుత్రుం గవిసినకొలందిఁ గ్రూరంబు లగు నారాచంబులు గుప్పించి నొప్పించిన నమ్మహీసురవరుం డయ్యుత్సాహం[2]బు వదలి మరలి యరదంబున కరుగ సహదేవుండు దనతేరిపైకి నప్పార్షతుం దిగిచికొని తొలంగం గొనిపోయె నక్కుంభసంభవసంభవుం డగ్గాండీవి మార్కొని పెనంగి [3]బెట్టిదంబుగాఁ [4]గనుకనిం దాఁకి యతండు నాటిన సునిశితశరంబున సోలె సారథి రథం బొండువలనికిం దోలె నర్జునుం డట్లు నిజ సేనానాథు రక్షించి ద్రోణిమదం బడంగించుట గనుంగొని కౌంతేయ సైనికులు సింహనాదంబులు సేయ నక్కడ నిస్సాణాదుల నాదం బెసంగి నింగి నిండె.

---

332 1. రువులం బరుషంబులు — పి.శ.స. కొన్ని ప్రతులు.

333 1. తొరుగ — పెక్కుప్రతులు.

334 1. వెరగుపడి — పెక్కు ప్రతులు. 2. బెదరి — ఎ.వ. 3. బెడిదంబుగా — బ.వ. 4. పెనంగి సునిశిత శరంబేసిన సోలె — ఎ.స.వ. ద్రోణి కిరీటం దాకి సునిశిత— కొన్ని ప్రతులు.

335 తే. సూతసుతుఁడు ధనంజయుఁ జూచి రోష
కలుషితా[1]త్ముఁడై తలపడఁ దలఁచె నపుడు
[2]తత్క్షణమున సంశప్తకతతియుఁ దోఁచె
రెండుఁ గని యిట్టు లనియె నా క్రీడి హరికి.

336 వ. కర్ణుండు మనల మార్కొనం గడంగెడు సంశప్తకులు గ్రమ్మఱం [1]బోదివిరి కర్ణుచేతం దగులువడితిమేని సంశప్తకుల కోహటించినవార మగుదుము వారలదిక్కు దేరు వోవ నిమ్ము.

337 చ. అన విని యట్ల చేసె నతఁ డర్జునుఁ డారిపుకోటి ముట్టి యే
పున నుఱుమాఁడుచుండెఁ గురుభూవర యప్పుడు ధర్మసూతనం
దనులు సముద్ధతింగడఁగ దండడి [1]క్రొత్తగ వారిసేనయుఁ
మనమొనయుంబెరంగె నుపమారహితం బగువిక్రమంబునన్.

338 ఉ. సంగర మేను పెక్కుదివసంబులు సూచితిఁ గాని యెప్డు నా
భంగి మునుంగ దచ్చెరువుపాటునఁ జిత్తము వోరు చున్కి యో
త్తుంగు[1]చు నున్కియో యెఱుఁగఁ దూలక పై పయిఁ గ్రమ్ముఁ గూలు సే
నాంగము లందు నిందుఁ గలహంబునుహోగ్రత యేమి సెప్పుదున్.

—: కర్ణుఁడు పాంచాలసైన్యంబు దైన్యంబు నొందించి విజృంభించుట :—

సం. 8—57—1 (కుంభ)

339 తే. అందుఁ బాంచాలవీరుల నశ్వసూత
రథసమేతంబుగా నంగరాజు దర్ప
మెసఁగ [1]నేవురఁ బదువుర [2]నేడ్వురను మ
హాస్త్రమార్గణములఁ దునుమాడె నధిప.

---

335 1. తాత్ముడై — అ.ఆ ల.శ.ప. 2. సమరమునకు సంశప్తకసమితిదోఁచె — వ.

336 1. బొడిమిరి — పెక్కు ప్రతులు.

337 1. బోరగవారి — ఇ.క.ఖ.

338 1. టయోయనంగ పెస దూలక — వ.

339 1. యేపున యిరువది యేను ఘన మహాస్త్ర — వ. 2. నేడువురను / నలిశితాంబకముల— కొన్ని ప్రతులు.

340 క. వడవడి పాండవయోధు, ల్వోదివినఁ బెనుఁదుంగమడువులో గజపతి యు
న్మదవృత్తిఁ గేలి సలుపుచ, గిది నాతఁడు [1]బోరె సురలు గీర్తన సేయన్.

341 వ. అట్టియెడ.

342 చ. ద్రుపదతనూజులుం గవలు ద్రౌపది పుత్రులు శౌరిశిష్యుఁడుం
గుపితమనస్కులై బలువుఁ గోల్తలఁ దాఁకి రథం డదల్చి యు
గ్రపురభసంబునన్ శరపరంపరలం బరగించెఁ గౌరవా
ధిపుహృదయంబు మోదమునఁ దేలఁగ నందఱయంగకంబులన్.

343 వ. వారలపై నక్కురుభూనాథుం డేనుఁగుకయ్యంబునకు వెరవుగల కళింగ వంగాంగమగధ [1]సుహ్మపౌండ్రాదిదేశంబులబలంబులం గవియించిన నవి తదీయ చతురంగబలంబుల మట్టి మల్లాడి చిత్రవధవిహారంబు సలుప నగ్గజ ప్రధానసేన లగ్గలికం జించి చెండాడుచు నాచండిమగలును జేకితాన ప్రభద్రకులును రౌద్రరసంబునం బెనఁచినం గనుంగొని మదంబునంబొదలి యొత్తరించి యురవడించిన.

344 శా. వంగాధీశుఁ గరీంద్రుతో నడఁగ గర్వస్ఫూర్తి శైనేయుఁ డే
యం గేలిగతి మాద్రి లేఁగొడుకు పౌండ్రాధీశ్వరుం గిట్టి యా
భంగిం గూల్చఁ దదగ్రజుం డటులదర్పం బొప్ప సుహ్మాధినా
థుం గోపంబునఁ ద్రుంప నేచెఁ గరటిస్తోమంబు లంతంతకున్.

345 క. విను మ ల్లేచి నకులుఁ బొది
వె నుదగ్రధ్వని ననేక వేదండములం
దెనిమిదిటిఁ గూల్చె బాణము
లెనిమిదియెనిమిదులఁ దమ్ముఁ డేర్తెఱ నధిపా.

346 క. ఆధృష్టద్యుమ్నాదులు, గ్రోధాంధత నడరి యేనుఁగుల [1]నస్త్రహతిన్
వ్యాధూతములుగఁ జేయుచు, రాధేయుం గదియ సంగరము పేర్చె నృపా.

---

340 1. దోలెసురలు — కొన్ని ప్రతులు ; బొల్చెసురలు — ఇ.ఐ.ప.

343 1. సుహ్మ—శ ; సుహ్మ — వ. ; సౌవీర, శూరసేన — కొన్ని ప్రతులు. 2. యొత్తరించి — పెక్కు ప్రతులు ; యుత్తరించి — వా.శ.ప.

346 1. శరనిహతిన్ — అ.ఆ.ఐ.ఒ.ఝ.డ.

347 వ. ఆ సమయంబున శోణితంబు పెల్లున మున్నెగసిన రేణుపడంగిన నిరువాఁగు సైనికులును దమతమయడియాలంబులతోడి గొడుగులును సిడంబులును బెద్దయు మెఱయఁ బెనంగుచుండ సంశప్తక[1]సంచయంబు గించిదవశిష్టంబుగా నష్టంబుసేసిన సవ్యసాచికి శౌరి యక్కౌరవపాండవబలంబులపోరు సూపి యప్పుడు దుర్యోధనుండు దనయందుఁ జేయంగలవారును దానును ధర్మనందనుం బట్టు తలంపున బెట్టుపొదువుటయు నమ్మృతంబున కాసపడి యడరు నసురుల మరల్చు శక్రాగ్నులచందంబున భీమసేనుండును సాత్యకియు వారలం బ్రతిహతులం జేయుటయు నంత నిలువక యక్కురువిభుండును గర్ణకృపాశ్వత్థామలును సుద్దామగతి నయ్యిరువుర శరజాలంబుల నమ్ముల జడియుచుం గదిసి యక్కౌంతేయాగ్రజుకంకటంబు ద్రుంచి వైచుటయుఁ గర్ణు నుత్సాహంబునం[2]గడంగు ధార్తరాష్ట్రుల సింహనాదంబులకుం దెరలక మరుత్సుతుండు మండలప్రచారుం డగుటయు నాసూతనందనుండు మొదలగు నమ్మేటిమగల మార్గణమ్ము లమ్మనుజపతిపైఁ బరగుటయు నకులసహదేవసాత్యకిధృష్టద్యుమ్న ద్రౌపదేయప్రభృతులైన పాండవేయపాంచాలాదియోధులం గలంచి యక్కర్ణుండు కమలాకరంబునం గేలి సలుపుశుండాలంబు[3]లీల నటించుటయు నవ్వీరుం డగ్గలిక నక్కవ్వడి రాకఁ గోరి కపికేతనం బాలోకించుటయుం గలిగిన యప్పరిపాటి యంతయు నేర్పడం జెప్పి యా రాధేయురభసం బుగ్గడించి మఱియు ని ట్లనియె.

348 క. నినుఁ దలపడఁ[1]జూచినయీ, తనియే డ్తెఱ మంట సొరఁగఁ దలఁచు మిడుతయు
బ్బున కెన య్యె నాకుం దోఁ, చినయది [2]ప్రమదింపు మితని శితవిశిఖములన్.

349 వ. అని పలికి యతని కప్పుడు దోడ్పడ నుత్సహించుభవత్సుతు నుపలక్షించి బీభత్సునకుం జూపి.

350 ఉ. ఇత్తఱిఁ ద్రుళ్లు సూపి నిను నేపున మార్కొని గెల్తు నన్ తలం
పెత్తి సుయోధనుం డదె యహీనబలంబులఁ గూర్చెఁ గర్ణుతో
మత్తగజంబులీల నెలమామిడిఁ గూల్చిన భంగిఁ బాండుపు
త్రోత్తమ వీనిఁ గూల్పు మతఁ డొంటిగ రాజ్యము నీకుఁ జేకుఱున్.

---

347 1. సైన్యంబు – కొన్ని ప్రతులు. 2. జెలంగు – కొన్ని ప్రతులు. 3. పోలి – కొన్ని ప్రతులు.

348 1. తలచిన – ఊ.ద. 2. మర్దింపు మితని – ఈ.ఉ.ట.ద.న.వ.పి.శ.ష.

351 వ. అనునవసరంబున.

352 మ. సమదాటోపత వాయునందనుఁడు ధృష్టద్యుమ్నుసై నేయు లే
కమనోవృత్తిఁ గడంగి తో [1]నడర దోర్గర్వంబు శోభిల్ల శౌ
ర్యము సొంపార నిలింపకోటి వొగడన్ రారాజుసైన్యంబు లో
[2]క్కొ మొగిం బెల్లగిలంగ బెట్టడరె సక్రోధాంతరంగంబుతోన్.

353 క. [1]అడరి పటుబాణజాలం, బడరింపఁగ వారిబలము లధికరయము నె
క్కుడుమదము నొలయఁ బైకొని, బడలువడఁగఁ జేసె నీదుబలముల నధిపా

354 క. వడిఁ బొదివి భీముఁ డార్చినఁ, జెడ విఱిగినసేన నేమి సెప్పుదుఁ దనదొం
దడిఁ దాన చదిసె వెనుకొను, కడిఁదిమగలచేత గాసి గాదె నరేంద్రా.

355 ఉ. ప్రెగ్గెడువాహనంబులును [1]మోములు వాడఁగ వాహనంబుల
న్డిగ్గి [2]తలంగుసైనికులు నేలకుఁ గప్పుఁజొప్పు సొప్పడం
[3]ద్రగ్గుసిడంబులుం గులముఁ దన్నుఁ దలంచి యెదిర్చి యొంటిమై
మ్రగ్గెడువారు నై కురుధరావరుసైన్యము రూపు మాయఁగన్.

356 ఆ. పావనికి నిషాదపతినందనుఁడు మాఱు, కొనిన నాతఁడతని కుంజరంబు
కరముతోఁ దదీయకరములు శిరమును, నఱకె శితశర[1]ములు నాలుగింట.

357 క. మూఁడ క్షౌహిణులిమ్మెయిఁ, బోఁడిమి సెడి పాఱఁ బవనపుత్రుని యెదురన్.
వేఁడిమి సూపఁగ నొకఁడు, న్వాఁడిమగఁడులేఁడ [1]యే మనం గల దధిపా

---

352 1. నశవ - క.ఖ.ద.ల. 2. క్క మొగింబెల్లగిలంగబెట్టడరెన క్రావథాంతరంగంబుతోన్ - పీ.

353 1. దడఁగి — శ.వ.

355 1. ముందట నిల్వక క్షితివాజులన్—ఒ.ఔ.క.ఖ.త.వ ; మ్రోయుచు బారుగజంబులున్ మహిన్ / డిగ్గి — గ.ఘ.ణ.వ ; మోములు ద్రిప్పకపోరు దంతులున్ — ఆనం. 2. తొలంగు — పెక్కు ప్రతులు. 3. దగ్గుసిడంబులున్ — వీ.శ.వ.

356 1. ములనాలుగింట — కొన్ని ప్రతులు.

357 1. యపుడు వసుధాధీశా — ఏ.గ.ణ.వ.

358 వ. ఇవ్విధంబున విక్రమించిన భీమసేనుబరవసంబును దదీయ సైనికుల సంరంభంబునుం బద్మనాభుండు ఫల్గునునకుం జూపి చెప్పె ననిన విని సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

359 క. నీ చెప్పెడుమెయి సూడఁగ, నీచత వాటిల్లె మనయనీకమునకుఁ దా
రేచేటు వడిరొ కౌరవు, లాచరిత మువన్యసింపు మంతయుఁ దెలియన్.

360 క. అనవుడు నతఁ డిట్లను న,మ్మనుజపతికి [1]హితులు సెప్ప మానక నీచే
సిన దుర్ణయమునఁ జేటొం,దెను వగవక రణము వినుము ధీరవిచారా.

361 వ. ఇట్లు భీముకడంక గని కవ్వడి దనమునుమ కొంచెపు మూఁకలం దోలి మగిడి మనసేనల మర్దించుటకుం దమవారిఁ జేరం జనఁ గౌరవపతి యమ్మారుతి మార్కొని.

—: దుర్యోధనుండు భీమసేనుం దలపడి పోరుట :—

సం. 8—44—3

362 తే. ఎందు వచ్చెదు నిలునిలు మేను గలుగఁ, గడిమి సెల్లునె నీకు నీఋణము నిన్ను
నంతకుని [1]పాలి కనిచెద ననుచు రోష, రక్తలోచనరుచుల శరములు వఱపె.

363 క. రాధేయుండు సు[1]దీర్ణ, క్రోధుం డై గర్జతోడి గుణరవము నభో
[2]బాధం బొనర్పఁగా నిజ,యోధులఁ బురికొల్పికొని సముద్ధతిఁ గడఁగెన్.

364 వ. అట్లయ్యిరువురు నుత్సాహంబు వాటించి నిజానీకంబు నిలువరించిన నది పురికొని పో[1]రికి నమరుటయుఁ బాండవబలంబును దిరం బయి పెనంగం దొడంగె నట్టియెడ నక్కడ నిక్కడఁ జేయంగల దొరలు దలపడి యుక్కున నక్కజంబగు సమరక్రీడ సలిపి రందు.

---

360 1. హితవుసెప్పఁగ — చ.జ.వ.

362 1. ప్రోలికనిచెద — ల.

363 1. దీప్తక్రోధుండై — ఇ.ఎ.ఒ.ఓ.ఔ.న.ల.వ. 2. వేధియగుచునిగుడనిజ — వి ; వీధి పయినిగుడ — క.ఖ.శ.ష. వీధిపయి నెసఁగా నిజ — కొన్ని ప్రతులు ; వీథిఁ బోలు పారగా నిజ — స.

364 1. దరుగుటయు — కొన్ని ప్రతులు.

365 సీ. కర్ణుఁ డేపారి శిఖండిరథ్యముల సా
రథిఁ గేతువును గూల్చి రయము మెఱయ
విగతాయుధుఁడు బాణవిహతాంగుఁడును గా ను
దగ్రుఁడై తఱుమ నతండు దొలఁగఁ
బాఱె దుశ్శాసనపార్షతు లొండొరు
తనువులు నొంచుచు ననిమిషులకు
నచ్చెరు వగునట్టియని సేయ వారల
యనుచరు లెడసొచ్చి పెనఁగి రంగ

తే. రాజుసూడఁ దత్పుత్రుసారథిశిరంబు
నకులుఁ డొకభల్లమునఁ ద్రుంపఁ జకితమై క
లంగు నచ్చటి మూఁకఁ జలంబు [1]మెఱయ
నిలిపె నాసూతసూనుండు నృపవరేణ్య.

366 వ. అట్లు సారథి[1]రహితుం డైన వృషసేనుండు వేఱొక్కసూతు [2]నమర్చికొని తండ్రికిం జక్రరక్షకుం డై నిలిచె నకులుండు నొండుదెస కడరె సహదేవుం డులూకుని విరథుం జేసి పఱపె సాత్యకి సౌబలు లన్యోన్య కేతుపాతనంబును బరస్పర కంకట[3]కర్తనంబునుం జేసి రా సమయంబున శైనేయుండు దురంగంబులం జడిపిన నరదంబు డిగ్గనుఱికి యోసరించు నగ్గాంధార విభుం గని యులూకుండు.

367 క. మును సహదేవుం డెగువం, జనినప్పుడ యొండుదేరు సవరించుకొనం
గనుట నది పేర్చి యతనిం, గొనిపోయెను సంగరమునకుం [1]దొలఁగంగన్.

368 ఉ. అచ్చటిమూఁక నల్గడల [1]నాతురతం జెడి పాఱె భీముచేఁ
జచ్చెఁ గురుక్షితీశ్వరునిసారథి కూలె హయాళి నుగ్గు గాఁ
జొచ్చె రథం బతండు వెలి సొచ్చి ధరిత్రికి దాఁటి పోయి వె
న్నిచ్చిన నీదు యోధవరు లేడ్తెఱ మార్కొని రమ్మరుత్సుతున్.

365 1. వెరయ - కొన్ని ప్రతులు.

366 1. హీనుండై—అ.ఐ ; విరహితుం డైన — త.న.వ. 2. నమర్చుకొని — తాళపత్ర ప్రతులు. 3. చ్ఛేదనంబును ; ఖండనంబును, విదళనంబును — అని పాఠములు.

367 1. తలఁగంగన్ - ఊ.

368 1. నాకులమందుచు - అ.ఆ.ఐ.చ.ల.

369 వ. యుధామన్యుండు గృపాచార్యుధనువు దునిమిన నమ్మహాత్ముండు వేఱొక్క విల్లెత్తె.

370 ఆ. కేతనంబు గూల్చి యాతపత్త్రము [1]దుసు,మాడి సూతుఁ జంప నధికభయము
గదిరి తేరు దాన కయ్యంబునకుఁ దొలఁ,గంగఁదోలె నతఁడు కౌరవేంద్ర.

371 క. శితశరము లుత్తమౌజుఁడు, గృతవర్మనిమేన నింపఁ గినుక గదిరి మూ
ర్ఛితుఁడుగఁ [1]జేసె నతఁడు పెప్ప,నతనిం దత్సూతుఁ [2]డెగచె నరదముఁ దొలఁగన్

—: అశ్వత్థామ యర్జునుం దలపడి మహాహవంబు సేయుట :—

సం. 8–45–1

372 చ. గురుతనయుం డనేకరథికుల్ దనపార్శ్వములం దుదగ్రులై
దురముకడంకమైఁ దఱుమ దోర్బలశౌర్యము లుల్లసిల్ల ని
ష్ఠురశరవృష్టి ముంచె మధుసూదను మధ్యమపాండవున్ వియ
చ్చరులు ప్రశంస సేయఁగ నిజధ్వజినీనయనోత్సవంబుగన్.

373 క. అలిగి నరుఁ డైంద్రమాదిగఁ, గలదివ్యాస్త్రంబు లేయఁ గా నయ్యైయు
జ్జ్వలమార్గణంబులను న, క్కలశభవసుతుండు మాన్చెఁ గౌరవ[1]ముఖ్యా.

374 వ. ఇవ్విధంబున వివిధాస్త్ర జాలంబులం బోరిపోరి.

375 సీ. ఉఱక యశ్వత్థామ యుగ్రబాణంబులు విజయుని దక్షిణభుజము దూఱి
మూఁడేయ నొచ్చియుఁ బోడిమి సెడక యబ్బలియుం డదల్చెఁ దత్పార్శ్వవర్తు
లగు పెనుమూఁకల నమ్ములవెల్లిఁ బేరల్క నక్కుంభజునాత్మజుండు
రథ్యచయంబు నారాయణు వానర ధ్వజము నవ్వీరుగాత్రమును బొదివె
తే. మెఱుఁగువాలంపగముల నమ్మెయినరుండు ద్రౌణితోడ భరంపడి రణమొనర్చు
చుండ నట మున్న ధర్మజుఁ డురవడించి చిత్రసేనుని నమ్ములఁ జిక్కు[1]వఱిచె.

---

370 1. నురుమాడి - పెక్కు ప్రతులు.

371 1. నేసె - కొన్ని ప్రతులు. 2. డగిచె – కొన్ని ప్రతులలోని రూపము.

373 1. నాథా – కొన్ని ప్రతులు

375 1. వఱచి – పి.

376 క. తఱిమి తనమునుము సైన్యము
నుఱుమాడఁగఁ గని సుయోధనుఁడు మున్నుగ నే
డ్తెఱ నీయోధులు మార్కొని
యఱిముఱి నొప్పించి[1]పట్ట నమరి పొదివినన్.

377 ఉ. పావనిఁ మున్నుగాఁ గవలుఁ బార్షతుఁడున్ వెస వారిఁ దాఁకినం
జేవ దలిర్ప నచ్చటికిఁ జెచ్చెరఁ గర్ణుఁడు వచ్చి తీవ్ర బా
ణావృత మూర్తిఁ జేసె మనుజాధిప యారథికావళిన్ ధను
ర్జ్యావితతస్వనంబున వియ[1]ద్వివరంబు [2]ప్రపూరితంబుగన్.

378 క. అట్టియెడ మాద్రిపిదపటి, పట్టి కురునృపాలు రెండుపదు లమ్ములు దా
బెట్టుగ నేసిన వేదన, ముట్టుడుఁ జేడ్పడియె నతఁడు మొనయును [1]దలఁకెన్.

379 మ. కని రాధేయుఁడు [1]దివ్యబాణ[2]నిహతిం గౌంతేయసైన్యంబు నె
ల్లను నొప్పించిన బీఱువోయె నది [3]యుల్లాసోగ్రుఁడై ధర్మనం
దను నమ్మేటిమగండు గిట్టుటయు నాతం డగ్గి పెల్లేసినన్
విను మందస్మితసుందరుం డగుచు నవ్వీరుండు ధీరోద్ధతిన్.

380 వ. అనేకచండకాండంబు లంగంబునం గీలించి.

381 ఆ. వలుఁదనారసంబు వక్షంబుఁదూఱంగ, నేయుటయును బాండవేయుఁ డార్తిఁ
గూరి నిలువలేక కూర్చుండఁబడి సూతు,నరద మెగపు తోలఁగ ననియె నధిప.

382 వ. అనుటయు వాఁడట్లచేయం గౌరవులు గడంగి పోనీక పొదువుం డను నెలుం
గులతో నక్కౌంతేయాగ్రజు వెన్నాడి కవిసినం గేకయపాంచాలబలంబు
లడ్డపడిపెనంగె భీమసేనుండు సుయోధను నిలు నిలు మని[1]యదల్చి యమ్ము
లం గప్పె నప్పుడు రాధేయుండు రభసంబున.

---

376 1. పట్టునఱిమి పొలది విసన్ - శ.ష ; పట్టనఱిమి — శర.

377 1. త్తలమెల్లఁ బ్రపూ — పీ.స ; 2. ప్రదీపితంబుగన్ — ల.

378 1. గలఁగెన్ — పీ.శ.ష.

379 1. తీవ్ర — ఎ.వ. 2. వితతిన్ - డ.ల. 3. యుల్లాసంబునన్ — పీ.శ ష.

382 1. నొప్పించి - అ.ఆ.భ.

383 క. పాంచాలురఁ గేకయుల నుదంచితగర్వమున [1]వాలురమ్ములవెల్లిన్
ముంచిన నోటుటి యరికరి, పంచాననమూర్తి భీముపజ్జ [2]కొదిఁగినన్.

384 వ. [1]అక్కర్ణుండు నిజరథంబుమెఱయ ధర్మనందను వెనుకొనియె నతండు విశిఖవేదనం జేడ్పడినచిత్తంబుతోడ నిజ శిబిరం[2]బున కల్ల నల్లన పోవుచుండియుఁ దన్ను నాసూతనందనుండు మూఁడుదూపుల నేసిన మఱలి యమ్మేటి మగని మేనం బలుమార్గణంబులు నొనిపి తత్సారథి సాయకత్రయంబునను హయంబుల శరచతుష్టయంబువను గ్రుచ్చించె నట్టియెడ.

385 క. ఇరుదెసలనున్న కవల, న్నరపతి దురవస్థ నూచి నారాచపరం
పరలు వరఁగించుచును జె, చ్చెరఁ గర్ణునిఁ దాఁకి రతఁడు చిలున వ్రేలయన్.

386 తే. వార లిరువుర నుగ్రంపునారసములఁ
గప్పి [1]దంతవర్ణములును [2]గాలవాల
సుందరంబులు నగు ధర్మనందనుని తు
రంగమంబులఁ బడ నేసి రయము మెఱయ.

387 క. అతనిశిరస్త్రాణంబును
శితవిశిఖనిపాతితంబు సేసి యుదారో
ద్ధతి నకులుకార్ముకము హయ
తతియుం దునుమాడుటయు నతండును నతఁడున్.

388 క. సహదేవుని తేరెక్కిన, సహితాంతకుఁ డైన కర్ణుఁ డమ్మువ్వుర సం
పిహిత శరీరులఁ జేసెను, బహువిధబాణములఁ జలము బలముసు మెఱయన్.

---

383 1. వాలుటమ్ముల — ఈ.క.ఖ.గ.న.వ. 2. పనిగెఱ, పజనియెన్ — అని పాఠములు.

384 1. ఈ ఘట్టమున కర్ణుడు ధర్మరాజును వెనుకొనుటయు నకుల సహదేవులను ధర్మనందనుని ముగ్గురిని బాణపీడితులను జేయుటయు, శల్యుడతని నివారించి అర్జునుని జయించుట నీ ముఖ్యకర్తవ్యమని హెచ్చరించుటయు మొదలగు కొన్ని వేశములు భండార్కరు ప్రతియందు కాన్పించ లేదు. కుంభకోణ ప్రతియందు కన్పించుచున్నది. 8-66-10. 2. బుదెసకు నల్లనల్లన — కొన్ని ప్రతులు.

386 1. హంసవర్ణములును - వ. 2. మూలమునందు కాలవాలమనియె యున్నది. "సంత వర్ణాం స్తురాధేయో నిజఘాన మనో జవాన్ / యుధిష్ఠిరస్య సంగ్రామే కాలవాలాన్ హయోత్తమాన్'' కర్ణ - 63-11. చిత్రశాలాప్రతి.

389 చ. కనుఁగొని శల్యుఁ డిట్లనియెఁ గర్ణునితో నిదియేల ధర్మనం
దనుపయి నాగ్రహించెదు హితంబగు కార్యమె యిమ్మహీశు నీ
వనిఁ దెగటార్చినట్లయిన నర్జునుఁ డుత్కటశోకరోషముల్
పెనఁగొన నిన్నుఁ గౌరవులఁ బీనుఁగుపెంటలు సేయకుండునే.

390 తే. ఇతఁడు దెగటాఱనేనియు నేమిఫలముఁ
గలదు నరుఁబొలియించుట యలఘుశౌర్య
మది కురుక్షితిపాలున కఖిలరాజ్య
సిద్ధియును [1]జేయు నింక నా బుద్ధి వినుము.

391 వ. అదియునుం గాక.

392 క. వాఁడె కురుక్షితిపాలుఁడు, పోఁడిమి సెడి భీముచేతఁ బొదువఁబడియె న
వ్వాఁడిమగని కడ్డము నీ, వేఁడిమి దక్కంగఁ గలదె వేఱొకఁ డరయన్.

393 క. పవనసుతుచేత నాభూ,ధవుఁ[1]డీల్గిన యేని నీవు ధర్మతనయునిం
గవలఁ సమయించుట దలఁ, ప వృథా స్ఫురణంబు గాదె పరబలభేదీ.

394 క. అనవిని యక్కురుక్షితిప
తనయుని దెసఁ జూచి వాయుతనయునిచే నా
తని పొదువఁబడుట యేర్పడఁ
గని రాధాతనయుఁ డతనిఁ గావఁగఁ జనియెన్.

395 క. చనుటయు నజాతశత్రుఁడు, దనశిబిరంబునకుఁ బిన్నతమ్ముని యరదం
బున నతని నతనియన్నను, గొనిచనియెను సత్వరముగఁ గురు[1]కులముఖ్యా.

396 వ. అని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రునకు ధర్మనందనుపలాయనం బెఱిం
గించె [1]ననుటయు.

---

390 1. జేత నీవు నా బుద్ధి — కొన్ని ప్రతులు.

393 1. డీలిగెనేని — పి.సు.

395 1. వంశనిధీ — ణ.

396 1. ననవుడు — పెక్కు ప్రతులు.

397 ఆ. మొదలి రాజు సభయముగ నిట్లుసమరంబు,దొఱఁగి చని యెనట్టె పెఱబలంబు
దొరలు నిలిచిపోరు టరిది యనంతర, వర్తనంబు విప్రవర్య చెప్పుము.

398 వ. అని యడుగుటయు.

399 చ. అనిమిషవంద్యమాన ఘనసాదరశీల సుధాయమాన స
త్త్వనలినగంధరూప విబుధద్విషదంతకరప్రతాప సం
జనిత నిరస్తకామ ముని సంఘమహార్ణవపూర్ణసోమ వే
దనికరసంవిధేయనిజ[1]తత్త్వ పరిష్క్రియ నిత్యనిష్క్రియా.

400 క. [1]ప్రమితివిదూరా సుమన, స్సమితిసమారాధనప్రసన్నాకారా
గమనాగమననిరసనా, శమన దమనసాధ్యపరమ సారోల్లసనా.

401 మాలిని. ద్విజపతివృషభాంకోదీర్ణ కారుణ్య పూర్ణా
భజన నిరత రక్షా ప్రౌఢ నిర్భేద[1]రూఢా
గజ[2]దురితసముత్సేకఘ్న హృత్పద్మ[3]నిఘ్నా
యజన విధి ఫలత్వ వ్యాప్త నిత్య ప్రదీప్తా.

గద్యము

ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్య పుత్త్ర
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బయిన
శ్రీమహాభారతంబున కర్ణపర్వంబునందు
ద్వితీయాశ్వాసము.

---

399 1. తంత్ర - ఆ.ఐ.డ.ల.

400 1. ప్రమద - వీ.వ; ప్రముదితవిదూర - ఝ ల; ప్రమితాఖిలవిబుధమనస్సమితి - ఎ.ణ వ.

401 1. దక్షా - ద. 2. హారణసము - త.వ. 3. సీమా - అ.బ.ఝ; సద్మా - వ; ధర్మా, దఘ్నా - అనియు పాఠములు.

—:o:—

# శ్రీమదాంధ్ర మహాభారతము

## కర్ణపర్వము – తృతీయాశ్వాసము

→ ←

1 శ్రీమచ్చరణాంబుజ యుగ
[1]శ్రీ మధుమూర్తిప్రభా[2]విలీనవిమలచే
తోమత్తభృంగభక్తజ
నామృతసరసీస్వరూప హరిహరనాథా.

—: కర్ణ విజృంభణము :—

సం. 8—66—33 (కుంభ)

2 వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె [1]నట్లు కర్ణుండు గాంతే. యాగ్రజు విడిచి దుర్యోధనసంరక్షణంబునకుం జనుట విని [2]ధృతరాష్ట్రుండు దనమనంబున.

3 క. అనిలజునకుఁ జాలఁడె నా, తనయుఁడు మోసంబుగాక ధర్మజుఁ డట్లె
బ్బినఁ బో నిచ్చుట రాధా, [1]తనయునకుఁ [2]బుద్ధియగునె తప్పెం దప్పెన్

4 వ. అని వగచి యుధిష్ఠి[1]రుండు సనిన[2]పిదప నెత్తెఱంగున [3]సంగరంబు సెల్లె నని యడిగిన సంజయుం డతని కిట్లనియె నట్లు సని యాధర్మతనయుండు రథావ

---

1 1. శ్రీమయ — ప.ల. 2. ఖిలీన — స.

2 1. నట్లు — కొన్నింటలేదు. 2. యాంబికేయుండు — కొన్నిప్రతులు.

3 1. తనూజునకు — ఉ.త.ద. 2. గార్యమగునె — ఊ; బుద్ధియఱునె — స.

4 1. రుచనిన — కొన్ని ; రునిచనిన — న. 2. మీదట — వ. 3. సమరంబు — ఎ.

తరణంబు సేసి [4]మందిరంబు ప్రవేశించి సజ్జ నొడలు సేర్చి నాటియున్న యమ్ములు వెలికించుకొని హృదయంబున నమ్మొయి నున్న పరిభవంబు [5]పీడ యొనర్ప విషాద [6]వివర్ణుండగుచుఁ గవలం గనుంగొని మీరు సమీరనందను కడకుం జనుం డని చెప్పెనట మున్న నకులుం డొక్కయరదం బాయితంబు సేసి[7]కొని యుండుట నయ్యిరువురుఁ ద్వరితగతిం జని యంబుదంబు చందం బున గర్జిల్లుచుఁ గౌరవులతోడం గయ్యంబు సేయుచున్న భీము[8]సేనుఁ జేరం జని యవష్టంభవిజృంభణంబునం బొలిచి [9]రంత నప్పాండవాగ్రజు తెఱం గేమియు నెఱుంగక నరుండు ద్రోణితోడ [10]భరంపడి రణం బొనర్చుచుండె.

5\. క. [1]నెఱి [2]దగఁ దేజితమై గమి, మెఱుఁగు లదరు నారసమున మిక్కిలివడి నే ద్రెళ్ల మెఱయ నురము నొంచిన, నుఱ కవ్విప్రుండు వైచె నుగ్రంపుగదన్.

6 వ. వైచిన నవ్వీరుండు.

7 చ. అది దునుమాడి మేనఁ బదియమ్ములు [1]గ్రమ్మఱఁ గ్రుచ్చి సూతు బె ట్టిదమగుకోలఁ గూల్చినఁ గడిందిమగంటిమి దాన రథ్యసం పదయును నూలుకొల్పికొని పార్థునిఁ గృష్ణుని నొంచె విస్మయం బొదవఁగ దేవకోటికి నృపోత్తమ [2]యగ్గురుపుత్రుఁ డుగ్రుఁడై.

8 వ. అట్లద్భుత విక్రమంబున నశ్వత్థామ [1]విజృంభించిన సహింపక.

9 చ. హయము[1]లు పగ్గముల్ వెడఁదయమ్మున నుగ్గుగఁ గ్రీడి యేయుడున్ రయమున నీడ్చెఁ [2]దేరటు దురంబునకుం దొలఁగంగ నెంతయున్ భయమున నీమొనల్ [3]గలఁగి పాఱె నరేశ్వర వారిసైన్యసం చయ [4]మెగవన్ మహీతలము సంభ్రుతకంపము గాఁగ నల్గడన్.

---

4\. శిబిరంబు — చ. 5. వ్రీడ — ట.త.గ.న.వ ; వేదన — డ.ల. 6. వివర్ణవదనుం డగుచుం — న. 7. కొనియె నయ్యిరువురు — పెక్కు ప్రతులు. 8. సేను సేనం జొచ్చియవ — కొన్ని ప్రతులు. 9. రప్పాండ — కొన్ని ప్రతులు. 10. బరంపడి — డ.ణ.త.ద.వ.

5 1. ధరతేజితమై దిక్కుల/మెఱుంగులదరు — వ. 2. దెగనంచితమై — బ.ల.

7 1. గ్రన్నన — ణ త.వ. 2. యారథికుండుదగ్రుఁడై — వ.

8 1. విక్రమించిన — ఈ.

9 1. ల పగ్గముల్ - ణ.త. 2. దేరవి — వ. దేరుసమరంబున — కొన్ని ప్రతులు. 3. దలఁగి — చ ; విఱిగి — ష. 4. మెగువన్ — ఏ.త.ల.

10 ఉ. పాఱిటినఁ జూచి కౌరవనృపాలుఁడు సూతతనూజుతోడ [1]నీ
కాటియ మద్బలంబునకుఁ [2]గాఁ దగునే వివిధాస్త్రసంపదన్
మీఱిన [3]నీవె సూడఁగ నమేయపరాక్రమ నీకుఁ బాండవు
[4]ల్మాఱు తలంప నీదగు[5]బలంబును జేవయుఁ జూపు మి త్తఱిన్.

11 వ. అనిన విని యబ్బలుమగండు [1]మదోద్రేకంబున మద్రపతి [2]నాలోకించి యిట్లనియె.

12 చ. కనుఁగొను మిప్పు డేను ముర[1]ఘస్మరుఁ బార్థుని భీమసేనునిం
దునిమెద నస్త్రసంపదయు దోర్విభవంబును శౌర్యసారము
న్జనులకు నెల్లఁ దెల్లముగ నా దగుపూనిక పార [2]మెద్దు నే
దినిఁ గురునాథుఁ [3]డొక్కఁడె యతిస్థిరసౌఖ్యత నేలునట్లుగన్.

13 వ. [1]రథ్యగతులు నెఱయ మెఱయ వలయుం జుమ్మీ యని పలి[2]కి విజయంబు వీక్షించి గుణంబు సారించి గాండీవంబు [3]నీకెదురే యని యగ్గిం[4]చి యప్పుడు పై పయి నురవడించు[5]పరసైనికులం జే యెత్తి యదల్చి భార్గవాస్త్రంబు ప్రయోగించిన నమ్మహానీ[6]యసాధనంబు.

14 శా. ఘోరానేకశరాకృతిం [1]బరగి సంక్షోభంబు గావించుచుం
దేరుల్ [2]ద్రుంగఁగ [3]వారణంబులు ధరం ద్రెళ్లంగ నశ్వావలి ను

---

10 1. న (ని) క్కాఱియ — పెక్కుప్రతులు. 2. గానగునే — ణ. 3. నీవుగల్గఁగ — ణ.వ. 4. ల్మాఱుమసంగినీ — న. 5. చలంబు — ణ.వ.

11 1. మహోద్రేకంబున — కొన్నిప్రతులు. 2. యానసంబాలోకించి — జ.

12 1. ఖండను — ఎ.గ.వ. 2. మొంచ — ఊ.ఝ.శ.ష; మేచ — పెక్కుప్రతులు. 3. డొక్కఁడ — కొన్నిప్రతులు; డొక్కరుఁడతిస్థిర — అ.క.ఖ.ఝ.

13 1. రథ్య — పెక్కింట లేదు. 2. కితనకు విజయంబొనర్చు కోదండంబు — వీ.శ.ష; బపేక్షించి — ఈ.బ; బుపలక్షించి — ప. 3. దీనికెదురే — కొన్నిప్రతులు. 4. చుచుఁ బై పయి—కొన్నిప్రతులు. 5. పాండవబలంబులకుం జేయెత్తి—జ. 6. యాయుధంబు—ఊ; యాస్త్రంబు — ణ.

14 1. భువన — అ.ఝ; బోదివి — క.ఖ.వ. 2. మ్రగ్గఁగ — పెక్కుప్రతులు; మ్రొగ్గగ— కొన్నిప్రతులు. 3. వాహనంబులు ధరం — త; వాహనంబులు ధరిత్రిం దెళ్ళ — ణ.

గ్గెరక్తంబునఁ దేలఁగా భటచయం బత్యంత [4]ఘూర్ణీకృతా
[5]కారత్వంబు భజింపఁ గేళి సలిపెం గౌంతేయసైన్యంబునన్.

15 వ. [1]ఇవ్విధంబున భార్గవాస్త్రబాధితం బై యప్పాండవబలంబు పఱచుటయు మరలి పఱచిన మనమూఁకలు [2]పెన్నడిం దఱుము సూనసూనందనుం [3]డ ట్లేచి యార్చి [4]యంటం దాఁకి విశిఖశిఖలు నిగిడించుచుఁ బొగ లేనిమంట [5]పగిదిఁ బ్రదీప్తుండయినఁ దదుత్సాహంబున [6]కోటుపడి యాసైన్యంబు[7]ను జనంబులు హాహాకారంబు లెసఁగ దీనదశం బొంది ముకుందపురందరనందను లం జేర్కొని [8]యాక్రందించి రట్టియెడ.

16 ఉ. గాండివి శౌరి [1]కిట్టు లనుఁ గర్ణునిఁ జూచితె యేకవిక్రమో
ద్దండతఁ దెంపు సేసి [2]పటుదర్పము సూపుచుఁ దేఱి చుండ రా
కుండెడునట్లుగా నలుక నుగ్రత [3]మండెడు నిప్పు నేర్పుమై
నుండక యీసునం దొడరి యోటమి దెచ్చికొనంగ నేటికిన్.

17 క. చచ్చిన మఱి గెల్పుగొనక, వచ్చునె తనయొడలు గలుగ వైరుల [1]గెలువన్
వచ్చుం దఱి వచ్చిన నది, మెచ్చుజయార్థులకు [2]సురుదమిత్ర[3]ధ్వంసీ.

---

4. ఘూర్ణీకృతా – శ.ప. కొన్నిప్రతులు. 5. కారంపై చలియింప – కొన్ని ప్రతులు.

15 1. ఇత్తెరంగున – ఇ.ప ; ఇవ్విధంబున – కొన్నిప్రతులు. 2. పెన్నాడి – కొన్ని ప్రతులు. 3. డంటనార్చి – కొన్ని ప్రతులు. 4. యదరంటందాఁక – ఉ.ఊట.ప. 5. చందంబున – కొన్నిప్రతులు. 6. కోటరి – పెక్కు ప్రతులు; కోపా టించి – క.ఖ. 7. ను–పెక్కింటలేదు. 8. యాక్రోశించి – ప ; యూఁకరించుచు నప్పుడు.

16 1. కిట్లనియె – పెక్కుప్రతులు. 2. బలుదర్పము – ద.న. 3. చూపెడువాడు నేర్పుమై – కొన్నిప్రతులు.

17 1. జెలుపన్ – పెక్కుప్రతులు. 2. నందమిత్రధ్వంసీ – న ; కరుదెయమిత్ర ధ్వంసీ – ఈ.ట. 3. విఘాతీ – డ.

18 తే. [1]పట్టపగలింటిసూర్యుని[2]పగిదిఁ గర్ణుఁ
డుగ్ర[3]మూర్తియై[4]వెలుఁ[5]గుచు నున్నవాఁడు
మనరథం బిప్డు మాధవ [6]మరల నిమ్ము
బ్రదికియుండిన శుభములు వడయవచ్చు.

19 వ. [1]అనిన [2]విని వాసుదేవుండు వడముడిదిక్కు విలోకించునెడ నతండు [3]కర్ణునకు మార్కొని పరాక్రమించి పాండవసైన్యంబు నిలువరించి ధృష్టద్యుమ్న[4]శిఖండి[5]సాత్యకిద్రౌపదేయాదిరథికు లారథికునిం దలపడఁ దానును గౌరవులపయిం గడంగె నట్లమ్మేటిమగనియాటోపం బప్పటికి వైరి[6]నివారణంబునకుఁ జాలియునికి యనుసంధించి రాధేయుం డొరులతో డయ్యం బోరుటయుఁ బార్థుండు డప్పి [7]దీర్చుకొనుటయు మేల్ల కాక యని

---

18 1. ఈ పద్యమునుబట్టి అర్జునుఁడు కర్ణునకు వెఱచి పలాయితుడైనట్లు కొందరు అన్వయింపగా బ్రౌనుగారు దానికి అంగీకరింపక అర్జునుని పాత్రపోషణకు స్వ్యానత కలుగనివిధముగా అన్వయించుటకు యత్నించుచు ఇట్లువివరించిరి.
"బ్రౌను వివరణము"

ఈ సందర్భము వేర్వేరు ప్రతులలో వేర్వేరు విధముల నున్నది. (చిత్రశాలా ప్రతియందు అర్జునున కిట్టి అపవాదు అంటగట్టుటకు వీలు లేనివిధముగ నున్నది చూడు. కర్ణపర్వము 64వ అధ్యాయము) అర్జునుడు శ్రీకృష్ణునితో నిట్లనియె "ఓ వాసుదేవా ! కర్ణుడు దుస్సహపరాక్రమోపేతుడై విజృంభించు చున్నాడు. బ్రతికియున్నచో పురుషుడు జయాపజయములను పొందగలడు. మరణించినవానికి ఇకజయాశయేముండును." ఈ మాటలను విని ప్రాప్తకాలజ్ఞుడైన శ్రీకృష్ణుడిట్లు పలికెను. "ధర్మరాజు కర్ణునిచేత తీవ్రప్రహారములకు గురియై నందున అతనిని మనము చూచిరావలెను" అర్జునుడు దాని కంగీకరించెను.

దీనికి కొంచెము భిన్నమైన కథనరీతి కుంభకోణప్రతియందు కాన్పించు చున్నది. అర్జునుడు స్వయముగా యుద్ధాపనయనమును శ్రీకృష్ణునితో ఉపన్యసించినట్లు కలదు "ఏషకర్ణో రణే భాతి మధ్యాహ్న ఇవ భాస్కరః / నివర్తయ రథం కృష్ణ జీవన్ భద్రాణి పశ్యతి". తిక్కనసోమయాజి కుంభకోణప్రతికి సమీపముగా అనువదించినాడు.
2. భంగి — గ.ణ. 3. తేజుఁడై — వ. 4. మండుచు — గ.వ.వి., 5. గొందు చున్నవాడు — కొన్నిప్రతులు. 6. మగుడ — చ.ణ.త.వ.

19 1. అప్పుడు — ఏ. 2. విని — ఖ.ట. ప్రతులయందులేదు. 3. కర్ణుదెస — శ.ష. 4. శిఖండి — కొన్నింటలేదు. 5. సాత్యకి — కొన్నింటలేదు. 6. విదారణంబునకు — ఆ.ఐ.ఝ.ణ. 7. యార్చికొనుటయు — పెక్కుప్రతులు. మాన్చికొనుటయు—

యూహించి యమ్మురారి దేరక్కుఁరు సేనా[8]ధిపతి సంగ్రామంబు సేయు చక్కటి కెడ గలుగం గొని చని యున్నరు[9]నితో మన మశ్వత్థామతో[6]డి పెనం కువం జిక్కినసమయంబున ధర్మనందనుండు సూత[10]నందనున కగ్గమై యుండె నాతం డతనియమ్ముల [11]నొచ్చెనో యని తలంచెద నయ్యవనీశు నవస్థ యెఱింగి మఱి నీ వయ్యంగరాజు సమయింపం గలవాఁడ వనుటయు.

20 ఆ. అన్న [1]నొచ్చె నన్నయమ్మాట చిత్తంబు, గలఁప నిజబలంబుఁ గలయఁ జూచి యన్న రేంద్రుఁ గాన కనిలనందనుకడ, కేఁగి [2]యడిగె నతఁడు నిట్టు లనియె.

21 ఉ. కౌరవకోటి నేఁ బొదివి క్రందుగఁ గయ్యము సేయఁ గర్ణుఁ డా ఘోరమణుఁడు వడిం [1]గదిసి ఘోరశరంబులు మేన [2]నింప నొ [3]వ్వారుటయుం దొలంగె నతఁ డాహవరంగమునందు లేఁడు నీ వారయు మింత కెట్లగునొ యచ్యుతుఁ డుండఁగ నట్టులే లగున్.

22 వ. [1]అనిన [2]విన్వచ్చుండు వృకోదరున కిట్లనియె.

23 క. కూ్రరము లగుసూతసుతుని, నారాచము లొడలఁ బెక్కునాటినఁ జేత స్సారము సెడి [1]శిబిరమునకు, నారాజేఁగెనొకొ యకట యటు గానోపున్.

24 క. ద్రోణాచార్యుని యుగ్రపు,బాణంబుల కోర్చి యతఁడు వడునంతకు న క్షీణ[1]ధృతి [2]నసమసమర,క్షోణి నిలిచి కర్ణుచేతఁ [3]గోల్పోయెఁ గదే.

---

ఘ.చ. కొన్నిప్రతులు. 8. ధి — పెక్కింటలేదు 9. ని — కొన్నింటలేదు. 10. సుతున కగ్గమై — కొన్నిప్రతులు. 11. నొచ్చునని — పెక్కుప్రతులు.

20 1. నొచ్చునన్న — కొన్నిప్రతులు. 2. యడుగ నాత డిట్టు — పెక్కు ప్రతులు.

21 1. గవిసి — కొన్నిప్రతులు. 2. నొంప — అ.ఇ.ఐ. 3. ప్పారుట — పెక్కుప్రతులు. (నొప్పి + ఆరుట).

22 1. అనినవిని — కొన్నిప్రతులు. 2. ఫల్గునుండు — కొన్నిప్రతులు ; భీభత్సుండు — కొన్నిప్రతులు.

23 1. శిరంబున కా రా జరుగంగ వలయు నటు — ఐ.ట.డ.

24 1. గతి — కొన్నిప్రతులు. 2. మెరయ — కొన్నిప్రతులు. 3. గోల్పడియె గదే— వి.శ.మ.స.శర.సూ.

25 వ. అని పలికి యనిలనందను నాలోకించి య[1]న్నరుం డానృపాలు తెఱం[2]గెఱుంగుటకు నీ వరుగు మేను [3]సేనమొగంబున నిలిచెద ననిన విని యవ్వీరుం డవ్విధం[4]పునడవడి నీకఁ జనుం గాని జనంబులు నన్నయినం బోరి కోహటించి పోయె నని యాడుదు రని చెప్పిన నప్పార్థుండు.

26 ఆ. సరభసము[1]గ నన్ను సంశప్తకులు వీరె, [2]తొడరుచున్నవారు దొలఁగి నాకు నరుగ నెట్లు వచ్చునని చూపె నతనికి, నపుడు గడఁగి [3]వచ్చు నబ్బలముల

27 క. చూపుటయు నగ్గలం బగు, నేపునఁ గిమ్మీరవైరి యే[1]న కలఁచెదఁ
జూపు సెడఁగ నిమ్మొనలను, భూపతి నరయంగ నీవ పొమ్మనియె నృపా.

—: *కృష్ణార్జునులు ధర్మరాజుసేమం బరయ నతనిశిబిరంబునకుఁ బోవుట* :—

సం. 8—45—64

28 వ. అనిన నట్ల కాక యని యర్జునుం డచ్యుతు నాలోకించి [1]యామహీపాలుం గనునంతకు నామనంబు [2]గలంగెడు [3]రథంబు రయంబునం బోవ నిమ్మని బలుకుటయు నతండు భీముం జూచి యేము మీయన్న సేమం బర[4]యుట వలయుపని గావునం జనియెదము నీవు కురుసైన్యంబుల జయించుట యరుదె గెలుపుగొను మని [5]యగ్గించు తెఱంగున దీవన లిచ్చి తురంగమంబులం ద్వరితగతి నడపె నివ్విధంబున మాధవధనంజయులు సమరంబునకు సమీరనంద[6]నుం జాలించి శిబిరంబున కరిగి ధర్మనందనుమందిరంబు ప్రవేశించి యేకతంబ శయ్యాతలంబున నున్నయన్నరపతిం గని యాతండు గుశలి యయి యునికికి ముదంబు నొందుచుం దదీయచరణంబులకుఁ బ్రణతులయి రాధరణీనాథుండు వారలు రాధేయు వధించి [7]వచ్చిరకాఁ దలంచి డెందం బలర మందస్మితంబుతో నభినందించి వారలవదనంబులు వీక్షించి యి ట్లనియె.

---

25 1. న్నరపాలు — పెక్కుప్రతులు. 2. గరయుటకు — ల. 3. సేనాముఖంబున — పెక్కుప్రతులు. 4. బున నడవడి — కొన్నిప్రతులు.

26 1. నఁగర్ణ — క.ఖ.ఝ.డ.వ. 2. బొదువుచున్నవారు —బోవనాకు —ట 3. కదియు— కొన్నిప్రతులు ; కవియు — కొన్నిప్రతులు.

27 1. నదలిచెదన్ — ట.

28 1. యా — పెక్కింటలేదు. 2. గనుంగొనునంతకు — అ.ప.ఒ.ల. 3. రథ్యంబులరయం — అ.ప.ఐ.ఝ.డ. 4.యవలయు — ఆ.ఊ.డ.ణ. 5. యొత్తింగించు—ద. 6. ను నియమించి — ద. 7. వచ్చినవారిగాఁదలంచి — ఇ.ప.ఓ.ఘ.త.వ.

29 మ. సురశైలం జలమెత్తి కర్ణుని రథక్షోణిఁ జయింపంగ నే
ర్తురె యవ్వీరుఁడు జామ[1]దగ్న్యకలితాస్త్రౌం ఉద్ధతేజంబునన్
దొర సప్తార్చికి లావునం బవనుతోఁ దుల్యుండు [2]కల్యుండు సం
గరసంక్రీడలయందుఁ బేర్కొనఁ దగుఁ గాంభీర్యధైర్యంబులన్.

30 తే. అట్టిబల్లిదు ననిఁ దెగటార్చి మీర, లేమియును గాక వచ్చితి రింతసంత
సంబు దొరకొను నే [1]నామనంబుచింత, వంత[2]యెల్లను జెడ నరవర్యులార.

31 చ. అతనికి నాకునుం గలిగె నాహవ[1]మింతకు ముంద రందుఁ బా
ర్షతుఁడును సత్యకాత్మజుఁడు శాంతనవాంతకరుండు ద్రౌపదీ
సుతులును జూడఁగా నతఁడు సూతహయధ్వజపాతనంబు సే
సి తనువు దీవ్రకాండములఁ జెండఁగ నే వెగ డందితిం గడున్.

32 వ. అప్పుడు దుర్యోధన[1]ప్రభృతిధార్తరాష్ట్రులకు భీమసేనుప్రభావంబున బ్రదు
కరానియంత వుట్టిన నన్ను విడిచి యాతం డట వోవ నేనిట వచ్చితి నని చెప్పి
వెండియు గాండీవి నుద్దేశించి,

33 సీ. పదుమూఁడువర్షముల్ పగ[1]లును రేయును
గర్ణుదర్పం బెట్లు గడతు నొక్కొ
యనుచింతఁ జేసి యాహారనిద్రలు లేక
పరితాప మందితిఁ బఱువుఁ జేయ
విప్రులు [2]పట్టరా వెఱ సొచ్చి యొదిఁగెడు
గవయంబుచాడ్పునఁ గర్ణభీతి
[3]నుల్లల నుడుకుచు నుండుదుఁ[4]గర్ణుండు
విడువక మోమున వ్రేలు నాకు

---

29 1. దగ్నికవితా — శ.ప. పెక్కు ప్రతులు. 2. శల్యుండు — ద.బ.వ.స. కొన్ని ప్రతులు, గణ్యుండు — కొన్నిప్రతులు.

30 1. మానసంబుచింత — ద.స. 2. యంతయుఁజెడ — కొన్నిప్రతులు.

31 1. ముద్ధతియొప్పనందుఁబా—న.

32 1. బ్రముఖ — పెక్కుప్రతులు.

33 1. ళులు ; లునురేయును — కొన్నిప్రతులు ; లునురేలును—వా. 2. వెంటరా—ణ.వ ; నంటరా—ఝ. 3. నుల్లము — ద.; నుల్లంబు — వ.శ. 4. తన్మూర్తి — ఉ.శ.ప.స.

తే. సురనదీసుతుచేతను గురునిచేతఁ
బడనిపరిభవము[5]న వాఁడు[6]వఱిచె నన్ను
నంతయును నీఁగఁ [7]గాంచి నీ యట్టియనుజు
వలనఁ[8] దేజంబు వడసితి నలఘుచరిత.

34 చ. వెరవును లావు దివ్యశరవీర్యము [1]శౌర్యముఁ గల్గుకర్ణు నె
[2]వ్వరుసునఁ జంపి తీవతని బంధులు మిత్రులుఁ బుత్రులున్ సము
ద్ధురబలు లాజికేలినిరతుల్ ధృతరాష్ట్రునిపుత్రు లెల్లఁద
త్పరిజను [3]లెట్టు లట్టు లనిఁ బ్రాణము లిత్తురు వాని కడ్డ మై.

35 చ. అరు దిది నీవు నొవ్వక మహాబలుఁ గర్ణు వధించి తాతఁ డ
క్కురుపతి సంతసింప నరుఁ గూల్చెద సంగరభూమి సేన యొ
[1]క్కరుఁడను వీఁకఁ దాఁకి యనుగర్వపుమాట సనంగ నీక నేఁ
టిరణములోన [2]నిట్లు ప్రకటించితె [3]భవద్భుజవీర్యశౌర్యముల్.

36 చ. పలికిన నేమి బీరములు వల్కుట సేవకనీతి యాసభం
బలుకునె యట్లు [1]జూదపునెపంబున ద్రౌపది నింతకాల మ
ప్పలుకు లలంచుచుండె మదిఁ బాయవు [2]గీఱినయమ్ము లట్ల దో
ర్బలదృఢలీల నిప్పు [3]డవి వాపితి [4]తీర్చి తలంత యంతయున్.

37 క. అతిగర్వసమున్న[1]త మగు, నతనిశిరము వానివార లందఱు బాష్పా
[2]ద్గతితోఁ జూడఁగ సమర, క్షితి డొల్లెనె విజయ నీదుశితభల్లము[3]నన్.

---

5. ను — కొన్ని ప్రతులు ; లు — కొన్ని ప్రతులు. 6. వఱపె — పెక్కు ప్రతులు.
7. గంటి — కొన్నిప్రతులు. 8. విజయంబు గాంచితి — క.

34 1. తేజము — క.ఖ.ద ; ధైర్యము — ప.బ.వ. 2. వ్వరును జయింపరీవతని — డ.
3. లెల్లయాజిమొనఁ బ్రాణము — ఇ ; లెల్లనేమరకఁ బ్రా—ఒ ; లెల్లయాతనికి—ట ; లెల్లనెట్లయని — అ.డ.ల ; లెల్లయ (న) ట్లయనిఁ బ్రా — కొన్నిప్రతులు ; లెల్ల యెమరక — ఒ.

35 1. క్కరుఁడన (ని) — పెక్కుప్రతులు. 2. నాతని కడిందిమగంటిమితో వధించితే — ల.
3. భుజాబలశౌర్యసారముల్ — ట.

36 1. జూదము — పెక్కుప్రతులు. 2. నాటిన — వ. 3. డెడపాపితి — త.వ.
4. చిత్తమువంతయంతయున్ — ఇ.వ ; తీర్చితివంతయంతయున్ — కొన్ని ప్రతులు.

37 1. తుఁడగునతని — ఔ.ఘ.వ.స. 2. ద్గతి జూడంగా — కొన్నిప్రతులు. 3. లన్ —
కొన్ని ప్రతులు.

38 క. ఈరసమునఁ గదిసి శరా,సారము పైఁ గురియ నీవు సక్రోధుఁడ వై
పేరురమున వెస నాటిన, తోరం బగునారసమునఁ [1]ద్రుళ్ళి కెడసెసే.

39 వ. [1]అనిన ధర్మనందనునకుఁ బురందరనందనుం [2]డి ట్లను నేను సంశప్తకులతోడఁ
బెనంగు చుండ ననేకరథ [3]సమూహసమేతుం డయి యశ్వత్థామ [4]వచ్చి నన్నుం
బొదివిన.

40 క. ఏనూ[1]ఱురథంబులు వెసఁ, బీనుఁగు పెంటలుగఁ జేసి పేర్చినఁ గుపితుం
డై నిప్పు [2]లురులుకన్నుల,తో నక్కోదండగురుసుతుఁడు నాసిఁదన్.

41 క. ఉఱకయడరి [1]మెఱసినయే
డ్తెఱ [2]నెఱ యఁగ గుడుసువడి యతిస్ఫురిత[3]రుచిన్
మెఱసి ధను [4]వనలవలయము
తెఱఁగునఁ జతుర్గతి ప్రీతి[5]హతిం జేసెన్.

42 క. [1]స్వాతి[2]గతుం డగుశుక్రుం, డే తెఱఁగునఁ బరఁగఁ జేయు [3]నెసకస్సువర్షం
బా తెఱఁగున సాయకవ,ర్షాతి[4]శయం బావహించె నతఁడు నరేంద్రా

43 క. తనయరదం బెద్దెసఁ జూ,చిన మొగమున వ్రేల దీప్తశితవిశిఖములన్
ననుఁ గృష్ణుం గప్పిన నే, ననఘా [1]కెల నరయఁజాల నైతి పెగడునన్.

---

38 1. ద్రుళ్ళడసెనొకో — ఈ.

39 1. అని యిట్లు కర్ణుండు మడియుట కాదలంచి సంతోషచిత్తంబున నాడుమాటలు విని ధర్మ — జ. 2. డిట్లనియె — కొన్ని ప్రతులు. 3, సమూహ॰ — ఎ.ఝ.వ. ప్రతులలో లేదు. 4. వచ్చి — కొన్ని ప్రతులలో లేదు.

40 1. రథదంబులు — ఓ. 2. లొలుకు — అ.

41 1. నెఱసిన — పెక్కు ప్రతులు ; చేసిన — న.వ ; చేచినచో డ్తెఱ — ప. 2. మెఱయగ — అ.ఆ.ఝ. 3. రతిన్ — కొన్ని ప్రతులు. 4. పల్లవలయము — బ.ప. 5. హతిగావించెన్ — జ ; తిసాతియొనర్చెన్ — చ.

42 1. స్వాతీగతు — చ.ల. 2. గతుడైన శుక్రు — ఏ.ఔ.క.ఖ.వ. 3. నెరయగ — ద; నెసగగ — త.వ. 4. యంబడర జేసె — ఓ.ణ.ద.వ.

43 1. కలనరయ — ఉ బ.

44 క. పదపడి యొక[1]భంగి నతని, మద మడఁచినఁ దొలఁగఁ జాఁఱె మానముదూలం
దదనంతరంబ నిన్నున్, వెదకితి నరనాథ మన యనీకములోనన్.

45 క. ఆలోఁ గర్ణునిచేతం, దూలని చతురంగములను దొరలసు ధరణీ
పాల మనమొనల గానను,[1] బ్రాలినదర్పమున మెఱయువడముడిఁ దక్కన్.

46 క. ఆతనిచే నీ విక్కడ,[1]కేతెంచుట [2]వింటి సేమ మెఱుఁగుతలఁపు మై
నేతెంచితి నవ్వీరుని, చేతులలా వస్మదీయసేన నిలుపుటన్.

47 క. మనుజేంద్ర కుశలివగునిమఁ
గని నామన మూఁడిల్లెఁ గావున మగుడం
జనియెదఁ గొనియెద రాధా
తనయునితల [1]చలము నెఱయ [2]దర్పము మెఱయన్.

48 క. ననుఁ జూడుము వేడుకకుం
జనుదెంచి భవద్బలంబు సంతస[1]మందం
దునిమెదఁ గర్ణుని దుర్యో
ధనుకోర్కియు నీమనంబు [2]తాపముఁ దీఱన్.

49 మ ధనురాచార్యునిచావు సూచి [1]తగ రాధానందనుం డాసుయో
ధనునిం దమ్ముల వారిసైన్యములనుం దాఁ గాచువాఁ డై రణం
బునకుం బూనుట నింత సేయ వలదే భూపాల యే పారి మం
[2]డునె యాఱం గలదీపమ ట్లతఁడు మండుం గాక యే నార్చెదన్.

---

44 1. క్రియనాతని — ఈ.క.వ.

45 1. వాలిన — కొన్నిప్రతులు.

46 1. యేతెంచుటవింటి — స. కొన్నిప్రతులు. 2. యెరిగి — ప.

47 1. నమ్మ — బ. 2. దర్పంబెసగన్ — ఊ ; దర్పస్ఫురణన్ — ప.

48 1. పడగర్ణుని తలదునిమెద దుర్యో — ఐ.డ. 2. తాపముమగుడన్ — ఐ.డ.ల ; తాపంబడగన్ — ఝ ; తాపమువాయన్ — క.ఖ.న ; తాపముపోవన్ — బ.

49 1. వెస — ఈ.బ. 2. డిన...మండెం — చ.ద.వ. మండున యారంగల — ప.ఐ.ఓ. ఔ.ఘ.ఝ.డ.

50 చ. నరవర పంపు మేను బ్రథనంబున [1]కేఁగిన సూతసూనుఁ డు
ద్ధురత నెదిర్చె నేరిఁ దలద్రుంపక తక్కిన విప్రుతోడ ని
ప్పురుసున నిచ్చువాఁడ నని పల్కి పదంపడి యింక తక్కుఁడు
ష్పురుషునిఁ జూచు[2] చూడ్కి ననుఁ [3]జూడుఁడు నీవును వాసు దేవుడున్.

51 వ. భీమసేనునకు సేనాముఖంబునఁ దాన నిలుచుట భరంబయి యుండు నేనుసుం
దడయుట గర్జంబుగాదు పోయెద ననిన విని యమ్మనుజపతి గర్ణుండు
కుశలి యై [1]యుండుట యెఱింగి యతని బాణంబు[2]ల నొచ్చినవాఁ డగుట
నలుకగదిరి యక్కిరీటి[3]తో ని ట్లనియె.

-: ధర్మరాజు కర్ణుండు బ్రతికియున్నవాఁ డని విని యర్జునుం గిని పలుకుట

సం. 8-48-1

52 క. అనిలోఁ [1]దెరలుట దొలఁగుట
యనునివి ననుఁ గాక నొచ్చియైనను గల నె
[3]ల్లను వెడలఁ జనునె యే న
ట్లును గా కిట వచ్చుటం జులుక నై తిఁ గడున్.

53 క. విను కర్ణున కే నోడితి, నన నేటికి నీవు నోడి తనిలజమాద్రీ
తనయులు [1]మున్నె యోడిరి, మనతోఁ గూడంగఁ గంస[2]మర్దనుఁ డోడెన్.

---

50 1. కుం జని — ఊ ఏ.ఘ. కేగెన — ఇ. 2. మాడ్కి ననుఁ— కొన్ని ప్రతులు ; నట్లు ననుఁ— కొన్ని ప్రతులు ; చందమునఁజూడుఁడు — ఏ.వ. 3 జూడుము నీవును — అ.ఆ.ఏ.క.ఖ.జ.ఝ.ట.ణ.

51 1. యునికి యెఱింగి — పెక్కు ప్రతులు. 2. లచే (త) — కొన్ని ప్రతులు. 3. కినిట్లనియె — కొన్ని ప్రతులు.

52 1. దొరలుట దెరలుట — అ ; దొరగుట టొలఁగుట — ట ; దెరలుట దొరఁగుట — ద. యునునివి — కొన్ని ప్రతులు ; యునునది ... యునునెడలందా ; జనుగార యిట్లు నెటుగా కని కోటరివచ్చి జులక నై తింబిదవన్ — ఇ. 3. ట్లును — కొన్ని ప్రతులు.

53 1. నుమున్న — ఆ ఉ ఒ.ఖ. 2. మర్దనుఁడోడెన్ — స. పెక్కు ప్రతులు. చ. ప్రతి యందలి అధికపాఠము (53వ పద్యము తరువాత).
క. కర్ణుని దోర్బలశక్తియు, నిర్ణయపరచంగ దరమె నీబలమున కా
దుర్ణయబలమున కీడుగ వర్ణింపంగ హస్తిమశక వైఖరి దలపన్.

54 క. కావున [1]మన మింక ననికిం
బోవం బని లేదు విపినభూమికిఁ జని యు
చ్చో ప్వె[2]ఱుపు దక్క తపసుల
మై విచ్చలవిడిఁ జరింత మందఱముఁ దగన్.

55 క. కాదేని బిరుదు లాడక, సాదుల [1]మై వినయమొప్పఁ జని కురునాథుం
డే[2]ది పనిచినను జేసి ద,యాదృష్టి నతండు సూచు నట్లుండఁ దగున్.

56 వ. అని కెంజాయ రంజిల్లుకన్నుల నన్నరు [1]నాలోకించి.

57 ఉ. నీతెఱఁ గిట్టి[1]దేని రణనిష్ఠకుఁ బూనక కార్య[2]వాది వై
ద్వైతవనంబునందఁ సముదగ్రభుజాబల[3]దుర్జయుండు రా
ధాతనయుండు వాని ననిఁ దాఁక నశక్యము నాకు నన్న నే
నీతెరు వేల వత్తు మహి యేల నశక్తుఁడు [4]వాంఛ సేయునే.

58 తే. అని వధించెదఁ గర్ణు[1]నే నని ప్రతిజ్ఞ, సేసి యిటు దెచ్చి [2]నన్నిట్లు సేసి తింత
కెట్లు నేర్చితి పొడవుగా నెత్తి [3]నేల, వైవ నోర్చితి ననుఁ బగవారినడుమ.

59 ఉ. పంకజనాభుఁడున్ వినఁగఁ బల్కిన యప్పలు కిమ్మెయిం దుదిన్
[1]బొం కగు టోర్చి [2]తిట్టిననుఁ బుట్టినయప్డు నుతించెఁ బోరికిన్
శంక గొనం డు గెల్చుఁ [3]గురుసంఘము నీతఁడు పుణ్యుఁడన్నయా
బొంకరి దివ్యవాణియుఁ దపోధనులున్ మము ని [4]ట్లలంతురే.

54 నింకంబోరికి — పెక్కుప్రతులు ; నీవికబోరికి — క.ఘ.వ. 2. అవ్వుదక్క - కొన్ని ప్రతులు.

55 1. మని — ఈ. 2. దియు పనిచినఁజేసి — ఊ.

56 1. నవలోకించి యిట్లనియె — ఏ.

57 1. దైన — జ.ణ. 2. వేదినై — పీ ; వాదినై — కొన్ని ప్రతులు. 3. దుర్దముండు — కొన్నిప్రతులు. 4. వాంఛ — పెక్కుప్రతులు; కాంతు — వా.

58 1. నినని — పెక్కుప్రతులు. 2 యిట్టులసేసి — పెక్కు ప్రతులు ; యిట్లుఁజేసితివియింక — ణ.త. 3. బయలవైవ నేర్చితి — స. కొన్నిప్రతులు.

59 1. బొంకుగజేసితట్టి — ఘ. 2. నట్టి — పెక్కు ప్రతులు. 3. నరసంఘము — కొన్ని ప్రతులు ; గురుసైన్యము — ట. 4. ట్లొనర్తురే — ట.

60 క. విను మప్పలుకులు[1]పాటిగఁ, గొని దుర్యోధనునితోడఁ గొంటిని బగ ము
న్ను నిజంబుగ నెఱుఁగను వీఁ,డని రాధేయునకు వెఱచు నని [2]యే నిన్నున్.

61 సీ. దేవత లిచ్చినతేరు నశ్వంబులుఁ గపికేతనంబును గలవు దైవి
కంబుచే నున్నది గాండీవ మనఁ దాటియంతవి ల్లది గాక హరి రథంబు
గడపెడు [1]నట్టి పరికరమిట్టి దై యుండ నెట్లు కర్ణున కోడి యిట్టు వలియఁ
బాఱు తెంచితినీవు ఖండనంబునఁగర్ణుఁ గని పాఱు దని సుయోధనుఁడు సెప్పె

తే. నది నిజంబుగఁ గొనక బేలై తినాదు,[1]బేలతనమునఁ గాదె పాంచాలమాత్స్య
పాండ్యులాదిగఁ గలిగిన బంధుమిత్త్ర, జనులు దెగటారి రప్రయోజనముగాఁగ

62 వ. అని పలికి కృష్ణునాననం బాలోకించి కర్ణు నిగ్రహించుట యశక్యం బయ్యె సుయోధనాదికౌరవులు గనుంగొన వానిచేతం బరిభవింపఁబడి యేను జీవంబుతోనునికిం గడచినకష్టంబునుం గలదే యదియట్లుండె నేను జావు దప్పివచ్చుట వడముడికతంబునం గలిగె నతం డొక్కరుండును బాణంబులు డాఁపక పరబలంబులు బడలువడం బోరుచున్న వాఁడు.

63 క. అని పార్థుఁ జూచి యతఁ డి,ట్లను నేఁ డభిమన్యుఁ డొండె హైడింబుం డొం
డెను గలిగిన ని ట్లగునే, విను మును చేసినది యనుభవింపఁగ వలదే.

64 ఆ. నిన్నుఁ దృణముఁ జేసి నన్నా దురాత్ముండు బంధుహీనుఁ బోలెఁ [1]బఱుప నెడరు
[2]దోఁచి నప్పుడొదవి [3]తొలఁగించువానిఁ గా కన్య నేల బంధుఁ డండ్రు [4]జనులు.

65 చ. హరి గలుగంగ నేటికి భయంబున వచ్చితి నీదుగాండివం
బెరవుగ నిచ్చి నీవు నొగ లెక్కు హరిఁ రథిఁ [1]జేయఁ గన్న ని
ష్ఠురభుజవిక్ర[2]మోగ్రుఁ డగు సూతతనూభవుఁ దత్సహాయులం
బొరిగొనఁడే సుయోధనునిపోఁడిమి [3]దూలఁగ నొక్క [4]మాత్రలోన్.

---

60 1. పాడిగఁగొని – అ.జొ.చ.ల. 2. యునునిన్నున్ – కొన్నిప్రతులు.

61 1. నట – కొన్నిప్రతులు. 2. బేలుతనము – కొన్నిప్రతులు.

64 1. బరచె – పెక్కుప్రతులు. 2. దోఁచినపుడు దొడరితొలగించు – ఆ.ఝ.ల. 3. త్రుంగించువాని – ఎ.గ.వ. 4. బుధులు – ఒ.చ.

65 1. జేయుమెప్డు – ఐ. 2. మోన్నతుని – అ; ముండయిన -- ఆ.ఐ.ఝ.ల. కొన్నిప్రతులు. 3. మాలగ – ఈ.ఒ.స. 4. వ్రేల్మిడిన్ – వ.

66 ఆ. గొంతికడుపునందుఁ [1]గొడుకుచూలై నీవు, దోఁపకుండ వైతి తోఁచినట్టి
పిండ మెడలి యైనఁ బిదప దిగంబడ, దయ్యొ [2]నింత పుట్టదట్టు లైన.

-: అరునుఁడు తన్ను ధర్మజుఁ డాడినపలుకులకుఁ గోపించి
యతనితల నఱుక వాలు పెఱికి కొనుట:-

సం. 8-49-1

67 సీ. అనినఁ గృపాణంబు గొని సవ్యసాచి య
వ్విభు వేఁ్రయఁ[1]దలఁచిన [2]విష్ణుఁ డెఱిఁగి
వాలు గేల నమర్ప వలసిన[3]కత మేమి
కౌరవు లియ్యెడ [4]లేరు మనము
ధరణీశ్వరుని సేమ మరయంగ వచ్చితి
మితనికుశల మి ట్లేర్పడంగఁ
గంటిమి సంతోషకాలంబు గా కిది
క్రోధకాలమె నధ్యకోటి యిచట

ఆ. నేది గాఁగ [5]నలిగి తీవని పలికిన
రూక్షభంగి యగుకటాక్షదృష్టి
యానరేంద్రుమీఁద నడరంగ నర్జునుఁ
డమ్మురారి కిట్టు లనియె నధిప.

68 క. విను మొరులకు గాండివ మి,మ్మని న న్నెవ్వండు వలికె నతనిశిరము గ్ర
క్కున బగుల వేయుటకుఁ జే,సినవాఁడఁ బ్రతిజ్ఞ నాదుచిత్తములోనఁ.

69 తే. ఇట్టికష్టపుఁ [1]గేలికై యిట్లు సేయఁ
బతిన వట్టుట దగదె యిప్పలుకు నీవు
వినఁగ నితఁ[2]డాడ నిమ్మహీవిభుఁడు ధర్మ
వంతుఁ డగుఁ గాక చంపన వలయుఁ గృష్ణ.

---

66 1. గొడ్డుచూలై — కొన్నిప్రతులు. 2. రేలవుట్టునిట్టులైన — ఏ.

67 1. గడగిన — శ.ష. మున్నగుప్రతులు. 2. వెన్నుడెరిగి — కొన్నిప్రతులు. 3. పని యేమి — పి.వ.శ.ష.స. 4. గలరె — పి.ఊ.బ. 5. నలిగెదీవు — పెక్కుప్రతులు.

69 మాటకై — వ ; పలుకునట్లు — శ. 2. డాడె — పెక్కుప్రతులు.

70 వ. చంపి పాలితప్రతిజ్ఞుండ నైన నాకు నసత్యంబు రాకుండఁ బరిహరించెద నీనికి
నీవేమి సెప్పెదవు సెప్పుము నీవు [1]జగత్కృత్య సాకల్యవేదివి నీ చెప్పినట్ల
చేయంగలవాఁడ ననుటయు నచ్యుతుండు పోపొమ్మెక్కడి వాఁడ వని
యదల్చి వెండియు నిట్లనియె.

71 ఆ. నీకు వృద్ధసేవ లేకున్కి యెఱుఁగంగ, నయ్యెరిత్త యిట్టు లడిచిపడుటఁ
బట్టి ధర్మవిధివిభాగజ్ఞు లైనవా, రేల చేయఁ జొత్తు రిట్టిదాని.

72 క. చేయంగ వలయు వానిం, జేయుట యిట్టివియె కొన్ని సేయ కునికి ధ
ర్మా[1]యత్తచిత్తుఁ డైనా, నాయోగ్యస్థలము లెఱిఁగి [2]నడపఁగ వలదే.

73 క. సత్యంబు నహింసయు నను; నత్యుత్తమ ధర్మ[1]యుగళమందు నహింసే
సత్యము గాచుట ధర్మ మ,సత్యమున నహింస గావఁ [2]జను నండ్రు బుధుల్.

74 ఆ. కర్మసూక్ష్మభంగి గానక యిమ్మెయి, సత్యరతుణంబు సలుపుపొంటె
భ్రాత ధర్మ[1]పరుఁడు రాజిమ్మహాత్ముఁ జం,పఁగఁ దలచుట ధర్మపథముగాదు

75 క. విను పిన్నవాఁడు నీ వి
యనుచిత మగువ్రతము వట్టితది గాకయు బె
ట్టనృతము సూనృతమును నీ
కనియెడు చందంబు బుధులు గయికొనరెందున్.

76 వ. అది యెట్లంటేని.

---

70 1, జగత్కర్తవు, సాకల్యవేదివి — ఎ.గ.

72 1. యత్తుడవై కని — అ అ.ఐ.ఒ.ఝ.డ. 2. నడపగవలదే — కొన్నిప్రతులు.

73 1. యుగ్మమందు — పెక్కుప్రతులు. 2. జనదండ్రు — ఊ.స. కాని, అసత్యముచే
నైనను అహింసను రక్షింపవలె ననియే మూలము.

"ప్రాణినా మవధ స్తాత సర్వజ్యాయా న్మతో మమ
అనృతాం వా వదే ద్వాచం నతు హింస్యా త్కథంచన"
కర్ణ. 69—23 చిత్రశాలాప్రతి.

74 1. రతుడు — పెక్కుప్రతులు.

77 ఆ. ప్రాణహాని వచ్చుపట్టున సర్వధ,నాప[1]హార వేళయందు నడవు
సత్య మనృతమం డ్రసత్యంబు సూనృత, మనిపరిగ్రహింతు రార్యజనులు.

78 వ. [1]విను పెద్దయు వినికి లేనివాఁడు కౌశికుం డనునొక్కవిప్రుం డొక్క విశిష్ట గ్రామంబున కనతిదూరంబున సరిత్సంగమపుణ్యక్షేత్రంబున వసియించి సత్యంబ పలుకువాఁడ నని వ్రతంబువట్టి సత్యవాది యనం బ్రసిద్ధుండయి తపంబు సేయుచుండ నొక్కనాఁడు ముచ్చులం గని వెఱచఱచి పఱతెంచినజనులు గొంద ఱయ్యాశ్రమంబుచేరువం బొదలం దూఱిరంత వెనుతగిలివచ్చుముచ్చు లత్తపోధనుని కడ కేతెంచి యిప్పు డిట వచ్చినవార [2]లెట వోయి రని యడిగిన నతండు సత్య[3]విభాగవిధిజ్ఞుండు గామిం జేసి తన కసత్యంబువాటిల్లు ననుశంక నీగుల్మలతాగహనంబు సొచ్చి రని చూపి చెప్పిన నత్తెక్కలికాఁడు వారలం జంపి ధనమ్ముగొనిరమ్ముని తద్వచనదోషంబున నరకప్రాప్తుం డయ్యె ననునితిహాసంబు [4]విందుము హింసాకరంబగు సత్యంబు ధర్మంబు గాదు తొలుత వినిన దానినపట్టి మూఢుండు పెద్దల నడిగి తెలిసికొనక వర్తించి దుర్గతిం బొందు నింతవట్టు విచారించి యజాతశత్రుండు వధ్యుం డవుం గాఁ డని నిశ్చయింపుమనుటయు నర్జునుం డిట్లనియె.

79 తే. తల్లిదండ్రులమాడ్కి హితంబు సెప్పి
నన్ను ననుచితకృత్యంబునకుఁ దొలంగ
ద్రోచితివి లోకమున నీకు గోచరంబు
గానిధర్మ [1]నిబోధంబు గలదె కృష్ణ.

80 క. జనములు వృథాప్రతిజ్ఞుం, డని నను నిందింప కుండ నగ్రజుఁడు సుఖం
[1]బునికియు గలిగెడునట్లుగ, ననుగ్రహముఁ జేసి చేయునది పనుపు దగన్.

81 వ. అనిన నతం డతని కిట్లనియె.

---

77 1. హరణ — ఆ.ఇ.హె.ట.వ.

78 1. వినుము పెద్దలవినికి — కొన్నిప్రతులు. 2. లెటఁబోయరి — వీ.ప. 3. విచారజ్ఞుండు — కొన్నిప్రతులు. 4. గలదు — ఒ.జ.

79 1. విచారంబు, విభాగంబు — కొన్నిప్రతులు.

80 1. బునయునికి గలుగునట్లుగ — ఎ.ఎ. క.ఖ.గ.వ.

—: కృష్ణుఁ డర్జునుఁ బ్రతిజ్ఞాభంగంబు గాకుండ ధర్మజు దూఱు మని చెప్పుట :—

సం. 8—48—64

82 చ. [1]అతిశితకర్ణబాణహతి నంగము నొచ్చినదాన నల్గి యు
ప్పతి నిను నొవ్వఁ బల్కు టిది ప్రాభవ మింతియె కాక నీయెడన్
మతిఁ బటు[2]కోపముం గలదె మారుతసూనుఁడు నీవుఁ దమ్ములుం
జతురవినీతి నీతనివశంబునఁ గాదె చరింతు రెప్పుడున్.

83 క. కావునఁ బ్రభుత్వసంపద, నీవిభుఁ డాడి[1]నది యెల్ల నెగ్గుగొనక నా
చే వినుము నీదుప్రతినకు, నేవిధి[2]సేయనగు దాని నేర్పడ ననఘా.

84 క. నీ విట్టివాఁడ వని ధర, నీవిభునిం బలుకు మదియ నీ చంపుట సం
భావించి పిదపఁ బ్రణతుఁడ, వై వినయము సేయు చిత్త మలర నతనికిన్.

85 వ. అట్లయిన నసత్యదోషంబునకు గురువధపాతకంబునకుం దొలంగి [1]సమాహితుండ వగుదు తదనంతరంబ కర్ణుని సమయింపఁ జనుటకు నమ్మనుజపతి యనుమతి వడయుద మనుటయు నప్పలుకుల కభినందించి పురందరనందనుండు ధర్మనందను నుద్దేశించి.

86 మ. [1]కనదస్త్రంబుల నుజ్జ్వలోద్భటగదాఘాతంబులం గాలఁ గే
లను విద్విట్చతురంగసంఘములు గూలం గేలి సల్పంగఁ జా
లినయాభీముఁడు వల్కఁగాక నను దోర్లీలాసమగ్రుండ వై
యనిలో [2]నిల్వఁగ[3]లేని నీ [4]విటుల కీ డాడంగ నర్హుండ వే.

87 క. న న్నెఱిఁగి యెఱిఁగి యిట్లనఁ, జన్నే నీజిహ్వ వెక్కుశకలము లై పో
కున్నది యేలొకో రణమున, నెన్నఁడు [1]నీ వేమి సేసి తింత యనుటకున్.

---

82 1. అతులితకర్ణ — ద. 2. రోషముంగలదె — ఎ.గ జ.ణ.వ.

83 1. నవియెల్ల — పెక్కుప్రతులు. దగుదాని — పెక్కుప్రతులు.

85 1. సమాహితచిత్తుండవగుదు — ఊ.ద.

86 1. ఘనశస్త్రంబుల — ఈ.ట. 2. నోర్వగలేని — ఇ. 3. లేక — వీ.శ.ష.స. 4. వునను — అ.ఆ.ఏ.ఐ.క.ఖ.ల.

87 1. నిన్నేమి; నీకేమి — కొన్నిప్రతులు.

88 క. నకులుఁడు సహదేవుండును, బ్రకటభుజాస్ఫురణమున నరాతిబలము నే
లకుఁ గోలకుఁ దెత్తురు నో,రికి వచ్చినయట్లు లాడి రే యిబ్భంగిన్.

89 సీ. నీవు జూదం బాడఁగావైరబంధంబు
కౌరవ[1]జాతితోఁ గలిగె మనకు
రాజ్యనాశంబు నరణ్యవాసంబును
[2]దాస్యదైన్యంబు నత్యంతదుఃఖ
ములుఁ[3]దెచ్చికొంటి సి గ్గొలయదు నీమనం
బున నించుకేనియు ననికిఁ జాల
కున్న వానికిఁ దాల్మియొప్పగుఁ [4]గాకపి
ల్లదములు వలికినలాఘవంబు
తే. సెందు ము న్నేమి సేసినఁ జేసి తింక
నైన దుర్బుద్ధితనములు మాని తగిన
పౌరుషము లేముసేయఁగ నూర కుండు
మిడుమవడువారు సైతు రే[5] యివ్విధం[6]బు.

90 వ. అని యగ్రజునప్రియంబులు వలికి యంతరంగంబు సంతాపంబు వొంద
నిట్టూర్పు నిగిడించి యంతకుము న్నొఱఁబెట్టినవాలు [1]వెఱికినం గనుంగొని
పద్మనాభుండు గ్రమ్మఱ నిది యేమి యని యడిగిన నతండే నిన్నరనాథు
[2]న్నే నాడిన పలుకులకుఁ బ్రాయశ్చిత్తంబు దల[3]ద్రెంచుకొనుటయకా నిశ్చ

---

89 1. కోటితో — చ. 2. దైన్యంపు బ్రతుకునత్యంత — న; దాసదైన్యంబు — ఇ.ఐ. చ.జ. 3. దెచ్చుకొంటి — పెక్కుతాళపత్రప్రతులు. 4. గాని — కొన్నిప్రతులు. 5. యివ్విధంబు — పెక్కుప్రతులు; యింతవట్టు — వా. 2. దీనితరువాత 'వ' ప్రతిలో క్రిందిపద్యమున్నది.

ఆ. వె. ఇపుడు మేనిరోగ మెడలించుటకు గాని
పల్కు లిట్టియెడల పల్కనాడ
గాని క్రోధ మాడ కష్టుడవని నన్న
నంగ వలదు పద్మనాభుఁ డెరుగు.

90 1. గైకొనం గనుంగొని—ఆ.ఝ. 2. నొవ్వనాడిన—కొన్నిప్రతులు. 3. గోసికొనుట,

యించితి [4]ననుటయు నమ్మహాత్ముఁ డాత్మప్రశంస సేయు మది మరణంబని పెద్దలు సెప్పుదురనుటయు నీచెప్పినట్లు చేయ కునికికిం గడచిన యధర్మం బును గలదె యిట్లు సేయువాఁడన కాక యని యా ధనంజయుండు ధనుర్ధరుండై ధర్మనందనున కిట్లనియె.

91 ఆ. హరుఁడుదక్కఁ జాపధరుఁ డొరుఁడెన నాకుఁ
త్రిభువనముల[1] లేఁడు దిశలు గెలిచి
తెచ్చి నీకుఁ బ్రీతి నిచ్చితిఁ బెనుపారు
ధనము రాజసూయదక్షిణలకు.

92 వ. దీప్తప్రతాపం బగు [1]సంశప్తకసంచయంబు [2]నడఁగించి కించిదవశిష్టంబుగా నష్టంబు సేసితి గురుసేన నాచేతంగూలి యెట్లున్నదియో యటు [3]సూడు మని పలికి మొగంబు బిగువుడిపికొని సవినయంబుగా దండప్రణామంబు[4]సేసి నిలిచి చేతులుమొగిడ్చి యజాతశత్రున కప్పురుహూతపుత్త్రుం డిట్లనియె.

93 క. నను [1]సుప్రసాదదృష్టిం, గనుఁగొను మే నిపుడు కొన్ని కాఱు లఱచితిఁ
మనుజేంద్ర వానిఁ బెడచెవు,లను బెట్టుము వేఁడుగాఁ దలం[2]పక దయతోన్

---

త్రుంచుకొనుట — అని పాఠములు. 4. ననినవిని — పెక్కు ప్రతులు.

91 1, గలదె — కొన్నిప్రతులు.

92 1. సైన్యంబు — ఇ.ఊ జ. 2. గిటడంగించి — కొన్ని ప్రతులు. 3. సూడుము మాతలిరథంబు గడప నేనొక్కరుండ నివాతకవచ కాలకేయాదులం జంపితినకాదె. చిత్రసేనాధి గంధర్వుల జయించి కురురాజు విడిపించితి నదియునుంగాక విరాటు గోవులంబట్టిననాడు గురుసేనంగల మహాయోధవరులం బెక్కండ్రగెల్చి గోవులం గ్రమ్మరించితి మరియును బెక్కుచోట్ల నేనొక్కరుండన చేసినవిక్రమంబులు మీ రెరుంగరె. నాలావు కొలందులకు నాకు నెదురనెందు రథికుండు లేకున్కి రెవ్వరెరుంగ రెట్లనిపలికి మొగంబు బిగువు — న. 4. సేసిలేచి నిలుచుండి — కొన్నిప్రతులు.

93 1. సప్రసాద — ఆ. 2. పకు దయతోన్ — కొన్నిప్రతులు.

94 తే. వినుము సత్యంబు పలికెదఁ దనువుఁ బ్రాణ
ములును నీసొమ్ముగా [1]మదిఁ దలఁతు నేను
నాదు[2]వృత్తంబు భవదధీనం బనంగ
నేల [3]పనుపుము నను భీముపాలి [4]కధిప.

95 క. ఓపి యతనిరణభారము, వాపెదఁ గౌరవ్యసేన బడలువఱచి సా
టోపతఁ గర్ణునిఁ దునిమెద, మాపెదఁ గురురాజుదురభిమాన[1]ము బలమున్.

96 వ. ఎల్లభంగుల నేఁడు రాధం బుత్త్ర[1]రహితం జేసెదఁ గాదేని గొంతి యైన నట్టిదయగుం గాక.

97 చ. అన విని యమ్మహీరమణుఁ డాతని కిట్లను మీకు నాకతం
బున బహుదుఃఖముల్ గలిగె [1]భూరికులంబున క్రియం బొన
ర్చిన యవినీతుఁ బాప[2]పరు శ్రేయఁ దగుం దల ద్రెవ్వ నీమనం
బునఁ గృప పుట్టి కాచినను బో యెద నిప్పుడ యేను గానకున్.

98 క. ననుఁ దొలఁగి నీవు సౌఖ్యం,బున [1]నుండుము సమరభీతు భుజబలహీనుఁ
జనపతిఁ గాఁ జేయుట యొ,ప్పునె కట్టుము పట్ట మనిలపుత్త్రునిఁ బ్రీతిన్.

99 వ. అని పలికి సెజ్జ డిగ్గి వనవాసగమనోన్ముఖుండయినం గనుంగొని కమలనాభుం డాభూపతిచరణంబులకుం బ్రణతుం డై యిట్లనియె.

---

94 1. నేనుదలతు నెప్పుడు — పెక్కుప్రతులు. 2. చిత్తంబు — అ.ఈ.ఊ.వ; హృదయంబు — గ.ణ.వ. 3. పనుపవు ననుభీముని — ఒ.క.జ. 4. కనఘ — కొన్ని ప్రతులు.

95 1. ముజలముఁ — వీ.శ.ష. కొన్నిప్రతులు.

96 1. హీనంజేసెద — కొన్ని ప్రతులు.

97 1. పూరుకులంబున — ఖ. 2. రతు — కొన్నిప్రతులు.

98 1. సంతసమందు భీతు — పెక్కుతాళపత్ర ప్రతులు.

100 సీ. నరుని ప్రతిజ్ఞ భూవర ము న్నె[1]ఱుంగని యింతియ కా దేను నితఁడు నిప్పు
డాడినమాటలు నంతరంగంబునఁ [2]బట్టవు పేర్చుకోపమున నీకుఁ
దను [3]నెవ్వఁ డుఱక యన్యునకు గాండీవమిమ్మని ధిక్కరించె నాతని వధింప
బ్రతిన వట్టినవాఁడు భావ్యంబు గాని యప్పలు కీవు వలికితి పరమధర్మ

ఆ. మైన సత్యనిష్ఠహానిఁ [4]బొందుట కోర్వ, కునికిఁ జూచి యేన యుల్లమునఁ ద
లంచి యట్లు వలుకఁ బంచితి గురునిఁ గీ,డాడుటయ వధించుటగుటఁ జేసి.

101 క. శరణము వేఁడెదను భవ,చ్చరణంబులు వట్టికొని నిసర్గదయాని
ర్భరబుద్ధిని గావుము మ,మ్మిరువుర నీతప్పు[1]సైపు మెల్లవిధములన్.

102 క. సూతసుతుని మెడ నెత్తురు, భూతలమున నివురు నేఁడు భూనాయక నీ
వాతనికి నలిగినప్పుడ, చూ తెగియెం బూని [1]యేన చుమ్ము సలికెదన్.

103 క. విను సత్యం బాడెదఁ బా,ర్థునిచే నేఁ డెల్లభంగిఁ దునుమం బడు క
ర్ణుని దెసఁ జింతయు వంతయు, మనుజేశ్వర విడువు పంపు మమ్ముఁ దెలివితోన్.

—: ధర్మరాజు కృష్ణునివాక్యంబులం గలంక దేఱి ప్రసన్నుఁ డగుట :—

సం. 8-49-113

104 వ. అనుటయు ధర్మసూనుండు ససంభ్రమంబుగాఁ [1]గృష్ణు నెత్తి యతండు [2]ప్రాంజలి యై యుండ నతని కి ట్లనియె.

105 క. ఇది యట్టిద మోసంబునఁ, బదిలుఁడఁ గా కేను మున్ను [1]పదరినకతనన్
హృదయము గలఁగిన నా[2]కె,య్యదియును దో[3]షమి వికారి నైతి మహాత్మా.

---

100 1. ఎఱుంగవ యింతియ — వి. 2. బట్టకు .... నీవు — కొన్నిప్రతులు. 3. నొవ్వనాడి యన్యునకు — డ. 4. కి నిత డోర్వ — ఎ.గ.వ.

101 1. సైచియెల్ల — ఈ.శ.ష.

102 1. యేనుసుమ్ము — పెక్కుప్రతులు.

104 1. గృష్ణుని గుఱిచ్చియెత్తి — అ.ఎ.గ.ణ.వ. 2. కృతాంజలియై — కొన్నిప్రతులు.

105 1. పలికిన — కొన్నిప్రతులు ; బడలినకతనన్ — జ.ణ.వ. 2. కిది యది యని తోప మి — న. 3. పకును గాని యైతి — వ.

106 ఆ. ఇట్టి నన్ను ననునయించి బోధించితి, కరుణ పేర్మిఁ జేసి గారవమున
నష్టమైన సమముమ్మ నాపత్పయోనిధి, మునుఁగ కుండఁ గాచి తనఘ[1]మూర్తి.

107 వ. అనియె నప్పుడు [1]విషణ్ణం బగు వదనంబు వాంచి యున్న వాసవిం జూచి వాసుదేవుం డీ విట్లు విషణ్ణుండ వగుట గర్జంబుగా దిమ్మేదినీపతిముఖ ప్రసాదం బభినందించి యనుమతి వడసి చని రాధేయవధవిహారంబున నితనికిం బ్రియం బుపపాదింతుగాక యింకఁ దడయ నేల యని పల్కి వెండియు.

108 ఉ. ఈతని నొవ్వఁ బల్కుట[1]న యిట్టిదురవస్థకు వచ్చి తక్కటా
శాతమహోగ్ర నీనృపతిఁ జంపిన నెట్లగు[2]దో [3]విపత్తికిం
బాతకఘోరవృత్తికిని బాసితి దైవ మనుగ్రహించుటన్
[4]నీతెలి వాప్తబంధుజన నిర్మిత పుణ్య విపాక మర్జునా.

109 వ. అనిన నతండు గన్నీ రొలుక [1]నన్న పాదంబులపైఁ బడిన నప్పాండవాగ్రజుండును బాష్ప[2]ప్లావితముఖుం డగుచు నతనిమీఁద నొఱగె నిట్లియ్యిరువురు నొండొరులం బట్టికొని యేడ్చి రచ్యుతుం డుడుప నుడిగి తత్కాలోపగత సముచిత[3]పరిజనానీతజలంబుల ముఖప్రక్షాళనంబు సేసికొనిరి తదనంతరంబ ధర్మనందనుండు దమ్ముని గౌఁగిలించుకొని మూర్ధాఘ్రాణంబు సేసి చిఱునవ్వుతో మనల నింత వలుచునే కర్ణుం డని పలికి మఱియును.

110 ఆ. [1]ఎల్లఁ జూడ సిడము విల్లు నశ్వంబుల, సూతుఁ దునిమి నన్ను నాతఁ డలవు
[2]నెఱయ గెలిచె నతని నీ విప్డు సంపక, యున్న నాకు బ్రదికియుండఁ దగునె.

---

106 1. చరిత — బ.

107 1. విషణ్ణంబగు - ఇ.ఉ.

108 1. కు నీదురవస్థ — కొన్ని ప్రతులు. 2. నో.తో అని పాఠములు. 3. ప్రపత్తికిన్ — వ. 4. నీతప మాప్త — ఔ.

109 1. నన్నరనాథుని పాదంబుల — ఓ.త.ద.వ. 2. పూరితముఖుం డగుచు — ల.వీ.శ.ష. పెక్కు ప్రతులు. 3. పరివారక జనోపనీత శీతలజలంబుల — ఎ.గ.వ.

110 1. ఎల్లవారుజూడవిల్లు — ఈ.వ. నెఱయ (సాధురేఫముతో రూపము) — శ.ష; మెఱయ గెలిచె... మృతిఁబొంద చేయక — వ.

111 చ. అనవుడు నమ్మహీపతికి నర్జునుఁ డిట్లను నేఁడు కర్ణు నే
ననిఁ బడ వైతు నీయడుగు లాన తదీయసుహృ[1]ద్గణంబుతోఁ
విను మటు సేయ కే మగిడి వెల్వెలఁ బాఱెడు మోముతోఁడ వ
త్తునె యిట కృష్ణసారథియుఁ దూలునె మానవిహీనవృత్తినై.

112 వ. అని గోపాలదేవు నాలోకించి నీమనంబునం గర్ణుండు దెగటాఱ వలయు నని యించుక దలంపుము దాన నే నతని వధియింతు ననిన నమ్మహాత్ముం డట్టి పనికిం జాలుదు వని యుత్సాహదీప్తుం డై పలుకుటయుఁ బార్థుండు నిజ రథంబు సవిశే[1]షకల్పితంబు సేయించి రథ్యంబుల జలపానఖాద్య[2]ఖాదనంబులం బ్రబలంబులఁ గావించి సన్నహించి యగ్రజు వీడ్కొ[3]ని [4]గమనోన్ముఖుం డగుటయు నచ్యుతుం డవ్విభు [5]నీక్షించి నీసమ్మానిం [6]గారుణ్యార్ద్ర కటాక్షంబుల నిరీక్షింపుము దీవన యిచ్చి పనుపు మని చెప్పిన నన్నరవరుండు గిరీటిం [7]దిగిచి బిగి[8]యారు కౌఁగిటం జేర్చి నీవు కృష్ణుపనుపునం దగు మాటలాడి తత్తెఱంగు నేనునుం దెలిసితి నాయెఱుం[9]గమి నిన్నుం బలికిన పలుకులకు సమ్మలింపకుమీ యనుటయు నతండు వికసితవదనుం డగుచుఁ దత్పాదద్వయంబు ఫాలంబు సోఁకం బ్రణ[10]తుం డయిన నమ్మానవపతి యెత్తి పునఃపునరాలింగనంబు సేసి కర్ణుని గెలువు విజయ నీకు విజయంబు శాశ్వతం [11]బయ్యెడు మని దీవించిన నమ్మేటిమగండు [12]నాటోపంబుగా దేవ నిన్ను నొప్పించిన [13]యప్పాపకర్ము మత్కార్ముకముక్తశిలీముఖంబులం గూలి వుచ్చి యిదె వచ్చెద ననుచు నంజలిపుటంబు నిటలంబునఁ గదియించి వీడ్కొనియెఁ దదనంతరంబ దామోదరుండును నన్నరుండును నరదం బెక్కి యలరు నుల్లంబులతో నరిగి యరిగి శుభప్రదంబులగు నిమిత్తంబులకుం బ్రమోదంబు నొందిరి పదంపడి రాధేయవధప్రకార చింతాక్రాంతుం డైన గాండీవితనువునం బ్రస్వేదకణమ్ములు [14]గ్రమ్మినం గనుంగొని కమలనాభుం డతని కిట్లనియె.

---

111 1. జ్జనంబుతోఁ — ఓ.ణ.త.ద.వ.

112 1. షంబుగా కల్పనంబు — శ.ప. 2. ఖాణంబుల — అ.ఆ.ఎ.ప.ఐ. కొన్నిప్రతులు. 3. న నున్ముఖుం డగుటయు — వ. 4. సుముఖుం డగుటయు — కొన్ని ప్రతులు. 5. వీక్షించి, ఉపలక్షించి — అని పాఠములు. 6. కరుణార్ద్రకటాక్షంబుల — పెక్కుప్రతులు. 7. దిగిచి — డ. 8. యార గౌఁగిటం — కొన్నిప్రతులు. 9. గమిం జేసి నిన్ను బలికిన — వ. గమి నేనేమియుం బలికిన — శ. 10. మిల్లిన — అ.ఆ.గ.జ.ఝ. 11. బయ్యెడు మనియె — కొన్ని ప్రతులు. 12. సాటోపంబుగ — కొన్ని ప్రతులు. 13. యప్పాపాత్ము — కొన్ని ప్రతులు. 14. బొడమినం — ప.

113 ఆ. అమరులకు [1]నజయ్యు లగువారిఁ బెక్కండ్ర
గెలచి తీవ్ర సిరుఁ గల యుదాత్త
దివ్యబాణములు సుపీర్ణధను ర్వేద
కౌశలంబు బలముఁ గలదె యెందు.

114 చ. అమరనదీతనూభవుఁడు నస్త్రగురుండు భవన్మహాస్త్రది
వ్యమహిమలో నడంగిరి జయద్రథుచా వధికాద్భుతంబు మ
ర్త్యమునన కాదు లోకముల నన్నిట నీ కెదు రెవ్వ రేల చి
త్తమునఁ గలంక యూఱడుము దర్పము నెక్కొడు నంత[1]కంతకున్.

115 క. బలమును శౌర్యముఁ దేజముఁ, [1]గలఁడని కౌరవులు నమ్మి కర్ణుని నీతోఁ
దలపెట్టిరి నీబాణం, బులఁ గూలెడు నతఁడు కీర్తివొందెడు నిన్నున్.

116 క. గురుపతి యాశలు [1]మాలఁగ, దురమున రాధాతనూజుఁ దునుమాడి జయ
[2]స్ఫురణంబునఁ గృతకృత్యతఁ, బొరయుము నీవారు మోదమునఁ దేలంగన్.

117 వ. అని వెండియు.

118 ఉ. కౌరవ సైన్య ముగ్గలము గాదె కడున్ భవదీయసేన క
వ్వారణకోటు లాతురగవర్గము లారథసంచయంబు లా
వీరభటావళుల్ బహుళవిక్రమకౌతుకివై నసీశరా
సారములన్ బడల్పడఁ గృశం బగు టిప్పుడు నీకుఁ దోపఁదే.

119 క. కురుసేనలకుం బతి యై, సరిత్సుతుఁడు పదిదినములు సమరము సేసెన్
శరమహిమ నతఁడు నీచేఁ, [1]బరిరక్షితుఁ డైన సైన్యపాలు మిగిలెనే.

---

113 1. నజేయులగు — శ.ప. పెక్కు ప్రతులు.

114 1. కంతకున్. వచనము. అని వెండియు — ఎ.ణ.వ.

115 1. గలదని - కొన్ని ప్రతులు.

116 1. దూలగ, మాసగ — అని పాఠములు. 2. స్ఫురణము నెగడుము పూనికె/చరితా
ర్థము బొంద నీదు సైన్యము వొంగన్ — వ.

119 1. స్థిరశరతల్పగతుఁ డయ్యె ధీరవిచారా — ఎ.గ.

120 చ. అతని శిఖండిబాణముల క్లైర సేసితి ద్రోణునిం జమూ
పతియుఁగ జేసెఁ గౌరవనృపాలకుఁ డగురుఁడుఁ భవచ్చమూ
పతి నడఁగించెనే టిప[1]పంచక మమ్మొయిఁ బోరి తావకా
ప్రతిహతబాహు[1]రశు యిరువాగును జూడదె పాండవోత్తమా.

121 క. [1]భీమునిరథవిహరణ ము,ద్దామం బగు తెల్ల నీదుదర్పంబునఁ గా
దే మాఱు లేనిభవద,స్త్రామేయబలంబు దెలియు నంతయు నాఁకున్.

122 వ. కృపాశ్వత్థామకృతవర్మకర్ణశల్యులు నీచేతం [1]బోయెడువారు కృపా
శ్వత్థామలదెసం గృప సేసితేనియుం జంపక గెలిచి విడువుము చుట్టం బని
యరవాయిగొనుట కర్జంబు గాదు కృతవర్మను సహయింపుము శల్యుండు
మేనమామ యైనను బగవారిం గూడి పరాక్రమించు చున్నవాఁడు గావున
నతని వధించుట పాపం బని తలంపవలదు కర్ణుండు [2]జతుగృహదాహంబును
గపటద్యూతోత్సాహంబును లోనుగాఁ గల దుర్యోధను దుర్నయంబులకు
మూలం బట్టుఁ గాక జూదంబునప్పు డాసభలోన ద్రౌపది నుద్దేశించి యపా
పాత్మ్యుండు.

123 క. లే రిచట [1]మగలు నీకును, వీరలు జూదమున నోడి విడిచిరి నిన్నున్
వారిజలోచన నీపైఁ, గూరిమి గలమగని [2]వెదకి కొను మొరు ననఁడే.

124 తే. ఏను సంధికిఁ బోయినఁ దాను ధార్తరాష్ట్రమానసములఁ బగ రాజఁ బెట్టి
నన్నుఁ బట్టింపఁజూడఁడె యెన్నఁడైన, నాదికారణ మతఁడ మీయాపదలకు.

125 చ. వినుము సుభద్రపట్టి బలు[1]విల్ మును వంచన వాఁడు డాసి త్రుం
చిన మఱి కాదె యందఱును జేరి వధించుట యాపరాభవం
బనలమపోలె నున్నది యహర్నిశముం బరితాపకారియై
మనమున నస్త్రవృష్టి నది మాన్పుము బంధులు మోద మందఁగన్.

120 1. శక్తి — అ.ఐ.ఝ.డ.ల.

121 1. భీము రణవిహారంబు / ద్దామ - ఏ ణ.త.ద.బ.వ.

122 1. బోలియు వారు (రె) — అ. 2. జతుర్గృహదాహంబును - పి.శ.ష. కొన్ని ప్రతులు.

123 1. బతులు నీకును - చ.ణ.త.ద.వ. 2. నేరికొనుము - వ.

125 1. విల్లును వంచన - కొన్ని ప్రతులు.

126 క. ఆసభ నాదుష్టాత్ముఁడు, సేసినదుర్నయము సూచి చిత్తమునఁ గడుఁ
[1]నోసినబంధులు వానిని, గాసిన గ్రద్దగమి [2]దొలువఁ గనుఁగొన వలదే.

127 వ. వాఁడు వడినం దక్కటి రాజులుం గౌరవులు నీకు [1]మొన[2]కట్ట రని చెప్పె
నిట్లు సెప్పుచు సమరస్థలంబున కనతిదూరంబుగాఁ జని యత్తెఱంగు చూచి
కర్ణుండు సంగరంబు సేయుసంరంభం బుగ్గడించి యగ్గాండీవికిం జూపి
పుండరీకాక్షుం[3]డు వెండియు.

128 క. కేతనము రథముఁ దురగ, వ్రాతముఁ బొడిచేసి నీ[1]శరంబులఁ గర్ణుఁ
వే తునిమినఁ గని శల్యుఁడు, వాతెఱ యెండంగఁ బాఱవలదె కిరీటీ.

129 వ. పూనిక సెఱపి శోకం బు[1]జ్జగించి లోకంబు సంస్తుతింప సుఖివి గమ్మనినం
[2]బ్రముదితహృదయుం డై.

130 శా. నీతోడ్పాటున నేఁ ద్రివిష్టపముల న్గెల్వంగ [1]నూఁకింతు నా
చేతం [2]గర్ణుఁడు రూపు [2]మాలిచను మెచ్చింతుఁ నన్నుం జూడు మీ
దైతేయాంతక యంచు శోననిభహస్తం బుద్ధతిం జాఁచి ని
ర్ధూతారాతిబలుండు పుచ్చికొని యెఁ దుర్దాంతకోదండముఁ.

-: అర్జునుఁడు కృష్ణునివాక్యంబులచేఁ గర్ణునివధ కుత్సహించుట :-

సం. 8-52-11

131 వ. ఇట్లు గాండీవం బెత్తి యెక్కువెట్టి యన్నరుండు నేఁడు నాబాణంబులు
బాణాసనంబును నరదంబునుం జూచి సుయోధనుండు శకునిచేతియడ
పోఁల్లును [1]బలకయు [2]నమ్మండపంబును దలంప వలయుఁ దన నమ్మినబంటైన

---

126 1. రోసిన - ఎ.గ.న.వ.పి.శ.ష ; మ్రోసిన - స. 2. బొదువ - ల ; పొదువ-ఆ.ఐ.ఝ.

127 1. మొగికట్టరు – కొన్ని ప్రతులు. 2. కట్టలే రని – కొన్ని ప్రతులు. 3. డు వెండియు- పెక్కు ప్రతులు.

128 1. శరావలి - ట.

129 1. సైరించి-క.ఖ. 2. బ్రమోదితుం డై -అ.ఆ ఝ.త.ల; ప్రమోదితహృదయుండై -న.

130 1. నుంకింతు – స.బ.శ.ష ; నూకింతు – కొన్ని ప్రతులు ; నూరెత్తు – త.వ. (అర్థము చింత్యము). 2. గర్ణుండె రూపుతో నిలుచు – శ.ష. పెక్కు ప్రతులు. 3. మాయు నిను మెచ్చింతుఁ - త.వ.

131 1. పలుకయు – పెక్కు ప్రతులు. 2. నమ్మంటపంబును – పెక్కు ప్రతులు.

కర్ణుండు నేనేయు తూపుల తాఁకున రూపడఁగినం గని యవ్వెంగలి దాను విదురుబుద్ధి వినమికి వగం బొందవలయు ధృతరాష్ట్రుండు దనకుం [3]గార్య దర్శనంబు లేమి యుగ్గడించి తన్నుందాన నిందించుకొనవలయు నతండు గొడుకులదెసను వారు రాజ్యంబుదెసను విగతాశులు గావలయు నని పలికి మఱియును.

132 ఆ. రాజరాజుఁ జూసి రాజ్యసంపద ధర్మతనయుఁ జేరు[1]పెంపు దారు దెలియఁ
గాంచి సాత్యకియును గపలును భీముండు గారవించువారు గాక నన్ను.

133 క. సురగరు[1]డోరగవిద్యా, ధరాదిభూతములు సూతతనయుని నేఁ డేఁ
బోరి వుచ్చిన నను బొగడుచు, నరుగుం గా కునికిపట్ల కంబుజనాభా.

134 వ. అని యిట్లు సల్లాపంబు సేయుచుం గృష్ణార్జునులు నిజసేనఁ జేరి రంతకు మున్న యిరువాఁగునం జయం గలదొరలు దలపడినం బోరు ఘోరం బయ్యె నందు.

135 సీ. కర్ణసూనులలో నొకం డుత్తమౌజుని
చేతఁ జచ్చుటయు శోకాతురుండుఁ
గ్రోధ[1]దీప్తుండు నగుచుఁ గర్ణుఁ డాతని
తురగకేతనములఁ దునుమ నాతఁ
డడిదంబు సేకొని యరదంబు డిగి కృపా
చార్యు రథ్యంబులఁ జంపి భీష్మ
వైరి తేరెక్క నాశారద్వతుం డట్లు
విరథుఁ డయ్యును బలువిడిఁ గడంగ
ఆ. నతఁడు పాదచారి యని యాశిఖండి య
వ్విప్రుసేయఁ డయ్యె వేగమెయ్యి
ద్రౌణి యతనిఁ దనరథంబుపై నిడికొని
యనికిఁ దొలఁగి చనియె మనుజనాథ.

---

3. గార్యంబుదెసన యంబు — క.ఖ.

132 1. నొప్పు — పెక్కు ప్రతులు; సొంపు — వ.శ.

133 1. డసిద్ధ — పెక్కు ప్రతులు.

135 1 సందీప్తుండగుచు — శ.

142 ఉ. వేడుకఁ జూడు మేను బటువిక్రమ [1]కౌతుకలీలఁ బేర్చి చెం
డాడెద వైరులన్ విదురుఁ డప్పుడు సెప్పఁడె జూద మిట్లు గా
నాఁడెనె రాజరాజ కట యాప్రతినల్ గడతేర్చుఁ గాక బొం
కాడునె ధర్మజావరజుఁ డంచుఁ దదాప్తులు వంత బొందఁగన్.

143 వ. అని వెండియు.

144 ఉ. [1]ఉత్తమ [2]కర్మ మిట్టి దని యొక్కరుఁడుం దగఁ జెప్ప[3]లేఁడనా
కిత్తఱి నేన [4]పోలుతెఱఁ గెల్లను జేసెద నట్లుఁ గాక నా
చిత్తము మార్గవర్తియుఁగ [5]శిక్షక మయ్యెడు దైవ మంచు న
త్యుత్తి భవద్బలంబుపయి నెల్లను జూ పడరించె నేపునన్.

145 వ. ఇట్లు గలయం గనుంగొని [1]యద్దిక్కు గలగుండు గొనుట యెఱింగి విశో
కునితోఁ గౌరవసైన్యంబు మనము దఱుమకయ తాన కలంగెఁ గెలనం
గవ్వడి గదిసెనొ కాక యను[2]టయు వాఁడు నిపుణంబుగా నిరూపించి
ముదంబునం బొదలుచు.

146 క. నరుఁడదె [1]కంటే కౌరవ, కరిసేనం గవిసెఁ గేతు కపిరుచు లంభో
ధరబృందముపైఁ గలయం, బరగుతటిల్లతలఁ దలఁపఁ [2]బట్టయి నిగుడన్.

147 క. హరిమేనికాంతియును నరు, కిరీటరత్నాంశు[1]వులును గిఱిగొన రథర
థ్యారుచులు బెరసి విచిత్ర, స్ఫురణంబునఁ దేజరిల్లెఁ జూడు కుమారా.

---

142 1. కార్ముక మేర్చిపేర్చి – వ.

144 1. ఉత్తరకర్మ—ఎ.గ.వ. 2. ధర్మమిట్టిదని—న.బ ల.శ. 3. రైరి, నేల, లేర—అనియు పాఠములు. 4. పోరు తెరగు – ఇ.ట. 5. ఇచ్చట మూలము—“ఆశాస్తా రః కర్మ చాప్యుత్తమం యే/తస్మే దేవాః కేవలం సాధయంతు”. చిత్రశాలాప్రతి. కర్ణ—76 – 22.

145 1. యదికలగుండుగొనుట – న.శ.ష ; యది గుండు గొనుట – కొన్నిప్రతులు. (చుట్టు కొనుట అను నర్థమున. 2. డు నిశ్చయంబుగా నిరూపించి – ట.

146 1. కౌరవసైన్యో/త్కరముగదిసెగంటికేతు – ఇ.ఊ.ట. 2. బట్టయియుండెన్ – కొన్ని ప్రతులు.

147 1. తతులుగిరికొన – కొన్ని ప్రతులు ; రుచులు – ద.

148 వ. అనిన విని యంతరంగంబు సంతోషమయంబు గా నంగంబు వొంగ నేర్పడ నాలోకించి విశోకునకు వృకోదరుం డిట్లనియె.

149 తే. [1]వరపురములు నూర్వురను మేలి వాజు లిరువదింటి సూళులు పదునాల్గు నిత్తు నీకుఁ [2]బసిదనము నీవు నాకు ప్రీతత్వరాఁక, సూపి [3]ముద మొనరించితి సూతవర్య.

150 వ. అనియె నప్పుడు వార[1]ణఘటావిదారణంబు సేసి వాసవి వాసుదేవుతో మన తేరు భీమసేనుఁ జేరం బోవ నిమ్మనుటయు.

151 క. అనఁడు వారలఁ దెలియుముఁగ ను,ద్ధతిఁ జను నెడ మనబలంబు దర్పమహోగ్రా కృతిఁ బోటవిసిఁ జతురంగ, ప్రతతుల నన్నరుఁడు నేలపాలుగఁ జేసెన్.

152 ఆ. మందరంబుచేత మథితమై తిరుగుసా,గరము[1]నులివు గెలిచె ధరణినాథ పోల్పుఁ దురవఁణింపఁ బలువడిఁ [2]గలఁగెడు, కౌరవేంద్రుసేన [3]కలకలంబు.

153 వ. కేతువు లనుపాతప్రభూతములు శకలంబుల నాశౌర్యభూషణుండు రణ[1]క్షోణికి నిష్ఠులోనమునం [2]బానరించె నట్లు కర్ణపథంబునకు వేగిరపడి తలుమ నులుక మునముఖమున నుండియు నొండొండపయిం గ్రమ్మిన నమ్మేటిమగండు.

154 క. పేరు గలగజముఖ్యుల, సారథిరథరథ్యకేతుసహితంబుగ దు ర్వారవిశిఖ[1]విస్ఫురణమున, బోరంబున శతచతుష్టయము పొడి చేసెన్.

---

149 1. వరపుళులు నూర్వురు — గ.ఓ.శ.ష; మెచ్చువరపుళ్ళ నూర్వుర మేలివాజు — క.ఖ. వరుస గోపుల నూటిని వాజు లిరువదింటి — చ. 2. పసుధనము — ట. 3. ప్రియ మొనరించితి — పి.శ.స.

150 1. వాజిఘటావిదారణంబు — అ.ఆ.ఐ.ఝ.ట.డ.బ.ల.

152 1. తెరగుదోఁచ — గ; గెలుపొలిచె — ప. 2. మెలఁగెడు — ద; కడగెడు — న స. 3. కళవళంబు — ఇ.ఊ.స.

153 1. ఊటికి — ఆ.ఇ.ఐ.ఒ.ఝ.డ.ల. 2. బోసరించునట్లు, ఆపాదించునట్లు — అనియు పాఠములు.

154 1. విస్ఫురణ — ఈ.ఉ.ఒ.ఓ.ద.ప.వ.స.

155 వ. అవ్వేఁడిమికి వెఱచఱచి యచ్చటిమూఁక విచ్చుటయుఁ గర్ణుముందటి మోహరంబుత్సాహతీవ్రం బయి [1]యురవణించినం గని యన్నరుం డురగనికరంబునకుఁ గవియు గరుడుని కైవడి నద్దెసకడరె నట్లడరుట యాలోకించి తన కట్టె[2]దుటి మొన [3]బెట్టు దాఁకి.

156 తే. వాయుసత్త్వుండు వాయుజవప్రదీప్త
తనుఁడు వాయుతనూజుఁ [1]డుదగ్రవృత్తి
నేచి బాహాసముల్లాస మెసక మెసఁగఁ
గనుపుగొట్టె వాలమ్ములఁ గౌరవేంద్ర.

157 వ. అవ్వీరునాటోపంబు సూచి కురుభూపతి ప్రధానసైనికుల[1]కుం జూపి యితండు సమసిన నక్కడ సకలంబు సమయు మీరొక్కుమ్మ[2]డిం బొదివి పొరివుచ్చుం డనిన వారును వారణాదిచతురంగంబులయగ్గలిక మెఱయ నతనిం జుట్టుముట్టి యస్త్రశస్త్రంబులం బొదువుటయు నతండు.

158 ఆ. వానినెల్ల ద్రుంచివల వ్రచ్చికొని లీల, నిగుడు[1]చొఱవోల పెగడుపడక
తఱిమి రక్తనదులు వఱపె మస్తకకూర్మ, హస్తభుజగతతుల నతిశయిల్ల.

159 క. కురువిభుఁ[1]డు సూచి శకునిం, బురికొల్పిన నాతఁ డుగ్రముగ మార్కొని చే
తురమున [2]నారాచంబులు, గురిసినఁ బవనజుఁడు సరకుగొన కారథికున్.

160 క. బలునారసమున నేసిన
నలఘులఘుత మెఱయ నాతఁ డది యిరుమూఁడ
మ్ములఁ దునియలు సేయుడు నతఁ
డలిగి యతనిధనువు దునిమె నల్లన నగుచున్.

---

155 1. యురవడించినఁ—కొన్ని ప్రతులు. 2. దిరి—పెక్కు ప్రతులు. 3. బిట్టుదాఁడి—శ.ప.

156 1. డుద్దండవృత్తి – పి.శ.ప.

157 1. నాలోకించి – వీ శ.ప. 2. డి సమయించుడు – ఎ.గ.వ.

158 1. మకరివోలె – ఈ.ప; చొరయుబోలి – కొన్ని ప్రతులు.

159 1. డప్పుడుశకునిం – ల.శ.ప. కొన్ని ప్రతులు. 2. బలునారసములు – క.ఖ.

166 తే. అట్టియెడఁ గృతవర్మ ద్రోణాత్మజుండుఁ
గృపుఁడు నృపతియుఁ గర్ణుండుఁ గినియుఁ జాల
రయిరె కిమ్మీరవైరికయ్యంబుకడఁక
యిట్టులుండునె పదపడి యెట్టు లయ్యె.

167 వ. అనిన సంజయుం డమ్మహీపతి [1]కిట్లనియె నప్పుడు కురుపాండవబలంబులు సైన్యంబులఁ దఱుముటయుం గని కర్ణుండు గడంగిన ఘనమూఁకలఁ బురికొని పవనతనయునితోడం బోర నప్పాండవసేనానాయకుండును రభసంబున నారాధేయుం బొదివిన.

168 క. అతఁడు వివిధోగ్రవిశిఖ, ప్రతతులు నిగిడించి ఘోరరభంగి నుదగ్రో
ద్ధతి సూపినఁ జెద్పడి త,చ్చతురంగంబులును గలఁగె జగతీనాథా.

169 చ. కనుఁగొని భీమసేనుఁడు శిఖండియు సైన్యవిభుండు ద్రౌపదీ
తనయులుఁ గేశవానుజుఁడుఁ దాఁకిర నందఱు కన్నిరుపుమై
తనువులు సంచుచుఁ హయవితానము నొంచుచుఁ గేతుదండ ఖం
డన మొనరించుచుం జెనఁగె దయ్యక కుఱియ్యకతండు గుండునన్.

170 క. నకులసహదేవులును వా, రికిఁ దోడ్పడి నిశితశరప[1]రీతునిఁ జేయం
బ్రకటితబలశౌర్యుఁడు సూ, తకు[2]లోద్భవుఁ జేసి వారిఁ దలఁకం జేసెన్.

171 క. పెక్కండ్రతోడఁ గర్ణుం, డొక్కఁడ పోరాడి యెక్కు డుక్కున వారిం
జిక్కువడం జేయుట గడు, నక్కజమై యుండెఁ గౌరవాధిప చూడన్.

172 వ. ఇవ్విధంబున నద్దెసఁ జేయంగలమేటి మగలవెగ డందించినం బోక [1]పాండు పాంచాలచేది మాత్స్యాదివర్గంబులపై నతం డనర్గళ[2]ప్రసారంబు లగు శరాసారంబులు నిగిడించినం గరిరథఘోటక[3]భటావయవ ఖండంబులును వివిధాస్త్రశస్త్రశకలంబును జామరచ్ఛత్త్ర కేతు భూషణభాగంబులును

---

167 1. కిట్లను — అ.ఆ. మున్నగు పెక్కు ప్రతులు.

170 1. రివృత్తుఁజేయం — కొన్ని ప్రతులు. 2. లోద్భవుడు — కొన్ని ప్రతులు.

172 1. పెనగు — ఊ.ఘ. 2. వాహంబుగ — ఇ. 3. వకులయవయవ — ఞ.త.ప

ఘోభాగంబునం [4]దొరఁగం బెరిఁగి నెత్తురుటేఱులు [5]వాఱమఱియుం బాండవ
యోధవరులు [6]పరుసం బోఁ బోరి యంత కంతకు నివ్వటిల్లు నాకర్ణుక్రొవ్వున
నివ్వెఱపడిన నవ్వీరుండు గోపులందోలుకోల్పులి[7]కైవడిఁ గాంతేయ
బలంబులం బఱపఁ బాంచాలురు వెండియు దండితనంబున నతనిం దలపడిన
నాతండు పంచవింశతి రథికులం దునిమి వైవస్వతుచందంబునం బేర్చినం
దుర్నివార్యరవంబులు సెలంగం [8]దత్పుత్రులును దుర్యోధనకృపదుశ్శాసనులు
నశ్వత్థామశకునికృతవర్మలుం [9]బైకొని యాధర్మనందనుసైన్యంబు
సమయింప నడి విచ్చిన నెలుంగిచ్చి పోనీక నిలిపి భీమ నకుల సహదేవ ధృష్ట
ద్యుమ్న శిఖండి ద్రౌపదేయులు గడంగి కౌరవసైనికులం గనుపుగొట్టం
దొడంగినం బోరు ఘోరంబయ్యె నిత్తెఱంగున రెండుదెఱంగులమూఁకలు
దెగటాఱుచుండ గాండీవి దమ[10]మోహరంబున కుత్సాహం బెసంగ నొక్కవలన
మనమొనల నెత్తుటం [11]దోఁచుచుం గదిసి దలయెత్తి చూచి శౌరి నుద్దేశించి.

173 సీ. కర్ణుని కేతువు గ్రాలెడుఁ [1]జూచితే భీ
మాదు లైనయుద్ధామరథిక
జనులు వ్యక్రంద్రతో నని సేయుచు వాఁ
డితనిప్రాపున గురుసుతుఁడుఁ గృపుడుఁ
గృతవర్మయును గురుపతి సురక్షితుఁ జేసి
కొని పేఁకఁ బాంచాలకోటి బలలు
[2]పఱచెదరురవడి దఱిమి యారాధేయు
గిటడఁగింతము ఘోటకములఁ

తే. బటురయమునఁ [3]బోనిమ్మని పలుకుటయును
శౌరి యట్లు సేయంగ శల్యుఁ డమ్మ
హోగ్రరథవేగమును నరునుజ్జ్వలంపు
జేష్టఁ గని సూతపుత్రుతో నిట్టులనియె.

4. దొరుగు – పెక్కు ప్రతులు. 5. వారలేశిసలిపి – ఇ.ఈ.ఘ.జ.ట.వ. 6. చలంబునం బొరి – కొన్ని ప్రతులు. 7. కరణి – అ.డ. 8. భవత్పుత్రులును – అ.ఆ.ఝ.ట.డ.ల. 9. బెరొకని – కొన్ని ప్రతులు. 10. మొన కుత్సాహంబు – శ.ష. 11. జొత్తిల్లం జేయుచు వరిసి – గ.జ.

173 1. గంటివే–గ.క.ఖ. 2. పఱచెద రు–పెక్కు ప్రతులు. 3. దోలుమని–కొన్ని ప్రతులు.

174 క. కేతనకపిభయదం బై, తోఁ తేరగఁ జక్రధరచతురసారథ్య
ద్యోతితవల్గనచారు, శ్వేతహయులు మెఱయ వచ్చు వీరునిఁ గంటే.

175 వ. అని మఱియును.

176 సీ. నవ్వెడుతలలను గ్రొవ్వారుచేతుల
బిరుదులు వెట్టిన చరణములను
వాతులు దెఱచిన వాజిమస్తకముల
గిరిశృంగములఁ బోని కరిశిరముల
నవయవభేదంబు లడఁగెడునట్లుగఁ
దుము రైన[1]బహుగాత్రసముదయముల
భయదంబు లై మహిఁ బడువిమానములట్ల
యఱవఱ లైనట్టి యరదములను
తే. నేలఁ గప్పుచుఁ దనబాణజాల మడర
నెవ్వ రడ్డము సొచ్చిన నించుకయును
[2]దవులఁబడక సముద్ధతిఁ [3]దవిరి మనలఁ
దేఱి చూచుచుఁ బార్థుఁ డీదిక్కు గవిసె.

177 క. తోడై [1]డాపట వలపటఁ, గూడి తఱుమువారు లేరు కోపంబున నీ
తోడిబవరమున కడరెడుఁ, గ్రీడి [2]మనతలంపు గూడె గెలువుము గడఁకన్.

178 ఆ. పాయ వడియె సేన బరవస మలరంగ, మార్కొనంగ మేటిమగఁ [1]డొకండుఁ
[2]గలుగ నోపఁ డేపు దలకొన మనము యి, బ్బలియుఁ దలపడంగ వలయుఁ గర్ణ.

179 వ. అనిన విని కర్ణుండు గవ్వడి[1]బాహుబలంబును శౌర్యసారంబును దపఃప్రభావంబును ముక్కంటితోడ [2]నెక్కటి పోరుటయును పాశుపతాది దివ్యాస్త్రంబులు వడయుటయును బురందరప్రముఖబృందారకులకు నజయ్యు లగుకాలకేయులనిర్జించుటయు విరాటుపసులం [2]బెట్టించు కొనుటయు

---

176 1. భటగాత్ర – ఉ.ఊ.న.వీ.శ.ష. 2. దగులువడక .... నిగిడి–పి.శ.ష. కొన్ని ప్రతులు.

177 1. దాపట – పెక్కు ప్రతులు. 2. ని నీ తలపుగూడ గెలువుము – అ.ఆ.ఐ.డ.ల.

178 1. డొరుండు – కొన్ని ప్రతులు. 2. గలడె యిప్పుడేపు – అ.ఆ.ఒ.ఝ.

179 1. బాహుబలంబును – కొన్ని ప్రతులు. 2. నొంటిపోరుటయును – ణ; నొక్కండు

లోనుగాఁ గలవిశేషంబులుగ్గడించి కృష్ణమాహాత్మ్యంబు పొగడి యిట్టి వారల నేనొక్కరుండన మార్కొని మదం బడఁగించెద మద్రనాయక మన తేరు వారియరదంబునకు సమ్ముఖంబుగాఁ జనని మ్మనిన నతం డట్లచేయఁ గనుంగొని కురుపతి పురికొలుపఁ గృప కృతవర్మ గురుపుత్ర గాంధారవిభులును గొందఱు కుమారులును విక్రమాటోపంబు దీపింప నయ్యంగరాజుం గడచి యడరి యాఫల్గునుం బొదివిన నమ్మహాభుజుండు హరిణకులంబు గనినసింగంబువిధమున విజృంభించి యారథికులపైఁ గలయ వివిధవిశిఖంబులు నిగిడించి ధనువులు దునిమియు ఘోటకలంబులఁ [3]గూల్చియు సారథుల సమయించియుఁ దత్సేనాచతురంగంబుల బడలువఱిచియు నబ్బలుమగలం [4]దెరల్చి యొత్తరించి కెలనన దురంబు సేయు నమ్మరుత్తనయుం జేరంజని బహువిరోధిజనపయోధి[5]మగ్నుం డగుచున్నయతని [6]నుద్ధరించి సంప్రీతుం డగు నతనికి నగ్రజుకుశలం బెఱింగించి సంతోషసాగరంబునం దేల్చి నీ విఁక దప్పి యార్చికొమ్మని పలికి రాధేయరథసోత్సాహసహితం బగు నీబలంబుమీఁదం గవిసిన.

—: కురుకుమారులు పదుగు రర్జునుం దాఁకి మృతు లగుట :—

సం. 8—58—23

180 చ. తొడరి భవత్తనూజులు పదుండ్రు సముద్భటసింహనాదులై
వడిఁ దనుఁ జుట్టు ముట్టుటయు వారల సూతహయధ్వజంబులం
బొడి పొడి సేసి యాతఁడు రిపుల్ [1]వెగడంద వెడందతూపులన్
మెడలు దెగంగ సేసి రణమేదినికిన్ బలిసేసె[2]న త్తలల్.

181 వ. అట్టియెడ.

---

పోరుటయును—ద. 3. మరల్చుటయు—వ ; బెట్టిన విడిపించుటయు — ఉ.జ.ట.న.ల.శ. 4. లగ్గించి — పెక్కు ప్రతులు. 5. విశ్శనుండ — అ.ఈ.ఐ.ఒ.ఝ డ.ల. 6. నుద్దేశించి—పెక్కు ప్రతులు.

180 1. వెరగంద — కొన్ని ప్రతులు. 2. నెత్తుటన్, నంతటన్ — అని పాఠములు.

182 తే. నవతి కౌరవరథికులు గవిసి కడిమిఁ
బొదువుటయు నన్నిశరముల భూరిరయము
మెఱయ నందఱఁ దెగటార్చి తరుమునతనిఁ
దాఁకె వేయుమున్నూఱు దంతావళములు.

183 వ. ఇట్లు దాఁకిన యాక్షీరాదమ్లేచ్ఛ[1]నికరంబుల నతం డనేకవిధవిశిఖంబుల [2]విరియింపం జెప్పెఁ గరితురగసుభటరథసమూహమ్ములు గ్రమ్మినం గని కడంగిన వడముడితోడ్పాటునం జేవ్రుడియు నవి వోక పొదివి పెనంగిన గదగొని యరదంబు డిగ్గి యగ్గలిక నప్పవనతనయుండు దారుణరణవిహారంబున [3]నెఱయమెఱయం దఱుచుగా మెఱుంగువాలంపగములు గాండీవి గుప్పింప నప్పు డమ్ముఖంబు చతురంగంబులయం దొక్కండేనియు రక్తంబునం దోఁగని [4]యట్టిది [5]లేక యుండె నట్లు గార్చిచ్చు వొదివిన కాననంబు చందం బయి యాసైన్యంబు రూపఱ విఱిగి 'కర్ణ కర్ణ కావు కావు' మను నెలుంగులతో నతని వెనుక కొదిఁగిన నీ కొడుకు లబ్బలుమగని బలసి నిలువ నావీరుండు దీవికై వడి సమరార్ణవంబున మునుంగ నీక యమ్మోహారంబు నుద్ధరించి మౌర్విఁ [6]దాటిం[7]చి కిరీటిదెసకు నడరె నంతకు మున్న యరదం బెక్కి యనిలతనయుం డాధనంజయునిం గూడుకొనిన నయ్యిరువురకుం దలకడచి పాంచాలు రాసూతనందనుం దలపడుటయు.

184 తే. ద్రౌపదీనందనులును సాత్యకియులోను
గాఁగ బాండవసైనికోత్కరము గవిసి
కూడికొనియెఁ బాంచాలురఁ గురువరేణ్య
యందఱకు నన్నిరూపులై యతఁడు [1]పెనఁగె.

185 వ. అప్పుడు.

---

183 1. నివహంబుల — వీ.ష.స. 2. విదళింప — వీ ఊ. 3. మెరయ — పెక్కు ప్రతులు. 4. వాడు — ణ; రథికుండు — చ. 5. లేకుండ — పెక్కు ప్రతులు. 6. మ్రోయించి, సారించి, వాటించి — అని పాఠములు. 7. చి యమ్మేటిమగండు కిరీటి — కొన్ని ప్రతులు.

184 1. పోలె — కొన్ని ప్రతులు.

186 సీ. జనమేజయుని సూతుఁ దునిమిరథ్యంబున
నోఁ నేసి భీమతనూజనకుల
సుతులచాపములు ఖండితములు సేసి ధృ
ష్టద్యుమ్నుమావుల సమయఁ జూచి
మెయి [1]వెంచి సాత్యకిహయములఁ గూల్చి కే
కయకుమారుని జముకడకు [2]ననుపఁ
దజ్జనకుం డగ్గి తన్ను నొప్పించి [3]ప్ర
సేనునిఁ దాఁ జూడఁ జెలఁగి చంపు

తే. టయును బుత్రశోకంబు గిన్కయు మనంబు
నందుఁ [4]బిరిగొని రాధేయుఁ డతని నఱకె
శినివరుం డొండు వాజులఁ దనరథమునఁ
బూన్చికొని వచ్చి తత్సుతుఁ బొదివె నధిప.

187 వ. ఇట్లు సూతపౌత్రుం డగు సుషేణుం బొదివి శినిపౌత్రుండు.

188 చ. హయములఁ జంపి ముప్పదిశితాస్త్రములం దెగటార్పఁ జూచి తం
డ్రి యమునిచంద మై తెగి[1]తిరే శినివీరుఁడ యంచు నేయుడు
న్భయదమహోగ్రతన్ నిగుడునారసమున్ నడుమన్ శిలీముఖ
త్రయమునఁ ద్రుంచి మేనఁ బదరత్రితయంబు శిఖండి గుచ్చినన్.

189 తే. కనలి యాసూతపుత్రుఁ డాతనిసిడంబు
ధనువుఁ దునుమాడి పార్షతతనయుఁ డగుసు
దేవుఁ దండ్రులు గనుఁగొనంగా వధించి
యేసె సుతసోముఁ [1]డడరిన నేపు దఱుఁగ.

---

186 1. నోంచి — పెక్కు ప్రతులు. 2. ననిచె, ననిచి — అని పాఠములు. 3. సుదేవుని జూడగా వధించు — పెక్కు ప్రతులు. కర్ణుని కుమారుని పేరు ప్రసేనుడని చిత్రశాలా ప్రతియందును, సోరన్స్ మహాభారత నామావళి యందును కలదు. సుదేవుడని కుంభకోణప్రతి - కర్ణ - 86 - 4. 4. బెనగొన - అ.ఆ.ఒ.ఝ.డ.ణ.వ.ల ; మెలిగొన — చ.

188 1. తశేశినివీరుడ - వి ; తిదేశిని — శ ; తివేశిని - ఇ.ఉ.ఐ.న.శ.

189 1. డలిగిన — కొన్ని ప్రతులు.

190 వ. వెండియుఁ బాంచాలరథికసంఘంబులు రాధేయుమీఁద నురవణింప సమీరణసుతసహాయుం డగు సవ్యసాచి వానిం గడిచి యక్కర్ణునరదంబున కడకె నట్టియెడ నుత్తమౌజుండును జనమేజయుండును యుధామన్యుండును శిఖండియు ధృష్టద్యుమ్నుండును నతనిం దలమిగిలి యబ్బలుమగనిం బొదివి యింద్రియంబులు [1]దృఢాత్మునిం గలంపం జాలని చందంబున నాసూతనందనుఁ [2]దెరల్పం జాల రైరి వారలకేతుచ్ఛత్రతుసూతతురగధనుస్తూణీరంబులు రేణువులు సేసి బహుబాణంబులఁ దనువులు నో సేసి సింహనాదంబు సేసిన యయ్యంగపతిపై సుసంగతులై ద్రౌపదికొడుకులు గవిసిరి వారిం గూడికొని శినివరుం డాసేనాపతి వారి నేయుసాయకంబులు ద్రుంచి యాతనికిం దోడ్పడుటకుం గడంగిన కౌరవపతియంగంబున నెనిమిదిసుని శిత విశిఖంబులు గ్రుచ్చి పేర్చెన.

191 క. అలిగెన యన్నరనాథుని, కెలఁకులవెనఁ దఱిమికర్ణ కృపగృతవర్మల్ బలుతూపుల సేయఁగ నన్నలువుర సుగ్గికృంచె నతఁడు నారాచములన్.

192 తే. దొరలఁ గడఁచి బలంబు లుద్ధురత నిగుడ
వారిమొనలు నెదిర్చిన ఘోరతముల
సంగరం బయ్యె నయ్యవసరమునందుఁ
దాఁకె దుశ్శాసనుఁడు వాయుతనయుతోడ.

:- దుశ్శాసనుఁడు భీమసేనునితోఁ బోరి చచ్చుట :-

సం. 8—60—29

193 తే. సారథుల యుబ్బు వాజుల చటులతయును
మెఱయనొప్పారు తేరులమీఁదఁ బొలిచి
రప్పుడు గయ్యంపు వేడుక [1]నాతడును న
తండుఁ జూపఱకన్నుల పండు వగుచు.

194 క. ఒండొరులమీఁద నుజ్జ్వల, కాండము లడరించు చట్లు గదిసినయెడ భీముండు ప్రమోదభరిత చిత్తుం డయి తగనిట్టు లనియె దుశ్శాసనుతోన్.

190 1. నియతాత్ముని, కృతాత్ముని-అని పాఠములు. 2 గదల్పం జాల రైరి-పెక్కుప్రతులు.

193 1. నతడునితడు / ప్రజల చూడ్కికి కన్నుల పండువగుచు - అ.ఆ.ఐ.ఒ.త.ల.వ.

195 ఉ. ఆ సభలోనఁ [1]గొన్నఋణ మంతయు నీఁగఁగఁగంటి వడ్డితోఁ
బాస కొంకింతయుం దొలఁగఁ [2]బాఱకతీర్చెద [3]నిష్ఠ నేఁడు నా
చేసినపుణ్య మెవ్వరును జేయరు నిన్నిటు సేరఁ దెచ్చుటం
జేసి విధాత నాకుఁ గృప సేయుట గానఁగ వచ్చెఁ దమ్ముఁడా.

196 వ. అనిన విని యతఁ డతని కిట్లనియె.

197 సీ. ఎఱుఁగుదు మఱచితి నేలక్కయుంటఁ జి
చ్చిడి మిమ్ముఁ బరచిన యిడుమలవియుఁ
గాక[1]యు నమ్మాయి గాంధారరాజు మీ
యన్నతో వెడజూద[2]మాడి రాజ్య
లక్ష్మిఁ జేకొని కానలకుఁ బోవ [3]నడిచితి
మంధుఁ బెక్కాపద లనుభవించి
యజ్ఞాతవాసార్థ మవ్విరాటునిఁ బ్రోలి
కరిగి యత్యంతదైన్యంబు నొంది

ఆ. యట్లు మీర లునికి యప్రసిద్ధమె యివి
యేల రిత్తమాట లేటు పోటు
[4]దలకు వచ్చి యనుడు దరహాసమునఁ గెంపు
గదురఁ బవనసుతుఁడు గడఁగి డాసి.

198 క. భల్లము[1]లుమూఁటసిడమును, విల్లునటికి సూతకంఠ విదళనమున శో
భిల్లి నిటలమునఁ బటుదర్పోల్లసితుం డగుచు నాటె నొకనారసమున్.

---

195 1. ఇచ్చట భీమ దుశ్శాసనుల నడుమ జరిగిన సంవాదమునకు మూలము భండార్కరు ప్రతి యందు కానరాదు. కుంభకోణ ప్రతియందు కాన్పించు చున్నది. 8-86-36.. 2. గన్నఋణము — అ.ఆ.ఝ.ట.వ. 3. బారకు - వా.సూ.శ.ష. కొన్ని ప్రతులు 4. నిష్ఠ - ఏ.ఐ.ఒ డ.

197 1. యిమ్మోయిసభ గాంధారరాజు-ఎ.గ.ణ.వ. 2. మార్చిరాజ్య-వా ; మాడిరాజ్య-శ.ష.స. పెక్కు ప్రతులు. 3 నడచిదు-ఏ వ ; బంచితి మందు - ట.ణ. 4. వచ్చి యనుడు నగుచు పటుకోపమున గెంపుగదుర - చ.

198 1. ను (ల) బరపి - పెక్కు ప్రతులు.

199 వ. దాన బీఱువోవక దుశ్శాసనుండు.

200 క. తురగములఁ దాన [1]నడపుచు, బెరవు రయము మెఱయ నొండువిలు గొని గాఢ
స్ఫురణమున భీముతనువున, బరగించె మెఱుంగు లడరఁ బండ్రెండమ్ముల్.

201 క. తోడన కోదండము [1]దును,మాడెను సూతు మెయిఁ గ్రుచ్చె నాఱమ్ములు సం
క్రీడయఁబోలెను ముప్పది, యాడించెను మఱియుఁ దూపు లనిలజు మేనన్.

202 మ. ధను వొం[1]డుగ్రత నెత్తి యేఁబదిశితాస్త్రంబుల్ మరుత్సూనుఁ డా
తనిగాత్రంబునఁ గ్రుచ్చినం గినుకమై ధైర్యంబు శౌర్యంబు నొ
ప్ప నతం డుజ్జ్వలభల్లయుగ్మయుగళస్ఫారాహతిఁ వాజులం
దునిమెం జాపము పిచ్చలింప విలసద్దో[2]ర్గర్వదుర్వారుఁడై.

203 వ. ఇట్లు విరథుం డై వృకోదరుండు మెయివెంచి.

204 మ. గద[1]లీలం గొని తేరు డిగ్గి మెఱుఁగుల్ గ్రమ్మంగ సారించి యు
న్మదయానంబునఁ గిట్టి ఘోటకములఁ [2]మ్రందించి బాహాబలం
బు దలిర్పన్ భవదీయసూనునరదంబు [3]ద్రెళ్లఁ ద్రోవంగ బె
ట్టిదపుందోమర మెత్తికొం చతఁడు దాఁటెఁ నేలకుఁ గ్రక్కునన్.

205 వ. అట్లు దాఁటి[1]బెట్టు వైచిన యత్తోమరంబు[2]నం గాడ నేసి యక్కీచకారాతి పదుమూఁడు వత్సరంబులు దమపడిన పాట్లును బ్రతినచందంబును డెందమున నావహిల్ల నుద్దండగదాదండంబున దుశ్శాసను వైవ నతండు తద్గదాఘాతంబున నెత్తురు దొరఁగ ధరణిం బడిన బెబ్బులి [3]లేడికొదమం బోదువు పోలికం బోదివి మెడ సిక్కం దొ్రక్కి యెక్కుడుమదంబున నక్కుమారునితో నిట్లనియె.

---

200 1. కడపుచు - కొన్ని ప్రతులు.

201 1. దున్మాడెను .... నారసములు సం — ఆ.ఇ.జ.

202 1. డుద్ధతి - క.శ.ష. 2. ర్దర్పదుర్వారుడై - అ.ఎ.ఏ.ఐ.ఔ.ఝ.ట.ల.

204 1. చేతంగొని - కొన్ని ప్రతులు. 2. మర్దించి - అ.ఊ.ఏ ఘ.చ.ట.న.ల. 3. ద్రెళ్లి
పోవంగ — అ; ద్రెళ్ళ ద్రొక్కంగ - ఎ.గ.ణ.

205 1. బెట్టిదంబగునత్తోమ — అ ఆ ఐ ఘ.ఝ.డ.ల. 2. లేటిం బోదువు, లేటి కొదమం
బోదువు - అని పాఠములు.

206 క. మును సభఁ బలికినదానం, దని వోవక యిచ్చటికి వెదకి వచ్చితి యే
[1]మనియెదనుము నీమాటలు, వినుటకు నా[2]కినుక సాల వేడ్కపడియెడున్.

207 వ. అని [1]యమ్మహాబలనందనుండు మహోగ్రలోచనప్రభలు నిగుడ మనబలంబు లం జూచిన.

208 క. నిగుడుదవాగ్నిజ్వాలల, వెగడందిన మృగకులంబువిధమున [1]నతిభీ
తి[2] గదిరి నలుగడ విచ్చిన. జగతీశ్వర యతఁడు మెఱసెఁ జక్కనిబయలన్.

209 వ. అప్పుడు నీయందుఁ జేయంగల [1]సైనికులు సూచి తత్తేజోవిశేషంబునం జూడ్కులు మిఱుమిట్లు గొన వెఱచఱచి యంతంత బిచ్చవడియుండ.

210 శా. లీలం గేల నమర్చి మత్తగజకేళీసుందరోల్లాస మా
ఖీలత్వం [1]బలరింపఁ ద్రిప్పుఁ జలదం బృథ్వీస్థలిన్ వైచు ముం
గాలం ద్రోయు మొగంబు ద్రేయు [2]దెస లుగ్రస్ఫూర్తి వీక్షించు మోఁ
కా[3] లూఁదుం బయిఁ గ్రుమ్మఱంగ మెడ [4]చిక్కం ద్రొక్కి నిల్చున్ నగున్.

211 వ. ఇవ్విధంబున ఘోరవిహారంబు సలిపి భీమవిక్రముం డగునా భీమసేనుం డయ్యువరాజు నాననం బాలోకించి.

212 క. ఏ నురము వ్రచ్చి నెత్తురు, తేనియ [1]యిదె ద్రావెదం గదిసి ననుఁ గడిమిన్
మానుప దిక్కుగలిగిన, వ్రానిమ్మెలుఁగింపు [2]మీమొనం గలవారిన్.

213 వ. అని పెలుచం బలికి కుఠారంబు వెఱికి యతనిమొగంబుమీఁద జళిపించి.

---

206 1. మనియెదవను నీమాటలు - ఇ.ఈ.ఊ.ఘ.ష. 2. కోర్కిచాల - అ.ఆ.ఐ.ఝ.డ.ల.

207 1. యుబ్బలియుండు - ప.

208 1. సేసల్ వెగడుచు - జ. 2. గదుర - కొన్ని ప్రతులు.

209 1. దొరలు, సైనికోత్తములు - అని పాఠములు.

210 1. బలరంగ - అ.ఆ.ఎ.ఏ.ల ; బడరంగ - ఐ.వ. 2. దిశలు - పెక్కు ప్రతులు. 3. లూరుంబయిఁగ్రమ్మనెక్కుమెడ నిక్కంద్రొక్కు లేచున్ నగున్-ఆసం ; లూరుంబయి - ఐ.ఓ క.ఖ.వ. 4. చక్కంద్రొక్కు - ఇ.ఈ.ఉ.న.స.

212 1. వరెద్రావెద - పీ.ష.స ; క్రియద్రావెద - ణ. 2. మొనసిరాఁగలవానిన్ - ఎ.గ.

—: భీమసేనుఁడు దుస్ససేనుని యురంబు వ్రచ్చి రక్తపానంబు సేయుట :—

సం. 8—61—1

214 మ. నరసింహుం డసురేంద్రు వ్రచ్చు[1] కరణి న్రౌద్రిం బుదగ్రంబుగా
నుర మత్యుగ్రతఁ జీరి క్రిమ్ము రుధిర మ్ముల్లాసియై దోయిట
న్స్వైరవారం గొని త్రావు మెచ్చుఁ జవికి న్మెనుఁ మొగంబుల్ భయం
కర[2]రేఖం బొరయంగఁ జల్లికొను నక్కౌరవ్యుఁ జూచుం బోరిన్.

215 వ. ఇట్లు దారుణభంగిం బ్రతిజ్ఞాకరణప్పూరణం బాచరించి.

216 తే. తల్లి చన్నులపాలేను ద్రావ నెట్టి, లానసే వలు తెలుఁగుల తేనియలును
ఖండశర్కరతోడిదుగ్ధంబు లనుభవింపఁ[1]బడవే యవియు నింతయింపు గావు.

217 చ. అని యులుగెత్తి [1]పల్కి నలి నాడు మహోద్ధతిఁ ద్రుళ్లి నార్చుఁ జె
ల్వన[2]భుజమప్పళించుఁ దమసైనికులన్ మనవారు రక్కసుం
డని [3]వెఱ గందువారు గళితాయుధు లయ్యెడువారు భీతి మూ
ర్ఛను బడువారునై రణవిరామముఁ బొంద [4]మదోత్కటాకృతిన్.

218 వ. పదంపడి.

219 మ. గద చేతం గొని యంత్యకాల [1]యమరేఖం [2]బేర్చి రక్తంబు చా
య దలిర్పం దను వుగ్రసుందరముగా నవ్వీరుఁ డేతెంచి యు
న్మదమాతంగములీల దోఁప మనసేనం [3]బొల్పఱం దోలి వే
పాడివెం గ్రమ్మఱ దుస్ససేను వికటస్ఫూర్తి [4]స్ఫురన్మూర్తియై.

---

214 1. పగిదిన్ - ఇ.ఐ; కడిమిన్ - ద. 2. లీలం బొరయుంగ - కొన్ని ప్రతులు.

216 1. బడియె నే నవి యింత యింపు గావు-కొన్ని ప్రతులు; బిడ్డను యింతటి యింపు- వ; బడునెవ్వియును నింతనింపు - వ.

217 1. పాడు - ఎ.గ.వ. 2. యురమప్పళించు - ఓ.చ.త.ద.వ; నదరించు త్రుంచు - డ. 3. వెఱఁ బొందువారు — పెక్కు ప్రతులు; వెగడందిపార — ఈ.ప. 4. మహోత్కటా కృతిన్ — కొన్ని ప్రతులు.

219 1. విచరత్కాలాకృతిం బేర్చి — జ. 2. బొల్చి — ఏ.ట. 3. బారగా దోలి — ఈ.ఒ.క.ఖ. 4. స్మహోగ్రుఁడై — అ.ఆ.ఎ.ఐ.గ.ఝ.డ.ల.

220 వ. [1]చలంబు నెఱయ నతనికాలు గేల నమర్చి మొగంబు గనుంగొనుచు నక్కి
మ్మీరవైరి యిట్లనియె.

221 క. ఏమిర పసు లని యార్వవు, నీమాటలు నిలువఁబడియెనే పసరమ వి
మ్మేము మగుడ నిదె యార్చెద, మీమాటకు [1]మాఱు పల్క రెవ్వరుఁ గంటే.

222 ఉ. నెట్టన యగ్గినం [1]దగునె నీళ్లను ద్రోచుటయున్ విషాన్నముం
బెట్టుటయున్ మహాభుజగభీషణదంష్ట్రలపాలు సేఁతయుం
జుట్టలుఁ [2]బెద్దలుం జెలులుఁ జూడ సభన్ [3]నెఱిమాలి యమ్మెయిం
దిట్టిన కోర్చుటెందుఁ గలదే విను గెల్వరె జూద మెవ్వరున్.

223 క. అని పలికి క్రమ్మఱఁగ మన
మొనమీఁదన్ భ్రమరివాఱి ముద్గరలలితం
బునఁ గేలు మెఱయఁ [1]జని తన
కన[2]లడఁగక దుస్ససేనుఁ గనుఁగొని పలుకున్.

224 ఉ. [1]స్రెవడి పోయెఁ గాన ధృతరాష్ట్రుఁడు గన్నది యేమి యాసభం
దావల దన్నుఁ గీడుడుగదా పతి [2]లేఁ డసఁబడ్డకాంత నేఁ
డీవు గనుంగొనంగఁ బతియే డ్తెఱ నొప్పెఁ బతుల్ విజృంభిత
శ్రీ విలసిల్లుకామినులు సేడ్పడి రిట్లపతిత్వ[3]దీనతన్.

225 క. విను మేను జేయఁ బూనిన. పనులం దొకటి గడతేఱెఁ బాపాత్ము సుయో
ధనుఁ బొరిగొని తల[1]దన్నుదు, నను రెండవపనియుఁ దీర్ప నరిగెద నెలమిన్

---

220 1. ఇట్లు పొదివి కాలుగేల – జ.

221 1. మగుడపలుక డెవ్వడు – ట.

222 1. మగుడ నీళ్లను – ఇ.ఊ. 2. మాన్యులుం – ఘ.వ. 3. దూలి (ల) – కొన్ని ప్రతులు. 3. మిట్టులనే యుగంబులన్ – చ.

223 1. చిత్తముకనలడగ – గ.వ. 2. లడరగ – ఊ.గ.ని.

224 1. ప్రావడిపోయె – ఇ.జొ.ఘ.న.బ.శ.ప ; రావడి – పి.ఎ.జ.ణ.శర. 2. వేసనబడ్డ కాంత – ఇ.ఊ.ఘ.చ.ల ; నేరమిబడ్డ – జ. 3. హీనతన్ – ఢ.

225 1. దునుముదునను – ఘ.జ.ట.

226 చ. అని యెలుఁగెత్తి చెప్పి యతఁ డాతని గీటడఁగించి యార్చెఁ గ
ర్ణునకును లోను గా మనవరూథినియోధులకున్ మహాభయం
బున మనముల్ గలంగఁబడి పోరికి నూల్కొన [1]నీనిటిచ్చపా
టున సకలాంగకంబులు గడున్ శిథిలంబులుగా మహోగ్రుఁ డై.

227 క. జనపతియుఁ గృపప్రముఖులుఁ
గనుఁగొన ని ట్లనిలసుతుఁడు గ్రౌర్యముదల్ గై
కొనినట్లు పేర్చి దుశ్శా
సనుఁ [1]జంపుటఁ జూచి రోషసంరంభమునన్.

228 వ. నీకొడుకులు కవచియు నిషంగియుఁ బాశియు దండధారుండును ధను
ర్గ్రాహుండును [1]నలోలుపుండును సహుండును షండుండును వాతవేగుం
డును సువర్చసుండు గూడి కవిసి వివిధవిశిఖంబుల నతనిం బొదివిన నంతకు
మున్న దుశ్శాసన రక్తపానకౌతుకాధీనమానసుం డై నయాభీమసేను పై
నెవ్వరు [2]గడంగుదురో యని కన్నిడియుండి యతం డప్రతిహతంబుగాఁ
బ్రాఁన దీర్చుటకుఁ బ్రీతచిత్తుం డగుఫల్గునుండు భల్ల[3]దశకంబున నక్కుమార
[4]దశకంబు శిరంబులు దునుమాడె నట్టిభీమార్జునుల యాటోపంబున కోటఁజీ నీ
సైన్యంబు సమరవిముఖంబయ్యె నా సూతనందనుండును భీతుండై వద
నంబు వెలవెలఁ బాఱ నూరకుండె నప్పుడు శల్యుం డతని నాలోకించి
యి ట్లనియె.

229 తే. ఉగ్రుఁ డై దుస్ససేనుని యురము వ్రచ్చి
రుధిర [1]ముగ్రతఁ ద్రావుమరుత్తనూజుఁ
జూచి చేడ్పడి [2]చెయ్యేదె జూచితే సు
యోధనుని నీవు నట్లైన నొప్పు నెట్లు.

---

226 1. లేక — వి.ఆ.ఈ.ఝ.ల.శ; లేని — బొ.ష; రైరి — ఉ.ఊ.ద.

227 1. జంపగ — పెక్కు ప్రతులు.

228 1. అలంబుసుడు, జలసంధుడు అను పేర్లు మూలమున లేవు. 2. దొడరుదురో — ఈ.
3. నవకంబున — పెక్కు ప్రతులు. 4. నవకంబు — పెక్కు ప్రతులు.

229 1. మునుపేడ్క — ఎ.వ; మమరంగద్రావు — ఏ.క.ఖ; మందంద — ఐ.జ; జలములు — ఆ.ఝ. 2. యుండుట — వ.

230 క. బలియు రగు[1]రాజులునుగాల్, నిలువక [2]తెరలంగ వీరె నీప్రాపున శ
త్రులఁ దాఁకఁ దలఁచి కృపా, దులు నిలిచిరి కూర్చికొను మతుల ధైర్యమునన్.

231 చ. కడు[1] వెగ డంది యున్న నినుఁ గన్గొని [2]పిడె యుదార[3]ధైర్య మే
ర్పడ వృషసేనుఁ డొక్క[4]రుఁడుఁ బాండుతనూజుల మార్కొనంగఁ బో
యెడు నరు నీవు దాఁక వలదే రణభారము నీభుజంబునం
దిడియె సమస్తముం గురునరేంద్రుఁడు దానిఁ దలంపు మిత్తఱిన్.

232 వ. అనిన విని యతండు సమరోన్ముఖుం డయ్యె వృషసేనుండు భీమసేనుపై
నురవణింప నకులుం డడ్డపడి యక్కుమారునిసిడంబును గొడుగును గోదం
డంబును [1]ఖండించిన.

233 చ. అలిగి యతండు వెఱొకశరాసన మెత్తి రథమ్ము ఘోటక
మ్ముల నిలఁ గూల నేయఁ బొలివోవని ధైర్యము పేర్మి వాలునుం
బలకయుఁ గొంచు మాద్రితొలు[1]పట్టి ధరిత్రికి దాఁటి బెట్టుగో
ల్తలఁజని తత్సహాయభట దారుణకేలి యొనర్చి[2]పేర్చినన్.

234 ఆ. కర్ణసుతుఁడు పలక ఖండించి కృష్ణస,ర్పంబుఁ బోని పటుకృపాణ ముఱక
నఱికి సరసములు నాటించె నయ్యర్జు, నానుజన్ము[1]మేన నల్ల నగుచు.

---

230 1. రథికులును – అ.ఆ.ఐ.ఒ.ఝ.ఢ.ల. 2. తెరలెవరువీరె – ఇ.ఈ.ఊ.ఔ.జ.ట.వ.

231 1. వెరగంది – కొన్ని ప్రతులు. 2. యుద్ధతిపిడె – అ.ఆ.ఎ.ఒ.ఓ.గ.ఝ.ఢ.ల. 3. బీరమేర్పడ – జ.ల; పిరమేర్పడ – కొన్ని ప్రతులు; దర్పమొర్పడ – ఏ. 4. డును పార్థుని భీముని – క.ఖ.

232 1. దునుమాడిన – అ.ఆ.ఐ.ఒ.ఝ.ఢ.ల; దునిమివైచిన – ఎ.గ.వ.

233 1. పట్టిలకొప్పుగ – అ.ఆ.ఐ.ఒ.ఝ.ఢ.ల. 2 యార్చినన్, నిల్చినన్ – అనియు పాఠములు.

234 1. మీఁద – కొన్ని ప్రతులు.

235 వ. అప్పుడు ధృష్టద్యుమ్నుండు యుధామన్యుండును నుత్తమౌజుండును శిఖండియు జనమేజయుండును సాత్యకియు ద్రౌపదేయులును రౌద్రంబు శోభిల్ల రుద్రులకై వడి వృషసేనుపయిం [1]గవిసినఁ గృతవర్మకృపద్రౌణి దుర్యోధనులును శకునియుఁ దత్సోదరులు గొందఱు[2]ను గ్రందం దఱిమి దుర్వారవిశిఖ[3]వర్షంబుల వారలం గప్పినం గని గజసాధను లగు[4]కుళిందు లురవణించి.

236 క. కృతవర్మ సిక్కువడ భూపతి సేడ్పడ శకుని [1]వెగడుపడఁ దదవరజ ద్వితయము ధరఁ బడఁ దీవ్రో[2]ద్ధతిఁ బోరిరి చాపటంకృతంబులు సెలఁగన్.

237 వ. ఇత్తెఱంగునం బోరినం గనలి కడంగి కర్ణుండు.

238 క. ఆ ముప్పురుఁ జలమున నుద్దామద్విపసహితచిత్రదళనంబున సంగ్రామతలము [1]రక్తాక్తం, బై మెఱయ బలాధిపత్రయముఁ బోరిగొనినన్.

239 క. తక్కటిరథికజనులు సే
రుక్కున నయ్యిభచయంబు [1]నొదిఁగించియునుం
జిక్కు[2]వఱిచియుం దునిమియు
నెక్కుడుమద మొప్ప మెఱిసి రిభపురనాథా.

240 వ. మెఱసినం జూచి.

---

235 1. బొదివిన - కొన్ని ప్రతులు. 2. నుగ్రతం దరిమి - ఉ.ఎ.ఓ.గ.ణ.న.వ. 3. వేగంబున- ఎ.న.ణ. 4. కుళిందు లురవణించి - కాళింగులు కౌరవుల పక్షమువహించి యుద్ధము చేసినవారగుటచే ఇచ్చట కళింగులనుట పొసగదు : మూలమునందు 'కుళిందు' లని యున్నది. "నవజల దసవర్ణై ర్హస్తిభి స్తానుదీయుః/గిరిశిఖరనికాశై స్త్యమవేగై ః కులిందాః" చిత్రశాలాప్రతి. కర్ణ - 85 - 4. కుంభకోణ ప్రతియందు (కుళిందు) లనుటకు మారుగా 'కుణిందు' లని కలదు. కర్ణ - 88 - 55.

236 1. వెరగుపడ — కొన్ని ప్రతులు ; వెడగుపడ - కొన్ని ప్రతులు. 2. ద్రుతిపోరిరి.... టంకృతుల్ సెలగంగన్ - పి.స. 3. మెరయన్, నిగుడన్ - అనియు పాఠములు.

238 1. రక్తాంకంబై మెరయ - ష ; రక్తోగ్రంబై - ఎ.ణ.వ ; రక్తార్ధంబై - ? ; రక్తాస్నానమై మెరయ — ఏ.

239 1. నుడిగించియు — అ.ష. 2. వఱపియుగ్రముగా - ణ.త.వ.

241 ఆ. అరద మెక్కి తటిమె ననిల తనూజుఁ డప్వీరుతోన పొండవేయసేనఁ
జేయఁగలుగు[1]దొరలు శితశరాసారంబు, లదర వారిమీఁద నడరుటయును.

242 వ. రణంబు దారుణం బయ్యె నందు.

243 సీ. కర్ణుని యగ్రభాగంబున గరిఘటల్
దునుమాడు నకులనందనునిఁ గిట్టి
వృషసేనుఁ డమ్ములవెల్లి పైఁ [1]బరగించి
శితభల్లమున సూతుశిరము ద్రుంప
గనుఁగొని యక్కర్ణతనయునిమీఁద బా
ర్థాదులు గవిసిన నతఁడు పార్థు
ననిలజు మూఁడు మూఁడమ్ముల నొప్పించి
యాశతానీకుని నట్లచేసి

తే. నకులు తనువున బాణసప్తకము నొనిపి
శార్ఙ్గధరుమేనఁ బండ్రెండు సాయకములు
వఱపి పేర్చినఁ గౌరవప్రతతి మెచ్చి
పార్థువేఁడిమి యూహించి భయముఁబొందె.

244 చ. కెలఁకుల [1]యోధులంగడచి కిరీటి వడిఁ వృషసేనుమీఁద న
మ్ములు నిగిడింప నారథికముఖ్యునిమూఁపున నక్కుమారుఁ డే
పలరఁగ వాఁడిపూఁపులు గయంబుమెయిం బది చెట్టు గ్రుచ్చి య
గ్గలిక ముకుందు నేసె నవకాండములఁ దివి ముట్ట నార్చుచుఁ.

245 వ. ఇట్లు విజృంభించిన.

—: అర్జునుఁడు వృషసేనుని మృతిఁబొందించుట :—

సం. 8-62-59

246 మ. భ్రుకుటిస్ఫూర్జితఫాలభాగుఁ డగుచుం బొంగారి యాసూతపో
త్రకుకోదండము బాహుదండములుఁ జిత్రస్ఫూర్తిఁ దున్మాడి మ

241 1 వారుశితశరాసారంబు - ఈ.ఓ.త.ద.వ.

243 1. నిగుడించి - డ.ద; పొరగించి - ఏ. 2. ద్రుంచె - పెక్కు ప్రతులు.

244 1. రెంటనుం గడిచి - ద.

ప్త్రక ముగ్రోద్ధతిఁ గ్రూరభల్లవిలసద్ధారాహతిం ద్రుంచె బా
ణకళామర్దముఁ దన్నరుఁడు పతియు న్రాధేయుఁడుం జూడ గన్.

247 వ. ఇవ్విధంబున వృషసేను [1]సమయించుటం జూచి కర్ణుండు శోకవ్యాకుల చిత్తుండై కన్నీ రొలుకం గోపాటోపంబున నుద్భటుం డగుచు నమ్మహా [2]రథుని కెరికి సమ్ముఖంబు గాఁ దనయరదంబు [3]వఱపించి యర్జున యర్జున యని యాహ్వానంబు సేసిన నతండును సవిశేషోత్సాహంబునం బొదలి యడరె నట్టియెడ దురంబు దక్కియిరువాఁగునుం బరమకౌతుకంబునం గనుంగొను చుండ నయ్యిరువురు రామసన్నిభంబులు నాదిత్య సంకాశంబులుఁ ద్రినయనప్రతిమంబులు నగు నాకారంబుల నుల్లసిల్లిరి వారల యొక్కటికయ్యం బాలోకించు కుతూహలంబున సుర పితృ విద్యాధర సంయమిసంఘంబులును శచీపతి ప్రజాపతి పశుపతులును లోనుగా ననేక దివ్యు లేతెంచి నభోభాగంబున నిలిచి రప్పుడు బ్రహ్మ రుద్రున కిట్లనియె.

—: కర్ణార్జునుల ద్వంద్వయుద్ధకాలమున బ్రహ్మరుద్రేంద్రుల ప్రశ్నోత్తరములు :—

సం. 8-63-46

248 క. ఇరువురు నతిరథులు సమ, [1]స్ఫురణులు విక్రాంతిపరులు శూరులు వీ రొం
డొరువులతోఁ బెరఁగఁగ న,శ్వరమగు జగ ముడుపరాదె సమరం బనఘా.

249 క. అన విని యాదేవుం డ, వ్వనజభవున కిట్టు లను నవార్యోద్ధతు లీ
ఘనభుజులు వీరిరణ మె,ట్లును జెల్లుం దప్ప దప్పలుకు విడు మింకన్.

250 వ. అని యి ట్లమ్మహాత్ములు సల్లాపంబులు సేయ నాకర్ణించి పాకశాసనుండు సప్రణయంబుగా బ్రహ్మ కిట్లనియె.

251 చ. తపము నుదాత్తశౌర్యము నుదగ్రబలంబును గల్గుక్రీడిక
య్యపువెర వెక్కుడై గెలుచు[1]నట్లుగ నీవు దలంపవే పురా
ణపురుషులైన కృష్ణుల రణంబున శాత్రవు లాక్రమించుటం
గుపితమనస్కులైన నిలకున్ బ్రదు కెమ్మెయిఁ గల్గనేర్చునే.

---

247 1. వధియించుట—న.శ.ప. 2. వీరుని—కొన్నిప్రతులు. 3. నడపించి—కొన్నిప్రతులు.

248 1. స్ఫురణంబుల విక్రమముల శూరులు — వ.

251 1. నట్టిలుగాక — ఙ.త.ద.వ ; నట్లుగనాత్మవలంప — క.ప.వ.

252 వ. నరనారాయణుల[1]కు నెందును జయంబు [2]ధ్రువం బని తొల్లియుం జెప్పితి రిమ్మహాత్ములు జయించుట లోకహితంబు గర్ణుండు [3]ద్రోణ భీష్మప్రాప్తం బైన పుణ్యలోకంబు వడయుఁ గిరీటి చిరకాలం బిడుమలం బడినవాఁడు గావున రాజ్యసుఖంబు లనుభవించుం గాక యనిన నప్పరమేష్ఠి వీరల జయాపజయంబులు నిశ్చయించి పలుకనేల యనుటయు నీశానుం డతని నాలోకించి నిశ్చయించుట మేలు కాక యెగ్గేమి నిశ్చయింత మని కలిసికొని యతండును దానును వాసవువలను విలోకించి కృష్ణార్జునుల నుద్దేశించి.

253 తే. మహితమును లగుపి రెండు మాఱు లేక
మెలఁగువా రయి కాదె జన్మించినారు
వినుము నీచెప్పినట్టుల వీరి నొరు [1]ల
ధఃకరించుట లోకహితంబు గాదు.

254 వ. వీరికి [1]జయంబు ధ్రువం బని పలికి యంత నిలువక వీరిజయంబు ధ్రువంబయ్యెడు మనవుడు నయ్యమరవిభుండు సుర[2]మునిప్రభృతులం గలయం గనుంగొని దేవదేవు లిరువురు [3]నేకమతంబు గా [4]నిశ్చయించిన లోకహితం బగు [5]నానతి యాకర్ణించితిరే మీచిత్తంబులిత్తెఱంగున కనుకూలంబులు గావలయు ననిన నందఱు నది యిట్టిద కాక యొండగునే యని రనిమిషులు గుసుమ వర్షంబులు గురియించుచు దివ్యదుంధుభిధ్వానంబులు సెలంగించి రయ్యవసరంబున నఖిలభూతంబులును విస్మయోత్ఫుల్లనయనంబు లగుచు నమ్మహా

---

252 1. కెమ్మెయి జయంబు — ఈ.ఉ.ఎ.ప.ల. కొన్ని ప్రతులు. 2. ప్రసిద్ధంబని — అ.ఐ.డ. 3. భీష్మద్రోణ — కొన్ని ప్రతులు.

253 1. లధఃకరించుట — ఊ.వ.సూ ; లు. ధిక్కరించుటలోకహితంబుగాదు— వా.పి.శ.ష. మున్నగు పెక్కు ప్రతులు. యతిభంగ మేలకో వీరిదృష్టికి రాలేదు — లు. తక్కరించుట— ణ.ప. తక్కరించు అని ధాతువుగా ప్రయోగము నిఘంటువులలో కాన్పించదు.

254 1. జయంబయ్యెడు మనవుడు — ఆ; జయంబయ్యెడు మనవుడు — ఖ. 2. మునిబృందారక ప్రభృతులం — అ.ఝ.డ. 3. నేకతంబుగా నిశ్చయించిన — అ ఆ.ఘ.డ ; నేకవాక్యంబుగా — క.ఖ.గ.ప. 4. నిల్పిన — కొన్ని ప్రతులు. 5. నాలాపంబు — ఊ;

ద్వంద్వయుద్ధంబు వీక్షించు వేడుక నొండుదలంపులు దక్కి[6]యుండె నట్లు దార్కొనిన మహనీయరథంబులు రెంటియందును సన్నాహసముజ్జ్వలులై యొప్పు వాసుదేవార్జునులును గర్ణశల్యులును దమతమశంఖంబు లొత్తి రప్పుడు.

255 తే. రెండుసేనల శంఖభేరీ [1]ముఖంబులైన బహుతూర్యముల పటుధ్వాన మడరి నింగిఁబొంగారె నత్యంత [2]నిశ్చలంబు, లయ్యె సైనికనికరంబు లద్భుతముగ.

256 సీ. కపికేతనము హస్తికక్ష్యయు నమ్మహో
బలు లిద్దఱును దపోబలము[1]వలనఁ
గన్నవి యై బుద్ధి గలిగి శోధిల్లును
ర్వీశ యప్పుడు కపి యొ[2]రఁగి హస్తి
కక్ష్యపై నడరినఁ గయ్యమా రెంటికిఁ
గలిగె నం దాహస్తికక్ష్య దెరలె
నంబుజాక్షుండు మద్రాదినాథుండును
దృక్కులహంబునఁ దేజరిల్లి

తే. రర్జునుండును గర్ణుండుఁ దర్జనంబు
లైనచూడ్కి లొండొరువుల యాననములఁ
బఱపి రాకృష్ణపార్థులబలుపు శల్య
కర్ణచిత్తదౌర్బల్యముల్ [3]గానవచ్చె.

257 వ. అట్టియెడ నాసూతనందనుండు మద్రపతి నాలోకించి.

258 తే. అర్జునుఁడు నన్ను [1]నోర్చిన యట్టులైన
నెట్లు సెప్పుము యనుడు మద్రేశుఁ డేను
గృష్ణు లిద్దఱ నొక్కటఁ గిట్టి తీవ్ర
బహుళశరజాలముల[2]పాలుపఱుతు ననియె.

---

వాక్యము — వ. 6. యుండి రట్లు — కొన్ని ప్రతులు.

255 1. రవంబులైన — ఏ.ణ.త. 2. నిస్వనంబు — ఆ.డ.ల.

256 1. వేస్మె — బ. 2. రెుగి — ఇ.ఖ.వ. 3. గానన య్యె — జ.వ.శ.ష.

258 1. గెలిచిన — వ. 2. బడల్పరతునని యె — ఎ.గ.వ.

259 ఆ. అట్ల సవ్యసాచి యడిగిన మురవైరి
నగుచు నినుఁడు గూలినను ధరిత్రి
పతియలైన మేరు వొఱగినఁ గర్ణుచే
నీవు గోలుపోవు చేల కలుగు.

260 వ. అని వెండియు.

261 ఉ. అట్టి[1]ద లోకపర్యవస మాదురవస్థకు [2]స్రుక్కనేర్తునే
కిట్టుదుఁ గర్ణశల్యు లనుకీటములం [3]గరతాడనంబులం
బెట్టుదు [4]నేలఁ గౌరవులఁ బీనుఁగుపెంట[5]లు గాఁగ ధర్మజుం
గట్టుదుఁ బట్ట మన్న నగి గాండివి యద్దనుజారి కిట్లనున్.

262 ఉ. నవ్వుల కంటెఁ గాక [1]యది నాకు నశక్యమె కర్ణశల్యులం
గ్రొవ్వడఁ[2]గించుచే ద్రుపదుకూఁతురు గొల్వునఁ బడ్డపాటునన్
నెవ్వగఁ బొందుచుఁ సమయనిష్ఠ నడంగితిఁ [3]గాని యింక నా
ముప్వురుఁ[4]బూని వచ్చినను ముట్టెదఁ గర్ణుని నేలఁ బెట్టెదన్.

263 మ. అరదంబుఁ సిడమున్ హయవ్రజము శల్యాంగంబులుం జాపముం
గరకాండంబులఁ బెక్కుభల్లముల నుగ్రస్ఫూ[1]ర్తిఁ దున్మాడి ని
ష్ఠురభల్లం బొకటఁ సుయోధనునిచూడ్కుల్ [2]నీరుగా నిప్డ యు
ద్ధురగర్వోన్నతమైన కర్ణుతలఁ ద్రుంతుం జూడుమీ వేడుకన్.

264 ఆ. కర్ణముద్రపతులకాంతల విధవలఁ, జేయువాఁడ నీవు సెన్ను మిగిలి
నగుచు నేఁడు ద్రుపదనందనవీనుల, ధర్మసుతునిచెవులఁ [1]దనుపు నినుపు.

---

261 1. విపర్యయంబయిన నద్దుర – వీ; అట్టిదలోకవంద్య (వర్య)వినుమాదుర – వ.ల; ఇట్టిద లోకపర్యవసమీదుర –స. 2. నోర్వవచ్చునే – ఊ. 3. బదతాడనంబులఁ – ద. 4. నెల్లకౌరవుల – ఖ.జ. 5. గజేసి – కొన్ని ప్రతులు.

262 1. యని – వీ.సూ.ద.ల.ష. కొన్ని ప్రతులు. 2. గింతునా ద్రుపదు – ఇ.ఈ.ఎ.ఫ. కొన్ని ప్రతులు. 3. గాకయింక – కొన్ని ప్రతులు. 4. గూడి – కొన్ని ప్రతులు.

263 1. ర్తిముఁ ద్రుంచి – పెక్కు ప్రతులు. 2. నిండగా – వ.

264 1. దనుపు — వీ.శ.ష. పెక్కుప్రతులు ; దనివు – వా.

265 క. సంతసపువా_ర్తవుచ్చుము
కుంతికి నే దంతి దరువుఁ గూల్చిన[1] క్రియ దు
ర్దాంతగతిఁ గర్ణుఁ గూల్చుట
యంతయుఁ గన్నారఁజూచి యచ్యుత యెలమిన్.

266 వ. అని పలికె నా సమయంబున నుభయసైన్యంబులజనంబులకు నంబరంబున నున్న దివ్యసమూహంబులు నందు గీతనృత్తంబుల నుల్లసిల్లు నప్సరోగణంబులుం గానసైన నద్భుతంబున వారు ననిమిషులై యుండి రప్పు డేకనిశ్చయు లగుకర్ణుండును దుర్యోధనుండును నచ్చెరువాటునం బోరయక దురంబుమీఁది [1]భరంబునం బొలిచి రిరువాఁగుసైనికులు గిరీటికిఁ గర్ణునకు నభిముఖంబుగాఁ దలమిగులఁ దగ దనుబుద్ధిని భయంబునను దద్రథంబులు రెంటిని బలసి నిలిచి రమ్మహావీరులు ధనుర్ద్యుతులను బాణప్రభలను [2]దీవ్రతేజంబులును బ్రదీప్తులై కల్పాంతసూర్యులచందం బగుచు నొండొరుల నోర్చుకడంకలఁ [3]బేర్చి రయ్యవసరంబున నశ్వత్థామ గురుపతిఁ జేరంజని కరంబు [4]సేతం దెమల్చి సాంత్వన[5]స్వరంబున ని ట్లనియె.

-: అశ్వత్థామ దుర్యోధనునకు హితోపదేశంబు సేయుట :-

సం. 8-64-20

267 చ. [1]కలన గురుండు భీష్ముఁడును గాండివిచేఁ బడి రంగరాజు వా
రల కధికుండె యాతని దురంబున నోర్వఁ గలండె [2]పూని యే
వల దని బుద్ధి సెప్పిన నవశ్యము నాతఁడు నిల్చు నీతనిన్
నిలుపుము నీవు ధర్మసుతునిం దగుమాటలఁ దేర్పఁ జొప్పడున్.

268 వ. [1]తెలిపిన దామోదరుండునుం దెలివి నొందు.

---

265 1. గతి — అ.ఆ.ఐ.ఒ.ల.

266 1. కడంకం బొలిచిరి — అ.ఆ.ఐ.ల.శ. 2. తేజోబింబంబులనతిదీప్తులై —ఇ. 3. నుల్లసిల్లిరయ్యె — ఎ. 4. చేజేతన్ — ఇ.గ.వ. 5. పూర్వంబున — స.

267 1. కలశభవుండు — ఈ.ఘ. 2. క్రీడిదేవలదని — ఈ.

268 1. దేర్చిన – అ ; అతడు తెలిపిన – వ ; ఇచ్చట బ్రౌనుగారి వివరణము. "అతండు అను మాట సంస్కృత వ్యతిరేకము. ఇక్కడ మూలమునం దిట్లున్నది. అహంత్వవధ్యో మమ చాపి మాతులః / ప్రశాధి రాజ్యం సహ పాండవైశ్చిరమ్ / ధనంజయః శామ్యతి వారితో మయా/జనార్దనో నైవ విరోధ మిచ్ఛతి'', చిత్రశాలాప్రతి–
కర్ణ—88—22.

269 క. భీముఁడుఁ గవలును ధర్మజుఁ,చే మరలెడువార లేను జెప్పెడిపలుకుల్
భూమీశ కురుకులమునకు, నీమొనరాజులకుఁ [1]బ్రజకు హిత మూహింపన్.

270 చ. వలవదు నన్నునుం గృపు నవధ్యులఁగాఁ గొని క్రీడి గెల్వ శ
క్తు లని తలంప భీష్ముఁడును ద్రోణుఁడు లోక మెఱుంగఁగా నవ
ధ్యుల హరికల్మి సారథికు దోర్బలలీల నడంగి [1]పోరె య
చ్చలమొ ఫలంబొ యింకయిన సంధి యొనర్చుట మేలు వారితోన్.

271 చ. హరి సనుదెంచినప్డు మన మమ్మెయిఁ బల్కితి మింక సంధికి
న్వెర వగు టెల్ల గల్గు నని నీవుదలంపకు మాంబికేయు భూ
వరుఁడుఁగఁ జేయు ధర్మజుఁ డవశ్యముఁ బాండున్నృపాలుపాల యే
వురకు నమర్చుఁగాని చనవుం వెలి[1]మెచ్చును నొల్లఁ డేమియున్.

272 తే. పాండవులయట్ల రాధాసుతుండు నాదు
పలుకులకు నియ్యకొను నీవు బ్రమకు తెరువు
పట్టు బ్రదికిన నెల్లశుభములుఁ గలుగు
నీసు మానుము చచ్చిన నేమి గలదు.

273 క. వెడతలఁపు లుడిగి సంధికి
నొడఁబడు మిది లెస్స దీని కొడఁబడమి గడుం
జెడుతెరువిప్పటి [1]పదనున్
గడవఁ[2]బడుట [3]దాటఁ దప్పుకరణియ చుమ్మీ.

274 చ. అన విని యమ్మహీరమణుఁ డాతని కిట్లను నిష్ఠ దుస్ససే
ముని[1]పని దీర్చి మారుతతనూభవుఁ డాడినమాట యేర్పడ
న్వినియును సంధి సేయుటకు నీ వభిలాషము [2]సేఁత యొప్పునే
పెనఁకువ కర్ణుఁ డేలుడుగు బేలవె మానుము ద్రోణనందనా.

---

269 1. బరమహితము వహింపన్ — డ.

270 1. పోవరే / చలమొ — స. పెక్కుప్రతులు.

271 1. బుచ్చును, బుచ్చును — అనిపాఠములు.

273 1. పదనన్ — కొన్ని ప్రతులు. 2. బడిన—పీ. 3. దాటు తప్పు కరణియు — ఉ.ఘ.న.శ.

274 1. పగదీర్చె — ద. 2. సేయుటొప్పునే — జ.

275 శా. క్రాంతిం బొందినవాఁడు పార్థుఁడపరిశ్రాంతుండు గర్ణుండు దు
ర్దాంతోదగ్రత నేఁడు గీటడఁచు నీతం డాతనిన్ వహ్ని య
త్యంతంబున్ శిశిరత్వ మొందినను [1]గోత్రాళుల్ వడం కాడినం
గుంతీసూనునిచేతఁ గర్ణున కనిం గోల్పాటు వాటిల్లునే.

276 వ. అని పలికి యజ్ఞనపతి తన సైనికుల నాలోకించి సమరసముత్సాహ[1]పోష
ణంబులగు భాషణంబుల ముఖరుం డగుటయు నఖలతూర్యంబు లొండొండ
మోగ్రెసెఁ పాండవబలంబునను భేరీపణవాదుల[2]రణనంబులు నిగిడె నప్పుడు
కర్ణుండును నర్జునుండును.

277 క. కరి కరి గిరి గిరి నంభో, ధర మంభోధరముఁ బెలుచఁ దాఁకినక్రియఁ దాఁ
కిరి కడఁగి గగన[1]తటియును, ధరణియు [2]మ్రోయుచు వడంక ధరణీనాథా.

278 క. మెఱ[1]య వెలిమావులును గడు
మెఱుఁగారెడు నరదములును మింటను మంటల్
వఱపెడు వాలమ్ములుఁ జూ
పఱ నత్తొలుతాఁకు వెఱఁగుపడఁ జేసె నృపా.

279 వ. ఇవ్విధంబున నవ్వీరోత్తము లుదాత్తభంగిం దలపడి పెనంగం దొడంగిన
నుభయసేనల[1]వారలు నార్పులు నింగి ముట్టఁ జెలంగి రట్టియెడ.

280 మ. భరితోత్సాహతఁ బేర్చి దీప్తు లడరన్ భల్లమ్ము లొక్కుమ్మడిం
బరగం జేయుము కర్ణగాత్రములలోఁ బార్థుండ వే[1]త్రుంపు మి
క్కురు భూపాలకు రాజ్యకాంక్ష దొరయే కోదండపాండిత్యవి
స్ఫురణం గర్ణుఁడు నీకు నీబలుపు నేపుం జూపు మత్యుగ్రతన్.

---

275 1. గోత్రాదుల్ – పెక్కు ప్రతులు.

276 1. దోహలంబు – ఆ.జ.ల. 2. రవంబులు, రావంబులు – అని పాఠములు.

277 1. తలమును – ఝ.ఞ.న.ప.ల. 2. దిక్కులు – అ.ఇ.క.ఖ.

278 1. యువెలిమావులును – కొన్ని ప్రతులు.

279 1. వారు నుబ్బున నింగి ముట్ట – ఇ.ఔ.ప.వ.

280 1. తెంపు – జ.త.వ ; ముంపు – కొన్ని ప్రతులు.

281 వ. అని పాంచాలురు పార్థజయార్థసంభాషణంబులు సేసిరి కౌరవులును గర్ణుఁ డగ్గలిక.

282 చ. కడఁగుము [1]నీదుబాణములఁ గవ్వడి గూలినఁ జాలు నంతతోఁ
జెదుదురు పాండవుల్ [2]రణము సేయునుదగ్రత యెల్లఁ దక్కి పే
రడవుల కేఁగి సాధు[3]మునులై చరియింతురు కౌరవేంద్రుఁ డీ
పుడమి సమస్తముం బొగడు పొంపిరి వోవఁగ నేలు లీలతోఁ.

283 వ. అని తమలో పలికిరి ప్రొద్దునుం జాలవ్రాలెఁ గాలాంతకప్రతిము లగు నప్పార్థకర్ణు లన్యోన్యజయార్థులై పెనంగునప్పుడు.

—: కర్ణార్జును లొండొరులమీఁద దివ్యబాణంబు లేయఁబూనుట :—

సం. 8-65-12

284 సీ. కర్ణుండు పదిచండకాండంబు లర్జును
తనువునఁ జొనుప నర్జునుఁడు దీప్త
ఘనబాణములు పదునెనిమిది కర్ణుమైఁ
బరగింప నయ్యంగపతి దశోగ్ర
చక్రమార్గణముల సరభసంబున నొంచె
నన్నరు నాతండు నట్టి వన్ని
శరములు రాధేయునురమున నాటించె
నతఁడు దొమ్మిది [1]వాలుటమ్ములతని

తే. వక్షమునఁ గ్రుచ్చి సాయకద్వయము శౌరి
మేననిగిడింప బీభత్సుఁ డేను మెఱుఁగుఁ
తూపు లాసూతపుత్రు నెత్తుట మునుంగ
నేసె బాహాసముల్లాస మెసక మెసఁగ.

---

282 1. దివ్యబాణముల — ఎ.వ. 2. దురము — వ. 3. జనులై — ణ.త.వ.

284 1. వాలురమ్ములు - పీ. కొన్ని ప్రతులు.

285 చ. అలిగి కడంగి సూతసుతుఁ డచ్యుతపార్థులఁ దీవ్రబాణపం
క్తులఁ బొదువం బరాక్రమకుతూహలి యవ్విజయుండు పిన్నన
వ్వొలసి ము[1]ఖాంబుజంబునకు నొప్పుగఁ దద్రథరథ్యకేతుసూ
తులను దదీయగాత్రమును దూపులవెల్లి మునుంగఁ జేసినన్.

286 క. అతఁడును దురగసారథి, కేతుయుతము గాఁగ ముంచెఁ [1]గ్రీడయపోలెన్
శాతశరవృష్టి నన్నరు, నీతెఱఁగున మఱియుఁ బెనఁగి రిద్దఱుఁ గడఁకన్.

287 శా. ఆయుగ్రాహవకేలి నిట్లు నిపుణుం డై యొప్ప నప్పార్థుఁ డా
గ్నేయాస్త్రం బరివోసి దారుణమహోగ్నిజ్వాలికల్ భీషణ
స్ఫాయద్భంగి నభస్థ్సలిన్ నిగుడ దర్పస్ఫూర్తి శోభిల్ల రా
ధేయాంగోద్దహనాభిలాష మెడఁదన్ దీపింప బెట్టేసినన్.

288 ఉ. అంత కోపవహ్ని విపులాకృతి గై కొని వచ్చినట్లు మి
న్నంతయుఁ దాన యై కవియు నగ్నిశిఖంబు మనంబులోన నా
వంతయు శంక లేక సముదగ్రత వారుణమార్గణాహతిన్
శాంతముఁ జేసె విక్రమవిశాలుఁడు గర్ణుఁడు మాకు నుబ్బుగన్.

289 ఆ. ఫల్గునుండు మేఘబాణ మేసిన ఘూన ఘోంతరంబు సంభృతాంధకార
మయ్యె సూతసూనుఁ డనిలాస్త్ర మేయుడు నాతమంబు [1]విరిసె నాక్షణంబ.

290 ఉ. అర్జునుఁ డైంద్రబాణము సమంచిత[1]భక్తి[2]ధరించి మంత్రవి
స్ఫూర్జితగాండివుం డయి రిపుప్రకరంబులు సంచలింప న
త్యూర్జితశక్తి నేయుడు మహోగ్రబహుప్రదరప్రకారశా
దుర్జయలీల నిర్మథనదోహాలి యై యదికర్ణుఁ గిట్టినన్.

291 క. అతఁ డభిమంత్రితబాణప్రతతిఁ దదుద్రేక [1]మడఁచి పార్థుని మేనన్
శితశరములు నిలిచిన మారుతపుత్రుఁడు గనలి యన్నరున కిట్లని యెన్.

---

285 1. ఖంబు చెల్వునకు నొప్పుగ — అ.ల.

286 1. గెలియఁబోలెన్ - కొన్నిప్రతులు.

289 1. విడిచెన — అ.త.

290 1. శక్తి - ఉ. 2. దలంచి — వ.న.

291 1. మడపి - అ.ఉ.

292 ఉ. సూతసుతుండు నీయెదుర నుక్కక నిల్చుట కాక నీశర
వ్రాతము నిల్వరించి యనివారణ నొంపఁదొడంగె ఖాండవం
బేతెఱి వొందఁ గాల్చితి మహేంద్రుఁడు నివ్వెఱఁ గంది యుండఁగా
నాతెఱి వాత్మ నూల్కొలిపి యగ్గలికం బెగటార్పు మీతనిన్.

293 చ. తెగి మన కగ్గమై యరుగుదెంచినవాఁ డితఁ [1]డల్కి యింక నొం
దుగడకుఁ బోవ కుండఁగఁ గడుం జెవ దగ్గఱి యేఁ గపాలముం
బగులుతునో గదానిహతిఁ బార్థ భవత్ప్రికట ప్రతిజ్ఞకై
తగ దని మాన్చె దేని నిశితప్రదరంబులఁ ద్రుంపు కంఠమున్.

294 వ. అని పలికెనప్పుడు.

295 సీ. పుండరీకాక్షుండు గాండీవితో నీదు
దివ్యబాణములు రాధేయుచేతఁ
దూలపోవుటయు బల్ దూపుల నాతండు
నినునొంచి యిట్లుపేర్చినవిధంబు
నుత్సాహ మెడలి నీ వునికియుఁ గనికురు
సంతతి యార్వఁ బాంచాలకోటి
పిలుసని [1]పోవంగ నెఱుఁగవో యెఱిఁగియుఁ
దగఁ జేయునదిలేక వెగడుపడితొ

తే. చక్ర మిచ్చెద నతని మస్తకము దునుము
మనిన నగుచుఁ గిరీటి బ్రహ్మాస్త్ర మధిక
నిష్ఠమై నేయ నది బహు నిష్ఠురప్ర
దీప్తశరమూర్తిఁ గర్ణునిదెసకు [2]నడరె.

296 క. అరథికుఁడు దలఁకక నియ,మారూఢప్రౌఢభావుఁ డగుచుఁ దదస్త్రో
దారతరబలమునన త,ద్దారుణసంరంభ ముడిపె ధరణీనాథా.

---

293 1. డింకభీతి — ప.వ; డట్టురాక - క.సం.

295 1. పోవుటయెరుగవో — ఉ.న.శ.ష. 2. నిగుడె — పెక్కు ప్రతులు.

297 తే. ఉడిపి తోడన కవ్వడి యొడలఁ గృష్ణు
మేన మూఁడుమూఁ డడరించె మెఱుఁగుఁదూపు
లన్నరుఁడు గర్ణుతనువు శల్యాంగకములుఁ
జించెఁ దొమ్మిదితొమ్మిది శితశరముల,

298 ఆ. మొనసి క్రీడి మరియు మూఁడు నెనిమిదియు
రెండు నాల్గు పదియుఁ జండమార్గ
ణములు గ్రుచ్చె సూతనందను[1]మై నతఁ
డుఱక యతనిమౌర్వి యూడనేసె.

299 వ. ఏసి మఱియు శితశరంబులం బొదువం బొలి వోవక పార్థుం డాగుణంబు సమాహితంబు సేసి పెల్లేసిన రయంబున రాధేయుం డతనిశింజిని శిథిలంబు గాద కాక యని తలంచె నాధనంజయుం డతనివింటినారి వికలంబుఁ[1]గాఁ జేసి.

300 క. చిఱునగవుతోడ మైమఱు, వఱువుల్గుగఁచేసి యతని యంగము దోఁగం
బఱపె రుధిరంబు బెడిదపు, మెఱుఁగువెడఁద యంపగమి నమిత్రులు దలఁకన్.

301 చ. తెరలక కర్ణుఁ డవ్విజయుఁ దీవ్రశరత్రయవిద్ధుఁ జేసి మం
దరధరు నస్త్రపంచకనితాంతహతిం గడు నొంచె నాశరో
త్కరము [1]వరప్రభావకలితం బగుటన్ మగుడంగ వచ్చె ని
ష్ఠుర రభసం బెలర్ప మధుసూదనుఁ గ్రమ్మఱ నేసె[2] నాతఁడున్.

302 క. అలఘుపటుభల్లపంచక
ములరెంటం గ్రీడి చిత్రముగ [1]నయ్యస్త్ర
మ్ములు మూఁడు మూఁడు శకల
మ్ములుగాఁ దునుమాడె జనులు పొగడ నరేంద్రా.

---

298 1. మెయినతండురక – ఎ.

299 1. గాగనేసి, గానేసి – అని పాఠములు.

301 1. వరప్రసాద – ప; తపఃప్రభావ – ల. 2. నుగ్రతన్ – జ.

302 1. నైదైదమ్ములు – పెక్కు ప్రతులు.

303 క. కర్ణునిమెయి నాలోనన, కర్ణాంతాకృష్టచండకాండము లధికో
దీర్ణక్రోధంబున న,భ్యర్ణగతుండగుచుఁ గ్రుచ్చె నతఁడే పలరన్.

304 చ. మఱియు నరుండు సూతసుతు మర్మవిభేదన మాచరించిన
న్మెఱుఁగులు గ్రమ్ముసమ్ముల వినిశ్చలధైర్యముపేర్మి నాతఁడు
క్కఱక పెనంగె దానఁగన లగ్గల మై వెస నమ్మహోభుజుం
డఱిముఱిఁ జీఁకటుల్ గలియు నట్లుగ రోదసి నించెఁ దూపులన్.

305 తే. [1]వెగడుపడి చక్రరక్షకుల్ వెనుక దిక్కు
గాచురథికులుఁ బార్శ్వసంగతులుఁ దమ్ము
విడువఁ జాలక లజ్జ వో విడిచి రపుడు
గర్ణువారలు వాఱుట గని విభుండు.

306 క. [1]ఆ దిక్కువారు భీముం, డాదిగ నని సేయు కుండు నన్నియతిఁయెడం
దా దైన్య మొందె [2]తప్పం, గా దని యూహింప నీనికలఁకకతమునన్.

*-: దుర్యోధనుఁడు తనయోధుల నర్జునుం దలపడఁ బురికొలుపుట :-*

సం. 8-65-42

307 వ. ఇరుగెలంకులనూఁకలం గలయం గనుంగొని యెలుంగెత్తి.

308 క. తొడరుఁడు పొదువుం డేయుఁడు, పొడువుఁడు భీభత్సుఁ బ్రిదిలి పోనీక వెసం
బడ వైవుం డొక్కుమ్మడిఁ, గడఁగి యనుచుఁ జేయి వీచెఁ గౌరవనాథా.

309 క. విను మతఁ డిమ్మెయిఁ బురికొ,లిపిన రథకరితురగసుభటబృందములు రయం
బున నురవణించె నయ్యు,ర్జునుపైఁ దగువారు నిలిచి చూచుచు నుండన్.

---

305 1. వెరగుపడి - ఈ.వ.

306 1. కర్ణునిగాచుటకై దుర్యోధనుడు తన వీరులను ప్రోత్సహించె నను భావమునకు మూలము నందు ఆధారము కాన్పించదు. ఐనను "దుర్యోధ సేనానుమతానరిఘ్నః" అను శ్లోకపాదమును మూలముగా గొని తిక్కన సోమయాజి దీనిని విపులీకరించి యుండును. 2. కర్జము గాదని - అ.ఐ.ల. పంపంగాదని - వ.

310 వ. ఏపరి సైన్యంబు సమరంబు దొలంగి యుండ టయెఱింగి కడంగుట [1]పాడి గా దని దొరలు దురంబునకుం జొర కుండిరి గాండీవి కోదండగుణ [2]రణన భరితభూనభోంతరుం డగుచు వివిధవిశిఖజ్వాలాకలాపంబుల వేఁడిమి సూపి న[3] నేపఱి వెఱచి యమ్మూఁకలు వఱచినం గనుంగొని యక్కురునాథుం డద్దొరల నుద్దేశించి.

311 క. బీరమును లావుఁ గల్గిన, మీరందఱుఁ గర్ణు నొకనిమీఁదన యిమ్మెఁ
బో రెల్లఁ ద్రోచి ఫల్గునుఁ, జేర కునికి యాయుధోపజీవు[1]ల తెఱఁగే

312 వ. అనిన విని యుల్లంబుల లేసియుత్సాహంబు దెచ్చికొని వా రొక్కుమ్మడి నురవడించిన.

313 మ. భరితక్రోధమహోగ్రవృత్తి సిడముల్ భంజించుచుఁ సూతుల
న్ధరణిం గూల్చుచుఁ జాపముల్ నఱకుచు న్రథ్యంబులం జంపుచుఁ
నరుఁ డాఖీలపరాక్రముం డగుడు దైన్యం బంది వెన్నిచ్చి వి
చ్చిరి వా రందఱు దివ్యసంఘము నుతింపెం జూచి యవ్వీరునిన్.

314 చ. కురుపతి వెండియుం దఱుమఁ గోత్తల సేయర క్రమ్మఱంగ నె
వ్వరు నతిభీతి నిట్లు మనవా రెడ గాఁ జని చూచు చుండి ర
ప్పరుసున నాసమిద్ధరణిభాగము శూన్యతఁ బొందఁ గర్ణుఁ డ
న్నరుఁ దలపడ్డ నప్పటిరణంబు మ[1]హాద్భుత మయ్యె భూవరా.

315 చ. క్రమమున సోలు చుండియుఁ బరాక్రమ[1]సంపదసొంపు మీఱ దు
ర్గమవివిధాస్త్రజాల తిమిరంబుల నొండొరుఁ గప్పి కప్పి శౌ
ర్యములును బాహువీర్యములు రాజుల సచ్చెరు వందఁ జేయ ను
గ్రముగఁ బెనంగి రయ్యమరరాజతనూజుఁడు సూతసూనుఁడున్.

---

310 1. కర్ణముగాదని - ఇ; పాటిగాదని — ఎ.గ.త.వ. 2. రవభరిత — పీ.ల వ.స. 3. వెరచరచి - కొన్ని ప్రతులు.

311 1. లు గారే - వ.

314 1. హోగ్రతయెమిచెప్పుదున్ — ప.

315 1. మొప్పఁ - అ.ఝ.

316 వ. అట్టియెడఁ దక్షకునపత్యం బై తత్సోదరుం డగు[1]నైరావతుండు పెనిచి యుపలాలింప నుల్లసిల్లిన యశ్వసేనాభిధానుండగు నాగకుమారుండు సర్పముఖశరాకారంబు గైకొని తనయొద్ద నుండఁ దాను బసిండిపొదిం బెట్టి యనుదినంబును గంధపుష్పంబుల నక్షతంబుల నర్చించుచు నయ్యర్జును మీఁదం బ్రయోగించువాఁడై [2]యున్న యట్టి యమ్మహనీయాస్త్రంబు రోషావేశవివశుం డగుచుఁ బుచ్చికొని తలదెగ వ్రేయుటకై యక్కర్ణుండు సముదీర్ణజ్వాలాజాలంబు లంబరంబునం బర్వఁ[3] జూపఱులు హాహాకారంబులు సేయం గార్ముక గుణంబున సంధించి తెగవాపినం గని యారథికు [4]చూపు కంఠంబుచక్కటికిం గాక తప్పియపాంగప్రదేశంబుకొలంది యగు టంజేసి యది నెపంబుగాఁ శల్యుం డతనికిఁ [5]జిత్తవైకల్యం బాపాదింపం దలంచి యీ సంధానంబు మెడ దునుముట కనుగుణంబు గాదు నిపుణం బుగా నిరూపించి యొండుభంగి సంధింపు మనినఁ గర్ణుండు గనలునఁ గనుఁ గవఁ గెంపు గడలుకొన నమ్మద్రపతిం జుఱచుఱం జూచి.

317 క. నసుబోఁటి[1]జోదు[2]నం గా
దని పలుకఁగ నేర్పు నీకు నంత గలదె య
ట్లును గాక వినుము[3] కర్ణుం
డినుమా టొకశరము దొడుగునే పరులు నగన్.

318 వ. అని పలికి కలు[1]షం బగుచిత్తంబుతో నెలుం గెత్తి ఫల్గున ఫల్గున పొలిసి తంచు నేసిన.

---

316 1. అశ్వసేను డను నాగుడు ఐరావతునిచే పెంపబడినట్లు తిక్కన వర్ణించెను. మూలము నందు అశ్వసేనుడు ఐరావత వంశ్యు డని చెప్పబడినది. "ప్రదీప్తమైరావతవంశసంభవం" కుంభకోణ ప్రతి - కర్ణ - 97 - 22. 2. యునిచిన - వీ ఙ.త.ద.వ.స. 3. జూపఱు లాహాకారంబు - వీ.ల.శ.ష. కొన్ని ప్రతులు. 4. తూపుకంఠంబు - ఏ.క.ఘ.చ. 5. మూలమునం దీభావమునకు ఆధారము కానరాదు.

317 1. జోదులం గాదని - పెక్కు ప్రతులు. 2. నౌగాదని - ఙ.త.వ. 3. ఇచ్చటమూలము "నసంధత్తే ద్విః శరమ్ శల్యకర్ణో".

318 1. కలుషాయత్తంబగు - అ.ఆ.ఉ.ఝ.ట.ల.శ. 2. సితిపొమ్మంచు - క.ఖ.

319 క. [1]వలుదెస మంటలు [2]ప్రబ్బఁగ
నలఘుస్ఫుర[3]ణముస నిగుడు నయ్యస్త్రంబున్
జలజాక్షుఁడు గని పంచాం
గుళమాత్రము రథము ధరణిఁ గ్రుంగ నదుముడున్.

320 క. సురగరుడ[1]ఖచర విద్యా
ధరఖేచరు లంబరం బుదాత్తధ్వనిసం
భరితముగఁ బొగడి రమ్మురి
హరు దివ్యప్రసవవిరచితార్చనతోడన్.

*-: సర్పముఖశరంబున నర్జునుకిరీటంబు భూమిపైఁ బడుట :-*

సం. 8-66-11

321 మ. కురువంశోత్తమ వారిదిక్కుఁ బ్రజ సంక్షోభింప నప్పాఁపతూ
పురయం బుగ్రము గాఁగ బిట్టడరి దంభోళిప్రభగ్నక్షమా
ధరశృంగాకృతి గా హరించె బహురత్నస్ఫీతరశ్మిచ్ఛటా
స్ఫురితం బైనకిరీటముం విజయునొప్పం దేజముం గుందఁగన్.

322 తే. జనులు విహ్వలు లగునట్టి ఘనరవంబు
[1]దిశలయందు నాకసమున దీటుకొనఁగఁ
గర్ణుఁ డట్లు భేదించె దిక్పతులచేత
నైనఁ జెడనికిరీట మయ్యహిశరమున.

323 క. సురపతి తపంబు సేసినఁ
బరమేష్ఠి ప్రియంబుఁ బొంది బహుమానపుర
స్సరముగ నిచ్చినయది య
క్కిరీట మరిభీషణ[1]త్వ[2]కీర్తిదము నృపా.

---

319 1. వలుదెసల మంటలుమియుచు — జ. 2. క్రమ్మఁగ — అ; పర్వఁగ — ఆ.క.ఖ.చ.ద.వ. 3. ణంబు మెరయు — ప.ఐ.

320 1. సిద్ధవిద్యా — పెక్కుప్రతులు.

322 1. దెసలయందు — కొన్ని ప్రతులు.

323 1. ప్రకీర్తితము — ఎ.గ.ట.ణ. 2. కీర్తితము — కొన్ని ప్రతులు.

324 ఆ. వనధివాసు లగుని వాతకవచు లను
దనుజు లాపురందరున [1]కజయ్యు
లైన నతఁడు వనుప నర్జునుఁ డోర్చిన
మెచ్చి యక్కిరీట మిచ్చె నధిప.

325 చ. వినుము నరేంద్ర చూడ విన విస్మయ మిట్టిది [1]పాఁపరమ్ము వా
త నెగయు ఘోరరూపభయదప్రథమానవిషాగ్నిజిహ్వకల్
దనికినఁ బెల్చ మండుచు నిలాస్థలి[2] డొల్లె నినుఁడు పశ్చిమాం
బునిధి నితాంతదృశ్య[3]రుచి పొల్పెసఁగం బడుభంగి దోఁపఁగన్.

326 వ. అప్పుడు.

327 ఉ. శృంగము లేనినీలగిరి చెల్వునఁ గ్రీడి కిరీటహీనుఁ డ
య్యుం గనుపట్టె వెల్లతల యొల్లియ మౌళి దృఢంబు గా నమ
ర్చెం గురునాథ పూర్ణ శశి చెన్నునఁ బూర్వమహీధరంబు కాం
తిం గడచన్న యందము ప్రతీతము [1]గాఁగ నటించు చాడ్పునన్.

328 వ. అట్లు రాధేయకరప్రముక్తం బై కిరీటంబు నిర్దహించి [1]నేలం గలపినయమ్మ
హోరగంబు గ్రమ్మ[2]అం గవిసినం గని కమలనాభుండు గవ్వడితో మనమీఁద
మగుడ నిమ్మహాసర్పంబు సనుదెంచు చున్నయది యనిన నతం డిది యెక్కడి
పామిట్లు వచ్చుటకుఁ [3]గతం బేమి యని యడిగిన దీని నెఱుంగవే ఖాండవం
బేర్చునప్పుడు [4]దనతల్లిని రక్షించికొని యనలంబునకుఁ దప్పిపోవం బోవ
నీక నీ వేసిన నన్నాగాంగన మృతిం బొందె నప్పగ వాటించికొని కర్ణుకడ
నమ్మయి యున్న యశ్వసేనాభిదాన[5]భుజంగంబు.

---

324 1. కజేయు — శ.ష. కొన్ని ప్రతులు.

325 1. పాముటమ్ము — ఉ.ట.న.వ.శ.ష.స ; పాముఱమ్ము — ఇ.ఎ.ప.గ.ఘ.చ.జ.వ.స.
2. వ్రాలె — ఈ.క.ఖ.ప. 3. రతి — ఈ.క.ఖ.

327 1. గానటియించు — కొన్ని ప్రతులు.

328 1. నేలంబడినయమ్మ — ట. 2. రనెగసి — కొన్ని ప్రతులు. 3. కారణంబేమి - పెక్కు ప్రతులు. 4. తమ తల్లిని — పెక్కు ప్రతులు. 5. భుజంగమంబు — కొన్ని ప్రతులు.

329 తే. అతఁ డేయఁ గిరీటంబు నపహరించి
దానఁ గోపంబు వోవక తాన కడఁగి
నిన్నుఁ[1] బరిమార్పఁ గడఁగెదు నన్న నెఱిఁగి
యాఱుపటుభల్లములఁ దునుమాడె నతఁడు.

330 వ. అత్తెఱంగున

331 సీ. ఉరగంబుఁ దునిమి వే మరలి కర్ణునిమీఁదఁ
బదియుఁ బండ్రెండును బటుశరములు
నిగిడించి యుజ్జ్వలం బగుదొడ్డనారసం
బేసిన నది రుధిరాసవంబు
పానంబు సేయుచు మే నుచ్చి చనిన దం
డాహతం బైన మహాహివోలె
నాసూతనందనుఁ డత్యుదగ్రుం డయ్యు
నంతకు మును పాఁపరమ్ముచేత

తే. నర్జునుఁడు పావమికి వెఱఁగంది [1]యాతఁ
డటులు గెరలి పండ్రెండు వాలమ్ము లేసి
పద్మనాభుని నొప్పించి పార్థు నొకటి
కొఱఁతగా నూఱుశరముల నుఱక నొంచె.

332 క. వెండియు బలువిడి నయ్యా
ఖండలసుతునురము క్రూరకాండంబుల నొం
డొండ కడు నొవ్వ నేసి య
తం డుబ్బున నార్చె గగనతల మ్రువంగన్.

333 గీ. ఆర్చి పెలుచ నట్టహాసంబు సేసిన
[1]నలిగి యతఁడు భల్లములఁ దదీయ
భూరికంకటంబు పొలు పఱ నఱికి యు
ల్లసితమకుటకుండలములు డులిచె.

---

329 1. బాధింప నిగిడెదు (నడరెదు) నన్న దిరిగి — కొన్ని ప్రతులు.

331 1. యునికి (యుండి) యటులు — కొన్ని ప్రతులు.

333 1. కనలియతఁడు భల్లమున తదీయ — కొన్ని ప్రతులు.

334 వ. దులిచిన నబ్బలుమగండు.

335 క. శిరమునఁ గర్ణంబుల నె
త్తురొలుక బరిమేనితోడఁ దూలక బాహు
స్ఫురణంబు మెఱయ సాయక
పరంపరలు నరునిమీఁదఁ బఱపెం బెలుచన్

336 తే. వాని దునుమాడి యాపాండుసూనుఁ డలఘు
శరచతుశ్శతిఁ బొదివి నెత్తురులు మేనఁ
బఱప గైరిక నిర్ఝర ప్రకరశోభి
తాచలము వోలి పొలిచె నయ్యంగరాజు.

337 ఉ. అమ్మెయి నుగ్రుఁడై మఱియు నర్జునుఁ డుజ్జ్వల [1]వత్సదంతకాం
డమ్ములు పెక్కు సత్వరదృఢస్ఫురణం బలరంగ నేసి ర
థ్యమ్ముల సూతుఁ గేతనము నాతనితేరును గూడఁ గప్పె మే
ఘమ్ములు గ్రమ్మి భూధరము గప్పినభంగిఁ దలంపఁ బట్టుగన్.

338 వ. ఇవ్విధంబున విక్రమకుతూహలి యై విజృంభించె నవ్వుడు.

339 ఉ. నెత్తుటఁదోఁగి మేను కమనీయరుచిం గొమరార బాణసం
పత్తి యుదగ్రతన్ మెఱయ భాస్వరుఁడై యరదంబుమీఁద భూ
పోత్తమ కర్ణుఁ డొప్పె నరుణోజ్జ్వలమండలకాంతిపూరము
న్మొత్తపుదీప్తులుం దగ నినుం డపరాద్రి వెలుంగుచాడ్పునన్.

340 వ *ఇట్లు సూతనందనుండు నొచ్చియుఁ [1]బొలివోనిబంటుతనంబున [2]జంట
మెఱుంగులు చదలం బరఁగ శరంబు లడరించుచు బహుబాణంబులు రేణు
వులు గాఁ జేయుచుండ సవ్యసాచిదివ్యాస్త్రవిలాసంబు భాసమానం బయ్యె
నయ్యవసరంబునఁ గాలుం డదృశ్యాకారంబున.

---

337 1. దంతవత్ప్రికాండ — క.ఖ. మూలమునందు 'వత్స దంత' అనియె యున్నది. "సాశ్వంతు కర్ణం సరథం కిరీటీ / సమీచినోద్భారత వత్సదంతైః".

340 1. బొలివోవని - కొన్ని ప్రతులు. 2. బిట్టుమెరుంగులు - ఈ.వ ; మింటమెరుంగులు — కొన్ని ప్రతులు. * కాలు డదృశ్యుడై కర్ణుని రథము క్రుంగిపోవుటయు నాతని మరణమును గూర్చి పల్కుట భండార్కరు మూలపాఠమున లేదు. పాదసూచి యందుకలదు.

## —: బ్రాహ్మణశాపంబునఁ గర్ణు రథచక్రంబు భూమిం గ్రుంగుట :—

సం. 8—66—42

341 క. భూసురశాపంబున నిదె
యీసూత[1]జురథముచక్రి మిలఁ [2]గ్రుంగెడు వీ
తాసుఁ డగు నీతఁ డని సే
నాసముదయయుగ్మకము వినం బలికె నృపా.

342 వ. పరశురాముద త్తం బయినభార్గవాస్త్రం బను పేరిటిమహానీయసాధనం బప్పుడు రాధేయునకుం బ్రతిభాసింప కుండె [1]డాపటికల్లు [2]గ్రుంగినఁ దేరు ఘూర్ణిల్లె నట్లుజామదగ్న్యమహీసురులశాపంబు లస్త్రబలంబునకు రథంబు నకు వైకల్యం బాపాదించి చిక్కువఱుచుటయును సర్వముఖశరం బాభంగి నిష్ఫ[3]లప్రయత్నం బగుటయును దనమనంబున [4]నొవ్వడరి యక్కర్ణుండు గరంబు[5]లు విదుర్చుచు.

343 తే. ధర్మవాదులు ధర్మతత్త్వప్రధాన
చిత్తు లగువారిఁ బూని రక్షించు ధర్మ
మందు రది బొంకుఁ గావించె నతులధర్మ
శీలుఁ డగు[1]నాకు ధర్మువు[2]సెలవు లేద.

344 క. అని ధర్మంబును దూఱఁగఁ
దను నర్జునుబాణవితతి [1]తద్దయు వడిఁ దాఁ
కినఁ గర్ణుండు విషాదం
బున వెండియుఁ బెద్ద దూఱు భూవరముఖ్యా.

---

341 1. తనూజు చక్రమిల – వీ.న. 2. గ్రుంకెడు – ప.ల.

342 1. దాపటికల్లు – పెక్కు ప్రతులు. 2. డించిన – కొన్ని ప్రతులు ; డిగ్గిన – ఊ ; డిందిన – స. 3. లం బైపోవుటకు – జ. 4. నొప్పియడరి – కొన్ని ప్రతులు ; నొప్ప డరి – వ.శ. 5. లువిదళించుచు – ఊ ; వగచుచు – ద.

343 1. నన్ను – పెక్కు ప్రతులు. 2. చెలిమిలేదు – జ.

344 1. దాకిన నొవ్వా (ప్పా) రి న కర్ణుడు – పెక్కు ప్రతులు.

345 క. కన లధిక[1]మైన లావె
క్కినయయ్యంగపతి నొంచెఁ గృష్ణార్జునులన్
సునిశిత[2]శరములు మఱియుం
జొనిపెను దనధైర్యమహిమ [3]సుర లగ్గింపన్.

346 వ. అలిగి యర్జునుం డాశీవిషంబులుం బోని[1]విశిఖంబు లాఱు కర్ణుమే[2]నుచ్చిచన నేసినం గ్రోధభాసితుం డై యతండు బ్రహ్మాస్త్రంబు ప్రయోగించుటయు నప్పార్థుం డైంద్రాస్త్రంబు ప్రయోగించిన.

347 క. అమితబలం బగుబ్రహ్మా
స్త్రముచే నయ్యస్త్ర మపహృతం బగుటయుఁ జి
త్తమున విషాదము దనుకఁగఁ
గమలాక్షుఁడు గారవమున గాండివితోడన్.

348 వ. నీయస్త్రం బిప్పుడు కర్ణాస్త్రంబుచే [1]విధ్వస్తంబయ్యె నిట్లు గా నేల యన వుడుఁ గవ్వడి బ్రహ్మాస్త్రప్రయోగంబున నమ్మహనీయసాధనంబు [2]బాధితంబు సేసి రాధేయాంగంబు బాణజాలంబులం బొదివి నొప్పించిన నమ్మేటి మగండు గాండీవంబు [3]మౌర్వికోటిఁ బాసి పో నేసిన నాసవ్యసాచి మగుడ నమర్చి మార్గణంబులు నిగిడించిన రయంబున నాసూతపుత్త్రుచూడ్కిక మ్మౌర్వి యూడుట దోఁప కుండె నవ్వీరుండు విన్వచ్చువిశిఖంబులు వారించి యతని తనువు నొంచిన వెండియుఁ బుండరీకాక్షుండు సహస్రాక్షనందను నుద్దేశించి.

349 క. నిను [1]నొంచువాఁడె కర్ణుం, డనితరసులభప్రకారమగుభుజవీర్యం
[2]బున [3]నసమానోజ్జ్వలఖే, లనమునఁ[4] దెగటార్చు శరవిలాస [5]నిరూఢా.

---

345 1. మగుడు — కొన్ని ప్రతులు. 2. శరంబు లురమున జొనిపెను - పెక్కు ప్రతులు; రయమున — ఇ.పౌ.ఘు.ట.ణ.వ. 3. సురలు నుతింపన్ — పెక్కు ప్రతులు.

346 1. శిలీముఖంబులు — ఊ.ణ.త. 2. గ్రుచ్చిపోవ — ఒ; నుచ్చిపోవ - కొన్ని ప్రతులు.

348 1. త నపహృతంబయ్యె — ఎ.గ.శ.[illegible]. 2. ప్రతిహతంబు — పీ.శ.ష. 3. గుణంబు - కొన్ని ప్రతులు.

349 1. నోర్చువాఁడె - ఘు.ణ.త.వ. 2. బనల సమానోజ్జ్వల, బనల ప్రభావోజ్జ్వ — అని పాఠములు. 3. లసమానోజ్జ్వల — ఐ.ఝ.శ. 4. బరిమార్చు - పెక్కు ప్రతులు. 5. ప్రౌఢిన్ — ణ; ప్రౌఢా - త.వ; నిరూఢిన్ — ఫ.న.స.

350 వ. అనునవ్వుడు విషవిస్ఫురద్భుజంగభంగికం బైనబాణంబు రౌద్రమంత్ర [1]సహితంబు సేసి కర్ణుండు పార్థుప్రాణంబులు గొన నప్పళించి సంధింప మున్ను కొండొకక్రుంగినచక్రంబు [2]కుండ మునుంగం దిగఁబడిన నొడ్డగెడ వై యరదం బేటునకు నను వీక తక్కిన నుక్కఱి యక్కర్ణుం డప్రతీకారంబు లగు రోషవి[3]షాదంబులఁ గన్నీ రొలుక [4]రథంబు డిగ్గి కవ్వడిదెసఁ గనుం గొనుచు నిట్లనియె.

351 సీ. అరదంబుచక్రంబు ధరఁ జాలఁ [1]గ్రుంగిన
[2]నె త్తెద నంతకు నేయ కుండు
మేను భూమిస్థుఁడ వీవు రథస్థుండ
విట్యోఁడఁ దగ వగు నేయ కునికి
[3]విరిదలవానిని విరథుని నాయుధం
బిడిన[4]వానిని శూరు లేయ[5] రెందు
[6]మహితశూరుఁడ వనుమాత్రగా దుత్తమ
కులుఁడవు రణధర్మకోవిదుండ
ఆ విట్టి నీవు దగినయట్టిభంగిన యని
సేయ వలయు నిట్లు సెప్పు టెల్ల
బాడి యేర్పడంగఁ బలుకుట గాని గో
విందునకును నీకు వెఱచి కాదు.

352 వ. అనిన విని యచ్యుతుం డతని కి ట్లనియె.

353 క. ఏమీ తగవును ధర్మము, నీమనమున[1] నేఁడ పుట్టెనే గర్వము ను
ద్దామదురభిమానము నే,లా మఱచితి కర్ణ యాచలం బెటఁవోయెఁ.

---

350 1. మహితంబు - కొన్ని ప్రతులు. 2. నిండ మునుంగం — అ.ఝ ; కుండు, గుండు - స. 3. కారంబున (ల) — కొన్ని ప్రతులు. 4. నత్తేరు — పెక్కు ప్రతులు.

351 1. గ్రుంగెను — కొన్ని ప్రతులు. 2. నె త్తెదు నంతకు — అ.ఊ.ఝ.ట. 3. విడిదల వానిని — కొన్ని ప్రతులు. 4. యోధుని - కొన్ని ప్రతులు. 5. రందుఱ — ఓ.త ద.వ. 6. మహిత — పెక్కు ప్రతులు ; మహిని - వా.శ.ష.

353 1. నేడు పుట్టెనే - పెక్కు ప్రతులు.

354 ఆ. పరమధర్మపరులు పాండుభూవల్లభ,సుతులు వారి నతుల శుభము [1]లొందు
ధర్మహీను లైనధార్తరాష్ట్రులకుఁ బాఁటిల్లు నివ్విధమున నెల్లచేటు.

355 వ. దీనికి నీవు [1]కటకటంబడినం బోవునే యని పలికి వెండియు.

356 సీ. గొంతియు నందఱు గొడుకులు సుప్తులై
యుండంగ లక్కయిల్ మండఁజేసి
కపటంపుజూదంబు [1]ఘటియించి ధర్మాత్ముఁ
డగుధర్మసుతుసిరి యపహరించి
యంతఁబోవక ద్రుపదాత్మజఁ దెచ్చి స
భాస్థలి నమ్మెయి భంగపఱచి
యమ్మహాత్ములఁ జంప నడవికి ఘోష యా
త్రావిధినెపమున దాడి వెట్టి

తే. బాలు నభిమన్యు నొక్కని బహురథికులఁ
బనిచి చంపించె మీసుయోధనుఁడు దలఁపఁ
గాని యిప్పాపముల కాదికర్త వీవ
యిన్ని యెడలను నీపాడి యెందుఁబోయె.

357 వ. అని యిట్లు కృష్ణుండు గర్ణు[1]తో నాడు[2]మాటలఁ దోడ్తోడం బెరిఁగిన యర్జు
నంజయుమనంబు రోషానలంబు రోమకూపంబులఁ బటుజ్వాలా[3]రూపం
బుల వెడలుట యతివిస్మయప్రదంబై యుండె నయ్యుగ్రమూర్తి సముదగ్ర
పరాక్రమంబునం గురియుపటుబాణాసారంబు వారించి యవ్వీరునంగం
బున నయ్యంగపతి నిశితాస్త్రంబులు నిగిడించుట మహాద్భుతం బయ్యెనత్తె

---

354 1. పొందు - కొన్ని ప్రతులు; పొదువ - ట.

355 1. సంకటబడినం - పెక్కు ప్రతులు.

356 1. కల్పించి - ఎ.గ.ణ ; గడియించి - ఘ.

357 1. దూలనాడు - వ. 2. వాక్యంబుల - కొన్ని ప్రతులు. 3. రూపంబున - కొన్ని

అంగున నీడంబోక పెనంగునతం డతిరయంబున నన్నరు[4]నిం బదిదొడ్డ నారసంబుల నొప్పించిన నత్తేజోధనుం డాజ్యధారాచ్ఛటాసేకంబున నుద్రేకంబు నొందినహుతవహుండునుం బోలె మండి శత్రు[5]సంతాపనం బును మిత్త్రోల్లాసనంబును బ్రగుణమణిజాంబూనదమయంబును జనప్రస్తుతి పాత్రంబును హాస్తికక్ష్యాత్మకంబును నగునతని కేతనంబును గనకపుంఖ పరిభాభాసితం బైనభల్లంబునఁ బడనేసినం గౌరవులు విజయశోబలదర్ప ప్రియంబుల మొత్తంబులు నడుటగాఁ దలంచుచు హాహాకారంబులతో నారాధేయునిదెస [6]నిరాశు లై రట్లు పరిస్ఫీత కేతుపాతనం బాచరించిన దానం గనలి కర్ణుం డతినిశితక్రూరనారాచజాలంబులు గృష్ణార్జునుల మీఁదం గురిసి వెగడుపఱచి యరదంబుపిఱిందికొమ్ముకిందికి [7]మూఁపు సొనిపి లావున నెత్తిన రథచక్రంబు విడువక భూమి గులపర్వతకానన సముద్రసహితం బాఅంగుళంబు లెగసె నట్లు [8]కర్ణుండు రథంబు నిలిపి కిఁదికిం జని యెప్పటిబాణంబు సంధింప వెండియుఁ జక్రంబు [9]క్రుంగినఁగ్రమ్మఱ రథంబు డిగ్గి యెత్త నమరె నయ్యవసరంబునఁ గృష్ణుపనుపునం గ్రీడి దోడన.

358 మ. కులిశప్రస్ఫురణాపహా[1]సనవిభాగుచ్ఛంబులం గల్గి యాఁ
కలిమై వచ్చుకృతాంతవక్త్రి మన నుగ్రం బై మురారాతిరు
ద్రుల చక్రంబును శూలముం దెగడుచుం గ్రూరంపు టొప్పారు నం
జలికం బైనమహాస్త్రముం దొడివి [2]కర్షం బుబ్బనం జేయుచున్.

359 క. ఏను దపశ్చరణంబున, దానంబున గురుజనాభితర్పణమున ని
త్యానూనవ్రతశీలుఁడ, నేనియుఁ గర్ణుతలఁ ద్రెంచు నీశర మనియెన్.

360 క. అని తెగ నిండఁ [1]దిగిచి యేసిన నయ్యస్త్రంబు రోదసీకుహరంబుం
దన మెఱుఁగుల నించుచు నిరు, మొనల జనుల గాఢమూర్ఛ[2]ముంచుచు నిగిడెన్

ప్రతులు. 4. ని తోంబది–ఏ. 5. సంతాపంబును–అ.ట.ణ.త.వ. 6. విగతాశు లైరి – ఇ.
7. మూపు సొనిపి – శ.ష. కొన్ని ప్రతులు. (అర్ధానుస్వారము లేని రూపము).
8. కర్ణుం డౌడుకరచుచు – జ. 9. దిగంబడిన – ఇ.ట ; డించిన – కొన్ని ప్రతులు.

358 1. సి పువిభాగుచ్ఛంబులం–వీ.స. సితవిభా–కొన్ని ప్రతులు. 2. యాకర్షంబునం(నుం)– ఊ.ఎ.ఓ.స.ణ.త.

360 1. దివిసి – అ.ఐ.ఒ.ఖ. 2. మునుగగ నిగిడెన్ – ఈ.ఔ.వ.

—: అర్జునప్రయుక్తం బగుఘోరశరంబున కర్ణశిరంబు ద్రుంచుట :—

సం. 8–67–24

361 చ. నినదసముద్భటస్ఫురణ నింగి వగుల్పఁగ సర్వభూతకం
పన [1]మగు చమ్మెయిన్ నిగిడి పార్థివ[2]సత్తమ యేమి సెప్పుదుం
దునిమె శిరంబు రక్తమునఁ దోఁగుఁచుఁ గర్ణునియట్ల వజ్రఘో
రనిహతిఁ గూలుగైరికధరాధరముం దలఁపిం[3]పఁ బట్టుగన్.

362 క. చరమగిరినుండి పడియెడు, తరణికరణి సూతపుత్రుతల వడఁ గాంతి
స్ఫురణోజ్జ్వలంబు నతిసుం,దరమును నగుకాయ మట్లు ధరణిం బడియెన్.

363 తే. అధిప [1]యంతన గను విచ్చి యఖిలజనులు
గనుఁగొనంగ నయ్యుజ్జ్వలతనువు విడిచి
చని [2]సముద్దీప్తమైనతేజంబు వారి
జాప్తబింబంబు సొచ్చె నత్యద్భుతముగ.

364 వ. అట్టియెడ.

365 క. వినుము మహీసురుశాపము, మనుజేంద్రా సూతపుత్రుమరణాంతం బై
యునికినొ రథచక్రము మే,దినిఁ గ్రుంగుట లేక తొంటి తెఱఁగున నుండెన్.

366 తే. దారు[1]ణాస్త్రజాలాంశుల వైరిసైన్య
తాప మొనరించి యాసూతతనయతరణి
పార్థదుస్తరకాలవైభవము గడవ
నను వు లేమి నవ్విధమున నస్తమించె.

---

361 1. మొనరించుచున్ — అ.ఆ.ప.ఐ.ఝ.ల. 2. కుంజర — ట. 3. చు చాడ్పునన్, చు నట్లుగన్ - అని పాఠములు.

363 1. యంతయు గంపించి — ఉ.న; యంతట గనువిచ్చి, యత్తరి గనువిచ్చి — అని పాఠములు. 2. యె సముదీప్తమైన — ఆ.ఝ; యు సము దీప్త — ఎ.గ.

366 1. ణప్రదరాంశుల — ఆ.ఐ.ఝ.ల.

367 క. సూతనూజుఁడు వడినం, బ్రీతిం బాంచాలు రార్వఁ బెల్లుగఁ దూర్య
వ్రాతంబు సెలఁగ సమ్మో, దాతిశయము వొందెఁ బాండవానీకంబుల్.

368 క. నిడుఁ[1]గేలుఁ బలుతొడలు,న్వెడఁదయురము నై రణావనిం గర్ణునొడల్
పడి యున్నఁ గని విషాదం, బడరి తొలఁగుమాడ్కిఁ గ్రుంకె నర్కుం డంతన్

369 తే. నిర్గతప్రాణు రాధేయు నిజకరములఁ
గరుణ పెంపున [1]నంటుట కారణముగఁ
బావనస్నాన మొనరింపఁ బోవు[2]నట్టు
లపరజలనిధిలోనికి నరిగె నినుఁడు.

370 వ. అప్పుడు.

371 తే. కామఁ బాసిన కమలంబుకరణిఁ బొలుచు
కర్ణుతల [1]యిలఁ బడియు నుదీర్ణకాంతి
నొప్పునట్టియుఁ జూచి శల్యుండు సిడము
[2]ద్రెస్సి మోడైన యరదంబు ద్రిప్పె నధిప.

372 క. బలితపువెస నాబోతుం, బులిగొనినం బసులు వాఱుపోలికిఁ గ్రోధో
జ్జ్వలుఁ డగుపార్థుఁడు గర్ణునిఁ, బొలియించిన నీదుసైన్యములు వెఱఁ బఱచెన్

373 తే. దీనవృత్తి శల్యుండు నీసేనజనులు, వట్లుపాంచాలు రుబ్బున నార్వ సిగ్గు
వడక పాండవమధ్యముసిడము మరలి, మరలిచూచుచుఁ బాఱిరి మనుజనాథ.

374 ఉ. గాండివముక్తబాణమునఁ గర్ణుఁడు గూలుటయుం [1]గడంగి శ
ల్యుం డరదంబు దోలుటయు నొక్కమొగిన్ భవదీయసేన లోం
డొండ కలంగి పాఱుటయు నుల్లసితుం డయి చూచివాయుపు
త్రుండు మహా[2]విరావమున రోదసి పిక్కటిలంగ నార్చినన్.

---

368 1. జేతులు - అ.ఐ.ఝ.ల.శ.ష.

369 1. నంటిన కారణమున - కొన్ని ప్రతులు. 2. కరణి నపర — ఐ.ట.త.వ.

371 1. యునుబడియు — ఎ.గ.జ.త.వ ; నేలబడియును దీర్ఘ—ట.వ ; పడియును సము దీర్ణ—ష. 2. ద్రెక్కమోడైన—ఎ.ఏ.క.వ ; దీసిమోడైన — అ.ఈ.ఝ. (కర్ణుని రథ ముసిడమును అర్జునుడు కూల్చెనేకాని శల్యుడు తానై తీసినట్లు లేదు.)

374 1. కడంగి - వ ; దలింకె — పెక్కు ప్రతులు. 2. నినాదమున - ఏ.ట.

—: అర్జునప్రయుక్తం బగుఘోరశరంబున కర్ణశిరంబు ద్రుంచుట :—

సం. 8_67_24

361 చ. నినదసముద్భటస్ఫురణ నింగి వగుల్పఁగ సర్వభూతకం
పన [1]మగు చమ్మొయిన్ నిగిడి పార్థివ[2]సత్తము యేమి సెప్పుదుం
దునిమె శిరంబు రక్తమునఁ దోఁగుచుఁ గర్ణునియట్ట వజ్రఘో
రనిహతిఁ గూలుగైరికధరాధరముం దలఁపిం[3]పఁ బట్టుగన్.

362 క. చరమగిరినుండి పడియెడు, తరణికరణి సూతపుత్రుతల వడఁ గాంతి
స్ఫురణోజ్జ్వలంబు నతిసుం,దరమును నగుకాయ మట్లు ధరణిం బడియెన్.

363 తే. అధిప [1]యంతన గను విచ్చి యఖిలజనులు
గనుఁగొనంగ నయ్యుజ్జ్వలతనువు విడిచి
చని [2]సముద్దీప్తమైనతేజంబు వారి
జాప్తబింబంబు సొచ్చె నత్యద్భుతముగ.

364 వ. అట్టియెడ.

365 క. వినుము మహీసురుశాపము, మను జేంద్రా సూతపుత్రుమరణాంతం బై
యునికినొ రథచక్రము మే,దినిఁ గ్రుంగుట లేక తొంటి తెఱఁగున నుండెన్.

366 తే. దారు[1]ణాస్త్రజాలాంశుల వైరిసైన్య
తాప మొనరించి యాసూతతనయతరణి
పార్థదుస్తరకాలవైభవము గడవ
నసువు లేమి నవ్విధమున నస్తమించె.

---

361 1. మొనరించుచున్ — అ.ఆ.ప.ఐ.ఝ.ల. 2. కుంజర — ట. 3. చు చాడ్పునన్, చు నట్లుగన్ — అని పాఠములు.

363 1. యంతయు గంపించి — ఉ.న; యంతట గనువిచ్చి, యత్తరి గనువిచ్చి — అని పాఠములు. 2. యె సముదీప్తమైన — ఆ.ఝ; యు సముదీప్త — ఎ.గ.

366 1. ణప్రదరాంశుల — ఆ.ఐ.ఝ.ల.

పాంచజన్య దేవదత్తంబులు పూరించిన నింగి వగుల్చు నమ్మ[3]హారవంబున గుండియ లవిసి కురుబలంబు లత్యంత వికలంబు[4] లయి వినిపాతిత రావణ నందనుఁ డగుసుమిత్రానందను సింహనాదంబున భయంబంది పఱచు దానవ సేనలచందంబున నీకొడు కున్న నెలవు విడిచి [5]వలియంబాఱిన వెలవెలం బాఱు నక్కురుపతితో నాళల్యుండు సంధ్యాసమయం బయ్యె నేఁటికిఁ గయ్యంబు [6]సాలింపుము [7]వేగుటయుఁ జేయవలయుకర్జంబు సూచికొంద మనియె నట్టియెడఁ గృపాశ్వత్థామ కృతవర్మ శకుని సుశర్మప్రభృతు లగు దొరలు పాండవజయంబునకు దైన్యంబునొందినయాననంబులతో నిశ్వాసం బులు నిగుడ నక్కురుపతిఁ జేరం జనుదెంచిన నతండు మూఁకల మరల్ప రామియు దొరల యుత్సాహవైకల్యంబును శల్యుమాటలతెఱంగు నూహించి మరలి కర్ణుం జేర్కొని విలాపంబుసేయుచు హాకర్ణ హాకర్ణ యను నెలుంగులతో బలంబులఁ దివియ నియమించిన దివిసి కౌరవులు దోడం జను దేర నిజశిబిరంబునకుం బోయె నప్పోవుట పాపజూదంబున నోడి పాండున్నప కుమారులు హాస్తినాపురంబు వెడలి యడవికిం బోవునప్పటిభంగి నైయుండె నయ్యవసరంబున.

381 చ. తనువులఁ గర్ణబాణము లుదాత్తగతిం జెలువొందఁ గౌరవుల్
కనుకనిఁ బాఱ శౌరియును గవ్వడియున్ వెలుఁగొంది రొక్కెడ
న్వినుత మరీచు[1]లై[2]పొడిచి నిర్భరసంతమసంబు నడ్గడం
జన నభిరామమూర్తు లగు[3]చంద్రుని సూర్యునిఁ బోల్పఁ బట్టుగన్.

382 వ. ఇట్లొప్పి యమ్మెఱుంగుటమ్ములు పెట్టికివైచి యొండొరులయాననంబు లాలోకించి రాత్రి[1]ముఖం బయ్యె విరోధుల వెనుకొనుటకు సమయంబు గాదని సంభాషణంబులు సేసి తమసేనలం [2]దివియ నియమించి.

అనియు పాఠములు. 3. హారావంబున — కొన్ని ప్రతులు. 4. లయిరావణ నంద నాంతకుఁడగు — కొన్ని ప్రతులు. 5. విరియంబాఱిరి — ఘ; కలయంబాఱిరి — ణ.త.వ. 6. సాలింతము — కొన్ని ప్రతులు. 7. వేగుటయు — పెక్కు ప్రతులలో లేదు; ఇట మీఁద వలయు కర్జంబు చేవు — ట.

381 1. కెపుచి — ఈ.ఙ.ప. 2. పొలిచి — వ; పొడమి — ఊ. 3. చంద్రుడు సూర్యుడు— పెక్కు ప్రతులు.

382 1. సమయం బయ్యె — అ.ఆ.ఐ.ఒ.ఝ. 2. దివియించి — కొన్ని ప్రతులు.

383 తే. బలునిఁ దెగటార్చి మరలు గోపతియు హరియుఁ
బోలెఁ గర్ణుని సమయించి లీల మెఱయ
మరలి రత్యంతమోదసంభరితు లగుచుఁ
గవ్వడియుఁ గృష్ణుఁడును బంధుగణము లలర.

384 వ. అప్పుడు దివ్యు లన్నరనారాయణుల ననేకప్రకారంబులం బ్రశంసించుచు నిజనివాసంబులకుం జనిరి పాండవసేనాజనంబులు సంతసంబునం దేలుచు ధనంజయుం [1]జెలంగి పొగడుచుం బోయి రివ్విధంబున జయంబునం బొంపిరివోవుచుఁ బాండవులు విడిదల కరిగి ధర్మనందనునగరిమొగసాలఁ జొచ్చి రట్టియెడ.

385 క. నెమ్మనఁ బాంచాలురు మును, మున్నా నృపు కడకు నేఁగి ముదితాత్ముం డై
యున్నయతనిఁ గని దీవన,ల న్నతులను సమ్మదానులాపములఁ దగన్.

386 వ. గారవించిరి వివ్వచ్చుండు వేగంబ యరదంబు డిగ్గిచని యజ్ఞనపతిచరణంబులకుఁ బ్రణతుం డైన నతం డెత్తి యాలింగనంబును [1]మూర్ధఘ్రాణంబును జేసె భీమ నకులసహదేవు లన్నరదేవోత్తమునకుఁ బ్రణమిల్లి పార్థుం గౌఁగిలించిరి కృష్ణసాత్యకు లప్పాండవాగ్రజునకు సవినయప్రణామంబు లాచరించిన నమ్మహీవరుం డత్యాదరంబున నభినందించె నప్పుడు కృష్ణుం డతని కిట్లనియె.

-: శ్రీకృష్ణుఁడు ధర్మరాజుతో సరససల్లాపంబు చేయుట :-

సం. 8–69–16

387 క. భువనము లన్నియు నొక్కటఁ
గవిసియుఁ గర్ణుఁ బరిమార్పఁగానోవునె భూ
ధవ భవదీయ క్రోధా
గ్నివిహతుఁడై [1]క్రాఁగెఁ గాక నిక్కం బరయన్.

---

384 1. జెలరేగి పొగడుచు – కొన్ని ప్రతులు.

386 1. మూర్ధ్నిఘ్రాణము – పెక్కుప్రతులు.

387 1. తుప్రింగె – ఎ.గ.వ.

388 ఆ. రథికవర్యుఁడైన రాధేయుఁబొలిసిన, [1]యపుడ యెల్లఁ బొలిసె నని తలంపు
కౌరవులకడంగె వైరంబు నీ కింక, నెదురులేదు [2]పృథివిఁ బొదలు మధిప.

389 చ. అన విని యమ్మురాంతకున కానృపుఁ డిట్లను నీవు చక్కఁ జూ
చిన సులభంబు శోభనము శ్రీధర నీదగుకూర్మికేను భా
జన [1]మఱి నాకు దుష్కరమె శత్రుజయంబు భవత్ప్రసాదజీ
[2]వనులము మాకు సంపద[3]లు వచ్చు నవశ్యము నింత నమ్ముదున్.

390 ఆ. అఖిలరక్షకుండ వగు[1]నీకు భక్తుల, మైనమమ్ముఁ గాచు టరుదె తలఁప
భయము నెవ్వగయును [2]బాసి నాకంటికి, నిదుర వచ్చు నేఁడు నీరజాక్ష

391 వ. అనవుడు నచ్యుతుండు.

392 చ. మనమునఁగూర్తు [1]గాన తగుమాటల నాకుఁ బ్రియం బొనర్చు టొ
ప్పును విను మీజయంబునకు భూవర యేను నిమిత్తమాత్ర మీ
యనుజులు నీమఱందులు మహోద్భుతవిక్రమశీలు రిట్టి ని
న్ను నొకఁడు పోర మార్కొనఁగ నూల్కొని రూపఱ కుండ నేర్చునే.

393 వ. అని యిట్లు మధురసల్లాపసౌఖ్యంబు నొంది ధర్మనందనుండు పొలికలను
సూచు వేడుక దనకుం బుట్టినఁ గృష్ణునితోడం జెప్పి యతం డనుమతి సేయం
గాలవాలంబులు దంతవర్ణంబులు నగురథ్యంబులఁ దనరథంబునఁ బూన్పించి
యారోహణంబు సేసి కరదీపికాసహస్రంబులు వెలుంగ సమస్తబంధుమిత్ర
[1]సోదరపరివృతుం డై యరుగునప్పుడు కృష్ణు నాలోకించి.

---

388 1. యప్పు డరయ పొలిసిరని — కొన్ని ప్రతులు; యపుడ యంత బొలిసి రని—ఎ.గ.జ. యపుడ యంత పొలిసె నని — ష. 2. పృథివి యేలు మధిప — అ.ఆ.ప.ఐ.ఝ.ల.

389 1. మగుటెంత దుష్కరమె — వ. 2. వనమున — కొన్ని ప్రతులు. 3. లవశ్యము వచ్చు నటంచు నమ్ముదున్ — న.శ.

390 1. నీవు - ఎ.ఏ.గ.వ.శ.ష. 2. బాసె — కొన్ని ప్రతులు.

392 1. గానఁదగ - పి.ష. (కాన. ద్రుతాంతముగా గ్రహించిరి); గాకతగు — ద,వ.శ.

393 1. పరిజన - కొన్ని ప్రతులు.

394 ఆ. సకలధరణివలయసామ్రాజ్య[1]మునకు నేఁ, డేను భర్త నైతి నెల్లపెంపు
గలిగి నీదు కరుణఁ గడిఁదిమగం డగు, పగతుఁ డశ్రమమునఁ [2]దెగుటఁ జేసి.

395 క. అని కీర్తించుచు నరుఁ గనుఁ, గొని యగ్గించుచు ముదంబు గూరినమదితోఁ
జని కర్ణుని[1]శిరమును ద, త్తనయులగాత్రములుఁ జూచె ధరణీనాథా.

396 వ. చూచి తన్నప్పుడు గ్రిమ్మఱ [1]జన్మించినవానిఁ గాఁ దలంచి యాపదలకుం
బాసి సంపదలకు భాజనం[2]బ నైతినని [3]యూఱడిల్లి యుల్లాసంబున మరలె
నిట్లు కర్ణసాగరంబు గడవ నీఁది పాండునందనులు పరమానందంబు నొంది
రని సంజయుండు ధృతరాష్ట్రునకుం జెప్పెనని జనమేజయునకు వైశం
పాయనుం డిట్లనియె.

397 చ. [1]అనలుఁడు భాస్కరుండును సుధాంశుఁడు నధ్వరసంప్రవర్తకుల్
వినుము నరేంద్ర యాక్రతువు విష్ణుమయం బిది నిర్వహించి ర
ర్జునుఁడును గర్ణుఁడున్ సమరరూపమునం దగ నీప్రబంధ మిం
పొనరఁ బఠించినన్ వినిన నొందు నరుం జిరసౌఖ్యసంపదల్.

398 వ. అనుటయు.

399 చ. ప్రకటమ[1]హార్దసౌరభపరాశరనందనవాక్యమంజరీ
పరికరసమర్చితా పరమపావననామ జగత్త్రయీవిధా
యక పరిరక్షక ప్రతిసమాహృతికారకచిత్తవృత్తిభా
వక భవబంధమోచన దివాకరచంద్రకృశానులోచనా.

---

394 1. పదమున కేను - ట. 2. పడుటఁజేసి — ఎ.జ.ద.

395 1. శరీరముద త్తన — కొన్ని ప్రతులు.

396 1. జనియించిన వానిగా-కొన్ని ప్రతులు. 2. బై తినని-కొన్ని ప్రతులు. 3. తలంచి-న.

397 1. ఈ పద్యమునకు మూలమైన శ్లోకము నందు పాఠభేదము కలదు. (అ) "మఖోహి విష్ణుర్భగవాన్ సనాతనః — వదంతి తచ్చాగ్న్యనిలేందు భానవః — చిత్రశాలాప్రతి-కర్ణ — 96 - 60. (ఆ) మఖోహి విష్ణుర్భగవాన్ సనాతనో వహంతి యం చాగ్న్యనిలేందు భానవః — కుంభకోణప్రతి — కర్ణ — 101-60. అనిలుడు — ఉ.ణ.త.వ. ఈ ఫలశ్రుతి శ్లోకములు భండార్కరు ప్రతియందు ప్రధాన పాఠమున లేవు. పాదసూచికలో నీయబడినవి.

399 1. హార్ద్ర — కొన్ని ప్రతులు.

400 క. వినతదురితనిరసనశుభ, జనన[1]కలా[2]కల్యచరణసంభావన పా
వనతటినీమాల్య సమ, స్తనిగమసంవేద్య పరమసంయమి హృద్యా.

401 మాలిని. కరణఫలపరిత్యాగవ్రతో[1]దాత్తచేతః
పరిణతసుఖ[2]పీఠభ్రాజమానా నతాంహో
నిరసన చర[3]ణాబ్జోన్నిద్రితారాజమానా
నిరవదిపరిణాహో నిర్భరానందదేహో.

## గ ద్య ము

ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన
విరాజి తిక్కనసోమయాజిప్రణీతంబైన శ్రీమహాభారతంబునఁ
గర్ణపర్వంబునందు సర్వంబును దృతీయాశ్వాసము.

---

400 1. సకలకల్పచరణ — వ. 2. కల్ప - కొన్ని ప్రతులు.

401 1. పాంత — ఎ.గ ; పాత్త — వ.శ.ష. 2. తా విభ్రాజ — ఐ.ఒ.క.ఖ.ఝ.ద,పి.శ.ష ; తాదిభ్రాజ — ల. 3. ణాబ్జానిద్రితా — అ.ఆ.శ.ష.

—):o:(—

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శల్యపర్వము - ప్రథమాశ్వాసము

→ ∩ ←

1 క. శ్రీ గిరిజా[1]సమవాయమ
హా[2]గురుతర[3]శుభగ సంప[4]దాలంబసదా
యోగిజన [5]క్షేమ[6]సమీ
హా[7]గర్భితదివ్యచిత్త హరిహరనాథా.

2 క. దేవా జనమేజయధా
త్రీ[1]వల్లభుఁ డుత్సుక[2]త్వరేఖా[3]సౌమ్య
శ్రీవిలసితుఁ డై యిట్లనుఁ
దా వైశంపాయనున కు[4]దాత్తవినీతిన్.

3 క. దురమున [1]నమ్మోయిఁ గర్ణుఁడు
పరిమార్పంబడిన నల్పపరిజనుఁ డై య
క్కురుపతి [2]యజయ్యు లగున
య్యరులయెడం బిదప [3]నెట్టు లయ్యె మునీంద్రా.

---

1 1. సమపాయ, సదుపాయ — అని పాఠములు. 2. గురుతాశుభ — పెక్కు ప్రతులు. 3. నిత్యపదా — ట; నుపవసం — ఆ.త. 4. దాలంబ్య - శ. 5. ధ్యేయ — ట.వ. 6. సమోహా - ఘ. 7. గర్విత - బ.వ.

2 1. వరణుండు - చ. 2. త్వరితా — గ. 3. సామ్యా, రమ్య, విభవ, సమ్యక్ - అని పాఠములు. 4. దాత్తప్రీతిన్ — ఆ.ఈ.ఊ.త.బ.వ; దాత్తవిభూతిన్ — ఖ.

3 1. నిమ్మోయి — కొన్ని ప్రతులు. 2. కజయ్యు — అ. 3. నెట్టిద, నెట్టిడ - నెట్టివా డయ్యెదగన్ — అని పాఠములు.

4 తే. [1]ఏను మును విన్న యక్కౌరవేంద్రపాండు
విభుతనూజులచరితంబు వేడ్కఁ [2]బెంచెఁ
జెవులతియ్యంబు దళుకొత్తఁ జెప్ప మనఘ
వారి కైన యనంతర[3]వర్తనంబు.

5 వ. అని యడిగిన వైశంపాయనుం డమ్మహీనాయకున కిట్లనియె నట్లు కర్ణుండు దెగిన దుర్యోధనుండు హతావశిష్టవసుధావరులు పరివేష్టింపం గొంచెపు మూఁకలతోడ విడిదలకుం జని సుహృజ్జనంబులు దేర్ప విషాదం[1]బుడిచి [2]సముత్సాహదోహలి యై శల్యునిం [3]దనకు సేనాపతిఁ గావించి వేగుటయు [4]బలుపు బొలుపును వెలయఁ [5]బొలికలనికి నడచెఁ బాండవేయులును [6]బలంబుతోడం బన్ని యేతెంచిన [7]నయ్యిరువాఁగునకు సురాసురసమరంబునుం బోనిసంగ్రామం బయ్యె [8]నంతమధ్యాహ్నంబున నమ్మద్రపతి యుధిష్ఠిరుపరాక్రమంబునం దెగియెఁ బదంపడి తన[9]భటులుం జెలులుఁ జుట్టంబులును సమసిన నుక్కుదక్కి యక్కురువిభుం డనిపని సాలించి [10]వెఱం బొందెడుడెందంబుతో నొక్కరుండునుం దొలంగం బాఱి యొక్కమడువు సొచ్చి [11]దాఁగి యుండె [12]నట గెలుపునుబ్బునం బొంపిరివోవు పాండవేయు లతం డందునికి యెఱింగి యయ్యెడకు నరిగి [13]నలిరేఁగి చుట్టుముట్టి పిలిచిన వెడలి వడముడి[14]తోడిపెనంకువం బెద్దయుం బ్రొద్దు పెనంగి యాభూనాథుండును బ్రొద్దు సాల వాలినప్పుడు భీముగదాఘాతంబునఁ దొడలు విఱిగి పడియె నంత నిశాసమయంబున నశ్వత్థామ

---

4 1. ఏము — వ. 2. బెనిచె — పెక్కు ప్రతులు ; గదుర, జేసె, జేసి — అని పాఠములు. 3. వర్తనములు — ఘ.

5 1. బుడిగి-వా ; బువిడిచి పెక్కు ప్రతులు. 2. సముత్సాహ-వ ; సమరసముత్సాహ-ఏ. 3. తనకు — కొన్ని ప్రతులలో లేదు. 4. బలువునుం బొలుపును — కొన్ని ప్రతులు. 5. బోరి — ఈ.ఉ.ఏ.ఐ. 6. బలంబుతోడం — పెక్కు ప్రతులలో లేదు. 7. నయ్యిరువాగునకు — కొన్ని ప్రతులలో లేదు ; నమరాసుర — కొన్ని ప్రతులు. 8. నంత — కొన్ని ప్రతులలో లేదు. 9. బంట్లు — ఈ.గ.త.వ ; బంధులు — ఉ.ఎ.ట ; తన భటులుం — కొన్ని ప్రతులు. 10. వెరగు బొందు — ఖ. 11. డాగి - ఆ.ఓ. 12. నట — పెక్కు ప్రతులలో లేదు. 13. నలిరేగి - కొన్ని ప్రతులలో లేదు. 14. తో పెనంకువం -

కృపకృత[15]వర్మలు దనకుం [16]దోడుగా ధర్మనందనస్కంధావారంబుఁ [17]బొదివి పాంచాల[18]ప్రభద్రక మాత్స్యప్రభృతి శేష[19]సైన్యంబుల [20]సమయించె మఱునాఁడు సంజయుండు కురుక్షేత్రంబుననుండి పూర్వాహ్ణంబునఁ గరినగరంబున కరుగుదెంచి.

6 చ. పొరిఁబొరి మోము బాష్పజలపూరము [1]గ్రమ్మఁగ నూర్ధ్వబాహుఁడై
చరణయుగంబు దొట్రువడ [2]సంభృతశోకత రాజవీథి నె
వ్వరిఁ గని యైన హామహిత[3]వైభవ హాధృతరాష్ట్రపుత్ర హా
కరిపురనాథ యం చెలుఁగు గద్గదికం దగులంగ నేడ్చుచున్.

7 క. జననయనచకోరానం
దనుఁ [1]డగునృపచంద్రుఁ డనుచితం బయినవిధం
బున నస్తమించె నంచుం
[2]దనుడోలన[3]భరితభూరిదైన్యం డగుచున్.

8 వ. చని ధృత[1]రాష్ట్రమందిరంబు ప్రవేశించి లోపలికొలువున గాంధారి[2]యుం గోడండ్రును విదురుఁడును [3]మఱియును దగుచుట్టంబులునుం [4]బరివేష్టింపఁ గర్ణులేమికిఁ [5]బ్రేముడించుపలుకులు సెల్ల నుల్లంబు దురపిల్ల నున్న యన్నరనాథుం గని డగ్గుత్తిక [6]వెట్టుచుఁ దనపేరు సెప్పికొని చేరి [7]పాదప్రణామం బాచరించి యేడ్పు[8]బెరయ నెలుంగుతో నిట్లనియె.

---

ఇ.జ.ట; తోడి బె (పె) నుకువ — ఎ.ఓ.క.గ. 15. వర్మలు — కొన్ని ప్రతులు. 16. దోడుగా — కొన్ని ప్రతులలో లేదు. 17. నడు రేయి సొచ్చి పొదివి — అ.ఫ. 18. ప్రకటప్ర — ఇ; ప్రకరప్ర — కొన్ని ప్రతులు. 19. సముదయంబు — ఆ. 20. సమయించిరి — పెక్కు ప్రతులు.

6 1. గప్పంగ — ఊ.ఎ. 2. సంవృత — చ. 3. వల్లభ — త.

7 1. డానృప — చ. 2. దనలోనన — పెక్కు ప్రతులు. 3. భూరిభరిత — ఉ.ఐ.గ.చ.

8 1. రాష్ట్రుని మందిరం — ఇ.ఐ.గ. 2. ప్రముఖ దేవీజనంబును, కోడండ్రును — ఫ. 3. మరియుం దగిన — ఆ వ. 4. గొలిచి యుండగ — అ; గొలిచి యుండ — ఫ. 5. బ్రేముడించుచు నప్పలుకులు — ఎ. 6. వడుచుం — పెక్కుప్రతులు. 7. యతని పాదంబులపయిం బడి యేడ్చుచు — ఫ. 8. బెరయ నిట్ల — పెక్కు ప్రతులు; నెలుంగు డగ్గుత్తిక నిట్ల — ఫ; నెలుంగు గద్గదిక పడ నిట్ల — అ.

9 సీ. జననాథ శల్యుండు సమసె సౌబలుఁడు గీ
టడఁగె నులూకుండు మడిసె సకల
సంశప్తకులు గడచనిరి కాంభోజ [1]శ
తానీకములు దెగటాఱె యవన
[2]పార్వతీయమ్లేచ్ఛబలములు ద్రుంగె నల్
దిక్కుల మన్నీ[3]లుఁ దక్కుఁగలుగు
నరనాయకులును జచ్చిరి [4]కుమారులు గల
యందఱుఁ దెగిరి కర్ణాత్మజులును
తే. బొలిసి [5]రయ్యా వృకోదరుపలుకు దప్ప
కుండఁ [6]దద్గదాదండప్రచండనిహతి
రెండుదొడలును విఱిగి ధరిత్రిఁ [7]బెలుచఁ
గూలి రూపఱి [8]రారాజు ధూళిఁద్రుంగె.

10 వ. మఱియు ధృష్టద్యుమ్నుండును శిఖండియు నుత్తమౌజుండును యుధామన్యుండును లోనుగాఁ [1]గలపాంచాలురును జేదిమాత్స్యప్రభద్రకప్రభృతిబలంబులు లోనుగా [2]నవశిష్టజనంబులును నీమనుమలైనప్రతివింధ్యాది ద్రౌపదేయులును సకలరథసామజఘోటకసుభటసమేతంబుగా మృతిఁ బొందిరిట్లు కౌరవశిబిరంబును బాండవస్కంధావారంబును విధివశంబున [3]వనితావశేషంబు లయ్యె నిందుఁ గృప[4]కృతవర్మలు నశ్వత్థామయుఁగా మువ్వురును నందుఁ బాండవు లేవురును గృష్ణ[5]సాత్యకులుగా నేడ్వురును భవత్సుతుండయిన యుయుత్సుండును శేషించి [6]రివ్విధంబునఁ [7]బదునొకండు నేడక్షౌహిణులు నఖిలక్షోణికి దుర్యోధను నధిపుఁ [8]గావింపనుం జంపనుం

---

9 1. శతానీకులునుం – ఇ. 2. పార్వతేయులు – చ.ట; పారశీయ – శ. 3. లు నుక్కు – శ.ష. 4. కుమాళ్లు, గుమాళులు, గుమారులు – అని పాఠములు. 5. రంత – ఆ.త. 6. ననిలోనదగ్గదాఘండ – అ. 7. యందు – ఏ. 8. కురురాజు – ఖ.

10 1. గలుగు – ఎ. 2. గలయవశిష్ట – కొన్ని ప్రతులు. 3. నిరవశేషంబు – పెక్కు ప్రతులు. 4. కృతవర్మాశ్వత్థామయు – పెక్కు ప్రతులు; కృతవర్మాశ్వత్థామలు – కొన్ని ప్రతులు. 5. సాత్యకులునుంగా – పెక్కు ప్రతులు. 6. వినుమివ్విధంబు – కొన్ని ప్రతులు. 7. పదనకొండు – పెక్కు ప్రతులు. 8. గావింపంజంప – ఆ.ఐ.

[9]బూను కాలం బగుటయు నాలంబున నిశ్శేషత్వంబు [10]నొందె నని చెప్ప టయు నమ్మహీపతి మూర్ఛిల్లె విదురుండును వివశుం డై యొఱగె గాంధారి[11]యుఁ గోడండ్రును జెయ్యేది పుడమిం బడిరి తక్కటిచుట్టంబులు [12]మొగంబులు మొగుడం జిత్రరూపంబు చందం బైరి సంజయప్రయత్నంబున నందఱుం [13]గ్రమంబునం దేఱి రప్పుడు మేను వడంక నమ్మానవనాథుండు నలుదిక్కులకు మొగంబు ద్రిప్పి విదురు నుద్దేశించి పుత్రహీనుండ ననాథుండ నగుటయె ఱింగితిఁ దమ్ముండ యిటమీఁద నీవ నాకు గతి యగు మనుచు మగుడ నిగుడుమూర్ఛాతిశయంబునం బరవశుం డయిన నతండును [14]నారీజనంబును [15]శీతాంబు సేచనంబుల[16]ను లలితవ్యజనవీజనంబులను [17]గొండొక సేపునకు సేదదేర్చినం గూర్చుండి యక్కురువిభుండు గుంభినిక్షిప్తభుజంగంబుచందంబున నిశ్వాసంబు [18]నిగుడ్చుచు నూరకున్నంగనుంగొని [19]యక్కాంతాసముదయంబును సంజయుండును రోదనంబు సేసిరి పదంపడి యవ్విచిత్రవీర్య[20]నందనుండు.

11 ఆ. అనఘు వశము గాదు [1]మనసు గోడండ్రమి
వదిసెఁ జుట్టములను సదనములకుఁ
బుచ్చు మనియెఁ బలుకు [2]లచ్చుపాటడఁచు గ
ద్గదిక దైన్యమెసఁగ విదురుతోడ.

12 క. [1]అనుటయు నాతం డందఱ
కును [2]మెలపునఁ జెప్ప వగలఁ గుందుచు నల్ల
ల్లన [3]తమనిలయంబులకును
జనిరి మఱియు నేడ్చుచుండె సంజయుఁ [4]డలఁతన్.

---

9. బూని – పెక్కు ప్రతులు. 10. నొందిరని, బొందిరని, వొందిరని – అనిపాఠములు. ప్రముఖ దేవీనివహంబులును, గోడండ్రునుచెయ్యేది – ఆ.ప. 12. మనంబులు – పెక్కు ప్రతులు. 13. గ్రమంబున – కొన్ని ప్రతులలో లేదు 14. నారీజనంబును – కొన్ని ప్రతులలో లేదు. 15. శీతల జల–పి.శ.ప. 16. నుల్లసిత–త.వ. 17. పెద్దసేపు – ఆ.ఇ. కొన్ని ప్రతులు. 18. నిగుడించుచు – కొన్ని ప్రతులు. 19. యక్కాంతలును సంజయుండును – పెక్కు ప్రతులు. 20. తనయుండు – చ.

11 1. మనము – పెక్కు ప్రతులు. 2. నచ్చు – పెక్కు ప్రతులు.

12 1. అనిన విని యాతడం – వ పెక్కు ప్రతులు. 2. మెలుపున, మెలువున – అని పాఠములు. 3. తమతమ నిలయములకు – కొన్ని ప్రతులు. 4. డడలన్, డంతన్ – అని పాఠములు.

13 వ. అమ్మేదినీశ్వరుం డేది గతి యని దుఃఖాతిశయంబునఁ జేతులు విదిర్చి యా [1]సూతనందనుదిక్కు మొగం బయి.

14 క. చావరు నొవ్వరు పాండవు
లేవురు నని నీవు చెప్ప నిప్పలుకులు దుః
ఖావేశకరము లై చే
తోవృత్తి దహింపఁ జొచ్చె దుర్భరభంగిన్.

15 క. తనయు లని నందఱుం బడి
రనఁగా విని పెక్కు[1]పఱియ లై పోవక యి
ట్లునికి యరయ వజ్రమయం
బని [2]తలఁపఁగఁ దగుమదీయ మగుహృదయంబున్.

16 ఉ. కన్నులు [1]చీకు లై సుతనికాయము [2]బాలవిహారలీలలుం
జెన్నగుప్రాయ మొంది విలసిల్లుతెఱంగును జూడఁ గాన కి
ట్లున్నను బంధుకోటి సమయోచిత[3]లాలనఁ బల్కుపల్కులన్
విన్నవి వీను లిప్డు గొఱవిం [4]దముఁ జూఁడినయట్లు పొక్కెడిన్.

17 వ. అని దుర్యోధను నుద్దేశించి.

18 సీ. ఇట రమ్ము నన్నుఁ గౌఁగిటఁ జేర్చు కొడుక మీ
యమ్మనూరార్వురావయ్య వృద్ధు
లగుమమ్ము విడుచుట [1]దగునె యేగతిఁ బోవు
వారము [2]చెప్పుము కౌరవేంద్ర
యంధత్వవికలుల నరయక యిట్లుపే
క్షించితి [3]నామీఁదఁ గృపయుఁ బ్రియము

---

13 1. సూతు — వా. కొన్ని ప్రతులు; సూత — కొన్ని ప్రతులు.

15 1. వ్రయ్యలై పోవ — ఇ. 2. తలపుదు — ల; తలపందగు — వ. కొన్ని ప్రతులు.

16 1. చీకుచీకులయి — శర. 2. బాల్య — ఐ. 3. వేళల — ఉ.వ. 4. గొని — ఐ.గ.ట.వ; వెస — పి.శ.ష.

18 1. తగవె — ఇ.చ. 2. చెప్పుమా — ల. కొన్ని ప్రతులు. 3. నామీది — పెక్కు ప్రతులు.

నెక్కడ వోయె భూమీశులు గొలువంగ
నుండు [4]దీవ ట్లొంటి నున్న వాఁడ

తే. వధికబలదుర్నివారుండ వైననీకుఁ
బాండుపుత్రులచేత నప్పాటఁ జావు
వచ్చె నిచ్చలు భక్తిమై వచ్చి [5]కొలిచి
[6]గారవింప నిం కెవ్వరు గలరు నాకు.

19 వ. కయ్యంపుమాట పుట్టినయప్పుడు నీవు నాతోడ

20 శా. చాపాచార్యుఁడు భీష్ముఁడుం గృపుఁడు నశ్వత్థామయుం గల్గ నా
కీపాండుక్షితిపాల[1]పుత్రు లెదు రిం కెవ్వాఁడు [2]దృప్యద్భుజా
[3]వ్యాపారుం డనిఁ గర్ణుఁ [4]డొక్కరుఁడు మాయం జేయు [5]మద్బాణవి
ద్యాపారీణత [6]గెల్తు [7]నొక్కఁడన యే నయ్యేవురన్ బ్రేల్మిడిన్.

21 తే. మున్ను చెప్పిన[1]వారు [2]గా కెన్నఁ గలరు
సుమ్ము బాహ్లిక భగదత్త సోమదత్త
శకుని భూరి[3]శ్రవ శ్శల శల్య సింధు
రాజ విందానువిందాదిరథికవరులు.

22 క. ఏనును [1]గర్ణుఁడు దమ్ములు
నా నలువురు [2]వీరు లైన నటు సూడు పృథా
సూనుల [3]నెట్ల జయించెద
నో నమ్ముము [4]నా బలంబును గలితనంబున్.

---

4. నీవిటు నెట్లు – వ. కొన్ని ప్రతులు. 5. నిలిచి – అ. 6. గారవింపగ నెవ్వరు – ఈ.ఎ.త.వ.వీ.శ.ష.

20 1. పుత్రకులలోనం-గ ; పుత్ర కులయం-బ. 2. దీవ్యద్భుజా-ఇ.ఎ.ఖ.గ ; దీప్యద్భుజా-వ. 3. వ్యాపారుండగు – ఆ.ఈ.ఓ.ఔ.ట.త.ద.న.వ. 4. డొక్కరుడ – కొన్ని ప్రతులు. 5. దద్బాణ – కొన్ని ప్రతులు. 6. గెల్చు – ఐ.గ. 7. నొక్కరుడనే – ఈ.ఉ.ఓ.ఔ. కొన్ని ప్రతులు.

21 1. వార కారెన్న – గ. 2. నా కెన్న – ఎ.వ. 3. శ్రవసుశర్మ – అ.ఏ ; శ్రవ ప్రభృతి – ఒ ; శ్రవకళింగ – శ ; శ్రవసుల – ల.

22 1. దమ్ములు (డు) గర్ణుడు – పెక్కు ప్రతులు. 2. ధీరులయిన – ఉ. 3. నెట్లు – పెక్కు ప్రతులు. 4. నాదు నేర్పునుం గలితనమున్ – ఖ.

23 క. అని యమజుఁ డిట్లఁ బలికిన
విని భవదీయానివార్యవిక్రమమునఁ బాం
డు[1]నరేంద్రసుతులు దెగుదుర
యని తలఁచితి [2]నీవె తెగితె యవ్వీరులచేన్.

24 క. అమరనదీ[1]తనయుఁడు సిం
హము గాక నరుండె పార్థుఁ డట్టిమహాత్మున్
[2]సమయించె [3]నట్లు జంబుక
సముని శిఖండిఁ గొని విధి కసాధ్యము గలదే.

25 చ. శరగురుఁ [1]డట్టియోధుఁ డడఁగె చచ్చె ననిన్ [2]దొర గానివానిచే
వెరవున లావునన్ [3]జనులు వెక్కసమందఁగఁ జేయుసింధుభూ
వరుఁ డడఁగె రిత్త వోయె ననివార్యుల బాహ్లిక సోమదత్తులం
బరు లవలీలఁ జంపి రడఁగె పల్కుడు నేమని [4]యేను దైవమున్.

26 క. [1]నీనమ్మినభూరిశ్రవుఁ
డేనిక [2]లావతఁడు నెందు నెనలేని మగం
డైనభగదత్తుఁడును వ
మ్మైన[3]తెఱం గట్టె యేమి యందుఁ గుమారా.

27 ఉ. నచ్చినకర్ణువిక్రమమునం బరవీరులయం దొకండునుం
జచ్చుట లేదు [1]దుర్దమము [2]శల్యభుజావిభవంబు లోకముల్
మెచ్చినయట్టి [3]దండు నొక మేలు వినంబడ దమ్మహాత్ములన్
ముచ్చులఁ జంపి[4]నట్టులు పరుల్ [5]దెగటార్చిరి దైవ మిచ్చినన్.

---

23 1. సుత ప్రతులు — ఎ. 2. నీవెదెగితెయనివారలచేన్ — వ.వీ.శ.ష ; నీవుదెగితె — పెక్కుప్రతులు.

24 1. సూనుడు — వ. కొన్ని ప్రతులు. 2. సమయించు — ఘ. 3. నెట్లు — వ.

25 1. నట్టి — చ.వ. 2. కొర — ఇ ఘ.ప.వ. 3. బరులు, జెలులు, జలము — అని పాఠములు. 4. నేడు — అ ; నేను — ఖ.ఘ.వ.

26 1. నానమ్మిన — శ. 2. బలశాలి యతని కెన లేని — వ. 3. తెఱంగెట్లదేమి — వీ.శ.ష ; తెరగులిట్టివేమి — ల. కొన్ని ప్రతులు.

27 1. యుద్ధమున — అ.ఏ. 2. శల్యు — పెక్కుప్రతులు. 3. దండురొక — ఈ.ష ; దండ్రునొక — వ. కొన్ని ప్రతులు. 4. న ట్లరిసమూహము సంపెను (8) — వ. కొన్ని ప్రతులు. 5. పరుద్దెగ దీర్చిరి — శ.

28 తే. [1]కొడుక తమ్ములు దోడ్పడఁ[2]గడఁగి శత్రు
వరుల [3]గెలిచెద నంటివో క్కరుఁడు దక్క
కుండ నీతమ్ముఁగుఱ్ఱల నూఁచముట్టు
గొనియె [4]నే విధి యేగతిఁ జనుడుఁ జెపుమ.

29 క. కదిసి పవనజుఁడు బెట్టుగ
గద [1]వ్రేసినఁ దొడలు విఱిగి కయ్యపు నేలన్
మద మఱి పడి[2]నప్పుడు నీ
మది నే మని తలఁచితో కుమార యెఱుంగన్.

30 వ. అని పెక్కు[1]భంగుల విలపించి.

31 చ. తలఁపఁగ భాగ్యవంతుల కుదాత్తశుభం బగుఁ గాక పుత్త్రహీ
నుల కది గల్గ నేర్చునె తనూభవు లాఱడిఁ బోయి రింకఁ గా
నలఁ జరియింపఁ [1]బోవుటయ నా కుచితం బటు గాక చండి నై
నిలిచితి నేని [2]మాటలనె నిచ్చలు భీముఁడు [3]చూఁడుచుండఁడే.

32 క. విను దుర్యోధన[1]దుశ్శా
సనులఁ [2]బలికి పలికి నిచ్చ చావుగ నప్పా
వని [3]యలఁచుఁ గాన నడవికిఁ
జనుటయు మేలైన తెఱఁగు సంజయ నాకున్.

33 వ. అని [1]పలికి యత్యంతదుఃఖదూషితస్వాంతుం డగుచు నమ్మహీకాంతుండు నిట్టూర్పు [2]నిగిడించి యా సూతనందనున కి ట్లనియె.

---

28 1. కొడుకు — ఘ.చ.ల. 2. దొడగి — క.జ. 3. గెల్చె — పెక్కు ప్రతులు. 4. విధియింక నేగతిజనుదు చెపుమ — ఓ.ఘ.ల.శ.

29 1. వైచిన — అ.ప. 2. యప్పుడు — కొన్ని ప్రతులు.

30 1. భంగులం బలవించి — కొన్ని ప్రతులు.

31 1. బోవుటయె — క.గ.చ ; బోవుటలు — శ. 2. మాటలను — పెక్కు ప్రతులు. 3. సూడు — కొన్ని ప్రతులు. సూడకుండునే — ఉ ; చూడు చుండెడిన్ — శ.ష.

32 1. దుశ్శాసనకర్ణులఁ బలుకునట్లు సంతతమును బా — శ. 2. దలచి తలచి — చ. 3. నెరుగకుండ — చ.

33 1. బల్కియత్యంతరంబునకుంజని — త. 2. నిగుడించి — పెక్కు ప్రతులు.

34 క. సురసరిదాత్మజుఁడును శర
గురుఁడును గర్ణుండుఁ దెగుటకుం దలఁకక యు
ర్వరిబాహుబలము గొని [1]యే
మరి కొత్తలు [2]నేసి రొక్కొ మనవారనికిన్.

35 వ, అని తన[1]కొడుకుచలం బూహించి.

36 చ. మును విదురుండు సెప్పె నతిమూర్ఖమనో[1]గతి యైనయీసుయో
ధనుచరితంబు [2]గీ డఖిల[3]ధాత్రిజనంబుల[4]కుం బొనర్చు నా
శన మని [5]దానిఁ గొంద అవిచారులు పాటిగఁ [6]బట్ట రైరి నా
కును మది వారి[7]కెట్లటుల కుత్సిత మయ్యె విధాత్రిప్పునన్.

37 క. అప్పు [1]డటు లతఁడు సెప్పఁగఁ
దప్పఁ దలంచినఫలంబు [2]దగఁ గుడువక[3]పోఁ
జొప్పడునె సూతనందన
చెప్పు మనికి నెవ్వఁ [4]డమరు సేనాపతియై.

38 చ. దురమున నర్జున[1]ప్రకటదోర్విభవంబు నెదుర్పఁ [2]జాలు ను
ద్ధురుఁ డొకరుండు గల్గెనె విధూతవిరోధిబలుండు శల్యుఁ డె
వ్వరిభుజశక్తిఁ [3]జిక్కెఁ గురువర్గము సంతయ [4]మట్లు సెల్ల దు
స్తర[5]బలశాలిభీమునిగదం బడియెం గురుముఖ్యుఁ డెమ్మెయిన్.

---

34 1. క్రమ్మర — అ.ఇ.ఔ.క.గ.జ.న.వ. 2. చే(సే)సిరొక్కొ—కొన్ని ప్రతులు.

35 1. కొడుకుల చందం — ద

36 1. గతుడైన — వ. 2. ముందఖిల — చ. 3. ధాత్రికివీడొకరుండొ. — చ. 4. కునొనర్చు — అ ఆ.ఎ. కొన్ని ప్రతులు. 5. వారి, వాని, దాన — అని పాఠములు. 6. బల్కు — త. 7. కెట్టులటులు — ఉ; కెట్టులటు (ట) — ఔ.న.ల.

37 1. డతడట్లు సెప్పగ — అ.ఒ.ఖ.ద. కొన్ని ప్రతులు; డితడ (డి) ట్లు — కొన్ని ప్రతులు. 2. దాగుడువ — ఐగ. 3. దా (తా) వ. 4. డమరె — పెక్కు ప్రతులు.

38 1. ప్రకర — ఇ.ఉ. 2. బోలును — ద. 3. గూలె — ఐ. 4. మెట్లుసెల్లె — పెక్కు ప్రతులు. 5. జయశాలి — వ; బలశాలి — అ.వ; జయభాసి — వ; బలశోభి — శ.ప.

39 వ. కృపకృతవర్మాశ్వత్థామ [1]లెబ్భంగి బ్రతికిరి ధృష్టద్యుమ్నశిఖండి ప్రముఖ పాంచాలురును [2]చేదిమాత్స్యప్రభద్రకప్రభృతిబలంబులును నామనుమ లైన ప్రతివింధ్యాదిద్రౌపదేయులును దక్కనుం [3]గలుగుయోధవీరులు [4]నెవ్విధంబున మృతిఁ బొందిరి పాండవు లేవురును [5]బద్మనాభసాత్యకులును యుయుత్సుండును నెత్తెఱంగునఁ దెగటాఱక [6]తప్పి [7]రింతయుఁ [8]బరిపాటిఁ [9]దేటపడం జెప్పు మనిన విని [10]సంజయుండు ధృతరాష్ట్రున కిట్లనియె.

40 ఉ. సూతసుతుండుఁ [1]జేయఁ గలశూరులు దర్పసమగ్రభూపతి
[2]వ్రాతముఁ బెక్కుదంతిరథవాజిభటావలులుం భుజాబల
స్ఫీతులు పాండునందనులచేఁ దెగటారిన నోడి వీటికిన్
నీతనయుండు హీనరథినీయుతుఁ డై [3]యటు లేఁగి నెవ్వగన్.

—: కృపాచార్యుఁడు దుర్యోధనునకు హితోపదేశంబు చేయుట :—

సం. 9-3-8

41 వ. మందిరంబుఁ [1]బ్రవేశింపక యొక్కబయల నిఖిలబంధుమిత్ర [2]పరిజనవృతుం డై నిలిచె నయ్యవసరంబునఁ గృపార్ద్రచిత్తుం డై కృపాచార్యుం డన్నరేంద్రున కిట్లనియె.

42 క. సమరము మీముబోంట్లకు ను
త్తమ[1]ధర్మం [2]బదియ తొంటిధాత్రీశులు కృ

---

39 1. లేమి భంగి – పెక్కు ప్రతులు. 2. చేదిమాత్స్య .... నామనుమలైన – పెక్కు ప్రతులలో లేదు. 3. గలయోధులు – పెక్కుప్రతులు. 4. నేమిభంగి – న. 5. కృష్ణసాత్యకులు – అ. 6. బ్రదికిరం – ఓ.ల. 7. రంతయు – పెక్కు ప్రతులు. 8. పరిపాటించి చెప్పుమనుటయు – ల. 9. ఎఱింగింపుమనుటయు – వ. 10. సూతసూనుం డి ట్లనియె – వ.

40 1. సేయ – శ; చేయ – ల. 2. వ్రాతము భూరిదంతి – ఇ.ఈ. 3. యరిగెం భయంబునన్ – ఘ.ల.

41 1. బ్రవేశింప నొల్లక – ఒ.క. 2. పరివృతుఁడై – పెక్కు ప్రతులు.

42 1. కర్మం – పెక్కు ప్రతులు. 2. బదియ (యె) య – అని పాఠములు.

త్యము[3]గఁ గొని యాచరించిరి
[4]తమకు సుగతి గోరి కీర్తి[5]స్ఫురణమెయిన్.

43 క. ఐనను నొకపలు కడ్డము
గా నొడివెద [1]దాని లెస్స గా విని [2]యది మే
లైనను [3]జేసెదు గాదే
న్మానెద నేర్పడఁగ వినుము మనుజాధీశా.

44 చ. అమరనదీ[1]తనూభవుఁడు నస్త్రగురుండును గర్ణుఁడుం బరా
క్రమమహనీయు లాహవధురంధరు [2]లట్టిర [3]తక్కఁ గల్గు భూ
రమణులు బంధుమిత్రులు దురంబున నందఱఁ బాండునందనుల్
సమయఁగఁ జేసి రట్లు [4]భుజశక్తియు దైవబలంబు నెక్కుడై.

45 చ. [1]వెరవును లావునుం గలుగువీరులు [2]పోరుల బడ్డ హీనతం
[3]బొరసితి మస్త్రశస్త్రహతి భూవర [4]చిక్కిన[5]వారు నొల్లఁ బో
యిరి విను పాండురాజసుతు లేవురు [6]గంటికి ఱెప్పచంద మై
హరి తముఁ గావఁ గా వెలసి రక్షతదేహ[7]విలాససంపదన్.

46 క. శ్వేతాశ్వ[1]పాటవం బు
ద్ద్యోతిత మై మెఱయఁగాఁ [2]జతుర్దంతరుచి

---

3. గాగనాచరించిరి—ఒ.క.జ.బ వీ.శ.ష. 4. తమకునుగతి – ఆ.ఎ.క.న. కొన్ని ప్రతులు. 5. స్ఫురణముగన్ – క.జ.

43 1. గాని, దీని, నీవు — అని పాఠములు ; అదియు లెస్సగై కొను మిదిగా — చ. 2. య (యి) ది పొందైన, యిట పొందైన, మది పొందైన, యదియశైన — అని పాఠములు ; (ను)మిదిగా దేనియు నక్కార్యము తగ మానుము—చ. 3. జేసెద—ఐ.ఘ.ప.

44 1. తనూజుడును – ఖ. 2. లందరు, లట్టిరు, లట్టుల, లద్దిర, లిద్దెన, లందలి – అని పాఠములు ; లున్నతవంశులట్టి – శ. 3. వీరు వారు భూ – వ. 4. ఘనసాహసవృత్తి బలంబుకే – చ.

45 1. వెరవులు – జ. 2. పోరున, పోరులు, పోరును – అని పాఠములు. 3. బొరసిరి యస్త్ర – ఇ.వ. 4. తక్కిన – పెక్కు ప్రతులు. 5. యోధులెల్ల – చ. 6. నెప్పటికన్న నందమై – చ. 7. విహార – ఘ.

46 1. పాటవము విద్ద్యో – ఎ.ట.వ. 2. జతుర్దంతాంత – ఘ ; జతుర్దంతసము – చ.

స్ఫీత మగుగజముక్రియ నరుఁ
డాతతకురు[3]సైన్యసరసియందుఁ [4]జరించున్.

47 క. జ్యారవము [1]నాదముగ నతి
ఘోరత వైరు లనుకరటి[2]కోటికి [3]రయదు
ర్వారం బగు[4]నర్జునకం
ఠీరవము శితాస్త్ర [5]నఖపటిష్ఠతఁ జూపున్.

48 తే. అర్జునోదగ్ర[1]దవ[2]శిఖి హారిమహోని
లంబు ప్రేరేప వైరిబలప్రకీర్ణ
గహనదహనవిహార ముగ్రముగఁ జలుపఁ
దేఁటి[3]చూడను [4]రాకున్కి దెల్ల మధిప[5].

49 ఉ. ద్రోణుఁడు సూతనందనుఁడు ద్రోణ[1]తనూజుఁడు నేను శల్యుఁడుం
ద్రాణపరాయణత్వమున దర్పము సూపఁగ [2]నీవుఁ దమ్ములుఁ
బాణపరంపరల్ [3]గురియ ఫల్గునుఁ డందఱ మీఁటి సైంధవ
ప్రాణము [4]నాఁచికోలు [5]నరపాల తలంపఁగ మర్త్యకృత్యమే

50 ఉ. ఇంతకుమున్ను సెల్లెఁ బదియేడుదినంబుల సంగరం బతి
[1]శ్రాంతతఁ [2]గుంది రిందుఁగలసైనికు [3]లద్దెసఁ గల్గుయోధు లా
[4]క్రాంతవిరోధి[5]దర్పుఁడు పురందరనందనుబల్మికల్మి ని
శ్చింతత నుల్లసిల్లెదరు చెక్కు [6]చెమర్పక కౌరవేశ్వరా.

---

3. సేన — చ.వ. 4. జరించెన్ — ఔ.ద.

47 1. గాఢ — క.జ ; నాదమున — ఐ.గ.వ. 2. ఘోటకచయ — ఔ.ఖ.ఘ.చ.ల. 3. భయ — ఇ.ఉ ; విను — శ. 4. ఫల్గున — పెక్కు ప్రతులు. 5. శిఖి — త.

48 1. దావాగ్ని హారి — ఐ.గ. 2. శిఖి — పెక్కుప్రతులు. 3. చూడంగ — కొన్ని ప్రతులు. 4. రాకుంట — ప. 5. ఈ పద్యము తరువాత 'అది యెట్లంటేని' అను వచనము కొన్ని ప్రతులలో కలదు.

49 1. సుతుండును — అ.ఉ.ఘ.చ.ల. 2. నిచ్ఛ (చ్ఛ) — ఘ.ల. 3. బరప — ఓ. 4. గోలుపుచ్చి — క ; గాచిపోవ — ఇ ; గాచికోలు — శ. 5. జనపాల — ఎ.ట.ప ; నరపాలక చూడగ — ఇ.క.

50 1. శ్రాంతము — ద. 2. బొంది, నొంది — అని పాఠములు. 3. లందరు నట్టి — ఇ ; లందును — ఎ.చ ; లద్దెసయోధులెల్లనా — ఖ. 4. శ్రాంత, శ్రాంతి, క్రాంతి — అని పాఠములు. 5. గర్వుడు — త ; యప్పుడు — న. 6. చెమర్పరు — పెక్కు ప్రతులు.

51 క. బలవిక్రమఘను లగు[1]దొర
లిలిగిన మనసేన మేదినీశ్వర విను క
న్నులు వెడి[2]న ట్లున్నది యీ
కొలఁదిం బోరి[3]గొనుట నరునకుఁ [4]సుకర మగుఁ.

52 వ. అని చెప్పి కృతవర్మశల్యగురుపుత్రులను [1]దన్ను నెన్ని.

53 క. దామోదరుతమ్ముండును
భీముఁడు నిరుగెలఁకులందుఁ బేర్చి తఱుమ ను
ద్దామగతి నడరుకవ్వడి
కే మిందఱుఁ [1]దలఁప నొక్కయెత్తు కుమారా.

54 చ. అనిలసుతుండు [1]పూన్కి [2]బలుపారఁగఁ గొండొక దీర్చె [3]నేపు నొం
దినభుజ[4]సంపదం గొఱఁత దీర్పఁగ నింకఁ గడంగ కుండునే
మనకు నజాతశత్రునిసమంచితమార్దవ మూఁది సంధి సే
య నుచిత మైనకాల మిది యాగ్రహముం జొరనీకు చిత్తముఁ.

55 క. సమరము నిష్కారణవై
రమునం బాటిల్లె [1]నెల్లరాజులు [2]భరతో
త్తములును మడిసిరి [3]విడు కో
పము దీర్ఘక్రోధుఁ డైనపతి కీ డొందుఁ.

56 క. [1]తమకు బలం బెక్కినతఱి
సముచిత [2]మగు [3]విగ్రహంబు శత్రుల కుత్సా
హము [4]మీఱినపుడు గర్త
వ్యము సంధి యనంగ విందు [5]మార్యులచేతఁ.

---

51 1. వారలిగిన—వీ.శర.ష ; దొరలలిగిన విను కౌరవేశ్వరా వీనులు—చ. 2. నట్లున్నవి – ఆ.ఇ.చ. 3. గొనగ – చ. 4. సమకూరెన్ – చ.

52 1. దన్నును నెన్ని, దన్నును నెన్ని కొనియె – అని పాఠములు.

53 1. మరయ – వ.వ ; జూడనొక్క, గూడనొక్క – అని పాఠములు.

54 1. పూని—చ. 2. పొలు, బోలు—అని పాఠములు. 3. నేర్పు-ఇ.చ. 4. శక్తిచే—ఎ.బ.

55 1. వినుము – ఊ. 2. ధర్మో—ట. 3. విను – ఇ.ఉ.

56 1. తమకునుబలమెక్కిన – అ. 2. ముగ – ఊ.శ. 3. నిగ్రహంబు – ఐ.చ; విక్రమంబు – ద. 4. మీరినయెడ – ఈ ; తొలగినపుడె – చ. 5. నార్యులచేతన్—త.

57 క. కలవా రెల్లను దెగి [1]నీ
తలన నిలిచెఁ గార్యమధిప తగ [2]నొడఁబడు మి
ట్టల మగునాత్మ[3]వినాశము
కలుగుట [4]యది విపులపాతకం [5]బంద్రు బుధుల్.

58 క. తనకై కాదే మది నె
ల్లను గోరుట వినుము దాఁ బ్రళయ మొందెనయే
నిని [1]వారని[2]యుద్యోగం
బునకు ఫలంబేమి రాజపుంగవ చెపుమా.

59 క. నినుఁ గాచికొనుము నీ వు
న్నను [1]సర్వము గల్గు ధర్మనందనునిఁ [2]దగం
గను మతఁడు [3]రాజ నని తన
మనమున నెక్కించుకొనఁడు మదగర్వంబుల్.

60 తే. రాజ్య[1]భాగంబు [2]దగ ధృతరాష్ట్రునకును
నీకు నన్నదమ్ములకు నాన్నృపతి యొసఁగు
[3]నాతఁ డెపుడుశుశ్రూషసేయంగఁ గోరు
గురుజనములకుఁ గావునఁ గూడుటొప్పు.

61 చ. హరియును గాందనందు గరుణా[1]న్వితు లై తగ [2]నమ్మహాత్ము లె
ప్పరుసునఁ గార్యనిశ్చయము పల్కినఁ గీచకవైరియుం బురం
దరతనయుండునుం గవలు దానికి మా ర్వలుకంగ నెమ్మెయిం
జొర రగు సంధి [3]యెట్లు ననసూయత నూల్కొని చేయు మిత్తఱిన్.

57 1. నీతల నిలిచెం—కొన్ని ప్రతులు. 2. దొడఁబడని—పెక్కు ప్రతులు; దొడరగని—చ. 3. విభావము — ఈ.త. 4. కది — పెక్కుప్రతులు; కును — ఒ. 5. బనిరి — ఎ.

58 1. వానికి ను — అ. 2. యుద్బోధంబునకు — ట.వ.

59 1. సర్వము — పెక్కు ప్రతులు. 2. ప్రీతిం — ఈ.ఎ.ట. 3. రాజు — వ.

60 1. భోగంబు—ఉ; భారంబు — పెక్కు ప్రతులు. 2. దగు — ఊ.ట. 3. చిత్తమెప్పుడు శుశ్రూషసేయగోరు — కొన్ని ప్రతులు.

61 1. న్వితుడై — కొన్ని ప్రతులు. 2. నమ్మహాత్ముడె — కొన్ని ప్రతులు. 3. యట్టున — వీ.ష; యట్లయిన — ఖ; యెట్టులన — శ.

62 ఆ. [1]ఇంత [2]చెప్పు టనికి నే నోడి ప్రాణర
క్షణము సేసికొనుట గాదు నీకుఁ
బథ్య [3]మని[4]యుఁ దఱిమి పల్కితి విను విన
వేని [5]నొచ్చి [6]తలఁచె దిట్టులగుట.

63 వ. అని యగ్గౌతముండు శోకాయత్తచిత్తుం [1]డగుచుం దనకు హితోపదేశంబు సేసిన విని దుర్యోధనుం[2]డు వేఁడినిట్టూర్పు నిగిడించి యొక్కింతసేపు చింతాక్రాంతుండై యూరకుండి [3]వ్రాల్చినకనుదోయి విచ్చి [4]యవ్విప్రవరు మొగంబుసూచి యిట్లనియె.

64 చ. చెడుటకు [1]నోర్వ కీ విటులు చెప్పితి నాకు [2]హితంబు నెయ్య మె
క్కుడు గలయట్టిచుట్టమునకున్ నయశిక్ష దగుం గదా [3]భరం
పడి బవరంబులం బెనఁగుభంగిని గార్యము దెల్పఁ [4]జాలిన
ప్పుడు నిను రక్షణార్థి [5]వని భూసురసత్తమ యే నెఱుంగుదున్.

65 వ. నీకూర్మి పేర్మిం జేసి దొలఁగింపం [1]జూచి సంధి కర్తవ్యంబని పలికితివి గాని యప్పలుకులు నాకు రుచియింప వెట్లంటేని.

66 సీ. కపటంపుజూదంబు ఘటియించి రాజ్యంబు
గొని [1]ధర్మజునిమది గుందఁ జేసి
సభ కేకవస్త్ర [2]రజస్వల నమ్మెయిఁ
బాంచాలి ముందల పట్టి యీడ్చి

---

62 1. ఇంతనీకుజెప్పుచేనోడి — చ. 2. చెప్పటిల్ల యే(నే)మోడి — ఎ.వ. 3. మనియ, మనుచు—అని పాఠములు. 4. తలంచి పలికితి—ఐ. 5. చొరఁ దలంతు నెట్టులయిన—శ. 6. తలచితిట్లు, తలచెదెట్లు — వ.

63 1. డయి— వ. 2. డు వెండియువేడి — పెక్కు ప్రతులు. 3. మోడ్చిన — అ.ఆ.ఇ.వ.శ. 4. యవ్విప్రవరుగూర్మిపేర్మిజేసి యవని — చ; యవ్వీరవరు — వ.

64 1. నోర్వలేకిటులు—ఆ ; నోర్వకిట్లుతగ—ఇ ; నోర్వకిట్లునికి—ఘ. 2. హితంబెసేయు—శ; హితంబుసేయు — ఇ. 3. ధరం — గ ; పదం — ఇ.శ. 4. జాలుదె, చోటనె, జూపిన — అని పాఠములు. 5. యని — ఇ.శ.

65 1. బూని — ఆ.ఊ.ఖ.ఘ.ల.శ.ష ; గోరి — ఎ.

66 1. రాజుమదియట్లు—అ.ఈ. కొన్ని ప్రతులు. 2. రజస్వలయైయున్న పాంచాలి—ఐ.ఒ.

సంధిసేయఁగఁ బూని శౌరి యేతెంచిన
[3]నవ్విధంబున [4]నప్రియం బొనర్చి
పలువురు గూడి సౌభద్రు [5]నొక్కని బాలుఁ
గిట్టి యత్తెఱంగునఁ గీ టడంచి

తే. [6]నేఁడు దుశ్శాసనుని ఱొమ్ము నెత్తు రనిల
సుతుఁడు[7]మదమునఁ ద్రావుట సూచికొఱఁత
ప్రతినదీర్చునతండని భయముఁ [8]బొంది
పొందుగోరిన నది యేల పోసగుఁ జెపుమ.

67 ఉ. రాజులు భక్తిఁ గొల్వఁగ ధరావలయం బఖిలంబు దర్పవి
భ్రాజిత[1]వృత్తి నేలి యనురక్తులఁ బ్రోచుచు శత్రు[2]కోటికి
న్దేజము [3]దప్పఁ జేయుచు [4]నతిప్రమదంబున నున్న నాకు నిం
కాజియె కాక యొక్కనిదయం గనురాజ్యసుఖంబు లేటికిన్.

68 వ. నిశ్చయం బిట్టిద యగుటం జేసి.

69 ఆ. [1]పొడుతు నెట్లు పాండు[2]పుత్రులతోఁ
గయ్య మేను నీవు దీని కియ్యకొనుము
పలుకు వినమి [3]గాఁ గఁ [4]దలఁపకు ముచితంబు
తెఱఁగు ధీరజనుల కెఱుఁగరాదె.

70 చ. విభవమునుం బ్రతాపమును విశ్రుతకీర్తియు మాయ ధర్మపు
త్రభటసమానవృత్తమున దైన్యమునొందుట కోర్వ [1]రాదు వీ
తభయతఁ [2]బోరఁ బేర్కొని యుదాత్తపదంబున కేఁగి భీష్మకుం
భ భవజయద్రథాదు లగు[3]బంధుల [4]మిత్రులఁ గూడు టొప్పగున్.

---

కొన్ని ప్రతులు. 3. నతనికి గడునప్రియం—ఘ. 4. కప్రియంబు—వా ; నప్రియంబు — పెక్కు ప్రతులు. 5. నొక్కరు — పెక్కు ప్రతులు. 6. నేను — వ. 7. దురమున—ఏ.ఖ ; దోయిట దా్రివంగ — చ. 8. నొంది, గూరి — అని పాఠములు.

67 1. శక్తి — వ.శ.ష ; భక్తి — ఘు. 2 కోటులం — త. 3. దవ్వ — పెక్కు ప్రతులు; మీరజూపుచు—చ. 4. ననింద్య పరాక్రమ లీల నున్నదా—వీ.శ.ష.

69 1. పోదునెట్లు—క. 2. పుత్రులతో నింక గయ్యమునకు దీని—త. 3. గానపలుకులకు—అ. 4. బలుకకు — ఇ.శ.ష.

70 1. నేల — అ.ప. 2. నేడు — అ ; బోరమార్కొని — అ.ప. 3. బాంధవ — అ. 4. నెల్లను — ఎ.ర.ట ఫ.

71 వ. అంత [1]వలవ దిమ్మాట మగ[2]పాడి కాడితిం గాని.

72 ఆ. ఏను దెంపు చేసి యీయున్న రథికజ
నంబుతోడఁ [1]గడఁగి [2]నడవఁ బెట్టుఁ
దఱిమి పాండురాజతనయుల [3]మర్దింతు
ననఘ నీవు మెచ్చునట్లు [4]గాఁగ.

73 చ. అన విని [1]చుట్టు నున్ననృపు లందఱు సంతస మంది యన్న రేం
ద్రుని వినుతించి యోటమికి [2]రోయుట నొందిన[3]చింత వంత యె
ల్లను దిగఁ[4]ద్రోచి నెమ్మనములన్ రణకౌతుక మావహిల్లు నా
ననములు దోఁప దర్పవచనంబుల సేనకు ను బ్బొనర్చుచున్.

—: దుర్యోధనుఁడు శిబిరంబు విడిచి సరస్వతీతీరంబు చేరుట :—

సం. 9-4-49

74 వ. [1]చెలంగి కృపకృతవర్మాశ్వత్థామశకునిశల్యులు గార్యంబువిచారించి కౌర వేశ్వరు నాలోకించి మన మీరాత్రి శిబిరంబున నిద్రించుట యొప్ప దెట్లనినఁ గర్ణుం [2]దెగటార్చుటం జేసి పేర్చినయుబ్బునఁ బాండవులు పైకొని పరా క్రమింప [3]నప్పళింపఁ గలుగుఁ [4]బో యని తలంచెదము వినుము వంచనఁ దొలంగి[5]యుండి మనకుం గలచతురంగంబుల [6]నాయితంబు సేసి[7]కొని

---

71 1. వలపటిమాట — ఊ. 2. పాటికినా — కొన్ని ప్రతులు.

72 1. గూడినడవ — ఏ.ఘ.త. 2. నడువ — ఎ.త. 3. మ్రిందింతు - ఇ. 4. గాను-చ.

73 1. చుట్ల - పెక్కు ప్రతులు. 2. రోషము - అ.ఊ. 3. యంతచింత యల్లను - ఖ. 4. ద్రావి, దావి — అని పాఠములు.

74 1. చెలంగిన — కొన్ని ప్రతులు. 2. దెగటార్చినబేర్చి — పెక్కు ప్రతులు. 3. నప్ప ళించుట - పెక్కుప్రతులు. 4. నోయని పెక్కు ప్రతులు. 5. యుండి—పెక్కుప్రతులలో లేదు. 6. నాయత్త పరచుకొని — అ.ప. 7. కొని వేకువం — పెక్కు ప్రతులు.

పెనఁకువం బన్ని వారికి వెఱఁ[8]గగునట్టిబెట్టిదంపుటురవడిం గదిసి రణంబు
సేయుద మట్లైన జయంబు గొన వచ్చు నని చెప్పిన నవ్వసుమతీపతి
ప్రీతుం డై యది లెస్స[9]వెర వట్లచేయుద మని సముచితభంగిం దగువారల
కెఱింగించి కదలి యచటికి [10]రెండామడ [11]యగు [12]సరస్వతిపొంతం బయ
లికి బలంబులం గొని చని సకలజన[13]వాహన సహితంబుగా నమ్మహా
నదియం దిచ్ఛానురూపస్నానపానంబు లాచరించి వఱయు తెఱంగున
[14]వెనుక [15]నడతెంచిన వివిధాహారంబులం [16]దుష్టిఁ బొంది యిష్టా
[17]లాపంబులు [18]సెల్లుచుండ నున్న [19]సమయంబున ము న్నాకర్జంబు నడ
పినదొరలును జిత్రసేనాదిభవత్కుమారులును గర్ణు[20]కొడుకు [21]సత్యసేనుం
డును లోనై నయాప్తజనంబు లమ్మనుజనాథున కి ట్లనిరి.

75 చ. వెరవును లావునుం [1]గలిగి విక్రమసంపద సొంపు మీఱి భూ
వర భవదీయ మైన బలవర్గము [2]నొడ్డన మేర్పు వీఁ కమైఁ
బురికొలుపంగ [3]నిర్భయతఁ [4]బోరెడునట్లుగఁ దాను [5]ముందటై
తిరముగఁ జేయఁ [6]జాలు నొకధీరు నొనర్పుము సైన్య[7]నాథుఁ గన్.

76 వ. అనిన విని [1]వృషస్కంధుండును [2]బీనదీర్ఘభుజార్గళుండును భర్గవరలబ్ధ
[3]జన్ముండును [4]దివ్యాస్త్రవేదియు [5]నవ్యాహతవిక్రమోద్దాముండును నగు
నశ్వత్థామ నాలోకించి యాదరభరితుం డగుచు నాధరణీవరుం [6]డతని
కి ట్లనియె.

---

8. గుపుట్టు, గుపడు - అని పాఠములు. 9. వెరవిట్ల – పెక్కు ప్రతులు. 10. యోజన
ద్వయం - అ. 11. గడ – ఇ. 12. సరస్వతీనదిపొంతం – ఎ. 13. వాహినీ – ఆ.
14. నుండి వివిధా - కొన్ని ప్రతులు. 15. వచ్చిన వివిధ - ఇ. 16. దృష్టి – కొన్ని
ప్రతులు. 17. హారంబు - జ. 18. సేయుచున్న - క.జ; సెల్లుచున్న–ఈ ఎ.ట.
19. సమయంబునమున్నా - పెక్కు ప్రతులు; సమయంబుమున్నా - వా. 20. పుత్రు
డగు - అ.ప. 21. చిత్రసేనుండు – ఖ; సత్యలోచనుండు - గ.

75 1. గలిగి - పి.శ. 2. నున్దననేర్పు – గ. 3. నిర్భరత – గ.ఐ. 4. బోలెడు - వా;
బోరెడు – పెక్కు ప్రతులు. 5. ముంగలై – కొన్ని ప్రతులు. 6. బోలు – ఘ.చ.ల.
7. పాలుగాన్ – ఊ.

76 1. దృఢ– ఖ. 2. నభినవ – ఈ.ఔ.త; నవీన – క. 3. జనితుండును – ఆ.ప.
4. దివ్యాస్త్రసంవేదియు – ఆ.ఓ.ఔ.ఖ ఘ.చ.ల. 5. నత్యాయత – క.జ 6. డతని
తో - ఆ ఇ.ఉ. కొన్ని ప్రతులు.

77 ఆ. అనఘ నీవు నాకు నాచార్యు[1]నట్టుల
నేడుగడయుఁ [2]గాన హితము సెప్పఁ
[3]దగు బలాధినాథుఁడుగఁ జేయ నర్హుని
నెల్ల వినఁగ నిశ్చయింప వలయు.

78 చ. అనుటయు నాతఁ [1]డిట్టు లను నజ్జన[2]పాలున కాజినైపుణం
బును మహనీయశౌర్యమును భూరిబలంబును సర్వ[3]సత్త్వవే
ధనముఁ బరాక్ర[4]మోద్ధతియు [5]ధైర్యసమగ్రతయుం [6]గలండు శ
ల్యుని రథినీపతిత్వమహిమోజ్జ్వలుఁ జేయుము కౌరవేశ్వరా.

79 క. [1]నినుఁబట్టి పాండుపుత్రులఁ
దనమేనల్లురఁ [2]దొరంగె ధరణీశ్వర యీ
తనిఁగడచిన పర[3]మహితులు
మనకుఁ గలరె యితఁడు లోకమాన్యుఁడు గాఁడే.

80 తే. కార్తికేయుం [1]డదీశుఁడుగా నమర్త్యు
లెలమిఁ [2]బురికొని దైత్యుల [3]గెలుచుకరణి
[4]మద్రవిభుఁ డగ్రణిగ [5]నేచి మనము నడచి
కడిఁది పగఱ జయింతము కౌరవేంద్ర.

---

77 1. డె(డ)ట్లట్లయే — ఇ.ఈ.ఉ.ట.వ. 2. నాకు - ఇ. 3. నగు — అ.ప.

78 1. డిట్లనియె — కొన్ని ప్రతులు. 2. నాథున - ఐ.గ. 3. శస్త్ర—పీ.ష ; శస్త్రసా—శ; తత్త్వవే — ఆ.ఘు.చ ; తత్త్వభే— అ.ఎ.ఏ.ఔ. 4. మోన్నతి — ఆ.ఉ.ఓ.ఔ.ఘు.చ. 5. ధర్మ — ఖ.ఘు.చ. 6. గలట్టి — ఉ ; గడంగు — చ.

79 1. విను — ఒ. 2. దొడంగు - ఖ. 3. మహితుడు మనకు గలడె — ల.పీ.శ.ష.

80 1. డునధికుండు — చ ; డధీనుండు — న ; డధీశుడుగాడె — ఆ. 2. బరికొని, బోరిగొని, బలిగొని, బనిగొని — అని పాఠములు. 3. గెలిచినట్లు - పెక్కు ప్రతులు. 4. మద్రినాథుని బలిమిచే మనము — పీ.శ.ష ; మద్రిపతిగేగ్రిణినేచినమనము — గ. 5. జేసి, నమర్చి - అని పాఠములు.

81 వ. అనిన విని సమస్త[1]జనపతులును జయజయశబ్దంబులతో శల్యుం బరివేష్టించి సంగరోత్సాహంబు[2]నం బొంగిరి కురు[3]నాథుండును గద్దియ డిగి [4]సవినయంబున నమ్మద్రవిభున కభిముఖుండై యి ట్లనియె.

82 ఉ. పొచ్చెము లేని నెయ్యమునఁ బూని విపద్దశ నొంద కుండఁ గా
నెచ్చెలిఁ గావఁ జూచుమహనీయున కిట్టిద కాల[1]మిప్పు డీ
వచ్చుపడంగ నీభుజబలాతిశయంబున [2]నద్భుతంపు గె
ల్పిచ్చి కృతార్థుఁ జేయు నను నే నినుఁ జెందియుఁ [3]దూలఁ బోదు నే.

83 క. పూనుము చమూపతిత్వము
నానమ్మినవారు నేను [1]నరవరబలసం
తానంబుతోడఁ బరిజన
మై నడచెద మాక్రమింపు మరి[2]వర్గంబున్.

84 చ. అన విని శల్యుఁ[1]డిట్లనియె నమ్మనుజేంద్రున కిప్పు డింతప్రా
ర్థన మొనరింప నేల వసుధావర యే నినుఁ జేరి[2]నప్డ నా
ధనమును బ్రాణముల్ బలవితానము నీకు సమర్పణంబు సే
సిన[3]యవి గావె నీపనుపు సేసెదఁ గౌరవసేనఁ గాచెదన్.

85 మ. భుజవీర్యంబు[1]న నచ్యుతార్జునులు నన్ బోలంగ లే రల్క వ
చ్చి జయింపంగఁ గడంగినన్ సురలు నాచే [2]నొత్తు రే నేచి య
క్కజపుం జేవయు లావు [3]జూపువడికిం గౌంతేయు [4]లే యోర్తు రా
ప్రజయున్ నీప్రజయుం [5]దలంగఁ జెలఁగం బాటింతు నాటోపముల్.

---

81 1. జగతీశులు–వా. పెక్కు ప్రతులు ; జనపతులు–వీ.శ.ష. 2. నకు నుత్సహించిరి–వ.శ. 3. విభుండు–వీ.శ.ష. 4. గౌరవంబుగా – వీ.శ.ష.

82 1. మిమ్మహిన్నచ్చు – త. 2. కద్భుతంబు – ఆ.చ.వ ; నద్భుతంబు – వీ. కొన్ని ప్రతులు. 3. రిత్త – ఐ.ఘ.

83 1. నరవర – పెక్కు ప్రతులు ; నరపతి – వా. 2. సైన్యంబున్ – ఎ.ట.వ.

84 1. డిట్టులను – కొన్ని ప్రతులు. 2. నప్డు – వీ.శ ష. కొన్ని ప్రతులు. 3. యదిగాదె- పెక్కు ప్రతులు.

85 1. న (ల) గేశవా – బొ.క.ఘ.చ.న ; కచ్యుతా – త. 2. నేర్చి – ఘ. 3. జూపినను నా కౌంతేయులెట్లోర్తు – వీ.శ.ష.స. 4. లెట్లోర్తు – చ.వీ. 5. గలంగ – పెక్కు ప్రతులు.

86 చ. [1]అతిముతి బాణజాలముల నక్కడిసైనికులం [2]దెరల్చెదన్
గుఱుకొని నాకు మాఱుకొని కోల్తలఁ జేసిన వీరవర్గమున్
నఱికెదఁ జూచుఖేచర[3]గణంబుల కచ్చెరుపా టొనర్చెదన్
బఱపెదఁ బాండునందనులఁ బాఱక నిల్చిన [4]రూపడంచెదన్.

87 శా. గంగానందను[1]పోటు మెచ్చక గురుం గాదంచు రాధాతనూ
జుం [2]గీడాడుచు నీతఁ డెవ్వఁ డొకొ యంచున్ శల్యుఁడే యిట్టివా
నిం గయ్యంబు[3]ల మున్ను గాన మనుచు న్వేభంగులం [4]జూప ఔ
ల్లం గీర్తింప [5]ధనుఃకళానిపుణలీ[6]లాఖేలతన్ జూపెదన్.

—: దుర్యోధనుఁడు శల్యుని సేనానాయకుంగాఁ జేయుట :—

సం. 9-6-5

88 వ. అని పలికిన నీసుతుం[1]డు ప్రీతుండై [2]కనకకలశంబుల [3]సరస్వతీజలంబులు దెప్పించి శాస్త్రోక్తప్రకారంబునఁ దగురాజులుం దానును [4]సేనాధ్యం బున [5]భద్రవిధానోపేతంబుగా [6]నమ్మద్రవిభు [7]నభిషేకించి బలాధిపత్యపట్ట [8]బంధంబు నిర్వర్తించిన శంఖభేరీప్రముఖమంగళ[9]తూర్యారవంబులు [10]సెలంగ సైనికసింహనాదంబు లుల్లసిల్ల నప్పు డాశల్యు నుద్దేశించి దీవనలం బొగడ్తల నఖిలజనంబులు[11]ను ముఖరు లయి రిట్లు సంతసిల్లి సపరివారం బుగాఁ గురుభూమీశ్వరుండు [12]విశ్రామంబు నొందె నట్టియెడ మున్ను

86 1. ఈ పద్యము 'ప' ప్రతిలో లేదు. 2. గలంచెదన్ — అ.ప ; రెమల్చె — ఖ.ల. 3. జనంబు — ఉ. 4. రూపుమాపెదన్ — ఘ.వ.ల.

87 1. పాటు — శ. 2. గీటాడుచు — అ.ట.వీ. 3. నదొల్లి — పెక్కు ప్రతులు, 4. బొంగిచాలం — ఐ.గ. 5. ధనుష్కళా — ఎ.త.వ. 6. లాభీలతన్, లాచాతురిన్. లాశూరతన్ — అని పాఠములు.

88 1. డైన దుర్యోధనుండు ప్రీతుండై — ఖ. 2. కనకకలశంబుల — పెక్కు ప్రతులలో లేదు. 3. సరస్వతీనదీజలం — ఓ.ఔ.వ. 4. సేనాధిపత్యంబునకు మంత్ర—ఊ.ఐ.గ.ద. 5. భద్రదంతివితానోపేతంబుగా — అ.ప ; భద్రపేఠాసనోపేతంబుగా — ఔ.త.వ ; భద్రపేఠాసమేతంబుగా — ఎ ; భద్రశోభోపేతంబుగా — చ. 6. పతి — అ.ఈ.ఏ. 7. నభిషిక్తుంగావించి బలా — ఈ.త ; నభిషిక్తుంజేసి బలా — వ ; నభిషేకంబు చేసి సేనాధి — అ.ప ; నభిషేకంబు చేసి — శ. 8. బద్ధంబు — పెక్కు ప్రతులు. 9. తూర్యం బులు సెలంగ — పెక్కుప్రతులు. 10. సెలంగెనవల — ఓ. 11. సుముఖులయి రట్లు —కొన్ని ప్రతులు ; ప్రస్తుతించిరిట్లు — అ.ప. 12. విశ్రమించె — పీ.శ.ష.

సమరజయంబునం బ్రిమోదభరితుం డగుచు నిజశిబిరంబునకుం జనిన పాండ వాగ్రజుండు బంధుమిత్రపరిజనంబులఁ దమతమ[13]విడిదలకుం బోవం బను వక యుచితప్రదేశంబునఁ బేరోలగం బుండి మనవారివలనివిశేషంబు లరయఁ జారులం [14]బనిచిన వారఁ దై వారలు మగిడి వచ్చు[15]నంతకు [16]నే మేని వినోదంబులం బ్రొద్దు వుచ్చి [17]యక్కడి యుత్సాహంబు [18]తెలం గంతయు విని యచ్యుతునాననం బాలోకించి యి ట్లనియె.

89 చ. కురుపతి మద్ర[1]రాజుఁ దనకున్ బలముఖ్యునిఁగా నొనర్చి సం
గరమున [2]కుత్సహించె నధికప్రిమదంబున వారిసేనయుం
దిర మయి పేర్చి యున్నయది దీనికి నెయ్యది సేయువార మీ
[3]వరయుము కార్యవృత్తి హృదయంబునఁ బాండవరక్షణోత్సుకా.

90 వ. నీ వెట్లు నిశ్చయించి [1]పలికె దట్ల చేయుదు [2]ననిన నమ్మహీకాంతునకు మురాంతకుం డి ట్లనియె.

91 సీ. శల్యు [1]నెఱుంగుదు శౌర్యధైర్యంబు
[2]లగ్గల మాతనికి బాహు[3]బలఘనుండు
గాంగేయకుంభజకర్ణుల [4]మిగిలెడుఁ
గాదేని సముఁ డగుఁ గాని యసదు
గాఁ దలంపఁగ రాదు కౌరవపతి మాన్యుఁ
జేయుట నధికవిజృంభణంబుఁ
జూపు భీమునకు నర్జునునకు [5]నెనయంగ
రాదు సాత్యకి కోర్వరాదు పార్ష

13. శిబిరంబు ; లకు — ఇ ఊ.క.చ. 14. బుత్తెంచిన, బంచిన — అని పాఠములు 15. నంతకు నెమ్మది —అ.ప. 16. దత్సమయోచిత వినోదంబుల బ్రొద్దు— ఖ. 17. మనవారి యుత్సాహ—అ.ప. 18. తెరంగువిని — పెక్కు ప్రతులు ; తెరంగెరింగి యచ్యుతు — ఈ.ఊ.ట.

89 1. నాథు — కొన్ని ప్రతులు. 2. కుత్సహించియధిక — ప.న. 3. దరయుడు—ఐ.గ.చ ; దరయుము — వ.

90 1. పలికితట్లుచేసెద — పెక్కు ప్రతులు. 2. ననినవినియమ్మహీ — పెక్కు ప్రతులు.

91 1. నేనెఱుగుదు — కొన్ని ప్రతులు. 2. గలవాతనికి — ఐ.ఒ.ఖ.గ.చ. 3. బలము నందు — పీ.శ.ష ; బలయుతుండు — ఖ ; ఘనబలుండు — ప. 4. గడచెడు, మీరెడు — అని పాఠములు. 5. జెనయంగ, జేయంగ, జేరంగ — అని పాఠములు.

తే. తనకుఁ దత్సోదరులకు మార్కొని పెనంగి
బ్రదుక [6]రాదు నీపీట నాబల్లిదునకు
నెదురురథికు[7]నిఁ గాన [8]ననేకహేతి
నిపుణశార్దూలవిక్రమ నీవు దక్క.

92 క. ఒరులయినఁ బెక్కు [1]దినములఁ
బోరిగొను నీబలము నెల్లఁ [2]బోరివోవ నతం
డరిభంజన నీవైనం
బరమోత్సాహమున నెల్లి [3]పడవై తతనిన్.

93 ఆ. [1]అతఁడు మేనమామ యనుకృప దక్కుము
రాజధర్మమును బురస్కరించి
యతుల విక్రమక్రియా పాటవంబున
నవ్విరోధినామ మడఁపవలయు.

94 క. [1]గాంగేయుని గుంభజుఁ గ
ర్ణుం గడచితి మింక నుద్ధురుం డగుమద్రే
శుం [2]గూల్పు మంతతోడఁ జె
గుం [3]గురుపతిపని జయంబు [4]గొనుము కడంకన్.

95 వ. అనిన విని యుధిష్ఠిరుం డతని కిట్లనియె.

96 ఆ. అనఘ నీవు చెప్పి[1]నట్టులు సేసెద
మున్ను పలికినాఁడ [2]నన్నరేంద్రు
కడిమి నాకుఁ బాలు గాఁ బూని యుద్యోగ
వేళయందు [3]నెల్ల వినుచు నుండ.

---

6. రాదిటదీటుగాబల్లి -శ. 7. నధికుగాన నెందు హేతి —వ.శ. 8. నేరనెందుహేతి—ట

92 1. విధముల — వి.శ.ష.స. 2. బొడవడగనతం — ఓ ; బొడవణచునతం — ఔ ; బొలివోవ — ఎ.ఏ.ఐ.క.గ.ఘ.చ.జ.ల. 3. పడవైతువనిన్ — అ.ఆ.ఏ.న.వ.

93 1. అతడు మీకుమేన — చ.

94 1. గాంగేయకుంభజుల — ఇ.వి.శ.ష 2. గూల్చు—ఈ.గ.ట వ గూల్పుమతని— క.న.ష. 3. గురుపతి నీ జయంబు — అ.ఆ.ఇ.జ.ట ; గురుపతి నీవుజయము — ఊ.ద ; గురుపతి యును నిజంబు గొనుము — క. 4. గొనుడటమీదన్ — చ ;గొనుము నరేంద్రా — ఒ.

96 1. నట్లసేసెద నేను-పెక్కుప్రతులు. 2. వన్నరేంద్రు-ఐ.క.గ. 3. జనులు వినగనేను-అ.ప.

97 వ. సదనంబునకుం జని సుఖనిద్ర సేయు మని [1]పలికి పద్మనాభునిఁ దనతమ్ము
లను ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకిప్రముఖులను దక్కటిపరిజనంబులను [2]నిజ
మందిరంబులకుం బోవం బనిచి [3]వీతశల్యం బైనమాతంగంబు[4]చందంబున
శయ్యాతలంబు [5]సేరె [6]బలం బంతయు నత్యంత [7]సంతుష్టం బై విశ్రాంతి
నొందె [8]నారాత్రియే నిట [9]వచ్చి నీకుఁ గర్ణువృత్తాంతంబు సెప్పి నీవు
వనుప మగిడి చని తెలతెల వేగునప్పుడు కౌరవసేనాసన్నివేశంబు సేరితి
నాసమయంబున.

98 క. కురుపతి పడవాళ్లం దగు
దొరలకడకు సత్వరముగ దురమునకు [1]భటో
[2]త్కారము [3]ననువు సేయుటకై
బరవసము దలిర్పఁ [4]బనిచెఁ బార్థివముఖ్యా.

99 వ. పనిచిన [1]నెల్లవారు నుల్లంబుల నుత్సాహంబు లుల్లసిల్లఁ దమతమ చతురం
గంబులకు సవరణలు సంఘటింపం దొడంగినఁ [2]దూర్యంబులు సెలంగ
నొండొరులఁ బిలుచునెలుంగులు నింగిముట్ట రథనేమిగజపద తురంగఖుర
పుటభటచరణ[3]సంఘట్టితం బగుధరణీతలం బ్రదువ బహుళంబగు నులివు
చంద్రోదయసమయ ఘూర్ణమానం [4]బగుమహార్ణవంబునినదంబు ననుకరించె
న ట్లాయితం బై శల్యశకునికృతవర్మాశ్వత్థామలును దక్కనుం గల
యోధవరులును నొక్కెడ ననుజసహితుం డై యున్నమనుజపతిసన్నిధిఁ
గూడి యతండు వినఁ దమలో ని ట్లనిరి.

---

97 1. పలికి యప్పద్మ — పెక్కుప్రతులు. 2. దమదమ విడిదలకుం — వీ.శ.ష. 3. విగత— ఇ.బౌ.న. 4. చందంబగుచు - కొన్ని ప్రతులు. 5. సేరిసుఖనిద్రచేసె — అ ; సేరి సుఖంబుండె—ప ; సేరిసుఖనిద్రచెందెనంత—చ. 6. బలంబులు — అ.ఏ.7. సంతుష్టులై — అ ఐ.గ ; సంతుష్టాంతరంగులై — చ. 8. నాటిరాత్రి— వీ శ.ష. 9. వచ్చికర్ణు — అ.బౌ.క.ఖ.గ.

98 1. బలో—పెక్కు ప్రతులు. 2. త్కారముల వెడలించుటకై—అ; త్కారములనని సేయు—ఊ. 3. పనుపు — శర. 4. బలికె - ట.

99 1. యెల్ల - ఈ. 2. దూర్యనినదంబులు-ఈ.బౌ.క.ఘ.న ; దూర్యనినాదంబులు-జ. 3. సంఘట్టనంబున - అ.ప ; సంభరితంబగు - ఓ.బౌ.ఘ.న.ల. 4. బగునర్ణవం—ఉ.ఎ. ఘ.ట.త.వ ; బగుమహార్ణవనినదం - అ.ఆ.ఊ.ఎ.చ.న.

100 క. ఒకఁ [1]డొకఁడ పాండవులఁ దాఁ
కక [2]సైన్యోపేతగాఢగతి [3]నందఱు నొ
క్కొకతల గాఁ [4]దలపడి వా
రికడంక యుడుపఁగవలయుఁ గ్రీడయ పోలెన్.

101 వ. మన మొకళ్లొకళ్లకుఁ బ్రాపగుచు నేపారి పోరినం జుల్కన గెల్వఁ గొన వచ్చు నిత్తెఱంగు మనకు సమయంబు సుండీ యట్లు గాక యొంటి [1]పెనంగెడివాఁడును [2]బెనఁగెడివానిఁ గని [3]కూడుకొనినవాఁడును బంచవిధ పాపంబుల నొందఁగలవాఁ డని యొండొరులకుం జెప్పికొని కదలి యుద్దామసామర్థ్యంబున నమ్మద్రపతిముంగలి యై [4]నడవం జనునప్పుడు.

—: కౌరవసైన్యంబు యుద్ధసన్నద్ధంబై వెడలుట :—

సం. 9—7—10

102 సీ. చంచరీ[1]కావళిఝం[2]కృతుల్ [3]గల్పించు
కర్ణ ఝుళంఝుళాకలనములును
ధరణీపరాగసంతానంబు గబళించు
కరశీకరచ్ఛటాస్ఫురణములును
ఘంటికా[4]టంకృతికాంతి [5]సంభావించు
నిర్భరబృంహిత[6]నిస్వనములు
[7]నంబరభాగంబు [8]నల్పంబు గావించు
నున్నతగాత్ర[9]సముద్ధతులును

---

100 1. డొకఁడు–క.ట.ల.వీ.శ.ష ; డొకడె–ఖ. 2. సైన్యంబెల్ల–చ. 3. నందరమునొ్న– అ ఉ ఔ.వ. 4. బై బడి – ద.ల వ. కొన్ని ప్రతులు.

101 1. పెనగు వాడును – అ.ఆ.స . పెనగులాడనివాడును – వీ శ.ష ; పెనగినవాడును– ఉ.ఐ ఒ.గ. 2. బెనఁగువాని – వీ.శ.ష ; బెనంగువాని – అ ; బెనగినవాని – ఒ ; బెనగెడువాని - ఆ ఇ ఎ ఘ జ.ట. 3. కూడికొనని – కొన్ని ప్రతులు ; కూడుకొనని– వీ.శ.ష. కొన్ని ప్రతులు. 4. నడువనడచి రప్పుడు—వీ.శ ష ; నడువ—కొన్ని ప్రతులు.

102 1. కావళీ – శ.ష. 2. కృతులర్పించు – వీ.శ.ష.స. 3. గప్పించు ; గంపించు – అని పాఠములు. 4. ఠంకృతి – పెక్కు ప్రతులు. 5. సంపాదించు – ఆ.ఓ.ఖ.ఘ.చ.ల ; నిభావించు – వ. 6. నినదములును – చ. 7. నంబుద – ఖ. 8. నందంబు – ఒ ; నట్టిట్టుగాఁజేయు – ఖ ; నడ్డంబు – ల ; నల్లన – చ. 9. సమున్నతములు – ఈ ;

తే. జారు [10]భీషణ రేఖలు భూరిమదభ
రాభిరామయానంబులు నాహవోచి
తోగ్ర[11]కల్పనవాభంగులు నుల్లసిల్లఁ
గరులు ధాత్రితలంబు గ్రక్కదల నడచె.

103 చ. గతిబహుతాలసత్ఖుర[1]విఘట్టిత మేదిని జీవితేశక
ల్పిత[2]నఖరేఖలం జెలువు పెంపు వహించుపురంధ్రిఁ బోల ను
ద్ధత[3]ముఖబంధురాంగ[4]లలితంబులు నూర్జితకింకిణీఝు[5]ణ
త్కృతిపటు[6]హేషలుం దగ నుదీర్ణములై నడచెం దురంగముల్.

104 సీ. మీఱిన[1]యుబ్బున [2]మిఁదికిఁ [3]గాళులు
సాఁచురథ్యంబుల [4]చటులతయును
[5]లలి బెండ్లికినిఁ బో[6]వుచెలువున విలసిల్లు
సూతజనంబు విస్ఫూర్జితంబు
జతనంబు[6]మేలిమిఁ జారు[7]ఘోరము లగు
నవయవంబుల విభవాతిశయము
[8]బిరుదుల నుద్భటస్ఫురణంబులై క్రాలు
కేతనంబుల సముద్ద్యోతితంబు

తే. సొంపు [9]మిగులంగ జోడుల యంప[10]పొదుల
దీప్తులును లేఁత[11]నవ్వులదీధితులును
[12]హార[13]రశ్ములుఁ గిక్కిఱ నగుచు వెలుఁగఁ
దేరు లరిగె నుద్దామతఁ గౌరవేంద్ర.

---

సమున్నతులను — ఓ.న. 10. భూషణ - అ.ప.న. 11. కల్పితాభరణములుల్ల—అ.ప.

103 1. విఖండిత — పెక్కు ప్రతులు; విఘట్టన — ఓ. 2. నవ — ఎ.ప.వ; బహు — ఔ. 3. దృఢ - ప; ముగ—జ; మగు — వ. 4. కలితంబుల - ఈ.ఔ.త; లసితంబులు — ప. 5. ణంకృతులు సెలంగహేషలను — పీ.శ.ష. 6. ఘోష(లం) లుం - కొన్ని ప్రతులు.

104 1. రయమున — ఏ. 2. మింటికి - పెక్కు ప్రతులు. 3. గాళ్ళను - పెక్కు ప్రతులు; మోరలు - శ; నిరుగాళ్ళు - ఔ. 4. చతురతయును — ఓ చ. 5. లీలఁ బెండ్లికిఁ బోవు పోలి(కె)క - ఈ.ఎ.ఐ.గ.చ.ట.పీ.శ.ష; లీల బెళ్ళికి బోవు పోలిక - వ. 6. బలిమియు — ఇ; మేలిమిచారు — ప.పీ.శ.ష. 7. పూర — ఊ.వ; ఘోష — చ. 8. బిరుదునైనిక రథ — చ. 9. మీరగ - చ. 10. గముల — అ.ప. 11. నగవుల — పెక్కు ప్రతులు. 12. హార - పెక్కు ప్రతులు; హారగుచ్ఛులు - ఐ.గ; హారరశ్ములకును దోడులై వెలుంగ — పీ.ష; నిబ్బరంబుగ దశదిశల్నిండివెలుఁగ—శ; హారరశ్ములను దిరమగుచు వెలుగ — ఈ; హారరశ్ములు నొగి బెడగైవెలుంగ - ఔ.ట.ప.వ. 13. రుచులు - ఐ.గ.

105 చ. కడఁకయు లావునుం [1]గరఁగి గట్టిగఁ గూర్చి యొనర్చి[2]నట్టి పే
[3]రొడళులఁ దాల్మియుం [4]గడిమియుం గలయం [5]బరికించి యందు [6]నే
ర్పడుకొని గాఢభంగి రచియించినచందము నెమ్మనంబులం
గడుఁ జెలు వొంద [7]నుబ్బి వడిఁ గాల్బల మేఁగెఁ గరం బుదగ్రతన్.

106 వ. ఇట్లు కురుబలంబు సమరతలంబు చేరం బోవునంతం బాండవబలంబును జను దెంచె ననిన విని యాంబికేయుండు సంజయున కి ట్లనియె.

107 తే. సురనదీసుతుచావును గురునిచావుఁ
గర్ణుచావును వినిననాకర్ణములకు
శల్యుచావు దుర్యోధనుచావుఁ జెప్పి
యధిక [1]తరముగ [2]సంతోష మావహింపు.

108 క. అమ్మద్రవిభుని ధర్మజుఁ
డెమ్మెయిఁ [1]బరిమార్చెఁ గౌంతేయుని భీముం
డెమ్మెయిఁ [2]గీ టడఁచె రణం
బెమ్మెయిఁ [3]బరిపాటిఁ జెల్ల [4]నేర్పడఁ జెపుమా

109 వ. అనుటయు [1]సంజయుం డమ్మనుజపతి కి ట్లను వగచుకొలంది కడ చనియె ధీరుండ వై వార్త లవధరింపుము.

110 క. గంగాసుతగురుకర్ణుల
సంగరమునఁ బాండుసుతులు సంపుట గన్నా
రం గనియు నీతనయు లా
సం [1]గూరిరి [2]వారిఁ జంపు శల్యుం డనుచున్.

---

105 1. గలిగి — వీ.శ.ప. కొన్ని ప్రతులు; గడగి — ఇ. 2. పేర్చి — ఈ.త. 3 రొడళులు — వీ.శ; రొడల(లు)ను — ఔ.గ.న. 4. గలిమి — ఐ.గ.ల. 5. బిసికించి — కొన్ని ప్రతులు. 6. నేర్పడి — పెక్కు ప్రతులు ; 7. నుద్దవిడి — వీ.శ.ప ; నట్టిగతిం — ఇ ; నబ్దిగతిం — ఉ ; నుబ్బువడి — ఊ.ఎ ఘ.ట ద.ప.

107 1. తరమగు — పెక్కు ప్రతులు. 2. శోకంబునావహించె — ఈ ; శోకంబు నావహింపు — ఎ ; సంతోషమాచరింపు — ల ; సంతాపమాచరింపు — చ.

108 1. గీట(ణ)డచె — ఎ.ఓ.ఔ.క. చ.జ.ట.త.ద.ల. 2. బరిమార్పె — ట. 3. బాటిల్లె నాకు నేర్పడ చెపుమా — ట. 4. నెరిగింపుతగన్ — చ.

109 1. నతండ — ఆ.ఉ.ఔ ; నాతండ — ఓ ఘ.

110 1. గూడిరి — ఖ.ప. 2. వారింజయించుశల్యుండనుచున్ — క.

111 వ. దుర్యోధనుండు దిక్కు మాలి యుండియు [1]నడియాసం జేసి తన్ను సంపన్నునిం గాఁ దలంచుచు.

112 చ. అనుజులుఁ దాను శల్యునిఁ బ్రియాతిశయంబునఁ జేరఁ బోవ నా
యన మును కర్ణుఁ డర్జునశరాహతిఁ గూలిన నుబ్బి భీముఁ డా
ర్చిన నడ లొంది తల్లడిలుచిత్తము లూఱట నొంద వారలం
గనుఁగొని పల్కులన్ శ్రుతిసుఖం బొనరించె నుదగ్రమూర్తి యై.

113 వ. ఇట్లు సమరోత్సాహసమగ్రుం డయినమద్రపతి సర్వతోభద్రవ్యూహంబు [1]వన్నించె నందు ముఖంబున [2]మద్రపతి గర్ణపుత్ర[3]ప్రముఖ పరివృతుం డై తాను నిలిచె వలపట శకయవనసమేతుం డై కృపాచార్యుండును దాఁపటఁ ద్రిగర్త[4]సహితుం డై కృతవర్మయు వెనుకఁ గాంభోజ[5]సహాయుం డై యశ్వత్థామయు నడుమఁ గురువీరపరి[6]రక్షితుం డయి [7]కౌరవేశ్వరుండును నతని[8]ముందటఁ గరిఘటాగ్రభాగవర్తి యై బహులచతురంగంబులతో[9]డ శకునియు నిలుచు నట్లు గా నొనర్చి పేర్చి యురవణించె నంతక[10]మున్న పాండవులు మూఁడు[11]మొగంబులు గా మోహరించిరి ధృష్టద్యుమ్న శిఖండిసాత్యకు [12]లగ్రేసరులుగా భీమార్జును లగ్రజునగ్రభాగంబున [13]శోభిల్లి [14]సితారూపవిద్యోతితం బై నశల్యుకేతనంబు [15]సూచి త్రోచి నడచి రనిన విని ధృతరాష్ట్రుం డప్పటికి మనకుఁ [16]బాండవులకుం గల సేనాంగంబులకొలంది యెఱింగింపు మనవుడు సంజయుం డాజన

---

111 1. నయ్యాసం జేసి — ఈ.ఎ.ఏ.ఐ.ఔ.గ.జ.ట.వ.

113 1. వన్నించియందు — ఊ. 2. శల్యుండు — పీ. 3. ప్రకరపరి — కొన్ని ప్రతులు. 4. సహాయుండై — కొన్ని ప్రతులు. 5. సహితుండై — కొన్ని ప్రతులు. 6. వృతుండై — పెక్కు ప్రతులు. 7. నీ కొడుకును — అ. 8. ముంద (ర) రం — ఉ.జ.త. 9. నీమరందియు — అ.ఎ; బలసిశకుని — ఆ.ఎ.ట. 10. మున్న — ఆ.ఈ. 11. మొగ్గరంబు (లు)గా — ఇ.ఏ.జ: మొనలుగా — ఓ.న; మూకలుగా — చ. 12. లునగ్రేసరులు — చ. 13. శోభిల్లి రి — ఊ ల.వ.పీ. 14. శితారుణవిద్యోతి — పీ.శ; పేతాంగరూపద్యోతి — వ; శితతాళరూపద్యోతి — ఎ.వ; శిలారూప — వ; శితారూపద్యోతి — ఇ.ఘ.జ.ట. 15. చూ (చి) చు కొని — ఔ.క.ట.త. 16. బాండునందనులకుం — కొన్ని ప్రతులు.

[17]పతి కిట్లను మనకుఁ బదునొకండు వేలు రథంబులును బదివేలు నేడునూఱు గజంబులును రెండులక్షలుహయంబులును మూఁడుకోట్లు పదాతులును వారికి నాఱు[18]వేలు రథంబులును మూఁడు[19]వే లేనుంగులును లక్ష గుఱ్ఱంబులును కోటికాల్బలంబులును గలిగియుండె నయ్యొడ్డనంబు లొం డొంటి గెలుచు నగ్గలిక డగ్గఱియె నట్టియెడ.

114 ఉ. ఒండొరులన్ జయించుమతి నుద్భటలీలలఁ జాల నొప్పి య
పాండవకౌరవుల్ పెనఁగుభంగిఁ గనుంగొనువేడ్క [1]నొక్కొ యీ
తండు మహోద్రి నెక్కె ననఁ దద్దయుఁ జెన్నగుబింబకాంతి న
ర్కుం డభిరాముఁడై పొడుపుగొండపయిన్ వెలుఁ గొందెఁ [2]జూడఁగన్.

115 చ. అరసి యనాగతం బెఱుఁగునట్టిమనంబులు గల్గుపాండుభూ
వరసుతబంధుమిత్రకురువర్గసుహృజ్జనకోటు లత్తఱిం
బొరసె నతిప్రమోదమును భూరివిషాదము [1]నాఁగ నంబుజో
త్కరము [2]వికాస మయ్యెఁ గుముదంబులు మీలన [3]మొందె నెంతయున్.

116 సీ. కుంజరనికురంబకుంభ[1]స్థలీసంగ
సింధూరరుచులతోఁ జెలిమి చేసి
కేతనవ్రాతసంకీలితమాణిక్య
రశ్ములఁ[2]గెడ విహారంబు సలిపి
సైనికనికర[3]వక్షస్థలపరిలిప్త
కాశ్మీర[4]దీప్తులఁ గాఁగిలించి
దండనాథోత్కరచండ[5]భావోద్వృత్త
చక్షుః[6]ప్రభలఁ దారు సరస మాడి

---

17 నాథున కిట్లను — కొన్ని ప్రతులు. 18. వేల - కొన్ని ప్రతులు. 19. వేలమాతం గంబులు లక్ష హాయంబులును — ఆ.

114 1. జేసి — ఘ ; బూని — చ. 2. నెంతయున్ - వీ.స.

115 1. గాఁగ — శ. 2. వికాసి యయ్యె — జ. 3, మయ్యె - ఓ ట.వ ; బొందె — కొన్ని ప్రతులు.

116 1. స్థలంబులు - ఐ. 2. తోవిహారం — అ.పీ.ష ; క్రీడవిహారం — ఈ ; యొడ పహారం — ఆ.ఎ.ట.వ. 3. వక్షస్థలి — ఇ.ల. 4. దీధితుల్ — శ.స. 5. ఫాలో — ఉ.శ. 6. ప్రభలతోడ — అ.వీ.శ ; ప్రభలతో (న) ను — ఆ.ఖ.

తే. యంశుజాలంబు లుభయసైన్యంబులందుఁ
బరఁగి బహువిధశస్త్రాస్త్రకిరణతతుల
బెరసి [7]పరభాగలక్ష్మి దీపించి [8]మెఱయ
బ్రాహ్యరమణీయుఁ డగుచిత్రభానుఁ డొప్పె.

—: కురుపాండవుల పదునెనిమిదవనాఁటి యుద్ధప్రారంభము :—

సం. 9—7—43

117 వ. [1]ఇట్లు పూర్వసంధ్యాసమయంబునఁ దార్కొని భేరీప్రముఖ తూర్యనిస్వనంబులు నింగి వొంగం జెలంగ.

118 క. ఒండొంటిఁ దాఁకి హేతులు
మండఁగఁ [1]దచ్చూర్ణతతులు మహి రాలఁగ ను
ద్దండతఁ గలయం బెరసెను
రెండుమొనలుఁ గ్రూరతరపరిస్ఫురణము లై.

119 వ. ఇత్తెఱంగునఁ దలపడి.

120 క. అరదంబులు నరదంబులఁ
గరులు గరుల హరులు హరులఁ గాల్వురు మఱి గా
ల్వురఁ దాఁకి [1]పెనఁగెఁ గడుభీ
కరభంగులు మెచ్చు[2]దేర గగనచరులకున్.

121 చ. పెనుపున నాకసం [1]బవియ బృంహిత[2]ముల్ దము నుగ్రగర్జిత
స్వనములతోడి మేఘములచందము గా నొనరింప మీఁది యో
ధనికర మేయు సాయకవితానము [3]భీషణవృష్టి [4]గా రయం
బునఁ బలుకొన్న యేనుఁగుఁలపోరునఁ దేరులు దేలె నెత్తుటన్.

---

7. యంబరలక్ష్మి - ఐ.వ ; ప్రాగ్భాగలక్ష్మి - స. 8. వెలయు, బెరయు, మెరయు — అని పాఠములు.

117 1. అట్టి — ఇ.ట.ద.ల.

118 1. దతూర్ణ — బ.

120 1. పెనగిరతి - పి.శ. 2. సేయ — ఎ.ట.న.

121 1. బద్రువ - గ. 2. నాదములుగ్ర — అ.వ.న; ఘట్టమునుగ్ర - త ; ముల్ సముదగ్ర - ఊ.ఖ.చ. 3. భీకర - ప.క.చ.జ.బ.వ ; భీకరలీల - ఇ; భీకరదృష్టి - బ. 4. కారణం — ఉ.ఊ.

122 తే. కరులఁగమి వారిచి [1]రథముల్ గాలుకొనఁగ
నీక మంలిన ఘోట[2]కానీకములను
బిరుదుమగ[3]ల మొత్తములను బిండిపిఁచు
సేయు బలితంపునేర్పు ల[4]చ్చెరువుఁ [5]బెనుఁప.

123 క. పటురయమున నాశ్వికు లొ
క్కటఁ బెక్కం డ్రెక్కి [1]రథనికరము[2]లు ఘుడిఱి
త్రుటితాకృతులుగ విహరిం
చుట యెక్కుడు వేడ్క సేయ సురగణము[3]నకున్.

124 క. పలువుర[1]నొక్కఁడు నొక్కని
బలువురుఁ దెగటార్చుటయును బలుదెఱఁగులమూఁ
[2]కలు పలుదెఱఁగుల దలఁపడి
పొలియించుట [3]పొలియుటయును బోరి నుగ్రముగన్.

125 క. చలమునఁ బోక పెనఁగు కా
ల్బలము పయిం దురగమును నిభంబులును రథం
బులుఁ గూడి [1]కవిసి యంతిం
తలు [2]దునియలు సేఁత [3]యనుచితక్రౌర్యముగాన్.

---

122 1. రథికుల్ - కొన్ని ప్రతులు ; రథికుల్ తెరలఁజేయ బరచినట్టియా ఘోటక-ట.ప.వ. 2. కప్రకరముల(లు)ను - కొన్ని ప్రతులు. 3. లు (ల) నమర్చిన-ట.ప.వ. 4. చెలువు-అ.ల. 5. గాఁగ — వీ.శ.ప. కొన్ని ప్రతులు.

123 1 యోధనికరములు ఘటిత - త. 2. లనువెసం-ఓ.ట. 3. లకున్ - పెక్కు ప్రతులు.

124 1. నొక్కండొక్కరుబలు — ఆ.వ. 2. కలువల — కొన్ని ప్రతులు ; కలుగూడి (బహువిధంబుల) పలు దెరంగులదల — ఒ.ఔ.జ ; కలువలపటరణముననుంబొలి — న. 3. తలపగనచ్చెరువునైయుదగ్రంబులుగన్ — కొన్ని ప్రతులు ; పొలియించుటయును దగ్రంబులుగన్ — ఒ.ఔ.జ.

125 1. కదిసి — ప.ఒ.చ. 2. తునుకలు — కొన్ని ప్రతులు. 3. యధికదారుణమయ్యెన్ — వీ.శ. కొన్ని ప్రతులు.

126 క. తెల్లని[1]సవరణ మెఱయ స
ముల్లసితము లగు తురంగములమెుత్తము చం
[2]చల్లలితపక్షములు శో
భిల్లుగతుల నొప్పునంచపిండుం బోలన్.

127 వ. అయ్యిరువాఁగు[1]ను బేరు వాడు నప్పుడు.

128 క. గుణనినదము [1]రథనేమి
[2]క్వణనంబుం దురగఖురరవముఁ గరిఘంటా
రణనమును హేణిసంఘు
ర్షణనాదముఁ దూర్యఘోషసంపదఁ [3]గడచెన్.

129 సీ. నెత్తుటఁ [1]దోఁగియు నిగిడి పొరెడు[2]వీరు
లలరి[3]న నడ[4]మోదుగులవిధంబు
గ్రక్కున దెగిపడి [5]కదలెడుబాహు
దండములు మహాభుజంగముల[6]భంగి
యవని రక్తాక్తంబు లై యున్న [7]యట్టిబల్
దలలు గెందామరకొలనిపగిది
దలుచుగా నెఱి దప్ప నొఱగినగజములు
గులిశభగ్నాచలకులమునట్లు

126 1. సవరములు మెఱయ — శ ; చాయలు మెఱయ — ఇ ; మేనులు మెఱయ — ఒ.బ.
2. పుల్లనవక్షంబులు — వ ; చల్లసిత — వ.

127 1. బెనంగు నప్పుడు — ఎ.వ ; ను బోరాడునప్పుడు — ఘ ; నుబేరువా(రు)డినప్పుడు— అ.ఖ.ల.వ.

128 1. రణ — వా. కొన్ని ప్రతులు — రథ — కొన్ని ప్రతులు. 2. క్వణమునుదురంగ— అ.ఓ.చ. 3. నొందెన్, నణచెన్ — అని పాఠములు.

129 1. గడుదోగినిగిడి — శ ; దొణగియునిగిడి — వ 2. ధీరులడరిన — న. 3. పూచిన — అ. 4. మోదుగులు — కొన్ని ప్రతులు; మోదువులు — ట.స. ఈ రూపములు 'శర'లో లేవు. 5. క్రాలెడు — ల. 6. కరణి — ఓ క.చ జ. 7. పుట్టువుల్ — స.

తే. దునిసి తొఱఁగినజోదులతోడలు సామ
జములకరములు నొండొంటి[8]చందములు గ
నంగొనఁగ వింత లగుటను సంగరాంగ
ణంబు రమణీయమును భీషణంబు [9]నయ్యె.

130 తే. ఏమి చెప్పుదు [1]రౌద్రంపు[2]సెసకమందుఁ
దఱచు[3]మెదళులు ఔంపులు నుఱుము లైన
యెమ్ము లిసుకయు సితచామరమ్ము లంచ
లయ్యె రుధిరంపుటేరుల కప్పు దధిప.

131 క. విను మయ్యెుఱలలో [1]వా
హానములె యోడలుగఁ జూడ నక్కజ మగు ను
క్కున నుద్దామవిహారం
బొనరించిరి వీరయోధు లుర్వీనాథా.

132 వ. ఇవ్విధంబునం బోరు ఘోరం బై [1]చెల్లుచుండ నుల్లసితవిక్రమవిజృంభితు లగుభీమపార్థులు నలిరేఁగి నారాచప్రముఖనానావిశిఖంబుల మన[2]మొనఁ గనుపు గొట్టిన నది [3]బెగ డొంది మగిడిన నమ్మోటిమగ లుబ్బి [4]పాంచ్ర దేవదత్తంబు[5]ల నొత్తుటయు ధృష్టద్యుమ్నుండును శిఖండియు గాంతే యాగ్రజు [6]మున్నిడికొని తఱుమఁ దోడన కవలును [7]గడంగి రట్లాటోప

---

8. చందమనఁగ—శ.ప. కొన్నిప్రతులు. 9. నయ్యె—పెక్కు ప్రతులు ; లయ్యె - వా

130 1. రక్తంబుసెసగుచుండ - ద. 2. సెసకమందు — ఉ.ఒ.ఓ.త; సెసకమెసగ — ఒ.బ.న. 3. మెదడులు — అ.ఆ.ఏ.ఒ.

131 1. వాహనము(ల)లు — కొన్ని ప్రతులు.

132 1. చెల్లెనుల్ల — కొన్ని ప్రతులు. 2. మొనలు — వ; మొనల — ద. 3. యుబ్బునం — ల. 4. పాంచజన్యదేవదత్తంబులో — ఈ.చ.ట.త.ద. 5. లొత్తుట - పెక్కు ప్రతులు. 6. మున్నిడు — ఆ.ఔ.ఖ.చ.వ. 7. తొడంగి — ల.

దీపితు లైన పాండవేయులయురవడికి [8]నో టఱి నీబలంబు [9]హాహా
కారంబులతోఁ [10]బలుదెసలఁ బఱవం [11]దొడంగినం గనుంగొని [12]శల్యుండు
సారథి కి ట్లనియె.

133 ఉ. అల్లదె కంటె పాండుతనయాగ్రణి తేరు సితాశ్వయుక్త మై
తెల్లనియెల్లి నొప్పినది తీవ్రత మార్కొని యాన్నృపాలుశో
భిల్లుట మాన్పఁగా వలయు భీషణభంగి రథంబు వోవ ని
మ్మెల్లజనంబు నాకడిమి యేర్పడ నేఁ డెఱుఁగంగఁ జేసెదన్.

134 ఆ. సురల నైన [1]గెలుతు దురమున విను నాకుఁ
బాండు[2]పుత్రు లెదురె భండనమున
నేర్పుబలుపుఁ జూపి నిన్ను [3]మెప్పింతు నా
చేతి[4]బరువు సూడు సూతవర్య.

135 వ. అనుటయు వాఁడు పాండవబలంబుల కెదురుగా నరదంబు సముచిత
రయంబున నడప నమ్మద్రపతి సముద్ర[1]సముద్రేకంబుచందం బైనయా
సైన్యంబు [2]సరభసత్వంబు చెలియలి[3]కట్టయుంబోలి యుడుపుట యచ్చెరు
వై యుండె నట్లు శౌర్య[4]ధైర్యంబుల నుల్లసిల్లుశల్యుం జూచి మనమూఁక
లును మగుడ నిగిడిన సంగ్రామంబు భీషణం బయ్యె నందు నకులుండును
గర్ణ[5]పుత్రుం డగుచిత్రసేనుండును దలపడి యొండొరువుల[6]కుఁ గృతా
స్త్రత్వంబును సమరవిశారదత్వంబును జూపుచుం జెనంగునెడ నా సూత
[7]పౌత్రుండు.

---

8. నోడి మనబలం - ప; నోటరి మనబలంబు — అ.ప.చ. 9. లాహో — ఆ.క.ద.వ.
10. దెసలకుంబరచినం - పెక్కు ప్రతులు. 11. దొడంగిన - పెక్కు ప్రతులలో లేదు.
12. శల్యుండు తన సారథి — అ; శల్యుండునిజసారథి — ద.

134 1. తనయులెదురె — చ. 2. బరువు — అ. 3. మెచ్చింతు — ద.వ; నొప్పింతు - వ.
4. బలువు — ఓ.త.

135 1. సముద్రితంబయిన చండంబున సైన్యంబు — ఐ; ముద్రేకంబైనచందంబున — వీ.శ.
2. సంరంభంబు - ఒ.చ.జ.న.ల.వ. 3. కట్టయైనిలువ — వీ.శ.మ. 4. భుజవీర్యం
బుల నుల్లసిల్లు — కొన్ని ప్రతులు. 5. నకులనందనుండు — వ. 6. కచ్చెరువగు — వ.
7. పౌత్రుండు — పెక్కు ప్రతులు; పుత్రుండు - వా.

## —: కర్ణుకొడుకులు చిత్రసేనసత్యసేనసుశర్మలు నకులునిచేతఁ జచ్చుట :—

సం. 9-9-12

136 చ. నకులునిచాపదండము ఘనప్రదరంబునఁ [1]దున్మి భాస్వరాం
బకము[2]లు మూఁడు [3]దీవ్రగతి ఫాలతలంబున [4]నాటి త్రుంచె ఘో
టకములఁ గేతనం బిలఁ బడన్ [5]విదళించి వధించె [6]సూతు ఖే
టకమును ఖడ్గముం గొని [7]కడంగ బయిం బరఁగించె భల్లముల్.

137 క. ఆనిశితభల్లములు దన
మేనికి రాకుండఁ బలుక మెఱయ జడియుచున్
వే [1]నిగిడి [2]కదిసె మాద్రీ
సూనుం డా[3]సూతసూతిసూనునరదమున్.

138 తే. కదిసి మీఁదికి లంఘించి మద మెలర్ప
గళము దునిమిన [1]నమ్మస్తకంబు డొల్లెఁ
గర్ణపూరకిరీటసంకలితవివిధ
రత్నరోచులు [2]మెఱయ ధరాతలమున.

139 వ. ఇట్లు చిత్రసేనుండు వడినం కనుంగొని కౌంతేయసైనికు లార్చినం తేర్చిన శోకరోషంబులు మనంబుల ముప్పిరిగొన వానిసోదరులు సత్యసేనుండును సుశర్ముండును నప్పాండుపుత్రుపైఁ గవిసిన నతండు వేఱొక్క తేరెక్కి బలువిల్లెత్తి దండధరప్రచండమూర్తియై మార్కొనిన నబ్బిరుదుమగ లయ్యరదంబు భల్లంబుల నఱకం దొడంగి[1]న నుఱక చిఱునవ్వు [2]నవ్వి.

---

136 1. ద్రుంచి—పెక్కు ప్రతులు. 2. లమూట దీవ్ర — శ. 3. శీఘ్ర—ఐ. ; తీవ్రముగ—బ. 4. నాటజేసి — ఖ. 5. విహరించి వధించె — ల.వ. కొన్ని ప్రతులు. 6. సూత — ల. 7. కడంగినపై బరగించె — ల వ. కొన్ని ప్రతులు.

137 1. నిగుడి — ఐ.ష. 2. కవిసె — వ. 3. సూనుసుతు — వీ.శ.ష ; తనయుసూను రథంబున్ — ఔ ; సూనుసూను రథంబున్ — పెక్కు ప్రతులు.

138 1. దన్మస్తకంబు — కొన్ని ప్రతులు. 2. వెలయ — ఓ.త.

139 1. ననవ్వీరుండు — వ. 2. నవ్వుచు — వీ శ.ష.

140 చ. కడువడి సత్యసేనుతురగంబులఁ గూల్చి శరాసనంబుఁ జ
క్కడిచిన నొండుతేరికి రయంబు మెయిం జని యన్యచాప మె
క్కిడుటయు నక్కుమారుశిశితేషుయుగంబున నొంచి [1]నొంచెఁ గ
వ్వడియనుజన్ముఁ డుగ్రుఁ డయి వానిసహోదరు [2]రెండుతూపులన్.

141 తే. అతనిధను వాసుశర్ముఁ డుద్ధతి [1]వలిర్పఁ
[2]ద్రుంచుటయు నొండువింట బల్తూపు లొడలఁ
బఱపి వాని[3]శిరంబును నఱికి సత్య
సేనువిలు ద్రుంచె [4]నాపాండుసూనుఁ డధిప.

142 శా. ఆరాధేయ[1]తనూజుఁ డన్యధను వుగ్రాకారుఁ డై యెత్తి దు
ర్వారప్రక్రియ [2]నేసె నాఽశిఖముల్ వారించి యాతం డతి
క్రూరస్ఫార[3]శరత్రియం బతనివక్షో[4]భిత్తిఁ గీలించి వే
నారాచంబులు రెండు [5]దమ్మునిమెయిన్ [6]నాటెం గడున్ బెట్టుగన్.

143 క. [1]వా రలిగి యొక్క[2]యుమ్మడి
సారథిఁ దెగటార్చి [3]యార్చి చాపము దునియం
జేరు వికలముగ మేను వి
దారితముగ నేసె [4]రత్యుదగ్రస్ఫురణన్.

144 వ. ఇవ్విధంబున.

---

140 1. త్రుంచె — శ. 2. డేడు — ల.

141 1. మెలర్ప — పెక్కు ప్రతులు. 2. దునుముట — ఐ.గ. 3. సిడంబు — ఓ.చ.ద.న.ప.బ.వ.శ.ష. 4. నమ్మాద్రి — అ.ప.

142 1. కుమారు డన్య — వ. 2. నేసి వాని శరము ల్వారించి — గ. 3. శరద్వయం — పెక్కు ప్రతులు; శిలీముఖం బతని — న.ప. 4. వీథి — అ.ఊ.ఐ.ఖ. 5. మాద్రిజు మెయిన్ — ఐ.గ. 6. నాటించెదాబెట్టుగన్ — ల.

143 1. వారిరువురు నొక్కుమ్మడి — ల.వీ.శ.స; వారలలిగి యొక్కుమ్మడి — వ. 2. మాటున — ఓ. 3. పేర్చి — అ.ఒ.జ.బ; యతని — ల. 4. రుద్రదర్ప — పెక్కు ప్రతులు.

145 మ. విరథుండున్ వినికృత్తచాపుఁడు శరావిద్ధుండు నై మేదినీ
[1]వర [2]నీపుత్రుఁడు చంచదుగ్రతర[2]జిహ్వాం బైనచండాహి [4]నాఁ
గర మాభీలతఁ బోల్చుశక్తిఁ గొని యల్కన్ సత్వరుం [5]డయ్యె సు
స్థిరసంరంభత [6]సత్యసేనుఁ బడవైచెం జూప అగ్గింపఁగన్.

146 ఆ. అన్న [1]పాటు సూచి యనుజుఁ డుల్లంబున
నడలు కనలుఁ గదుర నంపవానఁ
గప్పె నకులు నంతఁ గాంచి భీము[2]కుమారుఁ
డెయిదె నతనియరద మెక్కె నతఁడు.

147 వ. ఇట్లు ద్రౌపదేయుం డగుశ్రుతసోమునియరదం బెక్కి బలువిల్లు గొని యక్కుమారుండును దోడుపడ నాసుశర్ముని బటుశరపరంపరలం బొదివినఁ బొలి[1]వోక యతండు.

148 తే. వాఁడితూపులు [1]నకులుమై మూఁడు నాఁటి
యిరువదింటఁ దత్పుత్రునియురము నొంప
నర్ధచంద్ర[2]బాణాహతి నవ్విరోధి
శిరము [3]దునిమె నప్పాండుభూవరసుతుండు.

149 శా. మాద్రీ[1]పుత్రునిచేతఁ గర్ణసుతు లీమాడ్కిం బడం [2]జూచి వీ
రోద్రేకం [3]బెడలంగ నీసుతుబలం బొక్కుమ్మడిన్ విచ్చిన
న్మద్రాధీశుఁడు సింహనాదము [4]రణన్మౌర్వీసముల్లాసమున్
రౌద్ర[5]ప్రక్రమసూచకంబులుగ సంరంభస్ఫురన్మూర్తి యై.

---

145 1. శ్వర — క.చ.న. 2. పుత్రుండును — ఖ.చ. 3. రూపం — ఖ ; భవ్యం — త. 4. భీకర — ఖ. 5. డయ్యు — పెక్కు ప్రతులు. 6. చిత్ర — ఖ.

146 1. పడుట — చ.న.ల. 2. ని కొడుకై — పెక్కు ప్రతులు.

147 1. వోవక — పెక్కు ప్రతులు.

148 1. నకులుపై — ల. 2. బాణంబున నవ్విరోధి — త. 3. ద్రుంచె — ద.

149 1. సూనుని — కొన్ని ప్రతులు. 2. గాంచి — పెక్కు ప్రతులు. 3. బడరంగ — ఐ.ఒ.క.ఖ.గ ; బుదలంగ — శ. 4. ధనుర్మౌర్వీ — ఇ.ఉ.జ.వ. 5. ప్రిక్రియ — ఐ.ఒ.ఔ.క.బ.వ.

150 తే. హస్తతల మెత్తి నిలునిలు మని యదల్పఁ
బోక తిరిగి యమ్మూకలు పోరి కమరెఁ
బాండవేయుల [1]మొనలు సుద్దండవృత్తి
నురవణించిన సంగర ముగ్రమయ్యె.

151 చ. అదరి ధనంజయాదు లగునక్కడి[1]వీరులు విక్రమింప ని
క్కడ భవదీయనందనముఖ[2]ప్రభవోద్భటయోధవర్గము
ల్వడిఁ దలుమంగ నప్పు[3]డు బలద్వయముల్ విశిఖాగ్ని [4]పేర్చి యె
క్కుడ[5]యినభీతి [6]నొందె రణఘోరత భూవర యేమి సెప్పుదున్.

152 వ. ఇట్లు [1]మథితం బయ్యును పౌరుషంబు పెంపున నిరువాఁగును వేగంబు [2]గుందక వింతచందంబునం బేర్చు[3]క్రందు గగనచరులకు గన్నులపండువుగా బృంహితధ్వనులను ఘంటానినదంబులను నేమినిస్వనంబులను కేతుకింకిణీక్వణనంబులను [4]రింఖారవంబులను హేషాఘోషంబులను భుజా[5]స్ఫాలనంబులను సింహనాదంబులను [6]దిక్తటభేదనం బొనర్పనద్భుతోత్సాహంబున నాహవక్రీడ [7]సలుపుచుండఁ బుండరీకాతురక్షితు లగు పాండుపుత్రుల బల శౌర్యసంపదల సొంపునం బెంపొదవు ధృష్టద్యుమ్నశిఖండిసాత్యకిప్రముఖులైన దండిమగలు గూడికొని తలుమ [8]దారుణనైపుణంబున [9]బాహాటోపంబు సూపినఁ గార్చిచ్చు గవిసినం[10]గలంగు మృగకులంబుకైవడిం గౌరవసైన్యంబు దైన్యంబు నొందిన.

---

150 1. బలము – ద.న.వ.

151 1. వారలు, యోధులు–అని పాఠములు. 2. ప్రబలోత్కట–ఆ.ఈ.ఉ.ఎ.ద.వ.పీ.శ.ష; ప్రముఖోద్భట – ఔ.త. 3. డనివారణ నయ్యిరువాగు వారు – పీ.శ.ష. 4. దేర్చి, దేలి, నేర్చు, బేర్చి - అని పాఠములు 5. డునగు, డువడి, డుగడు, డుగను, డుగతి- అని పాఠములు. 6. నొందిరని – పీ.శ.ష ; బొందిరణ – కొన్ని ప్రతులు.

152 1. మర్దితంబయ్యును – ఐ.క.గ.జ.బ.వ ; విమథితంబులయ్యును – ఓ.వ. 2. నుగ డంకయునుగుందక బెగడువడక గగన - పీ.శ.ష. 3. కయ్యంబు – న. 4. ధనుష్టంకారంబులను – పీ.శ.ష ; శంఖారవంబులను – ల.వ. కొన్ని ప్రతులు. 5. స్ఫాలనధ్వానంబులను - పెక్కు ప్రతులు. 6. దిక్తటంబులు బీటలువార - పీ.శ.ష. 7. చె(సె)ల్లుచుండ-ఆ.ఔ.క.ఖ.చ.జ. 8. దారుణవిక్రమంబు–చ. 9. మహా–న. 10. గలంగు – 'న' ప్రతిలో లేదు.

153 క. పెనురొంపి[1]లోపల[2]ను గ్రుం
గిన[3]ధేనువు నెత్తుపోలికిని శల్యుం డ
మ్మొనఁ దనభుజబలమునఁ గలఁ
గని యట్టుగ నిలిపె శౌర్య[4]గర్వము మెఱయన్.

154 వ. నిలిపి పేర్చిన సమయంబున మనదిక్కున నుల్కాపాత ప్రముఖంబులగు దుర్నిమిత్తంబులు [1]వొడమిన నీకొడుకు[2]లు గూడుకొని చేయం గలనైనని కులం [3]గూర్చికొని తిరం బయి పెనంగి రట్లు పెనంగునెడఁ గడంగి [4]తల కడచి మిగిలి మద్రపతి [5]మార్గణాసారంబు వరగించుచుఁ బాండవాగ్రజు నగ్రభాగంబున నున్న భీమసేనసాత్యకిధృష్టద్యుమ్నశిఖండిద్రౌపదేయ మాద్రేయులఁ దాఁకి పది[6]పదిప్రదరంబుల నొప్పించి కదిసి యన్నరపతికిని బదితూపుల వేఁడిమి సూపి మలసినఁ బాంచాలప్రభద్రకబలంబు లొత్తెట్టి [8]బిరుదుచుట్టు ముట్టిన.

155 ఉ. వాలి యతండు బాహువిభవం [1]బలరించినఁ బేర్చి [2]రౌద్రతం
గూలుగజంబులుం గెడయుగుఱ్ఱపు[3]తండముఁ ద్రెళ్లుతేరులుం
గీ లెడలించినట్ల పడుకేతువితానము నుగ్గునూచ మై
రాలుపదాతి[4]వర్గములు రక్తపుటేఱులుఁ బ్రేవుప్రోవులున్.

156 వ. మఱియు[1]ను.

---

153 1. లోనగడు — క. 2. మునింగిన — అ ప; నుగ్రుంగిన — బొ వ. 3. మదకరి — న. 4. గర్వమెలర్పన్ — చ.

154 1. పొడగనియునునీ — ఓ వ. 2. లవిసరకుగొనకచే — అ. 3. బురికొల్పుకొని — జ. 4. తల మిగిలి — పెక్కు ప్రతులు. 5. చండకాండంబులు — అ.ఏ. 6. పదిపటుప్రదరం — పెక్కు ప్రతులు. 7. మలసి — పెక్కు ప్రతులలో లేదు. 8. మగనిం — ఇ.ఉ.ఎ.

155 1. బడరించిన — ఓ.బొ.ట.వ.పీ; బెడలించిన — ఎ; బెదరించిన — ఈ; బొనరించిన — ఇ.ఒ.గ. 2. యుగ్రతన్ — ద; రౌద్రమున్ — పెక్కు ప్రతులు. 3. దట్టులు — ఎ.ట.వ; దట్టపు మూక — ఇ. 4. వర్గమును — పెక్కు ప్రతులు.

156 1. నయ్యవసరంబున — అ.ఒ.

157 క. ఏరూపు లయిన [1]రూపఱ
ఘోరా[2]శను లట్ల శల్యుక్రూరాస్త్రంబుల్
కౌరవులు వొంగఁ బాండుకు
మారులసేనపయిఁ [3]దొరఁగె మనుజాధీశా.

158 వ. అట్లు [1]దొరుఁగుదారుణమార్గణాసారంబున [2]వెగడుపడి యాబలంబు పాండ వాగ్రజువెనుక కొదిఁగిన [3]నమ్మహీపతి [4]పురికొలిపికొని శల్యు మార్కొని నిశిత[5]విశిఖవర్షంబునం [6]బొదవిన నమ్మద్రవిభుండు [7]గ్రూరనారాచం బత నిమేనుచ్చివో నేయ నా ధర్మనందనునకుఁ దలకడచి యే డమ్ముల నవ్వా డముడియు సహదేవుం డయిదుతూపులను నకులుండు నవశరంబులను బ్రతివింధ్యాది[8]దా[9]పదేయులు [9]బహుబాణపరంపరలను నచ్చిరు [10]నేయ నప్పుడు కృపాచార్యుండును గృతవర్మయు శకునియు దత్సుతుం డులూ కుండును నీకొడుకులుం గవిసిరి గురుపుత్త్రుండు [11]మందహాసంబు[12]తో నమందగతి వచ్చి వారిఁ గూడికొని రా నక్కడి[13]సైనికులును [14]రభసంబున నా రథికవరులఁ దాఁకి రట్టియెడ.

159 క. కృపుఁడును ధృష్టద్యుమ్నుఁడు
నుపమాతీతాతిఘోరయుద్ధంబున బా
హుపటుత్వమ్ములు [1]సూపి ర
థిప యొండొరులకు [2]సమత్వ[3]దీప్తాకృతులై.

---

157 1. రూపరి, రూపరు — అని పాఠములు. 2. శనియట్ల — ద. 3. దొరుగు — పెక్కు ప్రతులు.

158 1. దొరగు శరాసారంబున — త. 2 బెగడియాబలం — అ. 3. నమ్మనుజపతి — పెక్కు ప్రతులు. 4. పటుగతింబైకొని — పెక్కు ప్రతులు; చటులగతిపైకొని — త. 5. మార్గణంబు లం బొదివి — ఏ. 6. బొదువ నమ్మద్ర — ఒ.జ. 7. గ్రూరంపు నారసం — పెక్కు ప్రతులు. 8. ద్రౌపదీతనయులు — ఇ.ఓ.ఘ.జ. 9. బాహు — వా; బహు — పెక్కు ప్రతులు; బహువిధ బాణ — ఈ. 10. పై బరగించిరప్పుడు — పెక్కు ప్రతులు. 11. దర — పెక్కు ప్రతులు. 12. తోమందగతి — పెక్కు ప్రతులు. 13. దొరలు సంరంభంబున — ఏ. 14. బరవసంబున — ఊ.క.ఖ ఘ.చ న.ల.

159 1. సూప (పి) ధరాధి — ఇ ఔ.ట.వ. 2. సమగ్ర — ఆ.ఎ.ఔ.ట.ద.న.ప.వ.వీ.శ.స. 3. దీప్తములయ్యోన్ — ఆ.ఎ.ట ద.ప.

160 క. [1]ఒకని నొకరిఁ [2]బదిపదిసా
యకముల నొప్పించె [3]వీరు లగుపాండుకుమా
[4]రకు లేవ్వుర నంతట ద్రో
ణకుమారుఁడు మోము చిఱుతనగవున నొప్పన్.

161 ఆ. వాయుతనయు [1]ఋశ్యవర్ణాశ్వముల మద్ర
పతి ధరిత్రిఁ గూల్చె నతఁడు దేరు
డిగ్గి నిజగదా[2]ప్రతిష్ఠత. జూపెఁ [3]గౌ
రవ్యసైన్యము[4]నకు రాజముఖ్య.

162 క. అనిలజునియశ్వములఁ గూ
ల్చినయప్పుడు [1]శల్యునిం గలితనము మెఱయం
దనయంప[2]వెల్లిచే ముం
చె నకులుతమ్ముండు నీదుసేన దలంకన్.

163 తే. అతనిహయములు నమ్మద్రపతిశరములఁ
బడిన నప్పాండవునిఁ దలకడచి బలము
పొదివె నయ్యోధముఖ్యుఁ దత్పుత్రుఁ డపుడు
గదిసె నాసహదేవుపైఁ గడిమి [1]మెఱయ.

164 చ. కవిసిన [1]దట్ట[2]కెం పడరుకన్నులతోడఁ గృపాణపాణి యై
యవనికి దాఁటి యాతనిశరావలి దున్మించుచుఁ గిట్టి తేరిపై
కి వడిఁ జలంబుమై [3]నరిగి కేళియపోలె శిరంబు దున్మించి పో
యె వెసఁ బొంగ త్త [4]కెక్కె ధరణీశ్వర యొండురథంబు మీఁదికిన్.

---

160 1. ఒకనొకనిని — ఊ ఎ; ఒకరొకరుని — ఘ. 2. పదపడి — ట. 3. ధీరు — అ.ఖ.ద; వీరులగు యోధులకు — ఆ.ఓ.త. 4. రకులగునయ్యేవురద్రోణ — ఇ.ఈ.ఉ.ఎ.ట.ల ; రకులను నేవుర నాద్రోణ — ఊ.గ ; రకులన్నేవుర నాద్రోణ — ద.

161 1. చిత్ర — వీ.శ.ష.స ; దీప్త — ల. 2. ప్రతిష్ఠ — చ. 3. కౌరవుల — కొన్ని ప్రతులు. 4 లకు — కొన్ని ప్రతులు.

162 1. శల్యుదాక్స్థిర శౌర్యమునన్ — వీ.శ.ష. 2. వెల్లువున, పెల్లువున — అనిపాఠములు.

163 1. వెలయ — ఇ.జ.

164 1. దండి — అ ; నట్ల — ఈ.త ; దంట — వ.శ ; నప్పి — వ ; దండ — ఊ. 2. కెంపొదవు — చ. 3. నెగసి — ఆ ఊ ; నెగిరి — ఐ గ. 4. కెక్కె — ద.వీ.ష. కొన్ని ప్రతులు.

165 వ. ఇవ్విధంబున.

166 క. సుతుఁ డీల్గిన మద్రమహీ
పతి శోకక్రోధవేగభరి[1]తాత్మకుఁ డై
శితశరపరంపరల ను
ద్ధతిఁ బాండవసైనికులమదం బడఁగించెన్.

*—: శల్యభీమసేనుల గదాయుద్ధము :—*

సం. 9—10—42

167 క. [1]ఉరవడి రథికజనంబుల
దెరలిచి [2]యేపారుతనదు తేరు మెఱయ ను
ద్ధురగతిఁ గౌంతేయాగ్రజు
నరదమునకుఁ గవిసి [3]వాలురమ్ములు నిగుడన్.

168 సీ. కనుఁగొని భీముండు గన్నుల నిప్పులు
[1]రాల శుండాల[2]కీలాలరంజి
తంబును [3]రిపుసైన్యదైన్యప్రదంబును
నాత్మీయవాహినీహర్ష కరము
నై [4]శతధారామహా[5]భుజగక్షమా
ధరశృంగసమ[6]త నుదగ్ర మగుచు
నెనిమిది[7]యంచుల నెసఁగు మెఱుంగుల
దారుణం బగుగదాదండ ముగ్ర

---

166 1. తాత్ముండై - పెక్కు ప్రతులు.

167 1. ఉరువడి — పెక్కు ప్రతులు. 2. యేపారి — పెక్కు ప్రతులు. 3. వాడియమ్ములు—ఘ ; వాలుటమ్ములు — అ ఎ ఓ గ.చ ల.

168 1. రాలు — న. 2. కీలాకరాంచి — త. 3. మన — చ. 4. శరధార — త ; శతధార — పెక్కు ప్రతులు ; 5. భుజంగ — పెక్కు ప్రతులు ; జంగమ — ఊ న. 6. సముదగ్ర—అ ; రసమగ్ర—ఐ.గ ;రముదగ్ర—త. 7. యమ్ములు—ఘ; యంబులు—ట.

తే. రేఖ [8]సారించి రౌద్ర ముద్రిక [9]నుందఁ
[10]గదిసి మద్రాధిపుని తురంగములఁ జదియ
[11]మోఁదె నాతండు దోమరమునఁ దదీయ
విపులవక్షంబు భేదించె నృపవరేణ్య.

169 క. [1]ఉరమున నాటినఘనతో
మర[2]మును డాచేతఁ బెఱికి మారుతి మద్రే
[3]శ్వరుసూతు [4]వైచె దానన
[5]ధరణిని బోరగిలఁ[6]బడ [7]నుదగ్రస్ఫురణన్.

170 మ. విరథుం డై పొలివోని[1]దర్పమున నవ్వీరుండు ఘోరంపుము
ద్గరముం గేలనమర్చి తేరు డిగి [2]దుర్దాంతాకృతిన్ వజ్రిభా
సురశక్రుండును దండచండయముఁడున్ శూలోగ్రఫాలాక్షుఁడున్
సరి [3]సేయం [4]దగువారు గాఁగఁ బొలిచెన్ [5]సంస్తుత్యసంరంభతన్.

171 వ. ఇట్లవష్టంభవిజృంభితుం డైన[1]యాసేనాధిపతిం జూచి [2]యేచి [3]భీముఁ
డుద్దామ[4]రభసంబున నతనికి [5]సమ్ముఖంబుగా నడరినఁ బఱవాది

---

8. విహరించి — ఒ ; మొనరించి — వ ; సవరించి — న. 9. మొుంద — పెక్కు ప్రతులు. 10. గవిసి, గదిసె, గవిసె — అని పాఠములు. 11. మోఁ — క.ఖ.న ; మోది — జ ; మోదుడును — అ ప.

169 1. పురపుర నాటిన — శ ; తిరమున — ప. 2. మట — అ ; మటు — ప. 3. శ్వర సుతుని — ప ; శ్వర సూను — ఐ. 4. నేసె — ఈ.త ; వైచెనప్పుడు - అ.ప ; వైచె నాతడు — ఇ 5. ధరణికి బోరగిల - త.ద. 6. బడె — ఈ ఎ.ఘ. 7. మదస్ఫురణన్ — అ ఉ.ఎ.గ ; మదస్ఫురణమెయిన్ — ట.ల.

170 1. శిరమున - వి.శ.ష.స. 2. దుర్దాంతస్ఫురద్వజ్ర — త. 3. వో.(పో) ల్పం — ఐ.గ. 4. గల — శ ; దగువాడు — అ ఒ గ 5. సంరంభసంస్తుత్యమున్ — ఉ.ఎ.ఖ.ట.త.బ.ల.

171 1. శల్యుజూచి — అ ప. 2. యేచి — పెక్కు ప్రతులలో లేదు. 3. భీమసేనుండు — పెక్కు ప్రతులు. 4. సంరంభంబున — ట.ల. 5. సమ్ముఖంబుగా — ఒ.ఔ.చ.వ.

[6]పార్తత్రి నిర్ఘరనినదంబులు సెలంగె నప్పు [7]డయ్యిరువాఁగు [8]నిరువుర నేనిక పోరు చూచువిధంబున గనుఁగొనుచు గదారణంబునకు శల్యుండు దక్క మారుతి మార్గ్యాన జాలుపేటిమగలు నివ్వనముడి వెలి గా నిమ్మద్రపతి మీఁదఁ గవియునట్టి జెట్టిబిరుదులుం గలరే యనుచు నచ్చెరు [10]వొందు చుండ.

172 ఆ. మండలప్రచారమహితాకృతులు గర్జ
నలుగఁ [1]బొలిచి మాఱు మలసి ఱంకె
లెసఁగఁ బోరి కమరి [2]గ్రేగ పొరువృషభ[3]యు
గంబు[4]నట్లు వారు గపిసి రధిప.

173 చ. మనమున నిమ్మెయిం గదిసి మద్రవిభుండును భీమసేనుఁడున్
గదలమెఱుఁగు లాకసము [1]గప్పఁగ [2]సుద్భటభంగి [3]ద్రిప్పి బె
ట్టిదముగ వ్రేయ నిప్పులు వడిం దొరగించె [4]సమగ్రవిస్మయ
ప్రదర[5]వభంగు [6]లై య[7]వి పరస్పరఘోరవిఘట్టనంబునన్.

174 వ. ఇట్లు దొడంగి.

175 క. [1]ధికాృరంబులు చరణద
భక్కారంబులును మెఱయ బలువు వెరవు పే
రుక్కును [2]నెక్కుడు వేగము
నక్కజములు గా నుదీర్ణులై పోరునెడన్.

---

6. వాదిత్ర - కొన్ని ప్రతులలో లేదు ; భేరీమృదంగ — చ. 7. డిరువాగు - ఈ.ఉ.ఎ. గ.జ ట త. 8. నయ్యిరువుర - పెక్కు ప్రతులు. 9. చుండగ - క.ఘ.చ వ. 10. వందు చుండ — పెక్కు ప్రతులు.

172 1. బొలసి — ఈ.ఎ.ట ; బొరసి — క ; వెలసి — చ. 2. రే(యే) పారి - ఇ ఐ.గ. 3. యుగ్మంబు - ఏ మ 4. పగిది - ఘ ; నట్లుపోర - చ ఒ.త.

173 1. గప్పగ — పెక్కు ప్రతులు. 2. నుజ్జ్వల — త. 3. జేరి — త ; ద్రిప్ప — ల. 4. నుమగ్ర - ఖ చ. 5. విభంగులై - అ ఎ ఒ ఔ క ఘ వ స. 6. లయ్యోడ — ఊ.ఐ.గ. 7. విరళస్వర — ఘ.

175 1. ధిక్కరణంబులు — ఆ.ఈ ఊ ఐ.ఒ జ గ. 2 వేగము నిరువురు నక్కజము — ఉ.ఎ.త ; వేగము నెక్కుడు — త.

176 చ. వెరవున [1]నంగముల్ నుసులవ్రేటులు వమ్ముగఁ దాఁకినప్డు ది
క్కరి[2]రదనప్రహారములఁ గంపము [3]నొందక యుండు మేదినీ
ధరములఁ బోల్పఁ [4]బ ట్టగునుదగ్రపుమూర్తుల [5]కిద్ద అందు ని
ష్ఠురరభసంబు శౌర్యము పటుత్వముఁ ద్రాసునఁ [6]బెట్టి[7]న ట్లగున్.

177 వ ఒక్కొక్క[1]మా ఱుబ్బున.

178 క. ఎనిమిదియడుగుల[1]కొలఁదిని
[2]వెనువెనుకకుఁ బోయి [3]మగిడి వేగంబునఁ గి
ట్టిన[4]తగళులకై వడిఁ దాఁ
కు[5]నగంబులభంగి దోఁచు గురు[6]కులముఖ్యా.

179 వ. ఇత్తెఱంగున బెనంగి నెత్తుట జొత్తిల్లినయంగంబులు పుష్పితకింశుకంబులఁ బోలఁ బరిశ్రమంబు నొందియుఁ బొలివోవని దర్పంబున.

*—: గదాయుద్ధమున మూర్ఛితుఁడైన శల్యునిఁ గృపుఁడు తొలంగం గొనిపోవుట :—*

సం. 9—11—23

180 క. ఇరువు[1]రును సందు [2]సూడక
వెర వెడలినయాగ్రహముల వ్రేసినగద లొం
డొరుల మెడల కెలఁకుల బ
ల్లరములు దాఁకుటయు వా రిలం బడి రధిపా.

---

176 1. నంగముల్ మసల — అ ; నంగముల్ నొసల — ఆ జ ; నంగముల్నుసుల — వ.ష ; నంగముల్నలియ — శ. 2. రథవాహినీచయము — అ ; చరణప్రహారములు — ఆ. 3. బొందుచునున్కి — అ ; నొందనిభూరి — పీ.శ.ష. 4. బట్టుగను — ప 5. నిందరందు — త. 6. దూచి — అ.ప 7. నట్లుగన్ — పెక్కుప్రతులు.

177 1. సమయంబున — వ.పీ.శ.ష.

178 1. కొలదికి — పెక్కు ప్రతులు. 2. వెనుకకునైపోయి — ఐ.గ. 3. మగుడి — పెక్కు ప్రతులు ; నెగడి — ఘ. 4. యెడతగర్లువడి — ఆ ; యెడఁదగరులఁగని — ష ; యెడఁదగళ్ళు తల — శ ; యెడదగరులవడి — న ; యెడదగరులువడి — స. 5. నిభంబులు — ఈ ఉ ద ; నిభంబులుదోచు భంగి — ఉ.ఎ.ట ల. 6 వర — ఈ ఉ త.

180 1. రయందును — ఆ.ఐ.ఖ.గ.త.ల ; ర (రు) సంధులు — ఒ.న. 2. సూడగ — పీ.శ.ష. పెక్కు ప్రతులు.

181 వ. ఇవ్విధంబున నమ్మహావీరులు మూర్ఛల్లుటయు నుభయసైన్యజనంబులును హాహాకారముఖరులై రట్టియెడఁ గృపాచార్యుండు శల్యుకడకుఁ దన రథంబు రయంబునం బఱపించి.

182 క. పడియును గద విడువనియ
క్కడిఁదిమగని [1]గ్రుచ్చి యెత్తి గారవమున సం
[2]దిడి తోలంగం గొనిపోయెను
వడముడి [3]దెప్పఱియె నంత వసుధాధీశా.

183 వ. తెప్పిఱి లేచి చూచి సేద దేఱినియమ్మద్రపతిం బేరుకొని యుద్దండగదా దండమండితం బై నకరంబునం బిలిచె నయ్యుద్ధతి [1]సహింపఁజాలక సింహనాదంబుతోడఁ [2]దూర్యస్వనంబులు సెలంగఁ గురు[3]భూవరు[4]ముందరిసైనికులు [5]రభసంబుగా నడుచునుఁ గూడి[6]కొని తఱుమఁ గవిసినం గౌంతేయాగ్రజునగ్రభాగంబు[7]న రథికులు చేకితానపురస్స[8]రులై యార్పులు నింగిముట్ట నయ్యనిల[9]తనయుఁ దలకడచి [10]వారిం దలపడి పెనంగి రప్పుడు.

184 శా. ఆ రవ్యవిభుండు వజ్రకఠినం బై యొప్పు[1]ప్రాసంబు [2]దీ
ప్తాకారోజ్జ్వలవృత్తి నెత్తి నిజసైన్యం బుబ్బునం గ్రాలఁ గే
లి[3]కల్పంబు గ మింట జంట మెఱుఁగు ల్నిండం బ్ర[4]దీప్తక్రియ
[5]శ్రీకాంతుం డగుచేకితానుఁ బడవైచెం జూప అగ్గింపఁగన్.

---

182 1. యరదమునను–చ ; గుచ్చియెత్తె – ఇ. 2. నిడుకొని–చ. 3. యును దెలిసె – ఖ.

183 1. సహింపక సింహ – పెక్కు ప్రతులు. 2. దూర్యనిస్వనంబులు – అ ఆ.ఊ ఓ.ద.వ. 3. భూవిభుని ముందర – అ ఔ.న.ల ; భూమీశ్వరునిముందర – ఈ.త ; పతిముందర– వీ శ. 4. ముందటి–పెక్కుప్రతులు. 5. సరభసంబుగా–ఏ.త.ల ; నుసరభసంబుగా–చ ; సంరంభంబుగా – ఘ. 6. కొని – పెక్కు ప్రతులలో లేదు. 7. న – పెక్కు ప్రతులలో లేదు. 8. రంబుగా నార్పులు – అ ; రులైయార్పులు – పెక్కు ప్రతులు. 9. తనయుం గాంచి–న. 10. వారిందలపడి–వీ శ.ష. ప్రతులలో లేదు. 11. కడంగి– వీ శ.ష.

184 1. ప్రాణంబు – న.ల. ఈ పాఠము ప్రకరణానుకూలము కాదు. 2. దీప్రాకారో జ్జ్వల – ల ; దీప్తాకారోద్భటభంగి – ఒ జ ; దీప్తాకారంబుల – చ. 3. కృత్యంబు – ఏ. 4. దీప్తోజ్జ్వల – ఒ. 5. శ్రీ కారుండగు – శ.

185 వ. ఇట్లు చేకితానుఁడు [1]వీతాసుం డై నం [2]గని కౌంతేయులు గోపాటోపంబున సైన్యో[3]పేతగతిం గదంగి కౌరవ[4]సైన్యంబుపైఁ [5]బటు[6]బాణంబులు [7]గురియుచు నడరిన శల్యుండు ధర్మపుత్రుని దుర్యోధనుండు ధృష్టద్యుమ్ను నమ్మహీపతిపనుప [8]నశ్వత్థామ కృతిగర్తులు మూఁడు వేలరథంబుల[9]వారు వివ్వచ్చుని మహోత్సాహంబున మార్కొనిరి [10]తక్కటి యోధులు సేనయు నవ్విరోధివరూథిని గలయం బెరయుటయు [11]నక్కజంబయ్యె నప్పుడు [12]పెంధూళి [13]యెగసి చూడ్కులు నిగుడకున్నను సైనికుల సింహనాదంబు[14]లు సెలంగం జేయుటయు బిరుదులు ప్రకటించుటయు బోధకంబుగాఁ బోరిన బోరన దొరఁగు[15]శోణితం బారేణువు నడంచినఁ బ్రియం బంది యిరువాఁగును బ్రేయుండు పొడువుం డనునెలుంగులు నింగి ముట్టఁ [16]బెనంగు నట్టియెడ.

186 చ. బరవస [1]మొప్ప మద్రపతి పాండవముఖ్యునిమీఁదఁ గాండముల్
గురిసిన నా[2]నృపాలుఁడు నకుంఠితుఁ డై పదు[3]నాల్గుతూపు ల
న్నర[4]పతిమేనఁ గ్రుచ్చి యెలనవ్వున నొప్పిన నమ్మహీశు పే
రురమున నాఱు నారథికుఁ డొక్కసముజ్జ్వలబాణ [5]మేసెఁ దైలన్.

187 వ. నాటినం గనలి యమ్మనుజేంద్రుండు చంద్రసేనుం డనుతదీయ చక్రరక్షకుం దునిమి న[1]వనారాచంబులు సారథిమేన నిగిడించె.

---

185 1. విగతాసుండై — పెక్కు ప్రతులు. 2. గనుంగొని కౌం — పెక్కు ప్రతులు. 3. పేతంబుగా — అ ప చ.ల. 4. బలంబుపై — పెక్కు ప్రతులు. 5 బటు — పెక్కు ప్రతులలో లేదు. 6. బాణజాలంబులు — పెక్కు ప్రతులు. 7. బరగించుచు — పెక్కు ప్రతులు. 8. నశ్వత్థామయుం — పెక్కుప్రతులు. 9. వారును బీభత్సుమహోత్సాహంబున — పెక్కు ప్రతులు 10. తక్కిన — ఆ. 11. నక్కజంబై యుండె — పెక్కు ప్రతులు. 12. గెం(కెం)ధూళి — ఇ ఉ.ఓ క.గ ఖ.చ. 13. బెనదం బొనిసంబూడ్కులు — న. 14. లున్ బెరువాడుటయు — పెక్కు ప్రతులు 15. రక్తంబారేణువు — పి శ.ష. 16. బెనంగిరట్టి — అ.ఊ ఘ ల ; బెనంగెనట్టి — ఇ ఎ ఐ క.ఖ.గ ; బెనంగిరప్పుడు — వ.

186 1. వృత్తి — ఇ. 2. నృపాలకుడ — పెక్కు ప్రతులు. 3. నాలుగమ్ములన్ — ఘ. 4. వీరు — పెక్కు ప్రతులు. 5. ముద్ధతిన్ — ల ; మేర్పడన్ — శ.

187 1. వడి నారసం బాసూతునిమేన — ఐ గ.

188 ఆ. అపుడు శినివరుండు ననిలపుత్రుఁడుఁ జేసి
బలము గల్గఁ [1]దీవ్రభంగి బొదువ
నాతఁ డాధనంజ[2]యాగ్రణిఁ బటుతర
పంచ[3]మార్గణముల నొంచె నధిప.

189 క. [1]విను మిరువదియేడమ్ముల
శినిమనుమని[2] యుబ్బడంచెఁ జేదిరథికులం
దునిమెం దీవ్రశరోత్కర
మున సిరువది[3]యేవురన్ సముద్భటభంగిన్.

190 క. కవలు తనమీఁద [1]రయమునఁ
గవిసిన [2]నిశితతరసాయకములను మౌర్వీ
రవము సెలంగఁగ వారల
యవయవముల నిసిచె నతఁ డహంకృతి మెఱయన్.

191 చ. కనుఁగొని ధర్మసూతి భుజగర్వ మెలర్పఁగ [1]బెట్టు గిట్టి శ
ల్యుని మెయిఁ దీవ్ర[2]మార్గణసముత్కరముం బరగించి కేతువుం
దునిమిన నాతఁ [3]డాపతికిఁ దూపుల వేఁడిమి సూపి వాయుసూ
నునిఁ గవలన్ శినిప్రవరు నొంచె [4]వడిం బది యేసి యమ్ములన్.

---

188 1. శీఘ్ర — ఖ.ఘ.చ.న. 2. యాగ్రజు — పెక్కు ప్రతులు. 3. సాయక — త.

189 1. వినుమిరువది — ఊ.ఖ.గ.ట.ద.న.ల.వ. 2. యుబ్బణంచి — పెక్కు ప్రతులు. 3. యేవురను — పెక్కు ప్రతులు; వేవురను — అ.ఇ.ద.

190 1. నురువడి — ఒ.జ. 2. శితశాత సాయకంబులు — పెక్కుప్రతులు; దశనిశితసాయకంబులు - అ.ఊ.ల; శితనిశిత సాయకంబులు — ఇ.ఎ.

191 1. బిట్టు — ఉ.ఎ.ట.ల. 2. బాణము — క న. 3. దాతనికి — అ.ఇ ఈ.ఉ.ఊ.ఎ.ట.ల. 4. బతిన్ వడినేసె — చ.

192 ఉ. నొంచి మదించి ఖేచరమనో[1]హరుఁ డై వడి ధర్మపుత్త్రు బ్రసు
క్కించి మహోగ్రబాణ[2]పరికీలిత[3]దేహునిఁ [4]జేసె దానఁ గో
పించి శితాస్త్రముల్ గవలు భీముఁడు సాత్యకియుం [5]గడంక గు
ప్పించిన వానిఁ ద్రుంచి శరపీడిత[6]దేహుల జేసె [7]వారలన్.

193 వ. చేసి యొండొక[1]భాసితధ్వజం బెత్తించి [2]మెఱసిన.

194 సీ. భీముఁ డాతని[1] మెయి బెడిదంపు[2]నారసం
బడరించి వెండియు నట్టి [3]వేడు
వఱపె సాత్యకి శతబాణంబు లతనిపై
బెట్టేసె మాద్రితొల్పట్టి [5]యైదు
[6]తీవ్రాస్త్రముల సహదేవుండు పదునాలు
గమ్ముల నవ్వీరునంగకములఁ
బరగించి రమ్మద్రపతి భీమసేనాదు
లైనయన్నలువుర నతిరయమున

తే. వరుస డెబ్బదిమూఁటను [7]నిరువదేను
వాఁడితూపుల నేనింట మూఁడుమార్గ
ణములఁ బీడితులుగఁ జేసె నఱకె భల్ల
నిహతి సహదేవుచాపంబు నృపవరేణ్య.

---

192 1 గతుడై — వీ.ష.స. 2. చయ—శ.ష.స. 3. వతుని— పెక్కు ప్రతులు ; గాత్రుని — న. 4. జేయ — కొన్ని ప్రతులు. 5. గడంగి కుం — పెక్కు ప్రతులు. 6. గాత్రుల — న. 7. నందరన్ — ఐ ఖ.గ.

193 1. భాసుర — పెక్కు ప్రతులు. 2. మెఱసిన — కొన్ని ప్రతులలో లేదు.

194 1. పయి, పైని, బలు, మీఁద — అని పాఠములు. 2. నారాచ మడరించి — ఇ.వీ.శ.ష ; నారాస మడరించి — పెక్కు ప్రతులు ; శరములు నడపించి వెండియు నపుడు — ఈ పాఠమున నఖండ యతి—ఖ. 3. వైదు — ల ; బెగడు — అ.ప. 4. నూఱు — పీ.శ.ష ; బహు — క. 5. యేడు — పెక్కు ప్రతులు ; యేను — క.ఖ. 6. దీప్తా — జ ; దివ్యా — ఓ.గ.ఘ. 7. నఱువదేను — వ. ఇచట సాధు శకట రేఫములకు ప్రాసకూర్పబడినది.

195 శా. ఆమ్రాద్రీసుతుఁ డన్యచాపధరుఁ డై యత్యుగ్రబాణంబులన్
మామా యెక్కడఁ బోయె దంచు [1]వెస నమ్మద్రేశు నేయంగ ను
ద్దామోదగ్రత భీమసాత్యకులు శాతప్రస్ఫురన్మార్గణ
స్తోమంబుల్ [2]గురియంగ ధర్మసుతుఁడుం దూపుల్ మెయిం [3]గ్రువ్వఁగన్.

196 చ. కలయఁగ నెత్తురుల్ [1]దొరఁగ గైరికనిర్ఝరజాలరంజితా
చలమును బోలి [2]పొల్పెసఁగి శల్యుఁడు వారల నస్త్రపంచకం
బుల వెస నొంచి త్రుంచెఁ గురుభూవర ధర్మజుచాప [3]మమ్మతో
బలమును శౌర్యముః సురలు ప్రస్తుతి [4]సేయ మహోగ్రమూర్తి యై.

197 ఉ. వేఱొకచాప మెత్తి పృథివీవర [1]ధర్మతనూజుఁ [2]డింతతోఁ
దీఱఁగఁ జేయుదుం బగ యతిప్రకటంబుగ నంచు సూతుమైఁ
దూఱఁ దురంగ[3]మాంగములు దూఁటులు వోవఁగ శల్యు[4]నెమ్ములన్
[5]గీఱ సిడంబు గాఁడ బరగించె సముజ్జ్వలచండకాండముల్.

198 వ. ఇవ్విధంబున విజృంభించిన.

199 క. కోపించి యతఁడు దర్పా
[1]టోపం బుగ్రముగ [2]దశపటు[3]ప్రదరము లా
[4]భూపాలు[5]మేనఁ జొనిపిన
[6]భూపాలక యాత డొల్లఁ బోవుటయు వెసన్.

---

195 1. వడి—పెక్కు ప్రతులు. 2. నిగుడింప—ఇ.ఉ.ఎ.ట.వ. 3. గప్పగన్—ట వ.వీ శ.ష.స.

196 1. గురియ — ఐ.గ. 2. బెంపెసగి — అ. 3. మప్పుడా — వీ శ.ష.స; మబ్బులో—ఈ; దండమన్ - ఓ. 4. సేయగ నుగ్ర — వ; సేయగరుద్ర — ఊ.

197 1. ధర్మజు డింతతోడనే — ట వ.ఖ. 2. డుగ్రితన్ — శ. 3. గాత్రిములు — ఐ.గ; ముల్ తనవు — చ. 4. నమ్ములన్ — ఐ.గ; దమ్ములన్ — ఖ; నంగముల్ — వ. 5. గేజి — చ.ల.

199 1. టోపముదగ్ర - వా; టోపంబుగ్ర-పెక్కు ప్రతులు. 2. శత - అ.ప; ఘన-జ. 3. ప్రిదరములన్ — ఒ; ప్రిదరంబుల్ — బ. 4. యేపారుచుమైజూపిన — బ; యేపారుచుమైజొనిపిన — ఒ జ. 5. మీఁ — వీ.శ.ష. 6. భూపాగ్రిణి — ఎ.ట.

### —: ధర్మరాజు శల్యునిబాణంబులచేత మూర్ఛితుం డగుట :—

సం. 9-11-66

200 క. శైనేయుఁ డడరి యుజ్జ్వల
నానావిశిఖముల మద్ర[1]నరపతిఁ బొదువం
[2]దా నలిగి విల్లు దునియలు
గా నొకభల్లమున సేసె గర్వోద్ధతుఁ డై.

201 క. అరథిక[1]వరుని నకులుని
మారుతి సహదేవు [2]మూఁడుమార్గణముల నే
పారఁగ బలుపారఁగ రయ
మారఁగ నొప్పించె నమ్మహాభుజుఁ డధిపా.

202 వ. అంతం దెలిసి యక్కౌంతేయాగ్రజుండు మద్ర[1]పతిని ముద్గరంబున [2]నేయ నవ్విరోధిపై సాత్యకి తోమరంబును వృకోదరుండు [3]భల్లంబును నకులుండు శక్తియు సహదేవుండు గదయును బ్రయోగించిన [4]నయ్యోధవరుండు వాని నన్నింటిని [5]మింట మెఱుంగు [6]లడర వెడఁదయమ్ములు వరఁగించి త్రుంచి యార్చినం బేర్చిన[7]రోషంబున నాకృష్ణానుజుండు సారథి మూఁడు వాఁడితూపుల [8]నవ్విరోధి రెండు[9]బాణంబుల బెట్టేసినఁ గో[10]ధదీప్తుం డై యాశల్యుఁడు ప్రచండకాండంబుల నయ్యేవురను బ్రుక్కించిన జూచి నీ[11]పుత్రుం డతనిచేతఁ బాండు[12]పుత్రులు [13]పొలియుదు రని తలంచె నట్లు భాసమానుం డై [14]న సేనాపతిం గని భీమసేనుండు సహింపక [15]తెంపున బెట్టు గిట్టిన.

---

200 1. నాథుంబొదివెన్ — ఐ.గ ; నరపతి బొదివెన్ - పెక్కు ప్రతులు. 2. దాను (న) గలిగి విలు - అ.ఊ.ఏ.వ.శ.ష ; దానవి యెల్లను దునియలు — త.

201 1. వరుడు — ఊ.ఐ.గ.చ.ప.ల. 2. దీవ్ర — కొన్ని ప్రతులు ; చండ — ఐ.గ.

202 1. పతిని — క.ఖ.ల ; విభుని — ఐ.గ.చ.జ.త.వ. 2. వైవన — పెక్కు ప్రతులు. 3. భల్లత్రయంబున — కొన్ని ప్రతులు. 4. నానెఱ బిరుదు — అ.ఏ. 5. మంట — ఖ ; వింట — ఒ. 6. లదరు — వా ; లదర — పెక్కు ప్రతులు. 7. కోపంబున — కొన్ని ప్రతులు. 8. నవ్వీరుని — పెక్కు ప్రతులు. 9. నారసంబుల, నారాచంబుల — అని పాఠములు. 10. దీప్తుం డై యా శల్యుండు ప్రచండ — పెక్కు ప్రతులు ; దీప్తుం డై ప్రచండ — వా 11. సుతుం డతని - పెక్కు ప్రతులు. 12. సుతులు — పెక్కు ప్రతులు. 13. సమయుదురని — పెక్కు ప్రతులు. 14. యా సేనాపతిం — వ. కొన్ని ప్రతులు. 15. తెంపున — కొన్ని ప్రతులలో లేదు.

203 క. శిని[1]మనుమఁడు గవలను దో
డన యురవడి నడరి పొదువుటయు నగ్గలికం
బెనఁగె నతం డానలువుర
కనలుఁ గడంకయును సరకు [2]గాఁ [3]గొన కధిపా.

204 వ. ఇట్లు పెనంగుచుండఁ బాండవాగ్రజుండు మున్ను దనచేతఁ జచ్చినచంద్ర సేనుతోడివాని ద్యుమత్సేనుఁ దల ద్రెవ్వ [1]నేసిన జక్రరక్షకహీనుం డయ్యును [2]బోలివోవనికనలున శల్యుండు సటలు వెఱికినం [3]గోపించు సింగంబుచందం బై సమీరణ[4]సుతాదు లగుజోదులనలువురయంగంబులఁ దురంగనికరశరీర సారథినికాయసహితంబుగా బహువిధవిశిఖంబులు వరఁ గించి [5]నెత్తురులు దొరఁగించినం [6]గని యాధర్మనందనుండు విషాదంబు నొంది నిజాంతర్గతంబున.

205 క. హరి[1]వచనంబు లసత్యతఁ
బొరయఁగ నేర్చు నొకో మద్రభూపతిబాహు
స్ఫురణము భీమాదిరథిక
వరు లోర్వని యట్లు గాఁగ వ్రాలెడిఁ దోడ్తోన్.

206 వ. అని [1]తలపోసి తనబలంబునకుఁ [2]జేయి వీచినఁ దోయధివీచివితానవిలాసంబుచందంబునఁ జతురంగంబులు శల్యునిపైఁ గవిసిన నా[3]ధైర్యధౌరేయుండు మందరనగంబు[4]లీలఁ గైకొని వారలం గలంచి పాంచాలపుత్రప్రభృతియోధ[5]ప్రకరంబులను బాండవాగ్రజునిం బరమసాంద్ర[6]తీవ్రశరాంధకారంబునఁ గప్పి సింహనాదంబు చేసిన.

---

203 1. వీరుడును — ఇ. 2. గైకొన — ఊ. 3. గా గొనడధిపా — ఒ.క.శ.

204 1. వేసిన — చ.ల. 2. బోలివోవని — పెక్కు ప్రతులు; బోలివోని — వా; బోలివోవని శల్యుండు — పెక్కు ప్రతులు. 3. గనలు — పెక్కు ప్రతులు. 4. నందనాదు — అ.ప. 5. వారల నెగడు పఱచినం విషాదంబు నొంది యా ధర్మనందనుండు నిజాంత — ఇ.ప.ఒ.ట.ల. 6. వారల వెగడుపరచినం గని యా ధర్మనందనుండు— పెక్కు ప్రతులు.

205 1. వాక్యంబుల — వ.పి.శ.ష. కొన్ని ప్రతులు.

206 1. తలంచితన — ఇ.ఉ.ఎ.ట. 2. చేయు — పెక్కు ప్రతులు. 3. శౌర్యధుర్యుండు — పి.శ.ష కొన్ని ప్రతులు. 4. పగిదిలీల — అ.ప. 5. వీరులను — లవ. పెక్కు ప్రతులు. 6. తీవ్ర — పెక్కు ప్రతులలో లేదు.

207 క. దివిజగరుడఖచరాదులు
వివిధవచనరచన లెసఁగ వినుతించిరి శా
త్రవ[1]భీకరుఁ డగునమ్మ
ద్రవిభు నిరణవిహారణములు ధరణీనాథా.

208 వ. ఆ సమయంబున.

209 తే. గురుసుతుఁడు పెను[1]బ్రాపుగా నరునిఁ [2]బొదివి
యధిపసంశప్తకులు వివిధాస్త్రతతులఁ
గప్పి రతఁ డందఱను జండకాండ[3]విదళి
తాంగులుగఁ జేసె దోర్లీల యతిశయిల్ల.

210 చ. తెరలక వారు పైపయి నుదీర్ణసముద్ధతిఁ గ్రమ్మి వాజులన్
హరిని [1]సిడంబుపైఁ [2]గదియ నాతఁడు సేద్పడ బాణవర్షముం
గురిసిరి కౌరవేంద్రు మొనకుం బ్రమదం [3]బగుఘోరభంగి న
ప్పురుషపరాక్రమస్ఫురణ పార్థివసత్తమ కాన మెయ్యెడన్.

211 వ. ఇట్లు సవ్యసాచికిఁ జేయార్ప రాకుండ దర్పంబు సూపిన నా[1]భూవర కుమారవర్యుండు వీరాగ్రహావేశంబున విజృంభించి భల్లార్ధచంద్ర[2]క్షురికాముఖనారాచప్రముఖవిశిఖపరంపరలు వరఁగింప నవి యాసైనికులరథ్యంబులం గూల్చియుఁ [3]గేతనంబులు [4]ద్రుంచియు బాణంబులు నఱకియు బాణాసనంబులు [5]విఱిచియు సూతుల గీటడంచియు నరదంబులఁ జెక్కియు మైమఱువు[6]లు పొళ్ళుసేసియుఁ జామరంబులు దునిమియు నాతపత్రంబులు రూపుమాపియు నెత్తురు లు[8]రలించియుఁ గండలు దొరఁగించియు నెమ్ములు [9]వగిలించియుఁ గాళ్లు ద్రుంచియుఁ జేతులు

207 1. భీషణుఁడగు — ప,ఐ.ఒ.ఓ.ఔ.జ.ట.వ.

209 1. పాత్రపు—వీ. కొన్ని ప్రతులు. 2. దొడరి—ప. 3. దారితాంగులుగ—పెక్కు ప్రతులు.

210 1. సిడంబునుం — వ.వీ.శ.ష. 2. గవియ - కొన్ని ప్రతులు. 3. బగ - అ.ఆ.ఊ.ఎ.ట;

211 1. భూపాలకుమార, భూపకుమార — అని పాఠములు. 2. క్షురికాముఖ — వీ.శ.ష. క్షురికప్రదర — అ; క్షురప్రకరనా - పెక్కు ప్రతులు. 3. గేతనాతపత్త్రంబులు - ఐ.గ.వ. 4. దునిమియు — ల. 5. ఖండించియు — ప. 6. లరువుళ్ళు — పెక్కు ప్రతులు. 7. దునిమియు వక్షంబులువ్రచ్చియు - ఓ.ఔ.గ.ఘ.చ. 8. గురియించి, గురిపించి, వరపించి — అని పాఠములు. 9. విదళించియు — అ ; పెగలించియు — ఆ

[10]దునిమియు [11]వ్రయ్యలుగా వక్షంబులు [12]చీఱియు మర్మంబులఁ [13]జొచ్చియు మకుటంబు[14]లు డుల్చియుఁ దలలు రాల్చియుఁ బ్రాణంబులు [15]పిల్చియు రౌద్రం [16]బావహించిన లయకాలరుద్రునిసంక్రీడనంబు చందం[17]బు దోఁచె నప్పుడు రథికవరసహస్ర[18]ద్వితయంబు [19]దెగటార్చి న వ్వాఁడిమగండు [20]పేరడవి దహించుదావపావకుని[21]చందంబున వెలిఁగెఁ దదీయతేజోమహిమ సహింపక యుద్ధామగతి నశ్వత్థామ గడిసి యక్కవ్వడిం దొడరి [22]దురం బొనర్చె నందు.

212 సీ. అతఁడు పంద్రెండు వాలమ్ము లాబీభత్సు
మెయిఁ గ్రుచ్చి కృష్ణుని మేనియందుఁ
[1]బది వాఁడితూపులు వఱపిన మదిలోన
నగ్గించి యవ్వీరుఁ డలఁతి[2]నగవు
తోడ రథ్యముల సూతునిఁ గూల్చి యాతని
తనువున [3]నెఱ తెగఁగొనక నాఱు
మూఁడుమార్గణములు ముసలంబు పరిఘంబు
నాతఁడు నిగిడింప నదియు నదియు

తే. నన్నరుఁడు దోడుతో[4]డ నైదాఱునిశిత
కాండములఁ దుంచి పటుసాయకత్రయంబు
నొనిపె [5]నవ్విప్రు మేన మార్కొనియె నపుడు
గడఁగి యప్పార్థు సంశప్తకవ్రజంబు.

---

10. చిదిమియు — కొన్ని ప్రతులు. 11. వక్షంబులు వ్రచ్చియు — కొన్ని ప్రతులు. 12. చీరియు — పీ.శ.ష ; నేఁజీయు — కొన్ని ప్రతులలో లేదు. 13. నొంచియు — పెక్కు ప్రతులు. 14. దునిమియు — వీ.శ.ష ; ఉడిపియు — ఐ ; మెదిపియు — త. 15. విడిపించియు — త. 16. బావహిల్లం బోరలయ — అ.క ; బావహించినప్రళయ కాల - కొన్ని ప్రతులు. 17. బొందె నప్పుడు - క.ఖ.ఘ. 18. ద్వయంబు — అ.ఊ.ప. 19. దెగటార్చి యవ్వాడి-వ. కొన్ని ప్రతులు. 20. వెదురుటడవి—ఓ.ఔ.క ఖ.ఘ.చ.ల; కారడవి — త. 21. విధంబున — పెక్కు ప్రతులు. 22. రణంబొ — ఇ.

212 1. పదియు వాలమ్ములు మది నొవ్వం బరికించిన — త. 2. నవ్వు — కొన్ని ప్రతులు. 3. ప్రాణముల్ గొనగ నాట - ఖ. 4. నాఱునైదు - పెక్కుప్రతులు. 5. నవ్వీరునొడల- ఊ.త.న.వ ; నవ్విప్రు నొడల — పెక్కు ప్రతులు.

213 వ. ఇత్తెఱంగున.

—: సురథుఁ డను పాంచాలకుమారుం డశ్వత్థామచేఁ జచ్చుట :—

సం. 9—13—35

214 క. సురథుండు గురుసుతుపైఁ దన
యరదము వఱపించి [1]యేయ [2]నప్పాంచాలో
త్తరు నొకనారసమునకును
నెర సేసె నతండు గినుక యొసకం బెసఁగన్.

215 వ. [1]ఇత్తెఱంగున.

216 ఆ. [1]సురథుఁ గూల్చి యతనియరదంబుపైకి [2]ను
ద్ధురత నరిగి గురుసుతుండు చండ
కాండసమితి నిగుడ గాండీవిఁ దాఁకి సం
శప్తకులకు సంతసం బొనర్చె.

217 వ. [1]అయ్యవసరంబున.

218 క. కురుపతి ధృష్టద్యుమ్నుని
యురవడిఁ దగ నిలువరించి యుద్ధతి మెఱయన్
శరపంచకమున [1]నొంచెను
బరఁగించెను [2]మఱియు [3]నవతిబాణము లొడలన్.

---

213 1. అట్టియెడ — పెక్కు ప్రతులు; పీ.శ.ష. ప్రతులలో లేదు.

214 1. యేగ — ఉ. 2. నప్పాంచాలవీరసుతుడు బాణచయముల — శ.

215 1. అట్టియెడ, అయ్యవసరంబున — అని పాఠములు.

216 1. నరుని — అ. 2. నుద్దండ వృత్తినరిగి — ఐ.గ.

217 1. కొన్ని ప్రతులలో లేదు.

218 1. నొంచియు — అ.ఊ.న; నొంచెన్ — ఎ.ల. 2. వెండి — ప; నతడు — ట.
3. సప్త - పెక్కు ప్రతులు.

219 తే. అతఁడు డెబ్బదియమ్ములఁ నతని నొంప
నన్నరేంద్రుండుఁ జేద్పడ ననుజసమితి
బలయుతంబుగ నడరి [1]యబ్బలియుమీఁదఁ
[2]గురిసి రస్త్రశస్త్రంబులు [3]నరవరేణ్య.

220 క. ఆపాంచాలోత్తముఁ డు
ద్దీపితకోపుఁ డయి వారిఁ [1]దీవ్రతరశరా
టోపంబునఁ గలఁచె రయం
బేపారఁగ నాత్మసేన కెత్తెఱ [2]మెఱయన్.

221 చ. కృపకృతవర్మలం గడిమిఁ గిట్టి [1]శిఖండిప్రభద్రకుల్ మహో
గ్రపువడి దోడ్పడంగ భుజగర్వము సూపిన నాబలాఢ్యులుం
గుపితమనస్కులై బలుపుఁగోల్తలఁ [2]బేర్చినలావు చేవ క
య్యపువెర [3]వేపు దాల్మి సరి నచ్చెరుపాటున [4]ముంచెఁ జూపఱన్.

222 వ. అప్పుడు శల్యుండు యుధిష్ఠిరభీమసేననకులసహదేవ[1]సాత్యకులపైఁ బటు
బాణంబులు గుప్పించి నొప్పించిన.

223 క. నకులుఁడు [1]రభసంబున సా
యకదశక మతనియురంబునందుఁ జొనుప స
భ్రుకుటి యగుచు నయ్యల్లునిఁ
ద్రికాండముల నొంచి యతఁడు దీపించె నృపా.

---

219 1. యబ్బలము—ట.వ. 2. గురిసెనస్త్ర—క.గ.ట.వ ; గురిసెనానాస్త్రసమితియు—ఖ; గురిసె నానాస్త్ర శస్త్రముల్ — ల. 3. కురువరేణ్య — ఊ.ఎ.చ.జ.న.వ.

220 1. దీవ్రప్రదరా - పెక్కు ప్రతులు. 2. మిగులన్ — పెక్కు ప్రతులు ; సూపెన్-త.

221 1. గడంగి - ఎ. 2. జేసిన - ఓ.క.చ.ట ; జేసియు — ఖ ; 3. వుక్కుతాల్మి — అ.ఫ; వేపు దాల్చియును నచ్చెరు - ఐ. 4. ద్రుంచె జూపముల్ - చ.ల.

222 1. సాత్యకులపై - పెక్కు ప్రతులు ; సాత్యకి ప్రిముఖులపై — వా.

223 1. సరభసముగ — ఒ వ.

224 క. తక్కటినలువురు వొదివిన
నొక్కొకనిశరీరమున మహోగ్రాస్త్రంబుల్
[1]పెక్కులు వెసఁ బఱపి మదం
బెక్క [2]నకులుధనువు దునిమె నిషుసహితముగన్.

225 వ. ఇట్లు శల్యుండు విజృంభించినఁ గోపించి.

226 మ. నకులుం డొండొకచాప మెత్తి పటుబాణశ్రేణిఁ [1]బర్వింపఁ గి
చకవిధ్వంసి [2]నిగిడ్చె షష్టిశరముల్ శైనేయుఁ డుద్దీప్తసా
యకముల్ దొమ్మిది యేయ ధర్మ[3]సుతుఁ డీరైదమ్ము లమ్మద్రనా
యకు[4]పై నన్నియుఁ బిన్నతమ్ముఁడును దోడై నాట నాటెం గడున్.

227 తే. అతఁడు [1]వెస నవసప్తతి శిత[2]శిలీము
ఖముల సాత్యకి నొంచి మార్గణము[3]తోడ
ధనువు ద్రుంచి రథ్యమ్ముల ధరణిఁ గూల్చి
[4]పదిపదుల్ బలుఁ[5]దూపులు వఱపె మేన.

228 క ఇవ్విధమున [1]శినివీరుని
క్రొవ్వు చెఱచి పాండుపుత్రకుల బాణంబుల్
నివ్వటిలనీక నలువుర
నవ్వీరుఁడు నొవ్వ [2]నేసె నద్భుత భంగిన్.

---

224 1. పెక్కువెసఁ—కొన్ని ప్రతులు; పెక్కు దెసల—ఓ; పెక్కుదెసం...ప. 2. యతని—ఎ.

226 1. వర్షింప – పెక్కు ప్రతులు, 2. నిగుడ్చ – పెక్కు ప్రతులు. 3. ననయుండై దమ్ముల - ఊ. 4. మై - కొన్ని ప్రతులు.

227 1. నవదశసప్తతి — ఖ. 2. శరములఁ గడిమి — ని.శ.మ ; శరముల రణగి — చ.ట. 3. తోన – పెక్కుప్రతులు. 4. పదియు బదియు – పెక్కు ప్రతులు. 5. తూపులం బొదివె మఱియు – పెక్కు ప్రతులు.

228 1. శినివరుని - కొన్ని ప్రతులు; శైనేయునిక్రొవ్వు — ఓ. 2. జేసె — ఓ.

229 ఉ. పాండవు లట్లు మద్రపతి బాణములం [1]దెరలంగఁ జూచి తా
నొండొకతెరికిం జని సముద్ధతి సాత్యకి దాఁకె నాతనిం
జండ[2]తర[3]ప్రచారణవిశారదుఁ డై పెస వారు గూడి యు
ద్దండత సూపి రక్కజపుదర్ప మెలర్పఁ బెనంగె నాతఁడున్.

230 ఉ. ఏపురతోడ [1]న ట్లొకఁడ యేచి పెనంగుటఁ గౌరవేంద్ర యో
ధావళి చూచి కూడికొని యా[2]రథికో త్తముగాఢవిక్రమ
శ్రీవిలసిల్ల నంపపెనుఁజీఁకటి యాకస మెల్లఁ [3]గప్పఁ గాఁ
జేవయు లావుఁ జూపుటయుఁ జెడ్డది రాత్రిపతివీరు లందఱున్.

231 వ. సేనయు నొక్కుమ్మడి [1]నద్దిక్కు దఱిమినం గని కృష్ణార్జునులు [2]నిజ సైన్యంబు [3]సమస్తంబు [4]నేకముఖంబు సేసి [5]మార్కొని రాసమయంబునఁ గిరీటి [6]కృపకృతవర్మలను సహదేవుండు సౌబలుని ద్రౌపదేయులు గొందఱురాజులను శిఖండి యశ్వత్థామను భీమసేనుండు సుయోధనునిఁ [7]దాఁక బాండవాగ్రజుండు దనకు [8]నకులుండు [9]బాసట గా శల్యు నిలువరించెఁ దక్కనుం గల యోధు[10]లుం దక్కటిసైనికులుం [11]దలపడి క్రమంబున నెల్లబలంబులును గలయం బెరసె నిట్లు [12]మార్కొని [13]యంతకంతకు రణంబు సమ్మర్దదారుణం బయ్యె న త్తఱి నమ్మద్రపతి రౌద్రంబు రూపు దాల్చినతెఱంగునం బొంగి పాంచాలయాదవాదిరథికవరులకును [14]బాండుకుమారులకును వారింపఁ గొలఁదిగాక రథచిత్రగతుల మెఱయ నెక్కడ జూచినం దాన యై నానావిధవిశిఖవితానంబుల నంబరభాగంబు [15]సంపి

---

229 1. దలరంగ – ఒ.వ ; దరలంగ – ఏ ; దలకంగ – ఖ ; దఱుగం – త. 2. శర – ఇ.ఎ.ట ; రథ – క ; కర – వ. 3. ప్రసారణ – కొన్ని ప్రతులు ; ప్రహారణ – త.

230 1. నొక్కడటువేచి – ఆ.జ ; నిట్టులొకఁడేచి – ఘ.న.ల. 2. రథికో త్తముగూడి– పెక్కు ప్రతులు ; రథికుల్ దగగూడి – ఏ ; రథికో త్తముజేరి – వ. 3. నిండగా– ఒ.

231 1. నద్దిక్కువారుదఱిమినం – వి.శ.ష. 2. తమ బలంబు – ఒ. 3. సమస్తంబు – కొన్ని ప్రతులలో లేదు. 4. నొక్క మొగంబు సేసికొని – కొన్ని ప్రతులు ; సమ్ముఖంబు సేసుకొని – ఒ. 5. మార్కొని – కొన్ని ప్రతులలో లేదు. 6. కృపాచార్య కృత – పెక్కు ప్రతులు. 7. దాక – కొన్ని ప్రతులలో లేదు. 8. నకులుండు – కొన్ని ప్రతులలో లేదు. 9. సహాయుంగా – ఐ.గ. 10. లువారిం – అ.ఏ. 11. దలపడిరిక్రమంబున-కొన్నిప్రతులు ; దలపడిరట్టియెడగ్రమంబున-వి.శ.ష. 12. మార్కొని- పెక్కుప్రతులు. 13. కంతకుంబేర్చిరణం – కొన్ని ప్రతులు. 14. పాండవాదిరథికవరులకు వారింప – ఘ ; బాండవులకు వారింప – త, 15. సంవృతంబు – ఈ.ట.త ;

హితంబుసేసిన మధ్యందిన[16]గతం బయ్యెను మార్తాండబింబంబు [17]దోఁపక యుండె నట్టియెడ.

232 సీ. కరులఁ [1]ద్రుంచెడువేళ గిరులఁ దున్మాడు సం
క్రందనుకైవడిఁ గానవచ్చు
నరదముల్ దెరలించునప్పుడు [2]పఱమొగుల్
విరియించుబలుగాడ్పువిధము [3]మెఱయు
హయములఁ జెండాడ నరుగు చోట్లను లేళ్ల
గమిఁ గిట్టుకోల్పులికరణి యొలయు
[4]భటులకు నరుగుచోఁ బసలేని పెనుఁ [5]గాన
[6]దరికొనుచిచ్చుచందంబు [7]గలుగు

తే. గసి మసంగిన[8]యంతకుకరణి యంత్య
కాలరుద్రుని[9]దర్ప మకాండమృత్యు
ముఖము నుగ్రభావము దోఁచు మొనయు వీర
సమితిఁ దెగటార్చు నప్పు డాశల్యునందు.

233 వ. ఇట్లు విజృంభించి [1]యత్యద్భుతవిక్రమంబున నుల్లసిల్లు [2]నమ్మద్రమహీపతి నుభయసైన్యంబులజనంబులు ప్రశంసించి రంత కంతకు నగ్గలం బగునగ్గలికఁ జెలంగి యతండు భల్లాది[3]కాండపరంపరలు పటురయంబునఁ బరఁగించు పరమాభీలభంగికి నోహటించి ధర్మజుమోహరంబు దెరలి మరలి పఱవం దొడంగిన నన్నరవరుం డదల్చి కరతలం బెత్తి నిలునిలు మని నివారింప

---

తిమిరంబు—ఐ.గ ; నచరించు మధ్యందిన—చ. 16. మార్తాండ బింబంబుదోపకుండె—ఐ; 17. దోపకుండె – పెక్కు ప్రతులు.

232 1. జెండెడు నప్డు — ఊ.ఎ.ఔ.ఖ జ.చ.న ; జెండిన యెడ — ఐ.గ ; జెండెడియప్డు — చ. 2. పెనుమొగుల్ — పీ.శ.ష ; బలుమొగుల్ — ఆ.ఈ.ఊ.క ; పటుమొయిల్ — గ. 3. దోచు — ఐ.క.గ. 4. కాల్వుర నిర్జింప గడగెడు నప్పుడు గార్చిచ్చు చందంబు గాన వచ్చు – ఐ గ ; భటుల దఱిగెడు నప్డు పైకొని పెను — ప ; భటుల కలిగి నప్డుపసలేని – చ; 5. గాలి – ఉ.ఖ.త. 6. దార్కొనుచిచ్చు — క. 7. నొందు — కొన్ని ప్రతులు. 8. యంతకు నొక్క యంత్య — అ ; యంత (కు) యుగడకయంత్య — ఉ.గ ; యుద్ధతి గడక నంత కాల — శ. 9. దర్పమకాల మృత్యు — వ ; దర్పంబుగాగమృత్యు — ఐ.గ.

233 1. యద్భుత – పెక్కు ప్రతులు. 2. నమ్మద్రపతి—ఏ.ఐ.త. 3. ప్రచండకాండ – ఇ.క.ఘ.

నిలువ దయ్యె నయ్యుధిష్ఠిరుండు పౌరుషంబు పెంపునం దెంపు [4]సేసి యా
శల్యునిఁ దాఁకి దర్పంబు సూపినం జూచి మగుడ నిగిడి [5]సేన పోరికిం
బురికొనియె నప్పుడు పాండవాగ్రజుండు దమ్ములను దొరలను దనపాలికిం
[6]బిలువం [7]బంచి వారలతో నిట్లనియె.

234 చ. అమరనదీసుతాదు లగు[1]నక్కడివీరుల మీర లందఱుం
గ్రమమునఁ బిల్కుమార్చి భుజగర్వము సూపితి రేను శత్రు[2]సై
న్యమథనకల్యు శల్యుఁ దెగటార్చెద నాకిది కృత్య మీసము
ద్యమ మనివార్య మై [3]నెగడునట్టి తెఱంగు వినుండు చెప్పెదన్.

235 వ. [1]నాతేరికి నకులుండును సాత్యకియు వలపటను సహదేవుండును ధృష్టద్యు
మ్నుండును డాపటను గావలి యై రావలయు వెనుకం గదిసి వివ్వచ్చుం
డును ముందటి[2]కేలన [3]మొనసి వడముడియును [4]నడచునది యింత యేమిటి
కన [5]వలదు న న్నొండె నతం డతని నొండె నేను సమయించుట యవశ్యం
బును గలుగం జూచితి నిట్లు తెంపు చేసి యమ్మద్రపతి మార్కొను నాకు
దుర్దమప్రయత్నంబు కర్తవ్యంబు కృపకృతవర్మాశ్వత్థామసౌబలసుయోధను
లయ్యోధముఖ్యు రక్షింపం జేయు పరాక్రమంబునకు మీరు ప్రతివిక్రమం
[6]బాచరించుచుండు నుదీర్ణం బగుమదీయబాహు[7]పాటవంబున నమ్మేటిమగని
గీటడంగించువాఁడ నని పలికిన నారథికవరులును దక్కనుగల[8]వార
లమ్మానవపతిపూనికి నగ్గించి యతనిరథంబు సవిశేషకల్పితంబు [9]గావించి
యతండు సెప్పినతెఱంగున సన్నద్ధులై సముద్ధతిం దేజరిల్లుటయుఁ దత్సై
న్యం బుత్సాహదీప్తం బై కడంగినఁ గరిఘంటారవంబులును రథనేమినిస్వ
నంబులును దురంగకింకిణీక్వణనంబులును సుభటసింహనాదంబులును నిస్సా

---

4. సేసి మామాయని పేరెలుంగెత్తి యాశల్యు—వా ; సేసి యాశల్యు—పెక్కుప్రతులు.
5. సేన పెక్కుప్రతులలో లేదు. 6. బిలిచి వారలతో — ట. 7. బనిచి — ఈ.ప.ఘ.త.

234 1. నద్భుత — అ.వ. 2. సైన్యము దలకంగ — వ. 3. నిగుడు — పెక్కుప్రతులు.

235 1. నేను శల్యుం దెగటార్పఁబోవునపుడు నా తేరికి — అ.ప. 2. కెలంకుల — ఆ.క.ఖ.ఘ.ట. 3. గదిసి భీముండును — ట. 4. నడువవలయు నడుమ నేను వచ్చు వాఁడ యిదియంత యేమిటి కనవలదు — అ. 5. వలవదు — ఆ.ఊ.జ.త. 6. బాచరింపు — క.ట.వీ.శ.ష. 7. బలంబున — ప. 8. తగువారల — ఒ.గ.వ ; వారలయ్యోధవరుపూనికి — వీ.శ.ష. 9. గావించి — పెక్కుప్రతులు; సేసి — వా.

ణాదితూర్యనినదంబులును[10] బెరసి యంబరంబు పిక్కటిల్లఁ జేసె నివ్విధం
బున యుధిష్ఠిరుం డుద్భటుం డై [11]యురవడించిన.

—: శల్య ధర్మనందనుల ద్వంద్వ యుద్ధము :—

సం. 9—15—54

236 క. [1]కురువిభుఁడు దనదు[2] మొనలకు
బరవస [3]మొప్పంగ మద్రపతి మును శౌర్యో
[4]ద్ధురుఁ డయి [5]కడఁగ నడరి య
వ్వరూథినిం దాఁకె ధరణి వడవడ వడఁకన్.

237 వ. అట్టియెడ.

238 క. పులులు దల[1]పడినయుబ్బును
[2]బలుపును దోఁపంగ మద్రపతిధర్మసుతుల్
తలపడి యొండొరువులపై
నలఘుప్రదరములు వఱపి రధికరయమునన్.

239 వ. వారి నాలోకించి యుభయసైన్యంబులు [1]విజృంభించి [2]సంరంభంబునం
గలయం బెరసినఁ గ్రిందుకయ్యం బయ్యె నందు.

240 ఉ. నీతనయుండు సింహకమనీయతరం బగుభీమునుల్లస
త్కేతన మర్ధచంద్రశరతీవ్రవిపాతిఁ మణికింకిణీనినా
దాతిశయంబుతోడఁ బడునట్లుగ నేసి శరాసనంబు బల్
వాతిశరంబునం దునిమె వారివరూధిని యే పడంగఁగన్.

---

10. నుంబరగి — కొన్ని ప్రతులు. 11. శల్యాంతక ప్రక్రియ నురవడించిన — అ.ప.

236 1. కురువీరుడు — శ; కురువిభుడలరగ మొనకున్ బరవస — ఖ; కురువిభుడును నమ్మొనకును బరవస — గ.స. 2. మొనకును — పెక్కు ప్రతులు. 3. మెఱగంగ — ఊ.ఎ.క.ట.త; మలరంగ — చ. 4. ధురుడై కడంక — పెక్కుప్రతులు. 5. కడంగిన మఱియు నవ్వరూధి — ఎ.

238 1. పడ్డయుబ్బున — గ. 2. నలువునుదోపంగ ధర్మనందన శల్యుల్ — పెక్కు ప్రతులు; బలువునుదోచగను ధర్మపతి సుతశల్యుల్ — వ.

239 1. విజృంభిత—ఉ.ప.క.ఖ.ట.వ; విజృంభ సంరంభులై — ఈ; విజృంభించి సంరంభులై — కొన్ని ప్రతులు. 2. సంరంభులై గలయ — కొన్ని ప్రతులు.

241 చ. అతఁడు [1]ప్రదీప్తకోపముఖుఁ డై [2]పటుశక్తి నురంబు వైచినం
బతి యరదంబుపైఁ బడియె బల్విగుమూర్ఛ మునింగి యప్పు డా
యతధను వెత్తి సూతుతల యక్కురు[3]ఘుస్మరుఁ డేసె డొల్ల వే
గ తొలఁగ నీడ్చెఁ దేరు దురగంబులు మూఁక గలంగి [4]పోం పఱన్.

242 క. కని యశ్వత్థామయుఁ గృపుఁ
డును గృత[1]వర్ముఁడును [2]నెక్కుడు బరవసమునన్
మనసేనకుఁ దలమిగిలిన
మనుజేశ్వర కవిసెఁ గ్రీడి [3]మద [4]మెలరారన్.

243 క. అమ్ముఖమున సమరము [1]రా
ద్రమ్ము పెనిచె మద్రవిభునిఁ దలకడచి యనీ
కమ్ము బహులాస్త్రశస్త్రచ
యమ్ముల ధర్మజునిఁ బొదివె నత్యుగ్రమునన్.

244 వ. పొదివిన నయ్యుధిష్ఠిరుండు

245 చ. అరదము చిత్రసంచరణ మక్కజమై పిలసిల్లఁ దేరులుం
గరులును ఘోటకంబులును గాల్బలముం దనచేతఁ [1]గూలఁగాఁ
బొరలఁగ మేదినిం దునియ ప్రోవులు గా రుధిరంపురొంపి బ్రిం
గ రణ[2]విహారముం జలిపెఁ గౌరవనాథ యనేకభంగులన్.

246 క. [1]నరులు మృదు వితఁ డనంగాఁ
బరగు యుధిష్ఠిరుఁడు శత్రుబలముల కతిని

---

241 1. ప్రకోపదీప్త — పెక్కు ప్రతులు. 2. పృథు — ఊ.ల. 3. పుంగవుడేసె — ఊ.ఐ.గ. 4. పెంపఱన్ — ఊ.ఐ.గ.చ.

242 1. వర్మయును — పి. కొన్ని ప్రతులు. 2. వెంగడున్ రభసమునన్ — శ ; వర్ముండును గడు రభసమునన్ — ఈ.ఉ.ఏ.త.న.వ. 3. మనమలరారన్ — త. 4. మేపారన్ — ఊ ; మెసలారన్ - ఎ.

243 1. రాదగ్రిమ్ముగదుర — అ ; రాద్రమ్మగుడును — ఊ.

245 1. దూలగా - ఈ.త.వ. 2. విహారముల్ సలిపె — శ.ష.

246 1. పరులు — ల.పి.ష ; పరులితడు మృదువ (డ) నంగా — క.ఖ.చ.వ ; పరులకు

ష్ఠురుఁ [2]డయ్యె నపుడు సురల
చ్చెరు వందిరి చూచి ద్రోణశిష్యుఁ బొగడుచున్.

247 క. మునుము [1]బయ లై [2]న నలిఁ జే
ర్చినయమ్మను జేందు క్రిమీఁద శితవిశిఖము లే
పున నిగిడించుచు శల్యుఁడు
దనరుభుజా[3]బలముతోడఁ దఱిమెం బెలుచన్.

248 క. అవ్వీరుని వాలంపఱ
[1]క్రొవ్వు నడఁచి తనదునంపకోల లడరఁగా
నవ్వసుధాధిపుఁ [2]డల్లని
నవ్వాలయఁగ [3]మాఱుకొనె ఘృణారహితుం డై.

249 వ. ఇవ్విధంబున మాఱ్కొని ధర్మజమద్రపతులు నిజశంఖంబులు [1]పూరించిరి భేరీ[2]ప్రముఖతూర్యస్వనంబులు నింగి [3]వ్రాంగారఁ జెలఁగె నయ్యిరువురు నొండొరులపైఁ జండ[4]కాండపరంపరలు [5]పరగించి తనువులనెత్తురు లురిలించి పూచిన[6]బూరువుల[7]పొలుపు దాల్చి రట్టియెడఁ గనుంగొనుజనంబులు.

250 చ. వెరవును లావుఁ జేవయును వీరల కారయ [1]నొక్క రూప దు
స్తరభుజశక్తి [2]ధర్మజుఁడు శల్యునిరూ పడఁగించి యువ్వసుం

---

మృదువితడనగా - ట; ప(న)రులు మృదుం డితడనగా — వ.ష.స. 2. డనిసురలచ్చెఱు వందిరి ద్రోణుని శిష్యు సన్నుతించుచు నధిపా — స.

247 1. చితములై — త. 2. సవిదచేర్చిన - ఇ; సరిచేర్చిన — ఉ.వ. 3. విక్రమమునం దరిమెం - ఓ; బలము మెరయ దరిమె నరేంద్రా — ప.

248 1. క్రొవ్వెల్ల నడంచి యంప కోలల — వీ.శ.ష; క్రొవ్వడ(చుచు)చియు నతనియంప కోలల—ఊ.జ. 2. డెట్టని—అ.ఉ ఎ.ఏ.ఔ.ట.త.ల; డల్ల ననవ్వాలరగ — గ. 3. మాఱుకొనియె నగురహితుండై — ఈ.ఎ.జ.వీ.శ.ష; మార్కొనియె ఘృణా — ల.

249 1. పూరింప భేరీ — పెక్కుప్రతులు. 2. ప్రముఖ నిఖిల తూర్య — ఆ ఇ.ఓ.ఘ.ట; మృదంగ నిఖిల తూర్య — చ; నిఖిలతూర్య—ఊ. 3. ముట్టజెలంగె - వ. 4. కాండంబులు వర — శ. 5. దొరగించి — పెక్కుప్రతులు. 6. మోదు(గు)వుల — ఆ.ఇ. ఉ.ఎ. 7. చెలువు — ల.

250 1. నేక - ఊ.ఖ. 2. తమ్ములును — ద. ఈ పాఠము ప్రకరణానుగుణముగా లేదు.

ధర గొను నొక్క నేఁ డితనిఁ దానమయించి సమస్తమేదినీ
శ్వరుఁడుగఁ [3]జేయ నోపు నొకొ శల్యుఁడు గౌరవరాజనందనున్.

251 వ. అని సందేహడోలాయమానమానసు లై [1]రప్పుడు.

252 తే. [1]మద్రపతి ధర్మజునివిల్లు రౌద్ర మెసఁగఁ
ద్రుంచి నూఱమ్ము [2]లేసి యుద్ధురతఁ బేర్చె
నతఁడు వేఱొక్క[3]ధను వెత్తి యతని[4]ధనువుఁ
దునిమి వెస నేసె [5]మున్నూఱు తూపు లధిప[6].

—: విరథుఁడయిన శల్యుని నశ్వత్థామ తనరథముపై నిడుకొనిపోవుట :—

సం. 9-15-65

253 ఉ. తోడనె [1]తేరి[2]వాహములఁ ద్రుంచి మదంబున సూతుప్రాణముల్
క్రీడయపోలెఁ బుచ్చికొని కేతువుఁ గూల్చిన [3]సేన విచ్చెఁ జే
యాడక యున్నశల్యుని రయంబున నాత్మరథస్థుఁ జేసి పె
న్నీడునఁ బొంద కుండఁ దొలఁగించెను ద్రోణసుతుండు భూవరా.

254 వ. ఇట్లు శల్యుండు సమరవైకల్యంబు నొందుటయు ధర్మనందనుం డార్చి పేర్చి తద్బలంబుఁ దఱిమె నంత నమ్మద్రపతి యొండు[1]రథంబు [2]గల్పించుకొని కడంగి యాకౌంతేయాగ్రజుపైఁ గంకపత్త్రంబులు [3]నిగిడించుచు [4]నిగిడినం గని యద్దెసఁ జేయఁ గల[5]సైనికోత్తములు సరభసంబు[6]న

---

3. జేయు నొక్కొతగ శల్యు — అ.ప ; జేయ జాలు నొకొ — ఊ.ఐ.గ.

251 1. చూచు చుండి రప్పుడు — వ.పీ.శ.ష.

252 1. ధర్మజుండప్పు డాతని ధనువు రొవ్వ్రి — చ. 2. వేసె నుద్ధురత — ఓ.త.ల
3. విలుగొని — పీ.శ.ష ; విల్లెత్తి యతని — అ.ప ; ధనువున నతని — పెక్కు ప్రతులు.
4. విల్లు దునిమి — ఊ.ప.ఘ.జ. 5. నన్నూఱు — ద. 6. వ. అంతనయ్యుధిష్ఠిరుండు వేఱొక్క విల్లెత్తి — 'చ' ప్రతిలో అధిక పాఠము కలదు.

253 1. చేరి — న. 2. మావులను — గ. 3. విచ్చెసేన — పెక్కు ప్రతులు.

254 1. రంధంబెక్కి కడంగి — ద. 2. సుకల్పితంబుగావించుకొని — పెక్కు ప్రతులు.
3. బరగించుచు — ల. 4. గవిసినం — పీ.శ.ష ; గదిసినం — ఊ ; నిగుడినం — పెక్కు ప్రతులు. 5. రథికులు సరభ — పీ.శ.ష. 6. గా — పెక్కు ప్రతులు.

నయ్యోధవరు [7]నెదుర్కొని[8]రప్పు డతఁడు సాత్యకిఁ బది[9]సాయకంబులను భీమసేననకులసహదేవుల శరత్రయంబు[10]లను గ్రుక్కించి యొక్కొడుమదం బునం బొదలిన యంగంబులతో నలరెఁగి [11]మఱియు నప్పుడు పొగడం [12]దగి యుండె నాకర్ణింపుము.

255 సీ. కమలాకరము లీలఁ గలఁచి యాడెడు గంధ
దంతా[1]వళము సముద్దండతయును
దరమిడి మృగసముత్కరము ఘోరంబు గా
వధియించుకంఠీరవంబు[2]నేపు
నీరసారణ్యంబు నిర్భరాటోపతఁ
గాల్చు దావాగ్ని యుగ్రక్రమంబు
[3]ప్రకట[4]విక్రాంతిఁ బురత్రయంబును [5]సమ
యించు ఫాలాక్షుని యేడ్తెఱయును

ఆ. [6]బోల్పఁ బట్టు లయ్యె భుజగర్వశౌర్య ప్ర
తాపదుర్దమప్రకోపములకు
[7]మద్రవిభుఁడు గోలుమసఁగి [8]శాత్రవసైన్య
హాననకేళి సలుపు నవసరమున.

256 వ. [1]ధర్మనందనుం దల [2]మిగిలినచతురంగంబుల నివ్విధంబున విని[3]హతంబులు సేసి యమ్మహీపతిపైఁ [4]గవిసినం గని కవలును శైనేయుండును [5]భీమసే

7. మార్కొని - అ.ఊ.ఏ. 8. నుటయునతం — పెక్కుప్రతులు. 9. బాణంబులను— ఒ.జ.బ. 10. నను - కొన్ని ప్రతులు. 11. మఱియు నప్పుడు - పెక్కు ప్రతులలో లేదు. 12. దగునా - పెక్కు ప్రతులు.

255 1. వళంబు నుద్దండ — పీ.శ.ష. 2. నేర్పు — గ; సొంపు — ఖ; నెరవు — ఇ. 3. ప్రబల — ప.వ. 4. విస్ఫూర్తి — చ; విఖ్యాతి — శ. 5. దహించు - చ. 6. బోల్పబట్టయ్యె భుజగర్వ భూరి శౌర్యకోప దుర్దమ భీమ ప్రతాపములకు — 'అ' ప్రతిలో సగము పద్యము తేటగీతిగా మార్పబడినది. కాని ఉత్తరార్ధము ఆటవెలది గానే నిలిచియున్నది; బోల్పబట్టయ్యె భుజగర్వ శౌర్య ఘోరరణ తీవ్రకోపములకు— 'ఖ' ప్రతిలోను పై పద్ధతినే మార్పు కలదు. 7. మద్రనాథుడు వెస - ఖ. 8. సైన్యంబులహనన - క.

256 1. ధర్మనందనునకుందల — పెక్కు ప్రతులు; ఇవ్విధంబున ధర్మనందనునకుం దలకడచి పొదివిన చతురంగంబుల నిహతంబుల జేసి — వ. 2. కడచి — ఆ.ఒ.ఓ. 3. హతంబులు - పెక్కు ప్రతులు. 4. గని - పెక్కు ప్రతులలో లేదు.

నుండును దోడ [6]నడువ నతం డమ్మోటిమగని మార్గాని [7]పటు మార్గణంబు లు[8]రంబున [9]నించి నొంచె నప్పుడు [10]కురువిభుండు వనుప మన[11]సైనికులు [12]దల మిగిలి శల్యునికిఁ బ్రాపయి యప్పవనతనయ[13]ప్రభృతులతోడఁ [14]బెనంగి రతం డాపాండవాగ్రజుమేనఁ జండ[15]కాండసప్తకంబు [16]నినిచిన నజ్జననాథుండు నవనిశిత[17]నారాచంబు [18]లప్వీరు[19]నంగంబుల నాటించె నిట్లు [20]దలపడి కోలుపులుల[21]పోలికఁ జేరేనుంగులతెఱంగున బలుసింగం బుల[22]చందంబునం బోరి యొండొరుల నొప్పించి రప్పుడు.

257 సీ. శల్యుండు బలునారసము [1]పాండవాగ్రజు
నురమున నాట నత్యుగ్రదీప్త
ఘోరనారాచ మాకుంతీసుతుం డేయ
నతఁడు మూర్ఛిల్లిన [2]నలరె నధిపుఁ
డమ్మద్రపతి తేటి యలుకఁ గెంపారెడు
కనుఁగవతోఁ జండకాండ [3]మొకట
నయ్యుధిష్ఠిరు నొంప నాతండు పసిఁడిమై
[4]మలు వాలుతూపుల నటికి [5]వైచి

తే. వాలురమ్ములు దొమ్మిది వక్షము[6]న ని
గుడ్ప నయ్యోధవరుఁ డతికూరభల్ల
[7]యుగళఖండితచాపుఁ జేయుదును నొండు
ధనువు గొని యవ్విభుండు దత్తనువు సించె.

---

6. నడర — పెక్కు ప్రతులు. 7. బలు – అ.ప.క. 8. రయంబున — ఐ.ఖ.గ.చ.ల.ప. 9. నిగుడించె – శ.ష ; నొప్పించె – క. 10. నీకొడుకు – అ. 11. సేనంగలుగు దొరలు శల్యునికి – అ.ప. 12. దలమిగిలి — పెక్కు ప్రతులలో లేదు. 13. ప్రముఖులతో — అ.ఊ.ఐ.గ. 14. బెనంగనాపాండవాగ్రజు — కొన్ని ప్రతులు. 15. కాండంబులు సొనిపిన నజ్జన — ఐ.గ. 16. సొ (జొ) నిపిన — కొన్ని ప్రతులు ; గుచ్చిన– పీ.శ.ష ; నించిన – ప. 17. సాయకంబు – కొన్ని ప్రతులు. 18. లమ్మోటిమగని యంగంబుల నాటించి — పీ.శ.ష. 19. మేనంబరపె నిట్లు – ల.వ ; నంగంబునంబఱపె– పెక్కు ప్రతులు. 20. దొడంగి — పెక్కు ప్రతులు. 21. కైవడినేనుంగు — ల.చ. 22. భంగింబోరి — పీ.శ.ష ; చందంబున బొదివి పోరి — వ.

257 1. నను ధర్మజు–త. 2. నలరి యతడు–అ ; నలరి రథిప–ఐ జ ; నలరె నధిపయమ్మద్ర–స. కొన్ని ప్రతులు. 3. మొకటి — కొన్ని ప్రతులు. 4. మఱువుబల్దూపుల — ఒ జ ; యిరువాలు తూపుల — న. ఈ పాఠమున సాధురేఫ శకటరేఫలకు యతి మైత్రి చెప్పఁబడినది. 5. వేసె – ఔ. 6. ననుగూర – అ.ఓ. 7. యుగవిఘట్టితచాపు — న ; యుగళఖండిత బాహు — వ.

258 క. ఖాసట యై భీముఁడు పె
ల్లేసెను [1]మద్రపతి [2]నాతఁ డిరువురతోఁడం
జేసెం గయ్యము [3]గృపును
ద్భాసితవిక్రమముతోఁడు[4]పాటు గలుగఁగన్.

259 వ. అట్టియెడఁ గంకటాంతరంబు ధరియించి కడంగి.

260 ఆ. మద్రవిభుఁడు ధర్మమారుత[1]సుతుల మై
మఱువు లుఱక నటికి మార్గణములు
దొమ్మిదింట [2]రెంటఁ [3]దూఁటులు సేసె దో
ర్దండములు ప్రదీప్తదర్పుఁ డగుచు.

261 క. ఆలో ధర్మజుసారథిఁ
గూలఁగఁ గృపుఁ డేయ మద్రకుంజరుఁడు భుజా
లీల [1]మెఱయంగ హాయము
ల్నాలుగు [2]నొకవేగ్ర్మిడిని నిలం బడ[3]వైచెన్.

262 వ. ఇవ్విధంబున విరథుండై యమ్మహీకాంతుం డంతర్గతంబున.

263 క. గెలువుము [1]శల్యుని నీవని
పలికి [2]ముకుందుండు నన్నుఁ బనిచినవాఁ డ
ప్పలుకులకు [3]నసత్యత్వము
గలుగఁగ నేర్చు నొకో దైవఘటనబలమునన్.

---

258 1. మద్రేశు డప్పు డిరువుర–ఖ ; మద్రేశ్వరుండు నిరువుర – త. 2. వారలిరువుర–చ. 3. నృపు – ట.త ; క్రూరోద్భాసిత – ఊ. 4. పాటుంగలిగెన్ – పెక్కుప్రతులు; పాటుగనధిపా – న.

260 1. పుత్రుల – చ. 2. నొడలుదూటుగ జేసె – ఐ.గ. 3. దుఱుములుసేసి – త.

261 1. మెఱయ నా (గా) హాయ – క.ఖ.జ. 2. నొక్కటనగ్రక్కునంబడ నేసెన్–ఐ.గ. 3. నేసెన్ – పెక్కుప్రతులు.

263 1. నీవనిశల్యుని – క ; శత్రునినీవని – ట.న ; ధర్మజనీవని – వ. 2. మురాంతకుడు – ఐ.గ. 3. నసత్యతయు – ఎ.ఒ.ఓ.వ.

264 వ. [1]అని శంకించియుఁ గొంకుపోవక యజ్జగన్నాథు[2]వచనంబున[3]కు నన్యథాత్వం బేల గలుగు నని యద్దేవునిం దలంచి యామాట యమోఘంబు గావలయు నని ప్రార్థించి వెండియు.

265 చ. స్ఫురిత[1]షడర్ధనేత్రునిఁ ద్రిశూలసముజ్జ్వలు నిర్గుణుం [2]గుణా
దరసము[3]పాత్తమూర్తిఁ గలితప్రభవస్థితి[4]సంహృతిక్రియా
నిరతి[5]వివర్తితత్రిభువనమహనీయుని దైత్య[6]మర్ది [7]న
ప్పురుషవరుం జతుర్భుజు [8]విభుత్వమహోన్నతు నాశ్రయించెదన్.

266 తే. ఖండనముసేయు [1]నరునగ్రభాగమునఁ బ్ర
చండ[2]శూలోగ్రహస్తు డై శత్రుకోటి
గీటడంచుచు నేఁజూడఁ [3]గేలి సలుపు
దేవు జయసిద్ధికై [4]సన్నుతింతు భక్తి.

267 వ. అనుచుఁ [1]బురుషోత్తమునిఁ జిత్తమున నిలిపి [2]యున్నతం బైనపూర్వకాయంబుతో మంద[3]ప్రకారంబున మార్గణంబు లమ్మద్రపతి[4]దెస నిగిడింప నతఁ [5]డవి బెండువడుట గాఁ దలంచి తఱిమి యఱిముఱిశరంబులు గురియుటయు [6]నప్పుడు.

---

264 1. అని పలికి శంకించి — పెక్కు ప్రతులు. 2. వాక్యంబునకు — పీ.శ.ష. 3. కనత్వ్య త్వంబేల — ట.న.

265 1. లలాట — ఊ. 2. గుణోత్తరు — ఘ.శ ; గుణోత్తము — చ. 3. దాత్త, పాంత — అని పాఠములు. 4. సంవృత — చ. 5. నివర్తిత — పెక్కు ప్రతులు. 6. మర్దనుం — పీ.శ.ష.స. కొన్ని ప్రతులు. 7. వత్పురుషుజతుర్భుజున్ భుజగభూషు మహోన్నతునాశ్రయించెదన్ — త. 8. నిభృత — ఐ.గ ; విభుప్రభవోన్నతు — ఉ.

266 1. సముదగ్రభావమున — త. 2. శూలాగ్ర — ఉ.ఊ.ఎ.ఏ.ఐ.ట.న.వ.శ. 3. గ్రీడ — ఆ.ఓ.క.ఖ.ఘ.చ.ల.వ. 4. సంస్తుతించు — పెక్కు ప్రతులు.

267 1. నప్పురహరు — ఊ. 2. నిరతం బైన — ద ; యవహితం బైన — అ.ఏ ; యాయితం బైన తేరి (రు) తోఁ పూర్వరథిక నికాయంబుతోఁ — ఈ.త. 3. ప్రచారమ్మున — ఎ. 4. మేన — ల ; మీద — చ. 5. దది — వా ; దవి — కొన్ని ప్రతులు. 6. అప్పుడు — పెక్కు ప్రతులలో లేదు.

268 చ. పవనసుతుండు విల్ నఱికి బాణయుగంబున [1]మేనునొంచి శా
త్రవులు దలంక సారథికురథ్యములన్ దరఁ గూల్చి సూతుకం
ఠవిదళనం బొనర్చి ప్రకటస్ఫురణం[2]బునఁ గంటకంబు భ
ల్ల[3]వితతి [4]ఘోర[5]సంహతి నిలం బడ నేసె రయం [6]బెలర్పఁగన్.

269 వ. ఇవ్విధంబున.

270 క. [1]విరథుండు నచాపుఁడు వ
ర్మరహితగాత్రుండు నైన మద్రవిభుఁడు భా
సుర[2]ఖడ్గచర్మశోభిత
కరు డై [3]తేరు డిగి కన్నుఁగవఁ [4]గెంపారన్.

271 మ. జముచందంబున [1]నేచి ధర్మసుతుపై సంరంభదుర్దాంత[2]ద
ర్పమునన్ వేకవియంగఁ [3]జండబలదుర్వారుండు భీముండు ద్రుం
చె [4]మదంబారఁగ వాలునున్ బలకయున్ శీఘ్రత్వ సందీప్తుఁ డై
తమది క్కార్పులుఁ దూర్యనాదములు [5]నత్యంతంబు శోభిల్లఁగన్.

272 వ. అమ్మద్రపతి [1]నేర్పును జేవయుం గలపరిజనంబులు చేర్పఁ గంకటగదా దండంబులు ధరియించి యుధిష్ఠిరుమీఁద నురవడి [2]నడరె నప్పు డప్పాండవాగ్రజునకు బాసటయై సాత్యకిధృష్టద్యుమ్న శిఖండిద్రౌపదేయమాద్రేయులేయుసాయకంబు[3]లు సరకుగొనకగదం జిత్రంబు గా జడియుచు వడముడి విక్రమంబునఁ [4]దవులంబడక నిగిడె నశ్వసూతరహితం బగురథంబుపై నున్న యన్నరేంద్రుండు తనదెసకు సింహ[5]చంక్రమణత్వసుందరుం డై వచ్చునవ్వీరు నాలోకించి [6]సక్రోధం బై నయవష్టంభంబున [7]నుద్దీపితుం డై.

---

268 1. బొమ్మునొంచి — ప; బొమ్ముగ్రుచ్చి — అ. 2. బెలరార ఘోరథ — బొ.ట. 3. విహతి–ట. 4. గంకటంబును – బొ.ట. 5. సంహృతి–అ.ఐ.గ. 6. బొనర్పగాన్–త.

270 1. విరథు డకృత చాపుదువర్మ రహిత – ఐ.గ. 2. చర్మఖడ్గ - అ.ఖ.ఘ ; ఖడ్గవర్మ– ఐ.క.ట. 3. కనుగవలకెంపు గడలు కొనంగన్ — ఊ. 4. కెంపడరన్ — చ.

271 1. నేర్చి — అ. 2. గర్వమునన్ — అ.ఉ.ఎ.ఏ.ఐ.వ. 3. గాఢ — ఐ. 4. మహిన్ రాలగ — ఖ. 5. లనౌద్ధత్యంబు – ప.వ. కొన్నిప్రతులు.

272 1. యేపును — ఇ.ఉ.ఎ. 2. నడరె, నడరి — అని పాఠములు. 3. లనతండు–అ. 4. దవులు బడక — పెక్కుప్రతులు; దవులువడక — ద.న వ.శ.ష. 5. సంక్రమణత్వ– పెక్కుప్రతులు; విక్రమణత్వ — ఈ.ఖ.ల; విక్రమఘనసత్వ — త. 6. సక్రోధుం డై యవ – ఐ ఘ ట.ధ.న.ల. 7. నుద్దీప్తుండై – వ ; విజృంభించియుద్దీప్తుండై —ఈ.త.

273 క. ఇతని సమయింప నయ్యు
చ్యుతుఁడు ననుం [1]బనిచె నాకు నొనరించిన[2]పా
లితఁ డని తలంచి మొగము
గ్రత [3]నొందఁగ శక్తిమీఁదఁ గను[4]దోయొలయన్.

274 వ. హృషీకేశు నుద్దేశించి.

275 ఉ. నీ దెస [1]నాదుచిత్తమున నెక్కొని యుండెడుభక్తి భద్రసం
పాదిని గావు టచ్చెరువె భక్తజనాభిమత[2]ప్రదాన[3]వి
ద్యాదయితత్వ మేర్పడ జయం బొడఁగూర్పుము దేవ సంశ్రితాం
హోదళనంబు నీకు [4]వ్రత ముల్లము [5]నాపయి నిల్పు మిత్తఱిన్.

276 వ. అని హృదయంబునఁ బ్రార్థించి యప్పార్థివోత్తముండు.

277 ఉ. అచ్చపుభక్తి[1]కిన్ మదిఁ బ్రియంబున నొందినఫాలలోచనుం
డిచ్చినప్రీతి[2]యోగమును నెక్కుడుభక్తియు నావహిల్లఁగా
నిచ్చలు గంధపుష్పముల నిష్ఠమెయిం బరిశోభితార్చనం
[3]బిచ్చుచుఁ దాను గొల్వ నుతి కెక్కినయమ్మహనీయశక్తికిన్.

278 మ. ప్రణతుం డై రథ[1]సోదయాభినవదర్పస్ఫూర్తి శోభిల్లుచు
[2]న్మణి[3]దండద్యుతి[4]మంజరీ[5]స్ఫురణము [6]న్సంశోభిఘంటాపటు
క్వణనంబున్ రిపుసైనికప్రకరదృక్కర్ణవ్యథం జేయ భీ
షణ[7]రేఖం బగు[8]దానిఁ బుచ్చుకొని చంచన్ముష్టి[9]దృప్త్యుద్ధతిన్.

---

273 1. బంచె — ఉ.వ. 2. వాడితడని — ఈ ఉ.ఎ ఘ జ.ల. 3. బొరయఁగ — ఆ.క.ఘ.చ. 4. దోయలరన్ — పెక్కు ప్రతులు; దోయలయన్ — ల.

275 1. నాకుచిత్త — ఏ. 2. ప్రదాయి — క.ఖ.గ.ల. 3. విద్యోదితతత్వ — ఐ.గ. 4. నీగలయుల్లము — ఘ.ల. 5. నాదెస — ద.

277 1. నెమ్మది — ఊ.ఔ. 2. యోగమున - పెక్కు ప్రతులు. 3. బిచ్చుటదాని(ను) — ఘ.వ; బిచ్చుచుదాని — ఊ.ఎ ఔ.క.ద.

278 1. సోగ్రవీరభయ — ఐ.గ; సోదయాదిమణి — ఒ.బ. 2. న్ఫణిరత్నద్యుతి — స. 3. చండ — వ. 4. పుంజవి — వీ.శ.ష. కొన్ని ప్రతులు. 5. స్ఫురితమున్—ద. 6. న్రంజిల్లు — ఎ.ఒ.ప. 7. రోషంబగు — ఘ.ల. 8. పాణి — ఇ ఉ.ఎ.ఏ.ఓ.ఔ.చ.వ.స. 9. దీప్రోద్ధతిన్ — కొన్ని ప్రతులు.

279 వ. అభిరామభీమాకారుం డై.

280 తే. నెరయుకినుకఁ [1]బెన్పెడఁద యై నిప్పు లురుల
కన్నుఁగవ శల్యుఁ [2]జూచిన నున్నయునికి
నతఁడు [3]నీఱు గాకుండుట యరిది యయ్యె
మాకుఁ జూడంగ నప్పుడు మనుజనాథ

281 వ. ఇట్లు రౌద్రోద్రేకంబునఁ బురత్రియ[1]దాహ[2]దోహలి యగు శూలాయుధు
లీల దోఁప దుర్నిరీక్షుం డై.

282 ఉ. ఘోర[1]తర[2]ప్రకార మగు[3]కుంచిత[4]జాహ్నవిలాస మొప్ప వి
స్తారము వింత [5]యౌనురము [6]సారతరంబుగఁ [7]జూచి వజ్రధా
రారుచిసన్నిభప్రచురరశ్ములు పర్వఁగ బిట్టువైచె న
ద్దారుణశక్తి నవ్విభుఁ డుదాత్త[8]సమిత్కృతికల్య శల్యునిన్.

283 తే. అట్లు పాండు[1]భూపాలకు నగ్రసుతుఁడు
మద్రనాథుని [2]వై చిన రౌద్ర మెసఁగ
గంకటముదూఱి వక్షంబు [3]గడచి వెన్ను
వెడలిచని యమ్మహాశక్తి పుడమిఁ జొచ్చె.

—: *ధర్మరాజు శక్తిప్రయోగించి శల్యునిం జంపుట* :—

సం. 9—16—50

284 వ. ఇట్లు శక్తి [1]బెడిదంపు[2]టురవడి నుచ్చిపోయిన.

---

280 1. బెన్నుప్పలై — వ. 2. జూచిన యున్న యునికి — పెక్కు ప్రతులు ; జూచుచునున్న యునికి — శ.ష. 3. నివురు — అ.ఎ.

281 1. హనన — ఖ; దాహన — చ. 2. దోహలియై యొసంగుశూలాయుధు — ఇ.ఈ.

282 1. ఘన — ఓ. 2. ప్రకారుడయి — ఐ.గ; ప్రకారమునగుంఠిత — ఒ ; ప్రకాశము నగుంచిత — న. 3. కుంభిత — క.ఖ. 4. జాణ — ఉ. 5. యైయు — పెక్కు ప్రతులు. 6. చారు — పెక్కుప్రతులు. 7. నుగ్ర — ఉ.ఎ.వ ; జూన్పి — ఐ.ఓ.గ. 8. సముద్యుతి — ఏ.

283 1. భూపాలు నియగ్ర — ఇ.ఈ.డి.ఏ.చ.జ.త. 2. సమయించి — ట. 3. గాడివెనుక, గాడివెంట, గాడివేగ, గాడివీపు — అని పాఠములు.

284 1. బెట్టిదంపు — పెక్కు ప్రతులు ; దేహంబునుచ్చిపోయిన — ఘ ; భేదించి నుచ్చి పోయిన — చ. 2. గతి నుచ్చిపోయిన — పెక్కు ప్రతులు ; టురువడి — గ.శ.ష.

285 చ. క్షతమున ముక్కునం జెవులఁ గన్నుల [1]నొల్కెడురక్తమంగ మా
ప్లుతముగఁ జేయఁగా నతఁడు బోరగిలం బడియెన్ [2]ధరం గద
ద్వితయము [3]సాఁచి ధర్మజునిదిక్కు శిరంబుగ వజ్రదారుణా
హతిఁ బడు భూరిభూధర[4]మహోత్తరశృంగముభంగి భూవరా.

286 ఆ. భూమిమీఁద నిట్లు బోరగిలం బడి
మద్రనాథుఁ డొప్పె మానవేంద్ర
లేమయురము[1]నందు లీలమై వ్రాలిన
ప్రాణ[2]నాథుఁ బోల్పఁ బట్టు గాఁగ.

287 ఆ. ధర్మ[1]సంగరమున [2]ధర్మజుచేఁ జచ్చి
పొలిచెఁ జూడ మద్రభూవిభుండు
విధియుతంబు గాఁగ [3]వేలిచి [4]విడిచిన
నాఁటి యున్నయగ్ని ననుకరించి.

288 మ. కని శల్యానుజుఁ డేచి ధర్మసుతు [1]నుగ్రస్ఫూర్తి శోభిల్లఁ దాఁ
కిన నాభూపతి చిత్రచాపధరుఁడై కేళీ[2]సమప్రక్రియన్
[3]ధనువుం గేతువుఁ ద్రుంచి [4]తోడన సముద్యద్దీప్తభల్లాహతిం
దునిమెం గుండల[5]కాంత మైనశిరముం దుర్దాంతదర్పంబునన్.

289 వ. [1]ఇట్లు శల్యుండు సోదరసహితంబుగాఁ బడినఁ బాండవసైన్యంబు జనంబులు
వృత్రవధం [2]బొనరించుపాకశాసనుఁ బ్రశంసించుబృందారకు[3]ల చందంబున

---

285 1. జిల్కెడు – క ; నొల్కుచు – ఖ. 2. వెసం – ఏ. 3. సాగ – పెక్కు ప్రతులు; గాగ – ఘ.త ; తోడ – ఎ. 4. మహోత్తత – చ.త.

286 1. మీద – ఔ.క.ట. 2. విభునికలప – పెక్కు ప్రతులు; విభునితోడ – ఇ.ఉ ; నాథుకలప – అ.ఏ.క.ఖ ; విభుడసంగ – త.

287 1. సంగ్రహమున – జ. 2. ధర్మునిచే – ఊ. 3. వేల్చిపోవిడిచిన – క ; వేల్చియు విడిచిన – చ ; వెలిచీరవిడిచిన – ఒ. 4. విడువగనా – ఖ.

288 1. శీఘ్రస్ఫూర్తి – పెక్కు ప్రతులు. 2. సమగ్రక్రియన్ – ఐ.గ ; సమగ్రక్రియన్ – చ.త ; గతివేగమే – శ. 3. దనరం – క. 4. తోడనె – ఓ.క ఖ.చ. 5. కాంతియైన – ఎ.ఘ ; దీప్తమైన – ట.

289 1. ఇత్తెరంగున శల్యుండు – పెక్కు ప్రతులు. 2. బుచేసిన పాక – పెక్కు ప్రతులు; బొనర్చు పాక – అ. 3. లట్లుధర్మ – వా ; ల చందంబున ధర్మ – పెక్కు ప్రతులు.

[4]నగ్గించి రమ్మోగ్రరంబునం దూర్యనినదంబులు సింహనాదంబుఁ జెలంగఁ గలంగి కురుసేన [5]విఱిగి పఱచినం బోనీక పొదువుం డనుచు సాత్యకి వెను[6]కొనుటయుఁ గనుంగొని కృతవర్ముండు మార్కొనియె నయ్యాదవ సింహులరణంబు దారుణం బయ్యె నందు.

290 సీ. కృతవర్మ సాత్యకి నతి[1]శితశర[2]దశ
కమున నొంచి తురంగములయుబ్బు
నుడిపి [3]విల్లునుముటయును నొండువింట న
బ్బలియుఁ డాతని మేనఁ బది[4]మెఱుంగు
[5]టమ్ములు వఱపి రథ్యమ్ముల నరదంబు
సూతుని నఱికినఁ జూచి కృపుడు
దన తేరిపైఁ బెట్టుకొని తొలఁగించె[6]న
వ్వీరుఘోరికి మూఁక వెఱచి పఱచెఁ

తే. గడఁగి వెనుకొన్న పాండవోత్కరము నొకఁడ
నిలువరించె [7]నుద్దండుఁడై నీతనూజుఁ
డంత వేఱొక్కతే రెక్కి యరుగుదెంచి
తాఁకె హార్దిక్యుఁ డరిసేన తల్లడిల్ల.

291 వ. ఇట్లెదిర్చి పేర్చినయలుకఁ బాండవాగ్రజుండు గృతవర్ముని ఘోటకంబులను గీటడఁగించినఁ గురునందనుం డా[1]హార్దికనందనుని నిజస్యందనంబున నిడుకొని [2]యవ్వలికిం గొనిపోయె నప్పుడు కృపాచార్యుండు గదిసిన నయ్యుధిష్ఠిరుం డాఱమ్ము లెమ్మలం గీలింప నతండు పదాఱుతూపుల నాభూపాలునిఁ దదీయతురంగంబుల నేసె నాసమయంబున.

---

4. గొనియాడిరమ్మోహరంబునం — అ ; గీర్తించిరంత నమ్మో — ఈ.ఎ ; గీర్తించి రమ్మో — ఇ.ఉ. 5. పఱచె - పెక్కు ప్రతులు. 6. కొనినంగనుం — పెక్కు ప్రతులు.

290 1. శాతశరముల నొదిగించి వాజుల నుబ్బణంచి — కొన్ని ప్రతులు. 2. శతకను(న)ల- అ.ఏ.ఒ ; చంక్రమమున — శ. 3. విలు వెసద్రుంచుట వేఱొక్కవింట, విశ్వాస ద్రుంచుట వేఱొండువింట, విలు వెసద్రుంచుట వినుమొండు వింట — అని పాఠములు. 4. శరములు — శ.ష. 5. వడిగ్రుచ్చి హయముల దడయక సమయించి — సూతుని జంపినం జూచి - శ. 6. నవ్వీరథుఁజూచిన మూక విచ్చి పఱచె — ఆ.ఇ.ఉ.ఊ.ఎ ; నవ్వీరు బోరిన మూకలు వెఱచి — ఘ. 7. సముద్ధతి - వీ.శ.ష ; నుద్ధతుఁడై — క.ఖ.గ.ఘ.

291 1. హార్దిక్యుని — వీ.శ.ష. కొన్ని ప్రతులు ; హార్దిక్యనందనుని — త.ల. 2. తొలఁగం గొని — ఈ.ఎ.చ.వ ; యవలకుంగొని — ఆ.ఊ.ఔ.వ.

292 తే. భద్రకరి నెక్కి చామర[1]ప్రకరవీజ
నములు ధవళాతపత్రవిభ్రమసమృద్ధి
యతిశయిల్ల సైన్యోత్సాహ మావహిల్లఁ
బొలిచె నెంతయు భవదీయపుత్రుఁ డధిప.

—: శల్యుచుట్టంబు లొక్కపెట్ట ధర్మరాజుం జుట్టుముట్టుట :—

సం. 9—17—3

293 ఉ. అమ్మనుజేంద్రు[1]ముందటికి నార్పులతోఁ జనుదెంచి శల్యుచు
ట్టమ్ములు సత్వరమ్ముగఁ గడంగి యనేకులు వీరయోధు లు
గ్రమ్ముగ వీఁకఁ దేరులు పొగడ్తకు నెక్కఁగ [2]దీప్తమైన కో
పమ్మున నేచి పాండవులపై [3]నదరం గని పేరెలుంగునన్.

294 వ. అన్నరనాథుండు.

295 తే. [1]మీర లేర్పడ [2]వడిఁదల మిగిలి[3]చనఁగ
వలదు [4]నామ్రోల [5]బలుపారి నిలువుఁ[6]డని యె
వారు నిలువక [7]పాండవబలము చేవ
దఱుగఁ జొచ్చి యుధిష్ఠిరుఁ దాఁకి రధిప.

296 వ. ఇట్లు చలంబున నవ్విభుం [1]దలపడి వివిధాస్త్రంబు[2]లు గుప్పించి నొప్పిం
చినఁ గవ్వడియును వడముడియుఁ గవలును [3]ద్రౌపదికొడుకు లేవురును
గోవిందుతమ్ముండును ధృష్టద్యుమ్నుండును శిఖండియును జండరయంబున

---

292 1. ప్రభలు వెలయనమరు — అ; ప్రభలువీవనమరు – ఏ.

293 1. ముందటికి – ఔ.ఖ.చ.ట.ర.వ. 2. దీవ్ర – అ.ప. 3. నడువం – ఏ.

295 1. మీరలెవ్వరు – పీ.శ.ష. 2. వడముడి – ఘ.చ.ల. 3. నడవ – ఏ.ఐ. 4. పలు
మారు మారలు – ఖ. 5. బొలుపారి – ఏ.ఐ.న.శ.ష. 6. డనగ – పీ.శ.ష. కొన్ని
ప్రతులు. 7. పాండవవరుని సేనదరియ – ఐ.గ; పాండవధ్వజునిచేవ – కొన్నిప్రతులు;
పాండధ్వజునిచేవ దెలియ – ఏ.ద.వ; పాండవధ్వజుని చెంత – ట; పాండవధ్వజిని
బెదర దరియజొచ్చి – చ.

296 1. గదిసి – పీ.శ.ష. 2. లుగుప్పించి నొప్పించినఁగవ్వడి – పెక్కు ప్రతులు; ల నొప్పిం
చినఁగవ్వడి—వా.పీ.శ.ష. 3. ద్రౌపదేయులును – ఏ; ద్రౌపదీ పుత్రులు – ఆ.ఓ.వ.

నుద్దండచతురంగసమేతు లై యారథికులఁ బోదువుటయును [4]వారలు వీరోద్రేకంబున సైన్యసాగరంబున నున్మదమకరప్రకరంబులవిధంబున విహరించి రట్లు పాండవసేనాసంక్షోభ[5]సంపాదు లగునాజి[6]దుల[6]యాటోపం బాలోకించి గాంధారపతి గాంధారేయు [7]నాలోకించి.

297 తే. మద్రవిభు వారి [1]నిమ్మోయి మార్తు [2]రాఁగి
కొనఁగ మనకు నుపేక్షింప[3]జనునె యనుడు
[4]నతఁడు నామాట వినక వారరిగి రేమి
సేయువార[5]ము చెప్ప నౌచిత్య మనియె.

298 వ. అని నన్ను నాపరివారంబును రక్షింపను దగ వెలింగింపను నర్హుండ వీవ కాదె యనుమాట లాడిన నతండు ప్రీతుం డై బలపరిపాలనంబును గర్వంబు సెప్పుటయును దనపనిగా మనంబునంబూని యవి దోఁచునట్టి యుచితవచనంబుల నవ్వసుమతీపతికిఁ బ్రియం [1]బాపాదించి.

299 చ. వినుము నరేంద్ర సైనికులు విక్రమలీల నరాతిసేన సొ
చ్చినఁ బతి గావ కున్న [1]నుపజీవులు మెత్తురె యన్నఁ గాతుఁ గా
కని [2]బహుతూర్యనాదములు నార్పులు[3]నుం జెలఁగంగఁ [4]ద్రోచి య
జ్జనపతి పీఁకమై నడరె సైన్యయుతంబుగ సత్వరంబుగన్.

---

4. వారు — వా.వి.శ.ష ; వారలు — పెక్కు ప్రతులు. 5. సంపాద(కు)నులగున జ్జోదుల — పెక్కు ప్రతులు. 6. యాటోపం బాలోకించి — పెక్కు ప్రతులు ; యాటోపంబు విలోకించి — వా. 7. నుద్దేశించి — పెక్కు ప్రతులు.

297 1. నిమ్మోయి — పెక్కు ప్రతులు; నమ్మోయి — వా. 2. రలమి — పెక్కు ప్రతులు. 3. ననువె — ఊ ; జనుదెయతడు — చ ; జనునె మనకు — ఒ. 4. నపుడు—ఔ.గ.చ. 5. మయిప్పుడౌచిత్య — ఐ.గ.

298 1. బు నాచరించి — వ.

299 1. రిపుసేనలు — అ.ఒ.జ. 2. పటు — ఐ.గ. 3. నింగిజెలంగ — ఆ.ఈ ; జెన్న లరంగ — ఔ.ట. 4. జూచి — అ.

300 క. అంత ధనంజయకిమ్మి
రాంతక[1]ముఖయోధ[2]వరమహాస్త్రప్రకరం
బంతకుకడ కనిచెఁ బరి
క్రాంతం బగుమద్ర[3]నాథు[4]రథికచయంబున్.

301 వ. ఇవ్విధంబున.

302 మ. అరులం గీటడఁగించి పాండుసుతుసైన్యం [1]బుబ్బి పైఁ గ్రమ్మినం
[2]గురుభూనాయకుసేన [3]నొచ్చి కలయం గూలన్ ధరన్ గుంపులై
తిరుగం బాఱఁగఁ జొచ్చె [4]విచ్చె మరలన్ దిగ్భ్రాంతి వాటిల్ల స
త్వరతన్ నల్గడఁ బాఱె నవ్విభుఁడు గర్వం బేది వెల్వెల్లఁగన్.

303 క. మనవారి కపుడు భీష్ము[1]ని
చనుటయుఁ గోదండ[2]గురునిసమయుటయును గ
ర్ణునిపొలియుటయును గ్రొత్తై
మనమున వెనుఁబాటు గదిరె మనుజాధీశా.

304 వ. అప్పు డద్దిక్కుజనంబులు.

305 చ. ధరణికి నింక నాయకుఁడు ధర్మ[1]తనూజుఁడు నేఁ డవశ్యముం
గురుపతి [2]గూలు నెవ్వగలతుం [3]గుదు రయ్యెడు నాంబికేయుఁడు
ద్ధురు లగుపాండునందనుల దుర్దమభంగి యెఱింగి ధర్మత
త్పరులకు గెల్పు [4]బాఁతె హరిభక్తులఁ బొందవె భూరిసంపదల్

---

300 1. వర — ఏ ; సుత — చ. 2. వరులయస్త్ర — వీ.శ.ష. 3. నాథ — కొన్ని ప్రతులు. 4. సైన్యచయం - ఔ.ఖ.ట.

302 1. బుగ్రతంగమ్మినం - ఇ. 2. కురుభూపాలకుసేన నొంచెగల — ఏ.ఙ. 3. నొంచె గలయం - పెక్కుప్రతులు ; నొర్చె గలయం - ల ; జొచ్చె గలయం — క ; 4. బేర్చె మరలెన్ — న ; విచ్చిపరచెన్ — ఘ.ల.

303 1. డునుట — కొన్ని ప్రతులు. 2. గురుడు — కొన్ని ప్రతులు.

305 1. సుతుండగు — వీ.శ.ష.స. 2. గూల్చు — ఏ ; గూల — ద. 3. గొలువనయ్యె, గొలదయ్యె — అనిపాఠములు. 4. భ్రాంతి — ఊ.

306 వ. అని రట్టియెడ నీకొడుకు నిజసారథిం జూచి మనబలం బాహవంబున కోహటించి పాఱెడు నిత్తఱి నేను బరవసంబు సేసినఁగాని నిలువ దవ్విధంబునకు రథం బనువై యుండఁ జేసి చేరఁ దెమ్మనిన వాఁ డట్ల చేయ నతం డేనుంగు డిగ్గి రథంబెక్కి యెక్కుడు[1]మగఁటిమిం బొంగునంగంబులతో సైనికుల కడ్డంబు [2]సని యెలుం గెత్తి.

307 ఉ. ఎక్కడఁ బోవ వచ్చు [1]గిరు లేవియుఁ గాన[2]భూము లైనఁ దో
నెక్కియుఁ జొచ్చియుం బగతు రేద్తెఱఁ గిట్టి చలంబునం దలల్
ద్రొక్కక [3]తక్క రట్లయిన దుర్గతి [4]వాటిలుఁ [5]బోక నిల్చి బే
రుక్కునఁ బోరినన్ సుగతి యొండె[6]ను [7]సంపద యొండెఁ [8]జొప్పడన్.

308 వ. అట్లుం గాక.

309 క. పాండవబల మల్పం బై
యుండం గృష్ణుఁడు ధనంజయుండును [1]దప్పిం
బెండువడఁగఁ గని మనకును
గం డడఁగఁగ నేల గెలుపుగై కొన వచ్చున్.

310 వ. అని పలికి కరతలం [1]బెత్తి నిలు నిలు మనిన నీబలం బతని నగ్గించుచు మరలె నమ్మేటిమగండు ముంగలి యయి నిలిచి పొంగారం గవియు[2]కౌంతేయ సేనాసముద్రంబునకుఁ జెలియలికట్ట [3]యయ్యె నయ్యవసరంబునందు మునుకొని వడిం దఱుము వడముడిం బోదివి మనపదాతిప్రకరంబు దర్పంబున నార్పులు బొబ్బలుం జెలంగ బహువిధాస్త్రశస్త్రంబులు వరగించినం

---

306 1. మదంబునం - అ.ప. 2. జొచ్చి, చని, నిలిచి - అని పాఠములు.

307 1. నిరవేనియు—అ ; నరు లైనను-చ ; గిరు లైనను—ఎ.ఘ.త.ల.వ ; గిరులెక్కియు - ఇ.గ.ట.న. 2. భూములేనిదా — ఒ ; భూములేనిదారె — వీ.ష. 3. బోవర(రె)ట్లయిన — ఏ.ట. 4. వాలను — వ. 5. బోర — కొన్ని ప్రతులు. 6. జయంబున నొండె — వీ.శ.ష.స ; ధరాతల మొండె జేకురున్ — చ. 7. దుర్గతి — వ. 8. చేకురున్ - ఔ.క.ఘ.ల.

309 1. దర్పంబెండు — ల.

310 1. బెత్త—వా ; బెత్తి—పెక్కు ప్రతులు. 2. పాండవ-ట. 3. చందంబుననాగియున్న-

బెరిఁగినమదాతిరేకంబున గదా[4]దండంబు ధరియించి ఘోరాకారుం డగుచుఁ దేరు డిగ్గి పేరడవిఁ [5]గూల్చు పెనుగాలికైవడి నతం డేకవింశతిసహస్రసంఖ్యసుభటుల నేలపాలు సేసె నప్పుడు.

311 క. కరిహయరథబృందం బు
ద్ధురత నడరెఁ బాండున్నపసుతులమూఁకలపై
నరుఁ డబ్బలంబునకు ని
ష్ఠురగాండీవముక్తశరపటుత్వము సూపెన్.

312 క. నకులసహదేవులును సా
త్యకియును రభసమున వాలురమ్ములు నిగుడన్
శకునిపయిఁ [1]గవిసి రతఁడును
బ్రికటస్ఫురణంబునం దిరం బై [2]పోరెన్.

313 చ. సమదగజాధిరూఢుఁ [1]డయి సాల్వుఁడు పాండవసేనఁ జొచ్చి ఘో
టములఁ [2]గలంచుచున్ [3]గజఘటల్ విరియించుచుఁ గాల్బలంబుఁ జి
త్రముగ వధించుచున్ రథకదంబములన్ [4]సమయించుచున్ మహో
గ్రముగఁ జరించువిస్ఫురణఁ [5]గన్గొని కోపసముద్భటాకృతిన్.

—: ధృష్టద్యుమ్నసాత్యకులచేత సాల్వుఁ డేనుంగుతోడఁ జీనుంగై పడుట :—

సం. 9—19—24

314 వ. ధృష్టద్యుమ్నుం డెదుర్కొనిన నతనిఁ ద్రొక్కించువాఁ డై యవ్వీరుండు వారణ[1]పతిఁ గొల్పిన నతండు.

---

యవసరం — చ. 4. దండదారుణఘోరా — అ.జ ; దండధార(ధర)ఘోరా — ఆ.ఐ ; దండాతిఘోరా — ఇ.ఉ.ఎ.ఒ.ఓ.వ ; దండంబు బుచ్చుకొని దండధర ఘోరా — ఔ.ఖ.గ.ట.న. 5. గాల్ప బెనుగాలి గూడిన యగ్నికైవడి — ఖ.

312 1. గురిసిరాతడుప్రక — ఘ.వ. 2. పొలిచెన్ — చ.

313 1. డగు — పెక్కు ప్రతులు. 2. నుగూల్చుచున్ — అ ; నుగీటణంచుచున్ — ప. 3. గరి — క.ఖ.గ.ఘ.చ.ల. 4. విదళించుచున్ — ఒ ; భ్రమయింపు(చు)చున్—వ. 5. గైకొని — ఇ.ఊ.ఎ.వ.

314 1. పతిఁడీకొల్పిన — పీ.శ ష.స ; పతిపురికొల్పిన — ద.ల.

315 మ. పటునారాచ[1]చయంబు కుంభయుగళీ[2]భాగంబునన్ బెట్టు నా
టుటయుం గ్రొవ్వఱి పాఱె నగ్గజము [3]సాటోపంబుగాఁ గ్రమ్మఱిం
చుటకున్ సాల్వుని[4] మెచ్చెఁ గన్గొనుజనస్తోమంబు కోపోద్గమో
ద్భటవేగంబున వచ్చి పట్టె [5]నది యాపాంచాలు తే రుగ్రమై.

316 క. ఆతఁడు గద చేతం గొని
క్షితి [1]గదురుమనముతోడఁ బృథ్వికి దాఁటన్
సూతాశ్వసమేతం[2]బుగ
నా తే రయ్యోనుఁ గెత్తె నాకసమునకున్.

317 ఆ. ఎత్తి త్రిప్పి [1]యాఁడి యిల[2]తోడ వ్రేసి [3]పాం
వములఁ జదుపఁ జూచి దారుణాస్త్ర
తతులు నిగుడఁ బవనతనయశిఖండి [4]సా
త్యకులు సాల్వుఁ దాఁకి రతిరయమున.

318 క. అతఁ డందఱి [1]బాణంబులు
వితథంబులు సేసి యస్త్రవిద్యాపారీ
ణత సూపె నవ్విధం బ
ద్భుత[2]ము [3]నినిచె గగనచరతతులచిత్తములన్.

319 వ. అప్పుడు.

---

315. 1. యుగంబు - కొన్ని ప్రతులు. 2 భా (ఫా) లంబునన్ - కొన్ని ప్రతులు. 3. సాటోపంబు (నం) మై — అని పాఠములు ; నాటోపంబునం — పెక్కు ప్రతులు. 4. నుతిం (చె) చ - క.ఘ.చ. 5. నపుడా పాంచాలు - శ.

316 1. యడరు - ఇ.ఉ.ఎ. 2. బగు — ఈ.వ.శ.

317 1. యాడె — శర ; యూచి — శ. 2. బడ - ఎ. 3. రథ్యముల — ఆ.ఇ.ఈ.ఉ.ఎ.వ.శ. 4. సాత్యకియునపుడు సాల్వుదాకిరథిప - చ.

318 1. వాలమ్ములు - క.ఖ.ఘ.ల. 2. మనిగగనచరులెల్ల బొగడుచునుండన్ — పి.శ.ష ; ఘంగం జెనిచెను సురతతుల చిత్తములన్ - ప. 3. జెనిచె — అ.ఘ.వ.

320 తే. అజ్జపాటించి మదివెఱ యుజ్జగించి
రయము మె[1]ఱయ నప్పాంచాలరాజ సుతుఁడు
[2]గదిసి యెగసి కుంభస్థలి [3]గదఁ బగుల్పఁ
గొండ గూలి న [4]ట్లక్కరి గూలె నధిప.

321 క. ఆలోచనన శినివరుఁడు వి
శా[1]లాస్త్రప్రదరని[2]హతి సాల్వునిశిర మా
[3]ఖీలముగఁ ద్రుంప నాతఁడు
గూలిన మనమూఁక విచ్చెఁ గురువంశనిధీ.

322 ఉ. [1]వాలి యెలుంగు సూపి కృతవర్ముఁడు సైన్యము నిల్వరించి యు
న్మీలితవిక్రముం డగుడు [2]మేమెయి నాతనిఁ దాఁకె నస్త్రవి
[3]ద్యాలసితుండు సాత్యకి యుదగ్రత [4]వారలు [5]పోర వారిదో
[6]ర్లీలలు సూచి [7]రోటువడి రెండు[8]బలంబుల యోధవీరులున్.

323 వ ఇట్లు పెనంగు చుండి.

324 క. కృతవర్మ నొంచె నెనిమిది
శితశరముల శినివరుండు శినివరుచాపం
బతఁడు దునిమె బలువిలుగొని
యతనిహయంబులను నూతు నాతఁడు [1]గూల్చెన్.

---

320 1. మెఱయంగ పాంచాల – శ.ష. 2. కదియనేసికుంభ – అ; కదిసి యలిగికుంభ – ఊ.క; కదిసి యక్కరి కుంభంబు గదు బగుల్ప – ఘ. 3. గదనుగుప్ప – ఖ. 4. గతిగరి గూలె – పీ.శ.ష: యట్టుల గూలె గజము – ఏ; యటుకరిగూలెనధిప – ఖ.

321 1. లాస్త్రప్రకరనిహతి – ఊ; లాస్త్రప్రతతినిట్లుసాల్వు – ఐ.గ. 2. నవతి – ఇ.ఉ.ఎ. 3. ఖీలతదుర్గింపగ నాతడు–పీ.స; ఖీలత్రుంచిన నాతడు–శ; ఖీలగతిద్రుంపనాతడు – ఎ.ఒ.ల.

322 1. వారి – కొన్ని ప్రతులు; వారి యెలుంగు నెత్తికృత – త. 2. వేడిమినాతడు–ఘ. 3. ద్యారసికుండు – ఘ. 4. నట్టులవారు బోరు – ఏ; మార్కొని పోరెవారి–శ; మీరగ బోర–ఖ. 5. నట్లుపోరుదో–అ; వారిదైన (దు) దో–ఇ ఉ; వీరువారునే–త. 6. పానుట – ఘ. 7. పొల్పరిరి – పీ.శ.ష. 8 దెఱంగుల – ఒ పీ.శ.ష.

324 1. ద్రుంచెన్, నొంచెన్ – అని పాఠములు.

325 మ. విరథుం డై యభిరామశూలమున నవ్వీరుండు శైనేయు [1]పై
చె రయం బార నతండు భల్లమునఁ ద్రుంచెం బెక్కు[2]తుండంబు లై
తొరుఁగం జూచి విషాది యై [3]నిజరథస్థుం జేసి తద్బాణగో
[4]చరతాదుర్దశ [5]కావృథోద్యముఁ గృపాచార్యుండు దప్పించినన్.

326 క. మన[1]సేన [2]విఱిగె [3]నృప నీ
తనయుం [4]డొక్కరుఁడు [5]నత్యుదగ్రతఁ గుంతీ
తనయుల నద్దెసఁ గల యో
ధనికాయముఁ బొదివె బాణధారలఁ [6]బెలుచన్.

327 మ. పతి యిమ్మై సముదీర్ణవిక్రమకళాపారీణుఁ డై విద్విష
చ్చతురంగంబులయందు నొక్కటియు [1]విస్ఫారోల్లసన్మార్గణా
హతికిం దప్పక యుండునట్లుగ సమగ్రైశ్వర్య[2]సంపాదకో
ద్ధతబాహావిభవంబు సూపె సురబృందస్తోత్ర[3]పాత్రోద్ధతిన్.

328 వ. అప్పుడు రెండు[1]విల్ల నతనిపాటిమేటి[2]మగలు లేరనుబుద్ధి నాకుం బొడమెఁ బదంపడి పాండవులును జేయఁగల[3]వారలును నవ్వీరుం బొదివిన నతం[4]డందఱ కన్ని రూపులై ధర్మసుతుని [5]శతశరంబు[6]లను భీమసేను దెబ్బది

---

325 1. నొంచె – ఎ. 2. ఖండంబులై – వ. 3. నను – ఎ. 4. చర సందర్శనావు తోద్యము – చ. 5. నావృతోద్యము – కొన్ని ప్రతులు; నావృతోద్యము – ఊ; రౌద్రితోద్యము – ఉ.ఐ; నావధోద్యము – శ.

326 1. మొనలు – ఆ. 2. విఱిగినను – చ; విఱిసిచన – ఖ. 3. చెదఱుటఁగని యప్పుడు రాజ రాజు కడువడి గుంతీ – ఈ.ఎ. 4. డొక్కడును నత్యుదగ్రత గుంతీ – అ.ఏ. 5. నత్యుగ్రతగుంతీ – పెక్కు ప్రతులు; దగ్రతరముగ గుంతీ – వా.వీ.శ.ష. 6. చేతన్ – ల. కొన్ని ప్రతులు.

327 1. విస్తారో – న. 2. సంపాదనో, సంపాదితో, సంపాతనో – అని పాఠములు. 3. పాత్రస్థితిన్ – పెక్కుప్రతులు; పాత్రింబుగన్ – వీ.శ.ష.

328 1. దిక్కులనితని – ఐ గ. 2. విలుకాడు లేడని నాకు దోచెనంత – వీ.శ.ష.స; మగం డెక్కడ లేడని కొనియాడిరి నాకుం జూడనట్ల యుండె నంతం దొడరి – ఫ. 3. వీరులును నయ్యనఘుం బొదిలిన – వీ శ.ష; వారును – పెక్కు ప్రతులు. 4. ఢందఱకన్ని రూపులై – పెక్కు ప్రతులలో లేదు; ఁడుధర్మ– పెక్కు ప్రతులు. 5. శరశతంబునను–అ.ఏ; శితశరత్రయంబులను – ఔ. శరత్రయంబునను – ట. 6. లనొంచి భీమ – ఒ.ఖ.ఘ.

[7]సాయకంబులను సహదేవుని [8]నైదింటను నకుల నఱువదినాల్గింటను ధృష్ట
ద్యుమ్నుని సప్త[9]మార్గణంబులను ద్రౌపదేయుల [10]నైదైదుతూపులను
[11]సాత్యకి మూఁడుకాండంబుల నొప్పించి సహదేవుధనువు దునిమిన
[12]నక్కుమారుండు వేఱొక్క[13]విలు గొని చలంబున నక్కురు[14]విభుం
గదిసినఁ దక్కటిరథికులుం గూడికొని యొక్కొక్కరుండు పెక్కమ్ములు
పైఁగురియఁ [15]గేలి[15]చందంబున వాని నన్నింటి వారించుచుఁ దత్తనువుల
శోణితంబు పూరించుచు నాజెట్టిజోదు బెట్టిదుం డై పెనంగ మన [17]యోధు
లుం [18]బురికొని యద్దొరల మార్కొనిరి [19]మనసైన్యంబు దైన్యంబు విడిచి
మరలి వారిబలంబులఁ దలపడియె నట్టియెడ.

329 క. భీముఁడు గురు[1]తనయుఁడు ను
ద్దామభుజా[2]వీర్యశౌర్య[3]ధైర్యములు జన
స్తోమము లగ్గింపఁగ సం
గ్రామ మొనర్చిరి నితాంతగాఢ[4]స్ఫూర్తిన్.

330 చ. పరుషపరాక్రమస్ఫురణఁ బాండవముఖ్యుని వాజులం జతు
[1]ష్కరహతిఁ గూల్చె సౌబలుఁడు సత్వరుఁడై సహదేవుఁ డమ్మహీ
శ్వరుఁ దనతేరిమీఁద నిడి సంగర[2]మధ్యము వాపె నాతఁ డొం
డరదము మీఁదికిం జని రయంబున [3]నయ్యరిఁ దాఁకె నుద్ధతిన్.

331 క. శరములఁ [1]బొదివిన నాతఁడు
దిర మై [2]యేయంగ [3]రణము దివిజగరుడఖే

---

7. మార్గణంబులను – అ.ఆ.ఊ.ఎ ; మూఁడు మార్గణంబులను – పెక్కు ప్రతులు. 8 నేడింటను – ఐ.ఔ.గ.ట ; నైదు శరంబులను – శ. 9. సాయకంబులను – పెక్కు ప్రతులు. 10. బంచ బాణంబులను – పెక్కు ప్రతులు; బంచవింశతి బాణంబులను – ఊ. 11. సాత్యకిని – పెక్కు ప్రతులు. 12. నమ్మాద్రి కడపటి పట్టి – అ.ఏ. 13. ధనువుగొని – అ.క.ఘ జ ; చాపంబుగొని – పెక్కు ప్రతులు. 14. పుంగవుం – ఒ. 15. కేళీగతివాని – ఎ; 16. గతి వాని – ఇ ఉ. 17. యోధవరులు, యోధవీరులు – అని పాఠములు. 18. గూడుకొని – ఏ. 19. మన – పెక్కుప్రతులలో లేదు.

329 1. సుతుడును – ఏ. 2. శౌర్యవీర్య – అ.ఏ.వ ; గర్వశౌర్య – ఘ. 3. దర్ప – ఐ.క.గ.ఘ.చ. 4. స్ఫురణన్ – ఔ.ట.

330 1. శ్కరముల – ఘ.ల.శ.ష. 2. భూమికిబాప – అ.చ. 3. నాతనిదాకియుద్ధతిన్ – ఖ.

331 1. బొలిచిన – ల ; బొదలిన – ఔ. 2. యరయంగగరము – త. 3. నతడు – ఈ;

చరసిద్ధప్రకరాద్భుత
[4]కరపరికారమున నొప్పెఁ గౌరవ[5]నాథా.

332 సీ. శకుని[1]నందనుఁడును నకులుండు నొండొరు
లకుఁ జండబాహుబలంబు సూపి
రతులశౌర్యమున సాత్యకికృతవర్ములు
పోరిరి విలుద్రుంచి కౌరవేంద్రుఁ
జేసె ధృష్టద్యుమ్ను నేచి యొండొకవిఁట
నతని నాతఁడు నొంప నక్క[2]జంపుఁ
గయ్య మయ్యిరువుర కయ్యె ద్రౌపదిపుత్రు
లేవురు [3]పతిఁ గిట్టి యింద్రియములు

తే. జాలికునిఁ జిక్కువఱచిన[4]పగిది [5]దలరఁ
జేయ నతఁ డీడఁబోవక సాయకములు
పెక్కు రయమున నిగిడించి యక్కుమార
వితతిఁ[6]గలఁపఁ దత్సంగర మతిశయిల్లె.

333 వ. మఱియు ననేకు లనేకులం [1]బొదివి పోరాడ నంతకంతకుఁ బేర్చినయగ్గలిక మొగ్గరంబులు రెండునుం గలయం బెరసినం [2]బేర్చిన పెంధూళి భానుబింబంబు గప్పె నప్పుడు [3]దొరుఁగు[4]నరతురంగమాతంగరుధి[5]రధారల నడంగిన నధికం బై నసంగరంబునకుం గడంగిన కౌంతేయుల యురవడికి నోహటించి మన [6]మోహరంబు [7]దొరలు మరలిన మరల నీక [8]నీకొడుకు పురికొలుపుకొని తఱిమినం గనలి ధర్మసుతుండు.

---

[illegible]రము — చ. 4. కరపరికరములను నొప్పె — ఐ.గ ; కరములను నొప్పెజాల — గ.
5. ముఖ్యా — ఈ.త.

332 1. సుతుండును — ఈ.త. 2. జముగ — ఈ.ప త. 3. గృపు — పెక్కుప్రతులు.
4. ఛంగి — వ.శ.ష. 5. దలర, దరల, గనర, దలక, దలప — అని పాఠములు.
6. నలప — ల.వ. పెక్కుప్రతులు.

333 1. దొడరి — పెక్కు ప్రతులు. 2. బర్విన — పెక్కు ప్రతులు. 3. దొరగు — కొన్ని ప్రతులు. 4. కరినరతురంగరుధిర — వ.పి.శ.ష. 5. రంబులనడగిన — అ.ప ; రథారాపాతంబుల నద్ధూళియణంగిన — చ. 6. మొనలు — ఓ. 7. దెరలినమరలనీక — పెక్కుప్రతులు. 8. తనయుడు — పెక్కు ప్రతులు.

334 తే. మూఁడు [1]నారాచములఁ గృపు వాఁడి చెఱచి
[2]వాలి కృతవర్మహాయముల నాలుగింటఁ
గూల్పఁ దనతేరిపై నిడి గురుసుతుండు
దొలఁగఁ [3]గొంపోయె నవ్విరథుని నృపాల.

335 చ. కురుపతి చూచి చిత్తమునఁ గోపము [1]పెంపెసలార నేడునా
యరదము లాతనిం బొదువునట్లు[2]గఁ బంచిన నొక్క పెట్ట బం
ధురతర [3]వారివాహములు తోయజబాంధవుఁ గప్పు[4]చాడ్పు దోఁ
ప రయముమైఁ గడంగి [5]యవి పైకొని యవ్విభుతోఁ బెనంగఁగన్.

336 క. కనుఁగొని శిఖండిముఖయో
ధనికాయం బడరి యారథప్రకరంబుల్
సునిశిత[1]శరప్రకరములఁ
దునుమాడెఁ రౌద్రరసము [2]దొలుకాడంగన్.

337 వ. ఆ సమయంబున [1]మనదెస నుల్కాపాతశర్కరావర్షాదు లగు[2]నుత్పాతంబులు గలిగె వానికి శంకింపక శకుని గడంగి యోధవరులతో మీరు కోల్తల సేయుం డేను [3]బెడముట్టునఁ దాఁకి ధర్మనందనాదులను సమయించెద నంచు సముద్ధతిం [4]గదిసె నప్పుడు [5]మద్రేశబలపురస్సరం బైన యమ్మోహారంబు రభసంబునం దఱిమి పాండవ[6]సేనాసంరంభంబున కోర్వక తిరిగిన

---

334 1. నారసముల — పెక్కు ప్రతులు. 2. పోలగృత — ఒ. 3. గొనిపోయె — పెక్కు ప్రతులు.

335 1. సొంపెసలార — పెక్కుప్రతులు. 2. గలంచిన — ఆ. 3. వారిదౌఘములు — ఐ.గ ; వారిదంబులును — ఖ. 4. లీల — పీ.శ.ష ; నట్లు — ఊ. 5. యనిబై — వ.శ ; యటబై — త ; యును — చ.

336 1. తీవ్రశరంబులదును — ఊ ; శరజాలంబుల — అ.ఏ.ఘ ; శరనికరములన్ — వ. 2. దొలు — పెక్కు ప్రతులు ; దొల — వా ; దొలుకొత్తంగన్ — జ.

337 1. నీసేనదెస — పెక్కుప్రతులు. 2. దుర్నిమిత్తంబులు గలిగిన — ఊ. 3. వెడ— స. పెక్కుప్రతులు ; వెనుకముట్టున, వెనుకదిక్కున, వెంటనంట, వెంటనంటి — అని పాఠములు. 4. జనియె — పెక్కు ప్రతులు. 5. మద్రేశ్వర, మద్రదేశ — అని పాఠములు. 6. సేనచెలంగిన తత్సంరంభంబునకు సహింపక మనసేన తెఱలిననా

నాసుబలసూనుండు ప్రబలతురంగ[7]దశసహస్రంబులతో వేగంబు మెఱయ వైరి[8]సేనవెనుకఁ గిట్టి యేను గలుగ మీకు భయం బేల యని యక్కౌరవ సైనికులం బేరుకొని యదల్చి [9]యార్చిన నాకౌంతేయవాహిని కలంగినఁ గని ధర్మనందనుండు సహదేవు నాలోకించి

-: శకుని సహదేవు లాశ్వికసహాయులై ఘోరంబుగాఁ బోరుట :-

సం. 9—21—32

338 ఆ. వేగ [1]తాఁకు మైదువేలగుఱ్ఱంబులు
ద్రౌపదీతనూజతతియు నీవు
శకుని [2]నను డ నతఁడు సంరంభజృంభియై
యట్ల [3]చేయ ఘోరమయ్యెఁ బోరు.

339 వ. [1]అట్టియెడ.

340 సీ. [1]లీలఁ గట్టియ[2]తోడఁ గూలంగ [3]వైచియు
డొంకెన[4]పోటులఁ [5]బొంక మడఁచి
పడఁ[6]ద్రోచియును వాలఁ [7]గడికండములుగ వ్రే
సియుఁ గఠారంబులఁ [8]జీరి చెఱచి
గీటడంగించియుఁ గిట్టి యొండొరుఁ బట్టి
కొని [9]మల్లుచందంబు ననికిఁ జొచ్చి
నేలకు [10]వంచియుఁ గేలిమై [11]గళముపై
నెక్కియుఁ బెక్కండ్రు రొక్క మొగిన

---

సుబలసూనుండ ప్రబలతురంగ — వీ.శ.ష. 7. శత — ఐ.గ. 8. సేనబెదర — క.ఖ; సేనచెదర — ఒ. 9. యార్చిపేర్చినన్ — పెక్కు ప్రతులు.

338 1. దాఁకుఁడైదు — ష. 2. నణపననుడు — అ.ఐ. 3. పాయు — వ.

339 1. అట్టియెడ — వీ.శ.ష. ప్రతులలో లేదు.

340 1. లీలమైగట్టిలగూలంగ — క; లీలగద్దియతోడ — వ. 2. తోన — కొన్ని ప్రతులు. 3. నేయుచు — గ. 4 వ్రేటుల — ఏ; పోట్లను — కొన్ని ప్రతులు; యలుగుల — త. 5. బింక — ఊ.క. 6. వైచి — కొన్ని ప్రతులు; ద్రాచివాలున — కొన్ని ప్రతులు. 7. గడికం (ఖం) డలుగను — ఏ.వీ.శ.ష.స; గడిఖండములు — కొన్ని ప్రతులు. 8. జీరిపొడిచి, జేరిచెరివి, చెరివి చెరివి, జెఱచిచెఱచి, జీరివిఱిచి — అని పాఠములు. 9. జెట్లయందంబున — అ; మల్లుతనమ్మున — శ. 10, దెచ్చియు, జొచ్చియు, వైచియు, వచ్చియు — అని పాఠములు. 11. దళముపై, రథముపై, హరులపై, తలలపై,

ఆ. [12]యెక్కుటయు [13]సహించి యుక్కునఁ బెనఁగియు
నులుక వివిధగతుల [14]నుబ్బి చెలఁగి
బొమ్మలాడినట్లు [15]పోరి యారావుతు
లధిప నెరయ మెఱసి రందు నిందు.

341 వ. మఱియు ననేకప్రకారంబుల ఖండనంబు[1] సేసిరి పదంపడి యమ్మాద్రీకుమారుని [2]వీరోద్రేకంబునకు నోహటించి గాంధారీసోదరుం డారువేల[3]తురంగంబులతోడం [4]దిరిగె నతండును ద్రిసహస్రహయశేషసేనా[5]సమేతుం డై యన్నకడ కరిగె నాసౌబలుండును[6] జుట్టి వచ్చి ధృష్టద్యుమ్నుని[7] మొనపైఁ బడిన నతండు [8]సైన్యసముద్దండసంరంభం బెసంగ విక్రమాటోపంబు సూపిన యపుడు పంచసహస్ర[9]త్రిశతహయంబులు వడిన రౌద్రంబు రూపు దాల్చిన ట్లాయుధఖండనాస్థిభంజన[10]శబ్దశ్రవణంబునను రక్త[11]మాంసమేదోస్థిమస్తిష్క[12]మజ్జాసమ్మేళనదారుణరణతలదర్శనంబునను దదీయ[13]విస్రగంధాఘ్రాణంబునను యోధులు [14]పీతచేతస్కులై రి తెగినతల యొకచేతను నెత్తుట జొత్తిల్లినకరవాలం బొకకరంబునను బట్టుకొని [15]యట్టలాడినట్లు పెనంగి యాశకుని హతా[16]వశిష్టంబు లైన సప్తశతాశ్వంబులతోడఁ దొలంగి యచ్చటి జనంబులతోఁ గురుపతి యెచ్చట నున్నవాఁ డనిన[17] [18]వార లతని కిట్లనిరి.

---

నుస్థితి పై — అని పాఠములు. 12. యెక్కసను — అ.ప ; నెక్కుటయు — వీ.శ.ష. 13. సహింపక — త. 14. నుబ్బుచెలఁచి — ఖ. 15. బొలిచియు — అ ; బొలిచియారావుత్తు — ప ; బొలియునారావుతు — స.

341 1. బొనర్చిరి — జె.న. 2. సంగరంబున — క. 3. గుఱ్ఱంబులతోడ — కొన్ని ప్రతులు. 4. దిరిగిపోయె సహదేవుండు మూడువేల హయంబులతో నన్న — ప. 5. సమన్వితుండై — ఎ ; సమన్వితంబుగా — ఘ.చ. 6. పోయిపోయి పోకతిరిగి యడ్డంబు చుట్టివచ్చి — అ.ప. 7. సేవపై — ద. 8. సముద్దండసైన్య పెక్కు ప్రతులు ; సైన్య — వా. 9. త్రిశతహయంబులు వడిన — పెక్కు ప్రతులలో లేదు. 10. శబ్దంబునను రక్తమాంస — ఆ. 11. మాంసమస్తిష్క — అ. 12. మజ్జనమేళన — పెక్కుప్రతులు. 13. మిశ్రగంధా — కొన్ని ప్రతులు. 14. పీత చేతనులైరి — కొన్ని ప్రతులు ; విచేష్టితులైరి — ట.త ; నిశ్చేష్టితులైరి — ఇ ; నిశ్చేష్టితతనులైరి — న. 15. యేటులాడినట్లు — న. 16. వశేషంబైన—ఐ.గ.క. 17. యడిగినవార — అ.ల. 18. వారలిట్లనిరి — వా ; వార లతనికిట్లనిరి — పెక్కు ప్రతులు.

342 ఉ. అల్లదె కంటె పూర్ణశశియట్లు కడుం జెలు[1]వొందెఁ జూడఁ బే
రెల్లి రథప్రతాన [2]మదె యేపున సంగరకేళిఁ జాల శో
భిల్లెడు నయ్యెడన్ [3]రిపువిభీషణవిక్రమణప్రకార[4]గా
ఢోల్ల[5]సనుండు భూపతి మహోన్నతి [6]నొప్పెడుఁ బొమ్ము చెచ్చెరన్.

343 వ. అనిన విని తల యెత్తి చూచి తత్ప్రదేశంబున కరిగి యద్ధరణీశుం గని యతని కిట్లనియె.

344 క. పొలియించితి [1]నే గుఱ్ఱం
బులఁ దేరుల కుఱికి యింక భూరిరయమునన్
బొలియింప వలయుఁ బ్రాణం
బులు డాఁచిన వశమె పాండుపుత్రుల గెలువన్.

345 వ. రథంబులు గజంబులు దెగినం గాని కాలుబలంబుల సమయించుట పని గాదనిన నమ్మాటకు సైనికులు సంతసం బంది [1]బరవసంబు సేయ నమ్మహీనాయకుండు సముత్సాహదోహలి యై తఱిమిన మనమూఁకలు కడంక యెలర్ప దర్పస్ఫురితంబు లగుచు నురవణించినం [2]గని గాండీవి గోవిందున కిట్లనియె.

346 క. మొనసి చనుదెంచు[1]దుర్యో
ధనసేనాసముదయంబుఁ దఱియ [2]నురవడిం
జననిమ్ము మనరథము నా
సునిశితబాణముల సమయఁ జూచెద [3]దీనిన్.

---

342 1. వంది — ఖ; వందె — ఉ.ఘ. 2. మొనరించుచు — ఖ; మది — ఈ.ప.ఐ. 3. విపుల — ఊ.ఐ.గ. 4. కోపోల్లస — ఊ. 5. సమందు భూమిపతి యొప్పెడు జేరగ బొమ్ము - ఇ; సనంబు — ఐ.గ. 6. జూపెడు — చ.

344 1. నే దురంగంబుల - పెక్కు ప్రతులు.

345 1. బవరంబు — ఊ. 2. గనుంగొని — వ.

346 1. దుర్యోధను — పెక్కు ప్రతులు. 2. నురువడిం — పెక్కు ప్రతులు. 3. వీనిన్, **వానిన్ — అని పాఠములు;** పేర్మిన్ — క.

-: దుర్యోధను మౌర్ఖ్యం బుద్దేశించి కృష్ణార్జునులు సంభాషించుట :-

సం. 9-23-18

347 వ. అనుచు [1]నమ్మెన యాలోకించి నిరూపించి.

348 క. [1]పెనఁకువ [2]యెడఁ త్రెవ్వక పదు
నెనిమిదిదివసములు [3]సెల్లె [4]నేఁ బెనఁగంగా
[5]వనధిం బోలెడుకురుబల
మనఘా కనుఁ[6]గొనఁగ [7]గోష్పదాకృతి యయ్యెన్.

349 ఆ. దైవ [1]మిట్లు గల చునే [2]వీరి మదిమది
నుండిఘోరమైన యుద్ధమునకుఁ
[3]దొడఁగ వలయు[4]నట్టి[5]తొడరువు కావించి
కొనిరి చీకురాజుకొడుకు లేచి

350 చ. అమరనదీ[1]సుతుండు [2]వడినప్పుడు వీరలబుద్ధి సంధికా
ర్యమునకుఁ [3]జొచ్చు నింక నన యాత్మఁ దలంచితి నమ్మహాత్ముఁడు
న్సముచిత[4]వాక్యవృత్తిఁ [5]గురునాయకుఁ [6]దేర్పఁగఁ [7]జూచెఁ [8]జిత్తదో
[9]షమహిమ నద్దురాత్ముఁడు [10]ప్రశాంతత నొందఁడ యెన్ని భంగులన్.

---

347 1. మనమొన — పెక్కు ప్రతులు.

348 1. పెను — పెక్కు ప్రతులు. 2. పెడితప్పక — ల ; యెడతప్పక - కొన్ని ప్రతులు; యెడతేర్పక — ఇ.ఒ. 3. చనియె — వ. కొన్ని ప్రతులు. 4. నేపెసగంగా — ఒ.జ.ట ; నేర్పెసగంగా — చ. 5. వననిధి — కొన్ని ప్రతులు. 6. గొనుము — కొన్ని ప్రతులు. 7. శోషితాకృతి - ఉ.వ.స.

349 1. మిటుదలంచునే, మిట్లుదలచునే — అని పాఠములు. 2. వీరు — ఈ.ఎ.ఔ.ఖ. 3. దొడరవలయు - కొన్ని ప్రతులు. 4. నిట్లు - క. 5. దొసగులు — ఖ.

350 1. తనూజుడువడు - ఓ. 2. వడునప్పుడు - ఔ.న ; డెగినప్పుడ - త. 3. నింక జొచ్చునని — ఇ.ఈ.ఉ.ఎ.వ ; జొత్తురింకయని — ఖ. 4. శౌర్య — అ ; కార్య — క.చ.న.బ ; వృత్తితోడగురు - ఊ. 5. నృపసత్తముదేర్పడజొచ్చె — త.వ ; గురు సత్తము — ద. 6. దీర్పగ — ఓ ; చెప్పగ — ఖ ; దెల్పగ — వ ; డేర్పడ — ల. 7. వింటిజింతదో — చ. 8. చిత్తరో — ఏ.క.ఖ. 9. మదర — ఐ.గ. 10. ప్రశాంతి వహించడెయెన్ని — త.

351 క. గంగా[1]తనయుఁడు దెగినను
సంగరమున కుత్సహింపఁ జనునే తమకున్
వెంగలు లని యప్పుడు దెలి
యంగా నెఱిఁగితి సుయోధనాదులఁ గృష్ణా.

352 ఉ. దంతియుఁ దాను [1]నాజి భగదత్తుఁడు [2]గూలఁగఁ జూచి సింధుభూ
కాంతునిచావు [3]దెల్లముగఁ గన్గొని యాతనిఁ గావఁ [4]బూని య
ట్లింతలు రాజు లెల్ల సమయం గని ద్రోణునిపాటు [5]గాంచి యా
వంతయు [6]నాత్మలోనఁ దెలియండు సుయోధనుఁ [7]డెంతమూర్ఖుఁడో.

353 క. తనయనుజు లకట దుశ్శా
సనుఁ[1]డును లోనైనవారు సమసినచందం
[2]బును బంధుసహితముగఁ గ
ర్ణుని గీటడఁచినవిధంబునుం జూడఁ డొకో.

354 క. అది యెల్ల నేల చెప్పఁగఁ
దుది శల్యుని[1]పాటు గనియుఁ దోఁప డితఁడు బ
ల్లిదుఁ డని ధర్మజుదెసఁ దలఁ
పిది కురుపతి బుద్ధికొలఁది యేటికి వగవన్.

---

351 1. నందను దెగి - ఉ.త ; సుతుడును దెగి - త.

352 1. గూడ — త. 2. గూలిన — వ. 3. దెల్లమిగ - ఊ ; దల్లడముగాగను — శ. 4. జూచి — ఈ.ఉ.త. 5. జూచి — అ.ఊ.ఏ.ఘ. 6. నాత్మలో దెలియడయ్యె - అ.ఊ ; నాత్మలో దెలియకుండె — ఇ.ఉ ; నాత్మలో నెఱుగడట్టి — ఖ ; నాత్మలో దెలియ డట్టి — చ. 7. డెంతమూఢుడో — పెక్కుప్రతులు ; డెట్టి మూఢుడో — చ.

353 1. డాదిగనెల్ల - అ ; లాదిగనెల్ల — ఏ ; దు వోయినవారు — త. 2. బునుజూచుచు గర్ణుండని చనుటయు దా జూచె బంధు సహితముగ దగన్ — వ.

354 1. చావు - ఐ.గ.

355 క. [1]క్షోణీరాజ్యార్థము దనఁ
ప్రాణము గలుగంగ నీఁడు రారాజు జగ
త్త్రాణపరాయణ[2]కరణధు
రీణుం డగు[3]పాండుసుత[4]గరిష్ఠున కెట్లున్.

356 వ. [1]కావునఁ గొంతయును దీర్పవలసియున్న దనిన విష్ణుండు జిష్ణున కి
ట్లనియె.

357 ఉ. [1]అక్కడ సంధి[2]కిం జనిన[3]యప్పుడు [4]నవ్విదురుండు కృష్ణ నీ
విక్కడ కేల వచ్చి[5]తి విహీనవివేకుఁడు [6]దుర్మదాంధ్యముం
[7]దక్కఁనె సంగరంబ యుచితం బగుకృత్యముగాక యిమ్మెయి
న్మక్కున నూర్పుగల్గఁ [8]గుజనుండు సుయోధనుఁ డుర్వి యిచ్చునే.

358 వ. అని బోధించె నదియునుంగాక దుర్యోధనుండు జనియించినప్పుడు మును
లిప్పాపాత్ముండు నిఖిలక్షత్త్రియక్షయహేతు వగు నని యాదేశించిరి గాదే
యనిన నర్జునుం డతని కిట్లనియె.

359 తే. అమ్మహాత్ములు సెప్పిన[1]యట్ల యయ్యె
నున్న [2]వారలఁ బొలియించి తన్ను విడిచి
కాని విడువండు ధృతరాష్ట్రసూనుఁ డుర్వి
ధర్మసూనున [3]కిది నిశ్చితంబు కృష్ణ.

---

355 1. క్షోణీరాజ్యపదము దన - శ. 2. శౌర్య — వ ; కరుణ — కొన్ని ప్రతులు. 3. ధర్మ సుతు — అ ఏ. 4. గరిష్ఠుండెందున్ — క ; గరిష్ఠిన కెందున్ — ఎ ; గరిష్ఠున కెపుడున్ - ఐ.గ.

356 1. కావున నీ కొంతయు - వీ.శ.ష.

357 1. అక్కట — ఇ.ఐ.ఒ.గ. 2. కేజనిన — ఉ.ఓ.గ. 3. యప్పుడనెన్ — ద. 4. నవ్విదురుండు — కొన్ని ప్రతులు. 5. తవివేకుడు మూర్ఖుడు దుర్మదాంధతం — చ. 6. దుర్మదాంధతన్ -వీ.శ.ష.స ; దుర్మదాంధుడున్-ఖ.ద. 7. దక్కుడు—ద. 8. నధముండు—త.

358 1. డచ్యుతున — అ.ఊ.

359 1. నయట్టులయ్యె - ఆ.ఇ.వ ; నట్లయ్యె నింక — ఈ. 2. వారిని — పెక్కుప్రతులు. 3. కిదియనాతలపు - ఆ.ఓ.ప.

360 క. [1]దుర్బల మగు నమ్మూఁకను
దోర్బల మెసఁగంగ నిపుడ త్రుంచెద [2]నాదు
[3]ర్నిర్బంధపరుఁడు దనదగు
దౌర్బల్యము [4]గనుచు మదము దక్కఁ కనుఁగొనన్.

361 వ. రయంబున రథంబు [1]గడపు మనుఁడు నుత్తుంగ మాతంగ మహీరుహశోభితంబును సాంద్రస్యందన[2]గుల్మగహనంబును బహుళహయక[3]ఘాకీర్ణంబును సముద్భటసుభటలతా[4]లసితంబును నైన సుయోధను సేనాకాననంబునందు మాధవమహా[5]వాయువు ధనంజయ[5]దారుణానలంబు దరికొల్పిన.

362 క. ఆకృష్ణ[1]వర్త్మఁ డుజ్జ్వల
భీకరశరజిహ్వ లడరఁ బేర్చిన నధిక
వ్యాకులత [2]నొందె రోదసి
[3]నాకౌకస్సమితి మెచ్చు[4]నం బొదలంగన్.

363 వ. ఇట్లు [1]దారుణరణవిహరణంబు సలిపి సవ్యసాచి యాసైన్యంబు[2]నిపతితవిఘటితభ్రాంతపలాయితంబు సేసినఁ దెరలక నిలిచి కురుపతి కరతలం బెత్తి నిలు నిలు మని యెలుంగు సూపిన నది మగుడఁ బురికొని [3]నిగిడి నేమినినద ఘంటాక్వణనకింకిణీ[4]నిక్వాణంబులు సెలంగఁ బాండవబలంబుఁ దాఁకిన ధృష్ట

---

360 1. దుర్బలులగు నిమ్మూకల — ఊ.ఘ ; దుర్బలమగు నీమూకను — కొన్ని ప్రతులు. 2. నేనా, నన్నా - అని పాఠములు. 3. దుర్బుద్ధి - కొన్ని ప్రతులు ; దుర్బుద్ధియుతుడు — ఒ.జ. 4. దక్కి స్రుక్కి దాగనుగొనగన్ - ఇ.ఉ.ల.

361 1. న (డ) డు పు — కొన్ని ప్రతులు. 2. గుల్మలతాగహనం — కొన్ని ప్రతులు. 3. పర్ణాకీర్ణంబును, కఘ్యాకీర్ణంబును, కఘావికీర్ణంబును — అని పాఠములు. 4. లలితంబును - ఇ.ఈ. 5. మహా - ఈ.

362 1. వర్ణుడు - గ ; ధన్వుడు - శ ; వర్తుడు — ఘ జ ; పార్థులు - శౌ.క ఖ. 2. బొందె, బొంది, బొంద, మొంద — అని పాఠములు. 3. నాకౌకససమితి — ఇ.ఉ.ప ; నాకౌరవసమితి — ఊ.వ ; నాకౌ(క)ఘపతతి — క.ఖ.జ.ల; నాకౌకఃపతతి — ఘ ; నాకౌతుకసమితి — వ. 4. నంబుదులనంగన్ - ఊ.

363 1. దారుణ విహారంబు — పెక్కు ప్రతులు. 2. నిపతితవిహతవిఘ — పెక్కు ప్రతులు. 3. నిగిడిరథనేమి — కొన్ని ప్రతులు ; పొదివిరథనేమి — కొన్ని ప్రతులు. 4. రణనంబులు — ఆ.ఇ.ఈ ఉ ప ; రవంబులు — కొన్ని ప్రతులు ; క్వణనంబులు — అ.త ;

ద్యుమ్న శిఖండి[5]శతానీకు [6]లయ్యానీకంబు ననేకవిధసాయకనికాయంబులం
గప్పి రప్పుడు ధృష్టద్యుమ్ను నరదంబుచక్కటికి సంరంభంబున.

364 ఉ. భూపతి [1]మించి యాద్రుపదభూపతనూజునురంబు నిర్భరా
టోపత యుల్లసిల్లఁగఁ బటుప్రదరంబుల [2]నొంప నాతఁ డు
ద్దీపితకోపుఁ డై [3]హరులు ద్రెళ్లఁగ సారథి డొల్ల [4]నేయఁగా
నే పఱి తేరు డిగ్గి యతఁ డెక్కె [5]హయోత్తముఁ [6]గౌరవేశ్వరా.

365 వ. ఎక్కి [1]కొండొక [2]తొలంగి మాతంగ[3]ఘటలం బురికొల్పిన నవి పురందరనం
దను నరదంబుఁ [4]బొదివిన నవ్వీరుండు ఘోరనారాచధారల [5]నవ్వారణంబు
లపైఁ [6]గురియం [7]గని గదాహస్తుం డై [8]యరదంబు డిగ్గి యనిలపుత్రుండు
[9]గవిసినఁ [10]దుండంబు లవిసియు [11]దంతంబులు [12]దునిసియుఁ [13]గుంభం
బులు వగిలియుఁ [14]బ్రక్కలు చదిసియు వెన్నులు [15]విఱిగియు నగ్గజంబు
లొఱలుచు నెత్తురులు గ్రక్కుచుఁ [16]దెరలుచు సుడి[17]వడుచుండ వెండియుం
బై పైనురవణించుకరులం గనుంగొని ధర్మజనకులసహదేవులును [18]ధృష్టద్యు
మ్నాదియోధులు నద్దిక్కు తఱిమి రట్టియెడ నశ్వత్థామ కృతవర్మకృపా
చార్యులు దుర్యోధనుఁ [19]దేఁగములలోనంగానక కలనం బడియెనో యని
యనుమానించుచు నచ్చటిమానవపతులం గురుపతి యెచ్చట నున్నవాఁ

---

స్వనంబులు-ఘ. 5. ప్రభృతులయ్యానీకంబు—అ ప వ. 6. లయోధనికరంబున-శ.ష.

364 1. ముంచి, యొర్చి, యుబ్బి, వచ్చి, ముట్టి — అని పాఠములు. 2. నాతడేయను—ఐ.గ. 3. హరుల — పెక్కు ప్రతులు. 4. వేసినం — త. 5. హయంబును — ఖ.పి.శ.ష ; హయోత్తమమున్నరేశ్వరా—చ. 6. గౌరవోత్తమా—పెక్కుప్రతులు.

365 1. కొండొక (దిక్కు) దవ్వు తొలంగి — అ.ప.ఐ.గ. 2. తొలంగిమత్తమాతంగ—ఈ త. 3. ఘటలంగూర్చుక — అ.ప. 4. చుట్టుముట్టిన — క. 5. వారణ సమూహంబుల పయిం—చ. 6. గురిసినగదా — ఇ; గురిసినగని—ఎ 7. గలిత — ప. 8. తేరుడిగ్గి — ఆ. 9. గవిసి (గదిసి) మోదినం—ఉ.ఎ ఓ.వ ; గవిసినలిరేగి — చ : గవిసిననవి — ఒ ద.శ.ష. 10. తొండంబు — పెక్కు ప్రతులు ; దొండంబులు దునిసి — ఊ ; తొండంబులు విఱిచి — చ ; తుండంబుల — ష. 11. గండంబులు విఱిచియు — ఊ. 12. పెఱికియు — చ. 13. శిరంబులు — ఇ ఉ ; కుంభస్థలంబులు — ఓ ఔ. 14. ప్రక్కలు చేసియు — చ. 15. బగిలియు, వాలమ్ములు దునిసియు నిట్లగ్గజంబులు బొరలుచు నెత్తురులు — ప ; విఱిచి చింవర వంవర లాడిన నగ్గజంబులు పొరలుచు నెత్తురులు-చ; విఱిగియు వాలంబులరిసియు నట్లుం గజంబులు బొరలుచు నెత్తురులు—అ. 16. జిరజిరందిరుగుచు సుడివడుచుండ—ఓ.న.వ. 17. వడుచు జిర జిర దిరుగుచుండ వెండియు — ఈ. 18. ధృష్టద్యుమ్న శిఖండి ప్రముఖ యోధ వరులును నద్దిక్కు—ఖ.ల. 19. తేరుగమిలో—

డని యడిగినఁ గొందఱు శకుని[20]దెసఁ దొలంగె ననఁ [21]దక్కటివా రతని వెదక నేల బ్రదికి[22]యుండె నేనియుఁ గనికొందము పాండవులమీఁద నుఱికి [23]పొడుతము గాక యనిన [24]విని యట్ల చేయ నారథికత్రియంబును దద నీకంబును వెడలి [25]సౌబలుఁ డున్న చక్కటికిం జనిరి యె నిట్లు దిక్కుమాలిన యమ్మొన చుట్టు ముట్టి.

—: దుర్విషహ ప్రభృతి కురుకుమారులు భీమునిచేఁ జచ్చుట :—

సం. 9-24-41

366 క. పాంచాలకుమారాదులు
దంచితభుజబలము మెఱయ నమ్ములవెల్లిన్
ముంచిరి నిజకరిహరిరథ
సంచయసంరంభ మెసఁగ జగతీనాథా.

367 వ. [1]అప్పుడేను ధృష్టద్యుమ్నునిబారి కోకభంగిఁ [2]దొలంగ తప్పియు నద్దెస నద్దామగతి చతుశ్శతస్యందనములతో నడరుసాత్యకిచేతఁ బట్టువడితి నట్టి యెడ వడముడి కుంజరప్రకరభంజన విహారణపారీణతం బేర్చి యార్చినం జూచి నీకొడుకులు దుర్విషహదుష్ప్రదర్శనప్రముఖులు శిత[3]విశిఖంబులు గురియుచుం గవిసి యబ్బలుమగనిం బొదివిన నతండు రథం బెక్కి యెక్కుడుమదంబున భల్లనారాచాది బాణంబులఁ బ్రాణంబులు గొనినం గనుంగొని [4]హత శేషంబైన భవదీయబలంబు క్రోధశోకావేశంబున నవ్వీరుఁ జుట్టుముట్టిన నాజెట్టిజోదు పంచశతరథంబులును దంతిశతసప్తకంబును దురంగాష్టశతంబును బదాతిదశ సహస్రంబును దనసాయకసముదయంబుల వేగంబున సమయునట్లుగా సంక్రీడనంబు [5]సూపినం దక్కటివారు దేటిచూ డనుం జాల కంతంత నిలువ భవత్కుమారమారణం బప్రతిహతం బై చెల్లుటకు నుల్లంబు వికసిల్లె [6]శిష్టైకసోదరుం డైన సుయోధనునిఁ దెగిన

ఇ.ఊ.గ.ట.చ.న. 20. దెసగలంగె — స ; మునుమునకుం దొలంగె — చ. 21. గొందఱతనివెదక — అ.ఇ.ఎ ఏ. 22. యుండినగనుగొందము — పీ.శ.ష. 23. పోట్లాడుదము — స. పెక్కుప్రతులు. 24. వినియును నిలువక — పీ.శ. 25. సౌబలుని యున్న, సౌబలుని యున్న దిక్కునకు — అని పాఠములు.

367 1. అప్పుడు ధృష్టద్యుమ్నుని — ద.పీ.ష. 2. దొలంగియునద్దెస, దప్పితొలంగియు — అని పాఠములు. 3. విశిఖనికరంబులు నిగుడించుచు గవిసి — పెక్కుప్రతులు. 4. హత శేషులైన — అ ఉ.ఊ.ఎ. 5. సలిపె. సలిపిన — అని పాఠములు. 6. శిష్టసోదరుండైన,

వానినకాఁ [7]గొని తన్ను నప్పుడు కృతార్థునిఁగాఁ [8]దలంచుచు మల్లచఱచి [9]నం గించిదవశిష్టం బైనయాకౌరవసైన్యంబు [10]వెగడంది ఱిచ్చవడియె నయ్యవసరంబున గుఱ్ఱపుఁ[11]దండంబులతో సుదర్శనుండు దాను నున్న [12]సుయోధను నాలోకించి గోపాలదేవుండు దేవేంద్ర[13]పుత్రున కిట్లనియె.

368 సీ. [1]అరు లడంగిరి యుధిష్ఠిరుఁ డాది యగు భవ
ద్భ్రాతలు నీపరిపాలనమున
నుల్లసిల్లిరి సంజయుని [2]బాడుదల వట్టి
కొని వచ్చి సాత్యకి వినుతి [3]కెక్కె
నెలమి ధృష్టద్యుమ్నుఁ డెంతయు నొప్పె ని
ప్పుడ కూడి తఱుము మిప్రోవుగట్టి
నిలిచినహయములం బొలియింపవలయు నిం
దున్నాఁడు చూచితె [4]యొద్దు చక్కఁ

తే. గా నమర్చుచుఁ జూడ్కులుగలయదెసల
బొరినిగుడ్చుచు ధృతరాష్ట్రపుత్రుఁ డల్ల
వాఁడె తెల్లనిగొడుగుతో వాఁడి దక్కి
నివురు [5]గప్పిన నొప్పుఱు నిప్పువోలె.

369 క. ఇతనిని భవదీయోజ్జ్వల
శితనారాచ[1]ప్రసార[2]శిఘ్రాభిలో
ద్ధతి గత[3]జీవితుఁ జేయుము
కృతకృత్యుఁడ వగుదు జగము గీర్తింపంగన్.

---

నిశ్శేష సోదరుండైన, నష్ట సోదరుండైన, దృష్టైక సోదరుండైన – అని పాఠములు.
7. కాదలంచి తన్ను – ఈ.ఎ ; కాదలంచు చుం దన్ను నప్పుడు – ఊ. 8. గొని మల్ల– అ.ఊ. 9. తన్ను నగించె నవశిష్టంబైన యా కౌరవ సైన్యంబు దైన్యంబు నొంది ఱిచ్చ– శ.ష. 10. దైన్యంబు నొంది ఱిచ్చ – పీ. 11. దళంబులతో – పెక్కు ప్రతులు. 12. దుర్యోధను – పెక్కు ప్రతులు. 13. నందనున కిట్లనియె – పెక్కు ప్రతులు.

368 1. పరు – కొన్ని ప్రతులు. 2. నిటు – పీ. 3. గాంచె – పీ.శ.ష. 4. యొండు – కొన్ని ప్రతులు. 5. గవిసిన నొప్పెడు – పెక్కు ప్రతులు.

369 1. ప్రచార, ప్రహార – ఎ.వ. 2. శీఘ్రపటుబలో – ఐ.గ. 3. జీవుని – ఇ.ఎ.ఏ.క.చ.ట.

370 క. వినుము ధృతరాష్ట్రనందను
లనిలతనయుచేతఁ బొలిసి రందఱు నిం కొ
క్కనుజుండు నితండును ని
ల్చిన[1]వా రయ్యిరువు రిపుడు చెల్లెద రెట్లున్.

371 వ. అనిన విని సవ్యసాచి సవినయంబుగా నయ్యంబు[1]జాతు వీక్షించి.

372 చ. అమరనదీతనూభవుని నస్త్రకళాగురుఁ గర్ణునిన్ మహా
సమరమునం దనేకబలసంఘములన్ బలవన్నృపాలవ
ర్గములను మద్రరాజు దుదిగాఁ దెగటార్చె భవత్ప్రసాదది
వ్యమహిమ యింక నల్పతరవైరిసమూహము [1]దాని కడ్డమే.

373 వ. ఇన్నూటయిరథంబులు నూఱేనుంగులు రెండువేలకాలుబంటులనిసియు సౌబలుని తోడి యేనూఱుగుఱ్ఱంబులు నింతియ కాదె యీసేన యిది కృపాశ్వత్థామ కృతవర్మలు గలసి నిలుప నిలిచినయది యేను దీని యఱిముట కలిగెనే నింతవట్టును [1]బరిమార్చెద నిమ్మొనఁక పడియును జాఱియుం దనచుట్టు బయలైన సుయోధనుం డెట్లయ్యెడినో యటు నూడుము మార్కొనియె నేని మదీయ మార్గణాగ్నికి నా[2]హుతి సేసి కపటద్యూతంబున నపహృతంబులైనసకల[3]ధనంబులు నలుఁగు మొన మరల్చినవాఁడనై పాండవాగ్రజునిచింతవంత యంతయుఁ బుచ్చివైచెద నేఁ డెల్లపనులు సక్కనయ్యెడుఁ గరిపురపురంధ్రీజనులు తమపతులుఁ బుత్రులుం బొలియుట విని పాండవు లుద్దండబాహువీర్యశౌర్యసముగ్రు లని యెఱింగెదరుగాక యనుటయు [4]నన్నరుమాటకు మెచ్చుచు నతండు.

---

370 1. వారిరువురును నేఁడు చెల్లెద రెందున్, వారిరువురును నేఁడు చెల్లెదరెట్లున్ — అని పాఠములు.

371 1. జాతునభినందించి — పి.శ.ష; జాతునభివీక్షించి — వ.

372 1. మాకు — ఈ.ఎ.వ ; గెల్వ — శ, నీకు — ఐ.గ.

373 1. సమయించెద నిమ్మొనక — ఏ.ఐ ఖ.ట.త. 2. సుయోధనపశువునాహుతిచేసి — ఏ. 3. రత్నంబులు — పెక్కు ప్రతులు. 4. నన్నరుమాటకు మెచ్చుచు — పెక్కు ప్రతులలో లేదు.

374 చ. అరదము గౌరవేంద్రుదెసకై నడపంగఁ గెలంకులం గడం
గిరి నకులానుజన్ముఁడును గీచకవైరియుఁ గౌరవేశ్వరుం
బొరిగొన నుత్సహించి వడి భూవర వారి కెదిర్చె సౌబలుం
డరిబలముం దదీయరథికావళియుం గని వినుతింప నుగ్రుఁడై.

375 వ. తక్కటివారు నుక్కెక్కి పురికొని రాశకునియు సుశర్ముండును సవ్యసాచిని సుదర్శనుండు సమీరనందనుని నీయగ్రనందనుండు సహదేవునిం దలపడి రట్టి యెడ.

376 క. వడముడిఁ దలమిగిలి రయం
బడరఁగ సహదేవుఁ డత్యుదగ్రత మెఱయం
దొడరి భవత్సుతు మార్కొని
నిడుదవెడఁదతూపు లేసి నెఱిఁ దూలించెన్.

377 ఉ. కట్టియ [1]వైచె నెన్నుదురు గాఁడ భవత్తనయుండు మాద్రి లేఁ
బట్టి నతండు సోలియును బాహిరపోవక తేరి [2]యావిభుం
గిట్టి [3]నిశాతబాణచయకీలితదేహుని జేసె రావుతుల్
కట్టుపకాసులై నరునిఁ గప్పిరి శక్తులఁ దోమరంబులన్.

378 వ. గాంధారదేశీయు లగునాశ్వికు లట్లు పొదివిన నొదవినకినుకఁ గ్రూర[1]భల్లంబుల శిరంబులు ధరం దొరఁగఁజేసినఁ దెగరత్నస్యందనసందోహం బడరి గోవింద పురందరపుత్రులపైఁ బటుప్రదరపరంపరలు వరఁగించి విజృంభించిన[2] నవ్విజయుండు.

---

376 1. ఈ పద్యము పెక్కు ప్రతులలో లేదు.

377 1. వోయి చెన్నుదురు — చ. 2. యవ్విభుం — పెక్కు ప్రతులలో లేదు. 3. నిశాత — పెక్కు ప్రతులు; నివాత — వా.

378 1. భల్లంబుల తదీయ — పెక్కు ప్రతులు. 2. యవ్విజయుండు — పెక్కు ప్రతులు.

379 సీ. సత్యకర్మునితల [1]చారుకుండలపరి
స్ఫురితత్వ మొందుచు ధరణిఁ ద్రొల్ల
నేసి మృగంబుపై [2]కెరఁగుసింగము[3]పోలెఁ
గిట్టి [4]సత్యేషుని [5]గీ టడంచి
బహుదినసంచితప్రకటకోపానల
జ్వాలలు [6]సాకారలీలఁ బర్వ
తెఱఁగున నరుణదృగ్దీప్తిజాలంబును
శర్ముపై నిగిడించి సాయకత్రి
తే. [7]యంబొడలనాటుటయుఁ దద్రథంబు లొక్క
పెట్టఁ గవిసిన నన్నిటిఁ బిలుకుమార్చి
రథ్యములఁగూల్చి యతనియురంబు ఘోర
భల్లమున వ్రచ్చి [8]నిర్జితప్రాణుఁ జేసె.

380 వ. ఇవ్విధంబునఁ ద్రిగర్తపతిం బ్రేత[1]పతి[2]పాలి కనిచి మనదెసజనంబులు ఖేదంబుం దమవారు మోదంబు నొంద నతనినందనుల నేడ్వుర నెనమండ్ర ముప్ప దుండ్ర మూఁడుమూఁడు[3]గోలలం దలలు నఱికెఁ దత్సైన్యశేషంబు బారి సమరె భీమసేనుబారిం బడినసుదర్శనుండు దదీయశరజాలంబు [4]నదర్శనగతుం డై పదంపడి [5]తచ్ఛరవిఖండితకంఠుం డైనఁ గోపంబు దీపింప [6]వగ మిగుల నక్కుమారుమూఁక యమ్మారుత[7]సుతుఁ జుట్టు ముట్టిన నతండు బెట్టిదంబు లగు తూపులనది రూ పడంగు న ట్లేపున [8]విహరింపఁ గనుంగొని సహింపక మహీపతిముందటిబలంబు బరవసంబున[9]ం గవిసిన నక్కౌంతేయసైన్యంబును [10]సరభసంబున నెదిర్చి పేర్చినసమయంబున సౌబలుండును సహదేవుం

---

379 1. సార — అ. 2. కెగయు — న; నెగురు — ఊ.ప. 3. పోల్కి — అ.బ. 4. సత్య శ్రీవు, సత్యసేను — అని పాఠములు. 5. గీటడం(ణం)చి — పెక్కు ప్రతులు; గించి — వా. 6. సహకార — చ. 7. యంబుమెయి, యంబుమై — అని పాఠములు. 8. నిర్గత — ఆ.జ.పి.

380 1. పురంబునకు గాపురంబనిచి మనవారికి — అ.ప. 2. ప్రోలికి — ఇ. 3. కో(గో) లలం— కొన్ని ప్రతులు 4. నంతకదర్శనుండై — ఈ. 5. తద్భల్ల — కొన్ని ప్రతులు. 6. వగలు మిగుల — ఉ.ఎ. 7. తనయు జుట్టు — ఊ. 8. విహరించినం గనుంగొని — అ. 9. చేసినం గౌంతేయ — ఆ; పై గవిసిన — ఊ. 10. సంరంభంబున — కొన్ని ప్రతులు.

దాఁకినం దత్సుతుం డులూకుండు [11]బాసట యై యడరె వడముడియుఁ బిన్నతమ్మునికి బాసట యయ్యె నాశకుని [12]మాద్రీతనయునిఁ బ్రదీప్తభల్లత్రయంబున నొప్పించి పదినారాచంబు లతనిమేన గుప్పించినం గోపించుచు నయ్యిరువురు సాయకనికాయం[13]బు నిగిడించిన నాగాంధారరాజు మొగ్గరంబునఁ గత్తళంబులు [14]గరవాలంబులు [15]పల్యాణంబులు మోరలు [16]గంఠంబులు చరణంబులు గరంబులు శిరంబులు దునియలై తొరఁగిన ధాత్రి చిత్రాకారం బై యుండె నిట్లు వనతురగ సముదయంబు [17]సమయుటయుఁ జలం బెడపక నీమఱంది యన్నకులానుజుం గిట్టి.

381 క. పెనుగడఁత దొడ్డ[1]యత్తళ
మునవైచిన నతఁడు మూర్ఛమునిఁగి రథము మీఁ
దన పడినఁ గనలి యప్పా
వని పొదివెను గౌరవేంద్రవాహినిఁ గడఁకన్.

382 వ. [1]పొదివినయవ్వీరునారాచంబు లతాకున.

383 క. అది గొంత పుడమిఁ బడ ను
న్నది పాఱినఁగని యదల్చి యవనీశుఁడు బె
ట్టిద[1]ముగ నెలుఁగు సూపెను
మద మారఁగ నబ్బలంబు [2]మగుడువిధమునన్.

384 వ. ఇవ్విధంబున దొర యఱిమి తఱిమి యమ్మొన కుత్సాహంబుగాఁ జటుల వాహం బగురథం బెక్కి శకునిఁ గూడుకొని [1]కవిసిన.

---

11. తోడ్పడియె - పెక్కు ప్రతులు. 12. వాయుతనయుం బ్ర - ఎ. 13. బులునిగుడిం- పెక్కు ప్రతులు. 14. సబళం (లం) బులుగర — పెక్కు ప్రతులు. 15. గాళ్ళమోరలు — పెక్కు ప్రతులు. 16. గంధరంబులు - కొన్ని ప్రతులు. 17. సమయజలం — పెక్కు ప్రతులు.

381 1. తోమరమున — శ.

382 1. పొదువుటయు నవ్వీరు — ఊ ; గదిసిన యవ్వీరు — ఎ.

383 1. మగు — పెక్కు ప్రతులు. 2. మగుడు నటులుగాన్ — పెక్కు ప్రతులు ; మరలు నటులుగాన్ — ఒ.వ.

384 1. కదిసిన — ఒ.ట.

385 తే. పాండవుల సైన్యమును సముద్దండలీల
మాఱు[1]కొనె నంతలో మూర్ఛదేఱి నకులు
తమ్ముఁ డమ్మామపైఁ బదియమ్ము లొక్క
పెట్టఁ గ్రుచ్చి యాతనివిలు బెట్టు[2]ద్రుంచె.

—: ఉలూకుఁడు సహదేవుచేత మృతుండగుట :—

సం. 9—26—23

386 సీ. ఆసౌబలుండు శరాసనాంతర దీప్తుఁ
డగుటయు నకులుఁడు ననిలసుతుఁడు
దాఁకిన వారి నతండు పెక్కమ్ముల
[1]నొప్పింప నతనితనూజుఁ డనిల
సుతసహదేవుల సునిశితశరవర్ష
మునఁ గప్ప నయ్యులూకుని ననేక
సాయకంబుల నొంచి శకునిమై నఱువది
యమ్ములు నాటించి యనుచరులను
తే. బెగడు పఱిచె నాభీముండు బెట్టులూకుఁ
డదరి యన్నకులానుజు నంపవెల్లి
ముంప నతఁ డేచి పటుభల్లమున శిరంబు
ద్రుంచె నన్నలయెదలు సంతోష [2]మొంద.

387 క. తనయుఁడు వడ శకుని కనుం
గొని శోకం బాత్మ [1]నారఁ గూరఁగ నశ్రుల్
[2]కనుఁగొనలయందు నినిచె
న్మనుజేశ్వర విదురు[3]భాషణంబులు దలఁచెన్.

---

385 1. కొనియెనంతకు మూర్ఛ — ఊ.ఓ.ట.త.ల. 2. దునిమె — పెక్కు ప్రతులు.

386 1. నొప్పించె — ఉ.ఎ.ఒ. 2. మొదవ — పీ.ష; మంద — పెక్కు ప్రతులు.

387 1. గదురగొనన్రుశుతతుల్ — ఈ. 2. కనుగవయందును నినుమన్ మనుజేశ్వర—ఉ.
3. మాటమదిలో దలచెన్ — వీ.శ.ష; పలుకు మదిలో దలచెన్ — ఓ.

388 వ. అట్లుడలుచు నిట్టూర్పు నిగుడ సహదేవుపై నదరి మూఁడునారాచంబుల నిగిడించిన.

389 చ. అవి వెసఁ ద్రుంచి యాతనిశరాసనముం దునుమాడె నక్కుమా
రవరుఁ డతం డనిందితపరాక్రముఁడై పటుఖడ్గయష్టిదీ
ప్త విపులముద్గరంబున విభాసితశక్తిని వైవఁ దోడుతో
నవియు ననేకబాణముల నాన్నృపసూనుఁడు నుగ్గు సేసినన్.

390 క. కనుఁగొని పార్శ్వచరులు వి
చ్చిన శకునియుఁ బాఱె నుల్లసిల్లిరి కుంతీ
తనయులు దదీయసేనా
జను లార్చిరి కురువిభుఁడు విషాదము [1]నొందెన్.

391 వ. ఇట్లు పాఱిన.

392 చ. అరదము సత్వరంబుగ [1]శరావళి [2]పెల్లుగఁ బర్వఁ బాండవా
[3]వరజుఁడు పోవనీక పొదువన్ [4]వడిఁ బింగలివారు పోరికిం
బురికొని త్రోచినన్ సుబలపుత్రుఁడు [5]దత్తురగవ్రజంబుతో
బరవస మొప్పఁగా నతనిపైఁ గవిసెం గృతనిశ్చయాత్ముఁడై

393 వ. కవిసినం [1]గని గుణంబు సారించి [2]శరాసారం [3]బడరించి యాసహ[4]దేవుం డిట్లనియె.

394 చ. తలఁకుట యొప్పునే నృపతి[1]ధర్మము నూఁది యెదిర్చి [2]యేమెయిన్
నిలుచుట యొప్పుఁ గాక మహనీయుల ధర్మతనూభవాదులం

---

390 1. బొందెన్ — పెక్కు ప్రతులు.

392 1. శరాసనముక్తశరంబు లొప్పన – శ. 2. వెల్లువ – ఉ; బెట్టుగ – ల. 3. వ్వరబలు డోలిమైని బోదువంగడు సిగ్గునమర్లి – శ. 4. ద(ను)న చెంగటి – ఆ.ఈ.వ; వడి చెంగటి – అ; వడి(గను)ను ంగలి – చ జ.ల. 5. నత్తురగ – పెక్కుప్రతులు.

393 1. గనుంగొని – కొన్ని ప్రతులు. 2. శరంబులడరించి – ల.వ. కొన్ని ప్రతులు. 3. నిగుడించుచునా – ఖ. 4. దేవుండతనికిట్ల – పెక్కుప్రతులు.

394 1. ధర్మముయూది–ఎ.ఐ.గ; ధర్మము-నొంది–శ. 2. యిమ్మెయిన్–పెక్కు ప్రతులు.

బలికిని నీవు [3]జూదపునెపంబునఁ దత్సల [4]మందె దిప్ప మా
చలము బలంబు [5]నేర్పడియెఁ జచ్చిరి మీయవివేకు లందఱున్.

395 వ. [1]మమ్ము నపహసించినవారిలోఁ గురుకులదాహకుం డొక్కరుండ [2]తక్కె
నద్దురాత్ముండు సూచుచుండ భవదీయశిరంబుఁ దాలఫలంబు[3]లగుడంబునం
బడవైచుపగిదిఁ బటుభల్లంబున డొల్ల నేసెద మామా పాటిక నిలువుమీ
యని యట్లు బహుభంగుల బలికి యతం డేయుసాయకంబుల[4] వారించి
[5]దశమార్గణంబులు మేనఁ జొనిపి.

396 క. తురగములు [1]సిడము గొడుగును
శరాసనముఁ దునిమి యార్వసాహసమున ని
ష్ఠురశక్తిఁ [2]బూన్చె నాతని
యురఃస్థలము [3]వైవ శకుని యుర్వీనాథా.

397 మ. సహదేవుం [1]డది శాతభల్లమున నుత్సాహోగ్రుఁడై [2]తుంచి దు
స్సహభల్లద్వితయంబునం గరయుగ[3]స్ఫారచ్ఛిదాకేళి స
ల్పి హాసద్వక్త్రవిలాస మొప్పఁగ నాభీల[4]ద్యుతిస్ఫారభ
ల్లహతిం గంఠము ద్రుంప మస్తకము డొల్లెన్ [5]డొల్లె [6]మేనుఱ [7]మహిన్.

---

3. జూదము — కొన్ని ప్రతులు. 4. మొందె — కొన్ని ప్రతులు. 5. నేర్పడగ — అ.ఊ; నేర్పెటిగి — ఖ.

395 1. మమ్మపహసించిన — పెక్కు ప్రతులు. 2. చిక్కె — వీ. కొన్ని ప్రతులు. 3. కుఠారంబు — క.వీ ష. 4. లుద్రుంచి - పెక్కుప్రతులు. 5. పటు — అ; శత - ఖ.

396 1. గొడుగుసిడమును - ఇ.ఉ ఏ క. 2. బూనె - వీ ష; బూని - కొన్నిప్రతులు.
3. వైచె — పెక్కు ప్రతులు.

397 1. డతి — కొన్ని ప్రతులు. 2. త్రుంచె — శ. 3. స్ఫారచ్ఛిదా - పెక్కు ప్రతులు.
4. స్ఫురద్ఘోర — శ. 5. డ్రెళ్లె- అ.ఇ.ఉ.ఐ. 6. మేనుర్విపై — శ. 7. వడన్-ఊ.ఘ.

398 వ. ఇట్లు కౌరవులదుర్నయంబునకు మూలం బగుశకునిఁ దెగటార్చి పేర్చియార్చిన యనుజన్ము నాలోకించి ధర్మతనయ[1]ప్రముఖులు పరమప్రమోదభరితాంతఃకరణు లై నిజశంఖంబులు పూరింప శౌరియుఁ బాంచ[2]జన్యారావంబున రోదసి నింప [3]సుయోధనుసేన చెదరక బెదరక [4]నిలిచి యాసౌబలుసైన్యంబు సహదేవునిపై ననేకాస్త్రశస్త్రంబులు గురియుచుఁ గవిసినం గవ్వడియు వడముడియు నవి యన్నియు [5]మోఘంబు లగు[6]నట్లు చేసి యమ్మూఁక బలువడనేసి యుల్లాసభాసితు లైనం గని జనపతి శోకాక్రాంతమతి యై హతశేషు లైన నిజసైనికులంబురికొల్పిన వారలు దడుక[7]రహితు లయ్యును దెంపు[8]పెంపున [9]శంకింపక యాసవ్యసాచిం బొదివి [10]తదస్త్ర[11]శిఖాసందోహంబున [12]మ్రందిపోయి రక్కురురాజు దనచుట్టును బయ[13]లగుటఁ గలయం జూచి కట్టెదురఁ జెలంగు నాకౌంతేయులం [14]గనుంగొని తొలంగిపోవం దలంచె ననుటయు నాంబికేయుండు సంజయుదిక్కు మొగంబై.

399 తే. అట్లు మనసైన్యులు దెగటారినపుడు
కుంతికొడుకు[1]లలో బల మెంత [2]గలిగె
నకట నాకొడు కెట్టివాఁడయ్యెఁ జెపుమ
యనుడు నతఁడిట్లు లనియె నమ్మనుజపతికి.

400 వ. అట్టియెడ రెండువేలురథంబు లేడునూఱుగజంబు లైదువేలుగుఱ్ఱంబులు పదివేలు [1]కాలుమానిసియుఁ దానును ధృష్టద్యుమ్నుండు [2]సంగరాంగణంబున మెఱసి [3]యుండె.

---

398 1. ప్రభృతులు—అ. 2. జన్యారావంబున—ఉ.ట ; జన్యనినదంబున—చ. 3. సుయోధనుండు — ఘ చ.ల. 4 నిలిచి — పెక్కు ప్రతులలో లేదు. 5. మ్రందునట్లు — వీ శ.ష. 6. నట్లుచేసియమ్మూఁక — పెక్కు ప్రతులు. 7. హీనులయ్యు — ల. కొన్ని ప్రతులు. 8. పెంపు — వీ.శ ష. ప్రతులలో లేదు. 9. చలింపక — ఇ ఉ.వ. 10. తదీయ నిశిత శిలీముఖాగ్ని జ్వాలల మ్రందిపోయి రక్కురు — వీ శ.ష. 11. విశిఖ — ఖ చ జ. 12. మడిసి — ఖ 13. లగుట చూచి — శ.ష. 14. గనికలంగి — అ ; గనుగొని కలంగి — పెక్కు ప్రతులు.

399 1. లకును — పెక్కు ప్రతులు. 2. నిలిచె — ఇ.

400 1. కాలు మూకయు గలిగి — అ ; కాల్బలంబును — ఊ.ష.చ. 2. సంగరావష్టంభంబున — ఒ.జ ల. 3. యుండె దదనంతరంబ — వీ.శ.ష.

401 క. [1]పలపలనిమూఁకలోఁ గాల్
నిలువక గుఱ్ఱంబు డిగ్గి నీకొడుకు గదా
కలిత[2]భుజుం డై యొక్కఁడుఁ
దొలఁగి చనియె నేమి చెప్పుదుం గురునాథా.

402 వ. [1]అని ధృతరాష్ట్రునకు సంజయుండు [2]దుర్యోధనుపలాయనం బెఱింగించె నని చెప్పిన విని యటమీఁదివృత్తాంతం బెట్లయ్యె నని యడుగుటయును.

403 ఉ. సంగవి[1]దూరతా[2]కలితశాంత[3]రసస్ఫుట[4]రోహదిగ్ధబో
ధాంగసమాశ్రితాపదుదయజ్వలనప్రశమ[5]ప్రవర్తకా
పాంగమరీచిరూప[6]వితతామృతవీచివిహార వాసవో
త్సంగత[7]లోపలాల్యపట[8]సంస్మృతివారణ దైత్య[9]దారణా

404 క. ఆశ్చర్య[1]కరణకరుణా
నిశ్చల[2]శుచిహృదయ[3]భావనీయ[4]విహరణా
పశ్చిమ[5]నాడీ[6]సరణ పు
ర[7]శ్చరణధ్యేయ [8]భక్తరమణవిధేయా.

---

401 1. పలువలని - అ ; వలవని - ట.న.వ. 2. భుజుడగుచు నొక్కఁడు - ల.వీ.శ.ష. కొన్ని ప్రతులు.

402 1. అని యిట్లు ధృత — పెక్కు ప్రతులు. 2. సుయోధను — పెక్కు ప్రతులు.

403 1. దూరితా - పెక్కు ప్రతులు. 2. కరణ — అ.ప. 3. రసత్పుట - స. 4. దోషదగ్ధ, రోషదీప్త, లోహదీప్త, లోమదిగ్ధ — అని పాఠములు. 5. ప్రవర్తితా - వ. కొన్ని ప్రతులు. 6. కలితామృత, విగతామృత, సతతామృత, విషతామృత, విరతామృత — అని పాఠములు. 7. రోహకావ్య — చ ; లోపభాగ్య — అ.క ; రోహతాల్య — ల ; లోభభోగ్య — జ. 8. సంస్మృతి తారణ — పెక్కు ప్రతులు ; సంస్తుతి తారణ, సంశ్రిత తారణ, సంభరితారుణ — అని పాఠములు. 9. వారణా, మారణా- అని పాఠములు.

404 1. కవిత - చ ; ధుర్య — ఆ.త ; శరణ — గ. 2. సుఖ — ఇ.ఈ.ఉ ; రుచి — ప. 3. పావనీయ — ఇ.త.వ. 4. విహారా — వీ.శ.ష. 5. తాళీ — వీ.శ. 6. హరణ, చరణ, శరణ — అని పాఠములు. 7. శ్చవణావ్యయ — ఈ, శ్చరణాధ్యయన-ఊ.ఖ. 8. భక్తి — పెక్కు ప్రతులు.

405 మాలిని. ప్రణవమయ[1]గరిష్ఠోపాయ సంవేద్యభూమా
[2]భణనమనన[3]దూరస్ఫారవిస్తార[4]సీమా
గుణ[5]విభవనిరాసా కుంఠితోల్లాసధామా
గణనరహితలీలా కల్పనిత్యాభిరామా.

గద్యము. ఇది [1]శ్రీమదుభయకవిమిత్రి కొమ్మనామాత్యపుత్ర
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజిప్రణీతం బైన
శ్రీమదాంధ్ర మహాభారతంబున
[2]శల్య పర్వంబునందుఁ
ప్రథమాశ్వాసము.

---

405 1. గరిష్ఠావాయ – పెక్కు ప్రతులు. 2. చరణసవన - వీశ; చరణమనన – కొన్ని ప్రతులు. 3. దురాస్ఫార – కొన్ని ప్రతులు. 4. ఘూమా – ఇ. 5. భవన, వచన, వినుత, విగుణ, రహిత - అని పాఠములు

406 1. శ్రీమదాంధ్ర – కొన్ని ప్రతులలో లేదు; శ్రీమదాంధ్ర మహాభారతంబున – కొన్ని ప్రతులలో లేదు. 2. యుద్ధ పంచకంబున శల్య – ల.

# శ్రీమదాంధ్ర మహాభారతము

## శల్యపర్వము - ద్వితీయాశ్వాసము

→o←

1 క. [1]శ్రీకరణనిపుణపదప
ద్మా కేవలసత్త్వపద్మ మాయావ్యవధూ
త్యైకాయనగమ్యా మధు
రా[2]కృతి[3]సర్వత్రరమ్య హరిహరనాథా.

2 వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు నిజపుత్రుండు పరాజయంబు నొందుట యాకర్ణించి యాంబికేయుండు.

3 క. మద మడఁగి యొక్కరుండును
గద చేకొని రాజరాజు కాల్నడ నెట వో
మదిఁ దలఁచి [1]తొలఁగె[2]నొకొ యా
పద లిట్టివి కలవె [3]మనుజపతులకు నెందున్.

4 వ. [1]అనంతర[2]వర్తనంబు తెఱం గెఱింగింపు [3]మనుటయు [4]నజ్జననాథునకు సంజయుం డిట్లనియె.

---

1 — 1. శ్రీకరుణ – ఎ.చ; శ్రీకరనైపుణ – ఉ; శ్రీకరణనిపుణాస్పద – ఘ. 2. మృత – వ.ఘ; కృత – కొన్ని ప్రతులు. 3. సర్వత్ర – గ.ద వ శ ష.స; సర్వస్వ – ఊ.చ. 'ఎ' ప్రతిలో ఈ పద్యస్వరూపమిట్లున్నది. "శ్రీకరుణనిపుణచరణ వ్యాకోచాంభోజ నిత్యవాసముదితసు, శ్లోకమునిచిత్తభృంగమ, హాకరుణామిళితా, పాంగ హరిహరనాథా."

3 — 1. తలఁగె – ఐ.గ. 2. నఁట – ఓ వ. 3. భూమిపతులకు – చ.

4 — 1. అని చింతించియనంతర – కొన్నిప్రతులు. 2. వర్తనంబెఱిఁగింపు – ఇ.ఉ.ఏ. 3. మనవుడు – ఘ. 4. నాంబికేయునకు – ఇ.ఉ.ఊ.క.ఘ.చ.పీ.శ.ష.

5 సీ. [1]ఏకాదశాక్షౌహిణీశుఁ డై పెంపునఁ
బొంపిరివోవునప్పుడమి ఱేఁడు
వెనుక నొక్కరుఁడును జన లేక యేకాకి
యై పోయె నచటికి ననతిదూర
మై యుత్తరము ముట్టినట్టితూర్పున నొక్క
[2]మడు వున్న దానిలో నడఁగియుండు
వాఁడుగా నట్టు లవ్వలనికిఁ జని చని
విదురువాక్యంబులు మదిఁ దలంచి

ఆ. యధిక మతినృపాలు ననుజుండు [4]సెప్పె [5]న
ట్లకట దానిఁ గొనన యనుచు శోక
తప్తచిత్తుఁ డయ్యె దైవ మెవ్వరి [6]నెట్లు
చేయఁ [7]జాల దేమి [8]సెప్పఁ గలదు.

6 వ. అట్టియెడ నుడిసి చిక్కిన మూఁకలు వీఁకమై నెదిర్చినం బొదివి నిరవశేషం బుగా సమయించి కృష్ణసారథికంబును ధవళహయంబును గ[1]పీంద్ర కేతనం బును నగునుజ్జ్వలస్యందనంబున నప్పురందరనందనుండు బంధుమిత్రాభినంది తుం [2]డై యొప్పె నప్పుడు పాలి[3]కలన నీబలం బఖిలంబును బెనుగాలిం బడినపేరడవిపగిదిం [4]గానంబడు చుండె నందుఁ గృపాశ్వత్థామకృతవర్మలు మువ్వురు బ్రదికి పోయి రాసమయంబున ధృష్టద్యుమ్నుండు నన్నుఁ గనుం గొని నగుచు సాత్యకి నుద్దేశించి.

7 తే. వీని నేటికిఁ బట్టితి వీఁడు బ్రదికి
[1]యిచట వర్తించి మనకు నెగ్గెమి సేయు
నప్రయోజన మిది [2]విడు మనిన నేల
విడుతు నీద్రోహితల దెగ[3]నడుతు ననుచు.

---

5 1. ఏకాదశాక్షోహిణీశుఁడై — పెక్కు ప్రతులు. 2. మడుగున — అ.ఏ.బొ. 3. నిమాటలు — వా. 4. సెప్పి — కొన్ని ప్రతులు. 5. నట్లగుట — పెక్కు ప్రతులు. 6. నేమి, కేమి — అనియు పాఠములు. 7. నేరదేమి — పెక్కు ప్రతులు; నేరఁ డేమి — అ.క.ట.త. 8. చే (సే)యువాఁడ — ఏ.ఓ.

6 1. గపీంద్ర — పెక్కు ప్రతులు; కపి — వా. 2. డగుచునొప్పె — పెక్కు ప్రతులు. 3. కలను — వా. 4. గానంబడు — ఇది పెక్కింటలేదు.

7 1. యెచట — కొన్ని ప్రతులు. 2. విడువనిన — పి. 3. ప్రేతునను చు — కొన్ని ప్రతులు.

8 వ. ఆశైనేయుండు వాలు వెటికి [1]ౘ్రేయం [2]జూచునంతఁ గృష్ణద్వైపాయనుండు సన్నిధిచేసి యతని వారించి సంజయుం జంపుట యనుచితంబు ముందల విడువు మని యానతిచ్చిన నతండును [3]వినతుం డై యట్ల కాక యని పలికి నన్ను [4]విడిచెఁ [5]గృష్ణద్వైపాయనుండు మదీయాననం బాలోకించి బ్రిదికి పోయి తెక్కడకైనం బొమ్మనుటయు [6]నమ్మునీంద్రు వీడ్కొంటి [7]నంత నతఁ డంతర్ధానంబు సేసె నేను దత్ప్రదేశంబు వాసి నీసుతుండు సనినచక్కటికిఁ గ్రోశ[8]మాత్రంబు వోయి [9]ద్వైపాయనం బనం బ్రసిద్ధం బై నయమ్మడువు సమీపంబున.

9 తే. అతనిఁ గాంచితి [1]నతఁ డశ్రు [2]లడర నడలు
చూడ్కి నామోము చక్కఁగాఁ జూడ కోర
వోవఁ జూచుచు దీనతఁ బొంది యునికి
గని మనంబున శోకంబు [3]గదుర నేను.

10 వ. ఒక్కింతసేపు పలుకు వెలువరింపఁ జాలక యూర[1]కుండి యెట్టకేల కెలుంగు దెచ్చుకొని పారాశర్యప్రసాదంబున బ్రదికినతెఱంగు [2]సెప్పిన నమ్మహీకాంతుండును గొంత[3]ప్రొద్దు నిశ్చేష్టితుం డై యుండి పదంపడి నాదెసఁ జూచి మనదెస బ్రదికిన[4]వారు గలరే [5]యనినఁ గృపాచార్యాదిరథికత్రయంబును బేరుకొని వారలు బ్రతికిపోయిరి త క్కొరుండును బ్రదుకుట లేదని యెటిం గించిన నిట్టూర్పు [6]నిగిడించుచు నామూఁపుపైఁ జే యిడి యన్నర[7]నాథుండు నన్ను నీకడ [8]కనుపం దలంచి [9]నాతో ని ట్లనియె.

---

8 తెగ[1]వ్రేయం — పీ.శ.ప.స. 2. ౘూనె - బూనిన - అనియు పాఠములు. 3. నమ్మహాత్మునకుఁ బ్రత్యుత్థాన వందనంబాచరించి వినతుండై యట్లకాకయని నన్ను - చ. 4. విడిచె - వా. 5. కృష్ణద్వైపాయనుండు - పెక్కింటలేదు. 6. నమ్మహాముని - పెక్కుపతులు; నమ్మహాత్ముని - ఐ.గ. 7. నంత — పెక్కు ప్రతులలో లేదు. 8. మాత్రంబువోయితి — కొన్ని ప్రతులు. 9. ద్వైపాయనహ్రదంబున — ఇ.ఉ.

9 గన్నులనశ్రు — అ; నాతండునశ్రు — ఈ.ఐ.గ. 2. లలరు - అ. 3. గదిరియేను — అ.ఏ; గదిరినేను — త.

10 1. కుండితినెట్ట — కొన్ని ప్రతులు. 2. సెప్పితి — పెక్కుపతులు. 3. సేపు — పీ.శ;ప. 4. వారునుం — కొన్ని ప్రతులు. 5. యని యడిగికృపా — కొన్ని ప్రతులు. 6. నిగుడించుచు — పెక్కు ప్రతులు ; నిగుడించి నామూఁపు — అ.ఔ. 7. పతి — నన్ను — పెక్కు ప్రతులు. 8. కుఁబోవంబనిచి — కుజనంబనిచి — అనియు పాఠములు. 9. నాతో — ఇది పెక్కుప్రతులలో లేదు.

11 తే. మాఱుమానిసి లేకుండ మడిసి రెల్ల
వారు నీదెసఁ బాండుభూవర[1]తనూజు
[2]లాప్తులుం దాము నున్న వా రాహవమునఁ
బడక తొలఁగితిఁ [3]బోటులఁ బడియు నేను.

12 వ. అని.

13 క. కౌంతేయులబారిం బడ
నింతియ సిరి చాలు రాజ్య మెల్లను [1]దారై
పొంత నను [2]బెట్టుకొని యొక
కొంత యొసఁగిరేని [3]నట్టికూ డేమిటికిన్.

14 క. అనుజులఁ దనుజుల మత్సరి
జనులను [1]సమయించి వారు సమరోల్లాసం
బున మెఱయఁ జూడ నేర్తునె
జననాథున [2]కింతవట్టు [3]సంజయ చెపుమా.

—: *దుర్యోధనుఁడు ద్వైపాయనం బనుమడుఁగున డాఁగియుండుట* :—

సం. 9—28—51

15 క. ఇమ్మడువులోన డాఁగెద
నిమ్ముల నెచ్చటికి [1]నైన నేఁగెదఁ [2]దగు వృ
త్తమ్మునఁ దొలఁగి నిలిచి మఱి
యెమ్మెయి[3]నేనియును దీర్తు నేఁ బగయ[4] సుమీ.

11 1. కుమారు - ఏ.చ. 2. లాప్తులును దారు — పెక్కు ప్రతులు. 3. (బోట్లను - కొన్ని ప్రతులు.

13 1. వారై — పెక్కు ప్రతులు. 2. బెట్టికొని — ఆ బ. 2. యట్టి — కొన్ని ప్రతులు; వా. ప్రతిలో 'రేనినట్టి' యనిద్రుతాంతముగా 'ఏని' పదము వాడఁబడుటకు ఆకరము కానరాదు.

14 1. బొలియించిన — ష. 2. కిత్తెఱంగు — కొన్ని ప్రతులు. 3. చయ్యన — అ.

15 1. నేనెచటికైన — ఎ; వేఱెచటికైన — జ. 2. దుర్వృత్తమున — శ; గూఢ వృత్తమున — క. 3. తోనైన నైనను - అనియు పాఠములు. 4. యనుమీ — పెక్కు ప్రతులు.

16 వ. అని [1]చెప్పి యమ్మడువు సొచ్చి మాయావిశేషంబున జలంబులు శరీరంబు సోఁక కుండ [2]సంస్తంభనంబు సేసికొని [3]యుండె [4]నంతరథ్యంబులు పరిశ్రాంతి నొంది [5]తూఁగాడ న[6]శస్త్రాదిక్షతంబు లగునవయవంబులతోడ రాజదర్శన విషణ్ణు [7]లగుచుఁ గృపకృతవర్మాశ్వత్థామ [8]లచ్చట మెలంగి డబ్బాటుగా నన్నుం[9]గని సంజయా[10]బ్రదికితే యని పలికి కురుపతి [11]ప్రాణంబులం గలఁడే యని [12]యడిగిన నజ్జననాథుఁ డొక్కండును [13]బాలు తెంచి నీరిలో డాఁగి యున్న తెఱం గెఱింగించి యాహ్రదంబు సూపి [14]యే మిరువురము [15]నొండొరులతో నాడినమాటలు దేటపడం జెప్పిన వార లత్యంతవిషాదంబు నొంది.

17 చ. [1]నరవరుఁ డేము సంగరమునం [2]బడ కున్కి యెఱుంగఁ డక్కటా
[3]బరవస మేది వచ్చెఁ బిదపజ విని యుజ్జ మముఁ [4]గూర్చికోలు [5]దు
స్తర మనుబుద్ధి [6]నిప్పటికి శత్రుల[7]క న్మొఱఁగం దలంచి యా
వెరవున [8]డాఁగె సర్వపృథివీపతి దుర్దశ నిట్లు పొందునే.

18 వ. అవ్విభుండు పెనుఁబ్రాపై నిలిచిన నేము పగతురతోడం బెనంగం జాలుదు మనుసమయంబున విజయవిజృంభితు లగుపాండవులు సబలంబుగా నచ్చెరువ నడతెంచిన నా[1]రథికులు దా రచ్చోట నిలుచుట కార్యంబు గా దని తలంచి నను గృపాచార్యురథంబు[2]మీఁద నిడికొని మనశిబిరంబున కరిగి రందు.

---

16 1. నాతోడఁ జెప్పి నికొడు కామడువుఁ సొచ్చి మునింగి మాయా విశేషంబున జలంబులు (తన్ను) తన శరీరంబు — అ.ప. 2. సంస్తంభనంబు, స్తంభనుండు, జలస్తంభంబు అనియు పాఠములు. 3. డాఁగియుండె—ఇ.వీ.శ.ష. 4. నంతనట—ఐ.గ. 5. తూఁగాడు—ఎ.ప.ఓ. 6. కృతంబులగు—పెక్కుప్రతులు. 7. లైన—పెక్కుప్రతులు. 8. నెంతేనియుఁ దొలఁగివచ్చి యచ్చట — అ. 9. గనుంగొనిసంజయా — చ. 10. బ్రతికివచ్చితి వేయని — అ.ప. 11. ప్రాణంబుననున్నవాఁడే — అ.ప 12. పలికిన అడుగుటయు — అనియు పాఠములు. 13. పఱతెంచి — వీ.శ.ష. 14. యజ్జనపతి యును దానును — క.ఖ.గ.ఘ.చ. 15. నొండొరువులతో — ఆ.ఇ.ఉ.ఓ.ఖ.ఘ.చ.జ.

17 1. వరవర యేము — ఈ. 2. బడకుంట యెఱుంగ — ఔ.ట.వ; బడకుండు టెఱింగిఁ — ఈ.ఖ.త. 3. బరువగుటిట్లు — చ. 4. గూర్పు — కొన్నిప్రతులు. 5. దుష్కర — పెక్కుప్రతులు. 6. నప్పటికి — పెక్కు ప్రతులు. 7. దామొఱఁగం — ఇ.ఉ; కున్మొఱఁగం — ఔ.ట. 8. దాఁగిపృథ్వీపతి వీఱఁడిదుర్దశ — ఆ.ప.

18 1. రథికవరులు — ఇ.ఉ.ఐ. 2. పై నిడికొని యవలంగొని పోయిరంత నవ్వీరవరులందఱుమన — ద.

19 చ. [1]కలఁగొనఁ బాఱుచుఁ సతులు గన్నుల నశ్రు[2]జలంబు లొల్క [3]వీఁ
పులపయి [4]పెన్నెఱుల్ [5]విరియఁ [6]బొడ్మఁగ లాలలు రోదనధ్వనుల్
సెలఁగఁగ మోములుం దలలుఁ జేతులుఁ [7]గెంపుగ [8]మోఁదికొంచు భ
ర్తల సహజన్ములఁ సుతులఁ దండ్రులఁ బేర్కొని యార్తి నొందుచున్.

20 వ. హతశేషు లైన పతాకాతపత్రచామర[1]భృదాది[2]జనంబులవలన సకలజనసంక్ష
యంబు వినుచు నేలంబడి పొరలుచు లేచు చునికి యత్యంతకరుణం బై
యుండె నప్పుడు మాన్యవనితాజనంబులకావలి[3]వారునుం గడంగి వారలం
దగినవాహనంబులపై [4]నిడికొని యిక్కడకు వచ్చిరి తక్కినభీతజనంబులు
పలు[5]దెసలం బాఱి రట్టియెడ నీకొడుకు యుయుత్సుండు శోకసం[6]తప్త
చిత్తుం డై.

21 శా. గంగానందనుఁ డాది గాఁగఁ గురుసంఘం బెల్ల సంగ్రామధా
త్రిం గూలెం బతి యొక్కరుండు పటుకౌంతేయప్రతాపంబు పే
ర్మిం గీడ్పాటున కోర్చె [1]పాఱె విధి నామేఁ బ్రాణముల్ [2]నిల్పె నా
కుం గాంతా[3]జను[4]లం దగంగఁ బురికిం గొం చేఁగు టర్హం బగున్.

22 వ. ఏకాదశాక్షౌహి[1]ణీభర్త మన్నించు[2]మానవతులు గాసి యగుదురే యని
మనంబునం దలపోసి [3]రథంబు డిగి యత్తెఱంగు శౌరికి నజాతశత్రునకు
నెఱింగించిన నప్పాండవాగ్రజుండు పరమ[4]కృపాపరుం[5]డు గావునఁ బ్రీతుఁ
డై శౌరియాననంబు పాలోకించి యది [6]మేల కాదె యని పలికి యతం డను

---

19 1. కలఁగఁగ — ఆ.వ ; కలఁగొని - అ.ప ; కలఁగను — ఇ.త 2. కణంబు — ఊ.ల. 3. గొప్పులపయి — ఘ. వేనలుల్ — కొన్ని ప్రతులు. 5. బొరయ — అ; బెరయ — చ. 6. పువ్వులురాలఁగ — అ.ట ; ఘోరునబాలలు — ఈ ; బొందఁగ లాలలు — క.ఖ. 7. తెంపుగ, బెట్టుగ, గొప్పగ — అనియు పాఠములు. 8. మొత్తు కొంచు —; మోదుకొంచు — అనియు పాఠములు.

20 ధరాది — కొన్నిప్రతులు. 2. ప్రముఖజనంబుల — పెక్కుప్రతులు. 3. వారలు వారలం — కొన్నిప్రతులు. 4. నిడుకొని — పెక్కుప్రతులు. దెసలకుం బోయిరి— తొలంగిరి — అనియు పాఠములు. 6. తప్తుం డై — పెక్కుప్రతులు.

21 1. పోక — ల. 2. నిల్చె — కొన్నిప్రతులు. 3. మణులం — అ; జనముల్ — ఇ; జనమున్ — ఖ. 4. లందఱంబురముకున్ — అ.

22 1. ణీశ్వరుండుమన్నించు — ఖ.ఘ.చ. 2. మాన్యవనితలు — ఐ. 3. రథంబుడిగి — కొన్నిప్రతులలోలేదు ; చని — పెక్కుప్రతులు. 4. కృపాళుండగుటయు — కొన్ని ప్రతులు. 5. డగుటయు — కొన్నిప్రతులు. 6. మేలుగాకయని — పెక్కుప్రతులు.

మతి సేయ నవ్వైశ్యాపుత్రుఁ బరిరంభణంబు సేసి లెస్స తలంపు తలంచి తని సంభావించి వీడు కొలిపిన నతండు రథారూఢుం డై రథ్యంబు[7]లఁ ద్వరితగతి నడపి భూపతి[8]ప్రేయసీజనంబుల [9]కధ్యక్షు లగువృద్ధకంచుకులం గలసి వారును దానును వారల నుచితప్రకారంబు[10]లఁ దేర్చి పురంబు ప్రవేశించు నప్పు డెదుర విదురుం గాంచి.

23 చ. అతఁ డడుగంగ శల్యసుబలాత్మజులుం బలమంతయుఁ రణ
క్షితిఁ [1]బడు టేర్పడం బలికి చెప్పి దురంగము డిగ్గి మేదినీ
పతి యొకరుండు పాఱుటయుఁ బాండవముఖ్యుఁడు ప్రీతిఁ [2]బంపఁగా
నతివల [3]నిల్లు సేర్చుటకు నై యిట రాకయు మానవేశ్వరా.

24 వ. అనిన విని యతండు శోక[1]వ్యాకులుం డగుచు నవ్వైశ్యాపుత్రుం బొగడి కాలో చిత[2]కృత్యం బాచరించి లెస్సచేసి తని [3]పలికి మఱియు ని ట్లనియె.

25 తే. [1]ఎప్పుడును సంజయుఁడు వచ్చి యెఱుఁగఁ జెప్పఁ
బతికి సమర[2]విశేషంబు [3]లతఁడు నేఁటి
తెఱగు చెప్పెడిఁ గాక యే తెంచి [4]మున్న
మనము వినిపింప గాఁ [5]దగ దనఘ [6]దీని.

26 వ. ఒండు[1]ముఖంబున నివ్వార్త నగరు సొరకుండునట్లు గా సంవిధానంబు సేయ వలయు [2]నీవు దుర్యోధను[3]ప్రియాజనంబులను దద్రక్షకులను దోడ్కొని

7. లతిత్వరితగతి — పెక్కు ప్రతులు. 8. ప్రియాంగనాజనంబుల — అ ఏ; ప్రియాజనం బుల - పెక్కు ప్రతులు. 9. కడనధ్య — ఐ గ. 10. నందెచ్చి, లందెచ్చి — అనియు పాఠములు.

23. 1. బడుట తఱిన్ — ఐ.గ. 2. నన్పఁగా — పెక్కుప్రతులు. 3. నట్లు చేర్చు టకునై — ఊ.

24. 1. వ్యాకులితచిత్తుండై యూత్తైవర్ణి కాంగనా — అ ఏ. 2. కృత్యంబాలోకించి — ఒ జ.త.వ. 3. పలికి విదురుండు మఱియు — అ.

25. 1. ఎప్పుడు సంజయుఁ డిటవచ్చి — ఐ గ చ. 2. విషయముల నతఁడు — ఐ.గ; నిశ్శేషంబులతడు - వ. 3. భంగి — శ. 4. మున్ను — వీ.శ.ష. 5. వలువ దనఘ, వలధనఘ — అనియు పాఠములు. 6. చరిత — ఘ.

26. 1. విధంబు, తెఱంగు — అనియు పాఠములు. 2. నిప్డు, నిట — అనియు పాఠములు 3. ప్రియాంగనాజనంబులను ప్రియస్త్రీజనంబును — అనియు పాఠములు.

భవదీయమందిరంబునకుం జనుము [4]తక్కటివారి నంతంత నడఁకువతో నిలువ నియమింప వలయు నని పలికి తానును యుయుత్సుండును సావధాన [5]ప్రయత్నంబున నవ్విధానంబు సంఘటించి నీతమ్ముండు పెద్దమొగసాలం జాలుమానుసులం గావలివెట్టి యభ్యంత[6]రంబు ప్రవేశిం[7]చి యుండె నక్కడఁ [8]గౌరవసేనాసన్నివేశం బత్యంతవిరళజనం బయ్యె [9]మున్ను మాతంగతురంగసుభటబృంహిత[10]హేషిత[11]భాషణంబులవలన శబ్దాంతరంబు గర్ణగోచరంబు గానియట్టియాశిబిరంబు [12]నిశ్శబ్దం బయి యుండె ననిన విని యాంబికే[13]యుం డిట్లనియె.

27 క. సూతసుత యిట్లు పగతుర
చేత మనబలంబు రాజసింహులు బంధు
[1]వ్రాతమ్మును సమసినఁ దుది
నేతెఱఁగున నడచితిరి నరేంద్రుఁడు [2]మీరున్.

28 వ. అనుటయు నమ్మహీకాంతునకు సంజయుం డిట్లనియె నంత నయ్యేడకుఁ గాంతేయులు సైన్యంబును దారును సుయోధనాన్వేషణపరు లయి రయంబున నరుగుదెంచుకలకలంబు వీతెంచిన.

29 క. కృతవర్మయుఁ గృపుఁడును గురు
సుతుఁడును గనుఁగొనుచు వొండుచోటికిఁ జని ర
ట్లతిరభసంబునఁ గుంతీ
సుతులచటికి వచ్చి నీదుసుతుఁ [2]బలుగడలన్.

---

4. తక్కిన — కొన్ని ప్రతులు. 5. పరిధాన యత్నంబున — ఐ.గ. 6. రమందిరంబు — పెక్కు ప్రతులు; రనివాసంబు — ఖ. 7. చెనక్కడఁ — పెక్కు ప్రతులు. 8. గౌరవపతిసేనా — ఆ.ఎ. 9. ముమ్మాఱు — వ. 10. హేషా — అ.ఏ. 11. భాషితంబుల — కొన్ని ప్రతులు. 12. నిర్జనంబయి, నిర్జనంబుగా, నిశ్చేష్టంబయి — అనియు పాఠములు. 13. యుండు సంజయునకిట్లనియె — ఎ.వ.

27 1. వ్రాతంబులు, వ్రాతమ్ములును, వారితంబును—అనియు పాఠములు. 2. మీరల్—ఎ.

29 1. నను — పెక్కు ప్రతులు. 1. నలుగడలన్ — కొన్ని ప్రతులు; నల్గడలన్ — ఇ.ఉ.

30 వ. అన్వేషించి కానమికి విషాదంబు నొందుచు మరలి చనిరి చనునప్పు డజాత శత్రుండు నీపుత్రునగరిలోనిజనంబులఁగృపతోడం గనుంగొని వెఱవకుండుఁ [1]డని పలికి చని యెనట్లు వారు నిజశిరంబునకుం జనుటయు మనయోధ వరులు నేను [2]మనంబున నడలు గదుర నమ్మడువుకడకుం బోయితిమి కృపాదు లగు మువ్వురు[3]దమరాక యెఱింగించి యమ్మనుజపతి కి ట్లనిరి.

—: కృపకృతవర్మాశ్వత్థామలు దుర్యోధనుఁగని సంభాషించుట :—

సం. 9—29—41

31 క. లెమ్మా కురునాథ కడఁగుము
వ మ్మొం గొని పాండుపుత్రమథనమునకు సై
న్య మ్మదియును నీచేతఁగృ
శ మ్మయ్యెడుఁ జుమ్మా వలదు శంకింపంగన్.

32 వ. అట్లు కాక గెలిచి భూమి [1]యేలుట యొండెఁ [2]జచ్చి నాకలోకసుఖం బనుభవించుట యొండె[3]గాని నీయట్టివాని కిట్టితెఱంగు కర్తవ్యంబు గా దని పలికిన విని యవ్విభుండు వారల కి ట్లని యె.

33 చ. తనువు ఘనాస్త్ర[1]శస్త్రములతాఁకున [2]నొప్పిని డప్పి వుట్టె నా
మనము వశంబు గా [3]కెడలె మాటల చందము సూడ మీరు డ
స్సినయటు లున్న వార లనుజీవులు లేరు తొలంగి నేఁటిమా
[4]త్ర నిలువుఁ డెల్లి [5]పైకొని యరాతుల గెల్తము లావు వచ్చినన్.

34 వ. [1]అనవుడు నగ్గురునందనుండు.

---

30 1. దనుచుంజనియె — పెక్కు ప్రతులు. 2. మనంబుల — పెక్కు ప్రతులు.
3. నవ్వసుమతీశునకుఁ దమరాక యెఱింగించి యిట్లనిరి — పెక్కు ప్రతులు.

32 1. గొనుట — ఊ.వ. 2. ఁగాదేనిచచ్చి — వీ శ.ష. 3. గాక — కొన్ని ప్రతులు

33 1. శస్త్రములు దాకిన — పెక్కుప్రతులు. 2. నొప్పునదప్పి — పెక్కు ప్రతులు.
3. కడలి, కడరి, దిపుడు, దెసల — అనియు పాఠములు. 4. తననిలుఁడెల్లి — ఘ.
5. గైకొని — అ.ఔ.చ. 6. గెల్తుము — వ.

34 1. అనవుడుగురు, అనుటయుగురు — అనియు పాఠములు.

35 ఉ. ఏ లనుమాన మేను సమయించెద [1]వైరము నేఁటి[2]తోడఁ బాం
చాలుర [3]నెల్లఁ దీవ్రశరజాలములం [4]బొలియించి కాని భూ
పాలక పుచ్చుఁ గత్తశము పాటిగఁ బట్టుము నాదుమాట లి
య్యాలితనంబు [5]వాపెదఁ బ్రియం బొనరించెద నీకుఁ దండ్రికిన్.

36 వ. [1]అనియె నప్పు డనిల[2]సుతుని వేఁట[3]కాఁడులు మాంసభారంబులతోడఁ బరి
శ్రాంతులై జలపానార్థం బమ్మడువునకు వచ్చి రంతకుమున్ను ధర్మనందనుం
డొక్క బోయం[4]బొడఁగని దుర్యోధనుండు [5]దొలఁగెం జెట్టుచేమల నడంగి
యుండునో మీరు [6]మెలంగు నెడల నరయ వలయు ననిన [7]వాఁడును
వృకోదరునిమృగయులలోనివాఁ డగుటఁ దమవారికి నెదురు వోయి
యమ్మాట తెఱం గెఱింగించుటం జేసి యప్పని మనంబులం దున్నట్టి
యాబోయ లట్లు కెలన నేమరి సల్లాపంబులు సేయు చున్న యన్నర
నాథునియారథికవరుల వచనంబులు విని పూర్వాభ్యాసంబువలన నయ్యుక్తి
ప్రత్యుక్తులపరిపాటి దేటపడిన నన్నిటితో నీకొడుకు డాఁగి [8]యుంట
నిశ్చయించి తమలో మెల్లన ని ట్లనిరి.

37 క. ఈ రథికులు తను నిమ్మోయిఁ
బోరెకిఁ [1]దఱుమంగఁ దాను బురికొన కిచటం
గౌరవపతి డాఁగి[2]నగతి
[3]బోరనఁ జని చెప్పవలయు భూనాథునకున్.

---

35 1. వైరుల — ఏ ఐ.గ.ట.న. 2. తోన — ఎ. 3 నెల్లితీవ్ర — ఉ. 4. సమయించి, పోఁవుచ్చి, బోరియించి - అనియుపాఠములు. 5. నాఁపెద—వ; ఁబాపెద - కొన్నిప్రతులు.

36 1. అనునప్పుడు — పెక్కుప్రతులు. 2. తవయు, నందను — అనియు పాఠములు. 3. కాఁడ్లు, కాండుర్రి అనియు పాఠములు. 4. గనుంగొని—అ.ఊ ఓ. 5. సమరంబున విరిగి తొలంగినవాఁడు కాననంబునం జెట్టుచేమలలో నెందేని—అ.ఏ. 6. దాఁగియున్న వాఁడో నీవు గహనసంచారుండవునీవు మెలంగిన యెడల — అ.ఏ. 7. వాఁడును నబ్బోయకెఱింగించిన — ఏ. 8. యునికి — పెక్కుప్రతులు.

37 1. ఔలువం — అ. 2. యునికి — పెక్కు ప్రతులు. 3. భోరున — కొన్ని ప్రతులు.

38 తే. అతఁడు పసదన [1]మొసఁగు మారుత[2]తనయుని
మున్ను గని మెచ్చు వడయుద మన్న రేంద్రు
నతఁడ కాన్పించు మనల రయమునఁ బోవ
వలయు మాంసభారంబులు [3]వలదు [4]లెండు.

39 వ. అని [1]మోపులు డిగవిడిచి వెసం బాఱి రయ్యవసరంబునఁ [2]బాండునందనులు సీనందను వెదక ననేకచారులం బోలికలని కెలంకులకుం బుచ్చి యాతండు తమ కగపడమికిఁ జింతాక్రాంతులై యుండ నాబోయలు [3]భీమునిపణిహారులఁ ద్రోచి[4]కొనుచుం దన్మందిరంబు దఱియం జొచ్చి యతనిం గాంచి యమ్మడువున [5]నమ్మహీపతి డాఁగి యునికి యెఱింగించి.

40 క. తమవిన్న మాట లన్నియుఁ
గ్రమమునఁ [1]జెప్పిన నతండు గడుఁ బ్రియమున న
ర్థము లొసఁగె వారికి ననే
కములు[2] వహింపంగఁ గోలఁదిగా కుండంగన్.

41 వ. ఒసంగి యాలుబ్ధకుల నగ్రజుఁ గానిపించి దేవా [1]దుర్యోధనుండు ద్వైపాయనహ్రదంబున [2]నొక్కఁడు ద్రవిద్యం జేసి [3]జలంబులు నిజశరీరంబు సోఁక కుండునట్లుగాఁ జేసికొని డాఁగియున్న వాఁడు వీ రెఱింగి వచ్చిరని యతనికి విన్నవించి యా[4]సుయోధనగురునందనాదులసల్లాపంబు లెఱిఁగించిన నతండు పరమహర్షంబున నాబోయలకు[5] బహువిధంబు లగు పసదనంబు లిచ్చి తక్కినతమ్ములకును గృష్ణునకుఁ [6]జెప్పికొని [7]వారును సకలబంధుమిత్రపరిజనంబులును దోడన చనుదేర నుద్దామగమనంబున.

---

38 1. మిచ్చుమారుత — క. 2. తనూజుమున్ను — పెక్కు ప్రతులు. 3. వైచి—ఎ.ఓ. 4. రండు, నేఁడు - అనియు పాఠములు.

39 1. మాంసభారములు డిగ — అ. 2. పాఁడురాజనందనులు — చ. 3. భీమసేను — ఏ.ఒ.చ. 4. కొని యతని మందిరంబు — వీ.శ.ష. 5. కురుపతి — అ.

40 1. నెఱిఁగింప — జొ. 2. లగు భాగములుకోలఁది — అ.

41 1. సుయోధనుండు — ఆ.ఎ. 2. నెందేనియొక్కఁడుద్ర — పెక్కు ప్రతులు. 3. జలంబులు నభిమంత్రించి — అ.ఏ. 4. సుయోధనాదుల — పెక్కు ప్రతులు. 5. కుపసదనంబుచ్చి — కొన్ని ప్రతులు. 6. నవ్వార్త యెఱుంగఁ జెప్పి — అ.ఏ. 7. కదిలి — పెక్కు ప్రతులు.

42 తే. తురగఖురపుటరథనేమికరిపదాతి
ఘట్టనంబుల నేల గ్రక్కదల శంఖ
పణవనిస్సాణకాహళరణన మెల్ల
[1]దెసలఁ బరఁగంగ వచ్చె నద్దెసకు నధిప.

43 వ. అట్లు ధర్మ[1]నందనుం డేతెంచుకలకలం [2]బాలకించి యంతకమున్న రణో త్సాహంబునకై రాజు [3]నిర్బంధించుచున్న యగ్గురుపుత్రకృతవర్మ లతని[4]తో ని ట్లనిరి.

44 మ. ధరణీనాయక పాండు[1]పుత్రులు సముద్దా[2]మోద్ధతిన్ వీరె వ
చ్చిరి వీరిన్ వడిఁ [3]గిట్టి తాఁకఁదమె నీచిత్తంబు పోరాటకుం
జొరదే నిప్పటికిం దొలంగి చని యెచ్చోనైన నేముఁడి చె
చ్చెర రూపించినవేళఁ [4]జెప్పె నెడకుం జేరంగ నేతెంతుమో

45 ఆ. [1]అనుడు నానృపాలుఁ డయ్యోధవరులతో
నిప్పు డనికి నుత్సహింప కెచటి
కేనిఁ దొలఁగిపోయి యిచటికి మగుడంగ
రండు పగలు [2]సనిన రాత్రి [3]యగుడు.

46 వ. వారు వారణపురంబున కనివారణఁ [1]బో నెదురు వోవుదురుగాక యిచ్చేరువఁ బోయిరేనియు నిమ్మడువున [2]నాయునికి యెఱుంగలే రట్లు గాక యెఱింగిరేనియు నన్నుఁ జేరరాదు మదీయవిద్యా[3]విశేషసంస్తంభి

---

42 1. దిశలఁ — అ.ఉ.ఒ.ఔ.క.ట.త.

43 1. తనయుం — ఓ. 2. బాలించి — పెక్కు ప్రతులు. 2. నిందేర్చుచున్న — ఆ. 3. నికిట్లనిరి — పెక్కు ప్రతులు.

44 1. సూనులు — పెక్కుప్రతులు. 2. మోగ్రతన్ — ఇ; మోన్నతి — ఐ.గ. 3. దాకి పోరుదమొ — పెక్కు ప్రతులు. 4. నుండియుటకున్ — అ.

45 1. అనిన — ఊ.చ. 2. వోయిరాత్రి — పీ.శ.ప. 3. యందు — క.ఖ.జ.

46 1. బోయెదరుగాక — పెక్కుప్రతులు. 2. నేనునికి — పీ.శ.ప. 3. విశేషసంభితాం —

రాంభో[4]దుర్గంబున నిర్భయుండ నై యుండెదఁ బొం డనినం బొగులు మనంబులతోడ నారథిక[5]జనంబులు వోవం బతి జలంబులు శిలాసదృశంబులు గాఁ బరి[6]స్తంభించె నేనును బాండుసూనుల చారు లెల్ల కడల మెలంగుట జేసి రాజు నప్పుడు వెలువరించుట కర్జంబు గా దనియు నతనితోయ [7]స్తంభవై దగ్ధ్యం బెఱుంగుట నొలసినయీఅటనుముందటియట్ల వారల తోడం జని చని చిత్తంబు గలంగినం జాలక యరదంబు డిగ్గి [8]యచ్చట నొక్కయెడ నొదిఁగి నిలిచెద నని వారలకుం జెప్పి యమ్మడువు [9]వఱుత నొక్కపఱపు [10]గలపొదయీఅమిం దూఱి పొంచియుండితి వారలు దూరంబు నని యొక్కవిపులవటంబు[11]పొంత విశ్రాంతి నొంది [12]నీనందను వలనికిం జనినవ్హృదయంబులతోఁ దదీయకార్యచింతాభరంబు పట్టుకొనఁ దదనుబంధసంభాషణంబులు సేయు చుండిరక్కడ.

47 క. కలకల నవ్వుచుఁ [1]బొలుచం
బలుకుచుఁ దమకెలఁకులందుఁ బాంచాలకుమా
రులు సనుదేరఁగఁ బాండు సు
తులు [2]వచ్చిరి సంతసంబు[3]తో మడువునకున్.

48 వ. ఇట్లు వచ్చి [1]ధర్మ[2]తనయుండు భవత్తనయమాయా స్తంభితం బైనయాజలా శయంబు నిరూపించి తత్ప్రకారం బెఱింగించి యచ్యుతునితో నల్లన నిట్లనియె.

---

పెక్కు ప్రతులు. 4. గర్భంబున — అ ; దుర్గమంబున — త. 5. వరులరుగఁ గురుపతి — వీ శ.ప. 6. స్తంభించుఁ గొనియెనంత నేనును - అ.ప.ఖ. 7. స్తంభవై దగ్ధ్య — పెక్కు ప్రతులు. 8. యాచ్చకటి — పెక్కు ప్రతులు. 9. సరస — ఆ. 10. గలిగియువ తాళించు పొదరిల్లు దూరిపొంచి (కొని) యుండితి — అ.ప.ఖ. 11. క్రింద — ఊ.ఒ ఘ 12. రారాజువలనికిఁ — ఐ.గ.

47 1. బెలుచం — కొన్ని ప్రతులు ; నుబ్బుచు — ఐ.గ. 2. చనుదెంచిరి ముదంబుతో — అ.ప ; చనుదెంచిరి సంతసంబుతో - ఖ. 3. తోడనరేంద్రా — ఓ.

48 1. భవత్తనయుండు - ప.ఘ. 2. నందనుండు, సూనుండు - అనియు పాఠములు.

49 క. చొర రాదు మనుజులకు నె
వ్వరికిని [1]నిజ్జలము కౌరవక్షితి[2]పతి ని
ర్భరమాయా[3]సంరక్షా
[4]భరితం బై కాన వీతభయుఁ డాతండున్.

—: ధర్మరాజు మడుగున డాఁగియున్న దుర్యోధనుని దూఱనాడుట :-

సం. 9-30-6

50 క. అని వెండియు [1]నాపతి గురు
జననాథుగురించి పలుకు శక్రుఁడు దోడై
చనుదెంచెనేని పో వ
చ్చునె నాచేఁ దప్పి [2]యిందుఁ జొచ్చినఁ [3]దనకున్.

51 వ. అనిన విని యచ్యుతుం డతనికి నల్పస్వరంబున ని ట్లనియె.

52 ఉ. మాయలు గల్గు[1]దుష్టులకు మాయపుఖంగులె మందు గాక ని
ర్మాయత నుల్లసిల్లెడు పరా క్రమ[2]లీలలు [3]గొల్చు నెట్లు దై
తేయులు దొల్లి మాయల నతిప్రబలాత్మకు లైనఁ దద్విధో
పాయములన్ జయింపరె నృపాలక విష్ణుఁడు నింద్రుఁడుం దగన్.

53 వ. హిరణ్యకశిపు వృత్రవధప్రకారంబు వినమె రావణుండు హోమాదిమాయా క్రియావిఘాతంబునఁ గాదె రాము చేతనిర్జింపం[1]బడె నరకాసురు నేను బరిమార్చిన తెఱం గెఱుంగవే వీఁ డగపడునట్టివిధంబు చూచికొ మ్మనిన విని యప్పాండవాగ్రజుండు జలాంతర్గతుం డై యున్నభవన్నందను నుద్దేశించి యిట్లనియె.

---

49 1. నిమ్మడువు-వీ శ.ష 2. వరుఁడు దుర్భర — ఐ. 3. సంరక్షణ 4. పరిణత మటుగాన, సంరక్షణ పరిణత మైగాన — అనియు పాఠములు.

50 1. నిట్లనునర్జునపతికురునాథుఁ గురించి శక్రుడు దోడై - ఎ.ఐ. 2. యెందునొచ్చి-పెక్కు ప్రతులు. 3. నైనన్ - ఏ.

52 1. శాత్రవుల — ఒ ; దుష్టకుని — ఐ.గ. 2. ఖంగులఁగొల్పు — అ.ఓ ; వంతులు గోలుపోరె - త. 3. చెల్లు, గొల్పు, గెల్వు — అనిపాఠములు.

53 1. బడియె — పెక్కుప్రతులు.

54 చ. ఇటు తగునే సుయోధన మహీవలయంబున నిట్టిదైన్య మె
చ్చట విన జూడ [1]గల్గెనె యసంఖ్యులు రాజులు నీకుఁగాఁగఁజ
చ్చుటయును బంధు[2]మిత్రులు విశుద్ధచరిత్రులు [3]పోర నట్లు త్రుం
గుటయును [4]జూచి [5]తేమిటికిఁ గ్రుంకితి నీళ్లను జావు దప్పునే.

55 ఉ. శూరుఁడ వంద్రు [1]నిన్ మడువు సొచ్చుట [2]శౌర్యముచొప్పె మాన మే
యూరికిఁ బోయె [3]నాజి నృపు లోడుదురే నృపుఁ డన్న మాత్రయే
కౌరవవంశజాతుఁడవు గష్టపుఁ[4]జచ్చుట దెచ్చుకొంటి నీ
పేరును బెంపు [5]మాలి యరిబృందము [6]నవ్వఁగ [7]నిట్లు సేయుదే.

56 తే. క్షత్త్రధర్మంబు [1]విడిచినఁ గలదె యిహము
బరముఁ బేరోలగంబునఁ బలుకుపలుకు
లెల్ల మఱచితె విను మని [2]పొల్లు లైనఁ
గష్ట[3]పాటు గా [4]కుసు ఱేల గావ వచ్చు.

57 చ. కొడుకులు దమ్ములుం గలన ఘోరపుఁజావులు సావఁ జూచి యె
[1]ట్లోడఁబడె నీదుబుద్ధి యొడ లోముటకై నిను రాజరాజ యి
మ్మడువున [2]కిడ్చి తెచ్చె [3]విధి మానము ప్రాణముకంటెఁ జాల నె
క్కుడగుట సెప్పఁగా విననొకో కడునీచతఁ బొంది తక్కటా.

---

54 1. గల్గునె — ట; గంటిమె — చ. 2. మిత్రులును సూనులును గోత్ర — చ. 3. నట్లుపోర — ఆ.ఎ.ఓ. 4. పోరి - ఇ ఉ. 5. రేమిటను — అ.ప ఖ.

55 1. నిమ్మడువు - ఈ.ఊ.ఔ.ద.ల — నిన్ + మడువు — అనుచోన్'కు పరసవర్ణము వచ్చి ఈరూపమేర్పడినట్లున్నది. 2. మానము చొప్పె — చ; బుద్ధితలంపె — త. 3. యిట్టి — చ; నాడి — వ. 4. ఁజావును — పీ; ఁజావిటు — అ.ప.ఒ.ఖ. 5. దూలి యరి - వ; దూలనరి - ఆ.ఎ; గూలనరి — ఐ.గ. 6. గప్పఁగ — జ. 7. నింత సేయుదే - ఐ; నీరుసొత్తురే — ఊ.

56 1. వీడినఁ గలదె — ఐ.గ. 2. పొల్ల - పెక్కు ప్రతులు. 3. పాటదిగాకసురలకుఁ గావ వశమె - ఇ. 4. కేటికి ఘనతవచ్చు — అ.ఖ; కేటికిఁ గలుగు సుఖము - ప; కసు వేలగావవచ్చు - ట.

57 1. ట్లోడఁబడి తీవు - చ. 2. కిట్లు - ఐ. 3. మును - ఎ.ఒ.ట.

58 శా. అంభో[1]గర్భము సొచ్చి పాండుసుతబాహా[2]గర్వదుర్వారసం
రంభం [3]బోర్వక డాఁగి [4]యుండె నట రారాజిప్పిరో [5]చచ్చుచో
గాంభీర్యంబును [6]ధైర్యముఁ బిడిచి దోర్గర్వంబు [7]బెండయ్యెనే
శుంభ[8]న్మానము [9]దూలెఁ గా కని జనస్తోమంబు [10]నిందింపదే.

59 తే. కర్ణశకునిదుశ్శాసనుల్ ఘనులు గాఁగఁ
దలఁచి వారలఁ గొనిమమ్ము గెలుచువాఁడ
వై మనంబున శంకింప కట్టు కీడు
చేసి తా[1]తూఁపు దప్పిన గాసి యైతి.

60 వ. నీకొలంది [2]గంటి మగపడితి వింక [3]నెందుఁ బోవచ్చు నని[4]మఱియు నిట్లనియె.

61 మ. భయముం [1]బాయఁగఁ ద్రోచి [2]వీరగుణముం బాటించి సంగ్రామని
శ్చయబుద్ధిం దలకొల్పి పౌరుషము[3]మైఁ జా వొండె గెల్పొండెఁ గా
క యధీరత్వము [4]నాకు [5]నీడె యని వీఁకం బేర్చి [6]వే తాఁకు మెం
తయుఁ బేరయ్యెడు రమ్ము లె మ్మొదిఁగినన్ దైన్యమ్ము [7]వచ్చుం జుమీ.

---

58 1. మధ్యము — ఔ. 2. దర్ప — చ. 3. బొప్పక - జ. 4. పోయె — ఘ.చ. 5. నిట్టిచో — చ. 6. శౌర్యమున్ - ప. 7. చేరయ్యెనే — ఊ. 8. న్మార్గము—చ. 9. గూలె - ట. 10. నిందింపరే - ఉ.ఐ.గ.ట.

59 1. పూన్కి - ఖ.వీ.ష ; ప్రాపు - గ.ఘ ; పూపు - కొన్ని ప్రతులు.

60 1. నీకొలఁదింతటి దని గంటి మడుగు నంబడి యగపడితింక నెక్కడం బోయెదవనిపల్కి వెండియు - చ. 2. గంటిమొంటినగ - అ.ఏ. 3. నెక్కడ - అ.ఊ. 4. పలికి వెండియు- కొన్ని ప్రతులు.

61 1. బారఁగ — అ.ఊ.ఎ.ఏ.చ. 2. ధర — వ. 3. చే — ఒ.ఖ.జ. 4. వీరత్వము — ఇ.ఉ. 5. నిందయని — అ.ఎ.ఏ ; నిట్టిదని — ఔ.క ; నేవెయని — ఘ.త ; నేలయని — చ. 6. పోరాడు — ఐ.గ.వ.వీ.శ.ష. 7. చిక్కుంజుమీ - ఖ.

62 చ. అని [1]మము నోర్చినం బృథివి యంతయు నేలఁగ వచ్చు [2]నీవుచ
చ్చిన [3]సురసద్మ[4]సౌఖ్యములు చేకుఱు రెండుదెఱంగులందు [5]నొ
ప్పనియది లేదు [6]డాఁగ నగుబాటును బ్రాణము[7]చేటుఁ [8]దెచ్చుకోల్
[9]విను మము నీ వెదుర్పఁ దగు వేయువిధంబులఁ జాటి [10]చెప్పెదన్.

63 వ. తెంపు చేసి [1]మామీఁద నుఱుకుట నీకు [2]ధాత నిర్మించినపరమధర్మంబు [3]పురుషుండ వైతేని దీని ననుష్ఠింపు మనిన వినియవ్వసుమతీ[4]శునకు సుయోధనుం డిట్లనియె.

–: దుర్యోధనుఁడు నీరిలోన యుండి ధర్మజున కుత్తరం బిచ్చుట :–

సం. 9-30-35

64 సీ. నరుఁడు ప్రాణభయంబుఁ బొరయుట యరు దయ్య
విను‌ము తెల్లంబుగా మనుజనాథ
రథవాహసారథిరహితుండ [1]నగుటను
బాణాదిహేతిసంపదలు లేమిఁ
బరివారశూన్యత వాటిల్లుటను బంధు
మిత్రసహాయులు[2] మిడి యడంగఁ
జచ్చుట[3]యునుబోట్ల నొచ్చి మేనును డప్పి
గూరి [4]చిత్తంబును బోరి కెలయ

---

62 1. మొన – క. 2. నీవు పెక్కు ప్రతులు ; లేక – వా.వీ.శ. 3 పరలోక – ఘ ; సురలోక – వ. 4. సౌఖ్యమును – అ.ఎ.ఒ ల. 5. నొవ్వని – చ. 6. డాఁగి – పెక్కు ప్రతులు ; దాఁగి – ఐ.ఔ.త. 7. జెట్టి – చ. 8. దెచ్చుటఁ – ఇ. 9. విను మెదిరింపఁగాఁ దగును – అ.ఓ ; వినుమటులెమ్ము – కొన్ని ప్రతులు. 10. చెప్పితిన్ – కొన్ని ప్రతులు.

63 1. నామీఁద – అ.ఎ. 2. విధాత – ఉ.ఊ.ఔ.న.వ. 3. పౌరుషుండవై – కొన్నిప్రతులు. 4. పతికి – ఎ.

64 1. నైధనుర్బాణాది – ఖ.ఘ.చ.ల. 2. లమ్మోయినడంగి (గ) – త.ల.వీ.శ.ష. 3. యునుబోట్ల – పెక్కు ప్రతులు ; టఁబోటుల – వా.శ.వ. 4. చిత్తంబున –

తే. కునికిఁ [5]జేసియుఁ [6]దొలఁగితి నొదిఁగి సేద
[7]దేర్చుకొని [8]రణమునకు[9] నుదీర్ణవృత్తి
వచ్చువాఁడను[10] [11]నీవు మీవారు విశ్ర
మింపుఁ [12]డంతకు మఱిరండు [13]సొంపు [14]సూప.

65 వ. అని పలికినఁ బాండవాగ్రజుండు.

66 క. ఇందాక విశ్రమించితి
[1]మిందు నినుం దడవి కంటి మిప్పు డిచట నీ
కుం దేఱ డప్పి కురుపతి
నందన ర మ్మింక రణమునకు నాయిత మై.

67 వ. అనుటయు.

68 తే. ఎవ్వరికిఁ గాఁగ రాజ్యంబు [1]నెల్లభోగ
ములును గోరుదు [2]రక్కుమారులు ను[3]నాదు
తమ్ములును లేరు తురగ[4]రథ[5]ద్విపప్ర
హీన [6]యయ్యె నీక్షోణియు నేల పెనఁగ.

69 చ. ద్రుపదతనూజులన్ గెలిచి దోర్బలసంపద నుల్లసిల్లి మి
మ్మపు[1]జితదర్పహీను లగునట్లుగఁ జేసి సమస్తభూపతి
త్వ[2]పదము గఁటినేనియు వృథా[3]రభసం [4]బది యింపు గాదు క
ర్ణుపడుట భీష్మ[5]లేమిని గురుండు [6]మృతుం డగుటన్ ధరాధిపా.

---

కొన్ని ప్రతులు. 5. జేసితి—అ. 6. ఁదొలఁగియు—అ.ఐ.శ. 7. దీర్చి—ఎ.గ ద.న.ట వ. 8. యుద్ధకయ్య—అనియు పాఠములు. 9. నత్యుదీర్ణ—ఘ.చ.ల. 10. నైతీవు—పెక్కు ప్రతులు. 11. మీరు—అ.చ ల. 13. డుండకమఱి, డందాకమఱి, డేగుటగని—అనియు పాఠములు. 13. తెంపు — అ.ఏ; పెంపు — త. 14. మీర — ఊ ఒ.చ.వ.

66 1. యెందుల నినువెదకి — అ; యెందునునినుదడవి — పెక్కు ప్రతులు.

68 1. లీసు — అ; తెల్ల - వ.శ. 2. నక్కు, నాకు—అనియు పాఠములు. 3. దారు—ఏ. 4. రథాలి పొలిసెనింక నిలమీఁదిభ్రాంతికై యేలపెనఁగ—చ. (ఈ పాఠమున మూఁడవ పాదమున అఖండయతి చెల్లుచున్నది). 5. ద్విరదము—ఘ.ల; ద్విరద విహీన—గ.ట.శ; ద్విపభట—అ.ఒ జ.వీ ష. 6. మయ్యె—పెక్కు ప్రతులు. 7. కి — పెక్కు ప్రతులు.

69 1. హృత, చిత, గత, హత, జయ — అనియు పాఠములు. 2. పదవి - పెక్కు ప్రతులు. 3. విరసం — ఏ. 4. బనమ్ము లేదు — వీ.శ.ష.స. 5. లేమియు — అ.ఏ శ. 6. మృతుఁడౌటను ధారుణీశ్వరా — ఐ,గ.

70 క. తనవారుఁ [1]దానుఁ [2]గూడఁగ
నను భవసుఖ [3]మందఁ[4]డేని యది రాజ్యమె రా
జునకు భవత్పరిజనములు
ననుజన్ములు బ్రదికి రేలు మఖిలధరిత్రిన్.

71 క. ఏ నింక సమరమొల్ల మ
హీనాయక[1]నీక యుర్వి నిచ్చితి శాంతిం
[2]గానకుఁ జని వల్కలపరి
ధానుఁడ నై [3]తప మొనర్చెదను [4]మునుల[5]కడన్.

72 ఆ. ఓడి [1]వచ్చినాఁడ నుద్ధతి నా కేల
యుడుకు [2]మాని [3]నీవయుర్వి యేలు
గుఱ్ఱములును నేనుఁగులు లేనిబయలు [4]నీ
తలనె [5]కట్టికొనుము ధర్మతనయ.

73 చ. అన విని [1]యన్నరేశ్వరుఁడు హాసము[2]తో నతనింగుఱించి యి
ట్లనుఁ దనుజానుజన్మసుహృదాప్త[3]సహాయులు సన్నఁ గాదె శ
ల్యునిఁ గొని మమ్ము గెల్చి సకలోర్వియు[4] నేలుట కుత్సహించి తీ
[5]పనువుట లేల మాను మిది పాటిగఁ బట్టుము [6]లెమ్ము పోరికిన్.

---

70 1. దారు — ఆ.చ; ఁన్ను — ఊ. 2. గుడువఁగ — వ. 3. మందితేని — న. 4. లేని — కొన్ని ప్రతులు.

71 1. యుర్వినీకునిచ్చితి — అ.ఇ; యుర్వినీకయిచ్చితి — ఉ; యేలుమర్వియిచ్చితి — కొన్ని ప్రతులు; నీకురాజ్యమిచ్చితి — వీ.శ.ప. 2. గావలలోవల్కల — చ. 3. తపముసలిపెదను — వీ.శ.ప. 4. మునివృత్తిన్ — ఐ.గ. నెడన్ — ఆ; లోద్దన్ — శ.

72 1. యిచ్చినాఁడ — క. 2. మాలి — పెక్కు ప్రతులు. 3. నీవుపుడమి — పెక్కు ప్రతులు. 4. నీతలన(ను)కు — కొన్ని ప్రతులు. 5. గొట్టు — కొన్ని ప్రతులు; జుట్టు — జౌ.

73 1. యమ్మహీశ్వరుఁడు — ఆ.ఎ.ఓ.త.ద.వ; యన్నరేశుఁడతి — శ. 2. తోఁగురు నాథులోడ — జౌ. 3. జనంబులు — త.శ. 4. నేలఁగను — ఆ.ఎ.ఓ.వ. 5. వనటర లెల్ల — ఇ.ఉ; పనపుటలెల్ల — కొన్నిప్రతులు; పనుపుటమాను తెల్లమిది — జౌ. జౌ. 6. రమ్ము — వీ.శ.ప.

74 సీ. నీ[1]యీఁగి [2]నేను భూ[3]నాయకుండగు టొల్ల
రాజకోటికిఁ [4]బరిగ్రహము [5]సమనె
నిను ననిం దెగటార్చి [6]నేలఁ బాలించెద
నను [7]నోర్చితేని [8]పెంపున సుఖంపు
మేమిటివాఁడ వై యిచ్చితి పుడమి నీ
కని యెడు మాట [9]యిట్లాడె దిపుడు
[10]నీవు ధరిత్రి యీనేర్చినఁ గురుకులం
బునకు[11] ని ట్లాఅడిఁ [12]బోవ నేల

తే. శాంతి నొందుటకై ధర్మసంవి[13]భాగ
కరణ మొనరింప వచ్చినకమలనాభు
వాక్యవృత్తిఁ బాటింపక వాఁడిసూది
మోపి[14]నంతైన [15]నుర్వి యీనోప నంటి.

75 క. ఏమివిధంబునఁ [1]బొరలియు
భూమి కురున్నృపాల నీకుఁ బుచ్చుకొనఁగ రా
కీ మెయి దైన్యపడితి[2]నా
కేమార్గము వట్టి యిచ్చె దేర్పడఁ జెపుమా.

76 క. అరులకు సిరి యిచ్చి నను
వెర[1]విడియుం గలఁడె దీని విడువుము నాకుఁ
ధర యిచ్చి తేనియును నినుఁ
బొరి[2]గొన కే వి[3]డువ నటిమి పోరుట యొప్పున్.

---

74 1. యీవి—ఒ.ఔ.చ.జ.ల. 2. యేను — గ. నేధరణీశుఁడనగుటొల్ల — జ. 3. నాయక దగనొల్ల — గ. 4. బతిగ్రహము — కొన్ని ప్రతులు. 5. సన్నె — కొన్ని ప్రతులు 6. నేనె — చ. 7. గెల్చి — అ. 8. పెంపనుభవింపు — చ. 9. యిట్లాడితీవు — పీ.శ.ష ; యెట్లాడెదీవు — ల ; యిట్లాడితిపుడు — అ ప.ఐ.ఖ.చ. 10. నీవధరిత్రి — కొన్ని ప్రతులు ; నీవనాకిచ్చుటనిజమైన — ద ; నీపిధరిత్రి — ఆ. 11. కిట్టులాఅడి — ఊ.ఎ. 12. బొంద-వ.పీ.శ.ష, బొందు-జ.గ. 13. ధాన—పీ.శ.ష.స. 14. నంతయు — కొన్ని ప్రతులు. 15. భూమి, నేల, పుడమి — అనియు పాఠములు.

75 1. బోరియు — ఔ.ట.న.వ. 2. గాకే — ఊ.ఘ.

76 1. వెద్దియు, విదియు — అనియు పాఠములు. 2. గొనియెదఁ గాక బ్రతికి పోనిచ్చెదనే — శ. 3. విడువంగడిమి పోరుట — ఇ ; పుడమియెల్లఁబోరుట — ఔ.

77 క. నాచే నీ[1]ప్రాణంబులు
నీచే నా[2]జీవితంబు నిజ మున్నవి యి
న్నీ చత యవకార్యము రా
జోచిత[3]కర్మకృతనిశ్చ[4]యుఁడ వగుము నృపా.

78 వ. అని వెండియు నిట్లను జతుగృహంబు దహించితి పాములం గఱపించితి నీటం ద్రోయించితి విషాన్నంబు వెట్టించితి వెన్ని కపటోపాయంబులు సేసినను నీచేతఁ జెడక యునికి యెఱుంగవే యింక నట్లి యమ్మాయలం బ్రయోజనంబు లేదు.

79 క. లే లెమ్ము బిరుద వైర
మ్మాలమునకు నీవు నెఱుఁగు దవ్విధము కడుఁ
మే [1]లొందు [2]తెరవు లే దిం
కేల యొదిఁగి కష్టపడ నరేశ్వర [3]చెపుమా.

80 వ. అని యివ్విధంబున [1]నమ్మనుజేంద్రుండు మఱియుం బలుకఁ బెఱవారు నట్ల పలికి రనిన విని ధృతరాష్ట్రుండు.

81 తే. ఇట్లు[1]జంకింపఁబడి మఱియేమి సేసె
నాతనూజుండు [2]మున్ను నెన్నఁడును [3]జంకఁ
బడినవాఁడు గాఁ డక్కట పుడమి నాల్గు
నెఱఁగు[4]లును వెఱఁ దన[5]పంపు సేయ బ్రదికె.

---

77 1. ప్రాణంబును — కొన్నిప్రతులు. 2. జీవనంబు — అ. 3. కృతకర్మ — కొన్ని ప్రతులు. 4. యుండవుగమ్మి — ఘ.

79 1. లొందు — పెక్కుప్రతులు. 2. తెఱఁగునీకింకేల — వీ.శ.ష.స. 3. నికున్ — పెక్కు ప్రతులు.

80 1. నన్నరపతి పలుకఁబెఱవారు — వీ.శ.ష.

81 1. ఝుంకింపఁ — శంకింపఁ — అనియు పాఠములు. 2. ముందరె — పెక్కు ప్రతులు. 3. ఝుంకె — కొన్నిప్రతులు ; జంకె — క.ఖ. 4. తెల్లను — వీ.శ.ష. 5. వలపు—వ.

82 క. పరిజనహీనత దీనతఁ
బొరసినయెడ ముట్టుకొని రిపుప్రకరము ని
ష్ఠురవాక్యమ్ముల [1]నమ్మెయిఁ
బరితాపము సేయ నేమిభంగి[2] నిలిచెనో.

83 వ. అనుటయు సంజయుం డమ్మనుజపతి కిట్లనియె నట్లు ధర్మతనయుండును దమ్ములుఁ [1]గొడుకులును ద్రుపదపుత్రులును [2]బొదువుకొని [3]పలుకుపరుసని పలుకులకుఁ జిత్తం బుత్తలపడ నాననంబు [4]పల్లటిల్లఁ గరంబులు [5]విదిర్చి దురం బొనర్చువాఁ డై యప్పాండవాగ్రజున కిట్లనియె.

84 సీ. [1]మీ రేవురును బరివారబాంధవమిత్ర
సహితుల రఖిలాస్త్రశస్త్రవంతు
లరు కరిస్యందనతురగసమేతుల
రేనొకరుండ విహీనసహాచ
రత్వంబు విగతాయుధత్వంబు [2]వాహన
[3]హీనత నొందితి నేవిధమున
నని [4]యొనర్పఁగ వచ్చు నది గాక [5]పోటుల
డస్సితి గడు మీకు డప్పి లేదు
తే. వరుసఁ [6]దగ నొక్కఁడొక్కఁడ వచ్చి పోరుఁ
[7]డిపుడ వెడలి మిమ్మందఱ నెల్ల [8]చెలులఁ
జుట్టముల రూపుమాపెదఁ [9]జుట్టుముట్టి
పలువు [10]రొక్కనితోఁ బోరఁ బాడి యగునె.

32 1. నిమ్మెత్రె — కొన్ని ప్రతులు. 2. భంగి బ్రతికెనో — వీ.శ.ష; భంగినొదగెనో — ఎ.ఓ.వ ; భంగినినిలిచెన్ — అ.ఈ.ఊ.న.వ.

83 1. గొడుకులును — పెక్కింటలేదు. 2. బొదివికొని — పెక్కు ప్రతులు. 3. పలుకు పలుకులకు — వా. 4. పల్లటిల్లమాననంబుదూల — ఔ.ఖ.ట.త.న.వ. 5. విదుర్చుచు — ఊ.ఘ.చ.వ.

84 1. మీరలేవురు—ఖ ఘ.త.వ. 2. వాహనాభావంబు — పెక్కు ప్రతులు. 3. హీనత్వ మొందితి — అ. 4. నోర్వవచ్చు మిమ్మదిగాక — ఎ.ఓ.వ. 5. పోట్లను, పోట్లాడి, పోట్లాడ — అనియుపాఠములు. 6. గద — ఊ.ఔ ; వెస — ల. 7. డరిమురిగ జెదర మిమ్ముననందరను చెలులఁ — చ. 8. జనులఁ, బలము, పెలుచ — అనియు పాఠములు. 9. కెండి పలువురును నొకనితోఁ బెనంగఁగరూఢి — ల. 10. రొకనితోఁ బెనఁగుట — పెక్కు ప్రతులు.

85 వ. అట్లు మీరు [1]సాలరేని.

86 ఉ. తమ్ములు నిన్నుఁ గేశవునితమ్ముని ద్రౌపదియన్న దమ్ములం
[1]గ్రమ్మన [2]గీ టడంచెద నొకండన యే నిదె వచ్చి బాహుద
ర్పమ్మున [3]నిర్గ్లవారమును భానుఁడు దోఁచి [4]సముజ్జ్వలాత్మతే
జమ్మున [5]రూపుమాపు[6]క్రియ [7]సజ్జత నిల్వుము [8]సుస్థిరుండవై.

87 తే. [1]వినుము నీకు గృష్ణునకును వెఱచి కాదు
ముంద రేనట్టు లాడుట యెందుఁ జెల్లు
సమరధర్మంబు తెఱఁగు దెల్లముగ నెల్ల
వారలకుఁ [2]దెల్పుటకుఁ గాని వసుమతీశ.

88 వ. నేఁడు మిమ్ముఁదఱ [1]సమయించి భీష్మద్రోణకర్ణభగదత్తబాహ్లికజయ[2]ద్రథ
శకుని శల్యాదు లగుబంధుమిత్రసహాయులఋణంబు దీర్చెద నని పలికినం
బాండవాగ్రజుం [3]డి ట్లనియె.

89 చ. సమరము పాడి నీ వెఱిఁగి శత్రుల గెల్వఁగ నుత్సహించు టొ
ప్పు మనుజనాథ [1]యొక్కఁడును బూని మహోద్భుతబాహుసంపదన్
మము వడిఁ [2]దాఁకెదం బిలుకు మార్చెద నంట [3]యుదాత్త మైనధై
ర్యమహిమ గాదె యిట్లనిన యంతన [4]యేనటు లేల చేసెదన్.

---

85 1. నావహంబునకుం జాలరేనియు — చ.

86 1. గ్రిమ్మర — అ.ఆ.ఘ.చ వ; గ్రిమ్మిన — ద; గ్రిమ్మున — ఊ.ఔ.ఘ.జ. 2. గీటణంచెన — పెక్కు ప్రతులు. 3. నెల్లవారలను — పెక్కు ప్రతులు. 4. తమమ్ము నాత్మ — ఊ త. 5 తమమ్ముఁ బాపు — అ. 6. క్రియఁ జక్కఁగ — వీ ష. 7. సమ్మతి, సంశ్రుత, సజ్యత, సత్యత, చాలుదు అనియు పాఠములు. 8. దర్పమేర్పడన్ — అ.ఒ.జ.బ.

87 1. వినుడు మీకును హరికిని వెఱచికాదు — అ; వినుము గోవిందునకు నీకు వెఱచి కాదు — బ; వినుము కృష్ణునకు నీకు వెఱచికాదు — ఇ ఉ.త. 2. దెల్పుటయ — ఎ.ఐ.

88 1. ఁబరిమార్చి — వీ శ.ష; సమయించెన — కొన్ని ప్రతులు. 2. ద్రథాదులకు — అ. 3. డతనికిట్లనియె — పెక్కు ప్రతులు.

89 1. యొక్కరుఁడపూని—వీ.శ.ష; యొక్కఁడవుఁ బోయి-ఆ.ఓ.వ. 2. దాఁకెదన్-ల. 3. యవార్య — ఐ.గ. 4. యిట్టులదేఁచేసెదన్, యిట్లిఁక నేల చేయుదున్ - అనియు పాఠములు.

90 చ. వలసినయస్త్రశస్త్రములు వాహనముం గొను మొక్కరుండ నీ
గలన జయించువాఁ డతనిగర్వము [1]నీ వడఁ గించితేని యీ
యిల సకలంబు గైకొని వహింపుము రాజ్యవిభూతి [2]వాఁడు నీ
దలపడి పోరుఁ [3]జుట్టలును [4]దక్కటివారలు [5]నిల్చి చూడఁగన్.

91 వ. అనిన విని భవన్నందనుండు ధర్మనందనున కిట్లనియె.

92 చ. అరదము లెక్కి ఘోరవివిధాస్త్రచయంబుల మున్న పోరమే
నరవర క్రొత్తచందము రణంబు కరంబు ప్రియంబు సేయు ని
ష్ఠురగదలం బదాతు లయి శూరతయుఁ మహనీయ[1]ధీరతా
స్ఫురణమునుం బొగడ్త వడఁ బోరుట మే లని నిశ్చయించితిన్.

93 తే. వింతకూరలు [1]గుడుపున వేడ్క సేయు
భంగి సంగ్రామమున నూత్నభంగు [2]లెడఁదఁ
గౌతుకము సేయుఁ గావున గద [3]ధరించి
నిను సహో[4]దరులను యోధులను జయింతు.

94 చ. అనుటయుఁ బొంగి ధర్మసుతుఁ డాతనితో గద నొక్కరుండ నేఁ
గొనియెద నీదుపాలిఁటను లకుంఠితబాహువిలాసభాసి నై
యనవుడుఁ బుట్ట[1]లోవలి మహాభుజ[2]గేంద్రుఁడు [3]రోఁజునట్టు రోఁ
జె నధిప యవ్విభుండు దనచిత్తము నవ్వులకుల్ గలంచినన్.

---

90 1. గిటడఁగించి తేని - వ.శ. 2. వొందు — వ. 3. ఁజుట్టములు - కొన్ని ప్రతులు. 4. దక్షిన — ఖ.వ. 5. ఁజూచుచుండఁగఁ - అ.ప.

92 1. వీరతా, శౌర్యతా, ధైర్యతా — అనియు పాఠములు. 2. స్ఫురణతయుం — ఊ.వీ శ.ష.

93 1. గుడువఁగ — వ ; గడుపున — కొన్ని ప్రతులు. 2. లెదకు, లడర, లెడల, లెదల - అనియు పాఠములు. 3. ధరింతు - కొన్ని ప్రతులు. 4. దరబంధులననిజయింతు - వ.

94 1. లోపల - పెక్కు. 2. గేంద్రము — అ. 3. రోఁజు భంగి - అ.ఎ.త.

-: దుర్యోధనుఁడు గదామండితుండై హ్రదంబు వెడలివచ్చుట :-

సం. 9-31-45

95 వ. అట్లు నిశ్వాసంబు నిగుడ నొడలు పొంగఁ బటుకశాఘాతంబునం గెరలు శూక లాశ్వంబు చందంబునఁ గెరలి జలస్తంభం బుడిపికొని మడువు సంక్షోభింప నపహసితశైలసారోదారంబును గనక[2]పట్టికామండితంబును నైన గదాదండంబు విపులాంసపీఠంబున నమర్చుకొని [3]వెడలె నట్లు సంరంభవిజృంభితుం డై.

96 తే. గదయుఁ దాను రుచిరశృంగమునఁ బొల్చు
పర్వతము గ్రేణి సేయునీపట్టిఁ జూచి
కాలదండంబు చేకొని లీలఁ [1]దోఁచు
జమునిఁ గా మదిఁ దలఁచిరి జనము లెల్ల.

97 వ. అతనిఁ గనుంగొని పాంచాలురును బాండవులును.

98 తే. చిఱుతనగవుతో నొండొరు[1]చేతు లప్ప
ళించి నిర్భరసంతోషలీల నొప్పి
రమ్మహీనాథుఁ డయ్యపహాస మెఱిఁగి
బొమలు ముడివడఁ గనుఁ[2]గవఁ [3]బొడమఁ గెంపు.

99 వ. కోపావేశంబు నొంది యుద్వృత్తతారకంబుల వారల [1]నెల్ల నాలోకించి.

100 క. ఈ [1]గలి వే లార్చెద బా
హాగర్వము మెఱయ విమ్ము నందఱను మహీ
భాగమునఁ గూల్చి నెఱపెద
నాగద[2]బలు పెట్టు లైన నగుఁ డండాఁకన్.

---

95 1. శైల—పెక్కు ప్రతులు; శిలా—వా. 2. ఘంటి—జ.వీ.ష. 3. మడువు వెడలె—అ.

96 1. దోఁచు — పెక్కు ప్రతులు; బొల్పు — వా.శ.ష.

98 1. చేకుల - పెక్కు ప్రతులు; చేతల — వా. 2. దోయి - అ.న.వ. 3. బోడమెఁ- కొన్ని ప్రతులు.

99 1. నెల్లం గనుంగొని — వీ.శ.ష.

100 1. గెలుపెల్లార్చెద—కొన్ని ప్రతులు. 2. కౌశలము మగతనంబుగ డంకన్—బొ.ట.న.వ.

101 తే. అనుచుఁ [1]బోటులఁ దొరుఁగురక్తాంబుధార
లంగమెల్లను [2]గప్పిన నప్పు డొప్పె
గావిసెలయేఱు లెల్లెడఁ గలయఁ బర్వఁ
బొలుచు కులపర్వతంబు చాడ్పున నతండు.

102 వ. అట్లు ఘోరాకారుం డై నిలచి నీకొడుకు పాండు[1]రాజుకొడుకులు బంధు
మిత్ర పరివారసమేతంబుగా నడరి యొక్కపెట్ట తన్నుం బొదువుదు రని
శంకించి పాండవాగ్రజుదెసఁ గనుంగొని.

103 ఉ. ఠం డిట యొక్కఁడొక్కఁ డ దురం బొనరింపఁగ మీరు పల్వు రొ
క్కండను నేను [1]హేతివాత[2]కాయత డస్సినవాఁడ నన్న నా
తం డభిమన్యు బాలుని నధర్మతఁ [3]బ్రౌఢు లనేకయోధు లొ
క్కండన కెట్లు చంపి రటు గాఁ గొను మిబ్బవరంబు నావుడున్.

104 వ. నిరుత్తరుం డై యున్న భవత్తనయున కాధర్మతనయుం డిట్లనియె.

105 క. ఏ నట్లు సూపి చెప్పితిఁ
గాని యది రణంబుపాడి [1]గామి యెఱుఁగుదున్
[2]రా నీను నీదుపయి మ
త్సైనికులను వెఱవ కాయితము గమ్ము నృపా.

106 క. తల [1]సక్క ముడిచికొని [2]దిం
డలవడ బంధించి పోరి కమరి నిలువు నీ
[3]వలచిన [4]యట్టివ యిచ్చెద
నలఘుశిరస్త్రాణకంకటాదులు నెమ్మిన్.

---

101 1. బోట్లను పెక్కు ప్రతులు. 2. గప్పఁగ — పెక్కు ప్రతులు.

102 1. రాజసుతులు — వి.శ.ష.

103 1. బాణ — ఉ.న.వ. 2. కాయుఁడ — అ.ఆ.ఉ ద. 2. మీరల — ఈ ; పోడల — వ.

105 1. గాని దెఱుఁగుదున్ — ఐ. 2. రానీనింకిటునిలు — ఈ ; రానీనటునీపై — గ.

106 1. చిక్క — క. 2. దిండలవడ — కొన్ని ప్రతులు. 3. వలసిన — వి.శ.ష ; కొన్నిప్రతులు. 4. వన్నియు — వి.శ.ష.

107 వ. మఱియు నొక్క తెఱంగు సీమనంబున మెచ్చును నచ్చెరువును నెలకొనం బలికెద నాకర్ణింపుము.

108 తే. ఏటికొను మీవు నొకని మాయేవురందు
వాఁడు [1]నీతోడ[2]గదఁ బోరువాఁడు వానిఁ
జంపి మహి యేలు [3]వానిచేఁ జచ్చి త్రిదివ
సౌఖ్యమొందుము చేసితి సమయమేను.

109 వ. అని పలికి యుజ్జ్వల[1]వివిధవర్మంబు లాతనిముందటం బెట్టించి.

110 క. విను జీవము[1]తో నిన్నుం
జననిచ్చుట యొండు దక్క సమరంబున గో
రినయది నీ కొసఁగెద నిం
తన చెడిపోయె నె యకట యన్నదమ్ములకూర్మల్.

111 వ. అనిన విని నీతనయుం డిట్లు కాక నీవు నా కలిగెదవే యని కనకచిత్రితంబు లగు శిరస్త్రాణకంకటంబులు గైకొని ధరియించి కాంచనాచలంబు ననుకరించుచు గద చేత నమర్చి పాండ వాగ్రజుం గనుంగొని.

112 సీ. కవలలో నొకఁ డొండె గాండివియొండెవృ
కోదరుఁ డొండె నీవొండెఁ జేత
గద గొని యెక్కటికయ్యంబునకుఁ బూని
యేర్పడ నిలిచిన నీక్షణంబ
సమయంగఁ జూచెదఁ గ్రమమున మీరెల్ల
నొకఁడొక్కఁడే తేరఁ బ్రకటబాహు
దర్పంబు వొగడొంద ధరఁ గూల వ్రేయుచు
వచ్చెద మఱియు నీవారిలోన

---

108 1. గదఁగొనిపోరునీతోడ—అ.ప. 2. గదఁ—పెక్కుప్రతులు ; ంగదఁ—వా; ౦డు—క.జ.
3. మతనిచేఁ—పెక్కు ప్రతులు.

109 1. వివిధాయుధ వర్మంబుల – పీ.శ.ప.

110 1. తోడనినుం – అ.ప ; తోడనునిను – క.జ ; తోడుతనిను – ఒ.జ.

తే. నలిగి యెవ్వఁడు దాఁకిన నట్ల నాదు
గదకు [1]నెర[2]సేసి [3]పేర్చెదఁ [4]గడు గదార
ణంబు నాతోడఁ జేయ మన్మథహరుండు
గ[5]డఁగ లేఁడు మీకెందుఁ [6]బోఁ గలదు నేఁడు.

113 వ. [1]ఇవ్విధంబున దుర్యోధనుం డుద్ధతుం డై [2]మఱియుం బెద్ద యెలుంగునఁ బలుకుచుండ నతండు [3]విన కుండఁ [4]బద్మనాభుండు పాండవాగ్రజున కి ట్లనియె.

114 చ. ఇతఁడు గదారణంబు కు నీకొలఁదిన్ నినుఁ బిల్చినన్ మరు
త్పతిసుతుఁ గోరినం జిఱుతతమ్ములలో నొకనిన్ వరించినన్
మతి సెడి రొక్కొ వీర లనుమాటకుఁ బాత్రము [1]గామె సాహసం
బుతఱియె మేదినీశ యిది బుద్ధి దొఱంగి [2]తనుగ్రహంబునన్.

115 చ. ఒకరునిఁ జంపితేని సకలోర్వియుఁ [1]గై కొను [2]మంట నీవు మున్
శకునికి మాయజూదమున సంపదలెల్లఁ ద్రయోదశాబ్దభో
గ్యకృతి నమర్చి [3]యొడ్డి నటు [6]లై నది పందెపుఁ గయ్య మయ్యె శ
త్రుకులము నెల్ల దుఃఖపడి త్రుంచుట దాఁ దుదిఁ బందె మాడనే

116 చ. నర[1]వర యెక్కటెక్కటి పెనంగఁగ భీముని నైనఁ బన్నఁ గా
దరయఁగ భీముకంటె గదయందలి కౌశల మెక్కు డీనహీ
శ్వరునకు భీమువేన బలసంపద మిక్కిలి దానఁ బోవునే
వెరవునఁ గొలుపోదె భుజవీర్యము [2]పోరుల నెందుఁ జూడమే.

---

112 1. నరి - చ; బలి - శ. 2. యిచ్చి - పీ.శ.ష. 3. వే (ప్రే) సి పుచ్చెద-అ.ఓ. 4. గదరణంబు - ఏ; గదవిహరణ - చ. 5. గవయ లేఁడెందు మీకుఁబోఁగలదు - పీ.శ.ష 6. గలదెపోర - అ; గలదుపోర - ఏ.

113 1. అని యివ్విధంబున - పెక్కుప్రతులు. మఱియు నాటోపంబున - అ; నాటోపం బునఁబెద్ద - ఏ. 3. వినకుండ మెల్లన - అ. 4 కమల - ఇ.ఉ.

114 1. గామె - పెక్కుప్రతులు; గాదె - వా. 2. తివాగ్రి - కొన్నిప్రతులు.

115 1. యేలుమటంటి - అ; జేకొనుమంటి - వ. 2. మంటి - పెక్కు ప్రతులు. 3. యోడిన - ఇ.ఉ.ఊ.ఔ.ఖ.ఘ.చ.వ. 4. గాని - అ.

116 1. పతి - అ. 2. కయ్యములందు - ఊ.ఘ.చ.ల; నెందులఁబోరు - అ; వారల యందుఁ - క.

117 వ. అనిన విని [1]మహాబలనందనుండు వసుదేవనందనున కిట్లనియె.

—: శ్రీకృష్ణుఁడు భీము నగ్గించి దుర్యోధనుతోడి గదాయుద్ధమునకుఁ బనుచుట :—

సం. 9—32—15

118 మ. గద నాచేతికి వచ్చినప్పుడు మహోగ్రక్రీడమై లోకము
ల్పదునాల్గున్ సమయింతుఁ బొమ్మనుసముల్లాసంబు [1]న న్నొందు దు
ర్మదసంరంభ [2]వికత్థనుం డయినకౌరవ్యాధముం డెట్లు నా
కెదురై ప్రాణముతోడఁ బోవు [3]నృపు నిశ్లే లొత్తె దీమాత్రకున్.

119 తే. వాని [1]గద భార[2]మునకు నోర్వకయు నాదు
పటుగదాదండ[3]ముద్దండబాహువర్వ
లీలవిలసిల్ల వ్రేయుదు నేలఁ [4]గూల
సంతసముతోడి మెచ్చు పుట్టింతునీకు.

120 వ అనుటయు నచ్యుతుండు ప్రియం బెసంగ నా[1]కిమ్మీరమర్దను మొగంబునఁ
జూడ్కి నిలిపి.

121 మ. బకవిధ్వంసన మాచరించితి హిడింబప్రాణముల్ గొంటి కీ
చకనిర్మూలనకేలి సల్పితి జరా[1]సంధాంగకస్వైరభం
జకలీలన్ [2]విలసిల్లి తీ [3]వవి మనుష్యస్ఫూర్తి[4]మాత్రంబులే
యొకమర్త్యుం డెదు [5]రెట్లు నీకు మది[6]నే నూహింప కిట్లాడితిన్.

---

117 1. గంధవహా — అ ప.

118 1. నంబొందుదు — వీ.శ.వ; తోనుండుదు, తోనుండుదు — అనియు పాఠములు. 2. వితర్క — చ.వీ.ప.స; వికర — ఇ.ఈ.ఉ.ఐ గ.త.స; ఏవర్త — ఒ.జ. 3. నిల్వఁగలఁడే యింకేల శంకింపఁగన్ — అ.ఈ.

119 1. గదకుభరంపడవలదునాదు — అ.ఊ. మనుమాటవలదు — స; ఘనుమాట మాను — అ; మునకోర్వవచ్చునాదు — కొన్నిప్రతులు; మునకోర్చిపూన్ని — వీ.శ. ప; మునకోర్చివరున — ఘ.చ. 3. విస్ఫార — ఈ.ఎ.ఓ. 4. బడఁగ — వీ.శ.ప.

120 1. సమీరనందనునకిట్లనియె — వీ.శ.ప.

121 1. సంధానక — ఊ ఎ. 2. వెసఁజేసి పట్టివి — ఘ ల. 3. వని, వది — అనియు పాఠములు. 4. మాత్రిండవే — ఊ.ఎ.ఏ.ఖ; మానంబవే — అ. 5. రెట్లు — వా. 6. నే — పెక్కు ప్రతులు; లో — వా.

122 క. కాళింగాదిక్షోణీ
పాలుర నున్మదమహాద్విపప్రకరములన్
నేల నిడి కాలఁ జమరితి
వాలిన[1]కురునృపకుమార[2]వర్గంబుఁ తోన్.

123 వ. అని [1]పలికి కురుపతిదెసఁ గటాక్షవీక్షణంబు [2]నిగుడ వెండియు.

124 తే. వాలిదుశ్శాసనునిఱొమ్ము వ్రయ్యఁ జీరి
నీవు నెత్తురు ద్రావంగ [1]నిన్ను నతఁడు
సూచు[2]చుండియు [3]వెఱపొచ్చెమునకుఁగాక
కవియఁజాలెనె నీపయిఁ బవనతనయ.

125 చ. అగ[1]పడి [2]కచ్చువెట్టి యితఁ [3]డాడినమాటల కీడ్డు బల్లిదుం
డుగఁ గొని యేను బల్వురుఁ గడున్వడి నీతనిఁ [4]జంపకుండ [5]నే
మిగ సమయంబు సేసి తిది మేలొకో యంటి నృపాలుతోడ నీ
మగఁటిమి [6]చందముల్ దలఁచి మారుతనందన [7]యూఱడిల్లితిన్.

126 చ. తులువతనంబునన్ సభకు ద్రోవది ముందల వట్టి యీడ్చి య
ట్లలఁపఁగఁ జూచి నీవు [1]దగ నాడిన రెండుదెఱంగులందుఁ బెం
పొలయఁగ దుస్ససేనువని యొక్కటి దీర్చితి తీర్పు మింక బా
హుల కసివోవ వీనిపని[2]యుం ద్వరితక్రమవిక్రమంబునన్.

---

122 1. యక్షురుకుమార — పెక్కుప్రతులు. 2. వర్గముతోడన్ — ఇ.ఉ,ఐ.గ.చ.

123 1. పొగడి — ఓ.ఔ.గ.చ.ట ; వొగడి — ఈ, 2. తెసఁగ — ఔ.

124 1. నిన్నతండు — పెక్కుప్రతులు. 2. చుండఁడె — పెక్కుప్రతులు ; చుండెను — అ. 3. వెడ — అ.

125 1. వడె నంచుఁబట్టి యపుడాడెడు — ఓ.ఔ ; పడకచ్చు — ల. 2. కప్పువెట్టి — వ. 3. డాడెదు, డాడెడి — అనియు పాఠములు. 4. జుట్టుముట్ట — ఘ.చ. 5. నెమ్మిగ — పెక్కుప్రతులు. 6. జూచియున్ — ఆ. 7. యూఱకుండితిన్ — ఐ.

126 1. తెగ — ఇ.ఉ.ఓ. 2. యుద్భటవిక్రి — ఐ.గ.

127 తే. [1]పరజయము నొంది కట్టుము పట్ట మఖిల
ధరణిరాజ్యంబునకు ధర్మతనయుఁ బ్రీతి
[2]బంధులకు నెల్లఁ గన్నులపండువగుచు
నీవుఁ దమ్ములు సుఖవృత్తి నెలవుకొనుఁడు!

128 వ. అని మఱియును.

129 చ. బరవస మొప్ప నీవు గదపండువు సేయఁ దలంచి తాఁకినం
గురుపతి నిర్జితుం డగుటకుం బవనాత్మజ [1]యేను బూఁట పో
టరితన మెల్లఁ జూపుము కడంగుము నీ వని [2]యేలిమాటమై
నరవర ధర్మసూనుఁడు వినన్ విజయం [3]బొసఁగెన్ మఱందికిన్.

130 వ. ఇవ్విధంబున వృకోదరునకు [1]మనోజయప్రదంబులగుమాట లాడి దుర్యోధ నుండు దండి మగం[2]డు [3]శ్రమంబునుంజాలఁగలడు[4]నీవతిప్రయత్నంబునఁ బెనఁగవలయుఁజుమ్మీ యనిపలికె నప్పుడు సాత్యకి యాసమీరనందను నగ్గించెఁ బాంచాలురుఁదక్కనుంగలుగు[5]ధరణీశులు నబ్బలుమగనిఁ బ్రశంసించి రతం డగ్రజునాననం బాలోకించి.

131 చ. వినుము నరేంద్ర యేను బలవిక్రమముల్ వొగడొంద నిక్కల
ఘ్నునిపయి నామనంబు [1]నతి[2]కోపము పార్థుఁడు ఖాండవంబునం
దనలముపర్వఁ జేసినటు లగ్గలికన్ నిగిడించెదన్ గదం
గొని యెదఁ బ్రాణముల్ మహి యకుంఠిత[4]శాస్త్రిగ నేలు మంతయున్

---

127 1. తరమజయమొంది — పెక్కు ప్రతులు. 2. బంధువులకెల్ల — కొన్ని ప్రతులు; బంధుజనులకుఁ గన్నుల — అ.

129 1. నీదుపోటు - అ. 2. మేల, మేలు - అనియు పాఠములు. 3 బెసఁగన్ — వ.

130 1. మనోజయప్రదంబులగు — పెక్కు ప్రతులు; జయప్రదంబులగు — వా.వీ.శ.ష. 2. డగ్రమంబునం - త వ. 3. గదసాధన మేటియనంజాల - అ ప ఖ.చ. 4. నీవతనితో నతి - అ 5. జగతీ - అ.

131 1. పటుకోపము పెక్కు ప్రతులు; బలుకోపము - వ. 2. క్రూరత - బ. 3. పొంద— అ.ప ఖ. 4. సుస్థితి — కొన్ని ప్రతులు; శాశ్వత - కొన్ని ప్రతులు; వృత్తిని — ఖ. 5. యెంతయున్, నట్లుగన్ — అనియు పాఠములు.

132 ఆ. మహితకీర్తి పుష్పమాలికఁ బూన్చెద
నిన్నుఁ జీకురాజు నేఁడు [1]వనరుఁ
గాక శకుని[2]బుద్ధికతమునఁ [3]దమ కింత
[4]వుట్టె నని తనూజుపాలియు చెఱిఁగి.

133 వ. అని పలికి [1]సన్నాహంబు [2]శోభిల్లుచుండ గదాదండంబుఁ గేలనమర్చి వృత్రున కభిముఖుం డగు వాసవుండునుంబోలె దుర్యోధనుదిక్కు మొగం బై [3]నిర్వ్యాహం బై న శుండాలంబు [4]చందంబున [5]నున్న యన్నరపతిఁ గనుంగొని తమయన్నయుఁ దమ్ములు నెమ్మనంబుల సంతసిల్లఁ దానును సమరోల్లాసభాసితుం డగుచు [6]నతని కి ట్లనియె.

134 ఉ. ఇట్టిది క్రూరకర్మమని యించుక [1]కొంకక లక్కయింటఁ జి
చ్చొట్టితి మాయజూదమున నుత్తము ధర్మజుఁ దూలఁ బుచ్చి తా
చుట్టలుఁ బెద్దలుం జెలులుఁ [2]జూడఁగ [3]ద్రోవది భంగపెట్టి తి
ట్టట్టన కింకఁ దత్ఫలము [4]లన్నిటి నొందుము చేరి తగ్గ మై.

135 సీ. గాంగేయకుంభజ కర్ణశల్యాదులు
నీకుఁ గాఁ బెనఁగి యనేకబంధు
మిత్రులు [1]మడిసిరి ధాత్రీపతులుఁ [2]దోడు
దెచ్చితి పలువురఁ జచ్చి రంత

---

132 1. దనరు – అ.చ ; తన దురాశ – ఎ. 2. బుద్ధిశకుని వ్రతమునఁ – ఎ. 3. తనకింత– ఐ.త.వ. 4. పుట్టె – పీ.శ.

133 1. సమర–అ.ఏ.ఒ. 2. శోభిల్లుచండ – పెక్కు ప్రతులు ; శోభిల్లుచుండ–వ.పీ.శ.ప. 3. నిర్వ్యాధంబైన – ఆ.వ; నిర్వ్యాపారంబైన – చ. 4. నుంబోలెనున్న – అ. 5. శోభిల్లుచున్న – ఐ గ. 6. నీతనయునకి ట్లనియె – గ.

134 1. రోయక – అ.ఊ.చ ; గొంకక – వ.పీ.శ ; కానక – న. 2. జూచుచునుండఁగ నింతినొంచితి – శ. 3. ద్రౌపది – పెక్కు ప్రతులు. 4. లన్నియుఁ బొందుము – పెక్కు ప్రతులు.

135 1. బొలిసిరి – ల.ఏ.జా. 2. దోడువచ్చిరి – ఐ.వ ; దోడువచ్చినవారలు – చ.

వట్టువారును దోఁడఁబుట్టువు [3]ల్లెల్లను
గూలి రంతటికిని మూల మైన
శకుని గీటడఁగె నింకొకరుఁడ వీ వున్న
వాఁడవు విను నిన్ను నేఁడు నాదు

తే. గదకు నెరసేసి లోకంబు కల్మషంబు
[4]లేను బాపెద నీరజ్జు లేల నా[5]కుఁ
జక్కనై రమ్ము మద్భుజా స్తంభశుంభ
[6]దుగ్రకేళికిఁ బాత్రమై యోట దక్కి.

136 చ. అనుడు నెదిర్చి నీతనయుఁ డాతని కిట్లను నేల రిత్తగ
ర్జనములు గానవే పటు[1]భుజాకలితోగ్రగదా[2]సముద్భటున్
[3]నను నిటు రమ్ము సూపుము రణంబున నీదుబలంబుఁ జేవయున్
మన మిటు చేరి నిల్చి వెడ[4]మాటలు నాడుచు నున్కి యొప్పునే.

137 క. వినుము గదారణమున ననుఁ
జెనయఁగ వాసవున కైన జెల్లదు నీ వీ
యనిఁ బాడి దప్ప కుండఁగ
[2]బెనఁగుము ప్రాణంబుతోడఁ బ్రిదిలెదు భీమా.

138 వ. అనిన విని పాంచాలురుం దక్కినజనపాలు[1]రుం బ్రశంసిం[2]చి మ త్త[3]మాతంగంబుః దాలశబ్దంబుల నబ్బం జేయు[4]నోజ [5]రారాజుఁ [6]బ్రహర్షంబు నొందించిరి [7]గజబృంహితంబులు హయ [8]హేషితంబులును జెలంగె నాయు

---

3. ల్లలమును - కొన్ని ప్రతులు. 4. లెల్ల, నేను — అనియు పాఠములు. 5. నేఁడు - కొన్ని ప్రతులు ; నీకు పెక్కు ప్రతులు. 6. దుగ్రతకుఁ బాత్రముఁగ మొగమోటదక్కి - అ.

136 1. భుజాబలశాలి సముద్భటార్భటుల్ — ఊ. 2. సముద్యముఁ - కొన్ని ప్రతులు. 3. న్ననువుగరమ్ము సూపుము రణంబున - ఈ. ఈ పాఠమున అఖండయతి ; ద్విత ద్విత్వసంధియుఁ గనఁబడుచున్నవి. 4. మాటల, మాటలె - అనియు పాఠములు. 5. నుంట నొప్పునే - ఊ.వ ; నున్కి యుక్తమే - క.

137 1. దానవుని - అ. 2. బెనగియు - పెక్కు ప్రతులు.

138 1. నతనిం—ఎ ఒ.గ.వ. 2. చిరి—ఊ.ఎ.ఔ.గ ఘ.చ.ల. 3. మాతంగంబులతాళ—ఔ ; మాతంగంబుదాళ, మాతంగంబులనాదం, మాతంబులజలద - అనియు పాఠములు. 4. సింహంబు చందంబున రారాజును ప్రహర్షంబు నొందించిరి — ఘ. 5. నారాజు- ఇ ఉ ఓ. 6. బ్రహర్షణంబు — ఔ.ల.వ. 7. యప్పుడుగజ — అ.ఏ ఖ. 8. పలును హే-

ధంబు లెక్కుడుమెఱుంగులఁ బొలిచెఁ దదనంతరంబ యెల్లవారును నెడ గలుగఁ [9]గూర్చుండి రమ్మహావీరులు దలపడువారై వీరోద్రేకంబునం జేసి యతిలోకం బగు[10]నవష్టంభంబున విజృంభించి యొండొరుల నవలోకించి [11]రట్టియెడ.

-: భీమదుర్యోధనుల గదాయుద్ధము సూడ బలరాముఁడు వచ్చుట :-

సం. 9-33-2

139 సీ. యదుకుల[1]దీపకుం డగు రాముఁ డవ్వార్త
యంతకమును విని యక్కుమారు
లాత్మశిష్యులు [3]గాన నాహవ మీక్షింపఁ
దీవ్రయానమున నేతెంచి దృష్టి
[4]గోచరుం డగుటయుఁ గురునాథ తగ నెల్ల
వారు నెదుర్కొని గారవమునఁ
బ్రణమిల్లిన[5] నతండు ప్రత్యభివందన[6]
మాచరింపంగ ధర్మాత్మజుండు

తే. [7]సమ్మదంబునఁ బరిరంభణమ్ము సేసె
నరుఁడు గవలును ద్రౌపదీనందనులును
వందనం [8]బొనరించిరి వారి [9]నాతఁ
డర్హభంగి భాషణముల నాదరించె.

---

వీ.శ.ష.. కొన్ని ప్రతులు; ఘోషంబులు — ఇ.త ; ఘోషితంబులు — చ. 9. గలసి-కొన్ని ప్రతులు ; గలిగి—కొన్ని ప్రతులు. 10. నవష్టంభ విజృంభణంబున—చ.వీ.శ.ష. 11. రట్టియవసరంబున — పెక్కు ప్రతులు ; యట్టి సమయంబున — ల.

139 1. దీపకుఁడైన రాముఁడు వార్త— పెక్కు ప్రతులు. 2. యంతయు, యంతకు — అనియు పాఠములు. 3. గానయాహవ — 'ల' మున్నగు పెక్కు ప్రతులు. ఈ పాఠమున 'కాన' పదము కళగా స్వీకరింపఁ బడినది. 4. గోచరంబగుటయుఁ — పెక్కు ప్రతులు. 5. రతఁడును బ్రత్య — వ. మున్నగు పెక్కు ప్రతులు. 6. నంబాచరించు టయు — ఇ.ఊ.చ.వ. 7. సంభ్రమంబున — ఒ. 8. బాచరించిరి — ఊ.ఎ ఘ.జ.ట.వ. 9. నతఁడు (నాతఁడు) నర్హమగు భాషణంబుల — అ ప.వీ శ.ష.

140 క. [1]హరియును సాత్యకియు వినయ
భరితాంతఃకరణు లగుచుఁ [2]బ్రణతులయిర [3]న
య్యిరువురను గ్రుచ్చి [4]పెరయం
బరి[5]రంభణ మాచరించెఁ బరమప్రీతిన్.

141 వ. ఇ ట్లెలుంగున నెల్లవారలు నా బలదేవునిఁ గాంచి కుశలప్రశ్నంబుసేసి రయ్యాదవపుంగవుండు సదుత్తరం బిచ్చి యేను బోయి పెక్కు [2]దినంబు లయ్యె నని యుగ్గడించి మిమ్ముఁ బెండ్లను జూచుటకును నాశిష్యులగదా యుద్ధం బనుసంధించుటకును వచ్చితి ననియె [3]నమ్మరుత్సుతుండును [4]భవత్సుతుండును గదలు సేతులన యుండ నతనిఁ జేరి భక్తిం బ్రణామంబు లాచరించిన నతం డాదరించె [5]నంత, గాంతేయాగ్రజుండు రౌహిణేయుఁ తో నన్నదమ్ములయిరువురయెక్కటిపోరు సూడు మని పలికి వారట్లు [6]ద్వంద్వ యుద్ధంబునకు సన్నద్ధులై నతెఱం గెఱింగించిన నతండు లెస్స కాక యని [7]యనుమతి సేసె [8]నని సంజయుండు ధృతరాష్ట్రునకు రామునాగ మనంబు సెప్పె ననిన విని తదీయప్రవర్తనశ్రవణకుతూహలాయత్తచిత్తుం డై నజనమేజయుండు వైశంపాయనున కి ట్లనియె.

142 తే. ఉభయవాహినిసంగరోద్యోగసమయ
మున హలాయుధుఁ డేతెంచి మురహరుండు
[1]పాండు రాజసూనులయెడఁ బక్షపాతి
యని విరాటాదిబంధులు వినఁగఁ బలికి.

---

140 1. హరిసాత్యకులిరువురు — వీ శ ప. 2. బ్రణమితులైన, బ్రణమిల్లిన — అనియు పాఠములు. 3. నాదరమొప్పవ — వీ.శ.ప. 4. చేరం బరి — వీ.శ.ప. 5. రంభము(ణ) చేసె నతఁడు — కొన్ని ప్రతులు.

141 1. కుశలసంప్రశ్న — వీ.శ.ప. 2. దివసంబు — ఉ.త వ. 3. మరుత్సూనుండును, మరుత్పుత్రుండును, అనియు పాఠములు. 4. భవత్సూనుండును, భవన్నందనుండును— అనియు పాఠములు. 5. నప్పుడు — పెక్కు ప్రతులు. 6. గదా — అ జ బ.౨ వీ శ ప. 7. యంగీకరించె — వ. 8. నని యిట్లు — పెక్కు ప్రతులు.

142 1. పాండవుల యెడఁ గడుపక్ష, పాండు నృపసూనుల యెడపక్ష, పాండురాజతనూజుల పక్ష — అనియు పాఠములు.

146 వ. [1]అది [2]ప్రభాసం బను పేరం బరఁగు [3]నట్లందులకుఁ జని తీర్థసేవనం [4]బనుష్ఠించి [5]యంతనుండియుఁ [6]బథిశ్రాంతిప్రయాణంబుల సరస్వతి[7]చేరువ నడచి తదీయ సకలతీర్థంబు లాడుచు నన్నపానంబుల నాసనశయనయానంబులను ధేను కనకరత్నాంబరాభరణాదిద్రవ్యంబులను [8]విప్రుల నతిప్రీతులఁ జేయుచు బాలవృద్ధవనితావికలాంగదుర్బల[9]ప్రాయులఁ బరిశ్రాంతు [10]లైనయెడలఁ [11]దడిమికొనియథేష్టప్రకారంబుల శరీరస్థితి నడపింపఁ దగువారి నియోగించి మఱియు ననేక[12]ధర్మంబు లాచరించుచుఁ గురుక్షేత్రంబునకు వచ్చె ననుటయు జనమేజయుం డాతీర్థవిశేషంబులు వివరించి [13]చెప్పు [14]మనుడు వైశంపాయనుం డి ట్లనియె.

147 క. మును చనియెఁ బ్రభాసమునకు
ననిచెప్పితి నతని నది మహాత్తరతీర్థ
మ్మునరేంద్ర యందుఁ జంద్రుఁడు
దన[1]యక్ష్మం దీర్చుకొని గతవ్యథుఁ డయ్యెన్.

—: ప్రభాసతీర్థ ప్రభావవర్ణనము :—

సం. 9—33—36

148 వ. అత్తెఱం గెఱింగించెద [1]దక్షుకన్యకల నశ్విన్యాదు లగుసప్తవింశతి[2]సంఖ్యలఁ జంద్రుండు వివాహం బయ్యెనందు రోహిణి రూపాతిశయవతి యగుటం జేసి తదాసక్తుం డైన [3]దక్కటివారు వగ నొంది [4]తండ్రికడకుం జని

146 1. అదియును — అ.ఏ. 2. ప్రభాసతీర్థంబనఁ బరఁగు — ఏ ఘ. 3. నందునని — ఐ.గ. 4. బొనరించియంత — ట ; ఆచరించి — ల. 5. యందు తిలకపయప్రియా — ఆ. 6. గతిపయ — త.ల.వ.వీ.శ.ష ; బ్రతిస్రోత (ః) ప్రయా — కొన్ని ప్రతులు. 7. నదికిం జేర — చ. 8. బ్రాహ్మణులనతి — పా. 9. ప్రముఖులపథశ్రాంతులై — ఊ ; ప్రాయంబులబరి — ఖ.వ. 10. లయినవారిఁ గూర్చికొని విశిష్టప్రకారంబుల — అ ; లయిన యెడలం దఱమికొనక యథేష్ట — ఐ. 11. దరమికొని — కొన్ని ప్రతులు. 12. ధర్మకర్మంబాచరించుచు — ఉ జ. 13. చెప్పుమనియడిగిన వైశంపాయనుండు — పెక్కు ప్రతులు. 14. మనుటయు — కొన్ని ప్రతులు.

147 1. క్షయము — ఊ.ఎ.ఏ.ఐ.ఒ క.గ.చ ; యక్షము — కొన్ని ప్రతులు.

148 1. దక్షుని కన్యలయందశ్విన్యాదులయిన — పెక్కు ప్రతులు. 2. సంఖ్యలం — పెక్కు ప్రతులు. 3. దక్కిన — పెక్కు ప్రతులు. 4. తండ్రికిఁ జంద్రుని — కొన్ని ప్రతులు;

చంద్రుని యన్యాయం బెఱింగించిన [5]నాప్రజాపతి చంద్రునితో నుగ్గడించి యది చాల నధర్మం బింక నిట్లు సేసి తేని శపింతుఁ జుమ్మీ సముఁడవై వర్తింపు మనుటయు నమ్మాట[6]దెస ననాదరంబు సేసి యతండు వెండియుఁ [7]దొంటియట్ల వర్తించిన నెఱింగి యమ్మహాత్ముండు గోపించి యక్షుఁదెవులు గొను[8]మని [9]శాపం బిచ్చిన నయ్యోషధినాథుండు నానాటికిఁ గృశుం డయ్యెన ట్లాతెవులుచేత నతండు పోఁడిమి [10]మాలిన నోషధులు [11]పస చెడియె దానఁ బ్రజలు డయ్యం [12]జొచ్చిరది చంద్రకార్శ్యహేతుకం బగుట [13]యనుసంధించి.

149 క. దేవత లమృతాంశునితో
నీ వేటికిఁ గృశుఁడ వైతి నిక్కము చెపుమా
నావుఁడుఁ దన తెఱఁ గేర్పడఁ
గా వారికి [1]నతఁడు సెప్పెఁ గౌరవముఖ్యా.

150 క. విని వారలతనిఁ దోడ్కొని
చని ప్రార్థించుటయుఁ దగఁ బ్రసన్నుం డై యి
ట్లను దక్షుఁ డఖిలభార్యా
[1]జనుల యెడఁ నడవవలయు [2]శశి సమవృత్తిన్.

151 వ. అట్లు నడచుచు సరస్వతీ[1]జలనిధిసంగమకలితం బైన[1]తీర్థంబుజలంబుల నిమగ్నుం డై [3]వృద్ధిఁ బొందు వరుసన పదియేనుపదియేనుదినంబులు సంక్షయంబును బ్రవర్ధనంబు [4]నొందం గలవాఁ డని చెప్పి వెండియు.

---

తండ్రికిఁదమ పెనిమిటి — త.వ. 5. నాదక్షప్రజాపతి — కొన్ని ప్రతులు. 6. యెడ — కొన్ని ప్రతులు. 7. తొల్లింటి యట్లరోహిణియందు వర్తించిన — అ.ప.ఐ. 8. మని యతనికి — పెక్కు ప్రతులు. 9. శపియించిన — ఊ.చ. 10. మాలుటయు; దూలుటయు, చెడిన - అనియు పాఠములు. 11. బని — వ. 12. జొచ్చిననది — పెక్కు ప్రతులు. 13. యెఱింగి — ఆ.ఓ.

149 1. చెప్పెనతఁడు - పెక్కు ప్రతులు.

150 1. జనములయెడ — కొన్ని ప్రతులు. 2. సమముగుబుద్ధిన్ - ఎ.ఓ.వ.

151 1. జలధి — ఇ ఊ.ఎ.ఒ చ. 2. తీర్థజలంబుల — పెక్కు ప్రతులు. 3. పదియేను దినంబులు వరుసన వృద్ధిఁ బొందుచుఁ బదియేను దినంబులు సంక్షయంబు — వీ శ.ష. మున్నగు — పెక్కు ప్రతులు. 4. బొందంగల — పెక్కు ప్రతులు.

152 క. అమవస నమవస నాతీ
ర్థమునఁ గృతస్నానుఁ డై [1]సుధాకరుఁడు ప్రవృ
ద్ధిమహితతనుఁ [2]డగు నని యతఁ
డమరుల [3]వీడ్కొల్పి యామృగాంకునితోడన్.

153 వ. వనితలకు విప్రులకు నవమానం[1]బు సేయకుమీ యని పలికి వీడ్కొలిపె నట్లు శాపమోక్షంబు జని చంద్రుం డాతీర్థంబునకుఁ జని తదీయ[2]జలస్నానంబున [3]నాప్యాయితశరీరుం డై లోక[4]ప్రభాసుం డయ్యె నదిగారణంబుగా నాతీర్థంబు ప్రభాసం [5]బను పేరం బ్రసిద్ధి నొందె నం దుండి యారోహిణీ[6]నందనుం డరిగి [7]చమసోద్భేదనం బను తీర్థంబున నొకరాత్రి వసియించి [8]యుదపానంబునకుం బోయె దానివిశేషం [9]బాకర్ణింపుము.

154 క. త్రితుఁ డనఁ[1]గా ద్వితుఁ డన [2]నే
కతుఁ [3]డనగఁ [4]దపస్విసుతులు గల రావిప్ర
త్రితయము భూపాలురకును
గ్రతుదీక్ష లొనర్చి ధేనుగణముం బడసెన్.

155 వ. [1]వడసి యొక్కట [2]నేతెంచునెడ నయ్యేకతద్వితులు నిజభ్రాత యగు త్రితుని వంచించి తా రాగోవుల దోలంగ నడిచి కొనిపోవువారుగాఁ బాపబుద్ధి కుత్సహించి రాసమయంబునఁ దెరువున నొక్కవృకం బున్నఁ దద్భయంబునం దోలంగం బోయి ప్రమాదంబున ద్రితుండు నూతం బడిన నయ్యిరువురు నతనినుపేక్షించి [3]ధేనువులం గొనిపోయి రమ్మునికుమా

---

152 1. సుధాంశుండుప్రవృ — ఊ.ఒ క.చ. (ఈ పాఠమున అఖండ యతి చూపట్టెడి). 2. వగునని — పెక్కు ప్రతులు. 3. వీడ్కొలిపెన (నామృ) మృగాంకునితోడఁ వీడ్కొలిపె నప్పుడమృతాంశునితోఁ — అనియు పాఠములు.

153 1. జెన్నఁడునాచరింపకుమీయనిపలికి — పెక్కు ప్రతులు. 2. జలంబులస్నాతుండై — వీ.శ.ష. 3. పూతశరీరంబున — వీ.శ.ష. 4. ప్రభాసమానుండయ్యె — ఇ.ఉ.ఏ.త. 5 బనంబ్రసిద్ధి — పెక్కు ప్రతులు. 6 సుతుండరిగి — ఇ.ఈ.ఉ. 7. సముద్భేదనంబను, మనోద్భవంబను, చమసోత్పథంబను, గిరిఛేదనంబను — అనియు పాఠములు. 8. యుదక— పెక్కు ప్రతులు. 9. బువినుము — వీ.శ.ష.

154 1. గనేకుఁ డనఁగాఁ గ్రితుఁడనఁగ — శ. 2. నుద్గాతుండన — చ. 3. డనంగాఁ బృథ్విసురలు గలరా — త.వ. 4. తపస్వివరులు — ఎ.ఓ ఘ.చ.

155 1. ఇట్లు వడసి — వీ.శ.ష. 2. తెచ్చునెడ — పెక్కు ప్రతులు. 3. డొక్క — అ.

రుండు నిర్జలం [4]బై నయయ్యుదపానంబున నుండి సోమపానంబు సేసినం గాని యీదురితంబు వాయ దని తలంచి [5]యజ్ఞసాధనంబునకుఁ [6]బ్రతి విధులు సంకల్పరూపంబున సంపాదించికొని [7]క్రతువొనరించిన దేవతలు సన్నిధి సేసి హవిర్భాగంబులు గైకొనిరి సరస్వతీజలంబు [8]తత్కూపంబున [9]నుద్గతం బై యాసవనపతి నుద్ధరించె [10]నయ్యమరులు వరం బడుగు [11]మనిన నమ్మహాద్విజుండు.

156 తే. [1]విను డు[2]ప[3]స్పర్శ మిందుఁ జేసిన[4]యతండు
[5]వడయు వాఁడు మహితసోమపానఫలము
వరము నా కిది యనుటయు వార [6]లట్టు
లవుట సంప్రీతిమై నిచ్చి దివికిఁ జనిరి.

157 వ. అట్టి [1]యయ్యుదపానంబు[2]న సేవించి [3]వివశనంబునకుఁ జని యెఁ ద త్తీర్థంబు హీనజాతులకుఁ బొడసూపక [4]నశించుఁ గావున [5]వినశనం బనం బరఁగె [6]మఱియు భూమికంబున[7]కుఁ బోయె నది యప్సరోగీతనృత్యవిహారభూమి యగుట [8]భూమికం బనఁ బ్రసిద్ధం బయ్యెఁ బదంపడి గంధర్వతీర్థంబు[9]నకు నేఁగె నది విశ్వావసుప్రభృతిగంధర్వతపస్సిద్ధిస్థానం బం దుండి గర్గస్రోతం

---

3. తొల్లులం — అ ప. 4. బై యున్నయయ్యుద (య్యుదక) పానంబున — కొన్ని ప్రతులు. 5. యజన, యాగ — అనియు పాఠములు. 6. బ్రతినిధులు — కొన్ని ప్రతులు; బ్రకరంబులు — గ.ఐ. 7. క్రతువునడరించిన — ఐ.గ; క్రతువొనరించె — పెక్కు ప్రతులు. 8. జలంబులాకూపంబున — పెక్కు ప్రతులు. 9. నుద్గతంబులై — పెక్కు ప్రతులు. 10. నయ్యమరవరులు — కొన్ని ప్రతులు. 11. మనుటయు నమ్మహాత్ముండు — చ.

156 1. వినుము — ఊ ఘ. 2. కర — అ; స్పర్శన — ఊ. 3. స్పర్శన మిందు — చ. 4. నరుండు — అ.ఆ.ఈ.ఏ.ఓ.వ. 5. బడయవలయును మహిసోమ పాన ఫలము — అ.ఊ; పడయు సోమపానము సేయు ఫలము ప్రీతి — గ.ఐ. 6. లట్లతివిరి — అ.ఊ; లట్లయపుడ — కొన్ని ప్రతులు; యట్లయవుట — కొన్ని ప్రతులు.

157 1. యెడనుదక, అట్టియుదక — అనియు పాఠములు. 2. ననుపస్పర్శనంబాచరించి, నుపస్పర్శించి, నుపసేవించి—అనియు పాఠములు. 3. విశసనంబునకుం—ఘ.చ.త.వ.శ. 4. వశియించు — కొన్ని ప్రతులు. 5. వినాశంబు (నంబు) నా — కొన్ని ప్రతులు. 6. నందుఁ గ్రుంకులిడి యచ్చోటుఁ బాసి — అ.ప.ఖ. 7. కుంజనియె — ప.ఐ.ఖ.గ. 8. సుభూమికంబునాఁ — ఇ.ఈ.ఉ.గ. 9. నకుంజనియెనది — కొన్ని ప్రతులు;

బున[10]కుఁ జనియె నందు గర్గుండు సన్మునిసేవితుండై చిరకాలంబు వసించె నచ్చోటు గదలి యా[11]బలభద్రుండు.

158 ఆ. వినుము శంఖతీర్థమునకు నైసర్గిక
మునకు నాగధన్వమునకు వరుసఁ
జనియె నాగధన్వ మనునది వాసుకి
స్థాన మచటఁ దొల్లి సకల[1]సురులు.

159 వ. నాగేంద్రత్వమునకు వాసుకి నభిషేకించి రందుండి యా[1]నీలాంబరుండు [2]నైమిశంబున కరిగె నయ్యేడం దొల్లి సరస్వతి యనునేఱు దూరంబై యుండ నైమిశారణ్యవాసు లగుమునులు గ్రతువు సేయం దొడంగిన నాసరస్వతి వారల సంభావించుటకు మలంగి పాఱినకతంబు[3]నం దటసమీపం బయ్యె నవ్విశేషంబు విని విస్మితుం డగుచు నాహలాయుధుం డా[4]తీర్థం బుఁ గొనియాడి సప్తసారస్వతంబునకుం [5]బోయె నచ్చట మంకణుం డనుమహాముని వసించుఁ దొల్లి నలిన[6]భవుసత్త్రంబున నైమిశారణ్యమునుల యాగంబున గయుని క్రతువున [7]నుద్దాలకునధ్వరంబున వసిష్ఠుసప్త తంతువున గురునిసవనంబున వెండియు నొక[8]మఱి యాపరమేష్ఠియజ్ఞంబున హిమవత్పుష్కరాదు లైనతత్ప్ర[9]దేశంబులకు సుప్రభయుఁ గనకాక్షియు [9]విశాలయు [10]సురతన్వయు [11]నోఘమాలయు సువేణియు సువేణియు విమలోదకయు ననునామంబుల నారీవేషయుక్త యై సరస్వతి చని యజమానసకలదేవమునిసంభావన వడసె నట్టిసప్తాకారంబుల నాసంయమియాశ్రమంబునఁ బ్రవర్తించుట నది సప్తసారస్వతం బనం బరఁగె నమ్మంకణుని చరితంబులు మఱియునుం గల వాశ్చర్యకరంబులు[12] వినుము.

---

నకరిగెనది—కొన్ని ప్రతులు. 10. కరిగె నందు-పెక్కు ప్రతులు. 11. నీలాంబరుండు, బలభద్రదేవుండు, బలదేవుండు — అనియు పాఠములు.

158 1. మునులు — ఎ.

159 1. బలభద్రుండు — త.వ. 2 నైమిశారణ్యంబున కరిగె — కొన్ని ప్రతులు. 3. న నైమిశంబునకు సమీపం బయ్యె-ఈ. 4. జలంబులఁ దీర్థంబాడి యచటఁ గదలి - ఏ. 5. జనియె — ఐ.ఒ.గ.జ. 6. సంభవు — అ.ఊ ఏ.న.ల. 7. నౌద్దాలకి యధ్వ — కొన్ని ప్రతులు. 8. పరినప్పర — అ.ద. 9. నుతనువును—అ.చ; విశాలాక్షియు - ఊ. 10. సుధన్వియు, సుధన్వయు, సుతనువును, సరసయు, విశాలయు — అనియు పాఠములు. 11. విశాఖమాలయు, సువేణియు, మేఘమాలయు — అనియు పాఠములు. 12. లాకర్ణింపుము - పెక్కుప్రతులు.

—: మంకణ మహాముని మాహాత్మ్యాభివర్ణనము :—

సం. 9—37—1

160 సీ. అతఁడు సరస్వతి నవగాహనము సేయు
[1]చుండి యాచేరువ నోర్తు తడుపు
గట్టక [2]నిల్లాడఁగాఁ [3]జూడఁ దనదు శు
క్లము నిర్గమించిన ఘటసురఁ
తము సేయ [4]స_ప్తభేదము లొంది యది [5]సప్త
రుషు లై రి [6]వారు మరుద్గణంబు
[7]నకు సంజననకారణం బై రి విను మొక్క
నాఁ డత్తపస్వి వ్రేల్నాటి దర్భ

ఆ. [8]గంటఁ గూరయసరు గాఱిన న_ర్తించె
నతఁడు తపముసిద్ధి కాత్మఁ [9]బొంగి
జగము లెల్లఁ దాన సంక్షోభ మొందె ని
ర్జరులు భీతిఁ జనిరి శంభుఁ గాన.

161 వ. కని యంతయు నెఱింగించిన [1]నద్దేవోత్తముం డాభూదేవోత్తముపాలి కరిగి యిది యెంతటివిశేషంబు దపంబు [2]లిట్టివే న_ర్తించుట మాను మని పలికి తన [3]యంగుటంబు వ్రేలం గీఱిన నందు భస్మంబు గాఱిన నాసంయమి సిగ్గు వడి దండప్రణామంబు సేసి.

---

160 1. చుండనచ్చేరువ — అ.ఇ.ప ఘ.జ. 2. నీరాడ — ప. 3. జూచి తనదు — అ.ప ఘ. 4. సవన — అ; సత్వ — బౌ. 5. స_ప్తఋషులై రి - పెక్కు ప్రతులు; సప్త మును లై రి — చ. ఈ పాఠమున యతి భంగమైనది. 6. వారమ్మరుద్గణంబు — ఉ. 7. నకునుజనన — ఇ.ఉ.శ. 8. గంటిశాకరసముగాకనఁ జింతించి యతడు — , గండి శాకరసముగాఱినఁ జింతించి యతడు గంటిగూర రసము గాఱినఁ జింతించి యతడు - అనియు పాఠములు. 9. బొంగె — ఇ.ఉ.ప.బౌ.ట.

161 1. నద్దేవుండు నామంకణుపాలికరుగుదెంచి మునిసత్తమా — అ. 2. సిద్ధించె — కొన్ని ప్రతులు; సిద్ధి యిట్టిదియె — కొన్ని ప్రతులు. 3. యంగుష్ఠంబు — పెక్కు ప్రతులు.

162 ఆ. దైవ [1]మెల్లఁ దలఁప నీవ సమస్తజ
గంబులకును నేడుగడయు నీవ
[2]కర్మ[3]ఫలదుఁడవును గర్మప్రదుండవు
నీవ కరుణ నన్నుఁ గావు మభవ.

163 వ. అని వెండియు ననేకప్రకారంబులం [1]బ్రశంసించినం బ్రసన్నుం డై పశుపతి యతనికిఁ దపఃప్రభావం బక్షీణంబు గా వరం బిచ్చి చనియె నమ్మహాముని నృత్యంబు మానిన జగంబులసంక్షోభంబు శాంతం బయ్యె [2]నట్టియమ్మహాత్మునినివాసం బై నసప్తసారస్వతంబు[3]నుండి యాసీరి యౌశనసంబునకుం బోయె వినుము [4]తొల్లి రఘురామునిచేతఁ జచ్చినమహోదరుం డనునసురతలపునుక యొక్కతపస్వికాలఁ దగిలి పుచ్చ రా కున్న నతండు వేదనం బొందుచుండం గని యార్యులు నౌశనం బనుతీర్థంబు శక్రుండు దపంబు సేసినచో టందుఁ బొమ్ము నీదురితంబు వాయు ననిన మహోదరనామధేయుం డగు నాసంయమి యచ్చటికిం జనినఁ గపాలంబు ముక్తం బయ్యె దానం జేసి యది కపాలమోచనం బనం బరగు నచ్చోటు గదలి పృథూదకంబున [5]కరిగెఁ దదీయవిశేషంబు వినుము గాధియనుమహారాజుకొడుకు విశ్వామిత్రుం డనున[6]తండు.

164 ఆ. తండ్రియట్ల [1]సకలధాత్రీశు డై యుండి
దనుజమథనమునకు దండు వెడలి
యరుగునెడ వసిష్ఠునాశ్రమంబునపొంత
విడియఁ [2]బరిజనములు వినయ మెడలి.

---

162 1. మనఁగనీవదలఁపసమస్త – ఊ ; యెల్లనీవదలఁప – ఔ.క.ఖ. 2. ధర్మ – ఈ. 3. ఫలదమీఁదగౌరి పతివి నీవకరుణతోడ నన్నుఁ గావు మభవ – అ.ఏ.

163 1. బ్రస్తుతించిన–ఇ.ఉ. 2. నట్టి యమ్మహితాత్ముని–కొన్ని ప్రతులు. 3. నంగుంకి యం దుండి యాసీరపాణి యౌశనంబునకుం జనియె–కొన్ని ప్రతులు. 4. తొల్లి – కొన్నింట లేదు. 5. కరిగెఁదద్విశేషంబు – పెక్కు ప్రతులు; కుం జనియె – వా. 6. కుమారుండు– పెక్కు ప్రతులు.

164 1. యఖిల – ఘ. 2. బడిరిజనులు – వ. బడిన జనులు – క ; బరిజనంబు – కొన్ని ప్రతులు.

165 వ. అందు దుర్నయంబు లాచరించిన నమ్మునిఁ గోపించి నిజహోమధేనువు నాలోకించి [1]నీబలంబు పనుపు మనిన నది దన[2]మాహాత్మ్యంబున నచట నావహిల్లిన ఘోరాకారు లగువీరులఁ బనుప వార లారాజువరూథిని మడియించిన [3]శేషించినజనంబులు పలుగడలం బాఱి రట్లు దురవస్థం బొందు [4]నాసేనం జూచి యగ్గాధినందనుం డెల్లశక్తులకంటె దపశ్శక్తి యెక్కుడగుట యెఱింగి యాపృథూదకంబునఁ దపంబు [5]సేయుచుండ దానికి దేవపతి విఘ్నంబు సేయ మఱియు నియమనిష్ఠుం డై బ్రహ్మచేత బ్రాహ్మణ్యంబును బడసె న త్తీర్థంబునందుండి యాబలభద్రుండు బకాశ్రమంబున కరిగె నయ్యెడఁ బకుం డను మునీంద్రుండు తొల్లి.

166 క. ధృతరాష్ట్రుం డనుధరణీ
పతి [1]దన్ను నధఃకరించి పలికినఁ గోపా
న్వితుఁ డై హోమ మొనర్చెను
[2]మృతనరమాంసముల నతనికిం గీడొదవన్.

167 ఆ. నలుకఁ బడినయడవి తెఱఁగున నతనిరా
ష్ట్రంబు సకలజంతు సముదయములు
[1]మడియ విన్ననయ్యు [2]నడలి యాభూపతి
య త్తపస్విపాలి కరుగుదెంచి.

168 వ. దండప్రణామం బాచరించి పెక్కుభంగులఁ [1]దేలించి మున్ను ధేను నిమిత్తం బగుదుర్భాషణంబు[2]ల నింత పుట్టుటం జేసి యాసంయమికి

---

165 1. నిజబలంబు - అ; యీ బలంబు సమయింపు — ఇ ఉ; యీ బలంబు జదుపు - త. 2. మహత్వంబున — కొన్ని ప్రతులు. 3. శేషించిన జనంబులు — పెక్కు ప్రతులలో లేదు. 4. నాత్మసేనం — పెక్కు ప్రతులు. 6. సేసె — కొన్ని ప్రతులు.

166 1. దన్నును ధిక్కరించి — ప శ. 2. మృత — ఉ.ప.జొ.ట.త. 3. గీడొందఁ — పెక్కు ప్రతులు.

167 1. నలఁత, నులియ, నరియ, నురియ, మఱియు — అనియు పాఠములు. 2. నడలి, నలికి, నలిఁగి, నెఱిఁగి — అనియు పాఠములు.

168 1. దేల్చి, దేర్చి, వినుతించి, నుతియించి, దలంచి — అనియు పాఠములు. 2. ననంత -

ననేకధేనువు[3]లనొసంగి దురితోపశాంతి యొనర్చి నట్టి బకాశ్రమంబున నుండి రేవతీరమణుండు యయాతంబునకుం[4]బోయె నందు యయాతి యజ్ఞంబున భోజనసమయంబున ఘృత[5]దుగ్ధాదులయందు విప్రుం డెయ్యది గోరిన నది యెల్ల సరస్వతి సుపూర్ణ[6]మనోరథంబు గా నొసంగుచు వచ్చె నయ్యెడఁ గదలి [7]వసిష్ఠావగాహంబునకు [8]వచ్చెఁ దత్ప్రదేశంబు దొల్లి విశ్వామిత్రునాశ్రమం బతండు వసిష్ఠునెడఁ దపోవిషయమత్సరంబునఁ గుపితుం డై.

169 సీ. అతని వధించుటకై సరస్వతి [1]మదిఁ
దలఁచిన నానది తత్క్షణంబ
సౌమ్యవేషంబున జనుదెంచి నిభృతయై
పని యేమి యనిన నమ్ముని వసిష్ఠు
గొనిరమ్ము నాకడ కని [2]పంచెఁ బంచిన
వార లిద్దఱు తపోవైభవంబు
నకు భయ మందుచు నరనాథ యరిగి వ
సిష్ఠున [3]కప్పని సెప్పెఁ దెలియ

తే. నాతఁ డవ్వాహినికి నిట్టులనియె నన్ను
నీవు గొనిపోక తక్కిన నీకు శాప
మిచ్చు నగ్గాధిసుతుఁడు దదిచ్ఛనలువు
మించు[4]కేనియుఁ [5]గొంకక యెప్పుడైన.

170 వ. అని యనుజ్ఞ యిచ్చిన సరస్వతి యత్తపస్వి తనచేరువ నొకప్పుడు జప యుక్తుండై యుండం గూలాప[1]హారణంబు సేసి [2]వఱుత నమ్మహాత్మునిం గొని[3]పోయిన నతం డాంగిరసమంత్రముల నత్తరంగిణిం [4]బ్రిణుతించె

---

పెక్కు ప్రతులు. 3. లొసంగి — కొన్ని ప్రతులు. 4. జనియె — ఘ.చ. 5. పక్వాన్నాదుల — వీ.శ ష. 6. మనోహరంబుగా — పెక్కు ప్రతులు. 7. వసిష్ఠోపవాసంబునకు. వసిష్ఠాశ్రమంబునకు, వసిష్ఠప్రవాసంబునకు—అనియు పాఠములు. 8. జనియె — పెక్కు ప్రతులు.

169 1. మతిఁ — ఓ.వ. 2. పనిచె, పుచ్చె — అనియు పాఠములు. 3. కపుడు — ఔ. 4. కైనను — ఆ. 5. గొదుక — ప; యొలమి మిగుల — త.

170 1. పహారంబు — పెక్కు ప్రతులు. 2. వఱద — వీ శ.ష. 3. పోవ — పెక్కు ప్రతులు; పోయి యొప్పించిన విశ్వామిత్రుండు ప్రీతుం డై—ఇ.వీ.శ.ష. 4. ప్రశంసించె—వీ.శ.ష.

నదియు [5]సంప్రీతయగుచు [6]నమ్ముని [7]విశ్వామిత్రునకు సన్నిహితుం జేసిన నతని నగ్గాధిసూనుండు వధియింప సాధనం బన్వేషించునాలోన వంచించి [8]యాప్రవాహం బవ్వసిష్ఠుఁ దొలంగించినఁ గోపించి విశ్వామిత్రుండు శోణితవాహిని [9]వగుమని [10]శపించిన నొక్కసంవత్సరం బత్తటిని [11]దైత్య సేవితయై యుండె నత్తీర్థంబునకుఁ గొందఱుమును [12]లేతెంచి యాదుర వస్థ నాలోకించి.

171 తే. అమ్మహానది నడిగి వా రత్తెఱఁగు
దెలిసి నిజయత్నబలమునఁ దీర్చెఁ దీఱ
[1]నట్టిదురవస్థ వారలు నాత్మఁ బ్రీతి
[2]యూనఁ జలిపిరి [3]పావనస్నానవిధులు.

172 వ. అప్పుడు గొందఱు బ్రహ్మరాక్షసు లమ్మునులకుఁ బ్రణమిల్లి తమచేసినవిప్ర ద్వేషగురుజనావమానదుష్టాన్నభక్షణాదులగు పాతకంబులు వేఱువేఱ యుపన్యసించి యే మియ్యెడ వసియించి యున్నవారము మాకు నిష్కృతి యనుగ్రహింపవలయు ననుటయు వార లాపనికి సరస్వతిం బ్రార్థించిన నమ్మహానది యరుణానదివలన నట్టితెఱం గగు టెఱుంగుం గావున నిగూఢంబుగా నరుణందనలోనికిఁ దెచ్చి దీన మజ్జనంబు సేయుఁ డని యనుమతి సేసిన.

173 ఆ. అజ్జలము[1]ల గ్రుంకి యాబ్రహ్మరాక్షసుల్
తనువు లచట విడిచి ధర్మపరుల
గతికిఁ బోయి రట్టు లతిగూఢ మై యున్న
యరుణతెఱఁ గెఱింగి యమరపతియు.

---

5. సుసంప్రీత, సుముదమ్మున — అనియు పాఠములు. 6. నమ్మునీంద్రుని — పెక్కు ప్రతులు. 7. పిడ్డాని చనియెనంత — పీ.శ.ప. 8. తత్ప్రవాహం — పీ.శ.ప. 9. వి గమ్మని — కొన్ని ప్రతులు. 10. శపియించి — కొన్ని ప్రతులు. 11. దైత్య ప్రేరితయై — ఎ; దైత్యశీలితయై — వ. 12. లరుగుదెంచి — కొన్ని ప్రతులు.

171 1. నధిప — పెక్కు ప్రతులు. 2. యానసలిపిరి — పీ.శ.ప. 3. యానది — ఎ.ఐ.గ.వ; వాసర — వ; వాసవ - ట.

173 1. ల — పెక్కు ప్రతులు; న — వా.

174 వ. తాను సఖ్యంబు సేసి నమ్మించి నముచి జంపిన[1] పాపంబు తదీయస్నానంబు నం బాపికొనియె నట్టిపుణ్యస్థానంబునుండి [2]యత్తాలధ్వజుండు సోమతీర్థంబు నకుం జనియె నది సోముండు రాజసూయంబు చేసినచో టయ్యెడ ననిమిషులు షణ్ముఖునకు నిర్జరసేనాధి[3]పత్యంబునకు నభిషేకంబు సేసి రతండు తారకాదు లైన యసురులం దెగ[4]టార్చె నతనిజననాదివృత్తాంతంబు కౌరవ వంశజాతుండ వగునీకు వినఁ దగుఁ జెప్పెద నాకర్ణింపుము.

### —: కుమారస్వామి ప్రభావాభివర్ణనము :—

సం. 9-43-56

175 ఆ. హరుఁడు దనదువీర్య మగ్నియం దిడిన వ
హింపఁజాల కజున కెఱుఁగఁ జెప్పి
యతఁడు వనుప దాని నగ్ని గంగాగర్భ
[1]భూతముగ నొనర్చె భూపవర్య.

176 వ. తేజోమయం బైనయాగర్భంబు గంగ హిమవన్నగంబుమీఁద సముత్సృష్టంబు సేసినఁ గనకమయం బైనశరస్తంబంబున నగ్నిసన్నిభుం డగుకుమారుం డై యొప్పె నయ్యెడ మెలంగుకృత్తిక లక్కుమారుం గని పుత్రార్థిను లై యందఱు[1]నొక్కపెట్ట వీఁడు [2]మాకొడు కని పలుకుచుఁ గరతలంబుల [3]నెత్త నప్పు డయ్యార్వుఱ[4]చన్నులుం జేఁపిన [5]నద్దారకుండు చంద్రనిభంబు లైనయాననంబు లాఱు దాల్చి [6]సప్తమాతృస్తన్యపానం బాచరించిన విస్మయప్రమోదభరిత లై వారలాశిశువు నెప్పటియెడన యునిచి ర ట్లయ్యగ్నిభవుండు గాంగేయుండును [7]శరజన్ముండును గార్తికేయుండును నయ్యె నయ్యెడకు బృహస్పతి యేతెంచి జాతకర్మాద్యనుష్ఠానంబుల

---

174 1. పాతకంబు — పెక్కు ప్రతులు. 2. తాళ — కొన్ని ప్రతులు. 3. పత్యాభిషేకంబు సేసి — పెక్కు ప్రతులు. 4. టార్చివేర్చె (ర్చె) న — పెక్కు ప్రతులు.

175 1. పూరమున — అ.

176 1. నొక్కట — కొన్ని ప్రతులు. 2. నా — పెక్కు ప్రతులు. 3. నెత్తిరప్ప — కొన్ని ప్రతులు. 4. చన్నులు చేఁప — వి.శ.ష. 5. నబ్బాలకుండు — కొన్ని ప్రతులు; నక్కుమారుండు — అ; నత్తారకాంతకుండు — త; నత్తారకహరుండు — ఖ. 6. సకల, సమస్త, నయ్యార్గుర — అనియు పాఠములు. 7. శరజన్ముండును - ఇది పెక్కు ప్రతు

నిర్వర్తించి పోయెఁ దత్ప్రదేశంబు దనమహానుభావంబున జాత[8]రూప
మయం బై యుండు.

177 క. విను మకుమారుఁ డుత్తను
మనఁ దగియెడుతపము దనవిహారముగా వ
ర్ధన మొందె[1]ధాత్రిధాత్రిగ
ధనురాగమమును శ్రుతులును [2]దనుఁ గొలువంగన్.

178 వ. ఒక్కనాఁ డకుమారుం జూచువేడుక శివుండు శైలకన్యకయుం దానుఁ
బ్రకృష్టజలపరాక్రమంబులు నానాప్రకారవదనశరీరంబులు గలుగు ప్రమథ
గణంబు గొలువ నయ్యెడకుఁ జనుదెంచె నప్పుడు బ్రహ్మవిష్ణులును
నింద్రాది[2]దిక్పాలురును రుద్రాదిత్యమరుద్వసుప్రభృతిసకల[3]సురులును
గరుడగంధర్వకిన్నరకింపురుషసిద్ధవిద్యాధరయక్షాదిదివ్యులును మునులును
మఱియుఁ బితృదేవతలును ననుచరసమేతు లై [4]యేతెంచిరి మూర్తిమం
తంబు లై యోషధిసరిత్సముద్రపర్వతంబులు నరుదెంచె నిట్లు నిజదర్శన
కౌతుకంబున వచ్చిన యమ్మహాసమూహంబున కభిముఖుం డై యోగ
బలాన్వితుం డగు నబ్బాలుండు తా నన్నిలగ్రీవుండు నిరీక్షించి [5]యంతర్గ
తంబున.

179 తే. ఉమయు నగ్నియు గంగయు నుండ నన్ను
[1]గారవంబున [2]నధికునిఁగాఁ దలంచి
చక్క నాపాలి కేతెంచునొక్కొ వీఁడు
సంభృతస్నేహ[3]భక్తివిస్రంభుఁ డగుచు.

---

అలో లేమ. 8. రూపంబై — పెక్కు ప్రతులు.

177 1. నాగమమ్ములు ధనురాది శ్రుతులు వరుసఁ — పీ.శ.స ; ధాత్రిమీఁదను, ధాత్రి
నెంతయు - అనియు పాఠములు. 2. దగఁ గొలువంగన్ - కొన్ని ప్రతులు ; దను
వర్ణింపన్ -- ఊ.

178 1. నుత్కృష్ట - ఘ.వ.పీ.శ.ష. 2. దిక్పాలకులును — కొన్ని ప్రతులు ; దిక్పతులును —
కొన్ని ప్రతులు. 3. సురమునివరులును - అ. 4 చనుదెంచిరి - పీ.శ.ష. 5. యాత్మ
గతమున, యంతరంగంబున — అనియు పాఠములు.

179 1. గౌరవంబున — కొన్ని ప్రతులు. 2. నధికుండుగా, నధికంబుగా — అనియు పాఠ
ములు. 3. భరిత — అ.ఎ.ఐ.ఒ.గ వ.

180 క. అనుచుండఁగ నమ్మువ్వురు
తనతనచిత్తమున నట్ల తలఁపఁగ నది యె
ల్లను దివ్యబోధమునఁ [1]గని
కొని యబ్జాలుఁడు [2]యోగకుశలత [3]వెలయన్.

181 వ. మూర్తిచతుష్టయంబు దాల్చి యన్నలువుర యొద్దకు నేకకాలంబునం జనినం గని యెల్ల[1]వారు [2]నద్భుతమగ్నమానసు లై రక్కుమారుండు పదంపడి యొక్కరుం డై పొలిచి నిలిచె నప్పుడు.

182 చ. హరుఁడును గంగయున్ శిఖియు నంబికయుం [1]బ్రణిపాతపూర్వని
ర్భరవినయంబుతోడఁ దగఁ బద్మజుఁ జేరి మహాత్మ యిక్కుమా
రురుచిరమూర్తికిన్ గుణగురుత్వవిభూతికి నీడు గాఁగ ని
మ్మర[2]సి యుదాత్తమైన[3]పద మన్న నతండు ప్రియం బెలర్పఁగన్.

183 వ. [1]దేవహితపరుం డగుటం జేసి చిత్తంబునఁ దలపోసి వీఁడు [2]దేవసేనకుం బతి యగుం [3]గాక యని నిశ్చయించి [4]వారల వీక్షించి యవ్విధ[5]మెల్లవారును వినం దెలియఁ బలికి శక్రవరుణాదు లగు మేటివేల్పుల నబ్జాలునకుం జూపి వీరు నీకు రక్షణీయులని [6]యప్పగించె నయ్యమరవరు [7]లక్కుమారు నభిషేకంబు [8]సేయుద మని [9]వారిజాసనుం బురస్కరించుకొని [10]యెల్లవారును దోడన యరుగుదేర సరస్వతీ[11]సమీపంబునకుం [12]జని సకలరత్న

---

180 1. గనుగొని, గనిగొని, గైకొని—అనియు పాఠములు. 2. దివ్య—అ. 3. మెఱయన్—కొన్ని ప్రతులు.

181 1. వారలు – పెక్కు ప్రతులు. 2. నానంద – పీ.శ.ప.

182 1. ప్రణవార్థ – అ.ఈ; ప్రణవాది–ఇ; ప్రణతాత్మ – జ.ల. 2. య – పీ.శ.ప. 3. వర – అ.

183 1. దేవలోకోపకరుండగుటంజేసి – ఖ. 2. దేవసేనాపతియగుం – పీ.శ.ప; దేవతాసేనలకుంబతి – చ. 3. గాక యని వారల – బౌ.క.త. 4. యమరుల వీక్షించి – జ. 5. వారలకుం దెలియఁ—పీ.శ.ప. 6. యప్పగించిన—పెక్కు ప్రతులు. 7. లక్కుమారునకు – అ ఈ.ఊ. 8. సేయుండన వారువారి – ఊ. 9. వారిజభవుం – ఐ.గ. 10. యెల్లదేవతలును – ప; యెల్లదేవతలలో – అ. 11. తీరంబునకుఁ – అ.ఊ.వ. 12. వచ్చి – ఈ.ఊ; వచ్చిరివచ్చి – ఖ; కరిగి – ఒ.జ; జనికనక – అ.

మయం [13]బై నదివ్యపీఠంబు [14]హిమవంతుండు వెట్ట నందాభూతపతిపుత్రు నునిచి బృహస్పతి[15]హోమకార్యంబు నిర్వర్తింప నీశానవిష్ణు[16]విధికౌశికులు లోనుగా నమరముఖ్యు లభిషేకద్రవ్యంబులు సారస్వతజలపూర్ణమణికనక [17]కలశంబులు ధరియించి గంధర్వాప్సరోగణంబులు సంగీత[18]మంగళంబాచ రింప మహామునిప్రకరపుణ్యాహ[19]ఘోషంబులు సెలంగ నుమా[20]శ్రీసర స్వతీశచీప్రముఖ లైనపుణ్యాంగనలు దీవనలతో సేస[21]లొలుక నభిషేకించి [22]సమ్మోదంబున [23]సేనాధిపత్యంబునకుం బట్టంబు గట్టిరి తొల్లి తత్ప్రదే శంబున దేవతలు జలాధి[24]పత్యంబునకు వరుణు [25]నభిషిక్తుం జేసి రవ్వ రు[26]ణాభిషేకంబుకంటెఁ గుమారాభిషేకం బొప్పె నప్పావక సంభవునకుఁ గామ[27]దమనకమలభవశార్ఙ్గిశతమఖ[28]ప్రముఖు లగుసకల ప్రభువులు దమతమయనుచరులయందు రూపగుణబలపరాక్రమాధికు లైన వారి [29]నేటి భీమఘంటాకర్ణ[30]సంక్రమదండధరసహితు లగు ననేకవీరుల నొసంగి వారల బెరసి వర్తించుటకుఁ దగిన సేనాంగసముదయంబు [31]నమ్మహితాత్మునకు మూలబలంబుగా [32]నొనర్చి రబ్బలంబులఁ జిత్రా భరణవర్మాయుధధరులును వివిధప్రకారాకారులు నగు గజకర్ణనికుంభకుము దాదులైన సైనికులు మెఱసి యుల్లసిల్లి రమ్మాఁకలతో శత్రుభయంక రంబు లగుచు మాతృకాగణంబులు ప్రభానీనీవిశాలాక్షి[34]పాలితాపుర స్సరంబు లై [35]పాలిచె నట్టియెడ.

---

13. బగు — పెక్కు ప్రతులు. నలంకారశోభితంబుగా 14. హిమవంతుండు — చ. 15. దగు — ఐ.గ;హిత — చ ; 16. కమలాసనులు — వీ.శ.ష. 17. కుంభములును ధరియించి — ఆ.ఓ. 18. మంగళగానంబులు, మంగళపాఠంబు — అనియు పాఠములు. 19. వాచనారవంబులు సెలంగ — పీ.శ,ష. 20. రమా — వీ.శ.ష. 21. లుచల్ల — అ.ఇ ఎ.ట.వ; లు చిలుక — చ. 22. రాసమయంబున — వీ.శ.ష. 23. దేవసేనాధి — ఐ.గ.ల.వ. 24. పతిత్వమునకు — కొన్ని ప్రతులు. 25. నకభిషేకించిరి, నకభిషేకంబు — అనియు పాఠములు. 26. ణాభిషేచనంబు — కొన్ని ప్రతులు. 27. దహన — ఈ.ఊ.ఘ.వ ; వాహ — చ. 28. ప్రభృతులగు — పెక్కు ప్రతులు ; ప్రముఖసకల — వీ.శ ష. 29. నేర్చి, నెఱింగి—అనియు పాఠములు. 30. సంక్రమణ—పెక్కుప్రతులు, సంక్రందన — ట.వ. 31. నమ్మహాత్మునకు — అ ఐ.గ. 32. నమర్చి — పెక్కు ప్రతులు. 33. ప్రభాసధీ—వ.వీ.శ.ష; ప్రభావసే, ప్రభావినీ — అనియు పాఠములు. 34. కాపా లికా — అ ; పారికా — ఎ.ఫ. 35. పాలిచిరట్టి — కొన్ని ప్రతులు.

184 సీ. శంకరుఁ డుదితభాస్కరనిభధ్వజమును
వాసవుఁ డసురవిధ్వంసకరణ
పరిణతశక్తియు హరి బలవర్ధని
యగు వనమాలయు నగజ యెప్పుడు
మాయనివెలిపట్టుదోయిని గంగయు
జ్వల[1]సుధామయకమండలువు గురుఁడు
దీప్తదండము వైనతేయుండు మహితము
యూరంబు [2]వరుణుం డుదార[3]రూప

తే. మైనతామ్ర[4]చూడంబును [5]నర్థవిభుఁడు
దర్పితచ్ఛాగమును [6]శతదళభవుండు
[7]లసితకృష్ణాజినంబును[8] నసమసమర
జయము నొసఁగిరి ప్రీతి నాషణ్ముఖునకు.

185 వ. ఇట్లు సిద్ధస్వరూపదీపితుం డైనయతని నాపోవక చూచుచు శంకరుండు వీని కి[1]విభవంబునకు ననాయాసంబున నమరవిరోధి[2]నాశంబు [3]గావించుటకు వలయు నని తలంచి భూత[4]మయం బగు[5]మహా[6]సైన్యంబు సమర్పించె నప్పు [7]డింద్రాదిబృందారకులు నిజబలసందోహంబులతో నాబర్హివాహనుఁ బరివేష్టించిరి శంఖభేరీపణవగోముఖప్రముఖతూర్యంబులు దిక్కులు పిక్కటిల్లఁ జెలంగె నట్లు [8]మహాతి యగు[9]దేవసేనకుఁ బతి యై యమ్మహాసేనుండు సురముఖ్యులఁ జూచి మీ కెవ్వరినేనియుం జంపను జెఱుపను

---

184 1. కాంతిగల – వీ.శ.ష. 2. నగ్నియు – ఆ.ఎ.ఓ వ. 3. దూత – ఇ. 4. కంధరము – ఔ.క.త. 5. నబ్ధివిభుఁడు – కొన్ని ప్రతులు; నబ్జభవుఁడు, నబ్జవిభుఁడు – అనియు పాఠములు. 6. శారదావిభుండు – ఆ.ఓ 7. నసిత, అతుల అనియు పాఠములు. 8. నమర – ఒ.గ.

185 విజయంబునకు – ఎ. 2. వినాశంబు – కొన్నిప్రతులు. 3 నొందింప – అ ఊ 4. భయంకరంబగు – ఊ చ.ల. 5. తనమహా – ఆ ఎ.ఏ.ఒ వ. 6. సేన – వీ శ.ష. 7 డింద్రాది ప్రముఖ, డింద్రాది ప్రభృతి, డింద్రాదిప్రభూత – అనియు పాఠములు. 8. మహావిభూతియగు – అనియు పాఠములు. 9. దేవ – వెక్క

వలసియున్నది యట్టిబల్లిదంపుఁ[10]బగఱం బరిమార్చెద నని వరం బిచ్చిన వారలు [11]బహుప్రమోదంబు నొందిరి సేనయార్చినఁ ద్రిలోకంబులు నాదమయంబు లయ్యె నవ్విధంబున విశాఖుని నుత్తమపదస్థుఁ గావించి విరించివైకుంఠశ్రీకంఠులు నిజేచ్ఛఁ జనిరి పదంపడి యగ్గుహుండు దేవతలు దారకాసురునివలన [12]నలంగి యునికి యెఱింగి.

186 క. బలయుతముగ నడచిన న
బ్బలియుండు ననేకదైత్యబలములతో న
గ్గలిక [1]నెదురు నడచెను ద
ద్బలయుగమున కక్కజంపు భండన మయ్యెన్.

-: కుమారస్వామి తారకాక్షుం జంపి దేవతలకు ముదంబుసేయుట :-

సం. 9–45–63

187 వ. అట్టియెడ.

188 క. తనకొరలుఁ దాను దారక
దనుజేంద్రుఁడు గార్తికేయుఁ దాఁకిన నమృతా
శనగణసమ్మదసంపా
దనుఁ డగుచును శక్తి యతఁడు ధరియించె నృపా.

189 వ. అమ్మహనీయసాధనంబున ననేకకోటిశక్తు లుద్భవించి నానాదానవప్రకరంబుల బడలువడం [1]జేసి యుల్కాసహస్రంబుల పిడుగులతండంబుల ప్రోఁతచందంబున [2]విరావం బావహిల్ల నది ప్రయోగించి యమ్మహాత్ముండు మహిషత్రిపాదభృతోదరు లను దనుజసేనాపతులం బొలియింప నిలింపసైన్యంబులు సంరంభంబున [3]దైత్యబలంబులం దెగటార్చె నక్కుమారుండు [4]ప్రయోగింప నాశక్తి [5]పగతు[6]రం బిలుకుమార్చి క్రమ్మఱఁ గర

ప్రతులలోలేదు 10. వైరి – జొ. 11. బహుళ (ల) – పెక్కుప్రతులు. 12. గలంగి – ల.వీ.శ.ప.

186 1. నెదురవచ్చిన – ఆ. నెదురువచ్చిన – ఓ వ.

189 1. జేసెనులా – కొన్నిప్రతులు. 2. అంబునరావంబా, పరివారంబునసా, వీరారావంబా – అనియు పాఠములు. 3. దనుజ – న.వీ.శ.ప. 4. ప్రయోగించిన యా – అ. 5. దైత్యులఁ – ఘ. 6. రఁదెగటార్చి – అ ఎ.ఓ వ ; రఁబరిమార్చి–

తలంబునకు వచ్చుచుండె [7]నత్తారకుం డట్లు దమవారు సమసిన సక్రోధుం డై యగ్గుహునిఁ గిట్టి బెట్టిదం బగు నతని శక్త్యస్త్రంబులతాఁకునం [8]బడియె నిట్లు జయంబు సేకొని యక్కార్తికేయుండు వెలిఁగె విబుధులు ప్రమోదంబు నొందిరి పదంపడి.

190 క. బలికొడుకు [1]బాణుఁడనియెడు
[2]బలవదసురవల్లభుండు బాధించు నమ
ర్త్యులఁ గ్రౌంచపర్వతాశ్రయ
బలిష్ఠుఁ డయి జగములెల్ల [3]భయముం బొందన్.

191 వ. [1]దాని విని యమ్మహాసేనుండు.

192 మ. కడిమిం బోయి మహోగ్రశక్తినిహతిం గ్రౌంచంబు భేదించి యె
క్కుడు[1]గర్వంబున వచ్చి మార్కొనిన [2]రక్షోనాథుఁ దత్సైన్యంబులం
గడువేగంబున రూపుమాపి మునిసంఘుంబుల్ ప్రశంసింపఁ బె
ల్లడరన్ నిర్జరదుందుభి[3]ధ్వనులు పుష్పాసార [4]మొప్పారఁగన్.

193 వ. త్రిభువనానందకరుం డై విజయ[1]విభవాతిశయంబున నొప్పె నిట్లఖిలలోక సంభావనీయం బగు[2]షణ్ముఖుచరితం[3]బు లాకర్ణించి కృతార్థుండ [4]వై తి కౌరవాన్వయపావన యాబలదేవువృత్తాంతంబుకొంత విను మతం డత్తీర్థంబునఁ బ్రతిష్ఠితుం డైన కుమారునకుఁ బ్రదక్షిణప్రణామంబు లాచరించి యందలిపెద్దలు కుమారాభిషే[5]కంబు సెప్పఁ జెవుల[6]పండువు సేసి.

---

ఘ.శ.ష. 7. నట్లు తమవారు సమసిన — ఆ.ఓ. 8. గూలె — అ.ఊ.

190 1. మహీషుఁడని — డ.న.వ. 2. బలవంతుఁడసురవిభుఁడు — పీ.శ.ష ; బలవంతుఁడు లోకమెల్ల భయపడఁగ నమ — ఏ. 3. భయమందంగన్ — పెక్కు ప్రతులు ; భయమొందంగన్ — ఒ న.

191 1. విదారింపుచుండ దానివిని — అ.ప.

192 1. దర్పంబున — అ. 2. నాదుసైన్యంబులం — శ.ష. 3. ధ్వనము — అ 4. మేపారగన్ — జ.క.ఖ ఘ.బ.

193 1. విభాతిశయం — ఊ.ఒ జ.త ; భాసితాతిశయం — ఈ. 2 యస్కమాను — పీ శ ష. 3. బాకర్ణించి — పెక్కు ప్రతులు. 4. వై తివింక నాబలదేవ — పీ.శ.ష. 5. కంబుప్రకారంబు సెప్ప, కప్రకారంబు సెప్ప — అనియు పాఠములు. 6. పండువు గానలయుచు — పీ.శ ష ; పండువుగావిని యచ్చోటువాసి — అ ఎ.

194 ఆ. అగ్నితీర్థమునకు నరిగె నయ్యోడఁ దొల్లి
యగ్ని డాఁగియున్న నమరు లచటి
[1]కేఁగుదెంచి కాంచి [2]రిద్ధశమి[3]గర్భ
లీనుఁ డైన[4]యతని మానవేంద్ర.

195 వ. భృగుశాపంబునం బ్రాపించు సర్వభక్షకత్వంబునకుఁ జాలక దొలంగి[1]న యగ్నిదేవు నట్లు [2]గని [3]బ్రహ్మాదిదేవత లమ్మునివచనం బమోఘంబు గావున నీవు సర్వభక్షుణుం డయ్యు [4]మాలో నగ్రపూజ్యుండ వని యొడం బఱిచి నిజస్థానంబునకుం జనువప్పు డత్తీర్థంబు పరమపావనం బని తజ్జలంబులఁ గృతస్నాను లైరి యందుండి యా[5]సీరి కౌబేరతీర్థంబునకుం జనియె [6]నది కుబేరుండు దపంబు సేసి ధనాధిపత్యంబు మొదలైనవరంబులు వడసి[1]నచో టయ్యోడ గదలి యతండు.

—: ప్రభావతియను మునికన్యక మహిమాభివర్ణనము :—

సం. 9—47—2

196 సీ. బదరిపాచన [1]నామ పరమతీర్థమునకుఁ
జనియె భరద్వాజతనయ తొల్లి
యచటఁ [2]బ్రభావతి యనునది యింద్రుండు
పతిగాఁగఁ గోరి తపంబు సేయ
నతఁడు వసిష్ఠునాకృతి దాల్చి వచ్చిన
నయ్యింతి యర్ఘ్య[3]పాద్యాదు లిచ్చి

194 1. కరుగుదెంచికాంచిరచట — ఊ. 2. రెలమి — అ.ద. 3 వృక్ష — ఎ. 4. వాని మానవేంద్ర — పీ.శ.ష.

195 1. యట్లున్నయగ్ని — పీ.శ.ష. 2 గనితెచ్చి, తలంచి, తెలిసి — అనియు పాఠములు. 3. సర్వభక్షుణుండయ్యుఁద్రిభువనపావనుండు (నంబు) గావరంబిచ్చి బ్రహ్మాదిదేవతలు — ఇ పీ.శ.ష. 4. మాలోనగ్రపూజ్యుండవని యొడంబఱచి — ఇది పెక్కుప్రతులలోలేదు. 5. కామపాలుండు, సీరపాణి — అనియు పాఠములు. 6. నదిమున్ను కుబే — అ.ప. 7. నచ్చోటుగదలి — కొన్నిప్రతులు.

196 1. మనఁబరఁగు — పీ.శ.ష. 2. ప్రతావని, శుభావతి, శ్రుతివతి — అనియు పాఠములు. (1) గమనిక — 'భరద్వాజస్య దుహితా రూపేణాప్రతిమాభువి సుచావతీ నామ విభో కుమారీబ్రహ్మచారిణి' అని మూలము. భం 9—47—2. ఇట్లు మూలమున ఇట్లు మూలమున ప్రభావతిఅనుటకు మాఱుగా సుచావతీ అని కాన్పించు చున్నది. (2) కుంభకోణప్రతిలో ఇట శ్రుతావతీ అని కలదు. 3. పాద్యంబు — చ.ల.పీ.శ.ష.

భక్తితోఁ జేరి మత్పాణి శక్తిన కిచ్చు
దాన నప్పాణిక మానఁ గాని

తే. వలయుపనిఁ బంపుఁ డన్న నవ్వ్వాలయ నమ్మ
హాత్ముఁ డది యట్ల యగుఁ [4]గాని యతివ వీనిఁ
[6]బక్వములు సేయుమని కొన్ని బదరిఫలము
లానితంబినిచే నిచ్చి యవులనుండ.

197 వ. అదియును గృతస్నానయుఁ గలితధౌతపరిధానయు నై [1]ప్రొయిరగ్ని రాజఁబెట్టి యాఫలంబులు జలంబులతోడఁ గూడ నెక్కించి వండుచుండ నవి పాకంబునకు రాకయుండ వెండియుఁ దనసవరించినకాష్ఠంబు[2]లు క్రమంబున [3]నిడి యనలంబు ప్రబలంబు [4]సేయఁ గాష్ఠంబులు సమసెఁగాని యారేఁగుఁ[5]బండ్లురియవయ్యెఁ గాష్ఠంబులు [6]గలయెడకుం బోయి తెచ్చు నంత కగ్ని [7]యాఱనేని దుష్పాకం బగు నని యామగువ తనకా లింధ నంబుగా నిడి పాకంబు సేయఁ [8]గనుంగొని పాకశాసనుం డచ్చేరు వొంది ప్రత్యక్షుం డై [9]శుభాంగి నీదుని[10]ష్ఠాతిశయంబునకు మెచ్చితి భవదభిమతం బిచ్చితిని తనువు విడిచి త్రిదివమ్మునకు రమ్మ సర్వపాపహారం బై యీతీర్థంబు లోకత్రయ[11]ప్రఖ్యాతం బయ్యెడు మని యె నమ్మహాభాగయు నాసుమనోవిభునకు [12]మనోరమ యై వెలసె నట్టిబదరిపాచనంబుననుండి.

198 ఆ. ఇంద్రతీర్థమునకు నేఁగె నాబలభద్రుఁ
డచట నూఱుక్రతువు లాచరించి
యనిమిషేశ్వరుండు గని యె శతక్రతుఁ
డనుప్రసిద్ధితోడ నతులపదము.

---

4. గాక — పెక్కు ప్రతులు. 5. వినుము — ఇ. నాకు — ఐ.గ. 6. పాచనము — అ.ఎ.ట ; భక్ష్యములు — గ.

197 1. పొయి — కొన్ని ప్రతులు ; పోయి — ఎ.క. 2. తెల్ల — పెక్కు ప్రతులు ; చెల్లం — ట.న. 3. నిడుచు — పెక్కు ప్రతులు, 4. సేయఁగాష్ఠ — కొన్ని ప్రతులు. 5. ఫలంబులు విరియవయ్యె — చ; బండ్లెప్పటియట్లు నుడుకకున్న — త. 6. తీఁగల— అ.ఊ. 7. యాఱిన — పెక్కు ప్రతులు. 8. గనుంగొని యప్పానికకుఁ బాక — ఆ.ఔ.క.త.న. 9. శుభాసతీ — ఘ ; శుభాంగీ — ఉ. 10. పాతివ్రత్యాతిశయం బునకు — చ. 11. ప్రఖ్యాతివడయు — వీ.శ.ష. 12. హార — కొన్ని ప్రతులు.

199 వ. అచ్చోటు గదలి హలాయుధుండు రామతీర్థంబునకుం [1]బోయెఁ బలుమాఱు రాజుల నెల్లను బోరిగొని పరశు[2]రాముం డతృప్తుం డై ప్రాయశ్చిత్తంబుగా నయ్యెడఁ [3]గశ్యపునుపదర్శనంబున [4]రాజసూయంబులు నశ్వమేధంబులు వాజిపేయంబులు ననేకంబు లొనర్చి యమ్మునీంద్రునకు దక్షిణసమస్తక్షోణియు నొసంగె నందుండి [5]యయ్యేకకుండలుండు యామునంబునకుం జనియె నది వరుణుండు రాజసూయంబులు సేసినపట్టావభృథంబునవసానంబున దేవాసురులకు సకలభూతసంక్షయకరం బగుచున్న సంగరంబు ప్రవర్తించె.

200 ఆ. [1]అచటు గదలి యాతఁ డాదిత్యతీర్థసం
సేవనమున కరిగె [2]ధీవిశాల
యందుఁ గ్రతు వొనర్చి యాదిత్యుఁ డుజ్జ్వల
[3]జ్యోతిషాధిపత్యశోభి యయ్యె.

201 వ. ద్వైపాయనుండును శుకుండును గృష్ణుండును [1]జైమినియు మఱియును [2]దేవల[3]జైగీషవ్యాదు లగునైష్ఠికు లనేకు లయ్యెడ నద్భుతయోగసిద్ధిం బొందిరి.

202 తే. అచటనుండి సారస్వత మను[1]వసిష్ఠ
తీర్థమున కేగె నాబలదేవుఁ డధిప
యందుఁ దొల్లి నిష్ఠాతిశయంబు మై [2]ద
ధీచి యనుముని నియమంబు లాచరించె.

---

199 1. జని — కొన్ని ప్రతులు. 2. రాముండు ప్రాయశ్చిత్తంబుగా — పెక్కు ప్రతులు. 3. గశ్యపుఁడుపద్రష్టగాఁగ — పీ.శ.ప. ; గశ్యపోపదేశంబున — కొన్ని ప్రతులు. 4. రాజసూయంబులు — పెక్కు ప్రతులలో లేదు. 5. యాబలరాముండు. యయ్యదుకుంజరుండు, యయ్యదుఘనుండు — అనియు పాఠములు.

200 1. అచట — కొన్ని ప్రతులు. 2. చెలువుమిగుల — అ.ఈ.ప ; నావిశాల — కొన్ని ప్రతులు ; ఘూవరుండు — ఖ. 3. జ్యోతిరాధిపత్య — పెక్కు ప్రతులు.

201 1. జైమినియు — పెక్కుప్రతులలో లేదు. 2. దేవయోగులు — పీ.శ.ప; దేవతలును — కొన్ని ప్రతులు. నాదిగాఁగలనైష్ఠి — పీ.శ.ప.

202 1. విశేష, విశిష్ట — అనియు పాఠములు. 2. దధీచుఁడను — పెక్కు ప్రతులు.

203 వ. ఆనియమాచరణంబునకు [1]నింద్రుండు శంకించి [2]తద్విఘ్న కరణంబు[3]నకు [4]నలంబుస యనునప్సరోవనితం బుత్తెంచినఁ దదీయదర్శనంబున నమ్ముని వీర్యంబు స్ఖలించిన దాని సరస్వతి గర్భంబుగా ధరియించి పుత్త్రుం గాంచి తపస్విజనగోష్ఠి నున్న యత్తపోధనుకడకుఁ దెచ్చి వీఁడు నీకొడుకు భవత్తేజంబు వృథ వోనీక యేను వహించి కాంచితి వీనిం గైకొను మనిన నతండు వాని నెత్తికొని యాలింగనంబును [5]మూర్ధఘ్రాణంబును జేసి [6]యాసరిద్వర నాలోకించి నీవు బ్రహ్మ[7]సరస్సున జనియించితి పుణ్యనదుల యందు మేటి వని సంస్తుతించి [8]నీజలంబులం దర్పణంబు సేసిన [9]విశ్వేదేవతలుఁ బితరులు గంధర్వులుఁ [10]దృప్తు లౌదు రని యనుగ్రహించి యిక్కుమారుండు నీ పేర సారస్వతుం డనం బరఁగుఁ బదంపడి పండ్రెండేండ్లనావృష్టి [11]యైన నయ్యాపదఁ [12]బొంద కుండఁ బెక్కండ్రు[13]మునుల రక్షించి [14]వేదాధ్యయనంబులు సేయించు నని [15]చెప్పి [16]యొప్పగించిన సరస్వతి ప్రీతయై తనయుం గొని చనియె నాకాలంబున.

204 క. [1]అమరులకు నసురుల[3]కుఁ గల
హము గలిగిన[3] బలవిరోధి యాయుధనికురుం
బము నవరించుమహోద్యో
గమునఁ బ్రవర్తించె వీరకౌతుక మలరన్.

205 వ. అట్లుద్యోగించి.

---

203 1. శక్రుండు — పెక్కు ప్రతులు. 2. తద్విఘ్నంబునకు - వీ.శ.ష. 3. నకతని శీలంబు సమయ — అ ఓ. 4. నలంబుస — పెక్కు ప్రతులు. 5. మూర్ధ్ని - పెక్కు ప్రతులు. 6 యాసరస్వతి — జ బ.ల ; యాసరస్వతీనది నుద్దేశించినీవు - మ. 7. శిరస్సు, తేజము. శిరంబు - అనియు పాఠములు. 8. నిజజలంబులం — ఈ.ఉ. వ. 9. విశ్వ — పెక్కుప్రతులు. 10 దృప్తులుగాఁగలరని — పెక్కు ప్రతులు. 11. యయ్యేడు — శ.ష. 12 బొరయ — పెక్కు ప్రతులు. 13. మునుల — పెక్కు ప్రతులు. 14. వేదాధ్యయనసంపన్నుంచగునని - వీ శ.ష. 15. నిర్దేశించి— ఇ.ఉ. 16. యొప్పించిన — పెక్కుప్రతులు.

204 1. 'త' ప్రతిలో ఈ పద్య మి ట్లున్నది:-
అమరులకు నసురలకుఁ గల
సమరిన యాయుధము లొప్ప నంపరికిని దా
సమత దగవేడ నిచ్చుచు
విమలయశోనిరతుఁ డగుచు వెలసె నతండున్.

2. కునుసమర - వీ.శ.ష. 3. నను హరియు సాధన నికురుం — వీ.శ.ష.

206 చ. జగముల నెందునుం బడయఁ జాల కతండు [1]దధీచియస్థులం
దగిలెడునాయుధం[2]బు లగుఁ [3]దత్పరతం జని [4]వేఁడ నాతఁ డి
చ్చు గురుతరాత్మ యోజ్జ్వలయశో[5]నిరతుం డని పంపఁగా నిలిం
పగణము [6]పోయి వేఁడి[7]న నృపాలక [8]యిచ్చె నతండు ప్రీతితోన్.

207 వ. [1]ఇచ్చి యతం డవ్వ్యయలోకంబున కరిగె నమరవరుండును దదస్థుల వజ్రా యుధంబు [2]నొనర్చి పేర్చె నంత నాసారస్వతుండు ద్వాదశ[3]వార్షికం బగునవావృష్టి[4]దురితంబునఁదన్నుం జేరి పిన్న యనక విద్యావిశేషకలితం బైనగౌరవంబున [5]శిష్యత్వంబు [6]భజియించినయఱువదివేవురు మునుల సరస్వతీ[7]ప్రభావజనితం బగునన్నంబున [8]రక్షించుచు వేదంబుఁ [9]జదివించె నా[10]సారస్వతతీర్థంబున నుండి యాసంకర్షణుండు వృద్ధకన్యాశ్రమంబు నకుం బోయె నయ్యెడ గర్గవంశ [11]వర్యుం డగు[12]ఖని యనుతపోధ[13]నుండు.

208 తే. పరమతపమున నొకకన్యఁ బడసి పెంచి
[1]దివమునకు నేఁగె నది తప[2]స్స్థిరతఁ బూని
[3]పతి వరింపంగ నొల్లక బ్రహ్మచర్య
మున [4]వెలింగి యయ్యాశ్రమమున వసించె.

---

206 1. దధీచునస్థులం — కొన్ని ప్రతులు. 2. బులుగఁ — అ.ఏ.ఐ.ఖ.గ.వ. 3. దత్పరత — అ.ఓ.ఖ. 4. వేఁడుఁ డాత — కొన్ని ప్రతులు. 5. భరితుండని — ట.వ; నిలయుం డని — చ. 6. లోలి — ఒ.జ. 7. నను పన్నుగ నిచ్చె — అ ఏ. 8. యాతఁడు నిచ్చె — ఇ.

207 1. ఇట్లిచ్చి — వ.శ.ష; అట్లిచ్చి — వీ; ఇచ్చియవ్వ్యయ — పెక్కు ప్రతులు. 2. నొనర్చి యసురుల నోర్చె, నొనర్చి యసురుల నోర్చి, నొనర్చి యసురుల నొప్పించె — అనియు పాఠములు. 3. వర్షంబులనా—వీ.శ.ష. 4 దోషంబున—కొన్ని ప్రతులు. 5. శిష్యత్వ నియతిం — వీ.శ.ష. 6. జరించి — వీ.శ.ష; భరియించిన — ఎ; భజించిన — ఐ. 7. ప్రభావంబున — నన్నంబుఁ బెట్టి — అ. 8. సంరక్షించుచు — ఈ; రక్షింపుచు వేదంబులు — పెక్కు ప్రతులు. 9. జదివించు చుండె, నడిపించె, జదివింపుచుండె — అనియు పాఠములు. 10 సరస్వతీ — పెక్కు ప్రతులు, 11. సంభవుండగు—వీ.శ.ష; వరుండగు, కరుండగు — అనియు పాఠములు 12. కుణి, మణి, గుణి — అనియు పాఠములు. గమనిక :— 'ఖని' యనుపేరు 'సోరెన్సన్' మహాభారతనామానుక్రమ ణికలో లేదు. 13. ధనవర్యుండు — ఉ.క.

208 1. దేవపథమున నేఁగె నస్థిరతఁబూని — చ. 2. స్థితియ — కొన్ని ప్రతులు. 3. పతినివరి యింప — ఒ.వ. 4. పెరిఁగి — అ.

209 వ. పదంపడి యత్యంతవృద్ధయై పరలోకగమనంబు గోరె నప్పుడు యదృచ్ఛా సన్నిహితుం డైన నారదుం డక్కన్యక కి ట్లనియె.

210 క. విను పాణిగ్రహణము సే
యనివనితకుఁ బుణ్యలోక మప్రాప్యము గా
వున నేయుపాయమున నై
నను దగియెడువరు వరింపు నలినదళాక్షీ.

211 ఆ. అనిన నిజతపంబు[1]నర్ధంబు లంచంబు
గాఁగ నిచ్చి యదియు గాలవాత్మ
జుని వరించె నతఁడు సుదతి[2]తో సమయంబు
పలికికొనియె ధరణిపాలవర్య.

212 వ. సమయంబు నేకరాత్రసహవాస[1]సమ్మతికలితం బట్లు పాణిగ్రహణసంస్కారవతి యై యావృద్ధకన్యక దైవయోగంబున నారాత్రి మనోహరయౌవనయుఁ బరమానులేపమాల్యాం[2]బరభూషణాభిరామయుఁ నయ్యె నమ్మునియుఁ బ్రీతుండై [3]యన్నాతిసంగతి [4]నన్నిసి గడపెఁ బ్రభాతంబున [5]నన్నితంబిని యతని కి ట్లనియె.

213 సే. ఒక్క రేయి [1]పాల నాయునికి గాఁగఁ
బలికికొన్నార మది [2]సెల్లె నలఘుచరిత
పోయి వచ్చెద నని దివంబునకుఁ బోవ
నుత్సహించె నమ్ముని మది నుమ్మలింప.

---

210 1. కన్యకు — ఏ.గ.

211 1. నందర్థముంకువగాఁగ — అ.ఏ.ఖ. 2. కి — వ; తో సమయమాచరించె ధరణినాథ — చ.

212 1. సంకల్పితంబనిన సమ్మతించి - అ.ఏ.ఖ. 2. బరాభిరామయు మణిభూషణ భూషితయు — వీ.శ.ప; బరాభరణాభిరామయు — కొన్ని ప్రతులు. 3. యయ్యింతి — వీ.శ.ప. 4. నారేయి — వీ.శ.ప. 5. నత్తన్వియతని — ఆ.ఉ.

213 1. గృహిణి - చ. 2. నెక్కె - ఘ.

214 వ. ఇట్లుత్సహించి యుత్తీరంబున దేవఋషిపితృతర్పణపరుం డై యొక్కనాఁ డుపవసించినవాఁడు పంచాశద్వత్సరపరిపూరణీయం బగునైష్ఠికబ్రహ్మచర్య ఫలంబు వడయువాఁ డని పలికి తనువువిడిచి దివంబున కరిగె గురువంశోత్తమా యయ్యెడ నా రేవతీ[1]పతి శల్యుండు రణంబునఁ బాండవులచేత నిహతుండగుట విని వగచుచు నచ్చటికిఁ జేరువ యగుశమంతపంచకంబునకుం జని [2]యందులమునులఁ గురుక్షేత్రవిశేషంబు లడిగిన వార లతనికి నది ప్రజాపతి యుత్తరవేది యనియును సమస్తదేవతలు నందు [3]వరిష్ఠంబు లగుసత్రంబు లాచరించి రనియును దానిఁ గురుం డనురాజు దున్నుటం జేసి దానికిఁ గురుక్షేత్రంబనునామం[4]బు గలిగె ననియు నెఱింగించిన [5]నయ్యేకకుండలుం డాభూమీశ్వరుఁ డేమి ప్రయోజనంబునకు దున్నె [6]ననుటయు నాతపోధను లి ట్లనిరి.

—: కురుక్షేత్ర ప్రభావాభి వర్ణనము :—

సం. 9—52—4

215 సీ. ఇందుఁ బుట్టినజను [1]లెల్లను దుదిఁ ద్రిది
వంబున కరుగంగవలయు నని మ
నంబునఁ గోరి యన్నరపతి దున్నంగ
నింద్రుఁడు సనుదెంచి యేల యిచటఁ
[2]దునియెద వనిన నమ్మనుజాధిపతి తన
కోర్కి సెప్పిన గేలిగొనుచుఁ జనియెఁ
బలు[3]మఱు నద్దేవపతి వచ్చి వెండియు
నుల్లసమాడుచు [4]నుండు నత[5]ని
ఆ. [6]నతఁడు నిష్ఠ [7]గుంద కనిశంబు దున్నంగ
వరముఁ బ్రీతి నొసఁగువాఁడు గాఁగ

---

214 1. రమణుండు — క.ట.త. 2. యందలి — పెక్కు ప్రతులు. 3. గరిష్ఠంబులగు, ప్రసిద్ధంబులగు, విశిష్టంబులగు, నిష్టంబులగు, బరివేష్టించి సత్రంబు, దుపదేష్టంబులగు— అనియు పాఠములు. 4. బయ్యెనని — పెక్కు ప్రతులు. 5. నయ్యదుకుంజరుండా — కొన్ని ప్రతులు. 6. ననియడుగుటయు — కొన్ని ప్రతులు; దవనిన — వ.

215 1. లెల్లవారునుదుది—అ ఊ ఓ.క.ల. 2. దున్నెదునీవని యన్న భూపతి తన—అ.ప.ఖ; దున్నెద—కొన్ని ప్రతులు. 3. మారు—కొన్ని ప్రతులు. 4. నుండ, నుండె, నున్న— అనియు పాఠములు. 5. దు — అ.ట.వ.స. 6. తనదు — అ.ఖ.స. 7. వదలకనిశంబు,

[8]నమలెఱు ఱుఁగ నిశ్చయము సేసి యాశ్రముఁ
డచటి [9]కేగుదెంచి యతనితోడ.

216 వ. ఈపుణ్యక్షేత్రంబున [1]నిరాహారులై దేహంబు విడిచినవారలకునిందు సమరంబు [2]సేసి సమ్యక్ప్రకారంబున మృతిఁ బొందినసమస్త[3]జంతువులకును సురలోకప్రాప్తి గలిగెడు మని [4]వల్కి నిజస్థానంబునకుం జనియె నట్లు చను చుండి యాశతముఖుఁడు సంభావనాతిశయంబున.

217 క. గాలిఁ గురుక్షేత్రంబున
[1]ధూళి తనువుఁ [2]జెంది [3]నరునిదుష్కర్మములం
దోలి యతనికి ధరిత్రిం
[4]దూలి [5]మధురలీల మై [6]నతులగతి యొసఁగున్.

218 వ. అని నిర్దేశించినఁ గురునృపాలుండును గృతకృత్యుం డై సంతోషించె నని [1]చెప్పుటయు నాప్రలంబవైరి ప్రమోదభరితుం డగుచు మెలంగి యశ్వత్థమధూకామ్రబిల్వాదిభూరుహోపశోభితం బైన నిజపూర్వాశ్రమం బుఁగనుంగొని యిది యెవ్వరియాశ్రమం బని యడిగిన నమ్మును లియ్యెడఁ దొల్లి విష్ణుదేవుండు దపంబు సేసినచోటు మఱియు శాండిల్యప్రభృతు లిందు యోగసిద్ధిం బొంది రనిన విని యయ్యాశ్రమంబుఁ గొనియాడి తత్ప్రదేశం బున బహిఃపరివారంబు నెల్ల [2]వీడుకొల్పి యొక్కపుణ్యాచలం బెక్కి దానితటంబున [3]సమస్థలంబున ముని[4]జనసహితంబుగ నాసీనుం డయ్యె నాసమయంబున నిచ్చటికి [5]జటామండలకలితుండును [6]గుశచీరచ్ఛాయా సుందరుండును గలహప్రియుండును నగునారదుండు హేమదండంబును

---

తోడన నిశంబు — అనియు పాఠములు. 8. నమరవరుగ — అ. 9. కరుగు — ఎ.

216 1. నీరాహారులై - ఆ.వ. 2. న సమ్యక్ప్రా - పెక్కు ప్రతులు. 3. జనులకు, జీవులకు- అనియు పాఠములు. 4. వల్కి వరంబిచ్చి దేవపతి - అ.

217 1. ధూళి, దూలి, గూలి, దేలి - అనియు పాఠములు. 2. జెడ్డ — వ. 3. యతని - ట ; యతఁడు — అ ; నరుఁడు - ఆ. 4. ధూళి, నోలి, జాలి — అనియు పాఠములు ; నోలి సురల గతిని సంతతోన్నతి నమరుఁ — ఊ. 5. యమర — కొన్ని ప్రతులు ; సురల - ఇ ఉ.ఊ. 6. సుసంగతి గలుగుఁ - చ.

218 1. చెప్పిన - పెక్కు ప్రతులు. 2. నిలిపి - చ. 3. ననేకమునిజన - కొన్ని ప్రతులు. 4 గణ — ఇ.ఉ. 5. జటాకమండల — ల. 6. కనకకాంతిని (భ) జచ్ఛాయా - పెక్కు ప్రతులు ; గుశచీరచ్ఛాయా సుందరుండును - ఇది వీ.శ.ప.

మణికమండ[7]లువును [8]గచ్ఛపవీణయుం బొలుపుమెఱయ నేతెంచిన నెల్లవారలుం బ్రత్యుత్థానప్రణామంబు లాచరించి సుఖోపవిష్టుం జేసి పరివేష్టించి యాదేవమునిం గొల్చియుండి యబ్బలదేవుండు.

219 క. కురువృత్తాంతం బడిగినఁ
గర మేర్పడఁ జెప్పె నతఁడు గాంగేయుఁడుఁ
గురుఁడును గర్ణుఁడు శల్యుఁడు
వరుస ననిం దెగుట కౌరవక్షితినాథా.

220 వ. మఱియును మృతులైననృపకుమారాదియోధ[1]వరులం జెప్పి పదునెనిమిదిదివసంబులఁ జెల్లినసంగరంబు తెఱంగును సంక్షేపరూపంబునఁ దెలియఁ బలికి దుర్యోధనసైన్యం బంతయు సమయుటయు నందుఁ గృపాశ్వత్థామకృతవర్ములు బ్రదికిపోవుటయు నన్నరపాలుఁ డోడి పాఱి ద్వైపాయనహ్రదంబుసొచ్చి జలంబుల సంస్తంభించి [2]డాఁగుటయు నది పాండవు లెఱింగి సపరివారంబుగా జనుదెంచి యమ్మడువుఁ జుట్టుముట్టి బెట్టిదంపు మాటలాడుటయు దానం గనలి యమ్మనుజవరుండు మడువు వెడలి వచ్చుటయు నెఱింగించి బిరుదుమగ లగుపగతురు పెక్కండ్రు పొదివి[3]కొని యుండం గురుపతియు నుక్కు దక్కక యున్నవాఁ [4]డద్దండితనంబుఁ జూచిన మెత్తు వీవని [5]యుగ్గడించి.

221 చ. అతనికి భీమసేనునకు నాహవ మయ్యెడు నొంటిమై మహో
ద్భుతబలశౌర్య [1]ధైర్యములఁ బొల్చుభవత్ప్రియశిష్యులఁ [2]సుశి
క్షితులఁ గనుంగొనం దలఁపు చిత్తము[3]నఁ మొలతెంచునేనిఁ బో
మ్మతుల[4]గదాకృతోజ్జ్వలవిహార ము[5]దారనిరూఢి [6]నొప్పెడున్.

---

ప్రతులలో లేదు. 7. లంబును గచ్ఛపాలయు – అ. కనకపు – ల. 8. నంబుచేసి – ట.వ.వి.

220 1. వీరులు – వా.వీ.శ.ష. 2. డాఁగియుండుటయు – పెక్కు ప్రతులు 2. కొనంగురుపతి – వ.వి.శ.ష. 3. డాతనిదండి – ఊ.జ. 4. యగ్గించిఁ యెఱింగించి – అనియు పాఠములు.

221 1. ధుర్యులన – కొన్ని ప్రతులు. 2. సురక్షితుల – ఔ.త.ద. 3. నంగలదేనివేఁగఅ.ఈ. 4. గదాయుధోజ్జ్వల విహారుల వారలఁ జూడనొప్పినన్ – చ. 5. గానఁగ – అ. 6. నెక్కిడిన్, నొప్పఁగన్, నొందెదుఁ, నొప్పినన్ – అనియు పాఠములు.

222 వ. అనిన విని యమ్మునీంద్రునిం దక్కటిమునులను వీడ్కొని యచలంబు డిగ్గి యభ్యంతరపరిజనంబుల నిజపురంబున కనిచి యన్నీలాంబరుం డరదంబు సమీపంబునకుఁ జని సరస్వతి నాలోకించి.

223 చ. అరయఁగ మేటిపుణ్యనదులందు సరస్వతి సౌఖ్యసంపదల్
నరులకుఁ గల్గు నిజ్జగమునం బరలోక[1]మునందు నీసరి
ద్వర నొకనాఁడు సేరినను వాసవముఖ్యసమస్తదేవతా
వరులును నిందు మేల్ వడయవత్తురు [2]సంస్మృతి సాలు [3]సిద్ధికిన్.

224 తే. అనుచుఁ బలుమాఱు చూచుచు నధికభక్తి
మోడ్పుఁగేలు శిరంబున [1]మోపికొనుచుఁ
బుణ్యతమనిజమూర్తి విస్ఫూర్తి మెఱయ
నమ్మురారాతిపూర్వజుఁ డరద మెక్కి.

225 వ. అతిత్వరితగమనంబున ద్వైపాయనహ్రదంబునకుఁ జనుదెంచె నయ్యెడ.

226 తే. ధర్మపుత్రాదులును సుయోధనుండు నతని
గన్న తెఱఁ గాంబికేయుండు [1]విన్న [2]తెఱఁగు
నధిప మును చెప్పినాఁడ నట్లన్న రేంద్ర
కుంజరుఁడు విని యిట్లను సంజయునకు.

*—: పాండవ దుర్యోధనులు ద్వైపాయనహ్రదంబు విడిచి పాలికలనికిఁ బోవుట :—*

సం. 9-54-3

227 క. బల[1]భద్రుఁడు సనుదెంచిన
నలఘుగదాస్ఫురితభుజసహాయత్వసము
జ్జ్వలుఁ డగుమత్పుత్రునకుం
దెలివి మిగులకున్నె రణము తెఱఁ గెట్లయ్యెన్.

---

223 1. సుఖంబు - వ ; ములందు - ఔ. 2. సంస్తుతి - జల. 3. శుద్ధికిన్ - కొన్ని ప్రతులు.

224 1. మోపు — అ.ఖ.గ.

226 1. చన్న - ఏ. 2. భంగి — పెక్కు ప్రతులు.

227 1. దేవుఁడు - ఊ.

228 క. అనుటయు నతఁ డి ట్లను న
జ్జనపతికి హాలాయుధుండు సనుదెంచిన నె
మ్మనము దెలివొందె నూఁపులు
దనరె మొగం బలరె నీదుతనయున కధిపా.

229 వ. ఇట్లు ప్రీతుం డై యాతండు ధర్మనందనుం జూచి శమంతపంచకంబు ప్రజా పతియుత్తర[1]వేది యనఁ బ్రసిద్ధం బై నపుణ్యస్థలం బయ్యెడం బ్రథనంబున [2]నిధనంబు నొందినవారికి సద్గతి యగుట ధ్రువం బని విందు [3]మిప్పటి[4]పాలి కలనికిం [5]బోవుద మనిన నతం డాద్వైపాయనహ్రదం బాసీమలోనిది గామి యెఱుంగుం గావున నమ్మాట కియ్యకొని తదభిముఖుం డై పోవ నా దుర్యోధనుండును గదా[6]కలనంబున నంసపీఠంబు పొలుపార మత్తగజేంద్ర యానంబున నమరప్రస్తూయమానుం డగుచుఁ జన శంఖభేరీప్రముఖతూర్య స్వనంబులు సెలంగె నిట్లు పాండవపరివృతుం డై యచటికి నీ కొడుకు నడచి [7]యమర్ష సముజ్జ్వలుం డై.

230 క. నిలిచిన సకలజనులు నెడ
[1]గలసి [2]బలసి నిలిచి రపుడు గదయుఁ [3]బసిఁడి [4]క
త్తళము మెఱయ నతని యెడురఁ
జెలువొందె బకారి హేమశిఖరియుఁ బోలెన్.

231 చ. కనుఁగొని దర్ప[1]మంథరము గా నతఁ డిట్లనుఁ బాండవాగ్రజ
న్మునకు వడిం బెనంగఁగ సనుం బవనాత్మజుఁ జూచు వేడ్క ని

---

229 1. వేదియనియుఁ బ్రసిద్ధం—ఘ; వేదియుననఁ బ్రసిద్ధం—చ. 2. మృతినొందిన—ఎ; వధంబు — ఖ. 3. మెప్పటి — వా; మిప్పటి — గ; నెప్పటి — ఘ. 4. పోరిగల పొలిగల - అనియు పాఠములు. 5. బోదమని - పెక్కు ప్రతులు 6. దండంబంస పీఠంబునం బొలుపార — ఊ ఎ; కలితాంస పీఠంబు పొలుపార - ఖ. 7. హర్షసము జ్జ్వలుండై —త.ల.

230 1. గలిగి — వీ.శ.ష. 2. బలిసి - కొన్ని ప్రతులలో లేదు; మెలసి — వ. 3. పసిఁడి కత్తళము — పెక్కు ప్రతులు: పసిఁడి గత్తళము — వా. మరి కొన్ని ప్రతులు. 4. కత్తలము — పెక్కు ప్రతులు.

231 1. ముద్ధతము, ముద్ధురము, సుందరము, ముందనర — అనియు పాఠములు.

జ్జన[2]తతి యంతకంత కిటు సందడి గాఁ [3]దనయిచ్చఁ గ్రమ్మఱం
[4]చునొ యుప[5]వేశనిశ్చలతఁ జూచిన మే లఖిలప్రియంబుగన్.

232 వ. అని భూపాలుర నెల్ల నాలోకించినం బాంచాలాదు లగునయ్యందఱును ధర్మ నందనుండు గూర్చుండ నియోగించి బలదేవ వాసుదేవ సహితంబుగఁ దాను నాసీనుం డయ్యె నమ్మహీనాథమండలంబున సితప్రభుం డైనయన్నిలాంబరుండు తారకామధ్యవర్తి యై మెఱయుమృగాంకు ననుకరించె నట్టియెడ భీమసేనుండును దుర్యోధనుండును.

233 సీ. అఖిల[1]గర్జనశోభితదేహు లై
యుద్భటవృషములయొప్పుఁ దాల్చి
[2]రోష[3]మహావిషభీషణవదను లై
చండోరగంబుల[4]చంద మొంది
మద[5]సముజ్జృంభితమండితాకారు లై
భద్రద్విపంబుల[6]పగిదిఁ [7]బొల్చి
చారుగదాశృంగసందీప్తమూర్తు లై
మహితపర్వతములమాడ్కి మెఱసి

ఆ. వాసుదేవయుగము వరుణద్వయంబు వై
శ్రవణయుగ్మకంబు రామయమము
వోలె దర్శనీయలీల వహించి యం
బోధియుగళ మనఁగఁ [8]బొంగు మిగిలి.

234 వ. ఒండొరులం జూఱుచుఱం జూచుచుఁ [1]బరస్పరహృదయ[2]విదారణంబు లగు దారుణభాషణంబు లెసఁగ [3]కుంభదవష్టంభంబు[4]నం బొలిచి నిలిచి రనిన విని యాంబికేయుండు.

---

2. పతి–ఇ.ఎ.ఏ.ఔ.ల.వ ; పతులంత–ఊ. 3. దమ–కొన్ని ప్రతులు. 4. చునునిఖి లైక నిశ్చలత – ల. 5. దేశ – ఈ.గ.త.వ.

233 1. గర్జిత – అ.ఊ.చ.వీ.శ. 2. రోషంబునను మహాభీషణ – ఊ. 3. మహాటోప – ఇ.ఉ ఎ.వీ శ.ష. 4. సరివహించి – ఊ. 5. సముజ్జృంభణ – ఇ.చ.ల. 6. భంగి బొలిచి – ఊ. 7. నొప్పి – చ. 8. బొలుపు – గ.

234 1. బరస్పర దారుణం బగు – చ. 2. వి దారంబులగు – క. 3. నవష్టంభంబున నిలిచి – ఈ ; బొలిచి యవష్టంభ విజృంభణమున నిలిచిరని – ఖ. 4. న నిలిచిపోరి రనిన – గ ; న నిలిచి పొలిచి రనిన – ఆ.ఈ.ఉ.త.ద.ల.

235 క. తనుఁ [1]బదునొకఁ డక్షౌహిణు
లనూనవిభవమునఁ గొలువ నఖిల[2]నృపులుఁ బం
చినపని సేయ నెగడునా
తనయుం డే కాకియుం బదాతియు నయ్యెన్.

236 తే. సకల[1]ధరణికి నాథుఁడై సంపదలకు
నెల్ల భాజన మగు కౌరవేంద్రుఁ డనద
తనము దోఁపంగ గదఁ జేతఁ గొని వినిశ్చ
యమునఁ బోరికి[2]నమరెనే యక్కటకట.

237 వ. [1]ఏ మనం గలదు సంజయా దైవంబ నేర్చుం గాక యని [2]పనివి యూర
కుండె న ట్లున్న యమ్మానవపతికి సూతసూనుం డి ట్లనియె.

238 క. నీసుతుఁడు సమరవిషయో
ల్లాసంబున [1]నంగకంబులం బొం గారం
[2]గా సు[3]స్వరమున నా[4]కుం
తీసూనుఁ బిలిచె నుద్ధతిఁ రణమునకున్.

239 వ. ఆ సమయంబున.

240 క. ఉర్వీవలయము వడఁకెను
బర్వము గాకయును రాహు భానునిఁ [1]బట్టెం
బర్వతము లురిలె వఱళులు
సర్వదిశల నఱచె నభము శర్కర గురిసెన్.

---

235 1. బదనొకండక్షౌహిణుల — క.గ.ఘ.ల ; బదనొకండక్షౌహిణుల — ఘ ; బదునొక యక్షౌహిణుల — వీ. 2. విభులు — ఘ.

236 1. ధారుణీ (ణి) పులసర్వసంపదలకు—ఐ.గ ; ధారుణి నాథుఁడై —చ. 2. నిలిచెనే-ఘ.

237 1. ఏమియనం గలదు, ఏమి సేయం గలదు, అనియు పాఠములు. 2. వగచి—అ.ఊ ఘ; పలికి — కొన్ని ప్రతులు ; పనిచి — త.

238 1. నంగకములునవిపొంగారన్ — ట. 2. తా — వ. 3. స్వనమున — ట. 4. కుంతీసుత మధ్య మునిఁబిలిచినేరణమునకున్ — ఐ గ ; కుంతీసుతుఁ బిలిచెనురణమునదీకొను వాఁడై — జ.

240 1. గప్పెన్ — కొన్ని ప్రతులు.

241 వ. మఱియు నిర్ఘాతపాతప్రభృతిమహోత్పాతంబులు [1]గలిగె వాని నెల్ల నను సంధించి [2]గంధవహనందనుండు గాంధారీనందను౯ [3]జూపి ధర్మ[4]నందనున కి ట్లనియె.

242 సీ. [1]ఆశ్రమంబున [2]గెల్వ నగు నాకుఁ [3]జూపఱు
గొనియాడఁ బోరాడి కూల్చి తొడలు
పొడిసేసి యున్నిచుఁ బొలియింతు మద్గదా
దండసముద్దండతావిభూతి
యవధరింపుము వీనియాయువు దెగటాఱె
నిక్కులపాంసను నిట్టు లేను
గదిసియుఁ గ్రమ్మఱఁ [4]గరిపురంబునకుఁ బో
నిత్తునే ధృతరాష్ట్రుఁ డింక వగలఁ

ఆ. బొగులువాఁడు గాక పోడిమితో నుండు
వాఁడె [5]వీఁడు మనల వాలి పఱుపఁ
దొల్లి పడినపాటు లెల్ల వెలారింతు
నధిప నీమనమున హర్ష మెసఁగ.

243 వ. అని పలికి దుర్యోధనాభిముఖుం డై.

244 క. నెఱి మాలి [1]వీరి నీతఁడు
పఱచినపాటులకుఁ దగినఫల మగు నని యి
త్తెఱఁగునకు నియ్యకొని చూ
పఱువొగడఁగ నిన్ను [2]నిపుడ [3]పడవైచుటకున్.

---

241 1. వొడమిన – ఔ. 2. వాహసూనుండు – గ. 3. జూచి – ట. 4. తన యున – ఘ.

242 1. ఆశ్రమంబున – అ.ఐ.ఒ ఓ.ఔ.గ.వ. ఇట ఆశ్రమంబున అనఁగా కొంచెపు శ్రమమున అనిభావమగును. 2. బోర – వ. 3. జూపఱల్గొనియాడ – శ. 4. గజపురమునకు – చ. 5. వీఁడుమనలమున్నువాశ్రిలిపఱప – ఎ ; వీడుమనల నిన్నిపాట్లు పఱప – ఐ.గ.

244 1. నీవుమమ్ముల – ఊ.వ. 2. నాజిఁబడవైచుటకున్ – క.త. 3. పడద్రోవైతు ననిన్ – అ.

245 తే. [1]అమరి యున్నాఁడ నాబారి కగ్గ మైతి
[2]పడుదుగా కింక నీకు నెక్కడకుఁ బోవ
వచ్చు ననవుడు నిది యేల పెచ్చు[3]పెరిగిఁ
[4]యాల మెడసేసి యనిలజ [5]ప్రేలె దిట్లు.

246 వ. అని కురువిభుండు వెండియు ని ట్లనియె.

247 క. పలుకుల వెఱపించెద వా
కొల దియె దుర్యోధనుం డకుంఠితబాహో
బలుఁ డిదెయవలీల నినుం
బొలియించెడిఁ బలుకు లుడిగి పోరాడు ధృతిన్.

248 శా. వ్యూహోభావము సూచి నన్నసదుగా [1]నూహించెదో భీమ మ
ద్బాహోచండిమసారదుర్గమగదాదండంబు దృప్యద్భవ
ద్దేహోల్లాసము నెట్లు దీనదశకుం దే[2]నోర్చునో చూడుమీ
యాహా [3]పుట్టెడు లాఁతి[4]చూపఱకు హాహా పుట్టు మీ వారికిన్.

249 ఉ. నా కెదురై పినాకియుఁ బినాకము వట్టక యుద్ధతిన్ [1]గదా
భీకరవృత్తి చూపుటకుఁ జేర్చిన నెక్కుఁడు వేర్చి చీరికిం
గైకొన కే పడంచి భుజగర్వ[2]సమున్నతి నిర్వహింతు నీ
కే[3]కడ డాఁగ వచ్చు గద నే నని సేయుటకుం గడంగినన్.

250 వ. అని మఱియును.

---

245 1 అనుచు నాతండునాబారి — ఐ.గ; అని మరియు నేఁడు — అ.ప. 2. పడుదుగాక నీకింక నెక్కడికిఁబోవ — ఎ.క.గ వ.శ. 3. పెరిఁగెదేల యెడసేసి యనిలజ ప్రేలెదిపుడు — ఊ.ప.శ.

248 1. నూహించితో — ఒ.క.జ; నూహించితే — ఈ. 2. నోర్చునో — పెక్కు ప్రతులు; నేర్చునో — అ వ; నోపునో — వా. 3. పుట్టెడు — వ; పుట్టఁగ — అ ప. 4. వారలకునాహా — ఊ; రాజులకు నాహా—ప.వ.

249 1. మదా, మహా — అనియు పాఠములు. 2. సముద్ధతి — పెక్కు ప్రతులు. 3. కణఁగంగ — కొన్ని ప్రతులు; కడకేఁగు — కొన్ని ప్రతులు.

251 క. గదఁ గయ్య [1]మెన్నఁడొకొ చే
యుదు భీమునితోడ ననుచు నుల్లంబునఁ గో
రుదు నెప్పుడు నిప్పుడు నా
కది యొదవెఁ విధి[2]కృతిం గృతార్థుఁడ నైతిన్.

252 వ. [1]నీ విట చక్కనయి రమ్ము.

253 చ. [1]అన విని యెల్లవారు భవదాత్మజు మెచ్చి నుతించి రయ్యెడన్
[2]ధనుఁ డరివీరు లట్లు ప్రథితంబు[3]గఁ దనఁ బొగడం బ్రమోది యై
వినుచుఁ [4]ప్రవర్ధితం బయినవీరగుణంబున [5]నుల్లసిల్లె నా
తనిపయి భీముఁ[6]డుద్యతగదాస్ఫురణఁ నడచెఁ నరేశ్వరా.

254 వ. అప్పుడు కుంజరబృంహితంబులును హాయ[1]హేషలునుం జెలంగె నిట్లు తన మీఁద నడచువడముడిం [2]జూచి నీకొడుకు కదల్చుచు గదాసముల్లాసంబు భాసమానంబుగ వీఁక నెదుర్కొని [3]తాఁకిన.

### -: భీమసేన దుర్యోధనుల గదా యుద్ధము :-

సం. 9—56—1

255 సీ. చండగదాపరస్పరఘట్టనంబుల
మింటఁ బెల్లడరెడుమంటగములఁ

---

251 1. మెన్నటికిఁజేయుదు — ఉ ; మెన్నటికొ — ప.ట. 2. వశమునం గృతార్థుఁడ నైతిన్ — ఖ.

252 1. చక్కనై యిటురమ్ము — పెక్కు ప్రతులు.

253 1. అనుటయునెల్ల, అనవుడునెల్ల — అనియు పాఠములు. 2. ధనుఁడతివీరుడి(డ)ట్లు- ఐ.ఓ.గ.జ ; ధనుఁడతిధీరునట్లు — ల ; ధనులరివీరులిట్లు — న. 3. దగన్ — ఊ.ఖ.చ. 4. బ్రివర్తితంబులగు వీరగుణంబులు — చ. 5. నుల్లసిల్ల, నుల్లసిల్లి, నుల్లసిల్లు - అనియు పాఠములు. 6. డుద్భట — వీ.శ.ప ; దుద్ధతి — ఐ.జా.గ.గ.

254 1. హేషితంబులు — కొన్ని ప్రతులు. 2. జూచియేచినీకొడుక — పెక్కు ప్రతులు. 3. తాకుటయు — ఊ.ఖ.చ.

బరమఘోరము లగు[1]పదతాడనంబుల
నొలయువసుంధరాచలనములను
నుద్భట[క్రో]ధసముదే[గ్రి]కములఁ జూడ్కు
లం దుల్లసిల్లెడు నరుణరుచుల
దారుణధ్వను లగుతర్జనలీలలఁ
బరగుపర్వత[2]గుహా[ప్ర]తిరవముల

తే. ననిమిషుల[3]దృష్టు మిఱుమిట్లు గొనఁగ భుజగ
పతియుఁ గూర్మంబు సంకటపడఁగ దరణి
కిరణములు [4]వెల్కఁ బాఱ దిక్కరులు బెదర
నొప్పె [5]నత్తాలితాకు మహోగ్ర మగుచు.

256 వ. ఇట్లు తలపడి మండల[1][ప్ర]చారవివిధ[ప్ర]కారంబులం బుడమికిం జిత్రగదా[2]సారణ బహుభంగుల నింగికిం [గ్రొత్త][3]యొ ప్పొలయం దమ[4]లావును వేగంబును నేర్పును [5]దర్పంబును జూపఱకు [6]వెఱఁగుఁ బుట్టింప నంతకంతకు నెక్కుడగు మదంబులం [7]బొదలెడు బాహుదండంబుల బలనై పుణంబు [8]లగ్గింపం బేర్చు[9]భీరంబుల నొండొరులసంరంభంబుల సరకుగొనక యక్కురుపాండవ పుంగవులు జంభవాసవులచందంబునం బెనంగినం బలుదెఱంగు లైన గదా[ప్ర]హతులం దునియలుఁ బఱియలుఁ దుముళ్లునై సీసకంబులు కత్తళంబులు ధరాతలంబునం దొఱంగె నట్టియెడ.

---

255 1. పాదతాడనముల — వి.శ.ప. 2. మహా — కొన్ని[ప్ర]తులు. 3. దృష్టి—ల.ప. 4. వెల్కు, వేడ్క, బెక్క — అనియు పాఠములు, 5. నత్తొలుతాఁకు పెక్కు [ప్ర]తులు.

256 1. [ప్ర]చారోల్లసితవివిధ — ఊ. 2. హారణ, [ప్ర]హరణ, [ప్ర]సారణ — అనియు పాఠములు. 3. యింపొలయ — ఐ.గ. 4. లాగును - కొన్ని[ప్ర]తులు. 5. దర్పంబు మెఱయ నంతకంతకు — అ. 6. వెఱపు - ఎ.ఖ.ఘ.ల.ప. 7. బొదలెడు — ఇ.ఉ; నెక్కుడ - పెక్కు[ప్ర]తులు. 8. లగ్గలింప—కొన్ని[ప్ర]తులు; లుగ్గడింప నంతకంత కెక్కుడై పేర్చు — చ; లుగదలింపఁబేర్చు — ఐ.గ. 9. భీకరంబుల—ఊ.ఐ.గ.చ.వ.

257 మ. ఒకది కుక్కద్ధతిఁ [1]బూన్చి యొందుదెస [2]వ్రేయుఁ మేను వంచించి వ్రే
తకుఁ దప్పఁ వడి వ్రేయు నొడ్డనమునం [3]దప్పించి వేగంబు గుం
దక [4]నొప్పించుఁ [5]జలం బెలర్పఁగ గదాదండంబు దూలించుఁ బాం
డుకుమారుం డుఱు[6] కట్లు కౌరవవిభుండుం గేలి సల్పం [7]దగన్.

258 వ. మఱియును శిక్షావిశేషంబులు [1]వెలయ నుల్లసిల్లి.

259 మ. గదతోడఁ గద చుట్టి రాఁ దిగుచుచుఁ గం డొప్ప లంఘించి మా
ఱు[1]దెసల్ గై కొనుచుం గడంగి పలుమాఱుం దాఁకుచుం బాయుచుం
బదబాహాకటిమధ్యవక్షముల సంభావ్యత్వరాచిత్రితో
న్మదనానా[2]గత రేఖలఁ [3]మెఱయు భీమత్వత్సుతుల్ [4]దీప్తులై.

260 ఉ. తప్పినయప్పు వ్రేటు దముఁ దాఁకినయప్పు డనేక[1]భంగు లై
యొప్పులు బల్పులుఁ మెఱయ నుల్లములఁ [2]సకలాంగకంబులం
[3]గప్పఁ దలిర్చు కోపములఁ గ్రమ్మెడు రక్తములఁ సురవ్రజం
బప్పటి కప్డు వింత యగునచ్చెరు వొందఁగఁ బోరి రేపునన్.

261 వ. ఆసమయంబున.

262 సీ. [1]వితతవీరాగ్రహావేశా[2]దిదర్పిత
చిత్తులై యొండొరు [3]నొత్తరించు

---

257 1. జూచి - పెక్కు పత్రులు ; జూపి – ఎ.ఘ. 2. వ్రేయన్ – పెక్కు ప్రతులు. 3. దప్పించున్ వీఁకవం - ఐ.గ. 4. యొడ్డించు - ఇ ; లీలంజలమేర్పడంగన్ - ఐ. 5. బలం బెలర్ప – కొన్ని ప్రతులు ; జలంబుదప్పక – త ; బలమేర్పడంగని – ఐ.గ. 6. నునట్లు – కొన్నిపత్రులు. 7. వడిన్, వెసన్ - అనియు పాఠములు.

258 1. మెఱయ - కొన్ని ప్రతులు.

259 దెసం - దెసం - ఊ.ఎ.ఘ.వీ.శ.ప. 2. గతి – పెక్కుప్రతులు. 3. మెఱయ - పెక్కు ప్రతులు, 4. దృప్తులై - ప.ఖ.

260 1. భంగులన్ - చ.త.వ. 2. దమయంగకంబులం - వ. 3. గప్పు - ఘ.చ.శ.స ; గప్పి - న.

262 1. విపుల - ఈ ; వితతి - ఐ.వ. 2. శాతిదర్పిత – పెక్కుపత్రులు. 3. నుత్తరించి –

[4]నుగ్రమహోద్ధతి నుద్భటాటోపతీ
వ్రములగుసమరవిభ్రమము [5]లంగ
[6]సంగతంబులు గాఁగ జయవాంఛనాత్మర
ణుణములవలని నైపుణము [7]లెడలు
టయు [8]ననర్గళనిరూఢప్రహారంబులం
దంద బెట్టిరుపు[9]రయందు సూడు

తే. పడఁగఁ దాఁకిన శోణితప్రసరణంబు
నిరతిశయ మైన [10]వెడ సోలి నిలిచి గదలు
నామకరముల నూఁదియు వారు మగుడఁ
బోరఁ [11]కెలయుట నిర్భరాద్భుతముసేసె.

263 వ. ఇట్లు [1]ధైర్యధుర్యోత్సాహంబులం బొదలి

264 శా. రౌద్రోల్లాసము మూర్తిసంకలన[1]ఘోరం బై పొరిం బేర్చినా
[2]సుద్రిక్తం బగునూత్నరక్తమున మగ్నోన్మగ్నతం బొల్చి త[3]
ర్జద్రూపోగ్రగదా[4]యుగంబు [5]విసరత్సంధ్యాంబుదద్వంద్వశా
స్వద్రేఖాలలితంబు చెన్నువడసెఁ వారిద్దఱుం బోరఁగన్.

265 క. సుర లచ్చెరువును మెచ్చును
బెరికొనుచిత్తములతోడఁ బెద్దయుఁ బొద్ద
య్యిరువుర గెలుపోటమి తెలుఁ
గరసి నిరూపింప నేరరైరి నరేంద్రా.

---

కొన్ని ప్రతులు. 4. నుద్ధతి నుగ్రమహోద్భటా — అ.ఓ.త. 5. లనఁగ, లమర, లెసగ— అనియు పాఠములు. 6. సంతసంబులు — ఎ.వ ; సంగరంబులు—ఏ.వ. 7. వెడలు — పెక్కు ప్రతులు. 8. నిరర్గళ — ఓ ; నగ్గల — ఐ.గ. 9. రుసందు — ఖ.ఘ.ద.ల.వ.స. 10. వేదననిలిచి — ఐ.గ. 11. కమరుట — అ.ఊ.ఘ.వ ; తెరలుట — త.

263 1. శౌర్యధైర్య — కొన్ని ప్రతులు.

264 1. ఘోరాకారతన్నిల్చిరా - చ. 2. సుద్రేకంబగు — పెక్కుప్రతులు. 3. రుద్రద్రూప — పెక్కు ప్రతులు; చంచద్రూప, రుద్యద్రక్తోగ్ర — అనియు పాఠములు. 4. యుధప్రహార సంధ్యాంభోధరద్వంద్వ — ఐ.గ ; యుగాంతవిహారత్సం — ఘ. 5. విలసత్సంధ్యాం — అనియు పాఠములు.

266 తే. [1]అప్పు డప్పుడ తలపడినట్టు లవ్వు
డేచి విలసిల్లు మేనులయెట్టిచెలువు
గలయఁ బూచిననడ మ్రోదువులఁ[2]దలంపఁ
బట్టుగా [3]దొప్పె నధిప నీపట్టిదోయి.

267 వ. ఇవ్విధంబున [1]నొండొరులకు [2]వట్రపడక యమ్మేటిమగలు సాటోపసంరంభం బులం బెనంగి రందు గాంధారీనందనుండు [3]వలపలించి [4]చుట్టుకొని రా నది సరకుసేయక బకవైరి[5] దాపలించి తిరిగినం బెరిఁగినయీారసంబున నుల్లసి తుం డై [6]యాభూవల్లభుం డతనిబరి యెముక [7]లగల వ్రేసిన నవ్వీరుం డక్కారవపతికదంబుతో నగ్గర బీఱువోవ వ్రేయం బాయక మగుడం [8]బూన్చి [9]సారించినం దోరంపుమెఱుంగు [10]లెసంగం జెలంగుశబ్దంబులు నింగి ముట్ట బెట్టిదం[11]బుగఁ దా వెరవునం [12]దిరిగి యద్ధరణీశుండు శిరస్తా డనంబు [13]సేసెఁ జేసినం గౌంతేయుండు [14]గంపింపమి యక్కజం బై యుండె నంత నగ్గలం బగునలుక నవ్వడముడి పుడమి జేనివెడఁద[15]యురం బుపలక్షించి లాఘవఘోరంబుగగదాదండంబు ద్రిప్పి వైవ నాతం డది మేనినుసులునం దప్పింపనది యిల చలింపం [16]బడిన నన్నుసులు [17]తెఱ పిన యుఱికి యద్భుతవేగుం డగు నావాయుపుత్రుండు గద పుచ్చుకొని తిరుగుసందున దుర్యోధనుండు తదీయవక్షఃస్థలంబు దారుణ[18]ప్రహారంబున నొప్పించిన నతండు పాండవపాంచాలురచిత్తంబు[19]లుదూల[20]సోలియు

---

266 1. అపుడవుడు గ్రొత్తదలపడి – పీ.శ.ష ; అపుడు క్రొత్తగాఁదలపడి – జ ; అపుడు దలపడి పోరుచునట్టు – న.వ. 2. విధముగ – ఇ.త. 3. బొలిచిరధిప – ఔ.ట ; నొప్పిరధిప – త.వ ; జొచ్చిరధిప – వ.

267 1. నొండొరువులకు – అ.ఇ.ఊ.గ.ఘ. 2. బట్టు – కొన్నిప్రతులు 3. పచరించి – అ ; పలవరించి – ఏ ; వెలవరించి – ఔ. వలపరించి – అ.ఐ.ఓ.గ.న.వ. 4. పట్టు – ఇ. 5. బకారి – అ. 6. యాభూపాలుండనిలతనయుబరి – ల.పీ.శ.ష. 7. బగుల – కొన్ని ప్రతులు 8. జూచి – కొన్ని ప్రతులు. 9. వైచిన – ఖ. 10. లెగయ – అ.ఓ.ఔ.త.వ. 11. బగు – కొన్నిప్రతులు. 12. దిగిచి – ఔ ; గదిసి – త.వ. 13. సేసిన – అ.ఆ.చ.ద. 14. గంపింపకయునికి, గంపింపకయుండియు గంపింపకతివిరి, గంపింపమికి, గంపింపక–అనియు పాఠములు. 15. యురఃస్థలంబు–ఆ.ఈ.ఎ ఓ ట.వ. 16. బడియె–ఇ.ఉ ఒ.ట.త. 17. తెఱపినుఱికి–పెక్కుప్రతులు. 18. ప్రహారణంబున– ఊ.ఖ.చ.వ ; ప్రహతి నొప్పించిన – ఔ.త. 19. లగల – త. 20. సొమ్మసిల్లంబోయిన

నాలోనన తెలివొంది బలవిక్రమంబులు మెఱయ నమ్మేదినీపతి పార్శ్వ భాగంబు జెట్టడిచిన మ్రోఁకరిలంబడియును [21]వీఁక చెడక యెగసి [22]యజ్జగతీపతి తన్ను నగుచు నార్చుపగతుఁరు సిగ్గువడ నగ్గలికసొంపు పొంపిరివోవఁ బవనతనయుఫాలకర్ణమధ్యప్రదేశంబు పటుప్రహతిం బగిల్చిన నొల్లంబోయి శీఘ్రంబునం [23]దేఱి యమ్మహా[24]బలనందనుండు గండ [25]తలంబునం దొరుగునెత్తు రనుమదంబున మత్త[26]కరి ననుకరించుచుఁ దుండంబుచందంబునం జెలు వొందుగదయల్లార్చి పేర్చి వ్రేటుగొనిన మెడకెలను దాఁకి నీకొడుకు మహా[27]పవనపతితం బగు సాలంబుపోలికిం గూలినం గని ధర్మ[28]పుత్రప్రముఖులు ప్రమోదంబు నొందిరి గ్రక్కున లేచి కాలాకారుం డై [29]ధాత్రీనాథుఁడు [30]చిత్రభ్రమణంబుల వెగడుపఱిచి పలువ్రేటుల నొప్పించినం [31]గిమ్మీరవైరి వసుధం ద్రెళ్ళుటయు నది సావుగాఁ గొని యక్కురుసింహుండు సింహనాదంబు సేయ [32]నవ్వా యుసుతుండు సావమి యెఱింగి యాభూపతి సెనంగుభంగియుఁ గనుం గొని మెచ్చి సురప్రకరంబులు [33]పుష్పవర్షంబు గురియం బరులకుం భయం [34]బొలసె నంతం దెలిసి భీమసేనుం డు[35]ద్వృత్తలోచనుం డై వీరావష్టం భంబునం [36]బొలిచె నప్పుడు సాత్యకి ధృష్టద్యుమ్ననకులసహదేవు లే మేమి యని సుయోధను [37]సంగ్రామంబునకుం బిలిచిన విని యావృకోదరుండు వారల వల దని వారించి విగతఖేదుం డగుచు నాకేశుండు నముచిం దాఁకిన [38]తెఱంగున రారాజుం దలపడి [39]బహుచిత్రగతులం జరింపం జూచి సవ్యసాచి జనార్దనున కి ట్లనియె.

---

నాలోనన — ఘ ; పోయిననాలోనన — చ. 21. వీఁకనెగసి — పెక్కు ప్రతులు. 22. యజ్జనవరుండు — ఆ.ఎ ; యజ్జగతీవరుండు — పెక్కుప్రతులు. 23. తెలిసి—కొన్ని ప్రతులు. 24. బలోద్ధతుండు — పెక్కు ప్రతులు. 25. స్థలంబునం — కొన్ని ప్రతులు. 26. గజంబున — న.వ.వీ.శ.ష. 27. వాత — చ.న.వ. 28. సుత— పెక్కు ప్రతులు. 29. నీబిడ్డఁడు — అ.ఏ. 30. చంక్రమణంబుల — ఘ. 31. నీతమ్మునికొడుకు — అ.ఏ. 32. నగ్గాలిచూలి — అ ; నవ్వాయుసూనుండు — పెక్కు ప్రతులు. 33. పుష్పనికరంబులు — పెక్కు ప్రతులు ; కుసుమనికరంబులు, కుసుమములముసురు — అనియు పాఠములు. 34. బెసఁగె — ఖ. 35. దుద్రిక్త — వీ.శ.ష ; దరుణ — ఒ.ఈ.చ.జ.ల. 36. నిలిచె — పెక్కు ప్రతులు. 37. ననికిం — అ.ఏ. 39. చదంబున — కొన్ని ప్రతులు. 39. బహువిధగతులం — కొన్ని ప్రతులు.

## —: శ్రీకృష్ణుఁ డర్జునుతో భీమదుర్యోధనుల తారతమ్యంబు చెప్పుట :—

సం. 9—57—2

268 క. భీముని [1]సుయోధనుని సం
గ్రామంబు తెఱంగుఁ [2]జూడఁ గా నెవ్వరియం
దేమే[3] నధికతఁ దోఁచెడి
నీమది నున్నట్లు చెప్పు నీరజనాభా.

269 చ. అన విని శౌరి యిట్లనియె నర్జునుతోడ గురూపదేశసం
జనితసమన్వయంబు సదృశంబ తలంపఁగ నిద్దఱందుఁ బా
వని మెయి లావు పెద్ద కురువల్లభుఁ డారయఁ [1]గౌశలంబు పెం
పున నధికుండు దత్పరతఁ బూని శ్రమం బధికంబు సేయుటన్.

270 ఆ. లావు [1]గలిగి మొక్కలమ్మునఁ గీచకా
రాతి పొచ్చి ధార్తరాష్ట్రు వెరవు
వలన నొచ్చుచున్నవాఁ డు గావున ధర్మ
సంగరము నరిది జయము గొనుట.

271 వ. అన్యాయంబునం జంపువాఁ డింతియ మాయలుగల పగఱ మాయాప్రకా
రంబులం బరిమార్చుటయ తగు నింద్రునివృత్ర[1]వధవ్యాపారంబు వినమె
జూదంబునప్పు డనిలసుతుండు సుయోధనుతొడలు విఱుగ నడచువాఁడ
నని ప్రతిన వట్టినవాఁ డది యట్లుండె గదాయుద్ధంబు నాభికి దిగువ యైన
శరీరభాగంబు నొప్పించుట ధర్మంబుగా దది యొండుమైఁ గండడఁచి మఱి
పరిభవరూపంబుగ నూరుభంగంబు సేసి ప్రతిజ్ఞ నెఱపువాఁ డిది తలంపునం
బెట్టక పెనంగె నేని ధర్మనందనునకు దైన్యంబు దెచ్చు నట్లగుటఁ బూనికి

---

268 1. దుర్యోధనుసంగ్రా — ఇ ఉ.ల. 2. జూచికను మెవ్వరి — ఇ.ఉ. 3. మెయివడిగా, దోఁచెను — పీ.శ.వ.

269 1. నైపుణంబు — పెక్కుప్రతులు.

270 1. బలిమి — అ.

271 1. వధాది వ్యవహారంబులు — త.న.వ; వధోపాయంబులు — కొన్ని ప్రతులు;

[2]వేర నూరులుభంజించి వధియించుట తప్ప నొం డుపాయంబు లేదు ధర్మనందనునివలన మనకు భయం బావహిల్లె నె ట్లనిన భీష్మద్రోణప్రముఖ బలవదరాతులం బొలియించుటం జేసి జయంబును యశంబునుం జేకుఱి యున్నయెడ నవి సందిగ్ధంబు లై నయట్లు గా నొకని జయించి సామ్రాజ్యంబు గొను మని దుర్యోధనుతోడం బలికి యతనితోడం గదాసమరంబునకు భీమసేనుం బొనిపె నింత[3]నిర్బుద్ధి యగునె హతబంధుమిత్రపరివారుండై రాజ్యంబునం దాస విడిచి మడువు సొచ్చినవాని వెదకి వెలార్చి యెక్కటికయ్యంబునకుఁ బిలుతురే పదుమూఁడువత్సరంబులు మత్సరాధికుం డగునగ్గాంధారేయుండు భీము జయించుట కయిగదాపరిశ్రమం బాచరించె నూర్ధ్వతిర్యగ్గతిసముల్లాసంబున మెఱయుచున్నవాఁ డీభీమునకుం బెద్దకాలం బేని శ్రమంబు లే[4]దిమ్మహాభాగుండు ధర్మంబు దొఱంగియైన నిక్కులపాంసనునిం బిలుకుమార్పకున్న నింక నించుకసేవునకుఁ దాన తెగుఁ దెగిన మీకు నెల్ల నిప్పాపాత్ముండు రాజగుట కోర్వవచ్చునే యనుటయు.

272 క. విని క్రీడి యపుడు మారుత
తనయుఁడు దనుఁ జూడ నూరుతలము కర[1]తలం
బున నప్పళించె నతఁడును
[2]గనికొనియెను సన్న యగుటఁ గౌరవ[3]ముఖ్యా.

273 వ. [1]కనికొని యధర్మం బైన నూరుభంగంబు సేయు మని కృష్ణాను[2]మతి జిష్ణుండు పనిచె నాకు నొండుమెయి నెట్లునుం బగతు[3]పాటు లేక [4]తక్కెనే నవ్విధం బాచరింతుఁ గాక యని మనంబున నిశ్చయించి వివిధగతులఁ జరియింపం గురుపతియు [5]బాహుచిత్ర[6]ప్రచారంబుల నుల్లసిల్లఁ దత్సంగ్రామం బామిషార్థిగరుడద్వయసమరంబు చందంబున దర్శనీయం బై యుండె నట్టియెడ.

---

వధాది వ్యాపారంబులు–కొన్నిప్రతులు. 2. నెరప, నెరయ, నెరపి, దీర, తేర–అనియు పాఠములు. 3. దుర్బుద్ధి – కొన్నిప్రతులు. 4. డిమ్మహానుభావుండు – పెక్కుప్రతులు.

272 1. పుటం – పెక్కు ప్రతులు. 2. గనుగొనెనది – వీ.శ.ష. 3. నాథా – కొన్ని ప్రతులు.

273 1. కనుంగొని – పెక్కు ప్రతులు. 2. మతంబునజిష్ణుండు – కొన్ని ప్రతులు. 3. నగుపాటులేక – పెక్కుప్రతులు. 4. తక్కిన – పెక్కు ప్రతులు. 5. బాటుచిత్ర – పెక్కు ప్రతులు. 6. ప్రకారంబుల – పెక్కు ప్రతులు.

274 ఆ. పాండురాజసుతుఁడు పటుతరోల్లాసి యై
వైచుటయును ధరణివల్లభుండు
[1]తొలఁగ దాఁటె రయము[2]దలకొని గదఁబుచ్చి
కొనియె నాబకాంతకుండు [3]నుఱికి.

—: దుర్యోధనుఁడు భీముగదాదండమునఁ దొడలు విఱిగిపడుట :—

సం. 9-57-45

275 క. ఆలోనం గురుధరణీ
పాలుఁ డడరి వ్రేయుటయును బవనసుతునిమై
సోలె నది గానఁ డాపతి
కేలివిభ్రమము దోఁపఁ గ్రేళ్లుఱికె నృపా.

276 చ. ఉఱికినఁ దేఱి పై కుఱికి యుగ్రత భీముఁడు వ్రేయ నవ్విభుం
డుఱక మహాద్భుతస్ఫురణ నూర్ధ్వ[1]పరిభ్రమణంబు సేసినం
దెఱపి యతండు గాంచి సముదీర్ణరయంబున వైచెఁ బెన్దొడల్
విఱిగి నగాగ్ర ముద్భటపవిప్రహతిం బడుచాడ్పునం బడన్.

277 వ. అప్పుడు మహోల్కాపాతంబులును బాంసుమాంసరక్తవర్షంబులును వికృతంబు లగుకరితురగబృంహితహేషాఘోషంబులును మఱియు ననేకోత్పాతంబులును గలిగిన నట్లు కౌరవపతి వడుటకు నుబ్బునం బొదలిన పాంచాలురుం బాండవులు నుద్విగ్నచిత్తులై రి వియత్తలం బంతయు నొక్కమోఁతగా నగ్గదాయుద్ధవిశేషంబు లగ్గించుచు సురగరుడఖచరాదులు నిజస్థానంబులకుం జని రిట్లు తనగదతాఁకునఁ దొడలు విఱిగి సింగంబుచేతం గూలిన గంధశుండాలంబుచందంబునం బడి యున్న నీకొడుకుంజేరం జని భీమసేనుండు.

---

274 1. తలఁగ — స. 2. దళుకొత్త — స. 3. నులికి — ఖ; గినిసి — చ.

276 1. పరిస్ఫురణంబొనర్చినన్ — ఉ.గ.

278 తే. ఏకవస్త్రఁ బాంచాలి న ట్లీడ్చి తేరఁ
బనిచి సభలోనఁ [1]బలికినపాపఫలము
ననుభవింపుము దుష్టాత్మ యనుచు
వామచరణమున బెట్టిదము గాఁగ శిరము దన్నె.

279 వ. తన్ని [1]యలుక మలుగక యతనియాననం బాలోకించి.

280 క. పసు లని యార్చుచు మము ను
ల్లస మాడినధర్మహీనులను నృపధర్మం
బెసఁగఁగ [1]నే మిదె [2]యిప్పుడు
పసు లని యార్చెదము మగుడ బంధుద్రోహీ.

281 క. విను [1]మేను కల్లసారెలు
గొని కపటపుజెత్త మాడుకుశలతఁ గా దో
ప్పనివారు నేపడంచుట
ఘనబాహు[2]స్వైరకేళిఁ గాని దురాత్మా.

282 వ. అని పలికి వెలుచ నవ్వి ధర్మనందనగోవిందపాంచాలప్రకరపార్థసాత్యకినకుల
సహదేవుల నాలోకించి.

283 ఆ. శంక లేక కడఁగి సభ కట్లు పాంచాలి
నంట రానిదాని నొంటి చీర
తోన యున్న సాధ్వి వేనరి వట్టి యీ
డ్చించి నతనిఁ జూడుఁ డంచుఁ బొదలి.

284 వ. పాంచాలి సేసినతపంబు పెంపున [1]నీశోభనంబు సమకూఱె [2]ననిన విని
వారు ప్రమోదంబు నొంద మిక్కిలి సంతసంబునం దేలి యక్కురుఘస్మ
రుండు నర్తించుచెన్ను దోఁపఁ [3]జెలంగి.

---

278 1. బలికిన - ఐ.న.

279 1. యంతనిలువక - ఊ; యలుకమగుడక - ఈ.ట.న.వ.

280 1. నేమిచ్చటనిదె-ల.వ.స; జయించిమేమిదెపసులని-ట.న.వ. 2. మిమ్మును-జ.ద.

281 1. మేము - పెక్కుప్రతులు. 3. స్ఫురణకేళి — కొన్నిప్రతులు.

284 1. నీజయంబు - ఆ.వ. 2. ననుటయు - అ.ఊ.ఖ.చ. 3. జెలంగుచునిట్లనియె — కొన్నిప్రతులు.

285 చ. మును మము గొడ్డువోయి రని ముష్కరతం జెడనాడినట్టిదు
ర్జనుల ననిం గడంగి ధృతరాష్ట్రతనూజుల [1]బంధువర్గమి
త్రనికరసైన్యకోటిసహితంబుగఁ గీటడఁగింపఁ గంటి మిం
క నమరలోక మైన నరకం బయినన్ సరి మాకు నారయన్.

286 క. అని గదఁ జేకొని నృప నీ
తనయుని మెడ వట్టి యదిమి తల గ్రమ్మఱఁ ద
న్నినఁ గని మును దన్నుట నె
మ్మన మెరియతదగ్రజుం డమర్షముతోడన్.

287 వ. [1]హర్షావేశలఘుచారిత్రుం డగునమ్మారుతపుత్రున కిట్లనియె.

288 చ. తల యది యేల తన్నెద వధర్మము నొందుట కాత్మ రోయఁగా
వలవదె రాజరాజనుజవర్గముఁ దక్కినబంధుకోటియుం
గలపరివారముం దెగిన గౌరవ మేదకఁ బోరి సంగర
స్థలమునఁ బడ్డ నీతులువచందముచేఁత జనంబు మెచ్చునే.

289 క. మును లోకము ధర్మపరుం
డనఁ బరఁగినవాఁడ విట్టు లనుచితకృత్యం
బునకుఁ జనఁ దగునె దీనం
గని యెదుఫల మేమి [1]దూష్యగర్వం బేలా.

290 వ. అని దూఱి దుర్యోధనుం జూచి బాష్పాకులలోచనుం డై

291 సీ. విధి ప్రతి[1]కూలుఁ డై [2]వేరంబు పుట్టించి
మాకు నీవును మేము నీకు నలిగి
యితరేతరద్రోహ[3]మతిఁ దెగియింతలు
సేయుట గావించె నీ యధర్మ

---

285 1. సైన్యబంధు-పీ; బంధుమిత్రపుత్ర - కొన్నిప్రతులు.

287 1. మహారోషావేశలఘు చారిత్రుండగు మారుతపుత్రు — క.న.వ.

289 1. నీకు — ఊ.

291 1. కూలమై — ద.బ.పీ. 2. విరసంబుఁబుట్టించి — ఎ.న.వ. 3. మతిగల్గి — వీ.శ.ష.

పరతయు [4]లోభంబు బాల్యంబు మదమును
నిన్ను నింతకుఁ దెచ్చె నీకతమున
నాకు బాంధవకులనాశంబు వాటిల్లె
ధృతరాష్ట్రుకోడండ్రు తీవ్రశోక

తే. కారి యయినవై ధవ్యంబు కారణముగ
నన్ను నిందింతు రనువచనములు మొదలు
గాఁగ బహువిలాపంబులఁ గరుణ మావ
హిల్ల దురపిల్లె [5]నుల్లంబు దల్లడిల్ల.

292 వ. అనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.

293 చ. అనిలసుతుం డధర్మమున నమ్మెయిఁ గౌరవమేదినీశ్వరుం
దనయెదురన్ వధింపఁగ గదాసమరాఖిలధర్మవేది నాఁ
జనినహలాయుధుండు గని సంజయ యే మని పల్కె నంత వాఁ
డనుజులకున్ మఱందులకు నట్టియెడ న్మొగ[1]మోడ నేర్చునే.

294 చ. అన[1]వుడు నాతఁ [2]డిట్టు లను నమ్మను[3]జేంద్రున కప్డు రోహిణీ
తనయుఁడు కోపవేగమునఁ దామ్రముఖుం డయి లేచి బాహు టె
త్తి నృపతులార చూచితిరె తెల్లముగా బకవైరివిక్రమం
బున తెఱఁ గిట్టివాని మనభూములఁ గంటిమె యెన్నఁ డేనియున్.

295 వ. గదాయుద్ధంబున నాభికి దిగువ యగుశరీరభాగంబు నొప్పించుట ధర్మంబుగా దను శాస్త్రోక్తి వినమె వీఁడు విచ్చలవిడిఁ [1]దెంపు సేసె నని పలుకు నమ్మహాత్మునిమనంబున రోషానలంబు [2]సముత్థితం బగుటయు [3]నప్పుడు.

---

4. మదములోభంబును గ్రోధంబు నిన్ను—ఐ.న.ల.వ.పీ.ష. 5. నంగంబు దల్లడిల్ల— ఎ; నమ్మేదినీశ్వరుండు — ట.న.

293 1. మోడఁ డేమియున్ — వీ ష.

294 1. వినియాత — ఈ వ. 2. డిట్లనియె — పెక్కుప్రతులు. 3. జేందుగ్రనితోడ — ఆ.ఎ.వ.

295 1. తప్పుచేసె — ఐ.చ.ద.న.వ. 2. సముద్భూతం — ఘ.న.వ; సముద్ధూతం — ద. 3. నతండు — పెక్కుప్రతులు.

296 క. నిజరథముమీఁదిహలమును
భుజశిఖరమునం దమర్చి భూమి యద్రువ వా
యుజుదెసకు [1]నడచె నుద్భట
గజరిపుచంక్రమణరేఖ గతియం దొలయన్.

—: శ్రీకృష్ణుఁడు బలరామునకుఁ గోపోపశమనంబు చేయుట :—

సం. 9—59—7

297 వ. దానికిం బవమానసూనుండు సోదరభుజబలనిజబలంబు లేకముఖత్వంబున నెప్పుడుం గలుగు మనోబలంబువలనం జలింప కుండె నట్టియెడ వేగంబ విన[1]యవినతుం డగుచు నచ్యుతుం డడ్డంబు సొచ్చి దీర్ఘవృత్తపీనంబు లగుబాహువుల హలాయుధు బట్టి కైలాసశైలంబు గదిసినయంజన మహీధరంబుమాడ్కి నొప్పి [2]యనూనస్వరంబున నతని కిట్లనియె.

298 క. తనవృద్ధియు మిత్రునివ
ర్ధనమును దత్సుఖసమృద్ధి ప్రబలుటయును శ
త్రునిదెస నిన్నియుఁ జెడుటయు
ననుషడ్విధములను దన్ను నతిశుభ మొందున్.

299 వ. పత్ప్రకారంబు విపరీతం బగుట యొప్ప దట్లు గావున మిత్రునకుం గీడు వాటిల్లి నెడ నేర్పు గలుగునేని మైత్రిపరుం డయినపౌరుషశాలి యది శమింపం జేయు సత్యపరాక్రము లగుపాండవులు మనకుఁ బరమ మిత్రులు విశేషించి మనమేనత్తకొడుకు లనీతిపరులచేతం బరిభవింపం బడినవారు గావున వీరల కభ్యుదయంబు గలిగించుట నీకుం గర్తవ్యంబు.

300 తే ప్రతిన నెఱపుట నృపులకుఁ బరమధర్మ
మగుట మనమునఁ జర్చింపు మనిలసుతుఁడు
గద సుయోధను తొడలు భగ్నములు సేయు
వాఁడు గా సభఁ [1]బూనినవాఁడు గాఁడె.

---

296 1. నడరె — న.వ.

297 1. యావనతుం — పెక్కు ప్రతులు; యానతుం — వీ. 2. యనునయవాక్యంబుల నతనికి — అ.ఎ ఓ వ.

301 వ. అట్లుం గాక మైత్రేయమహాముని శాపంబున దుర్యోధనుతొడలు భీమసేను గదాఘాతంబున భగ్నంబులు గాఁగలయవి యై యుండె నిప్పు డట్లయ్యెం గావున దీన దోషంబు దోఁపదు క్రోధం బుపసంహరింపుము కుంతీనందనుల యభివృద్ధి మఱకు సమృద్ధిఁ జేయు ననిన నతనికి హలాయుధుం డిట్లనియె.

302 తే. ఓపి ధర్మార్థకామంబు లొకటి నొకటి
నాశ మొందింపఁ కుండంగ నడపవలయుఁ
గాక ధర్మంబు సెడ నర్థకామములను
గోరుపురుషుండు నిందకుఁ గుదురుగాఁడె.

303 క. మునిశాపంబును బ్రతినయు
ననిచెప్పితి గలుగుఁ గాక యని విను ధర్మం
బున వానిన్ నెఱపక యి
ట్లనిలసుతుఁడు గలఁచె గాదె [1]యన్నెఱి యెల్లన్.

304 చ. [1]అన విని కృష్ణుఁ డిట్టు లను నాతనికిన్ నిను [2]నిజ్జగంబు ధ
ర్మనిరతమానసుండు మధురత్వనిరూఢుఁడు దోష[3]దూరుఁ డం
చనిశము సంస్తుతించును మహాత్మ యడంపుము [4]క్రోధ మీతఁడుం
దనదుప్రతిజ్ఞ కై రిపు గదాహతుఁ జేసె నధర్మ మే లగుఁ.

305 వ. అదియును నిలిచి మార్కొన్నయప్పుడును నడచు నెడను గాదు పొడవెగసి పైకుఱికినఁ దన్నుం గాచికొనుటయుం బ్రతిన నెఱపుటయును గారణముగా దొరకొనిన నాభికి దిగువ గదా యనియుడిగి చావ వచ్చునే గద నూరుభంగంబు సేయుదు ననుభీమసేనుపూనికి పదుమూఁడువత్స[1]రంబు లేని [2]వేఁచిన యది యక్కులపాంసనుం డేల తలంప కుండె మఱచెనేనిం జెడుఁ గాక మన కేమి కలియుగంబు[3]చొరవ యాసన్నం బయ్యె నివ్విధంబులు ధర్మంబు లై

---

303 1. యందఱఁ జూడఁగ — చ.

304 1. అనుటయుఁ గృష్ణుఁ — చ.ఖ. 2. నిప్డు సత్యధర్మ — ఎ. 3. హీనుఁడం — పెక్కు ప్రతులు. 4. కోప — పెక్కు ప్రతులు.

305 1. రంబులనాడుకొనినయది — ఆ.ప.వ. 2. డాఁచినయది — ద.పీ.ష; పూంచియున్న యది — స; రాఁజినయది — ఖ.వ; కాచిన యది — ఔ.న ల. 3. చేరువ — క.ఖ.

చెల్లకుండునే యట్లుంగాక పుట్టినంతనుండియుం గపటంబున నపకారంబులు సేయుచున్న వీనిఁ గపటప్రకారంబునఁ బడవైచుట ధర్మహాని యైతోఁపదు వీఁడు పాండవయాదవ[4]వంశవర్ధనుం డగుసుభద్రానందనుం దెగటార్చినతెఱం గెఱుంగమే యనిన నాబలదేవుండు బలు మొగంబుతో [5]నిట్టి చెనఁటగెలుపు గెలిచిన భీముండు వొగడు వడయుంగాక రణధర్మంబు దప్పక పెనంగినట్టి ధర్మాత్ముం డైన దుర్యోధనునకుత్తమలోకం బయ్యెడు మనుచు నతనికిం జెప్పి రథాధిరూఢుం డై పాండవేయ పాంచాలయదుప్రవరులు చిన్నంబోవ నిజపురంబున కరిగెఁ దదనంతరంబ వాసుదేవుండు ధర్మపుత్త్రు నాలోకించునెడ నతండు దీనాననంబుతోడ మానసంబు విషాదంబు నొంద నూరకున్న నారాయణుం డతని కిట్లనియె.

306 ఆ. బంధునాశకుండు పాపాత్ముఁ డీసుయో
ధనుఁడు వీని సమరధరణిఁ గూల్చి
శిరము దన్నె భీముఁడరయంగ నది యధ
ర్మంబె నీకు నేల మఱుఁగఁ జెపుము.

307 వ. తలఁ దన్ను వాఁడ ననుప్రతిజ్ఞయుఁ గీచకారాతికిం గలదు గాదె యనిన విని కుంతీనందనుండు దేవకీనందనున కిట్లనియె.

308 క. కురుకులము పొలియుటకు మది
యెఱియంగా నున్న నాకు నితఁ డీరాజున్
శిర ముఱక తన్ని యిమ్మెయిఁ
బరిభవ మొందింప వగపు పాటిల కున్నే.

309 తే. ఇతఁడు వఱచినపాటులు హృదయకీలి
తంబు లై భీమసేనుండు తగవు మాలె
నేమి సేయంగవచ్చుఁ బోనిమ్ము పుణ్య
పాపచింత యిం కేటికిఁ బద్మనాభ.

---

ఘ.ద.వ. 4. యశో - పెక్కు ప్రతులు. 5. నురగేంద్రుని భంగిరోజునిటువంటి చెనఁటి – అ త.వ; నిటువంటి గెలుపు గెలిచిన - కొన్ని వ్రతులు.

310 వ. అనుటయు నట్లు గాక దీని నింత గొనియాడ నేల యని యతండు భీమసేనపక్షపాతంబున నతనిచింత గీటునం బుచ్చె వివ్వచ్చుండు నెఱయం బ్రియం బందని డెందంబుతోఁ గీడు మే లాడక యూరకుండె నమ్మారుతి మోదం బెసఁగ మోడ్పుఁగేలు ఫాలతలంబున మోపికొనుచు నుత్ఫుల్లంబు లగు[1]లోచనంబులనొప్పి నిజాగ్రజుం జేరం జని యి ట్లనియె.

311 చ. పరిభవకారి యైన కులపాంసనుఁ డాహవభూమిఁ గూలెఁ ద
త్పరమతి వైరముం బెనిచి పాపవినిశ్చయ [1]కారకత్వని
ష్ఠురు లగుదుస్ససేనుఁడును సూతసుతుండును సౌబలుండుఁ ద్రుం
గి రితనికంటె మున్న మహికిం బతి వీవ ధరిఁపు మున్నతిన్.

312 వ. అనిన విని ధర్మ[1]తనయుం డతని కి ట్లనియె.

313 క. హరితలఁపు గూడఁ గురుపతిఁ
బరిమార్చితి ప్రతిన[1]తోడఁ బగ దీర్చితి నీ
[2]కరయంగ దైవబలవి
స్ఫురితభుజాబలము లింత చొప్పడి యున్నే.

314 వ. అని సంభావించె ననిన విని యాంబికేయుండు సంజయు నుద్దేశించి.

315 తే. అట్లు పడియున్న యక్కౌరవాధినాథుఁ
జూచి పాండు[1]తనూజులు సోమకులును
నేమి సేసిరి నా కది యెఱుఁగఁ జెప్పు
మనుడు నతఁ డిట్టులనియె నమ్మనుజపతికి.

---

310 1. నేత్రంబుల - వి.

311 1. కారిసర్వ — ఘ.

312 1. సుతుండు, నందనుండు - అనియు పాఠములు.

313 1. నెఱపిపగ — ఒ.వి.శ.ష ; నెఱపుపని — అ క.ఘ.జ.వ ; నెఱపుపగ - ఓ బౌ. 2. కరయఁగ దైవ బలంబును — ఐ గ.

315 1. కుమారులు - కొన్ని ప్రతులు.

316 వ. దేవా యేమి సెప్పుదుఁ బాండవులును బాంచాలురునుం దక్కటిభూపతులునుం గృష్ణసహితంబుగా నుబ్బునం బొంగి చీరలు వీచువారును విండులు విసరువారును గుణధ్వని సేయువారును శంఖంబు లొత్తువారును భేరీపణ[1]వాదులు మ్రోగించువారును జెలుచ నార్చువారును [2]నయి పేర్చినం బృథివికి వ్రేఁగగున ట్లుండె నిత్తెఱంగునం జెలంగి మారుతిసూరెలం జేరి యిట్లనిరి.

317 మ. గదనేర్పెక్కుడు గల్గువర్పఘునుఁ డీకౌరవ్యరాజన్యుఁ డు
న్మదలీలం బయి నట్లు [1]బెట్టుటికిన న్వంచించి పో కిట్లు సే
యుదె వీ[2]వాటునఁ బెద్దొడల్ విఱిగ వీఁ డుర్విం [3]బడెఁ మాకునో
ప్పు దలిర్పం బులకాంకురంబు లెసగం బో విప్పుడుం జూడుమీ.

318 ఆ. పరులచేతఁ గాని పని యైనవృత్రవ
ధంబుఁ బోనియరివధంబు నిర్వ
హించి యున్న నిన్ను నే మింద్రుఁ గొనియాడు
నమరులట్లు పొగడెదము సెలంగి.

319 క. అవమానంబులు సేసిన
యవినీతుల దుస్ససేనుఁ డాదిగఁ గలవా
రి వధించి [1]యడుగు పగతుని
యవుదల నిడి తింతవార లవనిం గలరే.

320 వ. అని మఱియు ననేకప్రకారంబుల బ్రశంసించిరి భీముచేసినగదాసమరధర్మవిరోధంబు శాంతిరాజులమనంబుల నుండునో యని శంకించి కృష్ణుం డెల్లరాజులం గలయం గనుంగొని యిట్లనియె.

---

316 1. వాదితూర్యంబులు – కొన్ని ప్రతులు. 2. నవ్వువారునునయి – కొన్ని ప్రతులు.

317 1. బెట్టదరి – కొన్ని ప్రతులు; బెట్టుటికి – కొన్ని ప్రతులు. 2. వాటున – పెక్కు ప్రతులు. 3. బడఁ – పెక్కు ప్రతులు.

319 1. యలఘు – చ.

321 ఉ. చక్కటి లేనియాలమునఁ జంపె ననఘ వల దీదురాత్మకుం
డక్కటికంబు లేక [1]సతి [2]నంతలు సేసిననుం గృపారతిం
దక్కక తండ్రిపా లడిగె ధర్మజుఁ డన్నెఱిసేయఁ డయ్యె వీఁ
డుక్కివుఁ డిట్టి[3]చావునకు యుక్తుఁ డగుం దలపోసి చూడఁగన్.

322 క. విదురాదులు సెప్పఁగ ను
న్మదుఁ డై యీఁడయ్యెఁ దగినమాత్రయు భూసం
పద వీఁడు పాండవుల కిది
యది [1]యగునె బకారి ప్రతిన కగ్గం బై నన్[2].

323 ఆ. నేలఁ గూలి [1]మ్రానువోలె ని ట్లున్న యి
ప్పాపకర్ము గుఱిచి పాడితెఱఁగు
తేట[2]పడఁగ [3]మాట లాట దా నేల మీ
రెక్కుఁ డరదముల మహీశులార.

324 వ. అని యిట్లు పుండరీకాక్షుండు [1]దన్ను నాక్షేపించుట యాకర్ణించి కౌర
వేశ్వరుండు గోపాయత్తచిత్తుం డై పిఱుందు మోవ లేచి చేతుల భూతలం
బూఁది కొని బొమముడితోడిచూడ్కి యతనిపయిం బఱపె నప్పు డపర
భాగంబు విఱుగ వ్రేటు వడి యలిగి తల[2]యెత్తి చూచుమహానాగంబు
చందంబు దోఁచె నట్లు ప్రాణాంతకరణం బై నవేదనాభరంబు దలంపక
కూర్చుండి మున్నా కృష్ణుండు జిష్ణుతోడ సంభాషించుటయు నతం
డూరుతలంబుఁ గర[3]పుటంబున నప్పళించుటయు వెడవెడ గనుటం జేసి
[4]భీమవాటునం దొడలు విఱిగి పడినప్పు డప్పటిబుడిబుడిమాటలు నాస

---

321 1. సభ — వ. 2. నంతపరాభవమందఁజేసినం — ఎ. 3. చొప్పునకు — వ.

322 1. యనునె — పెక్కు ప్రతులు. 2. దీనిపిమ్మట కొన్ని ప్రతులలో 'అని మఱియును' అను వచనము కలదు.

323 1. యిట్లునెఱిచెడియున్నయిప్పావ — ఖ. 2. పాటుమాటలేటికి నాడమీరెక్క — ఐ.గ ; పడఁగ నేల మాటలాడెదరు — వీ.శ.ష; పడఁగనేల మాట లాడఁగను మీ — ఊ. 3. మాటలాడంగ నేల — కొన్ని ప్రతులు.

324 1. దన్నధిక్షేపించుట, దన్నునధిక్షేపించుట-అనియు పాఠములు. 2. యెత్తినమహా- పెక్కు ప్రతులు. 3. తలంబున - కొన్ని ప్రతులు. 4. భీమువ్రేటునం - పెక్కు ప్రతులు.

న్నయు దీనికిం గా[5]కేమి యని యూహించి చేయునది లేక యవ్వుడు
గలఁచుచున్నవాఁ డగుట నగ్గోపాలదేవునితో ని ట్లనియె.

-: *తొడలు విఱిగిపడిన దుర్యోధనుఁడు గృష్ణు నాక్షేపించుట* :-

సం. 9-60-27

325 సీ. కంస[1]దాసునిపుత్ర కానవు నీకురా
చారంబుఁ [2]గృపయు లజ్జయును లేక
ప్రేలెదు నీవు సెప్పినఁ బార్థుచేసిన
సన్నగై కొని గదాసంగరంబు
పాడి దొఱంగి యిప్పాపకర్ముఁడు వై చెఁ
గాక చక్కటితోడికయ్య మైన
లీల మిమ్మందఱ నేలపాలుగఁ జేయ
నే శిఖండి గడంగి యేసె ననఁగ

తే. నర్జునుఁడు శాంతనవుఁ గూల్చునట్లు చేసి
తస్త్రగురుచావునకుఁ బాండవాగ్రజన్ము
బొంకు మని [3]పంచి తరదంబు పుడమిఁ గ్రుంగఁ
గర్ణుఁ [4]జంపించి తే మనఁ గలదు నిన్ను.

326 క. భూరిశ్రవుఁ [1]డొక్కనితోఁ
బోరంగ [2]నేయించి తట్లు [3]పొడిచీఁకటి
నం[4]హారరహితు సైంధవుని నరు
బారిపఱిచి తిట్టినీకుఁ బల్కులు [5]సనునే.

---

5. నోపునని — ఈ.ఊ జ.ల.

325 1. దాసీపుత్ర — ఇ.ఉ.క.త.న. 2. నీతి—వ. 3. పంచితి రథంబు—ల. 4. నేయించి—ట.

326 1. నొక్కరు (రి) — కొన్ని ప్రతులు. 2. చెయిదుగ్రించునట్లు బోధించితియం — అ.ప.ఓ.ట. 3. పోచీకటి — ఇ.ఉ.ఘ.న.ల; పోయి గదిసియుం — అ.ప.ఖ.గ. 4. నపోరఁబడ - పీ.ష. 5. దగునే — ఏ.వీ.శ.ష.

327 క. నను భీష్ము గురుని సూతసు
తుని భూరిశ్రవు జయద్రథుం జక్కటి ద
ప్పనియనిఁ [1]గోల్పుచ్చఁగ వ
చ్చునె నీకుం గపటశూర సుచరితదూరా.

328 వ అనిన విని యచ్యుతుం [1]డతని నవలోకించి నీవు భీముని [2]బాలునిఁ బాము
లం గఱపించియు విషం బిడియు నీటం ద్రోచియుం బలుమాఱుం జంప
దెగితివి కొంతియుఁ గొడుకు లేవురును నిద్రించుసమయంబున [3]జతు
గృహంబు దహించితివి [4]ధర్మోత్తరచరిత్రుం డగు నజాతశత్రుసంపదలఁ
[5]గపటద్యూతం[6]బున నపహరించి [7]తంతఁ దనివిం బొక యాజ్ఞసేని నేక
వస్త్ర రజస్వలం గొలువులోపల భంగపెట్టి తాపోవిద్ద నిన్ను నిట్టి దురవస్థ
కుం దేరం దగి యుండ నట్లు పోయి సమయంబు నడపి నీచేసినసకల
దుష్కృతంబులు సహించిన యప్పాండవాగ్ర[8]జుండు వనుప నేను బుడమిపా
లడుగ వచ్చిన [9]నీ నేరవైతి నీనేరమి నిక్కైతి భవదీయం బగులోభంబునం
బాపనిశ్చయంబున మదంబున శాంతచిత్తు లగుశాంతనవద్రోణులకుం బ్రాణ
హాని వాటిల్లె వినుము ద్రుపదునితపోయజ్ఞ[10]ప్రభావంబుల నదియు వనిగా
జనియించిన శిఖండిధృష్టద్యుమ్నులాభీష్మ[11]గురులమరణంబు[12]లకుఁ గార
ణంబులు గాక తక్కుదురే [13]పెక్కండ్రతోడం బోరి డస్సినసాత్యకిం
జంపువాఁడైనభూరిశ్రవుం [14]జంప కుందుమే యనేకప్రౌఢయోధు
లొక్కరుని బాలు సౌభద్రుం బొదివి చంపినం బూనినపూన్కి [15]నిఖి
లోపాయంబుల నెఱపక పుణ్యాత్మయైన పాంచాలి నరణ్యంబునం బరిభవిం

---

327 1. గూల్పింపఁగ - శ.ష ; గూల్పంగావచ్చునె - వ.

323 1. డతనియాననంబాలోకించి — వీ.శ.ష ; డతనినాలోకించి — కొన్ని ప్రతులు. 2. బాలుని — ఇది పెక్కు ప్రతులలో లేదు. 3. లక్కయిల్లు - అ.ఏ ; జతుర్గృహంబు — కొన్ని ప్రతులు. జతు శబ్దము ఉకారాంత నపుంసక లింగము. కావున ఈ 'జతుస్' అను రూపము విలక్షణముగా కన్పట్టుచున్నది ; జతు గృహంబున దహనంబు దరికొల్పితివి — వీ.శ.ష. 4. ధర్మోత్తరుండగు — వీ.శ.ష. 5. గపటపు జూదంబున — కొన్ని ప్రతులు. 6. బాడిశకునికైతవంబున — వీ.శ.ష. 7. తంతఁ బొక - వీ.శ.ష ; యంతటందనివోవక — కొన్ని ప్రతులు. 8. జుపనుపున నేను — వీ.ష. 9. నాఁడీనేరక— వీ.శ.ష. 10. మహిమనదియ — ఖ. 11. ద్రోణుల — ఒ.న. 12. లకుఁ గాక— అ.ఏ.గ.ల.ష. 13. పెక్కండ్రు రాజుల—ఊ.చ.జ.వీ.శ.ష. 14 బొలియింపకుండుదుమే, బొరియింపకుండుదు (మే) రే — అనియు పాఠములు. 15. వివిధో—కొన్ని ప్రతులు.

చినపాపాత్ముని సైంధవుని బ్రదికి పో విడిచి యర్జునం [16]డగ్నిం బ్రవేశించునే యిన్నితెఱంగుల చరిత్రంబులు నిర్మలంబులు ఘోష [17]యాత్ర నిన్ను గంధర్వులు పట్టుకొని పోవునప్పుడు నీవారెల్లం బాఱిన నర్జునుండు నిన్ను విడిపించుట యెఱుంగవే గాంగేయకుంభజకర్ణాశ్వత్థామకృపు లుద్దామ సమగ్రసైన్యంబులతోడ నడవ నీవు [18]విరటునిగోవులం బట్టికొని పోవు [19]చోట మీరంద [20]ఱుం దనసమ్మోహనాస్త్రంబున మూర్ఛితులైన సమయంబున [21]నర్జునుండు [22]నిన్నుం గాచుట యెఱుంగ రాదె నీ [23]వాపాదించిన పాపంబుల కెల్ల మూలం బైనకర్ణునరదంబు [24]ధరణిం గ్రుంగినం గవ్వడి వాని నేయ కేల కాచికొని యుండు నుండె నేసియు భూసురశాపంబున నక్కైనరథంబునకు నిష్కృతి గలుగునే కావున నన్నిచు సమయించుట సముచితంబు యుధిష్ఠిరుండు శల్యుం దెగటార్చిన తెఱం [25]గొప్పనొప్ప దని యుగ్గడింపక మేలు సేసితి పాండునందనులు పుట్టినంతటినుండి నేఁడు దుదిగా నీయెడ ధర్మవిరోధం బాచరింపరు కురుకులంబునకు గుద్దలి గొని దుర్ద్యూ[26]తంబు నీవ తొడరితి దాన నింతలు వుట్టెఁ [27]బవను పట్టి వట్టినప్రతిన యెఱుంగవె గద నూరుభంగంబు సేయుదునని పలికి పిడికిటం బొడుచునే [28]యని యెల్లను [29]వృథాజల్పంబు లూరకుండు మనుటయు నజ్జననాథుండు [30]జనార్దనున కిట్లనియె.

329 చ. చదివితి [1]నెల్ల వేదములు జన్నము లొప్పఁగ జేసితిన్ [2]రమా
స్పద మగువృత్తిఁ బొల్చి నరపాలకు లెల్లను గొల్వఁ గంటి దు

---

16. డగ్నిప్రవేశంబు సేయునే–పెక్కు ప్రతులు. 17. యాత్రయందు – అ.ఎ.ప.ఘ. 18. విరటువసులం – పెక్కు ప్రతులు. 19. నపుడు – ఔ.ట.ల.వ. 20. ఉనర్జునుని – ఈ.ఖ.వీ.శ.ష. 21. నర్జునుండు – ఇది పెక్కు ప్రతులలో లేదు. 22. మిమ్ముం – పెక్కు ప్రతులు. 23. వాచరించిన – పెక్కు ప్రతులు. 24. ధరం గ్రుంగిన, నేలం గ్రుంగిన, పుడమిం గ్రుంగిన – అనియు పాఠములు. 25. గొప్పదని–పెక్కు ప్రతులు. 26. తంబుదొణం (డం) గితి – పెక్కు ప్రతులు. 27. బవన తనయుఁడు–వా.వీ.శ.ష ; బవను పట్టి – పెక్కు ప్రతులు. 28. యిది యేల – కొన్ని ప్రతులు. 29. వృథాలాపంబు – వ. 30. జగన్నాథున – వ.

329 1. వేదశాస్త్రములు – అ ; నేను వేదములు – పెక్కు ప్రతులు. 2. గ్రమా – ఈ.ల

ర్మదరిపు గాఢ[3]గర్వపరిమర్దనకేళి యొనర్చి[4]తిం దగం
దుది [5]నని [6]మిత్రబాంధవులతోఁ ద్రిదివంబున కేఁగు టొప్పదే.

330 వ. నీకుం జూడ నెట్టివాఁడ నైనను నాకేమి మీరింకఁ బశ్చాత్తాపదుఃఖితు లగుచు నుందురు గాక యనియె నప్పు డతనిపైఁ బుష్పవర్షంబులు గురిసె దేవదుందుభులు [1]మొరసె దిశలు దెలివొందె మృదుసమీరణంబు సుగంధి యై వీతెంచె నంతయు ననుసంధించి యక్కౌంతేయులు దారు ధర్మంబు [2]దొలంగి గాంగేయద్రోణ కర్ణ[3]శల్యదుర్యోధనాదుల వధించుట యత్తఱిం గ్రొత్తయై తోఁచినఁ జిత్తంబుల వగయు లజ్జ[4]యు మిగులం [5]బొడమి మొగంబులఁ దోఁప విన్ననై యున్నం జూచి వెన్నుండు తత్సమీపంబునకుం [6]జని [7]వారలతో నిట్లనియె.

331 సీ. గాంగేయగురుకర్ణకౌరవపతులఁ [1]జ
క్కటి యనిఁ బరిమార్పఁ గాన మైతి
మని మీరు వగవకుఁ [2]డద్దొర లుగ్రాస్త్ర
వేదులు ప్రస్ఫుటవిక్రమమున
[3]నడరి [4]వారల గెల్చు టరిది గావున నేను
బహువిధోపాయముల్ వన్ని [5]యిట్లు
దీర్చితిఁ గాక యత్తీవ్రపరాక్రము
లలఁతులఁ బోదురే యట్లుఁ గాక

---

3. దర్ప—ఖ.జ.త.వ ; కర్మ—ఇ.ఉ ; వర్గ, సైన్య-అనియు పాఠములు. 4. పేర్చితిం—ఎ.వ. 5. (చ) సని — అ.ఏ.జ.వ ; నిక — త ; తగ — ఎ.ఓ. 6. విప్ర — వ.

330 1. మ్రోసె — ఇ.ఔ.క.ట.త. 2. దొలంగి — ఊ. 3. శల్య — ఇది పెక్కు ప్రతులలో లేదు. 4. యుఁ బొగులు — ఈ ; యును — ఒ ఖ.జ. 5. బొడమెదు — అ.ఏ ; బొడమిన — త.శ. 6. జేరి — క ; వచ్చి — త.వ. 7. వారలకిట్లనియె — పెక్కు ప్రతులు.

331 1. జక్కని — పెక్కు ప్రతులు ; చిక్కని—ఏ. 2. డందఱు దివ్యాస్త్ర—ఈ ; డందఱు శీఘ్రాస్త్ర — ఎ ఓ.ట ; డద్దొరల్ శస్త్రాస్త్ర — ఇ ఉ ; డద్దొరల్ శీఘ్రాస్త్ర — ఏ ఒ.ఖ.ఘ; డ తిరథుల్ శీఘ్రాస్త్ర — త. 3. నలరి—ఏ ; నరిది — త. 4. వారిని—ఇ. 5. పగర — జ ;

తే. వారి విధి [6]యివ్విధమునఁ జావంగఁ జేసె
దైవఘటనలు దప్పింప [7]మీవశంబె
సురలు [8]దనుజుల గెల్చినచొప్పు లిట్లు
సంతసపుసమయంబున వంత లేల.

-: *పాండవులు గృష్ణసాత్యకులతోఁ గౌరవశిబిరంబునకుం బోవుట* :-

సం. 9-61-3

332 వ. కృతకృత్యుల మైతిమి ప్రొద్దునుం జాల వా[ఱె] సేనయు సైనికవరులును విశ్రమింప వలయు బోదము లెం డనినఁ బాండవులు దెలివొందఁ బాంచాలురునుం దక్కిన భూపాలురునుం బ్రమోదం[1]బు నొంది రప్పుడు కృష్ణుండు పాంచజన్యంబు [2]పూరించిన నర్జునుండు దేవదత్తంబును యుధిష్ఠిరుం డనంతవిజయంబును భీమసేనుండు పౌండ్రంబును [3]నకులసహదేవులు సుఘోషమణిపుష్పకంబులును బూరించిరి సకల[4]రథికోత్తములును దమతమ శంఖంబు లొత్తిరి భేరీపణవాదితూర్యంబులు [5]మ్రోసె నా[6]సముత్థితనినాదంబులు నింగి [7]నిండె [8]నిఖిలజనంబులుం బాండవేయులం బొగడుచు లివు [9]దిక్కుల దీటుకొనియె ని ట్లుబ్బునం జెలంగుచు వార లందఱు నచ్చోటు గదలిరి కౌంతేయులుఁ గౌరవశిబిరంబునకుం జనిన సాత్యకి యనుగమనంబు సేసె ధృష్టద్యుమ్న[10]ప్రముఖు లైన ద్రుపదజ్ఞాతులును ద్రౌపదేయులునుం [11]దక్కినధరణీశులును దమవిడిదలలం గానివిశ్రమంబునకు వెరవుగా దని తలంచి తా రందుఁ బోయి నాఁటిరాత్రి నిలిచి రేపకడ గరిపురప్రయాణంబున[12] కొదవం జనుదెంచువారుగా విన్నవించి ధర్మతనయు ననుమతి వడసి సైన్య సమే[13]తంబుగాఁ బోయి రట్లు వార లటు వోవ నప్పాండు

---

పగయు—చ. 6. యివ్విధంబులఁ బోరఁ జేసె—ఇ; యీ క్రమమునఁ జావంగఁ జేసె—త. 7. దనకు వశమె — ఊ. 8. నసురుల — ఘ.వ.

332 1. బుఁ బొందిరి — అ.ఎ.ఖ ; బునఁ బొంగిరి — ఐ.ఓ.త.ద. 2. పూరించుటయు — కొన్ని ప్రతులు. 3. నకులుండుసుఘోషఁబును, సహదేవుండు మణిపుష్పకంబును — ఆ.ప. 4. ధరణీశులు — ఔ.ట ; ధీరోత్తములు — ఆ.ఉ. 5. మొరసె — ఉ.ఊ. 6. సముదిత-కొన్ని ప్రతులు. 7. ముట్టె-కొన్ని ప్రతులు. 8. నఖిల—కొన్ని ప్రతులు. 9. దిక్కులు పిక్కటిల్లెనట్లు — చ. 10. ప్రభృతులైన — అ.ఎ.క. 11. దక్కటి — కొన్ని ప్రతులు. 12. ననువొందనేతెంచు — ఆ.ఎ.ఓ. 13. తులై పోయి — పెక్కు

నందనులు సని సంగీతప్రవర్తకసంఘంబులు [14]విరిసి చనిన రిత్తయై యున్న రంగస్థలంబుచందంబునం బాడరియున్న యాశిబిరంబుఁ బ్రవేశించి నీనందను నగరు సొచ్చిన నచ్చట నున్న పరిచారకులును దత్సహవాసులును మణికన కాదివస్తుసంచయాధ్యక్షులును నయ్యుధిష్ఠిరుం గాంచి యాదరణంబు వడసి రక్కుంతీ[15]నందనులు రథంబులు డిగ్గునవసరంబున వాసుదేవుండు వాసవి నాలోకించి.

333 క. కవదొనలును గాండీవము
నవల నిడం బనుపు ముంద రరదము డిగు మే
[1]న విదప డిగియెద శుభకర
మవు నవ్విధ మట్లుసేయు మనుడు నతండున్.

334 తే. ధనువు తూణీర[1]యుగళంబుఁ గొనుచు రథము
డిగుడు [2]శౌరి పగ్గంబుల నొగల ముడిచి
డిగియెఁ గేతనకపియు భూతగణయుతము
[3]గాఁ దొలంగె నత్తేరు తత్క్షణమ మండె.

-: అగ్నిదత్తం బైన యర్జునరథంబు గాలిపోవుట :-

సం. 9—61—14

335 క. తురగంబులతోఁ గూడఁగ
నరదము సకలంబు నుజ్జ్వలానలశిఖలన్
[1]సురసురఁ బోయినఁ గని య
న్నరుఁ [2]డచ్చెరువంది కృష్ణునకు నభిముఖుఁ డై

---

ప్రతులు. 14. విడిచిచన — వీ.శ.ష. 15. పుత్రులు — పెక్కు ప్రతులు.

333 1. దివియెదఁ బిదపను శుభ — అ; ను వెనుకడిగియెద — ఆ.ఐ.గ.ట.వ.శ; నువినుము రథమున్ డిగ్గిననవునశుభము—ఔ; నుపిదప — స.ప, వలప్రాసవిషయమున చర్చకలదు.

334 1. యుగ్మంబు — ఐ.గ. 2. శౌరియుఁ బగ్గముల్ — అ ఊ.ఖ. 3. గాఁగఁ దొలఁగె నత్తేరు — పెక్కు ప్రతులు.

335 1. సురసుర — పెక్కు ప్రతులు; ఛురచుర — వా. 2. దద్భుతమంది — ఊ.

336 వ. వినయంబుతోడ మోడ్పుఁగేలు ఫాలతలంబునఁ [1]గడియించి [2]వినతుం డై దేవా యిట్టియాశ్చర్యంబుం గలదె యీరథంబు[3]దగ్ధం బగుటకుఁ గారణం బేమి నాకు వినం దగునేని యానతి మ్మనిన మురారాతి యతని కి ట్లనియె.

337 క. గురుకర్ణుల[1]యస్త్రాగ్నుల
నెరిసినయది [2]మున్ను దీని నిటు గా కుండం
[3]భరపడి రక్షించితి సం
గరము దెగినఁ దొలఁగి యిపుడు గాల విడిచితిన్.

338 వ. అని చెప్పి యప్పు డద్భుతరసమగ్ను లగు చున్నతక్కటిపాండవు[1]లం గనుం గొని యలరుమొగంబున నలంతినవ్వు కాంతి దళుకొత్తఁ గౌంతేయాగ్రజుం గౌఁగిలించికొని యే నుపప్లావ్యంబునకు వచ్చి నిన్నుఁ గనిన నీవు నాకు మధుపర్కం బిచ్చి విర్వచ్చుఁ జూపి వీఁడు నీకు రక్షణీయుండు సుమీ [2]యని యప్పగించి తేనును నియ్యకొంటి నట్ల నాసఖుండును సురక్షితుం డై వీరక్షయకరం బగుమహాసంగరంబు భవద్భీమనకులసహదేవహితంబుగ నిస్తరించి [3]జయంబు [4]గై కొనియె నిట మీఁదం జేయ వలయు కార్యం [5]బులు నడపు [6]మనవుడు నతం డచ్యుతున కి ట్లనియె

339 తే. ద్రోణకర్ణదివ్యాస్త్రముల్ క్రూరభంగిఁ
గవియున్నప్పుడు మము నీవు గావకున్న
[1]బ్రదుకు టెంతద వ్వధిక[2]శుభంబులకు భ
వత్ప్రసాదంబు గని కాదె వాసుదేవ.

---

336 1. గీలించి — వీ.శ.ష. 2 వినయుం — వా. విధేయుండగుచు — చ; వినయం బున — ల. 3. బగ్నిచేత దగ్ధం — ఆ.

337 1. శస్త్రా — అ.ఇ.ఉ.ఏ.ఔ.ఖ.ట. 2. దీని మున్న యిటు — ఇ.ఉ.ఔ.ట.న.వ; యైన దీని — చ.ష. 3. బరువడి — శ.ష.

338 1. గలయఁ గనుంగొని — పెక్కు ప్రతులు. 2. యనినా కప్పగించిన నేనును — చ. 3. విజయంబు — అ.ఊ.క.త. 4. జేకొనియె — ఘ; జేకొంటనిట — ఎ; గై కొనియె నీవు — ఆ. 5. బానతిమ్మనుటయు — చ. 6. మనుండు, మనుటయు — అనియు పాఠములు.

339 1. బ్రదుకుటకు దవ్వుగా దెశుభంబు గనుట మీ ప్రసాదంబునన — చ. 2. శుభంబులిటు భవత్ప్రసాద భాజనులగు వారి కరుదె — ఎ.ఒ.ట.

340 వ. అని వెండియు.

341 క. [1]మునిపతి కృష్ణద్వైపా
యనుఁడు ప్రబోధించె [2]నన్ను నచ్యుతుఁ డేది
క్కున [3]నుండు నెమ్మి నాది
క్కునకు జయము గల్గు నని యకుంఠితకరుణన్.

342 వ. అనుటయు మాధవుం డమ్మనుజేంద్రున కిట్లనియె.

343 క. మనకుం గౌరవులకుఁ బదు
నెనిమిది యక్షౌహిణులు మహీశ్వర [1]కల వ
[2]ప్పెను మొన లన్నిటిలో న
ర్జునునకుఁ [3]బాటి యని యొక్కరునిఁ బేర్కొనుమా.

344 తే. [1]ఈశ్వరుఁడు క్రీడి కస్త్రంబు లిచ్చుచోట
మత్సముండవు గమ్మని వత్సలత్వ
[2]గౌరవంబునఁ బల్కె నిక్కము[3]గ నంత
వాఁడు గాఁడె నీతమ్ముఁడు వసుమతీశ.

345 చ. కరుణ జనించి శాత్రవుల గాండివి సంపఁగ నొల్లఁడయ్యె నేఁ
బరువడిఁ [1]దెల్పి యైక్యపరిభావ[2]నిరూఢము గాఁగ జేసినం
దిర మయి పోరికిం గృతమతిన్ మఱి చొచ్చి సరిత్సుతాదులన్
వెరవున గీటడంచెఁ దనవిక్రమ మెందుఁ బ్రసిద్ధి కెక్కఁగన్.

---

341 1. పనివడి — గ. 2. నాకు — చ. 3. నుండెనేని — ల ; నెమ్మినుండు, నెలమి నుండు, జెందియుండు, వసియించును, నిల్చి యుండు — అనియు పాఠములు.

343 1. వినుమ — ఐగ. 2. మొనలన్నిటిలోపల — ఆ.ఎ.ఓ.ఖ. 3. సాటి — అ.ఏ.ఔ.ద.వ ; పాడి - ఇ.న.ల.

344 1. శర్వుఁ డర్జునునకు నస్త్రచయము లిచ్చి—ఆ.ఎ.ఓ.వ ; అభవుఁ డర్జునునకునుదివ్యాస్త్ర మిచ్చి — న.వ. 2. గారవంబునఁ బలికె, గారవముగాఁగఁబలికె, గౌరవమ్మునఁ బలికె, కారణంబునఁ బలికె — అనియు పాఠములు. 3. నకంత — కొన్ని ప్రతులు.

345 1. దేర్చి — క ; దీర్చి — ఖ ; తెచ్చి — అ.ఏ.జ. 2. మురూఢము - పెక్కు ప్రతులు.

346 క. ¹అచ్చెరువు ²సంపుటకుఁ దన
యిచ్చఁ జొరక కేలి సలిపె నిన్నాళ్లును వి
వ్వచ్చుఁడు హిత మేఁ జెప్పినఁ
జొచ్చెము లే కంతరంగమున ³నిల్పెఁ దగన్.

347 క. ఏ నుపదే¹శించితి ననఁ
గా నొక²పెం పెంచినాఁడు గాని తలంపన్
మానవనాథ సురేశ్వర
సూనుఁడు నాయట్టివాఁడ చు ³మ్మేపనికిన్.

348 క. నిమిషార్ధంబున త్రైలో
క్యమును సురాసురయుతంబు గా నోర్చుం గో
పము పొడమినఁ గవ్వడి క
య్యమునం¹గురుబలము ²గెలుచు టరుదే తలఁపన్.

349 వ. అని పలికె నిట్లు సల్లాపసౌఖ్యం బనుభవించి వాహనమోచనం బాచరిం
చిరి తదనంతరంబ కౌంతేయులు గమనీయాభరణంబులుం గనకరాసులును
రత్నసంచయంబులుం మొదలుగా మహనీయవస్తువిస్తారంబునం బ్రస్తుతి
పాత్రం బైననీపుత్రు¹భాండాగారంబుఁ జేకొని నాఁడు పొలిగలనికిం
బోవక యున్నరథరథ్యమాతంగతురంగంబులం జూచికొని దాసదాసీకుబ్జ
వామనగణంబులం గైకొని యధిక²ప్రమదసమదచేష్టితంబుల నుల్లసిల్లిరి
కొండొకసేపునకు శౌరి వారలతో ని ట్లనియె.

---

346 1. అచ్చుగఁ జెప్పుటకుం — చ. 2. జూపుటకు — ఆ.ఓ.ట.త.న.వ ; గఁజెప్పఁగ — అ.ఖ ; జెప్పుటకు — ఊ. 3. నిలుపుదన౯ — పెక్కు ప్రతులు.

347 1. సించెద—కొన్ని ప్రతులు. 2. టిప్పించి—ఈ.చ. 3. మ్మీపనికి౯—ల, మ్మెవ్వరికి౯, మ్మెవ్వనికి౯ — అనియు పాఠములు.

348 1. గౌరవుల గెలుచు — ఊ. 2. నోర్చుటరుదే — ఐ.గ.

349 1. భండారువు, భండారంబు — అనియు పాఠములు. 2. ప్రమదాభీప్సితంబుల — పీ ; ప్రమదాభీష్టితంబుల — ప ; ప్రమద చేష్టితంబుల — శ.

350 ఆ. వీఁడు పాడు గాన విశ్రాంతి కియ్యెడ
వనము మసల[1]వలదు మంగళార్థ
ముగ శుచిప్రదేశమున కేఁగి యచ్చోట
నుచితవర్తనముల నుండవలయు.

351 క. అనిచెప్పి పాండు నృపనం
దనులం దన తమ్మునిన్ సుభదం బెసఁగఁగఁ దో
డ్కొని పోయెను వసుదేవుని
తనయుఁడు శిబిరంబు [1]వెడలి ధరణీనాథా.

352 వ. ఇట్లు వోవునప్పుడు శౌరిసారథియైనదారకుఁడు మున్నెప్పుడును విడి దలం దమ తేరు [1]నశ్వంబులనుం బరికించి యుండెడువాఁడు [2]బోయలు నీకొడుకు మడువున డాఁగినయునికి జెప్పిన నయ్యెడకు వచ్చు కొంతే యులతో వీ డెల్ల నొక్కతలగా వెడలివేడుకఁ జూడం జనుదేరఁ దాను నయ్యారదంబున [3]శైబ్యసుగ్రీవమేఘ[4]పుష్ప[5]వలాహకం[6]బులం బూన్చికొని వచ్చుటం జేసి తా నప్పుడు కౌరవశిబిరంబునకుఁ [7]దోడన యరుగుదెంచెం గావున నొదవి సుకల్పితస్యందనుం డై యద్దామోదరుదృష్టిపథంబు [8]నిల్చె ధర్మనందనుండును దమ్ములును సాత్యకియును సముచితవాహనంబులు దెప్పించుకొని యారోహణంబు సేయ నన్నారాయణుండు నిజరథా రూఢుం డై యత్తెఱఁగునం బోయి.

---

350 1. జనదు — చ.

351 1. వెడలి — కొన్ని పత్రులు.

352 1. బరీక్షించి — పీ.శ.ష ; బరికల్పించి — స ; బరిరక్షించి — ల.వ ; బూన్చికొని — ఘ; బరికించికొనియుండెడు—పెక్కు ప్రతులు. 2. బోయలువచ్చినీ—అ.ఎ.వ. 3. సైన్య — పెక్కు ప్రతులు. శ్రీకృష్ణునిరథాశ్వములలో నొకటియైనదిగా 'సోరన్ సెన్' శైబ్యము గానే గ్రహించెను. అట్లనుటయే యుక్తము. 4. పుష్పక — ఏ.ఖ.త. 5. బలాహక — కొన్ని ప్రతులు 6. బులనువాహనంబులం బూన్చి — పెక్కు ప్రతులు 7. దానును నరుగు — అ.ఎ.ప ; దోన — కొన్ని ప్రతులు. 8. నిలిచిన — అ.

353 తే. [1]ఓఘవతి యనఁ బరఁగిన యొక్కపుణ్య
తటిని [2]చేరువఁ గల్గిన దానితీర
భూమియం దర్హ్మ మగుతలమున వసించి
రమ్మహాత్ములు చిత్తంబు లలర నధిప.

354 వ. అని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రునకుఁ బాండవులవిజయం[1]బు తెలుంగుఁ జెప్పె నని వైశంపాయనుండు.

355 క. జనమేజయునకు నిట్లను
విను మప్పుడు ధర్మసుతుఁడు విష్ణునివదనం
బునఁ జూడ్కి నిలిపి కరిపుర
మునకుం బోవలయు [1]నీకుఁ బురుషార్థనిధీ.

356 వ. అని ప్రార్థించె ననుటయు నమ్మనుజపతి యమ్మహీసురవరున కిట్లనియె.

357 చ. అని ధృతరాష్ట్రనందనుల నందఱ గీటడఁగించి [1]వేఁడి యా
యనకడ కచ్యుతుం [2]బనుపునంతటికార్యవిశేష మేమి గ
ల్గెనొ మునినాథ యాన్నృపతికిఁ మది నాకు వినంగ వేడ్క వు
ట్టినయది యత్తెఱంగు ప్రకటింపు పరిస్ఫుట[3]వాక్య[4]సంపదన్.

358 వ. అనవుడు నాసంయమి యిట్లనియె.

359 ఉ. కౌరవముఖ్య ధర్మ[1]గతి గాని తెలుంగునఁ గ్రీడి [2]పంపఁగా
మారుతి [3]గూల్చె నట్లగుట మాన్యచరిత్రుఁడు ధర్మసూతి గాం

---

353 1. యోగ — అ.ల; వ్యోమ — వ. 2. కి — ఎ.

354 1. బెఱింగించెనని — పి.శ.ష.

355 1. నివు — పెక్కు ప్రతులు.

357 1. వెండి — కొన్ని ప్రతులు. 2. బనుచు — కొన్ని ప్రతులు. 3. కార్య — ఓ.ఖ.వ. 4. పద్ధతిఁ — అ.

359 1. విధి — ఒ.క.జ. 2. యొప్పఁగా — వ. 3. గూల్చెఁ గౌరవసమాజవరేణ్యుని-

ధారి శపించు దీని [4]విని త మ్మని యాత్మఁ దలంచి యిమ్మెయిం
గూరినభీతి నవ్వనితకుం దగుభంగి శమం బొనర్పఁగన్.

–: శ్రీకృష్ణుఁడు గాంధారి నూఱడింపఁ గరిపురంబునకుఁ బోవుట :–

సం. 9–61–40

360 వ. వనిచెం గాని ధృతరాష్ట్రు నుద్దేశించి కా దట యచ్యుతుం డరిగి యప్పటి కుచితం బగువిధంబునఁ గార్యంబు నడపె నాకర్ణింపు మట్లు దన్నుఁ బ్రార్థించిన నప్పురుషోత్తముండు వనితెఱం గడిగి పాండవాగ్రజుండు సెప్ప విని రథారూఢుం డై యతిరయంబునఁ గరినగరంబున [1]కరిగి మొగసాల నిలిచి యాంబికేయునకుఁ దనరాక యెఱింగించి పుచ్చి తగం జొచ్చి యంతకమున్న గాంధారీద్వితీయుం డై కొడుకులదెస వగలం బొగులు చున్న యమ్మహీకాంతునివలని కారుణ్యంబున నతనికడకుం జనుదెంచి యున్నకృష్ణద్వైపాయనమహామునిం గని వినయసంభ్రమంబులు [2]దలకొనఁ దత్పాదంబులకుఁ బ్రణమిల్లి యక్కురురాజునకు [3]గాంధారరాజ నందనకు నమస్కరించి కులపతిసన్నిధి యగుట శిలాతలంబునం గూర్చున్న యజ్జననాథుసమీపంబున నాసీనుం డై.

361 ఆ. అన్నరేంద్రు పాణి యల్లన [1]తనకరా
బ్జమునఁ గీలుకొల్పి బహుళబాష్ప
[2]కలితవదనుఁ డగుచు గళమున [3]నెలుఁ గురి
యాడ వగచి యమ్మురాంతకుండు.

362 వ. తత్ప్రదేశంబున నున్నకనకకలశజలంబుల ముఖప్రక్షాళనంబు సేసి యెలుఁగు నూలుకొనం జేసి యి ట్లనియె.

---

వీ.శ.ష; గూల్చెనప్డుజనమాన్య — కొన్ని ప్రతులు. 4. విదితంబుగనాత్మ — ఊ.చ; విదితంబనియాత్మ — ల; వినితమ్మనిగంచుఁదలంచి — వీ.శ.ష.

360 1. కరిగినగరిమొగ — కొన్ని ప్రతులు. 2. దళుకొత్త — ల. 3. గాంధారికి నమస్కరించి — కొన్ని ప్రతులు.

361 1. కరతలాబ్జమున — ప. 2. గళిత — చ. 3. నెలుఁగెత్తియాడ — వ.

362 1. కుంభంబుల జలంబుల — ఐ.గ. కలశంబుల జలంబుల — కొన్ని ప్రతులు; కలశోదకంబుల — ఎ. 2. నంబాచరించి యెలుంగు — పెక్కు ప్రతులు.

363 చ. అకట కులం బకారణమ యంతయు [1]నాశము నొందె నిట్టిదా
నికిఁ జొరఁ నొల్ల రైరి మహనీయచరిత్రులు నాఁడు పాండవు
ల్సకలము నీ నెఱుంగుదు చలంబును నీసును దక్కి నన్ను సం
ధికి నిట [2]రా నొనర్చుట మదిం దలపోయు మ దెట్టిశాంతియో.

364 వ. [1]అని యంత నిలువక.

365 క. గొలువరె జూదము లెందును
గలదే తలఁబట్టి [1]పుణ్యకాంతఁ [2]గొలువులో
పలి కీడ్చి తెచ్చివలువ[3]ల
నొలుచుట యే మనఁగవచ్చు నుర్వీనాథా.

366 క. దానికి నొచ్చినమనముల
తో నడవికిఁ బోయి బహుళదుఃఖంబుల న
ట్లూని విరాటుపురిం బడఁ
[1]గానియిడుమ వడియు వారు గనల[2]ర కంటే.

367 ఉ. ఏవుర కుండ నొక్కొకటి యిమ్మని యూళులు వేఁడి కాన రై
[1]రే వల దన్న నీకొడుకు లెమ్మెయి [2]మానర లోభగర్వముల్
నీవును నట్ల [3]కాక మహనీయమతుల్ విదురాదిబాంధవుల్
వేవురు సెప్పరే యధిప వింటె తగం బలు కొక్కఁ డేనియున్.

368 క. కాలోపహతమనస్కుఁ[1]డు
[2]మేలు తెరువు వట్టు నెట్లు మెయికొని యది యిం
కేల తలపోయ [3]నుడుపం
జాలుదురే నరులు దైవ[4]సంపాదితముల్.

---

363 1. నాశన మొందె — ఖ. 2. బుచ్చియోర్చుట — ఎ.

364 1. అని మఱియు నంత — కొన్ని ప్రతులు.

365 1. యన్య — ఎ. 2. నుసభలో — ఘ. 3. లట్లొలుచుట — కొన్ని ప్రతులు.

366 1. గానిడుమలఁ బడియు—కొన్ని ప్రతులు. 2. రుకంటే, రెకంటే-అనియు పాఠములు.

367 1. రీ — ల.శ. 2. మానిరె — కొన్ని ప్రతులు. 3. లోక — ఇ.ఉ.

368 1. లు — కొన్ని ప్రతులు. 2. మేలి — కొన్ని ప్రతులు. 3. కుడుపం — వ. 4. సంపా
దనముల్ — అ.ఊ.ఏ.ఖ.

369 వ. అని వెండియు నిట్ల[1]నియెఁ బాండవులు గల్మషాయత్తచిత్తులు గామియు మీరు నెఱిలేమియు విచారింపు మేను మ్రొక్కి వేఁడికొనియెద వారల దెసఁ గోపంబు లేకుండ వలయు నట్లుం గాక నీకును గాంధారికిని వలయు పరలోకక్రియాకలాపంబులు వారియంద నిలిచెం గావున వారికి శుభంబు [2]గోరుట లెస్స మీచిత్తంబు నొప్పించితి [3]నని యెప్పాట దురపిల్లెడునో ధర్మజుతెఱం గెఱిఁగెదుగాక యని పల్కి [4]గాంధారరాజనందన నుద్దేశించి.

370 ఉ. నీ కెన వచ్చు రాజ[1]రమణీ ధరనెందును గంటి మే నృపా
నీకము [2]వించు నుండ సుతువిం దగు[3]పల్కుల నంత యొత్తుదే
నా కది సిక్కెఁ జిత్తమున నాఁటి బ్రియం బగుచుండు [4]నిప్పుడున్
[5]లోకవిరుద్ధవృత్తిచపలుం డితఁ డిమ్మెఱుఁగండ యేమియున్.

371 క. నీమాటకు దుర్యోధనుఁ
డామెయిఁ దాఁ ద్రుల్లి పడక యవుఁ గాకని నాఁ
డే మేనిఁ గొంతయక్కట
భూమి [1]యొసఁగె నేని యింత వుట్టదు సుమ్మీ.

372 వ. కీడు వుట్టునని నీవు [1]సెప్పితి చెప్పిన మాటయుం దలకూడెఁ బాండవుల వలనం దప్పు [2]లే దని యెఱుంగుదు గాదె వారల కలుగ కుండునది

---

369 1. ను — పెక్కు ప్రతులు. 2. గోరుటయ (యే) — కొన్ని ప్రతులు. 3. ననియెప్పాటదుర(పి)టిల్లెడి(డు)నోధర్మనందను తెఱంగెఱుంగుదువు (రు) గాదె — పెక్కు ప్రతులు. 4. గాంధారి నుద్దేశించి — వీ.శ.ష.

370 1. రమణీమణి నెందును — అ.ఓ.త.వ. 2. మెచ్చునొంద — ఇ.ఉ. 3. భంగుల — ఆ; మాటల — ట.వ. 4. నెప్పుడున్ — పెక్కు ప్రతులు. 5. పాకవిశుద్ధవృత్తిదల పండెయితండెఱుఁగండయేమియున్ — ఘ.

371 1. యొసఁగనింత వటువుట్టదు — కొన్ని ప్రతులు; యొసఁగ నింత వట్టు పుట్టదు — కొన్ని ప్రతులు.

372 1. సెప్పితినీచెప్పిన — కొన్ని ప్రతులు. 2. లేమి యెఱుంగుదు — కొన్ని ప్రతులు.

నీ వలిగి చూచినం [3]దిలోకంబులు భస్మీభూతంబు లగునట్టితపఃప్రభావంబు సం [4]బ్రసిద్ధవు గావున నిన్నుం బ్రార్థించెద నని [5]పల్కిన నద్దేవి యడి యంతయు నీచెప్పినట్టిద యని వెండియు.

373 చ. విపులవిషాదతాపమున వేదన నొందు మదీయబుద్ధికుం
దపగత మయ్యె నీదువచనామృతసేచనఁ జేసి యిట్టిచో
నవరిమితప్రభావ విను మంధుఁడు దీనుఁడు [1]వృద్ధు నైనయీ
నృపు నరయంగఁ బాండవులు నీవును [2]యుక్తులు గారె యెమ్మెయిన్.

374 వ. అని [1]పయిచీరచెఱంగు మొగంబున నదిమికొని యేడ్చినఁ గృష్ణుండు వివిధవాక్యంబుల [2]నద్దేవిం దేర్చి ధృతరాష్ట్రునకు మనస్తాపోపశమనంబుగాఁ బలికె నట్టియెడ నశ్వత్థామయుత్సాహం బమ్మహాత్మునకు హృదయగోచరం బగుటయు దిగ్గన లేచి పారాశర్యుచరణంబులకు [3]వినతుం డై యవ్విభున[4]కుం బ్రణమిల్లి యతనితో ని ట్లనియె.

375 క. గురుసుతుఁడు పాండవులకుం
గర మల్గును వారిఁ బొదువఁ గా [1]నతఁ డీ ప్రా
ద్దురవడిఁ గదియును బోయెద
దురపిల్లకుమయ్య మది [2]విఘాతకళంకా.

376 చ. [1]అన విని [2]రాజు దేవులు మురారికి [3]నిట్లని రెంతయున్ [4]రయం
[5]బునఁ జనుమయ్య పాండునృపపుత్రుల నెమ్మెయి [6]నైనఁ గాచికోల్

---

3. త్రిభువనంబులు — పెక్కు ప్రతులు. చతుర్దశభువనంబులు — వ. 4. ప్రశస్తవు— కొన్ని ప్రతులు. 5. పలికినవిని — ఒ.చ.జ.

373 1. వృద్ధుఁడైన — కొన్ని ప్రతులు 2. నుక్తులు — కొన్ని ప్రతులు.

374 1. పైఁటకొంగు — అ.ప ; పయిచీరకొంగు — కొన్ని ప్రతులు ; పయిచీరచెంగు — వ. 2. నద్దేవినూరార్చి — వీ శ.ష. 3. ప్రణతుండై, ప్రణమిల్లి — అనియు పాఠములు. 4. కుంగాంధారికిం బ్రణమిల్లి — కొన్ని ప్రతులు.

375 1. దానిప్రా, దానేప్రా, నతఁడే — అనియు పాఠములు. 2. విదూర, విఘాత — అనియు పాఠములు.

376 1. అనవుడు — ఒ. 2. రాజదేవులు — క ; రాజుదేవియు — చ.వ. 3. నిట్లను నెంతయున్ — ఎ.ఐ.ఓ.చ ద.వ ; నిట్లనిరంతయున్ — ఇ ఉ ; నిట్లనురక్తి నెంతయున్— త ; నిట్లరెట్లునుం — ప. 4. ప్రి(బ్రి)యం — అ.ఊ.ప.ఖ. 5. జనుము రయంబు తోడఁ బురుష ప్రవరుల్ దగువారిఁ గాచుకో — త. 6. రఘణీయులన్ —అ.ఎ.ద.

[7]వినుతి గదయ్య నీకు నిను [8]వేయివిధంబుల [9]నాశ్రయించు చె
ల్లను [10]ఫల[11]మొందఁ జేయఁగఁ [12]దలంచుట పెంపు [13]సుమయ్య కేశవా.

—: *శ్రీకృష్ణుండు కరిపురంబుననుండి పాండవులయొద్దకు వచ్చుట* :—

సం. 9-62-72

377 వ. పొమ్ము పునర్దర్శన మయ్యెడు మని వీడ్కొల్పిన వాసుదేవుండు వెడలెం దదనంతరంబ వేదవ్యాసమునీశ్వరుండు వారల[1]తో [2]మీకు శోకోపశమనం బుగ నిప్పుడు శౌరి సెప్పిన[3]వచనంబు లాదరణీయంబులు [4]సుండీ యని యుపదేశించి వెండియు వలయు[5]వాక్యంబుల వారి[6]కి [7]నాశ్వాసం[8]బు గావించి యంతర్ధానంబు [9]సేసె నిత్తెఱంగున గోవిందుండు కృత[10]కృత్యుం డై [11]వెలువడి యరదం బెక్కి యతిత్వరితగతి నోఘవతీతీరంబున [12]కరిగి పాండవులం గని తాను ధృతరాష్ట్రసన్నిధి గాంధారిం గనుటయు వార లకు దుర్యోధనుండు [13]దెగియె నని నెట్టనం జెప్పక [14]పెరసుంబల్కులుగా నయ్యాంబికేయుని [15]యుపేక్షనుం గొడుకుల [16]కీడునం [17]దత్కులంబు నకు సంక్షయంబు [18]వాటిల్లుట యుగ్గడించుటయు నాసందునఁ బాండవుల [19]వలనఁ బాపంబు లేమి దెల్పుటయును నారాజును దేవులును [20]వారిం గోపింపకుండం బ్రార్థించుటయు నుపచారవచనంబులచందంబున వార లావృద్ధులకు నిస్తారకు లనిపలుకుటయు విశేషించి గాంధారికి నుచితభాష ణంబుల న[21]త్యంతోపశాంతి [22]గలిగించుటయు నప్పలుకు లన్నింటను దుది

7. వినుమటు గాచికొమ్ము — అ.ఏ.ద ; వినుమటు గాన వారు — ఊ. 8. వేయు— పెక్కు ప్రతులు. 9. నాశ్రయింపుడె — క ; నాశ్రయించుడె — త. 10. బలమంద — త. 11. మందఁ జేయ — పెక్కు ప్రతులు. 12. దలంపుట — ఒ ఖ.ద. 13. గదయ్య— వ.ష ; వివేకవైభవా — ఖ.

377 1. తోడ — అ.ఊ.ఒ. 2 మీరు — ఊ.త. 3. విధంబులావర — అ.ప ; 4. సుమో—అ ; సుమ్మీ — ఏ. 5. కార్యంబులు — చ ; వాక్యంబులు — ఎ.ఔ. 6. కాహ్లాదంబులు—శ. 7. విశ్వాసంబు — బ ; నాశ్వాసంబులు — ఇ.ఐ.ఖ.గ.చ. 8. బొనర్చి — ఎ.ఓ. 9. నొందె—అ.ఏ.ఘ ; బొనర్చె — ఎ. 10. కృత్యుండై వారణపురంబు వెలువడి—అ.ఏ. 11. వెడలి — ఏ. 12. కుంజని — పెక్కు ప్రతులు. 13. దెగెనని — ఇ.ఉ.త.వీ.శ.ష. 14. పరుసపుఁ బలుకులు — వీ.ష.స ; బిఱుసు పలుకులు—ఊ.ఖ. 15. యపేక్షము—ల ; యుపేక్షయుఁ — వీ.శ.ష ; యుపేక్షయుం — ద ; యుపేక్షం గొడుకుల — క.ట.త. 16. కీడునుం(ను)—కొన్ని ప్రతులు ; కీడు చందంబున — జ. 17. దత్కులంబునకెల్ల — అ.ఏ. 18. వాటిల్లుటయు నాసందున — త.వీ.శ.ష. 19. దెసం — పెక్కు ప్రతులు. 20. వారివలన — కొన్ని ప్రతులు. 21. నత్యంతశాంతి — ఏ.చ.న. 22. గావించుటయు—

నయ్యిరువురు దనచేసినది సామాన్యంబున ననుష్ఠించిన యాపత్సమయ [23]సమాగమంబుగాఁ గొనినమాత్రయ కాని యొండెఱుంగక యుని కియు నగ్గాంధారరాజనందన దనకు మగసినప్పగించుటయు నెఱింగించి యంతక మున్న వచ్చి యావిచిత్రవీర్యపుత్రుకడం బారాశర్యుం డున్న వాఁ డమ్మహాత్ముం డే నిట వచ్చిన పిదప [24]నాదంపతులకు నాయొనర్చిన [25]యుపదేశంబు దృఢం బగునట్టిమాట లాడ నోపు ననియు [26]నతని యునికియట్లు[27]గాఁ దన[28]పోయినపని సఫలం బగుట[29]యుఁ బాండునందను లకుఁ [30]దెలియఁ జెప్పె నని వైశంపాయనుండు జనమేజయున కి ట్లనియె.

378 క. విను మోఘవతీతీరం
బున [1]కమ్మెయిఁ బాండురాజపుత్రులు ప్రీతిం
జనినతెఱఁగు సంజయుచే
విని ధృతరాష్ట్రుండు శోకవిహ్వలుఁ డగుచున్.

379 వ. అతని కి ట్లనియె.

380 ఆ. తొడలు [1]విఱిగి నేలఁబడి[2]యుండఁ దలదన్ని
[3]నట్టిభీమసేనుఁ [4]డగ్రజుండు
ననుజచయముఁ దాను నరిగినపిమ్మట
[5]నెట్టు లయ్యె నమ్మహీశ్వరుండు.

---

ఔ.ఘ.జ.ట.వ ; పుట్టించుటయు — చ. 23. సమాగమంబుగా — పెక్కుప్రతులు ; సమాగతంబుగా — ఇ.ఉ. 24. నాదు పలుకులకు — ఒ బ. 25. యుపశమనంబు— పెక్కు ప్రతులు; యుపశమంబు — బ. 26. ప (బ) లికి యిట్లు - కొన్ని ప్రతులు. 27. గోవిందుండుదన — కొన్ని ప్రతులు. 28. పోయివచ్చినపని — కొన్ని ప్రతులు. 29. యక్కౌంతేయులకుం-పెక్కు ప్రతులు. 30. దెలిపెననిచెప్పివైశం - పెక్కు ప్రతులు.

378 1. నిమ్మెయి, నమ్మెయి, కిమ్మెయి - అనియు పాఠములు.

380 1. విఱుగ — ఇ.ఉ. 2 యున్న — పెక్కు ప్రతులు. 3. యట్లు — పెక్కు ప్రతులు. 4. డగ్రజన్ము — అ.ప 5. నమ్మహీశుఁ డెట్టులయ్యెఁ జెపుమ - స.

389 వ. మఱియును.

390 మ. చెలులం జుట్టలఁ బ్రోచి యర్థిజనులన్ శ్రీమంతులన్ జేసి వి
ప్రుల భవ్యస్థితి [1]మన్చి యాగములు పేరుం బెంపు [2]శోభిల్ల ని
ట్టలపుం ద్యాగము [3]దానమున్ [4]నడపి [5]నిష్ఠం బెక్కు సెల్లించి యు
జ్జ్వలతేజంబున నిద్ధభూతి [7]భుజగర్వస్ఫూర్తిఁ బొల్పారితిన్.

391 క. పగవారి నాశ్రయింపక
మగఁటిమియును [1]ప్రాభవంబు మానము [2]నెందుం
బొగడొంద నుల్లసిల్లితిఁ
దెగునంతకు లక్ష్మితోఁ [3]బ్రదీప్తుఁడ నైతిన్.

392 క. సమరము శమంతపంచక
సమీపమున ధర్మవృత్తిఁ జలుపఁగ నత్యు
త్తమలోకము సమ[1]కూఱెను
విమలాత్ముఁడ నైతి [2]నొండు[3]వేయును నేలా.

393 తే. [1]ఎదిరి పెనగంగఁ జాలక నిదురవోవ
నొంచు తెఱఁగున విషము వెట్టించు పగిది
[2]నింటఁ జిచ్చిడు[3]చాడ్పున [4]నిట్లు సేసి
పడయుదురుగాక [5]రాజ్య మపాండుసుతులు.

---

389 1. అని వెండియు — కొన్ని ప్రతులు.

390 1. మంచి — పెక్కు ప్రతులు; బూన్చి — శ; నిల్పి — వ. 2. శోభిల్లి — ఇ.ఖ.జ. 3. దానమున్నతగరిష్ఠం — ఖ. 4. నడల — ద. 5. నిష్ఠల్ — ఆ.ఊ ఘ.ద. 6. నిందు(?) మాడ్కి చిరగర్వ — అ.ఊ.ఏ.ఖ ద.వ. 7. బలగర్వ, స్థిరగర్వ, నిజగర్వ, జితగర్వ, బలుగర్వ — అనియు పాఠములు. 8. శోభిల్లితిన్, బెంపారితిన్, బొల్పొందితిన్ — అనియు పాఠములు.

391 1. భుజబలాభిమానముబెందుం — వీ.శ.ష. 2. దోడ్తో — అ.ఊ.ప ; నేఁడుం — ఎ. 3. ప్రసిద్ధు — చ.

392 1. కూడెను—అ.ఐ.గ.జ. 2. నింక—కొన్ని ప్రతులు ; నెందు—ఘ. 3. వేయన నేలా—చ.

393 1. ఎదురు — క. 2. నిల్లు — క. 3. చొప్పున — వ. 4. నెంత — వీ.శ.ష. 5. రాజ్యంబుపొందు — ఉ.ఘ ; రాజ్యముపొదు — ఊ.ఐ.గ.

394 వ. అని యంత నిలువక.

395 ఆ. పాపకర్ము లయినపాండుతనూజులు
సమరధర్మ [1]మెడలి జయము గొనుట
[2]గురుసుతునకుఁ గృపునకుం గృతవర్మ[3]కు
దేట[4]పఱుపు నాదుమాట గాఁగ.

396 క. దేవవ్రతగురుకర్ణుల
దేవసములఁ బాడి దొఱఁగి [1]తెగటార్చుటయున్
నీవు [2]దలఁపించి వారల
[3]తో వెండియు నిట్టు లనుము దుర్జనదూరా.

397 ఆ. కపటధర్మకంచుకంబున వెలసిరి
గాని సత్య[1]పురుషకార[2]పరులు
గారు పాండుసుతులు వారల నమ్మంగఁ
[3]గాదు [4]సేత గుండె[5]కాయ యుడిన.

398 వ. ఇది నామాట గాఁ జెప్పు మని [1]పలికె నప్పు డచ్చేరువపల్లెలవారు దన్నుం జూడ వచ్చిన సజ్జనంబులఁ గలయం గనుంగొని గాంగేయుండును గుంభసంభవుండును మొదలైనబంధుమిత్రులను [2]లక్షణుండు [3]లోనుఁగాఁ గల

---

395 1. మేదిజయము – పెక్కుప్రతులు. 2. గురుతనూజకృపులకుం – ఐ.గ. 3. కెరుగఁ జెప్పుమాటలెల్ల ననియె – ఒ.ఔ. 4. వఱచునట్టి మాటతోన, పఱచు మిట్టిమాట వేగ, పఱచి చెప్పుమాట గాఁగ, పడెడు నట్టిమాటతోన – అనియు పాఠములు.

396 1. దెగటార్చుటయున్ – వా.వీ. మున్నగు పెక్కుప్రతులు; తెగటార్చుటయున్ – వ.శ.ష. 2. దలపింపు – పెక్కుప్రతులు. 3. తో విననిట్లనుముమఱియు – ఏ.ద.

397 1. ధర్మకార – ఊ.ఒ.చ.జ.ద.వ 2, సములు – ఒ.జ. 3. రాదు – రాయియుడిన– ఐ గ. కొన్ని ప్రతులు. 4. శాంతగుణనికాయవినుము–ఊ. 5. కాయలిడిన–చ.ట.న;

398 1. పలికియప్పు – పెక్కుప్రతులు. 2. లక్ష్మణాది కుమారులను – వీ.శ.ష; లక్ష్మణప్రభృతి కుమారుల – ఘ; లక్ష్మణుండు – అ.ఆ.ఇ; లక్షణుండు – వా. మఱికొన్ని ప్రతులు. గమనిక:– సంస్కృతమున 'లక్ష్మణంచాత్మజా – (చిత్రశాలాపర్తి) – అని లక్ష్మణశబ్దమే ప్రయుక్తమై యున్నది. 'సోరెన్ సేన్' లక్ష్మణపదమునే యీ యర్థమున పేర్కొనెను. 3. మొదలైన, లోనైన – అనియు

[4]కుమారులను బేరుకొని వారు మున్ను సనుటం జెప్పి వారు సనినలోకంబ తనకుఁ [5]బాటిల్లుట యుగ్గడించి తన [6]దేవులును దుస్సలయు నాదిగాఁ గల[7]యబలలు దాను [8]లేనిపిమ్మటఁ [9]బొందుదురవస్థలు వాక్రుచ్చి [10]పనివిన విని [11]వారలు [12]గన్నీ రొలుక [13]నుమ్మలికంబుగూరునుల్లంబుల[14]తోఁ జని రందుఁ గొంద అశ్వత్థామ[15]ప్రముఖరథిక[16]త్రయం [17]బయ్యెడ [18]మెలంగుట యెఱింగి వారలకు [19]రాజరాజువార్త సెప్పిన వారలు సత్వరంబున నచ్చటి కరుదెంచి యరదంబులు డిగ్గి.

—: కృప కృతవ ర్మాశ్వత్థామలు దుర్యోధనుంజేరి విలపించుట :—

సం. 9—64—3

399 సీ. కడు బెట్టిదం [1]బగు గాలి వేఁ గూలిన
మహనీయసాలభూరుహము[2]పోల్కిఁ
బ్రబలకిరాతమార్గణములఁ ద్రెళ్లిన
[3]రాజితవన్య వారణము[4]మాడ్కిఁ

---

పాఠములు. 4. కుమారులను దుశ్శాసన ప్రభృతిసోదరులం — చ ; కుమారులను దుస్ససేనుండు మొదలైన తమ్ములను — వ. 5. గలుగుట — ఆ.ఓ.వ. 6. దేవియు-కొన్ని ప్రతులు. 7. సతులు — పీ.శ.ప ; భామినులను — ఐ.గ ; స్త్రీజనంబులు — ద. 8. లేమికివనట — పీ.శ.ప. 9. బొందునవస్థలు — కొన్ని ప్రతులు. 10. నొడివిన, పలికిన — అనియు పాఠములు. 11. వారు — పెక్కు ప్రతులు. 12 గన్నీరు దొరుగ — అ.ప. 13. నుమ్మలించినం — ట ; నుమ్మలికంబునం — పెక్కు ప్రతులు. తో మగుడిమగుడిచూచుచుం — ఔ.క.ట.త.న.వ. 15. ప్రభృతి — పెక్కుప్రతులు. 16. వరు — పెక్కు ప్రతులు. 17. లున్నెడ, లున్నయెడ — అనియు పాఠములు. 18. మెలంగి వారలకు — పెక్కు ప్రతులు. 19. రారాజు — పెక్కు ప్రతులు. 20. డిగ్గనుఱికి — అ.ప.

399 1. బుగా, బున, బుగ — అనియు పాఠములు. 2. పగిది, భంగి, భాతి — అనియు పాఠములు. 3. రాజితవన మృగేంద్రంబు కరణి—ఒ.జ. 4. కరణి — కొన్ని ప్రతులు.

గల్పాంత[5]వాయుసఖస్ఫురణంబున
నివిరి పోయిన మహార్ణవము[6]కరణిఁ
గాల[7]పర్యయమునఁ [8]దూలి మేదినిమీఁదఁ
బడిన పూర్ణేందు బింబంబు[9]పగిది
తే. [10]దుఃస్థుఁడై యుండియును నొప్పు దొరుఁగకున్న
యన్నరేశ్వరుఁ గనుఁగొని యడలు[11]నెడల
తోఁడ మేనులు దూలఁగఁ దొట్రువడుచుఁ
జేర యాతనిచుట్టు నాసీనులైరి.

400 వ. [1]ఆసీనులైనయెడ నగ్గురుసుతుండు.

401 ఉ. [1]అక్కట యెప్డుఁ బల్వురు [2]ధరాధిపతుల్ గొలువంగ నుండు నీ
[3]వొక్కరుఁడున్న[4]వాఁడవు మహోన్నతపీఠ మలంకరించునీ
[5]దెక్కలిఁ [6]దాఁకి ధాత [7]యిల [8]ద్రెళ్లెడునట్లుగఁ జేసె నీబలం
బెక్కడఁ బోయె సైన్యపతు లేలొకో యిక్కడ రారు భూవరా.

402 తే. [1]కడలుకొనఁ జుట్టుఁ బట్టెడుగొడుగు లెవ్వి
యొసక మెసఁగంగ [2]సీవురు లేల పట్ట

---

5. భాను సంఘు — చ; వాయు సంఘు — ఇ.ఉ.ఔ.ద. వాయుసఖి — ఘ.జ. 6. రీతి, మాడ్కి — అనియు పాఠములు. 7. పర్వంబున — త.వ. 8. గూలి — ఆ.ఉ. 9 మాడ్కి, కరణి — అనియు పాఠములు. 10. ధరణిఁబడియుండియును నొప్పు దఱుఁగకున్న — ఔ.క.వీ.శ.ష.స. 11. నెడల — ఐ.ఓ.గ.శ.

400 1. యిట్లాసీనులైయున్న రథికత్రయంబులో గురునందనుండు — కొన్ని ప్రతులు; అట్లాసీనులై (డై) గురునందనుండు — కొన్ని ప్రతులు.

401 1. అక్కట యెప్పుడుఁ బటుధరాధి - అ. అక్కడ యెప్పుడుఁ బలుధరాధి - ఈ.ఊ. ఎ.ఒ.ఓ.ఔ.క.ఘ.ద; అక్కట యొప్పు పల్వురు — ల. 2. ధరాధిపులుఁ — ఔ.ఖ. 3. వొక్కఁడయున్న - ఒ.వీ.ష; వొక్కఁడు నున్న — ఆ.ఇ.త.న.శ; వొక్కట నున్న- ఐ. 4. వాఁడవె — పెక్కు ప్రతులు. 5. దెక్కలిధాతఁదాఁకి — వీ; దిక్కరి మాలి ధాత — వ. 6. దైవమిట్టులిలఁ — అ; దైవమేల యిలఁ — ఊ; నేలనినుఁద్రెళ్ళెడు — ఖ. 7. యిటు — ఇ.ఈ.ఉ.ఓ.వ. 8. ద్రెళ్ళఁగఁ జేసెనె (యిట్లు) యట్టి — అ.ఏ.ద.

402 1. తలిరుకొనఁ — ల; తడిలుకొనఁ — ఏ.ఒ.ఓ.ఔ; తడలుకొను — ఘ; తడలుబడు, గడలుకొన, అడి (డ) లికొని, గుమురుకొని, కడలుకొని - అనియు పాఠములు. ఈ పాఠమున ల, డ లకు ప్రాస. 2. శృంగార మేలచేయ — అ; చామరమేల — ఆ; చామరలేల — శ; గిడిగిళ్లునేల, గిడిగిళ్ళునేవి — అనియు పాఠములు. విసరువారెందు

[3]రంగమున నాసనంబున నవని[4]ధూళి
[5]గదిరె జలక మే లాడవు కౌరవేంద్ర.

403 చ. అనిమిషవాహినీ[1]తనయుఁ డస్త్రగురుండును నీకు నెప్పుడుం
గనుపెలుఁ గై [2]చరింతురు వికర్ణుఁడు దుస్ససేనుఁడున్
నిను నొక[3]యప్డుఁ బాయ రవినీతు లొకో నృప వారలెల్ల నె
మ్మనమున శంక లేక యొకమాటును [4]నిక్కడఁ జేర [5]రెవ్వరున్.

404 క. నీయెడఁ జంచల [1]యయ్యెను
శ్రీ యెవ్వరి నచలవృత్తిఁ జెందెడు [2]విధి య
[3]స్లై యున్నవారి నిట్టులు
యే నింక నేమి సేయుదు నధిపా.

405 తే. అని విలాపంబు సేసిన [1]విని విభుండు
గన్నుఁగవ [2]నశ్రు లురులంగఁ గరపుటములఁ
దుడిచికొనుచు డగ్గుత్తి[3]దొడరు నెలుఁగు
నెట్టకేలకు నూల్కొల్పి యిట్టులనియె.

---

వోయి — వ; సీగిరుతేల — త, 3. వంసమున — అ.ఊ.చ. 4. రజము - ఊ
5. గదియ, గదుర — అనియు పాఠములు; గదిసిజలకంబు లాడవు - ల.

403 1. సుతుఁడునస్త్ర — పెక్కు ప్రతులు. 2. చరింపను - ఖ. 3. మాటు, నాడు, బాటు- అనియు పాఠములు. 4. నీకడ — కొన్ని ప్రతులు. 5. రక్కటా, రిచ్చటఁ, రెంత యున్ - అనియు పాఠములు.

404 1. మయ్యెను — ఒ.ద.న ; మయ్యును — ఉ.జ. 2. నవి (ది) యో — ఒ.క.బ.
3. యీాయున్న - ఒ ; యాయున్న - క ; ల్లెయున్న - ఓ.ట.వ.

405 1. నవని విభుఁడు — ఆ.ఓ.ఖ.త.న.ల.వ. 2. గ్రమ్మనశ్రులు గర — పెక్కు ప్రతులు.
3. దోడ - ఔ.ల ; దొడర — అ.ఘ.ద.శ.

406 క. మనుజులకు [1]నిట్టిచందము
మును ధాత సృజించి[2]నది ప్రమోదము ఖేదం
బును వచ్చును బర్యాయం
బున [3]దీని నెఱుంగవలదె [4]పురుషుం డనఘా.

407 వ. అని యారథికవరుల [1]నాలోకించి.

408 సీ. [1]పయిపయి నెంత లాపదలు వచ్చిన నైన
నుత్సాహ మెడలక [2]యుద్ధమరులు
[3]సేద్పడునట్లుగాఁ [4]జేసెడిబంధులు
మిత్రులు సోదరుల్ పుత్రు[5]లట్లు
బలసమేతంబుగా ఖండనంబునఁ ద్రుంగ
[6]నొక్కఁడు నిల్చుట యొప్పు నెట్లు
మద్బాహువీర్యంబు మహిత[7]ధైర్యంబును
[8]దలమున్క లైన [9]సధర్మవృత్తి
తే. సంగరము సేయఁ జాలక శత్రు లిట్లు
[10]నొంప సద్గతి వడయుట [11]సొంపు గాదె
యదియుఁ గాక [12]విద్విషులచే నాజిఁ బడక
యుండ మిముఁ [13]గాంచునమ్మేలు నొదవె నాకు.

---

406 1. నీదు — ప. 2. నాఁడు మోదము - ఐ.గ. 3. నని యెఱుఁగంగ, నిది యెఱుఁగంగ, దాని నెఱుంగ - అనియు పాఠములు 4. పురుషునకనఘా — గ.

407 1. వెండియు నాలోకించి, నందఱ నాలోకించి, నెల్ల నాలోకించి — అనియు పాఠములు.

408 1. పై పైన చింత యాపనలు — జ; పైపయి నెంతెంత యాపదలు — బ. 2. యుండియరుల. యుండునరుల, యుండు హితులు, యుద్ధమతులు, యోధవరులు — అనియు పాఠములు. 3. చేద్పడు — కొన్ని ప్రతులు; చెప్పెడు — చ త. 4. జేసితి — పెక్కు ప్రతులు. 5. లెల్ల — ఖ. 6. నొకరుండు, నొక్కట, నొక్కండ — అనియు పాఠములు. 7. శౌర్యంబు — పెక్కు ప్రతులు. 8. మన బలంబును దలమునుకలైన—ఎ; మనమును మేనమద్ధర్మవృత్తి — ఘ. 9. సద్ధర్మవృత్తి — కొన్ని ప్రతులు. 10. పంపుఁ జేయుట సద్గతిపెంపు — చ. 11. పెంపు - కొన్ని ప్రతులు; తెంపు — కొన్ని ప్రతులు. 12. విద్వేషిచే — ఒ ఖ జ. 13. గాంచుటయు నాకు నొదవెమేలు — వీ.శ.ష; గాంచు మేలొండు — న.వ.

409 చ. వినుఁడు మహానుభావుఁ డగువిష్ణు నెఱింగి యెఱింగి [1]యే మిముం
గొని నెఱ పేది [2]కాదె పగకుం దలకొంటి జయంబు [3]గోరి మీ
రును బలశౌర్యసంపదను[4]రూపముగాఁ బొగ డొందు భంగులం
బెనఁగితి రేమి సేయుదురు [5]బెట్టిదుఁ డై విధి [6]తప్పఁ [7]జూచినన్.

410 వ. [1]వగవ కుండుం [2]డని యేఁ బొద[3]లోనం బొంచి యున్నది మొద[4]లుగ గదాయుద్ధంబుపాడి [5]విడిచి వడముడి [6]పుడమి[7]ఱేనిం బడవైచి తలదన్నుట [8]తుదిగా నైనవృత్తాంతం బెల్ల నప్పు డారథికవరులకుఁ దేటపడం బలికిన విని పాండవులదెస [9]నీసును [10]రోసంబు నెత్తి గురునందనుం డరుణాననుం డగుచు నవుడు గఱచి కఠినాక్షరకలితంబు గాన కౌరవేశ్వరున కిట్లనియె.

411 ఉ. పాండవు లట్లు మజ్జనకుఁ [1]బాపవిధిం దెగఁ జూచి[2]నప్పుడుం
జండతర[3]ప్రకోపము నసహ్యపు[4]శోకము నిట్లు చిత్త మొం
డొండఁ [5]గలంప వే నిపుడ యొక్కఁడుఁ [6]దక్కక యుండ వారి ను
ద్దండ[7]మదస్త్ర[8]వహ్నిఁ బరిదగ్ధులఁ జేయక యెట్టు లుండుదున్.

---

409 1. మిమ్ము నే — అ.ఈ.ఏ. 2 నాఁడు — ఘ. 3. గోరు — త.వ. 4. రూఢికి నెక్కఁగ బెక్కు — ఆ.ఉ. 5. బెట్టిదమై — ఘ. 6. చంప — ల. 7. జూడఁగఁ (గాఁ) — ఊ.ఐ.గ.

410 1. మీరింకవగవ — వ. 2. డనినేను — వీ; డనిననేను — శ; డనియెనంతనే — న. 3. లోఁ జొచ్చి యున్న — ట.గ.వ; లోనంజొచ్చి — న; లోన నాపొంచియున్న — ఇ.ఉ.ఘ.జ 4. లైన — కొన్ని ప్రతులు. 5. వప్పిన — అ. 6. తొడిబడపుడమి — అ. 7. ఱేనినొడిచి — కొన్ని ప్రతులు; ఱేని నొప్పించి — ఖ; ఱేనినోర్చి — ఉ. 8. తుది యైన — పెక్కు ప్రతులు. 9. నెత్తినక్రొత్త యలుక — స; నెత్తిన యలుకం — ఆ. 10 రోషంబున నత్తెత్తి యగ్గురు — ఎ.జ; రోషంబుననత్తెత్తి గురు — ఒ; రోషంబునెత్తి — కొన్ని ప్రతులు; కోపంబెత్తి — త.

411 1. బాపమునం — ఇ; బాపమతిం — చ. 2. రట్లవుం — అ. 3. ప్రరోషము — బ.వీ.శ.ష. 4. గోపము, రోషము — అనియు పాఠములు. 5. గలంప నిష్టు చని యొక్కఁడు — పెక్కు ప్రతులు; గలింగె నీవు చనియొక్కరుని జెదరంగనీకయు — ఖ. 6. ద్రిక్కక — ఐ.గ.ట.వ; జి(చి)క్కక — ఔ.త.న. 7. మహాస్త్ర — పెక్కు ప్రతులు. 8. శస్త్ర — ఆ.ఐ.ఓ.వ.

412 తే. వినుము సత్యంబు వల్కెద మనుజనాథ
యదరి యందఱఁ బాంచాలు రాది గాఁగఁ
గలుగు[1]బాంధవమిత్ర[2]సంఘముల[3]తోడఁ
గూడ [4]నేఁడిదె కృష్ణుండు సూడఁ ద్రుంతు

413 వ. పనుపు మనిన హృష్టుం డై యజ్జనపతి గృపాచార్యుం గనుఁగొని [1]యొక్క కలశంబున జలంబు నినిచికొని ర మ్మనుటయు నమ్మహీసురవరుం[2]డు దమ్ముం జూడ [3]వచ్చి యచ్చట నున్న సమీపాశ్రమమునికుమారులం బ్రార్థించి యొక్కకలశంబు [4]దెప్పించి దానిం దోయపూర్ణంబుఁ గావించి తెచ్చిన.

414 చ. [1]అతనికి నెమ్మి నిట్లనియె నమ్మనుజేంద్రుఁడు నీవు వేగ మం
చితముగ ద్రోణపుత్రు [2]నభిషిక్తునిఁ జేయుము ప్రీతి మ[3]చ్చమూ
[4]పతియుఁగ భూసురుండు నృపుపంపునఁ గయ్యముసేఁత లోకవి
[5]శ్రుత మగుధర్మ మట్లగుటఁ [6]జూవె యొనర్చెద [7]నవ్విశేషమున్.

415 వ. అనవుడు నతండు సంప్రీతుం డై యగ్గురునందనునకు సేనాధిపత్యాభిషేకం [1]బాచరించిన.

416 ఉ. ఆరథికోత్తముం డధికహర్షముఁ [1]బొందుచు నమ్మహీశ్వరున్
గౌరవ మొప్పఁ [2]గ్రుచ్చి యిఱిగౌఁగిటఁ జేర్చి యుదాత్తసింహనా

---

412 1. బాండవ - కొన్ని ప్రతులు. 2. వర్గముల – త.వ. 3. నెల్ల–అ. 4. నీరేయి- కొన్ని ప్రతులు ; నేఁడేఁగి - ఊ ; నేటికి – బ.

413 1. యొక్క కనక–ఆ.ఈ.వ. 2. డచ్చటఁ దమ్ముం–వీ.శ.ష. 3. జనుదెంచి యచ్చట– పెక్కు ప్రతులు ; వచ్చిన సమీ – వీ.శ.ష. 4. దెప్పించుకొని – పెక్కు ప్రతులు ; పుచ్చుకొని జలపూర్ణంబు - ఆ. 5. దోయంబులు సంపూర్ణంబు- ఐ.

414 1. అతిశయవృత్తి నిట్టులను – ల. 2. నభిషేకము – అ. 3. నచ్చమూ. తచ్చమూ- అనియు పాఠములు. 4. పతియగు – కొన్ని ప్రతులు ; పతియుగ నీవు భూసురుఁడ పంపఁగ – ఏ ; పతియుగనన్ను నప్డు – త. 5. స్తుతుఁడయి పేర్చునట్లగుట – ఆ.ఓ. 6. జూపి – కొన్ని ప్రతులు ; జెప్పి – త. 7. నిర్విశేషముఁ, తద్విశేషముఁ, నావిశేషముఁ – అనియు పాఠము.

415 1. బొనర్చిన – అ.ఐ.గ ; బొనర్చిన సంతసం బంది - ఏ.

416 1. నొందుచు – ఆ.ఏ.ఘ. 2. గాఢిగియ, పెద్దవడి, నెత్తికొని, గ్రుచ్చియిడి, గ్రుచ్చి

దారవ [3]ముల్లసిల్లఁగఁ బ్రియంబు మెయిం గృప[1]యాదవోత్తముల్
సేరి కెలంకులం జనఁగఁ జెచ్చెర నేఁగె నుదగ్రమూర్తి యై.

417 వ. [1]ఇట్లశ్వత్థామకృపకృతవర్మలును మహోద్యోగంబున.

418 క. అరినిరవశేషనిరసన
పరమానంద[1]ప్రచరితపాండవపుత్రో
త్కర బాంధవనికర పరి
స్ఫురణాఢ్య తదీయశిబిరమున కభిముఖులై

419 వ. చని రని యట్లు ధృతరాష్ట్రునకు సంజయుం డశ్వత్థామోత్సాహం[1]బు తెలుంగెఱింగించె నని వైశంపాయనుండు సెప్పిన విని జనమేజయుం డట మీఁదివృత్తాంతం బెఱింగింపు మని యడుగుటయు.

420 మ. శ్రుతివాక్యార్థమయ[1]ప్రభావమునిసంస్తు[2]త్యానుభావా శచీ
పతిముఖ్యానిమిషా[3]భి[4]వాద్య [5]నిరసద్భావైకవేద్యా మహో
న్నత[6]హేతుత్వవిరాజమానచరణా న[7]మ్రాపదుత్తారణా
[8]సతతోన్నిద్ర వివేకభక్తసులభా [9]సంవిత్స్వభావల్లభా

421 క. సిత[1]నీలాదిక[2]వర్ణా
[3]హితవైకృద[4]దూర[5]మాన[6]సేజ్యాధారా

---

యును — అనియు పాఠములు. 3. ముప్పతిల్లఁగ — ఐ గ. 4. యాధవోత్తముల్ — శ.

417 1. ఇట్లు సమరసముల్లాసభాసమానులై — అ.ఎ.ఓ వ.వ.

418 1. రసభరిత — అ.ఈ ఓ.ట వ; ప్రభరిత — ఇ ఉ.ఊ ఐ.గ.ఘ.త.ద.ల.శ.

419 1. బెఱిం (ఱుం) గించె-వి.శ.ప; బు చెప్పెనని—అ. 2. బెట్లయ్యెనని- పెక్కు ప్రతులు.

420 1. స్వభావ — పెక్కు ప్రతులు 2. త్యప్రభా — అ.ఊ ఒ.బ. 3. ద్యవాచ్య—న. 4. వంద్య — కొన్ని ప్రతులు. 5. నైరహంభావైక — పెక్కు ప్రతులు ; నిరతాభావైక — బ ; నిరహంకారైకవీర్యా — చ. 6. విభ్రాజ — ఎ ; తత్వత్స్ఫురరాజ—ఘ. 7. సద్రూప — ఏ ఒ జౌ బ. 8. సతతానివర్తివివేకభక్త, సతతోన్నిద్రవివేకభక్తి(క్త) — అనియు పాఠములు.

421 1. నీలోత్పల — అ; నీలాధిక — కొన్ని ప్రతులు ; నీలాద్రిక — జౌ.క. 2. వర్ణా-చ. 3. శ్రిత — వీ.ష ; శ్రుతివైకృతి, హృతి, న్వితి — అనియు పాఠములు. 4. రూప — అ.ఊ.ఓ.ట. 5. మాన్య — వీ.ష ; సంజ్ఞాదూరా — ఏ. 6. సేవ్యాధారా , సేవ్యా

శతదళభవసత్యవతీ
[7]సుతాదిబుధ[8]మతిలతా[9]ప్రసూనాకారా.

422. మాలిని. [1]భరిత[2]వికసనాంతః [3]పద్మినిశ్రేణికాసం
చరణ[4]పరిణ[5]తత్వశ్లాఘనీయక్రమోద్య
న్మరుదుపగమలీలా[7]మధ్యమానేందుబింబ
[8]క్షురదమృత[9]వికారోత్సారణానందరూ[10]పా.

గద్యము

ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర బుధారాధన
విరాజి తిక్కనసోమయాజిప్రణీతంబయిన శ్రీమహాభార
తంబున శల్యపర్వంబునందు సర్వంబును
ద్వి తీ యా శ్వా స ము.

శ్రీమదాంధ్ర మహాభారతమునందలి శల్యపర్వము సమాప్తము.

---

కారా, నిత్యోదారా — అనియు పాఠములు. 7. స్తుతాది — ఇ ; సుతబుధముఖ్యార్చిత ప్రసూనానందా — ల ; సుతబుధ — త ; సుతవిబుధ — ఈ ఒ ఊ.ఔ.చ ; సుతబోధామర — అ ; సుతమానసకమలహంస సుస్థిరరూపా — ఆ ఎ ఓ.ట ; సుతమానసకమలహంస రచనాలరూపా — వ. 8 ముఖార్చిత — ఊ. 9. ప్రసూనసుగుణోదారా— ఈ ; ప్రసూన సుగుణాధారా — స ; ప్రసూనానందా — జ.వీ ష; ప్రసూనకరాబ్జా—గ.

422 1. భరితసుకవినాథా — ఊ. 2. వికసనాశా — ఒ ; వికసనాత్మా — ఐ గ.చ వ ; వికసకాంతా — ఎ. 3. పద్మినీ — పెక్కుప్రతులు. 4. వివిధ — ఒ. 5 తత్వా — కొన్ని ప్రతులు ; తత్వశ్లాఘ్యచారుప్రమోద్య—ల వ ; తత్వాసాధునిర్యత్క్రమోద్య— ఆ ఉ. 6. స్మరదప — ఒ.త ; స్మరదుప — వ ; మరుదురగవిమాలా — ట. 7. నవ్యపూర్ణేందుబింబా — ఎ ; మధ్య పూర్ణేందుబింబా — ఔ.క చ.ట త.న.వ. 8. క్షరదవధృత — చ ; క్షర దమర — త.వ. 9. విరోధోత్సార — ఐ గ ; వికాసోత్సార, వికాసాకార, విదాహోత్సార, విలాసోత్సార — అనియు పాఠములు. 10. "గుణవిభవనిరాసాకుంఠితోల్లాసధామా గణనరహితలీలాకల్పనిత్యాభిరామా" అనెడి పద్యము — 'శ' ప్రతియందు కలదు.

—: o :—

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సౌప్తికపర్వము – ప్రథమాశ్వాసము

–×–×–

1 క. శ్రీమత్కౌస్తుభరత్నో
ద్దామారుణరశ్మిభూతిధవళమరీచి
స్తోమ[1]పరభాగరమ్యా మ
హో[2]మహితస్ఫురితవక్ష హరిహరనాథా.

2 వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె.

3 తే. సంజయునిచేత గురుసుతోత్సాహ[1]మట్లు
వినినధృతరాష్ట్రుఁ డిట్లను వీరవర్యుఁ
డనగఁ జాలునశ్వత్థామయును సహాయ
రథికులును విక్రమించినక్రమము సెపుమ.

4 వ. అనుటయు నమ్మానవపతి కాసూతసూనుం డిట్లను నవ్విధంబునఁ గురుపతి యశ్వత్థామ [1]కభిషేకంబు సేయించిన నాకృపాచార్యుండును గృతవర్మయు [2]గురుపుత్రునుత్సాహంబున కు[3]పోద్బలకం బగు నుద్యోగంబునం బొదలి రమ్మువ్వు[4]రు మహీపాలుండు పాండవులం బరి[5]మార్చుట[6]కుం బనిచిన నట్లు పూని [7]దక్షిణంబు ముట్టిపడమట నున్న పాండవశిబిరంబున కభిముఖులై చని రత్తెఱంగున [8]నవ్వీటి కెలని కనతిదూరంబుగాఁ జని యారథిక[9]వరులాలించి.

---

1   1. వర – ఓ.క. 2. మహిమ – ఏ.ఒ.ట.డ.స.

3   1. లీల – ఒ.ణ.

4   1. కునభి – ఆ.ఈ.ఊ.ఎ.ఏ.ఔ.క.ఘ ; నభి – ఉ.వి.ఒ.ఖ.గ.చ.ట.డ.ణ.బ.ల. 2. నగ్గురు – పెక్కు ప్రతులు. 3. పోద్బలంబగు – ఐ.ణ.బ. ; పోద్బలంబగు – పెక్కు ప్రతులు. 4. రనమ్మహీపాలుండు – పెక్కుప్రతులు. 5. మార్చిరండని –ఉ; మార్చుండని – డ. 6, కనిచిననట్ల – ప. 7. దక్షిణాభిముఖంబుముట్టి – ల. 8. నవ్విడిదల – ఈ. 9. వరులచ్చటి కలకలంబానించి – డ.

5 ఉ. అందఱివార లెల్లను జయంబునఁ బొంగుచుఁ బేరెలుంగు లం
దంద [1]చెలంగఁ గా[2]బలుక [3]నార్వఁగ నొత్తిలి నవ్వ నాకసం
బందిన[4]యట్టిమ్రోఁత విని యక్కడ వోవఁగ [5]నుల్కి రప్పుడ
మ్ముం దడవన్ వడిఁ వెడలు మూఁక[6]లు మ్రోయుటగాఁ [7]దలంచుచున్.

6 వ. [1]ఉలికి యట వోవు టుడిగి యెచ్చ[2]టఁ గేనియుం దొలంగి [3]నిలిచి మఱి
కర్జంబుఁ [4]జూచికొనువా రై యారథికవరులు [5]మగిడి తూర్పుదెస
కొంత[6]ద వ్వరిగి రనిన నమ్మాటలు వెడవెడ వినుచుం [7]దనకుం బాటిల్లిన
దురవ[8]స్థ [9]చింతించుచు నాంబికేయుం డిట్లనియె.

7 సీ. సంజయ కురురాజు సమయునే యిట్లు భీ
మునిచేత బలశౌర్యముల [1]నజయ్యుఁ
డని నమ్మియుండితిఁ దనయులు నూర్వురు
మడియుట [2]వినియు నామనము పెక్కు
పఱియలై పోవని[3]భంగిఁ జూడఁగ ధాత
నొనరించినది గాఁగ నోపు నింక
[4]నడియరితనమున నప్పాండవుల నాశ్ర
యింపఁగఁ జాల నే నెక్కుఁడేనిఁ
ఆ. బోదుఁ [5]గాక [6]యట్టిభూపాలుతండ్రినై
ప్రాభవమునఁ బేర్చి పరమదైన్య

---

5 1. తగంగ — ఆ.ఈ. 2. బెలుచనార్వగ — బ.శ.ష. 3. నార్పులనొత్తి — వ.
4. నొక్క — పెక్కు ప్రతులు. 5. నల్కి — ఈ.ఎ.బ ; నేలయంచు — గ.ఢ.
6. లమ్రోతలుగా — ఊ ఘ.ట ; లమ్రోతయన్ — ఎ.ఓ. 7. దలంపు — ఒ.జ.ట.

6 1. అలికి — పెక్కు ప్రతులు. 2. టనేనియున్ — పెక్కు ప్రతులు. 3. యుండి — ఊ.క.చ. 4. జూచుకొను - పెక్కు ప్రతులు. 5. మగుడి — పెక్కుప్రతులు ; మరలిమన పేటిదెసకుంగొంత — స. 6. దడవరిగి — ణ. 7. దమకు — చ.ప.ల. 8. స్థకుచింతిం — ఎ.ల. 9. చింతింపుచు — పెక్కు ప్రతులు.

7 1. నజేయు — పెక్కు ప్రతులు. 2. వినగ — అ.ఇ.ఊ.ఎ.ఖ.గ.ఘ.ప.వ ; వినిన - ట.వ ; వినినాదు మనము — జె. 3. దీం - ఎ ఓ ఖ.చ.ట.ఢ ; దిబ్బంగి — ణ.వ.
4. నడగి యనాథనై యప్పాండ - ఎ.ఖ ; నడరిరోసెరీతి - ఓ ; నరియుడి - వ బ ; నతిదీనవృత్తినేనప్పాండ-ల. 5. గాని — కొన్ని ప్రతులు. 6. యిట్లు—పెక్కు ప్రతులు ;

వృత్తి కోర్వఁ [7]దగునె విన [8]వశమే మాట
లామరుత్తనూజుఁ [9]డాడ నాకు.

8 వ. అని పలికి యశ్వత్థామప్రభృతు లేమి సేసి రనుటయు నజ్జనపతికి సంజయుం
డి ట్లనియె.

9 క. [1]ఇమ్మెయి నారథికవరులు
గ్రమ్మఱఁ జని యడవి సొచ్చి కని రొకమడు వం
[2]దిమ్ములఁ సూతజనులు ర
థ్యమ్ముల [3]నీళ్లకును [4]దిగువ నప్పుడు [5]దారున్.

10 వ. రథంబులు డిగ్గి యంబుపానంబు సేసి యామోఁతదెస నాలించు చుండిరి.

11 తే. అంతఁ బశ్చిమధరణీధరాగ్రపశ్చి
మంబునకుఁ బోయె మార్తాండమండలంబు
సాంధ్యసమయకృత్యంబులు సలిపి రపుడు
రథిక[1]వర్యులు మువ్వురు రాజ[2]ముఖ్య

12 వ. [1]సలిపి వా రొక్కవటవిటపిసమీపంబున నాసీను లై [2]రాసమయంబున

13 తే. వారిముఖమండలములతో వారిజములు
[1]మొగిడె శోకతమంబుతో [2]నిగిడెఁ దిమిర
పటలి బహు[3]విచారములతోఁ [4]బరగఁ బొల్చె
భూతభేతాళగణములు భూపవర్య.

---

యట్లు—వ. 7. నగునె—అ.ఇ.జె.గ.చ.ణ ల ; వశమె — ఎ.ప ఖ జ.వశములె — శ.వ.
9. డాడుచుండ — ణ ల.

9 1. అమ్మెయి — పెక్కు ప్రతులు. 2. దిమ్ములను సూతజనులశ్వమ్ముల — ఉ.
3. నీళులకు దిగువ — అ.ఇ. 4. దివియ — ఐ.ఒ ఓ.ఖ.ట.ణ.ల. 5. వారున్ — కొన్ని
ప్రతులు ; దాముఁ — ఆ.ఈ.ఎ.జె.చ.

11 1. ముఖ్యులు — పెక్కుప్రతులు. 2. వర్య — ఖ.ఘ.

12 1. తదనంతరంబావటమూలంబున — గ. 2. యుండిరంతనిశాసమయంబున — ఉ.

13 1. మొగుడె — ఏ.ఔ.చ.వ ; మొగిచె — ఈ.ఎ.న.శ ; ముణిగె — ట. 2. నిగుడె —
పెక్కు ప్రతులు ; నిగుడ—ల. 3. వికారములతో—అ.ఔ.వ ; విహారములతో—ఊ.ఘ.
4. పరిఢవించె — ఓ.ణ.వ ; పరగఁబొచ్చె — పెక్కు ప్రతులు. 5. రవములు — ఏ.జ.

14 క. కలుగు గురుసుతున [1]కెట్లుం
గలవాం బని చూడ సమరగణ [2]మధికకుతూ
హాలమున వచ్చె[3]నొ యనఁ జు
క్కలు[4]దోఁచెఁ గగనవీథిఁ గౌరవనాథా.

15 వ. ఇట్లు రాత్రి యగు[1]ట దివాచరంబు లైనజంతువు లు[2]పశాంతవర్తనంబు లయ్యె రాత్రిచరంబు లైనవి సంచరింపం దొడంగె [3]నప్పు డమ్మువ్వురు నెవ్వగలఁ [4]గూరినమనంబులతోఁ గురు[5]బలం బకారణంబ పొలియుట యుగ్గడిం[6]చి తత్సంబంధకలితంబు లైన[7]భాషణంబులు [8]చెల్లుచుండ నుండి [9]డప్పి గూరి [10]కొండొక సేపునకు మహీతలంబు[11]న మేనులు వైచి [12]వందురుచుండి రందుఁ గృపకృత[13]వర్మలు నిద్రవోయిరి గురునందనుండు క్రోధాతిశయంబునం జేసి నిదురవోవక [14]వటవిటపంబు గలయం గనుం గొను[15]వాఁడు తదీయశాఖోపశాఖల నానాకాకంబులు [16]నిలీనంబు లై నిద్రించుచుండ నాలోకించె నయ్యవసరంబున.

16 సీ. [1]మిడుఁగుఱుఁగములు [2]గ్రమ్మినయట్లు
[3]నిగిడెడు రోచులు గలమిడి[4]గ్రుడ్లుదనర
మెఱుఁగారు కెంజాయ [5]మెఱసినయెఱకల
[6]మోపున నెసఁగు పెన్మ్రోఁతతోడ

---

14 1. కిమ్మోయి — ఐ.బ.వ. 2. ములుకెతూ — వ. 3. ననగ — ఐ.బ.వ. 4 వొడిచెను — కొన్నిప్రతులు; వాలిచెను - కొన్నిప్రతులు.

15 1 టయు — పెక్కు ప్రతులు. శాంతవర్తనంబు — అ.ఇ.ఊ.క.ఘ ; ప్రశాంతవర్తనంబు — పెక్కు ప్రతులు. 3. నట్టియెడ నమ్మువ్వురు — పెక్కు ప్రతులు. 4. నూనిన - వ. 5. కులం - ఆ ఏ.ఔ.జ.ల. 6. చుచుతత్సం - కొన్ని ప్రతులు. 7. అన్యోన్య భాషణంబులు - ఐ.ఒ. 8. చెలంగు చుండ — ఐ.ఒ.న.వ. 9. దప్పి— పెక్కు ప్రతులు. 10. కొంత సేపునకు — అ.ఇ.ఊ.ఓ.ట ణ.వ. 11. పై —ఆ.ఈ ఉ. ఓ వ; నందు — ల. 12. వందు చుండి — ఆ.ఎ.ఐ.ఒ.ఓ.ల; కుందుచుండి - డ. 13. వర్మలు—పెక్కు ప్రతులు. 14. యవ్విటపంబు—పెక్కు ప్రతులు ; యవ్వటంబు — కొన్ని ప్రతులు. 15. చుండ — ఓ.ట; చుతదీయ — ఎ.ఖ.వ; చుండె - ణ.వ. 16. నిమీలితనయనంబులై —ఉ.ఏ.

16 1. మిణుగురు — పెక్కు ప్రతులు. 2. గ్రమ్మెదునట్లు - ఐ.ఒ వ. 3. నిగుడెడు - పెక్కు ప్రతులు. 4. గ్రుడ్లు నొప్ప — కొన్ని ప్రతులు ; గ్రుడ్డులొప్ప — ఏ.ఐ.ఒ.ఓ. ఔ.క.జ; గ్రుడ్లుదోప-ఎ.గ ; గ్రుడ్లు మెఱయ—డ ; గ్రుడ్లు బొడమ-ట. 5. నెఱసిన- ఈ.ఏ.ఔ.జ.ల. 6. మ్రోపున — కొన్ని ప్రతులు ; ప్రోవున - ట; ముంపున — క ;

[7]గాళులభీషణాకారత వేళ్లతో
[8]శీలమై [9]నెగసినశైల మనఁగఁ
గరముగ్ర[10]మగు మొగ మిరుదెస[11]మురియించి
యామిషంబులయిక్కలరసికొనుచు

తే. నచటిబయ లెల్లఁ దాన యై యక్కజంపుఁ
జందము[12]ను ఘోర మైన[13]నిస్వనముఁ జండ
గతియు భూతవితానభీకరము[14]గా ను
లూక మొక్కటి [15]వచ్చె భూలోకనాథ.

—: అశ్వత్థామ యులూకంబు కాకంబులఁ జంపుట నాలోకించుట :—

సం. 10—1—39

17 వ. వచ్చి [1]యవ్వటవిటపంబు [2]నూఁది యక్కాకంబుల నాలోకించి యంగంబుల యుద్భటత్వం బుడిపికొని గమనంబు [3]తిన్నఁదనంబు దలకొనఁ జొచ్చి వాని [4]నాక్రమించి.

18 ఉ. కొన్నిటికంఠముల్ [1]నులుపుఁ గొన్నిటికాళులు ద్రుంచు నుగ్రతం
గొన్నిటి[2]పక్షముల్ [3]నఱకుఁ గొన్నిటిపొట్టలు వ్రచ్చులీలమైఁ
గొన్నిటి [4]నప్పళించుకొని కోలెముకల్ నుఱుమాడు [5]నిట్టు ల
య్యన్నిటి నయ్యులూకము రయం బెసఁగఁగ వధియించె భూవరా.

---

మొంపున — ఊ.ఘ. 7. గాల విభీషణా — ఈ.ఉ.న.వ.ల.ష.స ; గాలాగ్ని భీషణా— ఆ ; గాఢవిభీషణా—అ.ఇ.ఊ.క.ఘ ; గాఢ భీషణ మహాకారతగణకమై-ఐ.ఒ.ట.డ.ణ.వ. 8. శీలతో — ఐ.ఓ.ట.డ.ణ. 9. నెసగిన — ఇ.ఔ.ట.వ. 10. ముగ — ఎ.గ.ఘ.ల. 11. మొరయించి—ఆ ; మొగియించి — ఎ ; మెఱయగ—శ. 12. న—పెక్కుప్రతులు. 13. నిస్వసము — వా ; నిచ్చలము — శ. 14. నగునులూక — ఇ.ఏ.ఔ.ణ ; నగుచులూక — ఈ.ఐ.ఒ.చ. 15. యచటి కి లోకనాథ — శ.

17 1. యవ్వట విటపంబు — పెక్కు ప్రతులు. 2. నమూఁగి యున్న — ణ వ ; ల మూఁగి యున్న — ఐ.ఒ. 3. సందిగ్ధంబుగ — ఐ.ఒ.ఓ.ట.ణ. 4. లోనుసొచ్చి — పెక్కు ప్రతులు.

18 1. నలపి — ఆ ; నలిచి — డ ; దునుము — ఈ.ఓ.ఖ ; నలుపు — ఇ.ల ; నునుము—ణ; నులుము — ప.వ ; చిదుము — క.వ. 2. వక్షముల్ — కొన్ని ప్రతులు. 3. నరుకు— కొన్ని ప్రతులు. 4. గాగిలించుకొని — ఆ.ఈ.ఉ.ఐ.ఒ.ఓ ; కండ్లు బోబొడుచు గొన్నిటి పుచ్ఛములూడ నీడ్చుచో నన్నిటి - శ. 5. నట్లుగా నన్నిటి — కొన్ని ప్రతులు ; నల్కమై — ఈ ; లీకన — డ.

19 వ. ఇవ్విధంబున నిద్రావివశంబులైన యవ్వాయసంబుల వివిధంబులగువధంబుల
గీటడంగించి యాకౌశికంబు శత్రువులం బోదివి సమయించినమేటిమగని
మాడ్కి మోదంబు నొందినం గని యగ్గురునందనుం డాచందంబు బొనర్పు
టకు డెందంబున నుత్సాహంబు వొడమి పొంగి తనలోన.

20 తే. ఇవ్విహంగమ ముపదేశ మిచ్చె నాకు
నిద్రవోవంగ శత్రుల నిగ్రహింతు
నింత లెస్సగునే ముందరేమి తెఱఁగు
గాన[1]నైతిసి నాపూనుకార్యమునకు.

21 వ. అని వెండియు.

22 ఉ. పాండునరేంద్రనందనుల బాంధవ[1]పుత్రయుతంబు గాఁగ ను
ద్దండత [2]ౙ వధింతు నని దర్ప మెలర్పఁగఁ గౌరవాధినా
థుండు వినంగఁ బల్కితిని[3] దుర్దమదోర్బలు లమ్మహా[4]త్మకుల్
గండున [5]బెట్టు పైఁ బడుట కార్యము గాదు దలంచి చూడఁగన్.

23 క. అరవాయి గొనక [1]బెట్టుగఁ
బరిగొని యక్కడిఁది[2]మగలపై [3]నడరుట [4]యు
ద్ధురగతి నగ్నిజ్వాలో
త్కరముపయిౙ మిడుత [5]యుఱుకు కరణియ కాదే.

24 వ. పాండవులం బరిమార్చుపని నేఁడ చేయక మఱిచేసిననారాజునిర్గతప్రాణుం
డైన నాకెలనం బెవ్వరి కెక్కెడుఁ బక్కటితోడిబవరంబున నబ్బలుమగల
గెలువరాదని యి ట్లురియాడునాచిత్తంబు చింతాపరంపర వాయ నీపక్షి
విచేష్టితంబు లోచనగోచరంబయ్యెఁ బగతురఁ దెగటార్చునెడ నన్యాయం
బనక యుపాయంబెయ్యది దొరకొనిన దాన నుత్సహింపవలయుట శాస్త్ర
సిద్ధంబ కాదే యెట్లనిన.

---

20 1. నైతి నా పూనిన కార్య — పెక్కు ప్రతులు.

22 1. మిత్ర—పెక్కు ప్రతులు. 2. నే పడంతునని—ఎ. 3. సుదుర్జయ — అ.ఇ.ఊ.క.ఘ ; సుదుర్దమ — ఐ.ఒ ఓ వ ; నిదుర్జయ—వ. 4. త్ములన్ — కొన్ని ప్రతులు ; త్ములొక్కం డన నిట్లు — చ. 5. బిట్టు — అ.ఇ.ఊ.ఔ.క.ఘ.ట.

23 1. బిట్టుగ - కొన్ని ప్రతులు. 2. పగర - గ. 3. నడుచుట — ఎ. 4. విస్ఫుర — ఔ. 5. యడరు - పెక్కు ప్రతులు ; గడగి యడరుట గాదె - ల ; యరుగగడగుట కాదే-ప.

25 తే. [1]ఎత్తినప్పుడు విడియుచో నిఱికటంపుఁ
బెరువునందు [2]నడపు సెడి తిరుగఁబడిన
యట్టియెడ నిద్రవోయెడునవసరమున
శాత్రవుల [3]బెట్టు పైఁబడి చంపవలయు.

26 వ. అనునీతివాక్యంబులు విని నంగీకృతతత్త్వధర్మం డగువానికి నిట్టివి కర్తవ్యంబు లట్లుఁ గాక పాండవేయులు పితామహగురు లైనభీష్మద్రోణులఁ దెగటార్చునెడం జక్కటి [1]గలతెఱంగున సంగరంబు చేసిరె యంగరాజును రారాజును బరిమార్చిన[2]భంగులఁ దలంపం గూడునె కావునఁ గల్మషోపాయు లగుకౌంతేయుల నిద్రాసమయంబున [3]గొబ్బున నిగ్రహించుట నీతియ కాని నింద్యంబుగాదని నిశ్చయించె నట్లు క్రూరవ్యవసాయుం డగునగ్గురుసుతుండు దనమామను గృతవర్మను మేలుకొల్పి యిట్టిసమయంబున నిద్రించితి మని లజ్జించు చున్న యారథికవరులతో ని ట్లనియె.

27 సీ. [1]మొగదప్పితిమి రణమున మన మకట మున
్ప్వరము రారాజు నొక్కరునిఁ బాండు
తనయులు దమవారుఁ [2]దారును బెక్కండ్రు
[3]గూడి చుట్టును ముట్టి [4]గుల్లపఱచి
రేకాదశాక్షౌహిణీశ్వరుఁ డట్లొంటి
మెయిఁ జిక్కి పోరుచుండియును బాడి
దప్పఁ డవ్విభుని నధర్మవిక్రమమునఁ
బాపాత్మకుం డగుబకవిరోధి

---

25 1. ఎత్తునపుడు – ఆ.ఈ.ఏ.ఐ.చ.జ.డ.బ.వ. 2. ను బడిచెడి – ఊ.క.ఘ ; నవడిచెడి–ప.
మూలం : ప్రస్థానే ప్రవేశే చ ప్రహర్తవ్యం రిపోర్బలం
నిద్రార్తం అర్ధరాత్రే చ తథానష్ట ప్రణాయకం
భిన్న యోధం బలం యచ్చద్విధా యుక్తంచ యద్భవేత్. 10–1–51, 52.
3. బిట్టు – ఊ.ఐ.ఒ.ఓ.ఔ.క.వ.

26 1. బవరంబుచేసి – ఐ.ఒ ఓ ణ. 2. భంగులు – పెక్కు ప్రతులు. 3. గొబ్బున – పెక్కు ప్రతులలో లేదు.

27 1. మొన – ణ.ల.శ.ష. 2. ననిలోన బెక్కండ్రుగూడగ వడిముట్టికోలుపరచి – ణ.
3. గూడజుట్టును – పెక్కు ప్రతులు. 4. కోలుపఱచి – పెక్కు ప్రతులు ; ముట్టుకోలు

ఆ. గూర్చె నంతఁ బోక కురుదేశరాజ్యాభి
షిక్తుఁ డైనయతనిశిరము దన్నెఁ
బరిభవంబు నొంచెఁ బ్రాణాంతకరవేద
నాతిశయముకంటె[5] నన్న రేంద్రుఁడు.

28 క. లావును వెరవును గలుగుమ
హావీరు లనేకులట్టు లన్నిదినము లా
భూవిభునకై పెనఁగి [1]జయ
మీ వలఁతులు గాక పోయి రే మన వచ్చున్.

29 ఆ. ఎవ్వ రెంతఁ జేసి రేనియు విధి యొండు
[1]దలఁప నాఫలంబు దలఁగ కేల
యుండు నిట్లు గాఁగ నున్నది కా కేమి
యెనక మెనఁగు[2] గౌరవేంద్రుమనువు.

30 వ. అని పలుమాట లాడి మీ[1]మది [2]కలంగకున్న దేని యీమహా[3]వ్యసనంబు నకుఁ గర్తవ్యం [4]బెద్ది చెప్పవలయు ననినఁ గృపాచార్యుండు ధనురాచార్య నందను మొగంబు గనుంగొని నీవు చెప్పఁ దలఁచినయంతవట్టునం జెప్పి కార్యం బడిగితేని నాకుఁ దోఁచినదానిం జెప్పెద [5]విను మని యి ట్లనియె.

---

పలుచి — వ. సూ. 5. నీచాత్మకుండగు కీచకారి — పెక్కుప్రతులు.

28 1. జయంబె పలతులగ నకపోయి - స.

29 1. దలచుగాక ఫలముదప్పకేల — వ ; దలఁపదత్ఫలంబుదలగకేల — స ; దలఁపగా ఫలంబు దప్పకేల — పెక్కుప్రతులు. 2. కౌరవేంద్రుడనఘు — ఖ ; కౌరవేంద్రు మనువు — ఒ.ఓ.క.వ ; కౌరవేంద్రునకును — ల.

30 1. మతి — ఎ.ప.ఔ.డ.ల. 2. గలకయున్నదేని — కొన్నిప్రతులు. 3. వ్యవసాయంబునకు — అ.ఇ.క.ఖ ఘ. చ.ఙ. 4. బెయ్యది — పెక్కు ప్రతులు. 5. సని యిట్లనియె — పెక్కుప్రతులు.

—: కృపాచార్యుఁ డశ్వత్థామకు నీతివిశేషంబు లెఱింగించుట :—

సం. 10-2-1

31 సీ. [1]ప్రారంభముల కెల్ల [2]పౌరుషమ్మును దైవ
మును [3]సాధనమ్ములు వినుము వాని
లోన నొక్కటిచేతఁ గానేర [4]దనఘ త
త్ఫలసిద్ధు లెట్లన్నఁ దలఁచు వాన
కారుపొలంబునఁ గల్గెనేనియుఁ గొల్చు
గావింప నేర్చునే కలవిధమున
వల నేర్పడఁగ దున్నఁ [5]బొలములో నైన
వర్షంబు లేకున్న ధాన్యంబు లగునె
ఆ. కాఁపు లావు వెరవు గల్గకర్షనము సే
యంగ వృష్టి దగిన[6]యట్లు గలుగ
ఫలము గల్గునట్లు పౌరుషంబునకు దై
వంబుతోడుపాటు వలయు నెందు.

32 వ. అదియునుం గాక.

33 క. తగుపని కుద్యోగించుచుఁ
దగవెఱిఁగెడు[2]హితుల క[3]నుమతంబుగఁ జేయన్
జగతీసురవర[4]కార్యము
లగు [5]వారికిఁ గలుగు విధిసహాయత్వంబున్.

---

31 1. ప్రారంభమునకెల్ల — కొన్నిప్రతులు. 2. పౌరుషంబును — పెక్కుప్రతులు. 3. సాధనంబులు — పెక్కు ప్రతులు. 4. వన — కొన్నిప్రతులు ; దన — వా పెక్కుప్రతులు. 5. వర్షంబులేకున్న బొలములో ధాన్యంబుబొందఁగలదె — ఙ. 6. యపుడు — పెక్కుప్రతులు.

33 1. నుద్యోగింపుచు — ఊ. 2. ప్రిజల — డ. 3. నుచితంబుగ — ల. 4. కడు నొప్పెడు నగణితమగు వానికిర్తి యఖిల ధరిత్రిన్ — ఊ.క.ఘ.వ. 5. వానికి — ట.ఙ.ల.

34 క. [1]ధర్మము దప్పక [2]నయగతిఁ
గర్మాచరణంబు [3]నడపఁగా ఫల[4]సిద్ధిన్
నిర్మలయశ మగుఁ [5]దప్పదుఁ
పేర్మి సెడదె నింద రా దభేద్యోత్సాహా.

35 ఉ. [1]నీతి [2]దొఱంగి కార్యముల నెట్టన యాగ్రహవృత్తిఁ జేసినం
బ్రీతిగ సిద్ధిఁ బొందినను భీతి[3]యుఁ [4]గుత్సయుఁ బుట్టు భూజను
[5]ల్వేతురు చేటు సేఁతలు ఫలింపక తక్కిన మున్న వచ్చు న
త్యాతురతాస్పదంబు లగునాపద [6]సిద్ధవివేకవైభవా.

36 ఉ. క్రోధము లోభ[1]ముఁ భయముఁ [2]గూరినచిత్తముతోడ దుష్క్రియా
సాధనవృత్తి దుర్జనుఁడు [3]సజ్జను [4]లాఁగఁగఁ జేయుకార్యముల్
బాధలఁ [5]బెట్టుకున్నె [6]సిరి పాయఁగ జేయక యున్నె వానిఁ దీ
వ్రాధి నితాంతదుఃఖహృదయత్వము దేరక యున్నె వానికిన్.

37 చ. వినుము కురుక్షితీశుఁడు వివేక[1]విదూరుఁడు క్రోధలోభముల్
మనమునఁ [2]బేర్చినన్ దురభిమానము[3]నన్ [4]హితు లెంత చెప్పిన
న్వినక బహుప్రకారముల [5]నిందకు నోర్చి పరాభవించె స
జ్జను లగుపాండుపుత్రుల [6]నసత్పథ[7]వృత్తికిఁ జేటు దప్పునే.

---

34 1. ధర్మువు — ఖ.జ. 2. నియతింగర్మా — క.వ.శ.ష ; నియతింధర్మా — ఐ.ఒ. 3. వలపఁగా — ఇ ; గడవఁగా — వ. 4. సిద్ధుల్ — ఈ చ.శ.ష.స. 5. దప్పదు — వ; వప్పినఁబేర్మి — వా ; దప్పినబేర్మి చెడునునింపవచ్చు (రాదె) పృథులోత్సాహ — వ.

35 1. నీతులుగాని కార్యములు — ఊ.క.ఘ.స. 2. దొరంగు — ణ 3. జుగుప్సయు — పెక్కు ప్రతులు. 4. గ్రౌర్యమువుట్టు — ఊ.గ. 5. ల్సేతురు — ఉ ఖ.శ.ష. 6, ల్లెనునానికిస్మహిన్ — చ : ఐందువివేకభూషణా — ణ.ల,

36 1. మున్మాదల — ఊ ఘ.వ. 2. గూడిన — ఉ.గ.వ. 3. సాగగలాపున — శ. 4. దాగగ — ఇ.ఊ.క.ఘ.వ ; లాఁచఁగ — ల.వా.ష.లాగగ — కొన్ని ప్రతులు. 5. బొందకున్నె — పెక్కు ప్రతులు. 6. క్షితిఁబాయఁగ — శ.

37 1. విహీనుడు — ఈ. 2. మెరయింపఁగా — ఆ.ఐ.ఒ.ఔ.వ. 3. తో — ల. 4. హిత వెంత — ఆ ; హితులెన్ని — వ. 5. వేదనకోర్చి — డ. 6. కసత్పథ — ఐ.ఒ.వ.శ. 7. వర్తికి — ఆ.ఇ.ల.

38 వ. అని పలికి [1]తమ్మునతండు మీమది గలఁగ[2]కున్న [3]దేని కర్తవ్యంబుఁ జెప్ప వలయు నని యడిగిన[4]నమ్మాటగురించి.

39 క. జగమెఱుఁగఁగ దుశ్శీలుం
డగుభూనాథుండు వోయినట్టులె పోఁగాఁ
దెగడుం జేటుఁ గలిగి [1]వగ
మిగులను మది గలఁగదే యమిత్రధ్వంసీ.

40 వ. అది యట్లుండె మన [1]కిప్పు డిది కర్తవ్యం బని నిశ్చయింప మనమేమి నేర్తుము తగవు [2]తెఱం గెఱింగించెద నాకర్ణింపుము.

41 క. మన మందఱమును ధృతరా
ష్ట్రునికడకుం బోయి కార్యసూత్ర మతనిచే
వినవలయు నాతఁ డెయ్యది
గని [1]పలికిన నదియ మనకుఁ గర్తవ్య మగున్.

42 వ. అమ్మహీకాంతుండు.

43 క. తానును గాంధారియు నె
ద్దానిం గార్యంబు గాఁగ దలఁచి [1]పనిచినన్
దానికిఁ గా దన వలవదు
పూని యనుష్ఠింత మదియ పొగ డొందించున్.

---

38 1. కియతండు — వా ; కితమ్మునతండు — ప.ల. పెక్కు ప్రతులు. 2. కయున్న దేని — వా.శ.ష : కున్న దేని — పెక్కు ప్రతులు. 3. దీనికిఁగర్తవ్యంబు — శ.ష. 4. నమాటలుగ్గడించి — వా.శ,ష ; ననమ్మాటగురించి — పెక్కుప్రతులు.

39 1. పగ మిగిలెను — ఎ ; వగ మిగిలెను — పెక్కు ప్రతులు.

40 1. కునిట్టిది కర్తవ్యం బని — అ.ఇ.వ ; కు నిది కర్తవ్యం బని — ఆ.ఐ.ఒ.ఔ.ల ; కు నిప్పు డిది — పెక్కు ప్రతులు. 2. చెప్పెద నాకర్ణింపుము — పెక్కు ప్రతులు.

41 1. పనిచిన — ఈ ; పలుకును — ఐ.బ.వ.

43 1. పలికినన్ — ప.

44 వ. వారలకక విదురుండు నుండు [1]నమ్మువ్వురు విచారించి చెప్పినకార్యంబు నకు నిందగలుగ దట్లుం గాక యెట్లు పొరలినను దైవోపహతంబు లగు కార్యంబులు సిద్ధిం బొందునె [2]యడిచిపడ వలవదు విచా[3]రించికొంద [4]మన వుడు శోకదందహ్యామానమానసుం డగుచు నగ్గురుపుత్త్రుండు కృత వర్మను నతని నాలోకించి.

*—: అశ్వత్థామకృపాచార్యు కృతవర్మలతోఁ దనపూన్కి స్థిరీకరించుట :—*

సం. 10—3—1

45 సీ. [1]వెర విట్టి[2]తెఱఁ గిది వెంగలితన మని
[3]యెల్లవాఁడును దనయెఱిఁగినట్టి
[4]తెఱఁగున నిజకార్య [5]దృష్టియ కయికొను
నొరులనేర్పులు పట్ట నొల్లఁ డాత్మ
బుద్ధియ మే లని పొగడు నన్యులచిత్త
వృత్తుల నిందించు వివిధగతులఁ
జెందెడునాత్మీయ[6]చేతఃప్రవర్తన
మరయఁడు దాన శాల్యమునఁ దలఁచు

ఆ. తలఁపు గీడు చేసి యెల్లప్రాయమున నొండు
తలఁపునందుఁ బట్టుకొలుపుఁ బ్రీతి
ముదిమి వచ్చి[8]నతఁడె నదియును విడిచి [9]య
న్యంబు లైన నేర్పు లాచరించు.

---

44 1. నప్పురుషు నడిగి — ఐ.ఒ.పౌ.వ; నమ్మువ్వుర నడిగి చేసిన — పెక్కు ప్రతులు. 2. యీాచిడిపిపట్టు వలవదు — ఎ. 3. రించు — కొన్ని ప్రతులు. 4. మనుటయు — పెక్కు ప్రతులు.

45 1. వెరవిడి — ఒ.ఓ.ట.ణ.ప.వ. 2. తనమిది — ఓ.ట.ప ; తెఱగని — ఎ.జౌ.క.ఖ.వ.ష; తెఱగున — శ. 3. యెల్లవారును — పెక్కు ప్రతులు ; యెట్టివాఁడును — క.వ; యెల్లవారలు తమ — ష. 4. తె(ర) రువున — కొన్ని ప్రతులు. 5. దృష్టికనుంగొను— శ.ష.స.సూ. 6. చిత్త — ల ; చరిత — ణ 7. బొందు — ఊ.క.ఘ ; బొంద — ణ. 8. నప్పుడది — పెక్కు ప్రతులు. 9. యన్యంబు నేర్పుగాఁగ నాదరించు — పెక్కు ప్రతులు.

46 క. ఆపదఁ బడి యొక్కఁడు స
ద్వ్యాపారము గాఁగఁ జూచి [2]దాని నడపు శ్రీ
ప్రాపించిన నరుఁ డొండొక
చూపున వర్తించు నని విశుద్ధపదముగన్.

47 క. [1]తగు నని మరణాదుల[2]కై
తెగువ దెసన్ మానవుండు దృఢ[3]నిశ్చయతం
దగిలినయది పరమహితం
బుగ వదలక నడుపు నన్యబుద్ధులు గొనమిన్.

48 వ. [1]మీ రెఱుంగనియది లేదు నాకుం దోఁచినకర్జంబు మన కందఱకును శోక నాశం బగునట్టిది దాని వినుండు [2]చెప్పెదఁ బ్రజాపతి ప్రజల [3]సృజించి [4]విప్రునకు [5]దమంబును [6]క్షత్రియునకుఁ దేజంబును [7]వైశ్యునకు దక్షత్వంబును శూద్రునకుఁ ద్రివర్ణానుకూలతయు [8]వలయుగుణంబులుగా [9]విధించెం గావున [10]శాంతుండు గానివిప్రుండును దేజస్వి గానిరాజును దక్షుండు

---

46 1. యొక్కటి సద్వ్యాపారము - పెక్కు ప్రతులు ; యొక్కటి సద్వ్యాపాయము-అ.ఈ; యొకరెస సద్వ్యాపాయము - ణ. 2. దాన నపుడు — ట.ష.స.

47 1. తగునెడ నిజ శత్రులపై -ఎ. 2. పై - పెక్కు ప్రతులు. 3. మగునియతిం-ట.ణ.వ ; ముగనియతిం - వ. 4. నడచు - ఒ ఓ.ట.డ ; నడుచు — ణ.

48 1. మీ యెఱుంగని - పెక్కు ప్రతులు. 2. చెప్పెద - పెక్కు ప్రతులలో లేదు. 3. సృజియించి - పెక్కు ప్రతులు. 4. విప్రులకు — కొన్ని ప్రతులు. 5. తపంబును — వ ; ధర్మంబును — ల; దమంబును, తపంబును అను పాఠభేదములు రెండున్నూ సరేమో. సంస్కృత పక్షమేమో చూడవలయును. 'బ్రాహ్మణేదమ మగ్ర్యంతు' అని తృతీయాధ్యాయము గనుక విప్రులకు దమంబును అనే పాఠమే వ్రాయడమైనది భండార్కరు ప్రతిలో "బ్రాహ్మణే ద... మవ్యగ్రమ్ - (10 - 3 - 19) అని కలదు. 6. రాజులకు-పెక్కు ప్రతులు. 7 వైశ్యులకు - కొన్ని ప్రతులు. 8. గావలయు గుణంబులు — ఉ.ఏ.చ.జ.ల. 9. విధియించె — ఏ.గ.చ.ప.వ. 10. దాంతుండు — ఏ.ఐ.ఖ.గ.

గానివైశ్యుండను ద్రవర్ణానుకూలుండు గానిశూద్రుండను [11]నిందం
బడుదు రది యట్లుండె నేను విప్రకులంబు[12]నందు జనపూజితం బైన
వంశంబునందు జనియించి భాగ్యహీనత [13]వలన రాజోచిత[14]ధర్మం బను
ష్ఠించితి నడుమ [15]నానిష్ఠ వదలి విప్రధర్మంబు మహనీయం[16]బైన నది
యాచరించువాఁడ నగుట నామదికిం జూడ మేలెయుండ దది[17]యుంగాక.

49 తే. మేటివిల్లును దివ్యాస్త్రకోటియును ధ
రించి [1]మెఱయంగ నాజి వధించెఁ దండ్రి
నొకఁడు వాఁడును రూపుతోనుండునట్టె
యెట్లుతలయెత్తిమెలఁగుదు నేను [2]జెప్పుఁడ.

50 క. వాఁడు మొదలుగాఁ బగతుర
వాఁడి గలుగుతూపుగముల[1]వలన మెఱసి యే
నేఁడు [2]వధింతును నెవ్వగ
వేఁడిమిఁ బడజాల [3]కొక్క వెరవు దలఁచితిన్.

51 క. తే దింకం బగ యని ధను
ర్ధాదులదెస వాహనములయందును సంత్య
క్తాదరులై పగతురు నేఁ
డాదమఱచి [1]నిద్రవోదు రది తఱి పొడువన్.

---

11. నిందింపం బడుదు—పెక్కు ప్రతులు. 12. న జన్మించి—పెక్కు ప్రతులు. 13. వలన—పెక్కు ప్రతులలో లేదు. 14. ధర్మంబులను – ఐ.ఒ.ఓ. 15. నన్నిష్ఠ – ఔ.ట ; యన్నిష్ఠ – డ.ణ. 16. ననునది – ఊ.ఎ.ఔ.ఖ.గ.చ.జ.ణ.ప. 17. యునుంగాక – పెక్కు ప్రతులు.

49 1. మెఱయుచు - ఊ.క; మెఱయుదు - ఇ.ఓ.ఖ.ట.డ.శ. 2. జెపుము – ప.

50 1. వలను—పెక్కు ప్రతులు. 2. వధించెద—పెక్కు ప్రతులు. 3. నొక్క—ఇ.ఘ.ట.

51 1. నిద్రింతు రిపుడ యరిగెద పొడువన్ – ఓ.గ.డ.

52 ఆ. ఓడిపోయి డప్పి [1]నూని గట్టును జెట్టు
జేరి [2]యొదిగి యున్న వారి గాఁగ
మనలఁ దలఁతు రరులు [3]మనముల నావంత
శంక లేదు సంతసంబు ఘనము.

53 చ. మదమునఁ [1]దేలి యేమఱినమార్తుర [2]దాడిగఁ బోయి [3]జెట్టు ము
ట్టెద శరజాల సత్వరపటిష్ఠతఁ బల్వురఁ ద్రుంతుఁ గొందఱుం
జదుపుదు నుల్లసత్పరిఘసంహననంబునఁ గొన్ని కంఠముల్
చిదుముదు నేల రక్తపరిషిక్తము గాఁ [5]గరవాలధాలన్.

54 తే. గెలుపునూఱట నొదవు[1]నగ్గలపునిద్రఁ
బీనుఁగులుఁబోలె నున్న యాబిరుదుమగల
జంపి పీనుంగుఁ బెంట గావింపవలయు
శిబిర మెల్లను భూతముల్ సెలఁగుచుండ.

55 వ. [1]అని వెండియు.

56 క. కరిహయనరశవముల భ
గ్న [1]రథంబుల [2]నెరసి ద్రుపద[3]నందనగాత్రో
త్కరము పడి [3]యుండఁ జూడక
పరిభవతాపోప శాంతి వడయఁగ నగునే.

---

52 1. నొంది — బొ ; గూరి — చ.డ. 2. యున్న యట్టివారి — శ. 3. మనమున — పెక్కు ప్రతులు ; తలతు రరులు నాదు తలపున నావంత శంక — స.

53 1. జేరి — ఐ.ఒ.ఖ.ప.వ ; బొంగి — గ ; గొరి — వ. 2. దాకగ — ఊ.ఘ. 3. బిట్టు— కొన్ని ప్రతులు. 4. గొందఱ — ఉ.బొ.జ.ట. 5. కరవాలధారలన్ — ఐ.ఒ.ఓ.గ.ట.వ.శ. కొన్ని ప్రతులు ; కరవాలలీలలన్ — వా.

54 1. నగ్గల మొలయ నిద్ర — పెక్కు ప్రతులు.

55 1. ఇ.ఏ.చ.శ.ష. ప్రతులలో యీ వచనము లేదు.

56 1. రథములను — వ ; రథములును — ఏ.బొ.క.జ. 2. జెరసి — పెక్కు ప్రతులు. 3. యున్న — డ.

57 శా. ధృష్టద్యుమ్నుని [1]ముట్టి పట్టుదు మదోద్రేకం బడంగింతు ను
త్కృష్టాస్త్రంబులఁ [2]జంప నల్క పశుభంగిం జంపినం గానిపో
దిష్టావాప్తి యనంగ నా [3]కిదియె [4]కాదేయిప్డు కౌంతేయులన్
గష్టస్వైర[5]విధాభియోగమృతులం గావించు నుగ్రాకృతిన్.

58 క. అలిగినపినాకిచందం
బలవడ శిబిరంబుఁ జొచ్చి [1]యందఱఁ బగఱం
బొలియిం[2]చెద శుద్ధుఁడ గా
[3]వలదే జనకునకు నాదువల నేర్పడఁగన్.

59 క. పాండవులం బాంచాలురఁ
జండభుజావిభవ మెసఁగ సమయించి కృతా
ర్థుండ నయి [1]పెంపు దేజము
[2]గండును దక్కొండు లేదు కార్యము దలఁపన్.

60 వ. అనవుడుఁ గృపాచార్యుం డి ట్లనియె.

61 సీ. [1]పఱిచిన[2]దానికిఁ బగ మాఱు వఱుపంగ
నుత్సహించుట [3]కడునొప్పు గాదె
దైవయోగంబునఁ దగిన[4]యుద్యోగంబు
నీమానసంబున నెలవుకొనియె
మాకు నీ[5]పూన్కి సమ్మత మేము [6]దీనికి
నీ తోడివారము నీవు డస్సి

---

57 1. గట్టి — ఐ.బ; మున్న — డ. 2. జంపకల్క — ప. 3. కదియ — పెక్కుప్రతులు. 4. భూయిష్టంబు గౌంతేయుల-వా.శ.ష ; కాదేయిప్డు కౌంతేయుల-పెక్కుప్రతులు. 5. వధాభి — పెక్కుప్రతులు.

58 1. యందలి — ప. 2. చెద — పెక్కుప్రతులు ; శును — వా.శ.ప. 3. వలవదె-ఘ.ల.

59 1. పేరుపెంపును — పెక్కుప్రతులు ; పరగుదుమరి — డ. 2. గండ నగుదు నొకటి లేదు — ఊ ఘ.

61 1. బరపిన — ణ. 2. వారికి — వా ; దానికి — పెక్కుప్రతులు. 3. యది యొప్ప- పెక్కుప్రతులు. 4. యుత్సాహంబు ఐ.బ.ఓ.ణ. 5. మాడ్కి-ఊ. 6. నీతోడివారము

యున్న వాఁడవు నిద్రయును లేక [7]యున్నది
[8]వెడగరపడి[9]యె దీ యడవిలోన

ఆ. [10]నెమ్మి డప్పిదేఱ నిద్రించి వేగినఁ
దెలివితోడ నత్యుదీర్ణవృత్తిఁ
గడఁగి యేము దోడ [11]నడతేర [12]నడరిన
నరిగణంబు [13]గెలుతు వ్రక్రమమున.

62 మ. వరదివ్యాస్త్రవిదుండు బాహు[1]ఘనుఁ డశ్వత్థామ పైఁ బోవ ను
ద్ధురలీలన్ గృతవర్మయుం గృపుఁడు నుద్యోగస్ఫురన్మూర్తులై
వెరవుం జేవయుఁ [2]జూపి తో నడవ దోర్వీర్యోద్ధతిన్ మార్కొన
న్నరయోధావళి గాదు దేవ[3]తతికి న్నా దెమ్మెయిం [4]జూడఁగన్.

63 వ. అని మఱియును.

64 చ. విను [1]కృతవర్మ దివ్యశరవేది బలాఢ్యుఁడు శౌర్యశాలి యే
నును సమరోద్యమంబునకు నూల్కొనఁ జాలుట నీవెఱుంగు ది
ట్లని గణుతింప రాదు గురునట్టిడ యీతఁ డనంగవచ్చు [2]ని
న్ననఘచరిత్రి యిట్టిరథికావళి [3]వైరుల [4]నెట్లుఁ జేయదే.

65 వ. కావున గోదండంబు నెక్కుడించి [1]కంకటం బూడ్చి నిద్రింపు మేము నిద్రా
గమనంబున జడులమై యున్న వారము ప్రభాతం బగుటయు నెల్లవార

---

నీవునుం బోర డస్సి — ఏ.ఔ.జ. 7. నీవును — ఙ. 8. వెడగుదు — పెక్కుప్రతులు ; వెడగురు — ఙ ; వేగిర — చ.శ.ష స. 9. యెవవేలయింత — శ.ష.స. 10. నిలిచి — ఓ.ట.ఙ.న.ల ద. 11. నడువంగ — ఐ.ఒ.ఓ ట.ఙ. 12. నడచిన — పెక్కు ప్రతులు. 13. గెల్చెద క్రమమున — పెక్కు ప్రతులు.

62 1. బలుడ — ఘ.డ.వ.శ. 2. జూపదోనడువ — పెక్కు ప్రతులు. 3. వతికిన్ రాదె — ఎ.ఐ.ఓ.ఙ. 4. జూచినన్ — పెక్కు ప్రతులు.

64 1. కృతవర్మ — సం ; - కృతకర్మ — వా. పెక్కు ప్రతులు. "అహంచకృతవర్మాచ ప్రియాంతం త్వాం నరోత్తమ అనుయాస్యావ సహితౌ ధన్వినౌ పరతాపినౌ"
(భండార్కరు 10-4-12.)
2. నన్ననఘ — వా. కొన్ని ప్రతులు ; నిన్ననఘ — పెక్కు ప్రతులు. 3. యెవ్వరి- ఔ.జ.ఙ.వ. 4 నేమసేయదే — ఔ ; నెట్లు సేయదే — జ.వ ; నట్లచేయదే — ఈ.

65 1. కంకటంబు పుచ్చి—ఈ.ఎ.ఐ.ఙ.ల ; కంకటంబుడించి — వ ; కంకటంబువివిచి — వ.

లకు [2]నుల్లంబు దెలివొందు నప్పుడు గడంగి [3]యోధులం బొదివి పేరు
వాడి పొలియింతము మనము పాంచాలసహితంబుగాఁ బాండవులం దెగ
టార్చుటయొండె వారిచేతం దెగుటయొండె నయ్యెడుం గాక రిత్త మర
లుదుమే యనిన మామకు నశ్వత్థామ యిట్లనియె.

66 తే. అలుక యెత్తినవానికి నర్థ[1]చింత
కునకు నాతురునకుఁ గామగోచరాత్ము
నికిని వచ్చునే వినునిద్ర నీవు నెఱుఁగు
[2]దెఱిఁగియుండి యి ట్లేటికి నేఁ బనన్ను.

67 క. ఎన్నఁబడి జను లెఱింగిన
యిన్నాలుగు తెఱఁగులందు నెయ్యది యైనన్
గన్న మొగుడ నీ[1]దళె నా
కిన్నియుఁ గలుగంగ నిద్ర [2]యేటికి వచ్చున్.

68 చ. గురుదెసవంత నాతురతఁ గూరెద వైరిఁ దలంచి కోపసం
భరితుఁడ నయ్యెదన్ సమరభంగి[1]నిరూపణచింత నొందెదం
గురుపతికిం బ్రియం [2]బెసఁగఁ గోరుట నుత్తలపాటు నొందెదం
బురుషవరేణ్య యే నిదుర వోవఁగ నెమ్మెయి నేర్తుఁ జెప్పుమా.

69 శా. సారాచారనిరూఢుఁ డైనధనురాచార్యున్ వధింపంగఁ గ
న్నారం జూచితి వీవుఁ దత్పరిభవం [1]బట్లుండె భగ్నోరుఁ డై
రారా జెంతయు దీనవృత్తిఁ జెవులారం బల్కఁగా[2] విన్న యే
నీరే యూరక నిద్ర[3] వోదునఁటె యిట్లేలంటి [4]వీరోత్తమా.

---

2. నుల్లంబులు – పెక్కు ప్రతులు. 3. యరుల – పెక్కు ప్రతులు.

66 1. చిత్తునకును – ఈ.వ. 2. ఎఱిగియెఱిగి యిట్లేటికి (నేపనన్ను) నేచెదనఘ – ఈ.వ.

67 1. దట – కొన్ని ప్రతులు. 2. యెట్టులు – అ ఇ.ఎ.ప; యెమ్మెయి – ఓ.ట.ణ.వ.

68 1. నిషూదన – ప. 2. బొసగ – ణ.

69 1. బట్టుండ – ఓ.ఔ.క.ఖ.డ.ణ; బట్లున్న – ట. 2. వింటినే – డ; విన్న నే – ఒ.ఔ.చ.శ.ష; విన్నయా – ణ. 3. వోవుదునె – ణ. 4. ధీరోత్తమా – ఎ.జ.

70 ఆ. మనము వినఁగ రాజు పనవినభంగి కే
క్రూర[1]చిత్తుఁ డైనఁ గుందకున్నె
కరుణ [2]లేక యున్న పురుషున కేనిఁ గ
న్నీరు దొరుఁగకుండునే మహాత్మ.

71 చ. అతఁడు మదీయసఖ్య[1]పరుఁ డక్కట యేఁ గసుగంద కుండ నా
క్షితిపతి యిమ్మెయిం బరులచేతఁ బరాభవ [2]మొందె దానిఁ జూ
చితి [3]మును లోకు లవ్వి భునిచేటును బాండుతనూజకోటియు
న్నతియును జెప్ప వింటి నది నామది [4]నూఁడెడు నిద్ర వచ్చునే.

72 వ. అదియునుంగాక.

73 ఉ. కవ్వడియున్ ముకుందుఁడును గావలిగా భయ మేది యున్నవీ
డెవ్వరి కైన ముట్టుకొని యే నని పేర్చి జయింప వచ్చునే
యెవ్విధి నైననుం బగఱ యే పడఁగించుట పౌరుషం[1]బ యే
నొవ్వక గెల్తు రాత్రిమెయి నూల్కొని [2]తాఁకితినేని [3]మాతులా.

74 ఆ. ఇట్లు నిశ్చయించి యెసకంపుఁ[1]గడఁకతో
నున్న వాఁడ నిట్టినన్ను మాన్ప
రామి యెఱుఁగ కంటి రారాజుమన్నన
వమ్ము చేసి మరలవచ్చు నెట్లు.

75 క. సమయింతుఁ బొదివి సౌప్తిక
సమయంబున నెల్లభంగిఁ జతురంగసమే
తము గాఁగఁ బాండునృపసుత
సముదయమును ద్రుపదభూపసంతానంబున్.

---

70 1. చిత్తమైన - పెక్కు ప్రతులు. 2. లేని కఠిన పురుషున కైన - ఎ.ఓ.గ.ఘ.జ.ణ.న.ల.

71 1. వరుడ - ణ. వా. 2. మొంది యుండ - ఈ; మొందె నట్లు నూ - ఓ; మొందనట్లు చూ - ణ. 3. నటలోకమవ్వి - ఎ; మను - వ. 4. నొంచెడి - శ.ష; నూడెడి - ఐ.చ.

73 1. బునే - ఆ ఐ.ఒ.క.డ. 2. తాకిరయేని మార్తురన్ - వ. 3. మార్తురన్ - అ.ఒ.ఓ.గ.

74 1. కినుకవో - ఈ; కడకఁబో - అ.ఆ.ఉ.ఘ.చ.శ.

76 వ. సమయించి మఱి విశ్రమించియు నిద్రించియు సుఖంచెద నీవు నిద్ర పేరు చెప్పి యుద్యోగంబు మాన్పి మరల్పఁ జూచెద విది [1]తగ వగునే యనిన గురునందనునకు గౌతముం డిట్లనియె.

—: కృపాచార్యుఁడు నిద్రాసక్తులఁ జంపఁదగదని యశ్వత్థామకు హితవుచెప్పుట :—

సం. 10-5-1

77 చ. అలుక మనంబునం గదిరి నాతఁడు దాను నెఱుంగఁ [1]దొడ్డచేఁ
[2]దెలియఁడు కార్యతంత్రములు ధీమహితుం డగువాని [3]కైననుం
జెలులను జుట్టలుం దగిలి చెప్పఁగఁజొప్పడుఁ [4]గాక తక్కని
ర్మల మగునీతితంత్రము దిరం బయి చిత్తమునందు నిల్చునే.

78 క. మతి నెప్పుడుఁ దా ధర్మ
స్థితినూహించుచును హితులు [1]సెప్పెడివెర వు
ద్ధతి దక్కి యాచరించుచు
జితేంద్రియత గలిగి నడవఁ జెందు శుభంబుల్.

79 తే. దుష్పథంబులఁ [1]జొరనీక తొలఁగఁ దివుతు
రాప్తజనములు దగ వశ్యు లయిన[2]వార
లందుఁ బుణ్యంబు దొలఁగనియతఁడు దొలఁగు
దొలఁగ నేరఁడు [3]భాగ్యంబు దొలఁగువాఁడు.

80 క. మతిమంతు లైనవారికి
హితు లగువెరవుగలవార లెఱిఁగింతురు దు
స్థితి గాకుండఁగఁ గార్యము
గతి [1]యొత్తియుఁదప్పులిడియుఁ గడవఁబలికియున్.

---

76 1. తగునే — పెక్కు ప్రతులు.

77 1. డొర్ల — డ. 2. దెలియఁగ లేదు కార్యములు — ఐ. 3. కేనియుం — ఐ. 4. కాత చిక్కు — శ.

78 1. చెప్పువెరవులుద్ధతి — కొన్ని ప్రతులు.

79 1. జన — కొన్ని ప్రతులు. 2. వారి యందు — కొన్ని ప్రతులు. 3. పుణ్యంబు — వ.

80 1. యెంత యు నొత్తినొడివి కడవ బలికినన్ — ష.స; యెంతయు దప్పు టడియుఁ గడవబలికినన్ — శ.

81 క. నాపలుకు[1]వట్టి యాగ్రహా
దీపితుఁ [2]డగు టుడిగి మదికిఁ జిన్నతనము నీ
వాపాదింపుము [3]చలమును
గోపము [4]గ్రౌర్యంబు విడువు గుణరత్ననిధీ.

82 వ. అశ్లైనం బశ్చాత్తాపంబునం బడవు నిద్రించినవానిని నాయుధంబులు విడిచినవానిని వాహనవై కల్యంబు నొందెనవానిని శరణుసొచ్చినవానిని [1]దల వీడినవానిని వధియించుట ధర్మంబుగా దీసనుయంబున సమస్తసైన్యంబును జాండన పాంచాలురు నిద్రవోవుదురు నిదుర సావునట్టిదికాదె పీనుంగులుం బోలెఁ బడి యున్నవారింబొడిచి పాపంబు గట్టుకొని నరకంబునఁ బడుట మేలె మహాస్త్రవిదు లగురథికముఖ్యులయందు మేటియనం బరఁగి యింతకు మున్నెమిటం గల్మషంబు లేనినీయట్టివానికిట్టిదుష్కర్మంబు గర్తవ్యం బగునె యిది మడుగుఁజీరయందు మసిదాఁకిన ట్లయ్యెడు సూర్యసంకాశుండ వగునీవు సూర్యోదయసమయంబునఁ బ్రకాశప్రకారం బైనపరాక్రమంబున కుపక్రమింపు మనవుడు నశ్వత్థామ గృపాచార్యున కిట్లనియె.

83 సీ. [1]నీచెప్పినది యెల్ల నిజము శాసింపంగఁ
దగువాఁడ వై హితం బగుదెఱంగు
నా కెఱింగించితి నీ కేను జెప్పెద
నేర్పడ [2]వినుమయ్య యెల్లనృపులు
గనుఁగొనుచుండ మజ్జనకుని సన్న్యస్త
శస్త్రుని నట్లు పాంచాలరాజ
సుతుఁడు ధృష్టద్యుమ్నుఁ డతిపాతకంబని
కొంకక తల పట్టుకొని వధించె

ఆ. [3]భీష్ము నాశిఖండి పేరఁ గృత్రిమసమ
రమున నర్జునుండు సమయఁజూచె

---

81 1. పట్లు — ఙ. 2. డవుగాకమదికి — డ. 3. సలము — వా ; చలము — పెక్కు ప్రతులు ; సమరము — ఈ ; సకలము - వ. 4. వేగిరము విడువు — పెక్కు ప్రతులు.

82 1. దల చీర విడిచిన — ఙ. 2. సమస్తసైన్యంబును — పెక్కు ప్రతులలో లేదు.

83 1. నీవు చెప్పినదెల్ల — వ. 2. జూడవె — వ. 3. భీష్ముని శిఖండి నెపమున వేర్చి యుగ్రసమరమున నర్జునుండును సమయ జూచె నరద మప్పుడు గ్రుంగిన నతడు డిగ్గి

నరద ముర్విఁ గ్రుంగి యనువు దప్పిన డిగ్గి
యెత్తుచుండఁ గర్ణు నేసె [4]నరుఁడు.

84 ఆ. చేయి నరుఁడు దునుమఁ బ్రాయోపవేశ[1]ప్ర
వృత్తమైఁ బ్రశాంతచిత్తుఁ డైన
పుణ్యపురుషు [2]నట్టిభూరిశ్రవునిఁ గృష్ణు
ననుజుఁ డట్లు [3]సంపె నాగ్రహమున.

85 చ. పలువురు గూడి కౌరవనృపా[1]లకు నొక్కరుఁ జుట్టు ముట్టి వి
చ్చలవిడిఁ బాపకర్మ మనుశంక యొకించుక యేని లేక యూ
రులు గద నుగ్గు సేయఁగ మరుత్సుతునిం బురికొల్పి రన్నిభం
గుల మును వారె కాదె చెడఁగ్రొచ్చిరి సంగరధర్మసేతువున్.

86 వ. వారి నెట్లు నిందింపవు [1]మమ్ము నెట్లు వారించెద [2]వాలింపుము.

87 ఆ. తొడలు విఱిగి నేలఁ బడియుండి ననుఁ గని
మానవేంద్రుఁ డట్లు దీనవృత్తి
నాడెఁ గొన్ని మాట లవి యంతరంగంబు
నందుఁ [1]జిక్కి కినుక యలఁత సేసె.

88 వ. వాని వెలార్పవలయు మజ్జనకహననసంతుష్టుం డగుధృష్టద్యుమ్నుండు లో
నైన యప్పాపాత్ముఁ బాపఁబు తెరువున రూపుమాపెద దీనం జేసి కీట
జన్మంబు పాటిల్లినను మేల కాని యీకడంక మాన నేర నన్ను వారింప
నెవ్వరివశం బగునని దిగ్గనలేచి యగ్గురు తనయుండు రథం బెక్కినం గనుం
గొని యగ్గౌతముండును గృతవర్ముండు.

---

యెత్తుచుండగ గర్ణుని నేసె నరుడు - శ. 4. నతడు — కొన్ని ప్రతులు.

84 1. ప్రవృత్తమున — శ ; ప్రవృత్తుఁడై — ఐ.బ ; ప్రవృత్తిమై — ణ.ల.ష ; ప్రవృత్తిమై — వా. పెక్కు ప్రతులు. 2. జంపె — ఉ ణ.ల. 3. మీరు గనుగొనంగ — ఉ.ణ.ల.

85 1. లుని నొక్కరు — ఎ.ల.

86 1. వదలకనన్నెట్లు వారించెవ — ణ. 2. వాకర్ణింపుము — పెక్కు ప్రతులు.

87 1. నెక్కికినియునట్లుచేసె — శ.ష ; చక్క నిలిచియలతఁజేయు — జ.

89 ఆ. ఏకనిశ్చయమున నిట యేఁగుదెంచితి
మనఘ నీవు నేము నధిపుపనికి
నిట్టిమమ్ము వేఱు పెట్టి యొక్కటికార్య
మాచరించువాఁడ వగుట దగునె.

90 చ. అనవుడు నాతఁ డిట్టు లను నమ్మహితాత్ముల కే నవశ్యముం
జని ద్రుపదాత్మజుం బొదివి చంపెద దుర్గతిఁ [1]బోవుచావుగా
ఘనభుజశక్తిశౌర్యము [2]నకంపితధైర్యమును౯ వెలుంగ మీ
రును దెలివొంది [3]కూడికొన రూఢికి [4]నెక్కుద మెల్లభంగులన్.

91 ఆ. ఒండు తలఁపు లుడిగి రం డని పోవ నా
రథికవరులు గడఁగి రథము లెక్కి
మొనసి చనిరి వారు మువ్వురు నగ్నిత్రి
యంబుఁ [1]బోలి యొప్పి యప్పు డధిప.

92 వ. అట్లు చని నిద్రావివశం బైనపాండవశిబిరంబు డగ్గఱి రనిన విని ధృత
రాష్ట్రుండు సంజయున కి ట్లనియె.

93 ఆ. రాజుఁ గూర్చి జయముఁ దేజంబుఁ [1]బొందిన
యత్యుదగ్రవిభవు లైనయరుల
శిబిర మాక్రమింపఁ జిత్తంబులందుఁ దెం
పొదవి మువ్వు రట్లు గదియు టరిది.

94 వ. వారు చేసినవిధంబు వివరింపు మనిన నాసూతసుతుండు విచిత్రవీర్యనంద
నున కి ట్లనియె నట్లు శిబిరద్వారప్రదేశంబునకు నడచి సహాయులం గడచి
యశ్వత్థామ యుద్దామరభసంబున జన నుత్సహించె నట్టియెడ.

---

90 1. బొందు — కొన్ని ప్రతులు. 2. నఖండితతేజము నన్వెలుంగుమీ — ణ. 3. వచ్చి
నను — స. 4. నెక్కుదు రెల్ల — కొన్ని ప్రతులు ; నెక్కుదు రెల్ల — కొన్ని ప్రతులు.

91 1. వోలె నొప్పి — కొన్ని ప్రతులు.

93 1. దక్కిన — పెక్కు ప్రతులు.

—: అశ్వత్థామకు శివుఁడు భూతాకృతియై తోఁచుట :—

సం. 10—6—1

95 సీ. క్షరితశోణిత మగుశార్దూలచర్మంబు
పరిధాన[1]కరణి విభాసితముగ
నురగాత్మకము లైనయుపవీతము[2]లు హార
ములు నంగదంబులు పొలుపుమిగుల
వివృతవిశాలాస్యవివరంబు నిశితదం
ష్ట్రానికరంబు ఘోరంబు గాఁగ
భాసురకాంతి వికాసంబు [3]లగులోచ
నంబులు బహుసహస్రంబు లొప్ప

తే. నుగ్రమును సుందరంబును నుజ్జ్వలంబు
నై మహాకార మద్భుత మావహింప
భూత మొక్కటి భీషణస్ఫురణ మెసక
మెసఁగ నగ్గురుపుత్రుకట్టెదుర నిలిచె.

96 క. విను మాభూతం బిట్టిది
యని కలరూ పేర్పఱింప నమరులకు వశం
బె నరేంద్ర తదాకృతి గనుఁ
గొనినఁ భేదిల్లి[1]వలయుఁ గొండకు నైనన్.

97 వ. ఇట్లతనియగ్రభాగంబున నావిర్భూతం బైనయమ్మహాభూతంబు నాస్య కుహరంబున నాసికావివరంబు[1]లఁ జెవు[2]లఁ గన్నుల నన్నింట [3]మంటలు వెడలి మింట నడ[4]రఁ దదీయతను తేజోమరీచిసంఘంబుల శంఖ చక్ర గదా [5]హస్తులై హృషీకేశు లనేకులు వెడలి రిట్లఖిలభూతభయంకరం బగు నమ్మహాభూతంబు నాలోకించి యవ్వీరవరుండు.

---

95 1. కరణ — క.ణ.ప.ల. 2. ను — ఎ.వ.ల. 3. గలుగులోచనములు — ణ.ప.ల.

96 1. కున్నె కొండయునైనన్ — ణ; వలయు గొండల కైనన్ — ఓ.

97 లను — ణ. 2. లను — ణ. 3. నుధూమ జ్వాలా సహితంబులగు మంటలు — ణ.వ. 4. రె — ణ. కొన్ని ప్రతులు. 5. శోభితహస్తులై — కొన్ని ప్రతులు.

98 చ. హృదయమునం గలంక యొకయించుక యేనియు లేక వీరసం
పద యలరంగ భల్లముఖబాణతతుల్ [1]నిగిడింపఁ బెద్దగా
వదనము విచ్చి భూత మనివార్యవిధంబునఁ ద్రావె బాడబం
బుదధిజలంబు ద్రాగెడుమహోగ్రసముద్ధతి వాని నన్నిటిన్.

99 చ. అతులశరంబు లట్లు వృథ యైనఁ గనుంగొని ద్రౌణి రశ్మిమం
డితమహనీయశక్తి [1]నిగిడించిన భూతముఁ దాఁకి యంత్యకా
లతిమిరవైరిమండలవిభగ్నమహోల్కయుఁ బోలెఁ బిన్నపి
న్న[2]తునియ లై యడంగె నరనాథ యతండు విషాద మందఁగన్.

100 చ. అలఘుతరాత్మ[1]సారుఁ డగునగ్గురుపుత్త్రుఁడు ఘోరఖడ్గమున్
బిలగతసర్పముం [2]దిగిచి భీషణ[3]రేఖ నటించుభంగి న
గ్గలపురయంబునం బెఱికి గాఢవిముక్తము గాఁగ వైచినం
బొలుపఱి పోయె దూదిక్రియ భూతశరీరసమాగమంబునన్.

101 తే. సరభసంబు[1]గఁ దోమరసమితిఁ జక్ర
వితతిఁ బరగించి పేర్చె నవ్వీరవర్యుఁ
డదియు నదియును దోడ్తోడ నల్ల నగుచు
మ్రింగె నమ్మహాభూతంబు మేదినీశ.

102 క. [1]అలిగి యతండు నితాంతో
జ్జ్వ[2]లగద వైచుటయు నదియు సత్వరలీలన్
జలచర మామిషముంగొను
[3]పొలుపు నెఱయ మెఱయ మ్రింగె భూతం బధిపా.

---

98 1. పరగింప – ఙ; నిగుడింప – ప.ల.

99 1. నిగుడించిన – ఙ.ప.ల. 2. తునియలై – సం.

100 1. శీలుఁడగు – ఊ.క. 2. దిగుచు – క.ల; దిగిచి – వా. పెక్కు ప్రతులు. 3. లీల – ఙ.

101 1. న – ఙ.ల.

102 1. అలయక – డ. 2. లుడైగద వైవ నదియు – ప; లుడైగద – ఊ. 3. పొలుపున నెఱయంగ మ్రింగె భూతం బధిపా – వ; పొలుపున మెరయ మ్రింగె నపుడు భూతం బధిపా – అ.క.ఖ.చ.ఙ.

103 ఆ. ఇవ్విధమున సకల హేతులు వమ్మయి
పోవ నతివిషణ్ణబుద్ధి యగుచు
నట్టు నిట్టుఁ జూచు నతనికి బహుజనా
ర్దనులు దోఁచి రంబరమున నెల్ల.

104 ఉ. భీకరవిష్ణురూపములు [1]పెక్కిటు లొక్కటఁ దోఁపఁ దీవ్రతా
పాకులమానసుం డగుచు నగ్గురుసూనుఁడు దుర్మదంబునం
జేకొన నైతి నట్లు కృపుచెప్పిన సత్యహితోపదేశముల్
నా కిది పెద్దయే యని మనంబున నిట్లని [2]వల్కె వెండియున్.

105 ఆ. మహిత [1]శాస్త్రకలితమార్గంబు విడిచి ని
జేచ్ఛఁ బగఱ గెలువ నెవ్వఁ డరుగు
వాని నయ్యధర్మవర్తన[2]క్రౌర్యమ
యెవ్విధమునఁ జెఱుచు నింత నిజము.

106 సీ. గోవు బ్రాహ్మణు బాలకుని వృద్ధు నంధుని
సఖుఁ దోడఁబుట్టువు జడుఁ బ్రమత్తు
మత్తుని గురుని నున్మత్తుని సుప్తు[1]ని
నంగన భీతుని నస్త్రశస్త్ర
నిహతి నొప్పించుట విహితంబు గా దని
యార్యులు సెప్పుదు రట్టిధర్మ
మార్గంబు దొఱఁగి దుర్మంత్రంబుమైఁ బగ
యడఁగింపఁ గడఁగినఁ నసురవృత్తిఁ

ఆ. [2]జేట గాక కార్యసిద్ధి గా నేర్చునే
పెద్ద యెత్తికొనిన భీతి మగుడఁ
బడుట కష్టసరణి బలిమి[3] దయ్యముతోడఁ
జెల్ల దింక నేమి సేయువాఁడ.

---

104 1. పెక్కులు నొక్కట - అ.క.జ.ణ.ల.వ.శ ; పెక్కయి యొక్కట - డ. 2. పల్కు - పెక్కు ప్రతులు.

105 1. ధర్మశాస్త్ర మార్గంబు — ఖ.చ.ప. 2. కార్యమ — చ.డ.ణ.శ.

106 1. రణాంగణ భీతుని - ణ ; నినంగనాభీరుని - అ.ఊ.ఏ.క.జ.వ.శ ; నినంగనాభిరతుని- ఖ.గ.చ.స. 2. చెడుట—ఔ ; చేటు—పెక్కు ప్రతులు. 3. దైవము—కొన్ని ప్రతులు.

107 ఉ. అక్రియమవృత్తి గీడు తెరువై [1]ఫలియింపద ద్రోణసూతి దు
ర్విక్రమ[2]నింద కర్షుఁ డె సవిస్మయమైనమనంబు భూతవృ
త్తిక్రమ[3]వేది గాదు గణుతింపఁగ నేమియొ యిమ్మహాద్భుత
ప్రక్రియ కాదికారణము పాపనిరూఢుఁడు [4]నీతిఁ గాంచునే.

108 వ. అని పెక్కుభంగుల వగచి పల్లటిల్లినచిత్తంబుఁ బట్టుకొల్పి యిట్లని నిశ్చ
యించె.

109 శా. భావం బేకముఖంబుఁ జేసికొని యాపద్వాంతభానున్ మహా
దేవుం బర్వతకన్యకాప్రియు దయార్ద్రీభూతచేతస్కు లో
కా[1]విర్భావవివర్ధనాలయకృతివ్యాపారపారంగతున్
దేవేంద్రప్రముఖామరార్చితుని భక్తిప్రౌఢతం గొల్చెదన్.

110 ఆ. అఖిలదేవతామయాత్ముఁ డద్దేవుఁ డ
ద్దగుట నిఖిలదైవికాపదుదయ
నిరసనం బొనర్చు నియతి నప్పరమేశుఁ
గొలిచి యిపుడ కీడుదొలగఁద్రోతు.

111 వ. అని యిట్లు నిశ్చయించి నియతుండై రథంబు డిగ్గి ధరణీతలంబునం
గూర్చుండి భావంబున భూతనాథు నెలకొలిపి యకుంభజసంభవుండు.

---

107 1. ఫలియింపద — అ.ఒ జ.వ ; ఫలియింపదు — ఆ.ణ ; ఫలియింపదె — వా. కొన్ని
ప్రతులు. 2. వృత్తికర్షుడె — ణ. 3. వృత్తి — ట ; సిద్ధి - ణ. 4. కాననేర్చునే-వ

109 1. విస్ఫార — ఘ.డ.ణ.న.వ.

—: అశ్వత్థామ శివుని కాత్మోపహారం బొసంగ నిశ్చయించుట :—

సం. 10—7—4

112 సీ. స్థాణు [1]నుగ్రుని శివు శర్వు నీశానుని
భద్రప్రదుని [2]శంభు [3]రుద్రు గిరిశు
నవ్యయు శ్రీకంఠు హరుఁ బరమేశ్వరుఁ
బురహరు నజుని శంకరుఁ ద్రినేత్రు
బహురూపు విశ్వరూపత్వసంవ్యాప్తుని
నంబికా హృదయేశు నమరవంద్యు
గణనాథు విభు శూలఖట్వాంగధరు జటా
మండలాలంకృతమౌళి నభవు

ఆ. నాశ్రయించి యతని కాత్మోపహార మ
ర్పించువాఁడఁ గాక [4]పెక్కుతలఁపు
లేల నాకు [5]నమ్మహేశ్వరేశ్వరుఁ డెట్టి
గతి [6]యొనర్చె నది సుఖంబ కాదె.

113 వ. అని తలంచి భూతకృత్యం బైనపరాక్రమప్రతిబంధరూప[1]ం బుగ్గ[2]డించి.

114 క. ఏ నీయాపదఁ గడచిన
నానాభూతోపహారసవ్యార్చన నీ
శానునిఁ బ్రీతుం జేసెద
బూని ప్రమథగణము నన్నుఁ బొగడునటులుగన్.

115 చ. అని హృదయంబునం బలుకునమ్మహనీయచరిత్రు ముందటం
గనకపువేది దోఁచె నధికద్యుతిజాలము లుల్లసిల్ల నం
దనలము విస్ఫురత్పటుశిఖావలి నొప్పి [1]వెలింగె దానికి
న్మనము దలిర్ప నిశ్చయమునం దెలివొందె నతండు నెంతయున్.

---

112 1. రుద్రుని — ఆ.ఎ.ఔ.ఖ.ట.ణ.వ. 2. శంభు — పెక్కు ప్రతులు ; కుంభు — వా. కొన్ని ప్రతులు. 3. భవుగిరీశు—ఎ.ఖ.ణ. 4 యొండు—ఆ.ఉ.ఔ. 5. నమ్మహేశుడు దానెద్దిగతి — న. 6. యొనర్చినను — కొన్ని ప్రతులు.

113 1. రూపదురితంబు గురించి — ఈ.ఏ.గ. 2. గురించి — పెక్కు ప్రతులు.

115 1. వెలుంగె — పెక్కు ప్రతులు.

116 వ. అప్పుడు ప్రదీప్తవదనులుఁ బ్రజ్వలితనేత్రులు నేకపాదులుఁ గరితురంగ సింహసూకరాననసమానముఖులును దీవ్రదంష్ట్రాకరాళాస్యులును మఱియు ననేకప్రకారంబు లగువక్త్రంబులం బోలుచువారును వక్రాంగులు దీర్ఘదేహులు హ్రస్వశరీరులు నతిస్థూలకాయులుఁ గృశమూర్తులుఁ బింగళ[1]గాత్రులు నీలతనులు మఱినానావర్ణంబులు గలుగువారును బంచ[2]శిఖులును జటాధారులును [3]గిరీటధరులును మఱియు బహుభంగికంబులై మౌళితలంబులం [4]బోలుపొందువారును లోనుగా వివిధవిశేషవికృతస్వరూపు లగునసంఖ్యాతప్రమథులు చిత్రాంబరమాల్యాంగరాగంబులు రత్నకనకమయభుజగాస్థిమాలాభూషణంబులును ధనుస్తూణ కృపాణ ముసల ముద్గర పరశు భిండివాల శూలప్రభృతిస్ఫారప్రహరణంబులు మెఱయ మృదంగ పణవ డమరు ఘంటా గోముఖాదితూర్యంబులు మొరయ విస్ఫురద్ధ్వజపతాకాకుంచికలు శోభిల్లఁ బాడుచు నాడుచు నార్చుచు బొబ్బలిడుచు [6]నవుడుగఱచుచుఁ ద్రుళ్లుచు గురువులువాఱుచుఁ గరటిబృంహితంబులుఁ గంఠీరవగర్జితంబులు శంఖరవంబులు భేరీధ్వనులుం బోనియెలుంగులు సెలంగ బెట్టిదంబు లగుపలుదెఱంగులపలుకు లెసంగ బ్రహ్మద్వేషు లగువారిమాంసరుధిరంబులఁ బూర్ణంబు లగుకపాలంబులు గరతలంబులం గొని యాభీలంబు లగు భక్షణపానంబు లాచరించుచు సోమపాన శమదమ తపోబ్రహ్మచర్యప్రముఖంబు లగు తమవిశిష్టకర్మంబులకు భవుండు విస్మయంబు నొందుంగాని యష్టగుణం బగునైశ్వర్యంబు [7]నొందియుఁ దారు విస్మితులు గానియట్టి మహానుభావు లద్దేవునకు గౌరికి గజముఖషణ్ముఖులకంటె నర్మిలికిం బట్టగు భవ్యులు దివ్యజనస్తవ్యు లయ్యుగ్రగురుతనూభవు తెం పెఱుంగుటకు సౌప్తికవ్యాపారఘోరత్వంబుఁ గనుంగొని వినోదించుటకు వచ్చి యతని చిత్తంబునకు బెదరు పుట్టించువారై [8]భీషణాకారంబుల నుల్లసిల్లిన నాధైర్యధుర్యుండు.

---

116 1. లోచనులు – గ ; నేత్రులు – ప.వ. 2. శిరస్కులును – ఎ.ఏ.చ.ణ.స ; ముఖులును – డ. 3. గిరీటధరులును – పెక్కుప్రతులు ; గపాలధరులును – వా. 4. జెలువొందు వారును – పెక్కు ప్రతులు. 5. శూల – ఒ.ణ.ల ; స్థూల – వా. పెక్కు ప్రతులు. 6. దాటుచు ద్రేపుచు – ఈ ; దాటుచు గీటుచు – ఎ ; దాటుచు గ్రుంకుచు – ఒ.వ ; దాటుచు గెరలుచు – డ ; దాటుచు గేలిచూపుచు – ఊ.క.వ ; దాటుచు క్రేపులాడుచు – ణ ; దాటుచు నెగయుచు – చ. 7. నొసంగినందనివిచాలనియట్టి – ణ. 8. భీషణ కరణంబుల – కొన్ని ప్రతులు.

117 మ. వెఱ పావంతయు లేక వారిఁ గలయన్ వీక్షించి నెమ్మోమునం
జెఱునవ్వున్ మదిఁ దెంపుసొంపు [1]వెలయం జెల్వంబు రెట్టింప నం
దఱుఁ గీర్తింప రథంబుమీఁది ఘనకోదండంబు చేనందిచి
చ్చులకం జేరె నుదాత్తభంగి మహనీయోత్సాహసందీప్తుఁ డై.

118 ఆ. ఇవ్విధమునఁ జేరి యవ్వేదిలోపల
భాసమానుఁ డైన[1]పావకుండు
దేహ మొక్కయాహుతిగఁ జేయుటకుఁ దగు
నంత లేకయునికి నతఁడు సూచి.

119 క. తనయరదముమీఁదం గల
[1]ధనుర్వితానము లసత్ప్రదరజాలములం
గొనివచ్చి వేదియం దిం
ధనములుగాఁ బేర్చి తెంపు దలకొనుమదితోన్.

120 వ. పేర్చి యప్పరమేశ్వరు నుద్దేశించి.

121 క. తెఱఁ గెట్టిదియో నామది
[1]నెఱుఁగ మదాత్మోపహార మిచ్చెద నీకుం
గఱకంఠ వరము నాకుఁ బ
గఱఁ బరిమార్పంగ శక్తి [2]గలుగుటయ చుమీ.

122 వ. అని ప్రార్థించి.

123 క. ఆంగిరసకుల[1]జనిత మీ
యంగము శిఖయందు దీని నాహుతిగాఁ జే
యం గంటి భవద్భక్తి సు
సంగతమతితోఁ గృతార్థజన్ముఁడ [2]నై తిన్.

---

117 1. నొలయం — అ.ఎ.గ.డ.ణ.

118 1. పావకుండు — పెక్కు ప్రతులు; పావకునకు — వా. కొన్ని ప్రతులు.

119 1. ధనురాదికహేతి బాణ తతులన్నియునున్ — ఖ ణ.వ; ధనురస్త్రవితానములు — ఆ.ఓ.చ; ధనుర్వితానంబులుం బ్రదర జాలములుం — పెక్కు ప్రతులు.

121 1. నెఱుగను నాత్మోపహార—ఆ.ఈ ఏ.ఔ.చ.జ ట.ణ; ఎరుగక యాత్మోపహార—ల.వ.
2. గలుగ నిమ్మీ — ణ.శ.ష.స.

123 1. జనితము నంగము మీకిపుడు — ణ. 2. నగుదున్ — అ.ఇ.

124 క. అని పలుకుచుఁ బరమేశ్వరు
మనమున నిడి యూర్ధ్వబాహు మహితాకారుం
డును ఘనసమాధి [1]యగుచుꠂ
విను మురికెను గురుసుతుండు వేదికపైకిన్.

125 ఆ. ఉరికి మంటలోన నుల్లంబు తెలి[1]వొక
యింతయేనిఁ గుంద కిద్ధమూర్తిఁ
[2]దేజరిల్ల నున్న ధీరవర్యునకుఁ బ్ర
త్యక్షు మయ్యె శివుఁడు దయ దలిర్ప.

*—: అశ్వత్థామకు శివుఁడు ప్రత్యక్షంబై ఖడ్గంబొసంగుట :—*

సం. 10–7–59

126 వ. [1]ఇట్లెదుర నిల్చినభక్తవత్సలుం డగుభవానీవిభుండు దరహసితముఖుం డగుచు దివ్యావలోకనామృతంబు వెల్లిగొల్పిన నవ్వేదియందుఁ గమలాకరంబు[2]లో నున్నచందంబునఁ [3]బ్రమోదంబు నొంది యున్న యన్నరోత్తమునకు నారాయణప్రియుం డిట్లనియె.

127 క. [1]ఇమ్మెయి నీ దగు సత్క
ర్మమ్ము విశేషమునఁ జేసి మానస మత్యం
తమ్ము ప్రియ మందె నీకు వ
ర మ్మొసఁగఁగ వచ్చితిꠂ ధరాసురవర్యా.

128 వ. అనవుడు.

---

124 1. సుసమాధియునగుచును – జ; సమ్మోదియు నగుచును – ణ శ.

125 1. వొక – ఎ.ట బ.శ.ష.సూ. 2. దేజరిల్లుచున్న – ఊ.ఎ.క.శ.ష.

126 1. ఇట్లు తన యెదుర – పెక్కు ప్రతులు. 2. లోనున్న కమలంబు – ఇ; లోనున్న మరాళంబు – ఎ; లోనున్న మదకరి – ట; లోనున్న గజంబు – డ; లోనున్న పద్మంబు – ణ. 3. డెందంబు ప్రమోదంబు – అ ఔ.ఖ.గ.ఘ.జ.ట.డ.ణ.

127 1. రమ్మిట – పెక్కు ప్రతులు; రమ్మిదే – ఏ జ; రమ్మిచటికినీ – డ; రమ్మిట నీ కర్మ విశేషమ్మునను – ఈ.ఖ; ఇమ్మెయినీసాహసకర్మమ్ము – శ.ష; ఇమ్మెయినినీదు సత్కర్మమ్మునకుం జాల మెచ్చి మనమున నత్యం – ణ.

129 తే. [1]తనువు పులకలఁ బ్రోవు గా మనము గాఢ
సంభృతానందముగ శరాచార్యసుతుఁడు
వితతసంభ్రముఁ డై వేది వెడలి సాఁగి
మ్రొక్కి లేచి ఫాలంబున [2]మొగిచెఁ గేలు.

130 వ. అప్పుడు.

131 చ. అతని మొగంబు మీఁద నొలయన్ మధురం బగుచూడ్కి పార్వతీ
పతి మృదురీతి నిట్టు లనుభవ్యము లై నతపంబు [1]సత్యము
న్ధృతియును [2]శౌచముం గలిగి నిశ్చలభక్తి యొనర్చు గృష్ణుఁ డ
ప్రతిమ[3]సపర్య నాకు ననురక్తుఁడ నేనును నమ్మురారికిన్.

132 క. అతనికి సన్మానము సే
యుతలంపున ఘాతరూపయుక్తుఁ డ నై వ
చ్చితి నినుఁ బాంచాలురపై
నతిస్ఫురణఁ బోవ నీక యడ్డం బైతిన్.

133 తే. తెల్లముగ నీదుచిత్తంబు తెఱఁ గెఱుంగ
[1]వలసి నే ని ట్ల[2]నేకమాయలు పొనర్చి
యస్త్రశస్త్రనిరాసంబు నాచరించి
కేలి సలిపితి వేయును నేల [3]చెపుమ.

134 వ. కృష్ణసన్మానంబును గృతం [1]బయ్యెఁ బాంచాలురకుఁ గాలంబు డగ్గఱియె [2]నేఁడు దెగుదురు నీవు నాయనుగ్రహంబు వడసి తని [3]యొక్క మహా నీయఖడ్గం బవ్విప్రునిచేతి కిచ్చుచు నతం డెఱుంగకుండఁ దేజోరూపంబున

---

129 1. తనువు పులకోద్గమంబుగ మనము గాఢ సంభృతానందముగ శరాచార్య సుతుఁడు వితత సంతుష్టుఁడై వెలువెడల సాగి మ్రొక్కి ఫాలతలంబున మోడ్చు కేలు — ఉ. 2. మోడ్చు - కొన్ని ప్రతులు; మోడ్చె — కొన్ని ప్రతులు; మోపె — ణ.

131 1. శుద్ధి సూనృ — ణ. 2. శాంతము — ణ. 3. సఖుండు నాకు — డ.

133 1. దలచి — ఐ.ఒ.ణ. 2. నేకంబు పన్నవలసె — డ. 3. చెప్ప — పెక్కు ప్రతులు; పలుక — ఎ.

134 1. నని నీయుత్కృష్ట సాహసంబునకు సంతసిల్లితి పాంచాలురుకును-ణ; నీయుత్కృష్ట సన్మానంబునకు-శ. 2. నీచేతం-అ.ఇ.ఊ; నేడు నీచేతం-ఎ.ఒ.క.ఘ. 3. పలికిమహా -

నతనితనువున నావేశించె నిట్లు [4]రుద్రుం డొలసిన యగ్గురునందనుం డమంద హర్షమయమూర్తి యై యతులప్రభ నొప్పె మున్ను భూతంబుచేత నప హృతంబు లైనయస్త్రశస్త్రంబులును బిదప వేదియం దిడినయాయుధంబు నమ్మహావీరుని తేరిపైఁ బూర్వప్రకారంబున నుండె నప్పుడు ప్రమథగణంబు లదృష్టాకారంబులై యమ్మహాత్ముని బరమాత్ముఁ గొలుచుచందంబున బలసి రా రథారూఢుం డై పాండవశిబిరంబునకు నాతండు నడవఁ దోడన [5]కృప కృతవర్ములు నడచి రనిన విని ధృతరాష్ట్రుండు సంజయున కిట్లనియె.

135 చ. అతఁ డటు లేపునం జనఁగ నాకృపుఁడుం గృతవర్మయున్ మహో
న్నతవరలాభగర్వితమనస్కుఁడు ద్రోణసుతుండు వోవఁగా
నితనిక్రియన్ [1]బలోద్ధతి సహిష్ణుత గల్గనె యొండ్ల కంచు సం
భృతభయ[2]చిత్తవృత్తు లయి పెంపఱఁ బోరు గదా పిఱిందికిన్.

136 వ. [1]మఱియును.

137 మ. పటువేగంబున ముట్టి ద్రోణసుతుఁ డప్పాంచాలలోకంబుఁ ద
క్కటిభూపాలుర ద్రౌపదీతనయవర్గంబున్ భుజాఖేలనో
ద్భటఖడ్గోల్లసనంబుపాల్పఱిచి తద్గాత్రీతలం బెల్ల నె
త్తుట జొత్తిల్లఁగఁ జేసెనే రిపుచమూదుర్వారఘోరాకృతిన్.

138 క. పాండవశిబిరముఁ జొచ్చి య
ఖండిత[1]పౌరుషము వెలయఁగాఁ గలశజపు
త్రుం డది యంతయు మత్తు
త్రుం డరిగెడి తెరువునం దరుగఁ [2]జేసెఁ గదే.

---

కొన్ని ప్రతులు; పలికి యొక్క - కొన్ని ప్రతులు. 4. గండొలసిన - ఐ.ఒ.ఔ.క.ఖ. ఘ.వ; పొలిచి యగ్గురు - శ.ప; వరంబు వడసి - ణ; కృతార్థుండగ్గురు - ఎ.
5. కృపకృతవర్మలు - పెక్కు ప్రతులలో లేదు.

135 1. బరోద్ధతి - ఔ.ణ.న.ప.శ.ష.స. 2. చిత్తులై మగుడి పెంపఱి పోరుగదా - ఐ.ణ; చిత్తతం దొలగి - చ.

136 1. పెక్కు ప్రతులలో లేదు.

138 1. శౌర్యంబు మెరయగా - ణ. 2. జేసెనొకో - కొన్ని ప్రతులు.

139 వ. [1]సమరప్రకారం బంతయు సవిస్తరంబుగా నెఱిఁగింపు మనుటయు [2]నతం డిట్లనియె.

140 తే. ఇవ్విధంబున గురుసుతుఁ డేపుమిగిలి
చనఁగఁగృపుఁడును గతవర్మయును దలిర్చు
కడఁక [1]నతనితో నడచిరి గాని వారి
వలన నించుకయును నరవాయి లేదు.

141 వ. ఇట్లు తనకెలంకుల నడచునవ్వీరుల నాలోకించి యాచార్యసుతుఁడు సంతోషించి.

142 ఉ. మీరును దెంపు సొం పెసఁగ మిక్కిలి బీరము లావు చూపఁగాఁ
గోరి కడంగి పైఁబడుటకుం దగి యుండదు వీడు మీబలో
దారతపాత్రిపునం జని యుదగ్రభుజావిభవంబు [1]పెంపు సొం
పారఁగ నవ్విరోధినిచయంబు సమస్తము నేన త్రుంచెదన్.

143 వ. అని యిట్లు వారి నగ్గించి వాకిట నిలిపి మహనీయబాణబాణాసనంబులు వహించి [1]సుప్రసుప్తసకలజనం బైనయాశిబిరంబుఁ జొచ్చి తాను [2]మున్న గతాగతజనంబులవలనఁ బ్రసంగాధీనతం జేసి యవ్విడిదల[3]తెఱంగు లిట్టిట్టివి వారిసన్నివేశంబు లిచ్చ టిచ్చట[4]నని సాభిజ్ఞానంబుగా విని యునికికతంబున నరసి కొని పోవ నేర్చి తొలుత ధృష్టద్యుమ్నుసదనంబునకు[5] నరిగి బాణ బాణాసనసహితం బై యున్న రథంబు డిగి రుద్రు నుద్దేశించి మానసంబున.

---

139 1. తత్ప్రకారం — పెక్కు ప్రతులు. 2. నమ్మనుజ పతికి నతండిట్లనియె — పెక్కు ప్రతులు.

140 1. తోడన నడచి — పౌ.ణ; వెనుకొని — డ.

142 1. నేర్పుపెం — పెక్కు ప్రతులు.

143 1. సంప్రసుప్త—పెక్కు ప్రతులు; సాంద్రసుప్త—చ. 2. మున్ను — పెక్కుప్రతులు. 3. తెఱంగు లిట్టిట్టివారి — పెక్కు ప్రతులు; తెఱంగును నిట్టిట్టివి — వా; తెఱంగు లిట్టిట్టివి — ఆ.ఎ.చ. 4. టివనియునుసాభి — కొన్ని ప్రతులు. 5. కుంబోయి — పెక్కు ప్రతులు.

144 క. పూనితి నిష్ఠమెయి [1]న్నిను
నానాభూతోపహార నవ్యార్చన నీ
కే నొనరిం[2]చెద నది యీ
శానా కైకొనుము సుప్రసన్నుఁడ వగుమీ.

145 వ. అనుచు నరిగి.

146 తే. అచటిజనములు పగలింటి యాహవమున
శ్రమము[1]బొందియు నిశ్శేషశత్రునాశ
నమున నూఱటఁ [2]జేసియు నమితనిద్ర
నొంది యత్యంతవివశులై యుండ నతఁడు.

147 వ. మందగతిం బ్రవేశించి యన్వేషించి.

148 చ. [1]తెరయును మేలు[2]కట్లుఁ దగు దీవియలుం జెలు వొంద మేటిచ
ప్పరమునఁ [3]జాలహృద్య మగుపాన్పున [4]నూఱడి నిద్రవోవున
గ్గురువధకారి గాంచి [5]మదిఁ గ్రోధము మోదము సందడింప సు
స్థిరతఁ బదప్రహారమునఁ [6]దెల్పెఁ దృణీకరణాభిరాముఁ డై.

149 వ. తెలిపినఁ [1]గను విచ్చి తన్నుం జూచి యెఱింగియుఁ గలంగక రణదుర్మదుం డైన యాద్రుపదనందనుఁడు దిగ్గన లేచినం దనచేతివిల్లు విడిచి యతనితలఁ బట్టుకొని పెడ మఱలఁ [2]దిగిచి యబ్బలియుండు.

---

144 1. న్నును – పెక్కు ప్రతులు. 2. పగనది – పెక్కు ప్రతులు.

146 1. నొందియు–పెక్కు ప్రతులు ; బొందిన యునికినిశత్రునాశ–ద. 2. జెందియు–పెక్కు ప్రతులు.

148 1. తెరలును – అ.ఎ.ఐ.ఒ.ఔ.ఖ.ణ. 2. కట్టులును – ఊ.క.ఘ ; కట్టుబలు – ఆ.ఇ. 3. జారు – పెక్కు ప్రతులు. 4. నాదట – పెక్కు ప్రతులు ; నేమరి – ఓ. 5. మది పెక్కు ప్రతులు ; కడు – వా.శ.ష ; మదిగ్రొత్తగ గ్రోధము సందడింప–ఐ.ఓ.ణ.ల. 6. దెల్పెనుద్రౌణిరణాభిరాముడై–స.

149 1. గన్నులు – పెక్కు ప్రతులు. 2. గుదియించి – కొన్ని ప్రతులు.

150 ఉ. నేలపయిం బడం దిగిచి నిష్ఠుర[1]భంగి నురఃస్థలంబు మో
కాల నొగిల్చి యేపున మొగం బతిదారుణముష్టి [2]నొంచె ని
ద్రాలసవృత్తి నంగములయందు బలంబును బుద్ధినేర్పునుం
జాలని యవ్విరోధి వివశత్వముఁ [3]బొందఁగఁ జేసె ద్రేల్మిడిన్.

151 వ. ఇవ్విధంబున [1]నతనిచేత ధృష్టద్యుమ్నుండు.

152 చ. వివశత [1]భీతిఁ బొంది కడువిహ్వలుఁడై తనుఁ జూడ ద్రోణసం
భవుఁడు వెసన్ శరాసనము వాపి గుణంబు తదీయకంఠముం
దవులఁగఁ [2]జేర్చి [3]వాగురవిధం బొడఁగూర్చి మనంబు విక్రమో
త్సవమున [4]నుబ్బఁగాఁ బశువుఁ [5]జంపెడుచాడ్పునఁ [6]జంపువేడుకన్.

153 వ. [1]ఉరంబును [2]మెడయును నిరుగాలం ద్రొక్కినఁ ద్రోచియు దైన్యంబు దోఁప గోళ్ల [3]గీఱియు నిస్తరింప లేక [4]యెలుంగు వెడల కున్న నెట్టకేలకు మాట వెడవెడ యెఱుంగ వచ్చు[5]తెఱంగునఁ బాంచాలవరుం డమ్మహీసురవరున కిట్లనియె.

154 క. గురుపుత్త్ర శస్త్రనిహతిం
[1]బోరిపుచ్చుము తడయ [2]నేల పుణ్యగతికిఁ జె
చ్చెరఁ బోవునట్లు సేయుట
పరికింపఁగ [3]మేల కాదె [4]పగతుర కైనన్.

150 1. వృత్తి — ఐ ఒ.వ ; తన్దదురఃస్థలంబు — ఈ ; భంగి నురంబుదన్ని — ఏ.చ. 2. నొంచి - పెక్కు ప్రతులు. 3. నొందగ — పెక్కు ప్రతులు.

151 1. తనచేత - పెక్కు ప్రతులు.

152 1. నొంది భీతి బడి — పెక్కు ప్రతులు ; నొంది భీతి భర — ఓ.డ. 2. జేసి — కొన్ని ప్రతులు. 3. యాసుర — ఐ ఒ ఓ.వ.శ.ష ; నాసుర — ణ ల. 4. నుబ్బుమై-శ. 5. జంపిన — కొన్ని ప్రతులు. 6. జంపె - కొన్ని ప్రతులు ; జంప - జ.ణ.

153 1. ఉదరంబు — ఏ.జ. 2. మెడయు — వా ; మెడయును — పెక్కు ప్రతులు. 3. గిల్లియు — పెక్కు ప్రతులు. 4. యేరు పరుపంగ వచ్చినట్టి — ఓ.ణ. 5. సట్టితెఱంగున — పెక్కు ప్రతులు.

154 1. బోరియించుము — ఒ; బోరిమార్పుము — ణ. 2. కేను — ఖ. 3. మేలు — పెక్కు ప్రతులు. 4. పగతునకైనన్ — కొన్ని ప్రతులు ; పగతుడనైనన్ — డ ; పగతురనైనన్ - కొన్ని ప్రతులు.

155 వ. అనిన విని యశ్వత్థామ యతనిమొగంబు చూచి

156 క. వినుము గురుద్రోహికిఁ గ
ల్గునె యుత్తమగతి నితాంతకుత్సితభంగిం
దువిమితి[1]వి నీవు గురు నే
నును [2]దుర్విధకరణమున నినుం దెగఁ జూతున్.

157 ఆ. అనుచుఁ బెలుచ నొంప నచ్చటిజనము[1]లు
గలఁగి యపుడు మేలుకాంచి చూచి
భయము [2]దోఁప గడిఁదిబలు[3]గాముగాఁ దమ
యుల్లములఁ దలంచి యొదిఁగి యుండ.

—: అశ్వత్థామ నిద్రావరవశుండగు ధృష్టద్యుమ్నుం జంపుట :—

సం. 10-8-21

158 ఉ. [1]కాలను గేలనుం జదిపి గంధకరిం దెగటార్చు సింహముం
బోలుచుఁ బేర్చి యాద్రుపద[2]భూపసుతున్ [3]సమయించె [4]వేదనన్
ఱోలఁగ రోఁజఁగాఁ బలుమఱుం [5]బొరలం[6]బడి లాల గ్రక్క న
వ్వాలుమగండు [7]ప్రాక్పరిభవంబుఁ దలంచుచుఁ [8]గార్యధుర్యుఁ డై.

159 క. ధృష్టద్యుమ్నుని [1]నిట్లతి
కష్ట[2]విధిప్రాప్తమరణుఁ గావించి మహో
వష్టంభోజ్జ్వలుఁ[3]డును సం
హృష్టాత్ముఁడు నగుచు వింట నిడియె గుణంబున్.

---

156 1. గురునీవును - శ.ష. 2. దుర్వ్యధకరణము - పెక్కు ప్రతులు; తద్విధికరణము - గ.

157 1. లక్కల కలమున—పెక్కు ప్రతులు. 2. గదుర — పెక్కు ప్రతులు. 3. గ్రహాముగ— ఆ.ఎ.బొ.

158 1. కాలునగేలునం—ఊ.క.శ.ష. 2. పుత్రకునిన్—కొన్ని ప్రతులు. 3. పరిమార్చె—ల. 4. రోదనన్ — శ; నుగ్రుడై - ష. 5. చగరక్తముగ్రక్కుచుక్క - ఆ.ఎ. 6. లాడగ- ఊ.క.ఘ. 7. ప్రాక్పరిభవంబు - పెక్కు ప్రతులు; వాక్పరిభవంబు — డ.ణ.వా.శ.ష. 8. ధైర్య — బొ.ఖ; శౌర్య — ఉ,ఊ ఘ.శ.ష.

159 1. దుర్గతి — చ. 2. తర — చ. 3. డతడుసుహృ — ట.

160 వ. ఇట్లు సజ్యం బయినచాపంబు ముష్టి నమర్చి యాచార్యనందనుండు.

161 ఆ. చప్పరంబు వెడలి చనుదెంచి [1]యల్లని
నగవు [2]నెఱయ సూతుమొగమునందుఁ
జూడ్కి [3]వ్రాలయ [4]రత్నసుందరం బగునిజ
స్యందనంబు[5]పైకిఁ జనియె నధిప.

162 మ. అరదం [1]బిమ్మెయి నెక్కి [2]యుబ్బి శిబిరం బాప్రొద్ద నిశ్శేషతం
బొరయం జేయుకుతూహలంబు మది నుప్పొంగన్ లసన్నేమి ని
ష్ఠుర[3]నాదంబు ప్రమోద[4]ముం బెనుప రక్షోభూతచిత్తంబులం
బరవీరావలియిండ్లకందు[5]వ లెడం [6]బాటించుచుం బోయినన్.

163 తే. పీనుఁ గై [1]యున్న పాంచాలసూనుఁ జూచి
రక్షకులును దదీయపురంధ్రులును స
మగ్రశోకాంధకార[2]నిమగ్నచిత్త
[3]వృత్తులై యేడ్చి [4]రెలుఁగులు మిన్ను ముట్ట.

164 క. ఆకలకలమున మేల్కని
యాకెలఁకులయిండ్లరాజు లది యే మనుచున్
వే [1]కదియం గనియాజను
లాకులరవ మెసఁగ నిట్టు లనిరి నరేంద్రా.

---

161 1. యెట్టని—స ; మెల్లని—క.ఘ ; యల్లన—ఈ.ఎ.ఔ.గ.ణ.ప.శ.ష. 2. మెఱయ — ఊ.ట.డ.వ ; వెడల — ఓ ; తోడ — జ. 3. వ్రారయ — ఐ.ఒ ఓ.ఔ ; నిలిపి — ఢ. 4. నతడు — శ.ష. 5. మీదికరిగె నధిప — పెక్కు ప్రతులు ; నెక్కె జనవరేణ్య — ఉ.

162 1. బుద్ధతినుబ్బియెక్కి — శ.ష. 2. వేగ — పెక్కు ప్రతులు. 3. రావంబు — గ ; ఘోషంబు — ఆ.ఎ. 4. మున్నెరప — ఊ.క.ఘ వ.శ.ష. 5. వలుదా — ఆ.ఎ. 6. భావింపుచున్ — పెక్కు ప్రతులు.

163 1. పడ్డ — ఏ. 2 నిర్మగ్న — పెక్కు ప్రతులు. 3. ఖిన్నులై — ఏ.ఖ.జ.శ. 4. రెలుగుల విశ్వమగల — ఆ.

164 1. కవియం — ఆ.ఎ.ఔ.చ.డ ; కలియం — ఈ.గ ; కదియఁ గదియఁగా జను — శ.

165 క. [1]రక్కసుఁడో మానిసియో
నిక్కమెఱుంగము వధించె నృపసూనుని [2]పిఁ
[3]డొక్కరుఁ [4]డుదగ్రుఁడై రథ
మెక్కి [5]యరిగె[6]డున్ దురాత్ము[7]నెయిదుఁడు కడఁకన్

166 వ. అనిన విని యన్నరపతులు తల లెత్తి చూచి పోనీక పొదువుం డనుచు సపరివారంబుగా [1]నడరి యశ్వత్థామం బొదివిన నుద్దాము[2]ప్రకారంబునం దిరిగి [3]మూఁపులు [4]పెరుఁగ గొనయంబు [5]సారించి.

167 మ. ఖరనారాచపరంపరావిహరణక్రౌర్యంబునన్ [1]ఘాతని
ష్ఠురభల్ల[2]ప్రవిసారదారుణత[3]రక్షోణీశులం [4]దద్భులో
త్కరముం గేలియవోలె గిటడఁచె దోర్గర్వం బఖర్వంబుగా
వెరవుం జేవయు భూతముల్ వొగడ నవ్వీరుండు ధీరోద్ధతిన్.

168 వ. తదనంతరంబ యుత్తమౌజునిలోఁగిలి చొచ్చి కృపాణపాణియై యరదంబు డిగ్గి [1]యరసికొని యతనియభ్యంతరమందిరంబుఁ బ్రవేశించి.

---

165 1. రక్కసియో—ఆ.ఎ.ఐ.క.ఖ.ణ.వ. 2. దానొక్క—గ. 3. డొక్కండు — ఆ.ఊ.క.ఘ. 4. దుగ్రుండై —ఎ.ఓ.ణ.వ. 5. చనెడు నీదు—క.వ. 6. నద్దురాత్ము—ఎ.ఏ.గ.జ.ట.ప. 7. నేయుడు — పెక్కుప్రతులు; నేయుండనుచున్ — శ; నెయిదుండనగన్ — ష.

166 1. నడచి - ప; నడిచి — శ.ష. 2. పరాక్రమంబున — ఒ వ; రథసంబున — ఖ.వ; భీమరయంబున — శ.ష. 3 మూకలు — ట. 4. విరిగి — ఖ; విరగ — గ.ట; వెరుగ - శ.ష. 5. సంధించి — ఐ.ఒ.ణ వ; ఎక్కించి గుణంబు సారించి — డ.

167 1. ఘోర - శ.ష; సార — ప. 2. ప్రవితాన—ఈ.చ.ద.ప; ప్రహరాది—ఊ క; ప్రవిఘాత - ఐ ఒ ఓ న; ప్రవిహార — ష; ప్రవిఘాత — శ. 3. నాక్షోణీశులం — పెక్కు ప్రతులు. 4. దద్భటోత్కరముం — ఒ.ణ.

168 1. యరసికొని యతని - పెక్కు ప్రతులలోలేదు.

169 సీ. [1]ఉలికిడి మేల్కనునతని ధృష్టద్యుమ్నుఁ
బట్టినక్రియఁ దలపట్టి [2]యీడ్చి
యాతనిఁ జంపినయట్టులు పశుమర
ణాతి[3]కౌతుకమున నవనిఁ బెట్టి
[4]చంప నచ్చేరువఁ జప్పరంబున శయ
నించుయు ధామన్యుఁ [5]డెఱిఁగి కడఁగి
చనుదెంచి రాక్షసుఁ డని తలంచియు [6]గొంకు
పెట్టక పెనుగద బెట్టు వ్రేయ
ఆ. వ్రేటు వడి చలింప కాటోపదీపితుఁ
డగుచు గురుతనూజుఁ డక్కుమారు
[7]నగ్రజన్ముఁ బోలె నుగ్రత [8]వధియించెఁ
గాని [9]ఖడ్గలీల గలుగ[10]దయ్యె.

170 వ. ఇట్లు ద్రుపదపుత్రుల నొక్కుమ్మడి నిరువుర గీటడంచి [1]యబ్బలుమగండు.

171 శా. కాలాకారతఁ బేర్చి దోర్లసితఖడ్గస్ఫారసాంద్రప్రభా
జాలం బొప్పఁగ [1]నిట్లు సొచ్చి లఘుసంచారంబు శోభిల్లఁ బాం
చాలవ్రాతముఁ గ్రీడమై దునిమె రక్తశ్రేణి మాంసంబుఁ గీ
లాలంబుం గబళించి త్రావి మదలీలాలో[2]లతం గ్రాలఁగన్.

172 వ. అట్టియెడ.

---

169 1. అక్కిలి — అ.ఆ.ఉ.ప.న ; అంకిలి — పెక్కు ప్రతులు ; అప్పుడు — క ; అంతన—ఐ. 2. ఈగిచి - పెక్కు ప్రతులు 3. శయంబున నతని బట్టి — కొన్ని ప్రతులు. 4. చంపె- కొన్ని ప్రతులు ; చంపిన జేరువ — ఆ.ఉ ఎ ఔ.ఖ. 5. డేచి — ప.జ. 6. నట్టుగొట్టక - పెక్కు ప్రతులు ; నతండడిదము వెరికియున్నట్లవై చె — ఎ. 7. నగ్రజులను బోలె — పెక్కు ప్రతులు. 8. దెగటార్చె — పెక్కు ప్రతులు. 9. ఖడ్గనిహతి గలుగ—క.వ ; శస్త్రనిహతి గలుగ — వ ; షండలీల — గ. 10. దయ్యె — ఆ.ఇ.గ.

170 1. నలిరేగి యబ్బలు మగండు — కొన్ని ప్రతులు ; యబ్బలియుండు — కొన్ని ప్రతులు.

171 1. నిండ్లు - పెక్కు ప్రతులు. 2. శాలితం — కొన్ని ప్రతులు ; కారతం — ఉ ఎ.ట.

173 శా. నిద్రాసక్తునిఁ గొంతమేల్కనినవానిన్ సుప్రబుద్ధాత్ముఁ డై
యుద్రేకంబును శౌర్యసారమును బాహాబాల్యాసమును జూపఁ జం
చద్రేఖం దిర మైనవానిఁ దను నుత్సాహోగ్రతం దాఁకి యు
న్ని[1] ద్రసై ్వరసముద్ధతిన్ మెఱయువానిం [2]దున్మె నేకాకృతిన్.

174 వ. మఱియు నతఁడు.

—: అశ్వత్థామ కరితురంగంబులపై కవిసి నఱుకుట :-

సం. 10-8-39

175 స్రగ్ధర. [1]తుండంబుల్ నుగ్గును[2] గై [3]తొరుఁగఁగ జులుకంద్రుంచుఁ గుంభస్థలంబు
ల్ఖండించున్ మౌక్తికంబు ల్గలయఁగఁ జెదరం గాయముల్ ప్రేవుఁ బ్రోవుల్
[4]చండంబుల్ సాంద్రరక్తస్రవమున బెరయన్ జాల్వడన్ వ్రేయు నిమ్మై
శుండాలశ్రేణి మాయించుచు వెలిఁగి హయస్తోమశాలాగతుం డై.

176 ఉ. కొన్నిటిపాదముల్ నఱుకుఁ గొన్నిటిమోరలు ద్రెక్కు లీలమైఁ
గొన్నిటికంఠముల్ దునుముఁ గొన్నిటివీఁపులు వ్రచ్చు నుబ్బునం
గొన్నిటి సర్వగాత్రములు కూరిరవిచేష్టితవిభ్రమంబు [1]దోఁ
ప న్నఱుమాడు ప్రౌఢబలభాసితభూరిభుజావిహారుఁ డై.

177 వ [1]ఇట్లు గిఁ భీమంగు [2]పెంట లై నపాంచాలురవిడిదల వెడలి విజయోద్దా
ముండగు నశ్వత్థామ [3]చల్లడము దట్టి మొదలయినపరికరంబులు పాటించి

---

173 1. ద్రాస్తోక — శ.ప. 2. ద్రుంచె — పెక్కు ప్రతులు.

175 1. తొండంబుల్ — పెక్కు ప్రతులు 2. నూచై — ఉ.ఎ.ఐ. 3. తొరగగ — పెక్కు ప్రతులు.
4. ఖండంబుల్ సాంద్రరక్తప్లవమునబెరయన్ బల్విడిన్ వ్రేయునిమ్మై — పెక్కు ప్రతులు.

176 1. లొప్ప — పెక్కు ప్రతులు.

177 1. ఇవ్విధంబునం దిరిగి — పెక్కు ప్రతులు. 2. పెంటయైన — పెక్కు ప్రతులు.
3. ఖల్గాది సాధన పరికరంబులు — ఊ.క.ను ; బల్లిదులైన ఘనులలో గిళ్ళకు — ఆ.ఎ.

యున్న [4]గనపలోఁగిళ్ళకుం జని తొలుత దొరలం దునుముచుఁ బరిజన మాతంగతురంగమండలంబులమట్టి విదళనవినోదంబులు సలుపుచు నొక్కొక్కయెడ మార్తురు మేల్కని పన్ని మార్కొనిన మారి మసంగినట్లు మృత్యుదేవత గెరలిన చాడ్పున జముండు నలిరేఁగినకరణిఁ గనుపుగొట్టి కాలుకాలం బెనంగిన పీనుంగులను గనకరత్నవలయంబులఁ జెలువందు చేతులను దునిసిపడినకరికరంబులతో సరసమాడుచెలువునం జలనంబు నొందుచరణంబులను నావులించుతలలను వేదండదంతఖండంబులను ఘోటకముఖలేశంబులను రథావయవశకలంబులను మడువులు గట్టునెత్తురులను [5]గుప్పలు గొనుకండలను బెనంగొనుప్రేవులను బెనుతిట్టలగు నెమ్ములను మూర్తిమంతంబులయినట్టి యద్భుతంబునకు భయానకంబునకు బీభత్సంబునకు నన్నెల నెలవగునట్లుగాఁ జేయుచుఁ జెలంగి చెలంగి మలంగి మలంగి తనకరవాలలీలలు భూతబేతాళంబులకుఁ బ్రీతిఁ బెనుపఁ జతురంగంబులం బాఱినను బీఱువోయినను [6]దురలినను గలంగినను దొలంగినను దఱిమినను నఱిమినను గిట్టినను ముట్టినను దాను వానిం బొదివి పొలియించుచు బలువిడియు నుబ్బును వెరవును బరుసఁదనంబు నొక్కచందంబునఁ జెల్ల నందొక్కటినైనను దక్కనీక యంతకంతకు నెక్కుడగుకోపంబున నాటోపంబు దీపింప [7]నాదరఁ జిక్కినయెముకతునుకలు గోఱదౌడలకైవడి గలిగి రుధిరానులేపనంబున నాభీలం బగునసిపట్టిక ఘోరాకారయైనరాక్షసి పగతుర గీటడంగించుటకుఁ దనకుఁ దోడువచ్చినతెఱంగున మెఱయఁ జేదిసైన్యసన్నివేశంబు లోనుగాఁ గలపలుచోట్లఁ గమలాకరంబు సొచ్చిన ఘనలులాయంబు రేఖయుఁ గేలివనంబుఁ దఱిసినమత్తశుండాలంబు పోల్కియును గాంతారంబు దరికొనుదావపావకువిధంబును దోఁప విహరించుచు వలయుతఱి [8]రథం బెక్కుచుఁ బాదచారియై విక్రమించుచు వెరవు [9]దొరకొన నప్పుడు నగ్గలికమై బెరయఁ బెనంగి పగతురరక్తంబున సిక్తంబైనశరీరంబు దారుణప్రకారంబున నుల్లసిల్లఁ దన్ను సకలజనులు దానవుం డని తలంపఁ [10]బెంపారుభీషణోద్ధతిఁ బ్రవర్తిల్లు పరాక్రమక్రీడ

---

4. కడమ — ఈ; ఘనుల — జ. 5. గుంపులుగొను — పెక్కు ప్రతులు. 6. మరలినను దెరలినను — పెక్కు ప్రతులు. 7. కరవాలధారం జిక్కిన — కొన్ని ప్రతులు. 8. నరదం బెక్కుచు — పెక్కు ప్రతులు. 9. దొరకొనినప్పుడు నగ్గలిక — వ; దొరకొని యప్పుడు డిగ్గుచు నగ్గలిక — వా; దొరకొనునప్పుడు — కొన్ని ప్రతులు; దొరకొనినపుడు — కొన్ని ప్రతులు. 10. సొంపారు — పెక్కు ప్రతులు.

నతిశయిల్లి రాజమందిరంబు సొర [11]నప్పళించుచు దద్ద్వారంబున కభి
ముఖుండై యరిగె నట్టి యెడ.

178 సీ. కలయంగ వీడుమేల్కని యమ్మహావీరుఁ
డొక్కడ మెలఁగుటయు నతండు
దొలుత ధృష్టద్యుమ్నుఁ ద్రుంచి తద్బంధు సం
తతి [1]గీటడఁచి యోధదంతి తురగ
చయముల నెల్లను సమయంగఁ జూచుచు
రాకయుఁ గర్ణపరంపరావ
గతమున[2] సన్నాహగాఢమై యెక్క డె
క్కడ యని కడఁగి శిఖండి ద్రౌప

తే. దేయులును దానుఁ బన్ని యుద్వృత్తశౌర్య
[3]మానతుంగప్రభద్రక[4]మాత్స్య[5]తతులు
తోడ బలువిడిఁ దఱుమంగ ద్రోణితనయు
ముట్టి శస్త్రాస్త్రచయములు ముంచుటయును.

179 వ. వారల నేర్పడ నాలోకించి.

180 ఉ. అగ్గురునందనుండు వారిణావలిఁ గాంచి కుభృత్తటంబు వే
డిగ్గు మృగేంద్రుచాడ్పునఁ గడిందిమగంటిమి యుల్లసిల్లఁ గా
డిగ్గి రథంబు చోద్యపువడిం [1]గలయఁగ బెరసెం గరంబులం
దగ్గల మైనఖేటకము నద్భుతఖడ్గముఁ దేజరిల్లఁగన్.

---

11. నప్పళించి తద్ద్వార — పెక్కు ప్రతులు.

178 1. గీటణంగించిదంతితురగ — పెక్కు ప్రతులు. 2. గ — పెక్కు ప్రతులు. 3. భంగి దుప్రదప్రభద్రక — ఐ.ఒ.ఓ.శ.ష.స. 4. బలవితతులు — ష.స. 5. వతులు — కొన్ని ప్రతులు.

180 1. గవిసెంగినుకం — శ.ష.స.

181 మహాస్రగ్ధర. చతురంగ చ్ఛేద కేళీసరభస[1]కలనాశ్చర్యధౌరేయనానా
గతులం దన్నొల్లి వారుం గడిఁదియసుర నాఁగా నతిక్రూర [2]చేష్టో
ద్ధతి యొప్పం జొచ్చి [3]సైన్యాస్త్రముల నతనియస్త్రంబులం ద్రుంచి వీఁకం
బ్రతివింధ్యుం [4]గిట్టి [5]రెండై పడఁగ దునిమెఁ దద్బాహుసమానాంగయష్టిన్.

182 వ. [1]ఇవ్విధంబున ధర్మతనయనందనుని నడుము దెగ నడిచి యార్చి పేర్చిన.

183 మహాస్రగ్ధర. అతి[1]శోకక్రోధవేగవ్యథితహృదయుఁడై యశ్వ[2]సాదిత్వ[3]పీరో
ద్ధతిఁ[4]బౌఢస్ఫూర్తి నెల్పొందఁగ [5]సబళముఁ దద్గాత్రముం[6]జొన్పఁ[7]బూఁచె
న్నృతసోముం [8]డల్ల బట్టె న్గురుసుతుఁడది[9]యుఁ బ్రుక్కు చెన్నార నల్క
న్ధృతఖడ్గుం డైనఁ జేయు న్శిరముఁ దురగము న్వ్రేల్మిడిం ద్రుంచివైచెన్.

184 వ. ఇవ్విధంబునఁ [1]జితవధంబునకు [2]గోచరుండైన కీచకాంతకతనయుం
గనుంగొని.

185 మహాస్రగ్ధర. నినుఁ గూడఁ బీఁడె [1]వచ్చెన్ నృపుఁ డనుచు శతానీకుఁ డాఖీలచక్రం
బున నశ్వత్థామవక్షంబునను [2]రుధిరముం బొంగఁగాఁ జేయ [3]నప్పా
టున నీడంబోక [4]బల్వేటున నిలంబడ నాటోపముం జూపి యంతం
దనివో కాదుర్జయుం డాతనిశిరమును [5]దద్గాత్రముం బాపె లీలన్.

---

181 1. రచనా — ఐ.ఒ.ఔ.న.వ.శ. 2. ఖేటోద్ధతి — ష. 3. సైన్యోత్కరముల వేసన
స్త్రంబులం — డ; కూరిరాస్త్రముల — క.వ. 4. డొందు రెండై — ఐ.ఒ.న.వ.
5. గండేర్పడగ — ఈ.

182 1. ఇట్లు ధర్మనందన నందను నడుము – పెక్కు ప్రతులు.

183 1. వేగక్రోధశోక — శ.ష. 2. సందీప్త —ఒ.ఓ.డ న.వ.శ. 3. తీవ్రోద్ధతి — అ.ఇ.ఊ.క.
ఘ.వ; ధీరోద్ధతి - ఈ.ఖ చ.శ; వాతోద్ధతి - ఐ.డ.న; పాతోద్ధతి — ఓ. 4. మూర్తి
స్ఫూర్తి — శ.ష. 5. నొకగద — శ. 6. దాఁక నేసెన్ — శ.ష. 7. జూచెన్ —
కొన్ని ప్రతులు; జొచ్చెన్ — కొన్ని ప్రతులు. 8. డల్లబట్టె — ఈ ఉ.న; డల్ల
తోడ — శ.ష. 9. యున్నుగ్గుగా జేయ — శ.ష స; యేనుంగు చెన్నార — కొన్ని
ప్రతులు; యేనుంగుచే నాగ — కొన్ని ప్రతులు.

184 1. ప్రేత పతి పురంబునకు — ఐ.ఒ.ఓ.న.వ; జమునకు — గ. 2. గోచరంబైన —
పెక్కు ప్రతులు.

185 1. వచ్చెన్నిజమనుచు — శ.ష; వచ్చెన్ రిపుడనుచు — పెక్కు ప్రతులు. 2. రుధిరము
నుప్పొంగ జేయంగ — పెక్కు ప్రతులు. 3. నపోటున — ఓ. 4. బల్వేరిటున —
పెక్కు ప్రతులు. 5 గాత్రంబు (నుం) నం — కొన్ని ప్రతులు.

186 వ. [1]ఇట్లు నకులసూనుండు సమసిన.

187 మహాస్రగ్ధర. శ్రుతసేనుం డప్డు కోపస్ఫురదరుణమరీచుల్ దలిర్పంగఁ జకు
ర్ద్వితయం [1]బుం గెంపునం బొందినచెలువము సందీప్తఘోరంబుగా [2]బె
ట్టితనిం జంచద్గ[3]దన్ వ్రేయఁగ నుఱ[4]క తదాస్యచ్ఛిద్రాస్ఫారకేళీ
చతురుండై యక్కుమారున్ జముకడ కనిచెం జండ[5]దోర్దర్ప [6]మొప్పన్.

188 వ. ఇత్తెఱంగున విక్షతాననుం డై పడి మృతుం డైనసహదేవసుతుం జూచి
రోషంబు[1]నం బేర్చి.

189 మహాస్రగ్ధర. వితతజ్యానాద మాశావితతి నినిచి దోర్వీర్య మేపార బాణ
ప్రతతిం ద న్నుంప వీఁకం బలుక జడియుచున్ [1]బల్విడిం బేర్చి చంచ
ద్గతిఁ గ్రీడం దంతి [2]హేలాదళనరతమృగేంద్ర [3]స్ఫురన్మూర్తి దోఃప్ర
శ్రుతకీర్తిం గిట్టి కంఠత్రుటనవిలసనారూఢి నవ్విప్రుఁ డొప్పెన్.

190 వ. ఇట్లు ద్రౌపదీతనయపంచకంబు పంచత్వంబు నొందినఁ గ్రోధాతిరేకంబునఁ
బ్రభద్రకులును శాంతనవాంతకుండును ధృష్టద్యుమ్నాంతకుఁ జుట్టు ముట్టి.

191 చ. శరములఁ దోమరంబులను జక్రములన్ వెసఁ గప్పి [1]బెట్టు ము
ద్గరకరవాలకుంతముఖదారుణ హేతుల నొంప నాతఁ డు
ద్ధురగతులం బ్రభద్రకులఁ ద్రుంచుచుఁ గేళి యొనర్పఁ [2]గా శిఖం
డి రుచిరమార్గణంబు భ్రుకుటిస్థలి [3]నొంచె సముద్భటోన్నతిన్.

---

186 1. అట్లర్జున తనయుండు గీటణంగిన — ఢ. ఇట్లు పురందర పౌత్రుప్రేత పతి పురంబున కనిచి — ఐ.ఒ.

187 1. బుగ్రంపు చెన్నొంది - ఆ ప జ; బుగ్రంపు సొంపొంది — ట; బుగ్రంపు నవ్వొంది- ఇ.ఓ.ఔ.క.డ; బుగ్రంబునంబొంది — గ.ప.స. 2. బిట్టతనిం — ఐ.ఒ.ఢ. 3. తిన్ — అ.ఇ.క. 4. కతడాస్య—ఆ.ఆ.ఇ గ జ ఢ.వ. 5. దోర్దండ—పెక్కు ప్రతులు. 6. హేతిన్- అ.ఇ.క.వ; లీలన్ - ఈ.గ.

188 1. ననేచి — కొన్ని పత్రులు; ననెదిర్చి - ఆ.ఎ.

189 1. ప్రౌఢతన్ — ఊ.ఘ; బర్విపేగంబ - క. 2. రేఖా — శ. 3. క్రమస్ఫూర్తి - పెక్కు ప్రతులు.

191 1. చేరి — పెక్కు ప్రతులు; ఖడ్గ — ఔ. 2. నా - పెక్కు ప్రతులు. 3. నాటి- కొన్ని ప్రతులు; నాటె — కొన్ని పత్రులు.

## —: అశ్వత్థామ శిఖండిం బొదివి చంపుట :—

సం. 10—8—66

192 క. గురుసుతుఁడు క్రోధ[1]మయమగు
పరవశము[2]న నప్పు డా ద్రుపదనందను మే
నిరువటి[3]య గాఁగ [4]నేసెను
[5]శిరము నుదగ్రతఁ గృపాణశిఖ మెఱయఁగన్.

193 వ. ఇవ్విధంబున దొరలు దెగినను పాంచాలప్రభద్రక[1]మత్స్యసైన్యశేషం బులువోక [2]పెనంగిన నతండు మాతంగవితాన[3]విదళనం బప్పుడు సలిపిన కంఠీరవంబు తనమీఁద [4]హరిణకులంబు గవిసిన నెట్టి దగు నట్టివాఁ డగుచుఁ బేర్చి యార్చె నత్తెఱంగుతుములం[5]బునఁ [6]బొడగానమిఁ బాండునంద నులు కృష్ణసాత్యకులును నాశిబిరమున [7]లేకయునికి యెఱింగె నప్పుడు గనుంగొను జనంబులకు నీతం డశ్వత్థామ యనుబుద్ధి [8]వొడమె నది యెట్టనినఁ గురుపాండవులు ఖండనంబుఁ [9]జేయం దొడంగినయది మొదలుగా రాత్రు లచ్చటిజనులు నీలతనువును రక్తాస్యనయనయు రక్తాంబర ధరయు రక్తమాల్యానులేపన[10]యు నగు లేమ [11]యొక్కతి [12]దమవీటి వారు నిద్రపోవుచుండఁ దలలు వీడ మేనులు వికృతంబులై [13]ప్రేలం బాశంబులఁ గరితురగసహితంబుగా బంధించి ఘోరసంరంభంబునం దెచ్చి తెచ్చి యశ్వత్థామయగ్రభాగంబునం బెట్ట నుగ్రభావంబున నతండు దును ముచు నార్చుచుఁ గలలు గాంతు రట్లగుటం జేసి నిద్రాసక్తులం జంపు

---

192 1. మయుఁడయి — శ.ప. 2. గదిసియామ్రివ — పెక్కు ప్రతులు. 3. యలుగా వ్రేసె — కొన్ని ప్రతులు. 4. వ్రేసె - కొన్ని ప్రతులు. 5. శిరంబు మున్నుగగృపాణ- అ.ఆ.ఇ.ఎ.ఓ ఔ.స. కొన్ని ప్రతులు

193 1. మాత్స్య — పెక్కు ప్రతులు. 2. పొదివిన — కొన్ని ప్రతులు. 3. విదళన విహారం బప్పుడు — పెక్కు ప్రతులు. 4. బాలహరిహరిణంబులు — కొన్ని ప్రతులు. 5. బులను—అ ; బునను — కొన్ని ప్రతులు. 6. జూడం గానమి—శ.ప. 7. లేకుంట— ఐ.ఒ.ఓ ; లేకునికి — కొన్ని ప్రతులు. 8. పుట్టె — ఊ.క.వ. 9. జేయుమొదలుగా రాత్రుల — ఐ.ఒ. 10. యునునై యొక్క తెదమవీటి — ఆ. 11. యొక్కతె — కొన్ని ప్రతులు. 12. తల వెంట్రుకలు వీడ — డ. 13. యుండం బాశం — ఊ.ఖ.ఘ.

టయు నవ్విధంబు[14]నార్పను [15]నేర్పడ ననుసంధించి యక్కాలలఫలంబు
గాఁ గేమి యని తలంచి చొచ్చి పోటునకు నయ్యారాతి రాత్రియై వచ్చుట
నిశ్చయించి [16]యశ్వత్థామగా నెఱింగి రవ్వీరుండు [17]మెఱుంగు [18]మెఱచి
నట్లు వివిధగతులఁ జరించినం జెండాడినం జూచియు నీడంబోక రణ[19]క్రీడ
[20]సల్పిన నబ్బలు [21]మగండు సముద్దండబాహుదండవిలాసుండై.

194 మహాస్రగ్ధర. [1]తలలఁ హస్తమ్ములం బాదములఁ దనువులం దత్ప్రదేశంబుఁ గప్పం
దొలఁగించున్ వానిఁ గ్రొన్నెత్తురు వఱపి హయస్తోమదంతిప్రతానం
బుల మేదోమాంసఖండంబుల దనుజమహాభోజనం బావహించు
న్మలఁగం బాఱుం జెలంగు [2]న్నలి నెసఁగు జయోన్మత్తుఁడై మానవేంద్రా.

195 తే. అట్లు [1]విహరించి హతశేషులైన జనులు
పాఱఁ గనుఁ గొని రథమెక్కి పటురయమున
వారి వెనుకొని మెఱుఁగువాలారుతూపు
గములు వరగించి యందఱ సమయఁ [2]జూచి.

196 క. [1]ఆకలన నట్లు సేసి మ
హాకుల జనతతులు [2]గాఁగ నన్య[3]స్థలులున్
భీకర[4]రథగతులనుద
గ్రా[5]కృతియై మెఱసి యమ్మ లడరింపంగన్.

---

14. నక్కలకలం బెరింగి – ఆ.ఎ. 15. నేర్పను – ఐ.ఒ.ఖ. 16. యట్లశ్వత్థామ– కొన్ని ప్రతులు. 17. మెఱుపు – ఈ. 18. మెఱసినట్లు – ఇ.ఈ.ఉ.ఒ.ఓ.శ.ష. 19. క్రియ – అ.ఇ. 20. సల్పిరబ్బలు – కొన్ని ప్రతులు. 21. మగండును – కొన్ని ప్రతులు.

194 1. తలలున్ హస్తంబులున్ బాదములుదనువులుం తత్ప్రదేశంబుగప్పం–కొన్ని ప్రతులు. 2. న్మనమలరజ – ఈ ఏ.ఔ.చ.ల ; న్మద మెసఁగ – వ.

195 1. తనచేత – ఒ.వ. 2. జేసి, జేసె – అని పాఠములు.

196 1. ఆకదన మటు – స. 2. గలుగు – పెక్కు ప్రతులు. 3. స్థలముల్ – పెక్కు ప్రతులు. 4 తర – ఈ. 5. కృతుడై దరిసి – ఈ.ఔ.ఖ.చ.ట.

197 వ. ఇట్లెసఁగు బహుళకోలాహలంబున హయంబులు నిభంబులుఁ గట్లు దెంచుకొని కలయం బాఱెఁ బాఱుటయు గోడికలకై [1]దంత[2]పాతకలహంబులం గెరలు[3]గుండ్లక్రందునను నొండొంటిమదగంధంబులు సహింపక మార్కొని పొరాడు సామజంబులసమ్మర్దంబునను గాళ్లు దునిసియుఁ జేతులు నలిసియు నురంబు లవిసియు వెన్నులు విఱిగియుఁ బ్రక్కలు నొగిలియుఁ దలలు పగిలియుఁ జాఁపకట్టు వడి చదిసియుఁ గ్రంకల నిఱకటంపుఁ [4]జోట్లమానవకోట్లు పీనుంగు [5]తిట్ట లగుచుండఁ బలకయుఁ వాలునుం గొని యవ్వాలుమగఁడు వేడుకం దేరు డిగ్గి యగ్గజంబులను ఘోటకంబులను బొదివి [6]పాటవాటోపం బొప్ప విపాటన వినోదంబు సలిపె నప్పుడు గొందఱు నెఱయ మేల్కనిభ్రమను భయంబునను బాదంబులు గుదివడఁ బాఱ [7]లేక నెల వెడలినయెలుంగుల నస్తవ్యస్తపుమాట లాడఁ గొందఱు జనకసహోదరాదు లగుబంధువులఁ [8]బేరువేరం బిలుచుచుం దిరిగి కనుదిరిగి తమవారు గానివారలచెట్టలుపట్టుకొని చనఁ గొందఱు కైదువులు గొని కదిసి నిదురకన్నుల[9]ం బొదువుచెలులను జుట్టంబులను బగఱ యని సమయింపఁ గొంద ఱెదురుగాఁ [10]జనుదెంచిన[11]వా రిది యేమి యని యడుగ నశ్వత్థామ సొచ్చి [12]పొడుచుచున్నవాఁ డనిన వాసుదేవార్జునులు శిబిరంబున లేమి నప్పాపాత్ముఁ డిట్లుసేయ వచ్చెంగాక వారున్నఁ దన్ను గాసి సేయరే యని పలుకఁ గొందఱుభీభత్సుం డిట్టి పరాక్రమంబు [13]సేసినం జూచి మనంబున రోయకుండునే యతం డెన్నఁ డేనియు వాహనవికలుఁ డైనవానిని జేత నాయుధంబులు లేనివానిని [14]దల వీడిన వానిని వెఱచినవానిని వెఱఁగుపడినవానిని నిద్రించువానిని నొంచునే యని యర్జునునగ్గింప నయ్యొందఱు నగ్గురునందనుండు గురుతరం బయినకురురాజుపరిభవంబు నప్పటప్పటికిఁ దలంపఁ బెంపారుదారుణక్రూరత్వంబునఁ

---

197 1. దంతి — ఐ; దండ — ఉ.ఔ.చ; కెరలునుత్తమాశ్వంబుల క్రందున — ఎ. 2 పాద — పెక్కు ప్రతులు. 3. గూంట్ల — పెక్కు ప్రతులు; నుత్తమాశ్వంబుల—ఆ; చునొండొంటి — శ.ప. 4. జోట్లను — పెక్కు ప్రతులు. 5. పెంటలగు — కొన్ని ప్రతులు. 6. కోపాటోపం—ఐ.ఒ.ఓ; ప్రతాపాటోపం—శ.ప; విపాటనాటోపం—క; పటాటోపం — ఈ; పట్టియాటోపం — ట. 7. లేకల్లవెడలి — శ.ప; లేక వెడ వెడ వెడలి — ఆ.ఎ. 8. వేఱువేఱ — శ.ప. 9. ంబొదువు — పెక్కు ప్రతులలో లేదు. 10. బరతెంచిన — పెక్కు ప్రతులు. 11. వారి నిదియేమియని యడిగిన — పెక్కు ప్రతులు. 12. పోటు పొడుచు చున్న — పెక్కు ప్రతులు. 13. సేసినం — పెక్కు ప్రతులలో లేదు. 14. దలవీడినవానిని వెఱచిన వానిని — పెక్కు ప్రతులలో లేదు.

గోలు మసంగియించుకయరవాయిఁ గొనక చెండియుం ద్రుంచియుం జించియుఁ దుంగమడుగుఁ జొచ్చిన మాతంగంబుపగిది [15]బడలువడం జేసె నా సమయంబున.

198 సీ. ఆయోధవరుశారి కగ్గంబు గాక ద
వ్వుల భీతిఁ [1]దలలచీరలును వీడఁ
బాదంబు [2]లట దొట్రువడఁ బాటి కొందఱు
మానవాధీశులు సైనికులును
విడిదల వాకిట వెళలుచోఁ గృపకృత
వర్మలఁ గని వఱువట్లు వట్టు
పెదవులు దడుపుచు సదయతఁ గావరే
యనుచు మ్రొక్కఁగ నమ్మహాత్ములపుడు

తే. రాక్షసావేశ[3]సంభృత క్రౌర్యులగుట
నధిపయాత్మీయమానుషహాని దలప
లేక వారలఁ బొదివి యనేకభల్ల
దారితులఁ జేసి రందఱఁ దరతరంబ.

199 క. ధరణి నెఱి దప్పనొఱగిన
కరిహాయనరచయము లొఱలఁగాఁ గరుణము భూ
వర [1]యొరసె శిబిరమునఁ దన
కరయఁగఁ జేరుగడ లేమి నదివృథయయ్యెన్.

200 వ. అట్టియెడ.

---

15 బడలు - ల.వ.

198 1. దలలు—పెక్కు ప్రతులు. 2. లును—ఒ ఓ ఔ.శ ప. 3. సంహిత—ఐ.ఒ.ఓ ఔ.డ.

199 1. రొులసె — పెక్కు ప్రతులు ; యాశిబిరమునందన — డ.శ.

201 మహాస్రగ్ధర. దనుజవ్రాతంబు కాంతాతతియును బ్రజలుం దారు నానావిధోగ్ర
ధ్వనులాకాశావకీర్ణత్వమహిమఁ [1]బొరయం దంష్ట్రి లత్యంతఘోర
త్వనిరూఢిం బొంద [2]నార్చుం దఱచుగ నగు [3]నుత్తారసల్లాప[4]ముల్ సే
[5]యు నలిం గ్రిందారఁ బైపై [6]నఁరవడిఁ [7]గలియుఁ హుంకృతాఖీలఖంగిన్.

202 వ. ఇవ్విధంబున వివిధవికారాననంబులు [1]బహుభంగికకరపాదంబులు గలుగు నపరిమితక్రవ్యాదులు [2]గవిసి మేదోమాంసమస్తిష్కమజ్జంబు లానుచుం జవి యైన వానిం బుత్రమిత్రకళత్రాదుల కొసంగుచు నన్యోన్యకోటి బెరసిన యెడఁ బ్రోదోప్రులాడి యవియుఁ గైకొనుచుం గీలాల పానంబున మత్తిల్లి నృత్యంబులు సేయుచు మఱియు ననేక[3]ప్రకారంబుల విహారంబు సలుపుచు నుల్లసిల్లిరి పదంపడి [4]యఱచినఁగు లొలుటయును దానవగణంబుకలకలంబును డిందువడియె నప్పుడు జగంబులు గొని కాలిన కాలాగ్నియుంబోలెఁ బాండవశిబిరంబు నిరవశేషంబుగా సమయించి [5]శమియించి చాపాచార్యనందనుండు [6]మే నెత్తుట జొత్తిల్లి మోహాంధ్యంబుతోఁ గలసి యునికిం జేసి సాంద్ర[7]తరరక్తసిక్తంబులైన బాహుఖడ్గంబు లేకద్రవ్యంబుచందంబు నొంద మరలి తాను బ్రవేశించుతఱి నెట్లుండె నట్ల నిశ్శబ్దం బై నయవ్విడిదల నెడలుచుండఁ దెలతెల వేగ నిట్లు బ్రతిన నెఱపి కృపకృతవర్మల పాలికిం జనుదెంచి వారలతో ని ట్లనియె.

---

201 1. బెరయం — చ. 2 గాంచున్ — శ; నేర్చున్ — వ. 3. నుత్తాల — పెక్కు ప్రతులు. 4. మున్ — పెక్కు ప్రతులు. 5. యునులీలంగ్రిందుపైపై—ఐ.ఒ.వ.శ.ప. 6. నురువడి — పెక్కు ప్రతులు. 7. గవియున్ — పెక్కు ప్రతులు.

202 1. నానాప్రకార శరీరంబులు బహుభంగి — పెక్కు ప్రతులు. 2. గలసి—అ.ఇ.ఉ.ఐ.ఒ. 3. విహారంబులు సలుపుచు—పెక్కు ప్రతులు. 4. యెడయెడ—శ.స. 5. శమయించి—కొన్ని ప్రతులలో లేదు. 6. పేరిన నెత్తుట—పెక్కు ప్రతులు; పెన్నెత్తుట—ఖ.శ.ప. 7. తర — పెక్కు ప్రతులలో లేదు.

—: అశ్వత్థామ పాండవశిబిరంబు వెడలి కృపకృతవర్మలఁ గూడికొనుట :—

సం. 10—8—140

203 సీ. సకలపాంచాలురు సమసిరి పాంచాలి
కొడుకు లందఱు జముకడకుఁ జనిరి
చేదిమాత్స్యప్రభద్రాదిబలంబులు
నిరవశేషంబుగా నేలఁ గలిసె
మాటలు పెక్కేల మానిసి గుఱ్ఱ మే
నుం గనుపేర్లఁ ద్రుంగెఁ బాండు
భూవరనందను లేవురుఁ గృష్ణుఁడు
సాత్యకియును నెందుఁ జనిరొ కాని

తే. తండ్రియును నేలి నాతఁడు దైన్యపడిన
దాని కరులపై వచ్చి యీశానువరము
[1]గాంచి మీరలు వెనుఁ బ్రాపుగాఁగ వీడు
దఱియుటకు నెంతదగునంతపఱుపఁగంటి.

204 వ. అని చెప్పిన వినుచు మున్ను రాక్షసావేశంబునం జేసి నీచపరాక్రమంబు లాచరించి తదనంతరంబ తెలిసి యారథికవరులు [1]వగం బొగులుచున్నవారు గావున నగ్గురునందను [2]నగ్గింపం దలంపక యూరకుండి తమమనోవికృతి యతం డెఱుంగ[3]కమున్న [4]తలలు వంచుకొని తగు తెఱంగు[5]నఁ బొగడిన నతండు.

205 తే. పాండుతనయులు నాచేతఁ బట్టువడుట
[1]తెగుట గలిగినను గొంతపొగడఁ దగును
[2]జలముమై రిత్త[3]వాండ్రను జంపుటరయ
మీరు గొని[4]యాడు[5]నంతటిపౌరుషంబె.

---

203 1. మీరు వెనుప్రాపుగా గనుమీశు వరము గాంచి వీడటు దరియంగ గంటినేను — చ.

204 1. వగలం బొగులు — పెక్కు ప్రతులు. 2. నగ్గింపక యూర — గ.డ. 3. కున్నం—ఆ; కుండం — ఎ. 4. తలంచికొని — పెక్కు ప్రతులు. 5. ననతనింబొగడిన నతండు — పెక్కు ప్రతులు.

205 1. తెగుటయును గల్గినను—ఊ. 2. చలముమయిరిత్త—ఉ; చలము మెయి — ఊ.ఘ. 3. కాండ్రను — అ.ఔ.క.ఘ; కాండ్రులం — ఆ ఎ. 4. యాడునెంతటి—ఈ ఎ.ఔ. 5. టది యెంత పౌరుషం — జ.

206 వ. అనిన విని వారలు ధృష్ట[1]ద్యుమ్నప్రముఖపాంచాలురను బ్రతివింధ్యాది ద్రౌపదేయులను జేరఁకొని [2]వారివారిబలంబులను [3]మాత్స్యానీకప్రభృతి సైన్యంబులను నొక్కరూపె[4]నియుఁ [5]ద్రిక్కకుండ నొక్కరుండవ రెండు జాములలో నేలం[6]గలిపితి కరం బచ్చెరువు గాదె [7]యని యతనిం గొనియా లించు[8]కొని రనుటయు సంజయునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

207 క. కురుపతికి [1]జయము గోరెడు
గురుపుత్రుఁడు మున్న యేలొకో [2]యిటు[3]తఱికిం
జొరక యెడమడిసినను మఱి
వెరవుం జేవయును జూప వేడుక వడియెన్.

208 వ. [1]అనినయమ్మహీపతి కతండిట్లనియె.

209 ఉ. పాండునృపాలనందనుల బాహుబలంబున కోడి యాతఁ డు
ద్దండతఁ గుంది యుండి వసుధావరునూరులు నుగ్గుసేసి భీ
ముండు దదుత్తమాంగము [1]సముద్ధతిఁ దన్నిన దాన శోకముం
జండతరప్రకోపము [2]నసహ్యాపువేదన సేయ నత్తఱిన్.

210 ఆ. [1]గురునిగావుతెఱఁగు [2]క్రొత్తయై మనమున
నావహిల్లుటయు[3] మహాగ్రహమున
బాసయిచ్చి రాజుపనుపును బడసి యు
దగ్రవృత్తి [4]నరిగి యట్లు సేసె.

---

206 1. ద్యుమ్నాది పాంచాలు—ఇ.శ.ష. 2. వారిని వారి—కొన్ని ప్రతులు. 3. మాత్స్య ప్రభప్రక ప్రభృతి-అ.ఇ.ఊ.క.ఘ.చ. 4. నియుంజిక్కకయుండ నొక్కరుండవు రెండు-ఆ 5. జిక్కకుండ - కొన్ని ప్రతులు. 6. గలుపుట కరం - పెక్కు ప్రతులు. 7. యనిపలికి యతనిం — పెక్కు ప్రతులు. 8. కొనిరనినసం — శ.

207 1. మేలు — జౌ ఖ. 2 యిట్లనికిం — బ. 3. దఱికి — కొన్ని ప్రతులు.

208 1. అనుటయు నమ్మహీపతికతం డిట్లనియె—ఊ.ఏ.జౌ.చ ; అనిన సంజయుం డమ్మహీ పతి — డ.

209 1. నుముద్ధతి — బ. 2. నసహ్యాత పెద్దయుజేయ — ఇ.ఊ ఘ.వ.

210 1. గురువు చావు - జ. 2. క్రోధమై — జ. 3. యునునాగ్రహము-కొన్ని ప్రతులు. 4. నాతఁడట్లు చేసె — కొన్ని ప్రతులు.

211 ఉ. తా వెసఁ బోవునప్డు బల[1]దర్పసమగ్రులు పాండుపుత్రుల
చ్చో వసియింపకున్కిఁ [2]దనచూచిన [3]గార్యమతం డొనర్చె దే
వావళికైన నత్తెఱఁగు [4]నాక్రమలీలలు [5]సెల్ల నేర్చునే
భూవర వారలున్న [6]విధిపోకలఁ బోవుట [7]గాక యింతయున్.

212 వ. అని చెప్పి విను మట్లు కృపకృతవర్మల చేత సంభావితుండై కుంభసంభవ సంభవుండు వారలతో మన మింక మనుజపతి కడకుఁ దడయక పోవలయుఁ బుణ్యంబున [1]మనము వోవునంతకుం బ్రాణంబులు గలిగియుండెనేని యిత్తెఱం గెఱింగింత మనుటయు వారలట్ల కాక యని యచ్చోటు గదలి యమ్మువ్వురును భూవల్లభసల్లాప [2]కుతూహలంబున రయంబునం జనుదెంచి.

*-: అశ్వత్థామాదిరథికత్రయంబు దుర్యోధనుం గనుంగొనుట :-*

సం. 10-9-1

213 తే. రక్తసంసిక్తమైనధరాతలమున
నార్తిఁ [1]బొరలుచు నూర్పు లందంద సంద
డింప జీవంబు వెడల [2]నుంకింపఁ జేష్ట
లొయ్యనొయ్యన యడఁగంగ నున్న యధిపు.

214 మహాస్రగ్ధర. కని శోకం బాత్మలం దగ్గలముగ రథముల్ గ్రక్కునన్ డిగ్గి [1]భూమీశ
[2]ధనువుల్ వోవైచి బాష్పోద్గమము వొదవవక్త్రంబులన్ విప్రలాపం
బును[3] దైన్యం బావ[4]హిల్లం బొరలుచుఁ బోలి నా[5]భూమిభున్ శాంతదృష్టిం
గనుఁగొంచుం [6]జేరి కేలంగముపయినిడుచుం గౌఁగిటం జేర్చుకొంచున్.

---

211 1. దర్పము గల్గిన — గ. 2. తన చూరత నాతడొనర్చె గాక (గాదె) దే — శ.ష.స. 3. కార్యమొనర్చినప్డు — ఊ ఘ ; కార్యమొనర్చె గాక — క. 4. నాగ్రహలీల — గ; 5. చెల్లివచ్చునే — క.వ. 6. పలుబోకల — గ. 7. గాదెయింతయున్ — ఖ గాదె యెంతయున్ — శ.

212 1. మన పోవునంతకు— పెక్కుప్రతులు. 2. కుతూహలంబునం జనుదెంచి— పెక్కు ప్రతులు.

213 1. బొందుచు — ఒ.ఘ.వ. 2. నూకింప — పెక్కు ప్రతులు.

214 1. వారల్—శ.ష. 2. తనువుల్ వేవైచి—కొన్ని ప్రతులు. 3. న—పెక్కు ప్రతులు. 4. హింపం — ఎ.ప.జ.వ.శ. 5. భూవరుం గొంత దృష్టిన్ — పెక్కు ప్రతులు ; భూ వరుం డాత్మ దృష్టిన్—ప ; భూ వరుం దీనదృష్టిన్—ఎ ; భూవరుంగాఢ దృష్టిన్—డ. 6. వెమ్మొ — ఊ.ఏ.ఘ.జ ; నెమ్మి — ఈ.చ.డ ; మోము — ప; ప్రీతి — శ.

215 చ. పురపురఁ బొక్కి యానృపతిపుంగవుచుట్టును నుండి యక్కటా
ధరణి సమస్తముఁ భవదుదారమహాజ్ఞకు లోను సేసి యి
ప్పరుసున [1]నీవు దీనతకు భాజన[2]మైతి విధాత కెందు దు
ష్కర మగుకార్యముం గలదె కౌరవనాయక మమ్మెఱుంగుదే.

216 క. [1]అన నప్పలుకులు వెడవెడ
విని యావిభుఁ డల్లఁ గన్ను విచ్చిన వదనం
బుకఁ జూడ్కి నిలిపి కలశజ
[2]తనయుం డిట్లనియె గద్గదగళుం డగుచున్.

217 చ. అమితబలంబు దర్పమును నద్భుత [1]ధీరతయున్ గదాపరి
శ్రమముఁ బొగడ్త కెక్కునినుఁ జక్క[2]నెదుర్చుట గాక పోర రం
ధ్రము గని యొక్కఁ డుద్ధతి గదం దెగటార్చుట [3]గల్గె నట్టె యిం
కమగల కెట్టివారలకుఁ [4]గల్గ దపాయము దైవ మల్గినన్.

218 చ. దురమునఁ [1]బెంపుఁ జేవయును దుర్దమలీల వెలుంగుచుండ సు
స్థిరత శమంతపంచకవిశిష్టతలంబునఁ బోరి [2]సద్గతిన్
బొరసె[3]దు నీకు నై వగపు పుట్టదు [4]బంధులు రాజు దేవులుం
దిరియుదు రింక వారి [5]దగు దీనత కోర్వక యుమ్మలించెదన్.

---

215 1. నిట్లు — ఈ.ఎ.ఓ బౌ.ఖ.ఒ ; నిప్డు — జ. 2. మైతె — అ.ఇ.

216 1. అని రప్పలుకులు — కొన్ని ప్రతులు ; అను నప్పలుకులు — గ; అని రప్పలుకులు దన మది విని యా ధరణీశు డపుడు వీరల గనుగొన్నను గలశజతనయుం డిట్లనియెం గద్గదిక కంఠ మందఱు కొత్తన్ — ప. 2. తనయుడనియె గద్గదంపు ధ్వని యలవడ గాన్ — చ.

217 1. విక్రమమున్ — క జ.స. 2. నెదుర్చునరాతి వర్గమున్ నమరగ జాలరయ్యమరు లైనను నీకెదు రంగ నేరింక మగల — వ. 3. నొండు గల్గెనిం — ఏ ; గల్గెనింక సె—చ; గల్గె నెట్టులిం — ష ; నెట్టి బింకముగలదెట్టివారలకు — శ. 4. గల్గు నపాయము — అ.ఇ.ఊ.క.ఘ ; గల్గదె యాపద — ద ; గల్గదెకయ్యము — గ ; గల్గదుపాయము — ఈ.ఐ.ఒ.

218 1. దెంపు — కొన్ని ప్రతులు. 2. యందఱున్ బోరసిరి — శ. 3. దు — ఏ.ట.ప. 4. అంధులు — ట ; నాకును — శ. 5. కగు — కొన్ని ప్రతులు.

219 ఉ. [1]సిరి యనారతంబుఁ దనశిష్యులలోపల [2]నెల్ల నిన్ను దు
ర్వారపరాక్రమాఢ్యుఁ డని వర్ణన సేయుట గేలి [3]చేసి యా
మారుతికిన్ జయం [4]బొసఁగె మాలవిధాతృఁడు వాని [5]గెల్వఁగో
లేరికి సమ్మతం బగునె యిట్టి[6]ది దీనను బెంపు గల్గునే.

220 చ. కురువర నీమగంటిమియుఁ గోత్తలయున్ బలముం జలంబు దు
స్తర[1]గతిఁ బేర్చి భీమునకుఁ జావక పోవఁగ రాని[2]యట్టి దై
నరు బెదరించి కేశవుమనంబు గలంచి యధర్మ వృత్తికిం
జొరుఁ [3]దని పంచె దీని దివిజుల్ గని రిఁకిట వేయు నేటికిన్.

221 ఉ. [1]ధర్మము [2]మాని యూరులు గదం బొడి [3]సేసినయంతఁ బోక దు
ష్కర్ముఁడు వాయుజుం డెడమ[4]కాల శిరంబటు[5] దన్నెఁ జూచి యా
ధర్మసుతుండు [6]శాన్తిఁ దగ దానికిఁ జేయఁడ యాతఁ [7]డెప్డు నం
[8]తర్మదదుష్టుఁ డీగెలుపు దైన్యము సేయదె కీర్తి మాయదే.

222 క. కౌరవనాయక నీదు గ
దారణ[1]గౌరవము సకలధరణీజనచే
తోరంజనమై నిర్మల
సారయశోధనము నీకు సంపాదిం[2]చెన్.

---

219 1. సిరియు సంతతంబు - శ.ష. 2. నిన్ను బ్రేమ — కొన్ని ప్రతులు. 3. చేసెనే — పెక్కు ప్రతులు. 4. బొసగి — పెక్కు ప్రతులు. 5. కెట్టిగెల్వేరికి — పెక్కు ప్రతులు ; గెల్వుదానేరికి - ఐ.ఒ.ట. 6. జయంబున — డ.

220 1. ధృతి — పెక్కు ప్రతులు ; ముగ — ఈ.ఏ.జొ.గ.చ ; మతి — శ. 2. దట్టిదై- అ.ఇ.ఈ.ఐ.ఒ.వ. 3. మని — కొన్ని ప్రతులు.

221 1. ధర్మువు — కొన్ని ప్రతులు. 2. దక్కి - పెక్కు ప్రతులు. 3. చేసియునంత- కొన్ని ప్రతులు. 4. కాలను దన్నె శిరంబు — శ.ష. 5. దన్న - పెక్కు ప్రతులు. 6. శాంతి — కొన్ని ప్రతులు. 7. డెప్పుడుం — పెక్కు ప్రతులు. 8. ధార్మికుడంట యాగెలుపు—ఐ.ఒ ; ధర్మపథంబు దప్పదని దైన్యము—శ ; ధర్మగరిష్ఠుడే గెలుపు- అ.ఏ.

222 1. కౌశలము — ఖ. 2. చున్ — పెక్కు ప్రతులు.

223 వ. అని పలికి తనమానుషంబు తెఱంగు గూహించి.

324 చ. కుడువఁగఁ గట్ట బంధులకుఁ గోటివిధంబులఁ బెట్టి జన్నము
ల్నడుప ననేకధర్మవిధులం బొగ డొందఁగఁ జాలునట్టియె
క్కుడుసిరి యిచ్చి పేర్మి నొకకొండగ మన్చిననీవు సావఁగా
[1]నొడ లిటు [2]లోమితిం గురుకులోత్తమ యే నొకసేవకుండనే.

225 వ. అని తన్నుఁ [1]దాన నిందించుకొనుచు మఱియు.

226 ఉ. న్యాయము దప్పకుండఁగ రణంబొనరించి దివంబు గైకొనం
బోయెద వందు రాఁ దగినపుణ్యము సేయుట లేదు గాని [1]మా
చేయు [2]మనంబునుం ద[3]నియఁ జెందఁగఁ బద్ధవిరోధివర్గముఁ
[4]నీయెడ కిం బొన[5]ర్పఁగ గణింపఁగ భాగ్యము గల్గె భూవరా.

227 ఆ. [1]పుణ్యలోకమునకుఁ బోయిన యప్పుడు
ద్రోణుఁ గాంచి నీకు [2]ద్రోహి యైన
జనవినింద్యచరితుఁ జంపె ధృష్టద్యుమ్ను
డనఘ నీతనూజుఁ డనుము తొలుత.

228 వ. అని నామాఱుగా నమస్కరించి కౌఁగిలించుకొనుము మఱియు వలయు
సల్లాపంబులు సేయుము బాహ్లీకసోమదత్తభూరిశ్రవస్సైంధవప్రముఖ
భవదీయబాంధవజనంబులతో నాచేసిన కుశలప్రశ్నంబుగా సంభావింపు మది
య ట్లుండె రేయింటి తెఱంగెఱింగించెద.

---

224 1. నుడుగక చూచితిం – శ. 2. నోమతి – అ.ఇ.

225 1. దాన – పెక్కు ప్రతులలో లేదు.

226 1. నా – కొన్ని ప్రతులు; కొంతేయు మనంబునందనివి – ఉ. 2. రణంబునం దునియ
జేయగ – డ. 3. తనివి – ఉ.శ. 4. నీయెద – ఊ.శ.ష ; ధీయుతనీదువద్దగణు
తింపగ – జొ. 5. ర్పగణుతింపగ – పెక్కు ప్రతులు.

227 1. పుణ్యలోకంబునకు నేవు బోయినపుడ ద్రోణునిం గాంచి నీకును ద్రోహుడైన–ఈ.
2. ద్రోహుడైన – పెక్కు ప్రతులు.

229 సీ. అమృతంబు నింపు కర్ణములకు నొసఁగెడు
మాటలాకర్ణింపు మనుజనాథ
శాత్రవ[1]శిబిరంబు సౌప్తికవేళఁ బ్రి
వేశించి నీచుఁ [2]గిల్బిషమయాత్ముఁ
దొలుత ధృష్టద్యుమ్నుఁ ద్రుంచితిఁ బశు[3]మర
ణంబుగాఁ దదనంతరంబ కవిసి
వానిబంధుల నెల్ల వరుస గీటడఁగించి
ద్రౌపదీసుతుల నందఱను బొదివి
తే. మిడుకమిడుకంగఁ జంపి యప్పుడమి యెల్లఁ
దునియ వెంటఁగఁ గరివాజిమనుజతతుల
నెల్ల నఱికితిఁ బాండవు లేవురును ము
రారియును [4]సాత్యకియును నాబారిఁబడరు.

230 వ. [1]అని చెప్పి.

231 ఉ. ఏ మటు [1]పోక శౌరి మది నేర్పడ మఱఁగని డాఁగురించెనో
యేమిటి కెందుఁ బోయిరో నరేంద్ర యెఱుంగము ధర్మదూష్య సం
గ్రామ విధంబు[2]లం జయము గల్గియు వారికి దక్క దయ్యె వా
రే మయి [3]రేమి మాకెలస మెక్కె నెఱుంగుము మమ్ము ముప్వురన్.

232 వ. అని కలిపి కొని [1]పలికి కృపకృతవర్మల వలనుం జూపి.

233 క. వీరి వెనుఁ బ్రాపు వడసినఁ
గౌరవకులనాథ యేనకా దరయంగాఁ
జీరికిఁ [1]బోవని వారును
వైరుల సమయంగఁ జేయ వలఁతులకారే.

---

229 1. సైన్యంబు — ఆ ఎ.ఔ.ట. 2. విద్విషు దురాత్ము — ఈ. 3. హననంబుగా — ఈ ఏ.చ. 4. సాత్యకులును నాదు బారి — ఆ.ఎ.ఔ.ఖ.

230 1. ఈ వచనము కొన్ని ప్రతులలో లేదు.

231 1. పోవ — కొన్ని ప్రతులు. 2. నన్ — పెక్కు ప్రతులు. 3. రేని — ఐ.ఒ ఓ.ప.

232 1. పలికి — పెక్కు ప్రతులలో లేదు.

233 1. బోయిన వారలు — గ.

234 వ. అనిన నమ్మాటలు మనఃప్రియంబు లై నాలుకకు లావిచ్చిన నాభూవరుం డమ్మహీసురవరున కిట్లనియె.

235 క. నీవును [1]నీయోధవరులు
నావైరులఁ [2]బఱిచినంత యాచార్యుండున్
దేవవ్రతుండుఁ బఱిచిరె
భావింపఁగ దుష్కరంపుఁ బని యిది యనఘా.

236 ఆ. కర్ణు మనము పెద్దగాఁ గొని[1]యాడుదు
మతనికంటె శల్యుఁ డధి[2]కుఁ డందు
[3]రతఁడు నతఁడు నిట్టి[4]యాక్రమంబున నాకుఁ
బ్రియము సేయఁ జాలిరే మహాత్మ.

237 వ. అని యమ్మువ్వుర మొగంబులు గలయం గనుంగొని మీరు కృతకృత్యులరు సుఖుల రై యుండుఁడు పునర్దర్శనంబు త్రిదివంబున[1]నయ్యెడుఁ గాక వగలు మాని పొం డని పల్కి ప్రాణంబులు విడిచిన వార లవ్వసుమతీపతిఁ గౌఁగిలించుకొని వలగొని వచ్చి మరలిమరలి చూచుచు నరదంబు లెక్కి యరిగి రంత నుదయగిరిశిఖరంబు ఖరకరుండు వచ్చె నేను నిత్తెఱంగు నీ కెఱింగింపవచ్చితి నాహవప్రకారం బంతయు నీకు వినిపించుటకు నాఁడు [2]మునీశ్వరుండు నన్నుఁ బనిచి యొసంగిన దివ్య[3]దర్శనత్వంబు నీ కొడుకుతోడిద యయ్యె నని యిట్లు సంజయుండు ధృతరాష్ట్రునకు నశ్వత్థామాదిరథికత్రయవ్యాపారకథనపూర్వకంబుగా దుర్యోధనలోకాంతరగమనంబు సెప్పె ననిన విని [4]యటమీఁదఁ బాండునందను లెవ్విధంబునం బ్రవర్తించి రని యడుగుటయు[5].

---

235 1. నియోధవరులను - కొన్ని ప్రతులు. 2. బరచి - పెక్కు ప్రతులు.

236 1. యుండుదు — కొన్ని ప్రతులు. 2. కబలుడు — ఈ. 3. నతడు — ఈ. 4. యాహవంబున — ప.శ.ష.

237 1. నయ్యెడుమని — ఉ.క.ఘ. 2. కృష్ణద్వైపాయనముని — కొన్ని ప్రతులు. 3. దృష్టినీకొడుకు—ఐ.ఒ. 4. జనమేజయనరేంద్రుండట మీద—ఉ.గ. 5. వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె - డ.

238 మహాస్రగ్ధర. పరమజ్ఞేయస్వభావాభవభయహరణప్రౌఢనామానుభావా
కర[1]ఖేలచ్చక్రశూలా కలుషహృదయసాంగత్యవైముఖ్య[2]శీలా
కరుణాయత్తాంతరంగా కమలభవముఖానేకకంజసంవాసక్త్యంగా
దురితధ్వాంతప్రదీపాతులనిరసనసంస్తుత్య[3]నిర్భాసరూపా.

239 క. పరిణామ[1]గమ్యనిగమా
వరనిష్ఠాసంపదచలభావనరమ్యా
[2]నిరుపమ సౌందర్య తప
శ్చరణ[3]నిరతహృదయకమల [4]సముదిత సూర్యా.

240 మాలిని. చరణయుగళకాంతిస్ఫారలీలా[1]నిరూఢా
దరసుఖమయయుక్తా ధర్మ[2]శీలానురక్తా
సురసముదయ[3]రక్షా [4]సువ్రతానంగ హేలా
కర[5]మహిమకటాక్షా గాఢపర్వానుపేక్షా.

గద్యము

ఇది శ్రీమదుభయకవిమిత్ర కొమ్మనామాత్యపుత్ర
బుధారాధన విరాజి తిక్కనసోమయాజి
ప్రణీతంబైన శ్రీమహాభారతంబున
సౌప్తిక పర్వంబు నందుఁ
బ్రథమాశ్వాసము.

---

238 1. ఖేలాచక్ర — ఒ.ఓ.స శ.ష; కేళీచక్రి — గ.ట. 2. లీలా — పెక్కు ప్రతులు. 3. నిర్వాణరూపా — ఆ.ఎ డ.

239 1. నియమగమ్యా పరినిష్ఠా — ఏ.జ; నియమా — పెక్కు ప్రతులు. 2. నిరుపాధిక శౌర్య — అ ఇ ఊ.ఔ.క.ఘ ట.వ. 3. నియతహృదయ — ఏ.ఔ.వ. 4. సమధిక సూర్యా — వ; సముదయ సూర్యా — ఈ.

240 1. నురూఢా — అ.ఇ ఎ ఒ.ఓ ఖ.ప.ల; నురూపా — డ. 2. లీలానురక్తా — కొన్ని ప్రతులు. 3. పక్షా — వ. 4. సువ్రతానంద — ఎ.చ. 5. మహిత — కొన్ని ప్రతులు.

—::—

# శ్రీమదాంధ్ర మహాభారతము

## సౌప్తికపర్వము - ద్వితీయాశ్వాసము

1 క. శ్రీశాశ్వతత్వ[1]కరణక
లాశాలిదయా[2]దినిర్మలజ్ఞాన[3]మయా
నాశోత్పత్తిరహిత శు
ద్ధాశయసంభజన [6]మహిత హరిహరనాథా.

2 వ. దేవా [1]వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు సూర్యోదయం బైన యాసమయంబున సమీరనందనాదిసోదరులును శౌరిసాత్యకులుం బరివేష్టింపనున్న ధర్మతనయు పాలికిఁ [2]బఱతెంచి ధృష్టద్యుమ్నుని సారథి సాష్టాంగదండప్రణామం[3]బు సేసి కరకమలంబులు [4]మొగిడ్చి.

3 సీ. నరవర మనవీడు [1]నడిరేయి [2]కృతవర్మ
యును గృపాచార్యుండుఁ దనకుఁ దోడు
గా వచ్చి జనులు నిద్రావివశాత్ములై
యుండనశ్వత్థామ [3]యొకఁడు సొచ్చి
తొలుత ధృష్టద్యుమ్నుఁ దునిమి తత్సోదర
తనయాదిపాంచాల తతులమిట్టి
యన్యాయవిధి[4]ని నింద్యం బైన విక్రమ
లీలాతిశయమున నేలఁ గలిపి

---

1 — 1. కరుణ – పెక్కు ప్రతులు. 2. వినిర్మల – పెక్కు ప్రతులు. 3. నిధీ – అ.ఎ. సుజన – ఊ.ద.న.వ.

2 — 1. జనమేజయుండటమీఁద కథాశ్రవణకుతూహలుండై యడిగిన వైశంపాయనుం డిట్లనియె నట్లు సూర్యోదయం బైన – ఊ.ఘ.వ. 2. జనుదెంచి – కొన్ని ప్రతులు. 3. ఆచరించికరంబులు – పెక్కు ప్రతులు. 4. మొగిచి యిట్లనియె – పెక్కు ప్రతులు.

3 — 1. నడురేయి – పెక్కు ప్రతులు 2. గృపకృతవర్మలు బాహుగర్వంబు తోడు – శ.ష. 3. యొకడ వచ్చి – ఐ.ఒ. 4. వినింద్యం బైన – పెక్కు ప్రతులు.

ఆ. చేది బలము నెల్లం జెండి మాత్స్యప్రభ
ద్రకులు మేలుకాంచి ద్రౌపదేయు
[5]లను శిఖండిఁ [6]గూర్చికొని తన్నుఁ దాకిన
[7]బెట్టు [8]చంపె నంతవట్టువారి.

4 వ. మఱియును.

5 స్రగ్ధర. వీడెల్లం [1]దల్లడిల్లన్ వివిధగతులమై విక్రమోల్లాస మొందం
గ్రీడాకల్పంబుగా నాకృతిఁగని ప్రజశంకించి [2]దైత్యుం డనం జెం
డాడెన్ [3]శీర్షవ్రజంబున్ వారులగముల వేఁటాడె నేనుంగులం దు
న్మాడెం గాఁ ఉేయ హేలాభ్యసనలసితబాహోగ్రఖాభిషణుండై .

6 తే. అడవి దరమిడి నలుకంగ నందుఁ గల వి
[1]హంగమంబులు [2]గలగొన నఱచు తెఱఁగు
[3]దోఁచె నాతఁడు యోధులఁ దునుమఁ [4]గలఁగి
యన్యజనము లాక్రందించునప్పు డధిప.

7 క. అఱచినఁ బఱచిన ప్రేళులు
గఱచిన నతఁ డించు[1]కయును గరుణింపక యం
దఱ [2]నుఱుముసేసె [3]గుంపుల
[4]యుఱికి ఖడ్గ[5]దారుణోల్లసనములన్.

8 వ. ఆ సమయంబున.

---

5. లును — పెక్కు ప్రతులు. 6. గూర్చుకొని — పెక్కు ప్రతులు. 7. బిట్టు — అ.ఈ.ఏ.ఔ.ఖ. 8. సంపె — పెక్కు ప్రతులు.

5 1. దల్లడిల్లెన్ — బ.ల. 2. దైత్యుండునా — ఆ. ఈ.ఏ.గ.చ; దైత్యుండనాచెం — పెక్కు ప్రతులు 3 యోధవ్రజంబున్ — ఏ ఏ.ఔ.చ. 4. సంక్షోభలీలా — డ.

6 1. హంగములు భీతి దోచంగ నరచు భంగ — క.ఘ. 2. వలగొని — ఐ బ.ల. 3. దోప నా యోధవరులను దునుమగలగి — ఊ.క.ఘ 4. గడగి — అ.ఇ.గ.ఘ.

7 1. కేని కరుణింప — ఈ.చ.ట. 2. నుగ్గుచేసె — పెక్కు ప్రతులు; నుగ్గు చేసి — ఏ.చ. 3. కుప్పల — ఐ.బ.బ.వ. 4. నరకె — ఏ.చ. 5. దారుణోల్లా సమునన్ — అ.ప.బ.

9 మహాస్రగ్ధర. కృపుఁడున్ హార్దిక్యుఁడుఁ వాకిట నిలిచి భయార్తి ప్రయోధ వ్రజంబున్
నృపులుఁ వే నిర్గమింప న్వివిధశరముల న్మేదినిం గూల్చుచుఁ ఘో
రపుసంరంభంబు దుర్వారముగఁ గెరలి రౌద్రంబు రూపంబు దాల్పం
గుపిత క్రవ్యాదులో నాఁ గుచరితనిరతిం గూరి రత్యాధుర్యు లై నన్.

10 వ. తత్ప్రదేశంబు నవ్వీటిలోనుంబోలెఁ బీనుంగు పెంట యయ్యె నట్లు శిబి
రంబునం గల కరితురగనరనికరంబులు నిశ్శేషత్వంబు నొందె నాయు
శ్శేషంబుకతంబునం గృతవర్మచేతం బట్టువడి యతండు [1]మందల విడువ
నిట వచ్చితి నని చెప్పినం బాండవాగ్రజుండు.

11 తే. శోక[1]వేగసంతప్తుఁ డై [2]సొలసి వ్రాల
సంభ్రమమ్మునఁ బట్టిరి సాత్యకియును
[3]గవలు భీమసేనుండును గరతలముల
నుమ్మలికము నెమ్మనములఁ [4]గ్రమ్మ దేర.

12 వ కొండొకసేపునకు మూర్ఛ దేఱి యన్నరపాలుం డెలుంగు రాల్పడ నిట్లనియె.

-: ధర్మరాజు తనపుత్రు లశ్వత్థామచేఁ జచ్చుట విని పలవించుట :-

సం. 10-19-9

13 సీ. ఎట్టి[1]వారల కైన నెఱుఁగంగ నగు నె[2]కా
ర్యంబులగతు లుపాయంబు [3]బలుపు
వెలయంగ నట్లు శత్రుల బంధుమిత్ర పు
త్రామాత్యయుతముగ నాహవమున
[4]నందఱ నేఁ దెగటార్చినవాఁడనై
విజయంబు సేకొని విభవ మెసఁగ

---

10 1. ముందల — పెక్కు ప్రతులు.

11 1. వేదన తప్తుడై — ఈ.ఊ.క.ఘ.చ.వ. 2. సొగసి — ఈ.ఉ.ఏ.జౌ.జ.బ; సొగిసి — అ.ఇ.ఎ.ఒ.క.ఖ.గ. 3. నరుడు — ఈ; కవ్వడియు భీమసేనుండుకర — ఞ; కవ్వడియును భీముండును కరతలమున — ప 4. క్రిమ్మదేర — పెక్కు ప్రతులు.

13 1. వారికినైన — పెక్కు ప్రతులు 2. కార్యముల మేలును నుపాయంబు — ఐ.ఒ.శ.ప. 3. బలిమి — శ.ప. 4. నరయనందర దెగటార్చినవాడనె — ఐ.ఒ.ఓ.డ.

నిట యేఁగుదెంచితి నట బంధుమిత్ర పు
త్రామాత్యయుతముగ నస్మదీయ

తే. బలము నెల్లను ముట్టి శత్రులు నితాంత
ఘోరముగఁ దెగటార్చిరి కుత్సితంపు
విధము వాటిల్లె నస్థిర[5]విజయమునఁ బ
రాజయమనియాడు నింక ధరాజనంబు.

14 స్రగ్ధర. బాణజ్వాలానితాంతప్రసరణముల శుంభద్ద్విషత్సాంద్రసైన్య
శ్రేణీకాంతారముల్ చూర్ణితములుగఁ బటుక్రీడమైఁ [1]దేజరిల్లెన్
ద్రోణాచార్యాగ్ని వేఁడిం దొడరక మెఱసెన్ దోర్విలాసంబు వైరుల్
[2]ప్రాణంబుల్ నాఁచి[3]కోల్ దప్పదు తుది విధి యబ్బాలురం ద్రెళ్లవైచెన్.

15 **మహా**స్రగ్ధర. శర[1]దంష్ట్రాభీషణం బై చటుల రిపుమృగస్వైరవిధ్వంసలీలా
స్ఫురణన్ శోభిల్లు రాధాసుతుఁ డనుపులి [2]విస్ఫూర్జితంబున్ సహింపన్
వెరవున్ దర్పంబు గల్గెన్ [3]వికల రిపులచే వీటఁ బోయెం గుమారో
త్కర మిం కేమందు నాపత్పరికలన ప్రమాదంబునం గాక యున్నె.

16 స్రగ్ధర. శాతాస్త్రస్ఫారవీచీసముదయరభసాశ్చర్యసంపాదిహేలా
స్ఫీతంబై క్రమ్ముదేరన్ బెదరక [1]కలఁచెన్ భీష్మవారాశిఁ [2]దుశ్చా
రాతివ్యాపారదుర్వారతఁ దెగియెఁ గుమారవ్రజం బక్కటా ని
ద్రాతంత్రావ్యాప్తి నక్రూరతఁ బొరసి భుజాప్రౌఢి వమ్మయ్యెఁ జుమ్మీ.

---

5. విజయమును పరాజయమ యని యాడుధరాజనంబు — డ.

14 1. దేజరిల్లన్ — పెక్కు ప్రతులు. 2. ప్రాణంబుల్ దాచికోల్ — ఆ.ఎ.ఒ.ఔ.ఖ.న.బ.స; ప్రాణంబుల్ గాచికోల్ — అ.ఇ.ఈ.ఏ.క.ఘ.డ.వ; ప్రాణంబుల్ దాచికోల్ — స. 3. కోలుంబడుటకు — ఈ.చ ; కోల్పంపక — శ; కోలైపక — ఒ.ఔ.వ.

15 1. జిహ్వా — బ.శ.ష; విద్యా — వ. 2. విస్ఫూర్తి పెంపున్ — ఒ.ఓ.ఔ.ట.డ.న.బ.వ.శ.ష. 3. వెలయ — ఆ.ఎ ; వికట — ఈ.ఓ.చ.ట.

16 1. గడచెన్ — ఔ.వ. 2. దుష్టా — ఒ.ఓ.ఔ.ఖ.న.బ.వ.

17 ఆ. అధిక [1]బలము గెల్చి యవనీపతులు గొంద
ఱతివిహీనరిపులయాక్రమమున
మడిసి రకట జలధి[2]వెడలి సన్నపుఁ [3]గయ్య
మునిఁగి రూపడంగుజనులమాడ్కి.

18 చ. జనకుఁడు [1]లేమికిం గడువిషాదము [2]నొందెడికృష్ణ యిమ్మెయిం
దనయులు భ్రాతలుం దెగుట దా విని మూర్ఛ మునుంగు నెమ్మనం
బును [3]నవశంపుమేను నయి భూస్థలిఁ ద్రెళ్లక యున్నె [4]త్రెళ్ళదే
నిని బటుశోకవేగమున నిర్భరవేదనఁ [5]జెంద కుండునే.

19 క. మున్నిట్టితెఱఁగు శోకం
బెన్నఁ[1]డు దా ననుభవించి యెఱుఁగ దకట నేఁ
డన్నెలఁతయలఁతపెల్లున
[2]నెన్నియవస్థలకు వచ్చి యెట్లయ్యెడినో.

20 వ. అని వగలం బొగిలి పాంచాలి రాపింపం దలంచి తనపనుపున నవ్వేలంది ద్రుపదవిరాటులు చచ్చినమఱునాఁడు తదీయ[1]పత్నులకు శోకాపనోదంబు సేయుటకై సుభద్రయు నుత్తరయును దోనరుగ విడిదలనుండి విరాటు పురంబునకరిగి ద్రుపదుండును గొడుకులు నవ్విటికి వచ్చునాఁడు దోడన వచ్చి కోడండ్రును దానును నందయున్న యాద్రుపదు[2]పత్నినివిరాట పత్నిం గాంచి పదంపడి సుభద్ర యర్జునుననుమతి వడసి ద్వారవతికిం బోవ నమ్మత్స్యపురంబున నునికిం జేసి యన్నరనాథుండు నకులుం గనుంగొని యతిత్వరితగమనంబునకుం దగురథంబునం జటులంబులైన రథ్యంబులం

---

17 1. బలుల — శ.ష. 2. గడచి — డ. 3. గయ్య — బొ.జ ట.డ ప.శ; గాల్వ — ఊ.ఘ. 4. పడిన యట్టి — ఒ.న.వ.శ.

18 1. చచ్చిచన్ — ఆ.ఎ; లేమినిం — జ. 2. బొందెడు — పెక్కు ప్రతులు. 3. నవశంబు — కొన్ని ప్రతులు. 4. తేరనవ్విని — శ; త్రెళ్ళదేనిని — బొ; తెఱ నేవిని — వా. పెక్కు ప్రతులు. 5. బొందకుండునె — పెక్కు ప్రతులు.

19 1. దునుంగుడిచిచూలు — ఒ. 2. దన్నెఱుఁగని పరవశమునఁ దానెట్లగునో — ఒ.బ.వ.శ.

20 1. పత్నీ జనంబులకు — పెక్కు ప్రతులు 2. పత్నిని విరాటపత్నిం — పెక్కు

బూన్చికొని [3]యుపప్లావ్యంబునకుం జని ద్రుపదనందనను దక్కును [4]మన దెసం గలుగు నంగనలను ద్రుపదమత్స్యపతి[5]పత్నంబుభామలనుదోడ్కొని యవ్విడిదలకుం జను[6]దెమ్మని చెప్పి యేము నయ్యేడకుం జనుదెంచెద మను టయు నతండు తదుక్తప్రకారం[7]బున జనియె నజ్జనవల్లభుండు తక్కటి తమ్ములును దామోదరసాత్యకులును నడలుచుఁ దన్నుం బొదివికొని చనఁ గౌరవశిబిరంబునం గల[8]జనంబులు గొల్చి వోవ నేచ్చుచు నిజశిబిరంబున కుంబోయి తత్ప్ర[9]దేశంబున.

21 మహాస్రగ్ధర. స్ఫురదశ్వత్థామచంచద్భుజలసదసి విస్ఫారితక్రూరధారా
పరి[1]కృత్తావ్యక్తగాత్రప్రకరులసఖులన్ బంధులం బుత్రులం దాఁ
గరుణం [2]బుప్పొంగ నార్తిం గనుఁగొని వికలాంగత్వముం బొంది మూర్ఛా
పరతంత్రుం డై ధరిత్రిం [3]బడినఁ బడిరి తద్భ్రాతలుం గేశవుండున్.

22 వ. ఇట్లు పడి సాత్యకిప్రయత్నంబున నందఱుం దెలిసిరి ధర్మనందనుండు వెడ వెడ దెలిసియు మగుడ నిగుడు నడలున మనంబు మునుంగ వెగ[1]డొంది నందనులతనువు[2]ల మీఁద[3]వదనంబు బాష్పాంబుధారాక్రాంతంబుగాఁ బ్రక టాక్రందనంబు సేయుచుఁ బలవించు[4]చుండెఁ గృష్ణార్జునులు సముచిత భాషణంబుల బోధించిరి తక్కటివారును దగుమాటల [5]నుపచరించిరి కొం డొకసేపునకు నవ్విభుండు రోదనంబు దక్కె.

---

ప్రతులు ; పత్నింగాంచి — వా. 3. నీవుపప్లావ్య — కొన్ని ప్రతులు. 4. మన దెసం — కొన్ని ప్రతులలోలేదు. 5. పత్నంబుల — పెక్కు ప్రతులు. 6. దెమ్మ మేమును నయ్యేడకు వచ్చెద — పెక్కు ప్రతులు. 7. బుననతిత్వరితంబుగా — ఈ.ప.చ.ట. 8. హతశేషులైన జనంబు తమ్ముచూచి భయంబు నొంద వారల కభయం బిచ్చుచు జని నిజశిబిరం — డ.

21 1. పిక్త్యావ్యక్త — ఎ.ఒ ఓ.ఔ.బ.వ. 2. చొప్పంగ — అ.ఎ.చ.జ.శ. 3. బడియె— ఆ.ఎ.

22 1. డందుచు — పెక్కు ప్రతులు. 2. లంటిచూచి — శ.ష. 3. వ్రాలుచు వదనంబు — పెక్కు ప్రతులు. 4. చుండ — పెక్కు ప్రతులు 5. ననున యించిరి — పెక్కు ప్రతులు

23 తే. పుత్రులకు బాంధవులకును మిత్రతతికి
నగ్నికార్యంబు వొగులుచు నాచరించి
యొక్కచోట నాసీనుఁడై యుండె ద్రుపద
తనయ వచ్చుట [1]వార్చి నెమ్మనము [2]దలఁ.

24 వ అద్దేవియు నకులు[1]నిచేత నుపప్లావ్యంబున సుతసోదరమరణప్రకారంబు వినుటం జేసి.

25 క. అల త గదిరి నోరెం[1]డఁగఁ
బలవించుచుఁ దోడుతోడ [2]బాష్పజలం బ
గ్గలమై క్రమ్మఁగ [3]సొలయుచుఁ
దెలియుచు నాతనికి నడలు దీపింపంగన్.

26 వ. అరుగుదెంచి యంతంత నవసీకాంతుఁ గాంచి యధికశోకాక్రాంతయై యార్తిం గూరి యాక్రందనంబు సేయ నమ్మాద్రీపుత్రుం డొయ్యన యయ్యంగన నరదంబు డించె నుచితవాహనంబుల నెక్కి తోడన వచ్చిన వనితాజనంబు లవతరణంబు సేసి వనట వందురుచుఁ బరివేష్టించి రప్పు డావధూరత్నంబు.

27 క. పెనుమంచునఁ జెలు [1]వేదిన
వనజంబునుబోలె నశ్రువారిపరీతా
ననము [2]చెలువెడలఁ గొడుకులఁ
బనవుచుఁ జరణములు తొట్రువడ దీనగతిన్.

---

23 1. వినియు – ఉ; చూచి – ఎ.క.ఘ; కోర్చి – గ వ. 2; వలక – ఉ.ఊ.ఎ.ఏ. ఒ.ఔ.ఘ.ట.వ.

24 1. చేత – పెక్కు ప్రతులు.

25 1. డన్ బలవించు – కొన్ని ప్రతులు. 2. బాష్పాంబువుల – క.ప. 3. సొగి యుచు – పెక్కు ప్రతులు; సొగసియు – వ.

27 1. వెడలిన – ఆ. ఎ.ఔ. 2. పొలువెడల – ఐ.ఒ.ఓ బ; పొలుపడగ – వ.

28 వ. కొన్ని యడుగులు వచ్చి వసుధాతలంబున ౖవాలిన వేగంబ [1]వాయునంద నుం డాౖదుపదనందనఁ ౖగుచ్చి యె_త్తి ధర్మసూనుసమీపంబునకుఁదెచ్చిన నమ్మగువ మగుడ నిలం బడి యమ్మహీపతియాననం బాలోకించి యెలుంగు రాలుపడ దైవమానుషంబులు సుసంగతంబు [2]లై యుండుటయు నతనికి సామ్రాజ్యంబు చొప్పడుటయు నుగ్గడించి.

29 చ. కలిమికి నొప్పుగాఁగ బలగంబయి నీకడ నాతనూభవుల్
మెలఁగఁగఁ జూడ గానన యమేయభుజాబలశాలి విక్రమో
జ్జ్వలుఁడు సుభద్రపట్టి[1]యును వ మ్మయి పోయె ననూనభోగముల్
గలిగినయేనియుఁ మఱవఁగా వశమే మన కాకుమారులన్.

30 వ. అని యప్పు డశ్వత్థా[1]మోద్దామరణకరణస్మరణంబు దనచి_త్తం బు_త్తల పెట్టఁ గోపంబు దీపింప నాసీన యై.

31 క. ఘోరమణ గాఢనిద్రం
గూరినసమయమున ముట్టికొని నాసుతులం
గ్రూరతఁ దెగ[1]టార్చెను బా
పారంభుఁడు గురుతనూజుఁ డక్రమలీలన్.

32 క. అది యాఅని పెనుఁజిచ్చై
మదిఁ [1]గాల్పఁ దొడంగె దీని మాన్ప నుపాయం
బు దలంప నొండు లేద
య్యుదయుని [2]ముట్టుకొని నామమడఁచుట దక్కన్.

---

28 1. చని వాయునంద — పెక్కు ప్రతులు 2. లగుట యతనికి — పెక్కు ప్రతులు.

29 1. యటు — పెక్కు ప్రతులు ; సహజన్ములు లేకను నెంత భోగముల్ — ఐ బ.

30 1. మదారుణ — శ.ష.

31 1. జూచెం — పెక్కు ప్రతులు ; టార్చెను — ఖ.ప.

32 1. గాల్ప — పెక్కు ప్రతులు. 2. ముట్టికొని — కొన్ని ప్రతులు.

33 క. వాయుసుతుఁ బనిచి నేఁడటు
సేయింపక తక్కితేనిఁ జెప్పెద వినుమేఁ
బ్రాయోపవేశ[1]మున నీ
కాయ ముపేక్షింతుఁ [2]జుమ్ము కౌరవనాథా.

34 వ. అనుటయు నమ్మనుజపతి యమ్మానిని కిట్లనియె.

35 క. క్షితిపతితనయులు పోర
న్మృతిఁ బొందుట తగునకాదె నీసోదరులున్
సుతులు నతిపుణ్యపురుషో
చితసుగతులు గనిరి వగలఁ జేదృడ నేలా.

36 వ. మనస్వినివైన నీ కుపశమించుట గర్తవ్యంబు శోకంబు దక్కు మశ్వత్థామ యొనర్చినపరాభవంబునఁ బుట్టినయలుక దాని సమయింపక పోదని చెప్పుటయ కాదు నాతలంపును నిట్లవాఁ డడవిం గలసినవాఁడు గానోపు సమయించుట నీ కెల్లెలుంగ నగుఁ జెప్పు మనిన నప్పొలతిఁ యప్పాపాత్మునకు సహజంబైనశిరోమణిగలదు దానిం దెచ్చి యిచ్చిన జూచి జీవంబుతో నుండెద ననితలంచితి నని పరుషాక్షరంబుగాఁ బలికి యప్పవమానతనయుఁ దనపాణితలంబున సంస్పృశించి.

37 ఆ. క్షత్రధర్మ మాత్మఁ గైకొని రయమున
నరిగి పాపకర్ముఁ డైన కుంభ
జన్మతనయు ముట్టి చంపుము నామది
కనలు నడలు నుడిపి కావు నన్ను.

38 వ. [1]వెండియు.

---

33 1. నంబున – పెక్కు ప్రతులు; మతినై – ఐ.ఒ ఓ.జౌ. 2. విజము – ఇ.

38 1. అని వెండియు – పెక్కు ప్రతులు.

—: ద్రౌపది యశ్వత్థామం బరిభవింప భీమసేను నియోగించుట :—

సం. 10–11–21

39 సీ. జతుగృహదాహావసరమునఁ జేసిన
సముదీర్ణతరపౌరుషంబుతోడ
నత్యుగ్రుఁ డగుహిడింబాసురు[1] వచ్చిన
చోటఁ గైకొన్న నిష్ఠురతతోడ
యతులు పొదివిన యపుడు[2] వాటించిన
యాఖిలదోర్బలవ్యాప్తితోడ
సమధిక[3] బలుఁడు గీచకుని యేఁచినయెడఁ
బూనినవిక్రమ [4] స్ఫూర్తితోడఁ

ఆ. గూడ [5] నిన్ను జనులు గొనియాడునట్లుగఁ
జనుము [6] నీదుబలముఁ జలము [7] మెఱయ
[8] గీటడంపు మనల గెలిచితి నని గర్వ
మున దనర్చు ద్రోణతనయు [9] నెట్లు.

40 వ. అనిన విని యగ్గురుపుత్రుదెసం బొడమిన[1] మయర్షంబున మేను వొంగఁ బవమానసూనుండు ద్రుపదనందనతో ధర్మనందనుం డాడిన [2] మాటలశ్వత్థామపైఁ బోవుట కను[3] మతిగా నంతరంగంబున నంగీకరించి.

41 మహాస్రగ్ధర. కనకప్రస్ఫీతరత్నోత్కరపరి[1] విసరత్కాంతి రాజన్నిజస్యం
దనముం బన్నంగ నత్యాదరమున నకులుం దా నియోగించె నాతం
డును దీప్తోత్సాహుఁడై గందున [2] సబలరయాటోపరథ్యాది[3] సత్సా
ధనయోగం బొప్ప సారథ్యమునకు నమరెం దన్మనోవృత్తియుక్తిన్

---

39 1. వచ్చిన — పెక్కు ప్రతులు; జంపిన — అ.ఈ.ఎ.ఏ.జ ప.శ ష. 2. సాధించి నయా — ల. 3. బలుని — ఊ.ఐ.వ. 4. స్ఫురణ — క.వ. 5. నెగి — ఐ.ఒ ఔ. బ.వ. 6. నీవు — అ.జ. 7. నెరయ — కొన్ని ప్రతులు. 8. గీటణంచు — అ.ఈ.ఎ.ఓ.ఔ.క.గ.జ.ట.డ. 9. విద్దు — కొన్ని ప్రతులు, ముట్టి — కొన్ని ప్రతులు.

40 1. యమర్షణంబున — అ.ఉ.ఊ.ఎ.గ.ట. 2. మాటలనశ్వత్థామ — కొన్ని ప్రతులు. 3. తంబుగా — ఈ; గుణంబుగా — క.

41 1. విలసత్కాంతి — కొన్ని ప్రతులు. 2. రభస. — అ.ఎ. 3. సంపాదన — శ.ష.

42 వ. ఇట్లు సహదేవపూర్వజుం డనకు సారథ్యం జేసికొని సమీరనందనుండు కోదం
డగదాదండాది[1]హేతిసంపన్నం బైన [2]యారథంబెక్కి శిబిరంబు వేగంబ
వెడలి గురుతన[3]యాది [4]యోధులయరథంబులచొప్పు పట్టికొని [5]యతి
త్వరితగతిం జని కురుక్షేత్ర[6]సంచారిజనంబులం గని యశ్వత్థామ యెక్కడ
మెలంగెనో యెఱుంగుదురే యనియడిగిన వార లతండు కృపకృతవర్మల
తోడం గరినగరంబుదెసకు నరిగి [7]మగిడి భాగీరథీతీరంబున కరుగుదెంచి
యయ్యెడనయ్యిరువురుం బాసి [8]యొక్కవలని కరుగం దాను గృష్ణ
ద్వైపాయన మహాముని యాశ్రమంబున[9]కై తొలఁగి తత్ప్రదేశంబున
వసియించె నని చెప్పుటయు నద్దిక్కు తేరు నడప నియోగించినట్టియెడ
ధర్మనందనునకు వసుదేవనందనుం డిట్లనియె.

43 చ. అనిలసుతుండు శోకమున నల్కయుఁ జిత్తమునం గరంబు పే
ర్చిన గురుపుత్త్రు ముట్టి[1]కొనఁ జెచ్చెరఁ బోయెడు నీతఁడొంటి యా
తనిపయిఁ బోవ ఘోరమణతప్పదె కార్యము పెద్దగూర్తు వీ
వనజులలోన నాతనికి నందఱుఁ బోవుట మేలు పోరికిన్.

44 వ. వినుము సకలపృథివియు దహింపఁ జాలునట్టి బ్రహ్మశిరోనామకంబను దివ్యా
స్త్రం బశ్వత్థామకు ద్రోణుం డిచ్చెఁ బ్రియాతిశంబున వివ్వచ్చునకు నొసంగె
నశ్వత్థామ వివ్వచ్చుతోడి[1]మత్సరంబునఁ దదీయబల[2]నైపుణ్యంబునకు నస
హ్యంబు వడుఁ బదంపడి యెఱింగి పాండవులపై వీఁడు దీనిం బ్రయోగింప
కుండవలయు నని తలంచి యమ్మహనీయసాధనంబు మనుష్యుల[3]పైఁ
బ్రయో[4]గించుకొలఁది గాకునికియుం గలదు గావున సర్వధర్మవిదుండైన
యగ్గురుం డొక్కనాఁ డస్త్రవిషయసంభాషణసమయంబున నతనితో నిట్ల
నియె.

---

42 1. సాధన సంపన్నం - ఓ. 2. యరదంబెక్కి – కొన్ని ప్రతులు. 3. యాదుల యోధుల – పెక్కు ప్రతులు 4. యోధుల – పెక్కు ప్రతులలో లేదు 5. సత్వర గతింజని – పెక్కు ప్రతులు. 6. సంచారికాజనంబు - కొన్ని ప్రతులు. 7. మగుడి – పెక్కు ప్రతులు 8. యొక్కొక్క వలని – కొన్ని ప్రతులు. 9. కరిగి – ద.శ.ష.

43 1. కొని – కొన్ని ప్రతులు.

44 1. వైషమ్యంబున – క. 2. నైపుణంబు – పెక్కు ప్రతులు ; నైపుణ్యంబు - వా. 3. మీద - పెక్కు ప్రతులు. 4. గింపఁగొలఁగామియుంగలదు - శ.ష.

45 క. మనుజులపై బ్రహ్మశిరం
బనునస్త్రం జేసితేని నశుభంబొలయుఁ
విను మెన్ని యాపదలు వ
చ్చిన [1]నపరోపాయములన చెఱుపుము పుత్రా.

46 వ. అని చెప్పి మనోగతం బవశంబై నాలుకకు వచ్చిన వీఁ డెట్లును సజ్జనుల వృత్తంబునఁ బ్రవర్తిల్లెడునే యని యతండు విన నుగ్గడించె దానికి నశ్వత్థామ విషాదంబునఁ గుందియుండుఁ గాని యగ్గురుని చెప్పినట్లు సదుపదేశకరణ నిష్ఠుండుగాఁ డతనికి దురభిమానంబును గలదు వినుము [1]చెప్పెదఁ జిరజీవిత్వంబును భర్గవరప్రసాదజనక కారణంబును గలిగి యుండు ననియును దివ్యాస్త్రశస్త్రవిద్యారహస్యంబునకు మూలం బైన యగస్త్యుచేత ద్రోణుండు వడసినబ్రహ్మశిరోనామకంబు దనకుం గల దనియును దత్ప్రభావంబు దేవమనుజదనుజలోకంబులు భస్మీభూతంబులు సేయు నని యుండుం గావున మున్ను మీరు వనవాసులరై యున్నతఱిఁ దాను మాపురంబునకు వచ్చి యాదవకుమారులతోడివినోదంబులం దగిలి యుండి యొక్కనాఁడే నొంటిమై నుండ నాకడకుం జనుదెంచి నగుచు నిట్లనియె.

47 తే. విను మగస్త్యుఁడు మాతండ్రి వినుతతపము
పేర్మి కెంతయు నాత్మలోఁ బ్రీతిఁ [1]బొంగి
బ్రహ్మశిర మనుదివ్యాస్త్రరత్న [2]మొసఁగె
నగ్గురుండు నా కిచ్చె నత్యాదరమున.

48 వ. ఆదివ్యాస్త్రంబు నీ కిచ్చెద నీవు నాకుఁ జక్రం బొసంగ వలయు నని పలికిన [1]నే నద్దురభిమాని నాయెడం బరమస్పర్ధ గలిగియ ట్లగుట యెఱింగియు నొం డనక యతనికి మదీయచక్రధనుర్గదాఖడ్గంబులు సూపి వీనిలోన నీకు [2]ధరింపఁ [3]బ్రయోగింపశక్యం బైనదాని ధరింపు మని చెప్పి

---

45 1. నన్యోపాయ – ల ; కపటోపాయ – ఇ.ట.చ.వ; పరమోపాయ – ఊ.ఐ.ఒ.ఘ.వ.

46 1. చెప్పెద జిరజీవి — గావున మున్ను – ష. తక్క అన్ని ప్రతుల యందును లేదు.

47 1. బొంది – పెక్కు ప్రతులు. 2. మొసగ – గ.డ.

48 1. నే – పెక్కు ప్రతులలో లేదు. 2. ధరియింప – పెక్కు ప్రతులు. 3. ప్రయోగింప–

[4]నీవు నీయస్త్రంబు నాకునీ వలవదు [5]మిత్రుని కోరిన[6]యది యిచ్చుచుండి దానికి మాఱుగా నొకటి పుచ్చుకొనుట పురుషార్థంబు [7]తెరువే యనుటయు నతండు సుదర్శనంబు [8]వలయించిన బుచ్చు కొమ్మంటి నమ్మాటకు ముదితుం డగుచు నమ్మాధుండు [9]దనవామకరంబునఁ జక్రం బవలంబించి యెత్తం జాలక [10]దక్షిణపాణిం బట్టి యెట్లు [11]గదలఁ [12]దివియ శక్తుండు గాక యుభయహస్తంబులును [13]లావు సేసి [14]తివిసినను నది కదలకుండె నాతండు [15]డస్సి నిలిచి విషణ్ణుం[16]డై యున్న [17]నతని నాలోకించి యి ట్లంటి.

49 తే. అధిక [1]నిష్ఠమై బ్రహ్మచర్య వ్రతంబు
తోడ రుక్మిణీయుతముగాఁ దుహినశైల
తటమునందుఁ బండ్రెండు వత్సరము లుగ్ర
తప[2] మొనర్చి యిమ్మహితసాధనము వడసి.

50 వ. [1]దివిజదానవగంధర్వాది సమస్తభూతంబులు నాతోడి యెత్తురాకుం డెడునట్టి దోర్వీర్యంబున [2]వెలసి వర్తిల్లుదు నట్టిది దీని [3] మహత్త్వంబు నన్నిచక్రం బింతకమున్న బలభద్ర ప్రద్యుమ్న సాంబాది యాదవశ్రేష్ఠు లెవ్వరు నడుగరు [4]గాండీవి శ్వేతాశ్వ కపిధ్వజంబులు దపో[5]బలంబునఁ బడసి యెక్కటికయ్యంబున రుద్రు మెప్పించి పాశుపతంబు గొనియెఁ బ్రాణం

---

కొన్ని ప్రతులలో లేదు. 4. నీవు — పెక్కు ప్రతులలో లేదు. 5. మిత్రునికి — అ.ఇ.శ. 6. దానియిచ్చు - డ. 7. తెరంగే - గ.చ.డ ; సేయునుటయు - శ.ష. 8. వలయుననిన — ఈ.ఐ ; గోరిన — డ.శ.ష. 9. దన - పెక్కు ప్రతులలో లేదు. 10. కరంబున— కొన్ని ప్రతులు. 11. గదల్ప — ఈ.ఎ ఏ.చ.జ. 12. దివియ - కొన్ని ప్రతులలో లేదు. 13. లావునంజేసి—ఈ. వ ; లావునం దివిచిన—ఒ ఔ.వ. 14. తిగిచిన—అ.ఇ.ఉ.క.ఘ.వ. 15. డలసి నిలిచిన — ఉ.ఒ.ఔ.ఘ. 16. డగుచున్న - ఈ ఖ.చ.జ. 17. నతని — పెక్కు ప్రతులలో లేదు.

49 1. మైనట్టి — శ.ష. 2. మొనర్చి — ఈ.జ.డ.

50 1. దేవదాన — ఖ. 2. మెలంగుచునట్టిది — ఐ ఒ. 3. మహాత్మ్యంబు — కొన్ని ప్రతులు. 4. గాండీవి — పెక్కు ప్రతులు. 5. మహిమంబున — పెక్కు ప్రతులు.

బులకంబు నేనతనికిం గూర్తు నద్దేవసమునకు నొసంగఁ [6]దగనిది యెద్దియు
లే దట్టి యర్జునుండును దీని నడిగెనే భరతవంశాచార్య పుత్రుండవు సకల
జనమాన్యుండవు నీ విట్లెఱుంగక యడుగుదె దీని నెవ్వరితోడ రణంబు సేయఁ
దలంచి యడిగి తనిన నగ్గురునందనుం డి ట్లనియె.

51 చ. సకల [1]జగత్ప్రసిద్ధ మగు చక్రము నీ వొసఁగంగ నిష్ట వు
చ్చికొని భవత్పదాంబురుహసేవ పదంపడి చేసియైనఁ బో
రికి నిను నియ్యకొల్పు మదిఁ బ్రీతి [2]యెలర్పఁ బెనంగి నీకు నో
డక విలసిల్లి యెల్లఁ బొగడం బొను[3]పొందఁగఁ గోరి వేడితిన్.

52 వ. ఈ చక్రంబు[1] నీక ధరియింపం దగియుండు గాక నాకిది లేకున్న నేమి యగు
నెట్లును నీతోడ సంగరంబు సేయంగలవాఁడ ననియె నేను నవ్వుచు నట్ల
కాక యని ద్రోణాచార్య పుత్రత్వ బహుమానంబున [2]మాననీయ రథ్యం
బులు నభిరామ [3]రత్నాంబరాభరణంబులు [4]నిచ్చి పుచ్చినం జనియె నట్టి
మహాహంకారంబునకుఁ గారణంబైన బ్రహ్మశిరోనామకం బనుదివ్యాస్త్రం
బు నవ్యాహత సంరంభుండును [5]నసద్వ్యాపారారంభుండును గ్రూరదర్పు
నుండును నగునశ్వత్థామచేత భీముండు బాధితుండు గాకుండ వలయు నని
పలికి పద్మనాభుండు సాత్యకి సహదేవులం జూచి మీరు శిబిరంబున నిలువుం
డని నియోగించి.

---

6. వియచ - కొన్ని ప్రతులు.

51 1, జగత్ప్రసిద్ధము – పెక్కు ప్రతులు ; జనప్రసిద్ధ - వా 2. దలిర్ప – పెక్కు ప్రతులు 3. పొందుట – పెక్కు ప్రతులు.

52 1. నీవ – కొన్ని ప్రతులు 2. మహానీయ – పెక్కు ప్రతులు. 3. రత్నాభరణ - పెక్కు ప్రతులు. 4. యనిచి, నొసగి – అనిపాఠములు. 5. నసద్వ్యాపారారంభుండును – పెక్కు ప్రతులలో లేదు.

—: ధర్మజధనంజయకృష్ణు లశ్వత్థామ మీఁదికిఁ బోవుట :—

సం. 10—13—1

53 సీ. ప్రద్యోతితానేకరత్నశోభితమును
సంభృతాయుధ [1]వరిష్ఠంబు నైన
మాన్యరథమ్మున శైబ్యసుగ్రీవంబులను
మేఘపుష్పవలాహకములఁ
బూన్పించియాఖీలభుజగారికేతనం
బెత్తించి వేనొగ లెక్కుటయును
గాండీవధరణోద్భటుండును దూణీర
యుగళసన్నాహసముజ్జ్వలుండు

ఆ. నై ధనంజయుండు రథారోహణము సేసె
నగ్రజుండు నెక్కె ననికి నమరి
యొప్పి రమ్మురారియును వారునప్పుడు
బలహరుండు నశ్వినులును బోలె.

54 వ. ఇట్లు సన్నద్ధం బైనయారథంబు భానురప్రతోదంబు పుచ్చుకొనియద్దామోదరుండు [1]వఱప నయ్యుత్తమరథ్యంబుల రయాతిశయంబున సమీరనందనస్యందనంబు గొండొకసేపునకుంగూడె నప్పుడు భాగీరథీరంబునఁ గ్రోధాయత్తచిత్తుం డగుచు నశ్వత్థామ యున్నయెడ రోయుచుఁ బోవునప్పావని నమ్మువ్వురు [2]వారించి రట్లు [3]వారించిన నిలువక [4]వాముందటం జని యతండు సూడ్కి యట [5]నిగిడించి.

55 చ. సలిలసమీపదేశమున సంయమిసంఘము గొల్వఁగా సము
జ్జ్వలమయమూర్తి యగుసాత్యవతేయుఁ డు [1]తారకారణం
బులనడుమం బ్రదీప్తుఁ డగుపూర్ణసుధాంశుని[2]యట్టు లుండన
వ్వలనికిఁ బోక భక్తినభివాదనముగా మదిలోనఁ జేయుచున్.

---

53 1. పటిష్ఠంబు — పెక్కు ప్రతులు.

54 1. నడుప — ఊ.ఐ ఒ.ఔ. 2. వారించిరట్లు - కొన్ని ప్రతులలో లేదు. 3. వారించిన — కొన్ని ప్రతులలో లేదు. 4. వారలమ్ముం — పెక్కు ప్రతులు 5. నిగుడించి — పెక్కు ప్రతులు.

55 1. దారతారకంబుల — పెక్కు ప్రతులు. 2. బోలియున్న - ఐ.బ.డ.శ.ష.

56 వ. కెలంకులు గలయం బరికించి [1]యొక్కెడ.

57 ఆ. మేన [1]భసిత మలది మాననీయతపఃప్ర
యుక్తి[2]నాదరించి యున్న ద్రోణ
తనయుఁ గాంచి చాపదండంబు సజ్యంబు
సేసి మహితశరముచే నమర్చి.

58 వ. [1]భ్రుకుటితవికట ఫాలభాగుం[2]డై.

59 తే. ఓరి ధాత్రీసురాధమ కూరకర్మ
కపటధార్మిక యత్యంతకల్మషాభి
యుక్తిఁ [1]బోయినరేయి మహోగ్రవృత్తిఁ
దగిలి యెంత[2]వేగిరమునఁ దపసి వైతి.

60 వ. ఇట్లు లోదిఁగినఁ జావు దప్పునే లేలెమ్ము తపమ్ముసాలు రణమ్మునకు రమ్మని కఠినాక్షరంబులుగాఁ బలికె నటు వలుకునాభీమసేనుం గనుంగొని యతని వెనుకఁ గదియ నడచినసవ్యసాచి[1]ధర్మజులం జూచి సవ్యథం బగునంతః కరణంబుతో నగ్గురునందనుండు వారలదివ్యాస్త్రవేదిత్వం బూహించి దుస్సహంబగునమ్మహాదురితంబునకుఁ దలంకి బ్రహ్మశిరోనామకం బ[2]ను దివ్యాస్త్రంబు దలంచి యొక్క యిషీకంబు వుచ్చికొని యం దయ్య[3] స్త్రంబు నావహించి యపాండవం బయ్యెడు మని దారుణభాషణంబుల తోడ రోషప్రదీప్తుం డగుచుఁ బ్రయోగించిన.

---

56 1. యొక్కయెడ - కొన్ని ప్రతులు.

57 1. భూతియలది — ఊ.ఒ.ఓ.ఔ.ఖ.గ.ఘ.డ.బ.శ.ష. 2. యాచరించి — ఊ.ఐ.ఒ.ఓ.ఖ. ఘ.బ.

58 1. భ్రుకుటీవికట — పెక్కు ప్రతులు. 2. యిట్లనియె — కొన్ని ప్రతులు.

59 1. మైనడురేయి - ఈ.ప.చ. ; బోయిననడురేయిను గ్రవృత్తి — బ. 2. వేగంబున పెక్కు ప్రతులు.

60 1. ధర్మజకృష్ణులను — ఉ.ఐ.ఒ.ఓ.ఔ.ఖ.ఘ. 2. గుమహాస్త్రంబు — పెక్కు ప్రతులు. 3. స్త్రరత్నంబు — పెక్కుప్రతులు.

61 స్రగ్ధర. ఆదివ్యాస్త్రంబునం దుద్యత [1]మయి ఘనఘోరాగ్ని [2]యర్చిర్వితానం
బేదిక్కుం దానయై పెల్లొ[3]సఁగుచు భువనం బెల్ల భస్మంబుగా నా
పాదింపం జేర్చుమాడ్కిం [4]బరఁగి పెరిఁగినం బార్థునిం జూచి తద్వా
హోదర్వజ్ఞాన[5]ముద్రా వ్యపగతభయుఁడై యంబుజాక్షుండు [6]వల్కెన్.

62 వ. అర్జున యర్జున యిది బ్రహ్మశిరోనామకం బను దివ్యాస్త్రంబు దీని నొం
డస్త్రంబు ప్రతిహతంబుఁ జేయం జాలదు బ్రహ్మశిరంబు నీవునుం బ్రయో
గించి దీనినుడిపి నిన్నును నీసోదరులను గాచికొనుము సత్వరుండ[1]వు గమ్ము.

63 క. అనవుడు నవ్వీరుఁడు స
య్యన నరదము డిగ్గి నియతుఁడై [1]ధనురాచా
ర్యుని సంస్మరించి చాపము
గొని మంత్రముతోడ శరము గుణమునఁ గూర్చెన్.

*:- అశ్వత్థామార్జునుల బ్రహ్మశిరోనామకాస్త్రంబు లొండొంటిం దాఁకుట :-*

సం. 10-15-1

64 వ. కూర్చి తొలుత గురునందనునకుం [1]గీడు వొందకుండ వలయునని ప్రార్థించి
పదంపడి నాకును సోదరులకును శుభం బయ్యెడు మని పలికి యస్త్రదేవతలకు
నమస్కరించి యస్త్ర మస్త్రంబునన శమియించుఁ గావుత మని శివంబుఁ
జింతించుచుం బ్రయోగించిన నాదివ్యాస్త్రంబు కల్పాంతజ్వలనంబునుం
బోలె నాఖిలజ్వాలామాలాకరాళం బై [2]యుప్పరం బెల్లను దనమయం
బుగా [3]నిగిడి యశ్వత్థామాస్త్రంబు గ్రమ్మఁజింప నుత్సహించిన నవిక్రమ్మ
ఱక పెరిఁగి సముద్ధామధామం బగుటయు నయ్యస్త్రద్వితయంబు నాటో
పంబున.

---

61 1. మగుచును — అ.ఉ.ఎ.ఔ. 2. కీలాలిత — అ.ఉ.ఎ.ఔ. 3. సగగభువ — పెక్కు ప్రతులు. 4. బరగె బరగినం — పెక్కు ప్రతులు. 5. లీలావ్యప - అ.ఇ.ఉ.ఓ ఘ. 6. వల్కెన్ — ఊ.ఎ. కొన్ని ప్రతులు.

62 1. వగుము — కొన్ని ప్రతులు.

63 1. గురునకు భక్తినమస్కరించి — ఐ.ఒ.డ.

64 1. గీడొందకుండ — పెక్కు ప్రతులు. 2. యంబరంబెల్లను — కొన్ని ప్రతులు. 3. నిగుడి — పెక్కు ప్రతులు.

65 మహాస్రగ్ధర. జలధుల్ ఘూర్ణిల్లె నుల్కాశతములు వడియెం జండ భానుండుమాసెం
గులశైలంబుల్ వడంకెం గురిసె [1]నురవడిఁ ఘోరపాషాణధారా
వలి నాకాశంబు ధాత్రీవలయముఁ దిరిగెఁ వజ్ర[2]నిర్ఘోష మెందుం
జెలఁగం[3]జొచ్చెఁ జనం బచ్చెరువును భయముం జెంది నిశ్చేష్ట మయ్యెన్.

66 వ. ధర్మాత్ముం డగునారదుం డప్పుడు సాత్యవతేయునకు సన్నిహితుం[1]డయ్యె నతండును భరతకులోద్వహుండగునప్పారాశర్యుండును గూడి యిట్లు జగద్భయంకర[2]శస్త్రమోద్దాము లగునయ్యర్జునాశ్వత్థామల నుపశమింపం జేయుట కై నడుమ నిలిచి యయ్యిరువురు నాకర్ణింప నిట్లనిరి.

67 క. పలువురు మహాస్త్రవిత్తము
లలఘుభుజావీర్యశౌర్యులవనిఁ జనిరి వా
రలు దీనిఁ బ్రయోగించుట
గలిగెనె మానవులపై నకల్మషులారా.

68 వ. అనిన విని సవ్యసాచి దివ్యాస్త్ర [1]జ్వాలాకలాప మధ్యంబున నిస్సంభ్రము లై యున్న సర్వధర్మరక్షణ సర్వలోకహితాచరణపరిణతులగు నప్పరమ మునులం గనుంగొని తత్కాలోచితానుష్ఠానం[2]బు నూహించి యమ్మహాత్ము లతో ని ట్లనియె.

69 తే. అస్త్ర [1]మస్త్రముతో శాంత మగుటఁ గోరి
సొలవ కట్లు ప్రయోగింపవలసెఁ గాని
యొండుదలఁపునఁ గా దది యుడుపవలయు
నేని యుడిపెదఁ [2]బరమమునీంద్రు లార.

---

65 1. రవముతో ఘోర - అ.ఇ.వ ; మెరుపుతోగూడ - ఉ.వ.బ.శ. ; మెరుపుతో ఘోర ష ; మొరుపుతో ఘోర — న ; మొరము (?) తోగూడ ఓ.ట. 2. నిర్ఘాతభీతిన్ — శ. 3. జొచ్చెన్మనం - శ.

66 .1 డైతాను ను భరత — ఏ.ఒ.ఖ.ట.వ. 2, వరాస్త్ర మోద్దాములగు—ఘ;వ.

68 1, ద్వయ జ్వాలా — పెక్కు ప్రతులు. 2, బూహించి — ఐ.ఒ.ఘ.డ,ల.స; బులో నరించి - శ.

69 1. మస్త్రంబుచే శాంతియ — పెక్కు ప్రతులు. 2. భవ్య మునీంద్రు - కొన్ని ప్రతులు.

70 క. ఏను మదస్త్రం బుడుపం
గా నీపాపాత్ముఁ డస్త్రఘనదహనమునం
దానేర్చు నంద ఱును మీ
మానసములఁ దలఁపవలయు మాసేమంబుల్.

71 తే. అనుచుఁ జయ్యన యస్త్రవిద్యాప్రవీణ
మానసుండగు నరుఁ డయ్యహీన రూప
సాధనము నశ్రమంబున సంహరించె
[1]మెచ్చి యమ్మహామును లెదఁ బిచ్చలింప.

72 చ. తపమును బ్రహ్మచర్యమును దానము సత్యము గల్గునాసురా
ధిపతనయుండు దక్క సముదీర్ణముగా [1]నిగిడించి యమ్మహో
గ్రపుమహితాస్త్ర మొండ్లకును రాదు మగుడ్పఁగ నట్టిభంగి భూ
మిపతుల కాదు దేవతలు మేకొనఁ జాలరు కౌరవేశ్వరా,

73 వ. బ్రహ్మశిరోనామక బగునమ్మహాస్త్రంబు దలంచి బ్రహ్మతేజోమయం బగు
టం జేసి యిట్లు ప్రయోగించి వారింపశక్యంబు గాకుండు వారించిరేని
వారించిన వారిన తల ద్రెంచు గురుభక్తియు వ్రతయుక్తియు నెక్కుడు
గలుగుట నక్కౌరవశ్రేష్ఠుండు నివారణపటిష్ఠుండయ్యె నవ్విధంబునఁ
గవ్వడి యాదుర్నివారసాధనంబు వారించుట నాలోకించి యమ్మునీశ్వరు
లమ్మాహాత్మ్యంబూహించి రశ్వత్థామ నిజాస్త్రసంహారంబు సేయంజూచి
యది శక్యంబు గా కుండుటయు దీనమానసుండగుచు మాననియో
పాయుం డగుసాత్యవతేయున కిట్లనియె.

74 తే. చంపెఁ గురువిభు [1]నాకు లజ్జాకరముగ
భీముఁ డదియు నధర్మసంగ్రామవృత్తి
నంతఁబోవక వచ్చి ప్రాణాపహార
మాచరింపఁగఁ బూని నన్నాక్రమించె.

---

71 1. మెచ్చియా మునులెదదల బిచ్చలింప - వ.

72 1. నిగుడించి — పెక్కు ప్రతులు.

74 1. మున్ను లజ్జాకరముగ — ఓ; మును జలజాకరమున - వ.

75 చ. పరిభవజాతరోషమునఁ బ్రాణభయంబునఁ జేసి యిమ్మహా
శరము వివేకవర్జితవిచారుఁడనై యిటు [1]లేసితిన్ మునీ
శ్వర యిది పాండుభూవసుతవర్గము [2]నంతటినేర్చుఁ గాని [3]యె
ప్వరునున మాన దివ్విధము పాపమ యేనియు [4]దాని [5]కోర్చితిన్.

76 వ. అనిన విని యమ్మునిపతి యతనియానవంబునఁ జూడ్కి నిలిపి మీతండ్రి యిప్పాండవమధ్యమునకు వాత్సల్యంబున నీయస్త్రం బొసంగె నీయోధ వరుండు నీకుఁ గీడు దలంపఁడు భవదస్త్రం బుప[1]శమించుటకు నైన నిజాస్త్రంబు ప్రయోగించె మేము వలవ దన్న నుపసంహరించె నిట్లస్త్ర విద్యావైదగ్ధ్యంబు సడిసన్న కవ్వడి వధింప నీకు వశంబగునే నీయస్త్రం బితనియస్త్రంబుచేత నివారితం బయ్యెడు నది యట్లుండె విను మమ్మహాస్త్రంబు మనుష్యవిషయంబుగాఁ బ్రయో[2]గించువానికి నశుభం బగు నొకని చేతఁ బ్రయోగింపఁబడి యన్యునస్త్రం బు[3]పశమించెనేని యద్దేశంబునకుఁ బండ్రెం [4]డేం డ్లనావృష్టిదురితం బగుం గావునఁ బాండవులను నిన్నును నిద్దేశంబును రక్షించుటకుం జెప్పితి [5]మెప్పాటనయిన దీని నుపసంహరింప వలయుఁ దపంబునకుఁ జొచ్చినవాఁడవు రోషంబునకుఁ [6]దొలంగ నుఖవి [7]గమ్ము ధర్మంబున జయంబు గొన [8]నోపిన యిప్పార్థుండును బ్రీతుండై చనవలయు భవదీయశిరోమణి యీతని కిమ్మట్లయిన నితండ కాఁడు పాండవులందఱును నీ దగుజీవనంబు నపహరించినంతయ సంతసిల్లుదు రిది సమీచీనం బయినసంధిప్రకారం బిట్లు సేయుట మేలనుటయు నుమ్మాలి కంబుతో నగ్గురువందనుండు పరాశరనందనున కిట్లనియె.

---

75 1. చేసితిన్ - పెక్కు ప్రతులు. 2. సంతతి – బ.ష.స. 3. యిప్పరునున – పెక్కు ప్రతులు. 4. నింద – ఐ.వ. 5. కోర్చెదన్ – డ.

76 1. శమియింపజేయుటకై - కొన్ని ప్రతులు. 2 గించిన వానికి – పెక్కు ప్రతులు. 3. చేత శమించునేని – బ.వ; చేనుపశమించెనేని – శ.ష. 4. డు వత్సరంబులనా వృష్టిదోషంబు గలుగుగావున – పెక్కు ప్రతులు. 5. నెప్పాట – కొన్ని ప్రతులు. 6. దొరంగి – కొన్ని ప్రతులు 7. గమ్ము ధర్మంబున – ల. 8. నొల్లనియపార్థుండు – ల. కొన్ని ప్రతులు.

"నహ్యధర్మేణరాజర్షిః పాండవో జేతుమిచ్ఛతి''

10–15–26 (భం)

77 సీ. పాండునందనులకుఁ బ్రాఁకె రత్నంబులు
కౌరవనాథుభండార మెల్లఁ
గైకొన్నవారు నాగభయంబుఁదస్కర
భయము[1]ను దానవభయము దేవ
భయమును [2]బొరయవు బాధింప దాఁకలి
తృష నిద్ర[3]రోగంబు దీనికతన
నిట్టిరత్నము వీరి కీఁజాలుదునె ముని
నాయక నీవచనం బలంఘ్య

ఆ. మగుట దీని నీకు నర్పించితిని మద
ద్రత్నంబు పాండవేయ[4]రాగపాత్ర
గర్భములకు హానిఁ గావించి సంతృప్తిఁ
బొంది తాఁ బ్రశాంతిఁ బొందుఁగాత.

78 క. అన విని కృష్ణద్వైపా
యనుఁ డట్టులు సేయు మొంటి కాస పడకు మీ
యని [1]పలుక నప్పలుకునం
గనియెను దనపలుకు తప్పుగా నతఁడు మదిన్.

79 వ. కని పాండవేయ[1]రాగపాత్రగర్భంబు లని తత్సంతానసంజాతగర్భంబులనెల్ల నుగ్గడించినవాఁడ నయితి నది పారాశర్యుండు పాండవేయభార్యా గర్భంబు[3]లన పేరు[3]కొనుటగాఁ జేసి యొంటి కాసపడకుమీ యనియె దీని

---

77 1. దేవాసుర భయము వహ్ని — ష. 2. బొందవు — వ; బొందదు — బ. 3. శోకంబు — ఓ ఔ.డ.బ 4 రాజపౌత్ర — ఒ.ఔ.బ.వ.

78 1. పలికినయప్పలుకున — ఏ ఓ ఔ,బ.సూ.

79 1. దార—ఈ.గ.ష. 2. లన్నియు బెరు—ఎ.ఐ.ఒ. 3. కొంటినని తలంచి యొకటి — డ.

నెఱింగినవాఁడఁ [4]గానేని యిది యనుమతిగా భావించి సకలగర్భ విధ్వంసనంబు గావించెదం గాక యని నిశ్చయించి యమ్మునీంద్రునితో నట్లచేయు వాఁడ ననిపలికె వారలసంవాదప్రకారంబు హృషీకేశుం డెఱింగి వీఁడు సంయమివరుమాట గీటునం బుచ్చి తనవలసినట్లుసేయువాఁ డయ్యె నిప్పా పాత్ము నుపక్రమంబునకు నడ్డపడి చూచెదఁ గాకున్నఁ దుది నాచేయు తెఱం గున్నదియ కాదెయని వితర్కించె నప్పు డశ్వత్థామచేతోవృత్తి సాత్యవతేయుం డెఱిఁగియుం గృష్ణుం డెఱుంగుటయు నతం డతనితో సల్లాపంబు సేయం దలంచుటయుఁ గనుంగొని యూర కుండె.

—: *శ్రీకృష్ణుఁ డుత్తరగర్భంబు దగ్ధంబు గాకుండఁ జేయ నిశ్చయించుట* :—

సం. 10—16—1

80 క. వనజాక్షుఁడు ద్రౌణికి ని
ట్లనుఁ దునిమితి పాండుపుత్రు లందఱుఁ బాపం
బునఁ [1]బోయితి గర్భంబుల
దునిమెద [2]నందొకటియైనఁ దొలఁగింపఁ[3]దగున్.

81 క. ఏనొక్కనిఁ బాండవసం
తానార్థము [1]గాఁగనిత్తు ధర్మముల మహా
దానంబులఁ గ్రతువుల జన
తానందితుఁడగుచుఁ [2]బెంపుఁ దలకొనువానిన్.

82 తే. అట్టిగర్భంబు [1]నిలుపు తక్కన్ని గర్భ
ములును భవదస్త్రమున దగ్ధములుగఁ జేయు
మనుడు సంరంభజృంభితుఁ డగుచు ద్రోణ
తనయుఁ డిట్లను నమ్మురాంతకునితోడ.

---

4. గానేల — పెక్కుప్రతులు.

80 1. బొందితి - వ. 2. దొకరినైన తుది నిలుపదగున్ — ద; దొక్కడైన దొలగింప దగున్ - వ. 3. నగున్ — ఈ.ఘ.చ.

81 1. గానొనర్తు — ల. నలుపదలకొనువానిన్ — శ.

82 1. నిలుచునక్కన్ని - ఊ. నిలుచును నన్యగర్భ — ద ; నిలుచుఁగా కన్యగర్భ - శ.

83 వ. పక్షపాతంబున నీ విట్లు పలికిన నేన క్లేశ చేయుదు మదస్త్రంబునకు లక్ష్యంబులుగా గర్భంబు లొండు గలుగు లేకుండ నడియట్లుండె విరాటనందన యగు నుత్తరగర్భంబు రక్షించెదనని చూచె దప్పానికిఁ బూనితేనియు నాయస్త్రంబున నవశ్యం బడియును విధ్వంసంబు గావింతునని పలికినఁ బద్మనాభుండు.

84 క. అకఘుఁ డభిమన్యుతేజం
బనూనమై మాత్స్యపుత్రియం దున్నది నీ
తునువుట గలిగిననుం ద
త్తనయున కే నాయు విచ్చె[1]దను దీర్ఘముగన్.

85 క. అనిన విని నగుచుఁ గుంభజ
తనయుం డిట్లనియె నస్త్రదగ్ధుని బ్రతికిం
చినమేల కాదె నీవి
న్ననువు నెఱింగెదము కాక నరసఖ దీనన్

86 వ. అని పలికి పరమాదర[1]ణీయు లగుసాత్యవతేయదేవకీనందనులవాక్యంబు లాదరింపక పాండవసంతానసకలగర్భవిషయంబుగా నస్త్రప్రమోచనంబు సేసిన నుపలక్షించి వాసుదేవుం డతనితో నిట్లనుఁ ద్రికాలవేది యగునొక్క బ్రాహ్మణుం డుపప్లావ్యంబునకు వచ్చియుత్తరను జూచి నీపుణ్యంబునఁ బ్రాణంబులు పరిక్షీణంబులైనపుత్రుండు జనియింపం గలవాఁ డది కారణంబుగా భవదీయగర్భస్థునకుఁ బరిక్షిన్నామధేయం బగునని పలికె నమ్మహాత్మునివచనం బనృతంబు గానేరదు [2]భవత్కృత్యం బకృతసమంబ యబ్బాలకుండు పాండవవంశకరుండగు నని చెప్పి తనచిత్తంబున రోషంబావహిల్లుటయు బాలఘాతి వగు నీకు నశనంబు దుర్లభంబై సహాయరహితుండవై దుర్గంధరక్తంబున నంగంబు దగ్ధం బగుచుండ మూఁడువేలేండ్లు దిరుగుము నాచేత రక్షితుండై యక్కుమారుండు గృపాచార్యువలనధనుర్వేద

---

84 1. పతిదీర్ఘముగన్ — ఒ.

86 1. ణీయంబులగు - జ.ట.ల. 2. భవత్కృతసమయం బబ్బాలకునిం బొంద దతండు

విదుండై సర్వ[3]శస్త్రాస్త్రంబులువడసి బహుసంవత్సరంబులు వసుధఁ
బాలిం[4]పఁగలవాఁడు వానికి[5]జనమేజయుం డనుమహారాజు ప్రభవించి నీవు
చూచుచుండనుజ్జ్వలుండై ప్రవర్తించు మదీయంబు లగు తపస్సత్యంబుల
మహనీయప్రభావంబులు సూడు మని యాడె నప్పుడు కృష్ణద్వైపాయ
నుండు గురునందనున కిట్లనియె.

87 తే. బ్రాహ్మణుఁడ వయ్యునిట్లు క్రూరతకు రోయ
కస్మదీయ[1]వాక్యంబుల నాదరంబు
సేయకీపాపకర్మంబు సేసినాఁడ
వచ్యుతుఁడు వల్కినట్టుల యగుము నీవు.

88 వ. అని యిట్లు శపియించి నీచకర్ముండ పొమ్మనిన విని యశ్వత్థామయమ్మ
హాత్మునియాననం బాలోకించి మునీంద్రా నీవు మనుజులలోన[1]నుండువాఁడ
వని ప్రతిశాపం బిచ్చి నీకడన యేను వర్తిల్లఁగలవాఁడ నీవును శౌరియు
సత్యవాదు లగుదురు గాక యని [2]తనశిరోమణి పాండవుల కిచ్చి తపోవ
నంబునకుం జనియెఁ బాండవులునుగృష్ణుండును నమ్మునీంద్రునకు నమ
స్కరించి వీడ్కొని యతిత్వరితగతి నరుగుదెంచి.

89 క. అరదములు డిగ్గి వగలం
బరితాపముఁ బొందు చున్న పాంచాలిగాం
చిరి తమచేతోవృత్తులఁ
గరుణము మగుడంగఁ బొడమఁ గౌరవనాథా.

90 వ. అట్లు గాంచి యక్కాంతచుట్టు నాసీను లై రప్పు డగ్రజుండు వసుపఁ
బవనతనయుం డమ్మణి యద్దేవికి సమర్పించి.

---

పాండవ - స. 3. శాస్త్రంబులు — జ. 4. రాజ్యసుఖంబు లనుభవింపఁగల
వాఁడు - జ. 5. పారిక్షితుండను — పెక్కు ప్రతులు.

87 1. వాక్యముదెసనాదరంబు — గ.జ.ల.

88 1. యుండు — వా ; నుండు — కొన్ని ప్రతులు. 2. పలికి తన — పెక్కు ప్రతులు.

## —: భీమసేనుఁ డశ్వత్థామ శిరోరత్నంబు ద్రౌపది కిచ్చుట :—
సం. 10-16-25

91 క. పగతుపని సక్కనయ్యెఁ
వగమానుము రాజధర్మవైశిష్ట్యము పెం
పుగ నాదరించి నీతా
ల్మిగదా భూపాలు నుమ్మలికముం బాచున్.

92 చ. జనపతి పంపఁ గేశవుఁడు సంధికిఁ బోయెడునప్డు నీవు సె
ప్పిన గరువంపు రాజసపు బెట్టిదపుం దగుమాట లెల్ల నె
మ్మనమున నెక్కొనెఁ నిలుపుమా వగవం బని యేమి సంగరం
బునఁ బగవారుపేర్చి పొరివుచ్చక పువ్వులకోల సోఁతురే.

93 క. వినుము ధృతరాష్ట్రవంశం
బున మగ[1]పిఁచంబు నెల్లఁ బొలియించితిఁ గృ
ష్ణునికారుణ్యము జిష్ణుని
పెనుఁబ్రాపును [2]గలుగ నేను విగతభయుఁడనై.

94 ఉ. త్రావితి దుస్ససేనురుధిరం బురముగ్రత [1]బెర్చి వ్రచ్చిక్రీ
డావిధి వాని యగ్రిజుతోడల్ [2]వడి నుగ్గుగఁ జేసి [3]యార్చి యా
భూవరుమౌళిఁ దన్నితి నృపుల్గని సంతస[4]మందనింత హ
ర్షావసరంబు శోకసమయంబుగఁ [5]జేయుట నీకు[6]నర్హమే.

95 క. గురుతనయుఁ దగుటఁ బ్రాణము
హరియింపఁగఁ జొరక విజయుఁ డశ్వత్థామం
బరి[1]భూతుఁ జేసియాయుధ
[2]పరిగ్రహముతోడ [3]లజ్జఁ బాయం జేసెన్.

---

93 1. పింఛంబు—జ.ల. 2. గలిగి—ఒ.క.జ.

94 1. బెర్చి—పెక్కు ప్రతులు ; చీఱి—వా ; వ్రిచ్చినేను—ఊ. ఘ. వ ; వ్రచ్చితివ్ర—క. 2. గద—ఈ.ష.ల ; పెస—ఊ. ఓ.ఔ ; వెసనుగ్రత—ఘ ; వెసనుగ్రత నుగ్గుజేసి—ఊ.వ. 3. వైచి.ఆ.ఈ ఎ ; యేచి—ఇ.ఉ.ఏ.ఒ.ఓ.ఔ.గ.చ.జ డ.బ.ల. 4. మందిరింత—ఖ శ.ష; మందునట్లు—ట ; మంద నిట్టి—ఊ.ఔ.ఘ.వ ; మంద నింతి — ఆ.ఈ.ఎ.ఏ.ఓ.గ.డ.వ. 5. జేయగ — ఎ. 6. పాడియే — ఊ.ఘ.బ.

95 1. భూతుండుగ నాయుధ — అ ఇ. 2. పరిహరణము — ఓ. 3. మణియుఁబాయఁ గఁజేసెన్ — డ.వ.స.

96 వ. చూడామణి గోలుపోవుటం జేసి యాకుంభసంభవసంభవుకీర్తిశరీరంబు వడియె ముఱికిఁబొంది యున్న దింతియ యిట్టు[1]వైరంబు పేరులేకుండఁ దీర్చుట యెవ్వరికింజను నేమియుఁగీడాడఁ దెఱపిలేక ధర్మతనయుండు నిర్మలకీర్తికి భాజనంబై యుల్లసిల్లెడు నూఱడిల్లుము.

97 తే. అనినఁ గొండొక తెలివొందునాననంబు
తోడ[1]నుత్థితయై[2]న యాతోయజాక్షి
[3]ప్రభలు పర్వంగ[4]నొప్పునాపద్మరాగ
రత్నమణి చేత[5]నిడికొని రాజుఁజూచి.

98 వ. భీమసేను నుద్దేశించి.

99 ఉ. నామన మార దీనిఁ గని [1]నందముఁ బొందితి నింత సాలు నా
కీమహనీయరత్నము వహింపఁగ [2]నర్హుఁడితండ యంచు నా
భూమిపుచేతఁ బెట్టుటయు భూవర యాతఁడు ద్రౌణి గౌరవ
శ్రీమది భక్తిఁ బెంపఁగ ధరించె శిరంబున దానిఁ బ్రీతుఁడై.

100 వ. ఇవ్విధంబున.

101 తే. విలసితం బగునమ్మణి చెలువు మిగుల
మౌళియందు ధరించి యమ్మనుజనాథుఁ
డుదయ[1]రాగనితాంతసముజ్జ్వలేందు
బింబమునఁ బొల్చుపూర్వశైలంబు వోలె.

---

96 1. వైరంబను పేరు - పెక్కు ప్రతులు; వైరంబను పేరు – ఈ ఓ; వైరంబు పేరు – స.

97 1. నందిత – కొన్ని ప్రతులు. 2. పుల్ల - ఆ.ఎ; పల్కె – ఊ ఐ ఒ ఓ.ఘ. 3. ప్రభల జెలువొందుచున్న - క. 4. బొల్చు – కొన్ని ప్రతులు. 5. నిడుకొని - పెక్కు పతులు.

99 1. నప్పుడు సంతసమయ్యెఁజాలు - ఎ.ఖ; నప్పుడె సంతసమయ్యెఁ జాలు - శ.ష.స. 2. నర్హమె యర్హుడంచు – ఏ.చ.

101 1. శిఖరాగ్రరాగ సముజ్జ్వ – లు.

102 వ. ఇత్తెఱంగునం బాండవాగ్రజుండు పాంచాలికిఁ బ్రియం బాచరించి తత్ప్ర
భృతి కాంతలును సహదేవప్రముఖపురుషులును వేఱ వేఱ పవనతనయుం డశ్వ
త్థామునిఁ బొడఁగనుట మొదలై గురునందనుండు మహామణి యిచ్చుట
తుది యైనవృత్తాంతం బంతయుఁ జెప్ప వాఘావల్లభుండు లేనుగా నెల్ల
వారును నపత్యబాధకం బైనయాబ్రహ్మశిరంబుప్రభావం బూహించి
[1]కృష్ణునిప్రతివిధానంబు గలుగుట నూఱడిల్లియు నెట్లగునో యను
శంక నుండి రత్తఱి నుత్తరకుం దక్కఁ బాండవేయవంశవధూజనంబులకు
గర్భంబులు లేక యుండె నయ్యస్త్రోత్తమం బవ్విరాటపుత్రియుదరంబున
నున్నపిండంబు బాధితంబు సేయుట గనుంగొని యప్పుండరీకాక్షుండు
ప్రాణితోసల్లాపంబు సేయు నవసరంబున నయ్యస్త్రఘాతవేదన లేకుండఁ
దనచిత్తవృత్తిన యుడిపెం గాన నవ్విశేషం బయ్యభిమన్యువల్లభయాదిగా
నెవ్వరు నెఱుంగ రది యట్లుండెఁ బుత్రులదెస వగ దొఱఁగకున్న
యాధర్మనందనుండు దేవకీనందనున కిట్లనియె.

103 చ. బలమున శౌర్యసంపద న[1]భంగపరాక్రములై సదా ప్రదే
యుల నొకరుండ ముట్టికొని యుద్భటవిక్రమ ముల్లసిల్ల దు
ర్బలుల వధించు చాడ్పునఁ గృపాణకళాలలితంబు లొప్పవి
చ్చలవిడిఁ ద్రుంచె నట్టి గురుసంభవుఁ డంతకు నెట్లు సాఁటెనో.

104 ఉ. ఉద్యోగ[1]స్ఫురితుం డజయ్యభుజవీర్యుం డిద్ధ[2]విక్రాంతసం
పద్యోగ[3]ప్రథితుండు శక్రసుతసంభావ్యక్రమోద్యద్ధను
ర్విద్యావైభవశాలి సంగరకళా[4]విస్తారసంవేది ధృ
ష్టద్యుమ్నుం [5]డతఁ డోర్వకున్కి యెటులశ్వత్థామయుద్రేకమున్.

---

102 1. కృష్ణప్రతి – పెక్కు ప్రతులు.

103 1. పార – అ.క.

104 1. స్ఫురణుండజేయ – శ. 2. సంక్రాంతి – శ.ప; విక్రాంతి – పెక్కు ప్రతులు.
3. ప్రతిముండు – ఊ; ప్రవరుం ను – శ.ప. 4. విస్ఫార – పెక్కు ప్రతులు.
5. డనినోర్వ – కొన్ని ప్రతులు.

105 క. తక్కును గలపాం-చాలుర
నొక్కఁడ శిబిరంబు [1]సొచ్చి యుక్కుదలిర్వం
జెక్కంబ్రఁ దునిమె[2]నకొ యిది
యక్కజ[3]మగు నేమికతన నధికుం డయ్యెన్.

106 వ. అనిన నమ్మహీకాంతునకు మురాంతకుం డిట్లనియె.

—: ధర్మరాజునకుఁ గృష్ణుఁడు శివప్రభావంబు చెప్పుట :—

సం. 10-17-6

107 చ. వారుఁ [1]బరమేశ్వరేశ్వరుఁ గృపాతిశయా[2]ర్ద్రు నమేయమూర్తి శం
కరు నచలైకభక్తి[3]రసగమ్యుని నవ్యయు నిందుమౌళిఁ ద
త్పరమతి నాశ్రయించి [4]యనపా[5]య[6]బలోద్భటశౌర్య[7]సంపదన్
గురుతనయుండు గాంచి యధికుం డగుటం బగదీర్చె నమ్మెయిన్.

108 చ. శివుఁడు ప్రసన్నుఁ డైన [1]నఱ చేయునె యెవ్వరి కైన రాజపుం
గవ యమరత్వమైన బలఘస్మరు గెల్వఁగ నోపునట్టిద
ర్పవిభవ [2]మైన నిచ్చుఁ [3]బరిపంథు ల[4]నేకులు నొక్కరుండు బా
హువిలసనంబు [5]ఘోరముగ నోర్వఁగఁ జాలుట [6]యీగి చోద్యమే.

---

105 1. నందునుక్కు — ఊ.ఓ.ఔ.ఖ  2. నిదికడున — ఈ.  3. మతడేమి — పెక్కు ప్రతులు.

107 1. బరమేశునీశ్వరు — వ.శ.ష.స; బరమేశ్వరున్ శివు — గ.  2. దరమూర్తి రుద్రు — శ.ష.  3. గత — అ.ఆ.ఇ.క; రత — డ.ప.ల; నత — ఎ.ఖ.గ.జ.  4. యనివార్య — ప.శ.ష.  5. మహోద్భట - అ.ఇ.క.  6. సంపదల్ — పెక్కుప్రతులు.

108 1. నదిచెల్లదె యెవ్వరికైన - ఈ; నఱచేయక - ఆ.ఇ.క.వ.  2. మిచ్చుచుండు - ఈ.ఎ.ఏ.ఖ.చ.ల.  3. ప్రతిపక్షుల — ఈ.గ.చ.  4. నెల్లను - పెక్కు ప్రతులు.  5. చెల్వముగ - ప.శ.ష.  6. యేమి - క.జ.వ; కేమిచోద్యమో - శ.

109 ఉ. [1]తెల్లమి గాఁగ [2]నేను శివదేవు నెఱుంగుదు భూతసంచయం
బెల్ల జనింప [3]నిల్వఁగ లయింపఁగఁ [4]జేయు [5]నతండె యవ్విభుం
డుల్లమునం [6]దలంప భువనోత్కరవిశ్వవిధాన[7]యుక్తి వ
ర్తిల్లుచు నుండు భక్తికి విధేయుఁ డమేయుఁడు కౌరవేశ్వరా.

110 వ. అమ్మహాదేవుని దివ్యలీలలు సెప్పెద నాకర్ణింపుము.

111 సీ. భూత[1]సంచయ[2]సృష్టి బుద్ధిఁ దలంచి య
ప్పరమేశుఁ గానఁగ బ్రహ్మయరిగె
తనదు మనోవృత్తి దగ నెఱింగించిన
నమ్మహాత్ముండు తదభిమతంబు
గావింపఁబూని తపోవిభవం బేమి
పనులకు నైనను [3]బ్రథమసాధ
నంబని యూహించి [4]యంబుసమర్పిత
నిజమూర్తియై తపోనిష్ఠనుండె
తే. నావిరించియు నద్దేవదేవు రాక
బహుసహా[5]స్రవర్షంబులు వాంఛయుండ
నిజతపఃప్రభావంబున నిపుణ[6]చిత్తు
దక్షుఁ డనువానిసృజియించె ధరణినాథ.

112 వ. ఇట్లు సృజియించి [1]యవ్విరించి యతని నాలోకించి ప్రజల సృజియింపు మని
పంచిన నతండు పెద్దవా రొండ్లు లేరై రేని[2]యు సృజియించెద ననిన
నప్పరమేష్ఠి పరమేశ్వరుండు జలనిమగ్నుండై యున్నవాఁ డేను నిన్ను

---

109 1. తెల్లము – పెక్కుప్రతులు. 2. నీవు – శ. 3 నిల్పఁగ – ప.శ.ష. 4. జేయుచు నుండు – ఐ ఒ. 5. నతండ – పెక్కుప్రతులు. 6. వలిర్ప – డ. 7. వృత్తి – ఒ. 8. దు సత్యము – డ.

111 1. సంభవ వృద్ధి – ఏ. ఐ ఓ ఔ. 2. వృద్ధి – పెక్కు ప్రతులు. 3. బరమ సాధ – ఉ. శ ; ధర్మ సాధ -- ఏ.ఒ ఓ.ఔ. 4. యంబుధి నిమగ్న – ఐ. ఒ. ఓ. ఔ. డ. బ శ., యంబు సమర్పిత – ఊ. ఘ. వ.; యంబు సమ్మార్జిత – వా. మూలం."దీర్ఘకాలం తపస్తేపేమగ్నోఽకంభసిమహాతపాః" 10–17–11. 5. ప్రాబ్ద ములకోర్చి భక్తి నుండి – శ.ష. 6. వృత్తి – ష.వ.

112 1. యి – వా; య – పెక్కు ప్రతులు. 2. యు – పెక్కు ప్రతులలో లేదు.

నియోగించెద నింక సృజియించుపెద్ద లెవ్వరును లేరు సృజియింతువుగాక యనవుడు నమ్మహాత్ముండు దేవాసురమనుష్యతిర్యగాత్మక భూతంబుల సృజియించిన [3]నా కొని యవి దక్షప్రజాపతి భక్షింపం గవిసిన.

113 ఆ. అతఁడు బ్రహ్మపాలి కతిరయంబునఁ [1]జాటి
భూతతతులు నన్నుఁ బొదువకుండ
నాఁగవలయు వాని కాహారములు గల్పి
తములు సేయవలయుఁ దగమహాత్మ.

114 వ. అనిన విని యా జగత్కర్త యోషధులును ఫలమూలాదిభక్ష్యసంపదుపకారంబు[1]లుగా వృక్షలతాగుల్మంబులను గల్పించి యా భూతంబులకు వాని నాహారంబులుగా సమర్పించి మఱియును బలిష్ఠభూతంబులకు దుర్బల భూతంబులు భక్ష్యం బగుం గాక యనియు నాదేశిం[2]చె నంత నా భూతంబులు ప్రీతంబు లై చని తత్ప్రకారంబున వృద్ధినొంది సంతాన రూపంబున సమృద్ధంబు లగుచునుండెఁ బెద్దకాలంబునకు బాలేందుధరుండు జలంబులు వెడలి వచ్చి భూతకోట్ల నాలోకించి కోపించి నిజలింగంబుఁ బుచ్చి నేలనిడినం గని యానీరజాసనుండు భవునిం బ్రశమనవాక్యంబుల ననునయించుచుఁ జేరనరిగి లింగంబు నిశ్చేల చేసి తనుటయు నద్దేవుండు.

115 క. భూతంబుల సృజియించుట
కై తోయములందు మునిఁగియత్యుగ్రతపః
స్థితుఁడనై వచ్చితి నొరు
చేతస్సృజనమగుట నిట్లు సేసితి దీనిన్.

116 వ. భూతంబుల సృజియించుటకుం గాక లింగంబు [1]దన కేల యని పలికి సంరంభ విజృంభితుం డగుచు మాల్యవంతంబునకుఁ జని మహాతపంబు సేయుచుండ[2].

---

3. నవియాకొని — పెక్కు ప్రతులు.

113 1. నేగి — ఈ ఎ.ఏ.చ.జ; జని — ఏ.ఒ ట ఔ. ద; బోయి — ఊ.గ.ఘ.వ.శ.ష.

114 1. లగు — పెక్కు ప్రతులు. 2. చినహా — పెక్కుప్రతులు.

116 1. దక్కైల — స. పెక్కుప్రతులు. 2. పెద్దకాలంబునకు — పెక్కుప్రతులు

117 క. [1]ఆసమయంబున లింగము
భాసురగతిఁ జూడ నొప్పె బ్రహ్మాదులకుం
జేసిరి పూజలు వారలు
వాసవ ముఖ్యామరాది వర్గముఁ దారున్.

118 వ. [1]అంతం బెద్దకాలంబునకు.

—: రుద్రుఁడు దేవతలు సేయు యజ్ఞంబు సేరుట :—

సం. 10-18-1

119 క. [1]సురలొక్క మహాధ్వరమా
చరింపఁగ దలంచి ద్రవ్యసంపద మిగులం
[2]దొరకొల్పి భాగయోగ్యా
మరుల నిరూపించి యతిసమాహితమతులై.

120 వ. తొడంగి యనుష్ఠానప్రపంచప్రవర్తకు లగు చుండిరి గాని రుద్రుని మహాను భావం బెఱుంగమిం జేసి యయ్యోగమూర్తికి భాగకల్పనం బొనర్పరైరి దాని నెఱింగి.

121 సీ. [1]అతులతపోమయం బయి యద్భుతావహం
బయిన దైర్ఘ్యంబున నతిశయిల్లి
బాలార్క సన్నిభప్రభఁ దేజరిల్లెడు
నట్లుగా నొక్క శరాసనంబు
సృజియించి దానికి శింజినీ ప్రముఖంబు
లగునంగకములు యజ్ఞాంగ కల్పి
తములు గావించి [2]యుద్దామకోపానల
జ్వాలలు [3]సాకారలీల నిగుడఁ

---

117 1. ఈపద్యము ఎ.ష. ప్రతులందు పక్కతక్కినవానిలో లేదు. మూలమునందును దీని ప్రసక్తి లేదు.

118 1. పెక్కుప్రతులలో లేదు.

119 1. సురలోకమహాధ్వరమ్మా — వా ; సురలొక్క మహాధ్వరమా — పెక్కు ప్రతులు.
2. బురికొల్పి - ఖ.శ.ష.

121 1. అమల - శ.ష. 2. యువగ్ర - అ.ఇ.క. 3. సహకార — అ; నాకార — ఔ ;

ఆ. గేలియం దమర్చి కృత్తివాసుఁడు సుర
శ్రేణి[4]క్రతువు నియతిఁ జేయునెడకు
నరుగుదెంచె సత్వరాభీల హేలాప్తి
కాసభాసి యగుచుఁ గౌరవేంద్ర.

122 మ. ధరణీచక్రము [1]దిర్దిరందిరిగెఁ బాతాళంబు ఘూర్ణిల్లె భూ
ధరముల్ పెల్లగిలెన్ దిశావలయ ముత్కంపంబు నొందెన్ దివా
కరచంద్రాగ్ను[2]లదీప్తి మాసె సురలోకం బాకులం బయ్యె న
ప్పరమేశుం [3]డటు తా మరుత్క్రతుపరిభ్రంశార్థియై వచ్చినన్.

123 చ. అనిమిషసంఘమెల్లను భయంబునఁ జేష్టలు దక్కె యధ్వరం
బు [1]నడప నేర్పు [2]లేది కురుభూవర చిత్రగతప్రకార మ
య్యె [3]నడరి యేసె నాక్రతు[4]వు నీశుఁడు డెందము గాఁడ బాటిపో
యె నది మృగంబుచందము వహించి హుతాశనసంయుతంబుగన్.

124 వ. ఇవ్విధంబున యజ్ఞం [1]బపక్రాంతం బగుటయు నిర్జరులు [2]నిశ్చేతనులై రందు సవితృనిబాహువులును బూషునిదంతంబులును [3]భగునిలోచనంబులును త్రిలోచనుండు గోదండాగ్రంబునఁ దునియను డొల్లను బగులను బొడిచె నప్పుడు [4]దలరి దివిజులు యజ్ఞాంగంబులతోడం గూడఁ బలుగడలం బాఱం దొడంగిన.

---

హుంకార — ఘ. 4. నియతిక్రతువు జేయు — పెక్కు ప్రతులు.

122 1. సంచలించెవెస — ఐ.ఒ.బ.వ. 2. లదీప్తులెరి — పెక్కు ప్రతులు. 3. డటులా మరు — ఖ.ల.శ.ష ; డజరామరక్రతు — ఎ.

123 1. నడుపు - పెక్కు ప్రతులు ; నగలవేడ్కచూడ — ఆ.ఎ ; నడుపుచొప్పు - ట ; నడపలేకపోయె — క.వ ; నడపనేరులేడ — బ. 2. లేక — పెక్కు ప్రతులు. 3. నెనసిననేసె — శ. 4. వుమేశుడు — ఊ.ఐ ఓ ఘ.

124 1. బు!పశాంతంబగుటయు — ఆ.ఈ.ఎ.ఏ.క.చ స ; బుశాంతంబగుటయు — ప. 2. నిశ్చేష్టితులై — ఔ.గ.బ.ల.శ.ష.స. 3. భగుని — పెక్కు ప్రతులు. మూలం "భగస్యనయనేత థా'' 10-18-16 ; భృగుని — వా.శ. 4. దలరి - పెక్కు ప్రతులలో లేదు ; బెదరి — అ.ఇ ; దత్తరిల్లి — ఈ.ప.చ.ట ; దలంకి — బ.

125 క. ఆదేవుఁ[1]డు వారందఱు
నే[2]దిక్కులఁ బోవకుండ [3]నెయిదె భయంబా
[4]పాదించుచు నలి నాఁగెం
గోదండము [5]నారి సాఁచి గుములు గొనఁగన్.

126 తే. ఏయనొల్లక [1]యమరుల నివ్విధమున
[2]బొదివికొని యీశ్వరుఁడు దూలపుచ్చ వార
లొక్క మొగి వింటిగొనయంబు పెక్కుదునియ
లయ్యె[3]డుమ యనవుడు నది యట్ల యయ్యె.

127 వ. ఆలోన.

128 క. సుర [1]లాక్రతువుం దారును
శరణం బనుపలుకుతోడఁ [2]జరణానతులై
కరుణకుఁ బాత్రములగుటయు
శరణాగతవత్సలుఁడుఁ బ్రసన్నతఁ [3]బొందెన్.

129 వ. ఇట్లు ప్రసన్నుండై.

130 తే. [1]ఆత్మకోపంబు [2]పుచ్చి జలాశయమున
వైచి బాలేందుధరుఁడు దేవతలనాద
రమున వీక్షించె నమ్మహోగ్రంపు[3]రోష
మనల[4]రూపమై [5]యిగిరించె నజ్జలముల.

---

125 1. ద ంతవారల – పెక్కు ప్రతులు ; డట్లనందర – ఉ ; డట్టులందర – అ.ఇ.ఎ.క. 2. దెసలం – పెక్కు ప్రతులు. 3. నెయ – శ ; నేదె – వ ; నేసి – ఉ, 4. పాదించుటగానాగెం – శ ; పాదించుచునెరినాగెం – ఏ,చ. 5. సాచిసాచి – పెక్కు ప్రతులు ; సాచికదిసి – ఐ.ఒ.వ ; సాచియపుడు – డ.శ.ష.

126 1. నమరుల–శ. 2. బొదువుకొని – ఆ ఎ ఏ.క.చ 3. డమ–పెక్కు ప్రతులు.

128 1. లోకేశుడు – క. 2. శరణాగతులై – ఒ.క.ట. 3. నొందెన్ – కొన్ని ప్రతులు.

130 1. అట్టి – ఊ ష ; అతడు – ఐ ఒ ; అతను – బ.వ. 2. నపుడు – శ.ష. 3. కోప – అ.ఇ క.ఖ.ట.శ.ష 4. రూపంబుతో ద్రావె – డ. 5. నిలిచెను – ష ; దహియించె – ప.

131 వ. ఇత్తెఱంగునఁ గృపాయత్తచిత్తుం [1]డై సర్వేశ్వరేశ్వరుండు సవితృనకుఁ బూషునకు భగునకుఁ గరంబులును దంతంబులుమ నయనంబులును నొసంగి యజ్ఞం బెప్పటియట్ల ప్రవర్తిల్ల ననుగ్ర[2]హార్ద్రభావంబునం బనిచిన.

132 క. అమరులు భక్తిం గ్రతుభా
గమునప్పరమేశ్వరునకుఁ గల్పించి రతం
డు మనంబునఁ బ్రీతుండై
సమాహితుం డయ్యె జగము సంతోషించెన్.

133 వ. అట్టివి [1]యద్దేవదేవుని దివ్యలీల లతండు కోపించిన భువనంబు [2]లస్వాస్థ్యంబును బ్రసన్నుండైన సుఖత్వంబును గను నాభూతనాథుండు గురుసుతునకు సన్నిహితుం డయ్యెఁ గావున నయ్యోధవరుం డొక్కరుండ శిబిరంబు ప్రవేశించి యిత్తెఱంగుపరాక్రమంబాచరించెఁ గాని యివ్విశేషం బారథికవరునిశక్తి[3]నైనది గాదిది చిత్తంబున నిడం బనిలేదు భీష్మద్రోణకర్ణశల్యాదులైన మహావీరులం బోరఁ బరిమార్ప దొరకొనుటకును దర్పదుర్దములైన ధృతరాష్ట్రనందనాగ్రేసరులైన దుశ్శాసన దుర్యోధనులఁ జలంబు నెరయ వక్షోరక్తపానంబున నూరుభంజనంబునం [4]బరిమార్చుటం జేసి ప్రతిజ్ఞాపూరణాచరణశోభనంబు నొంద [5]సంభావించుటకును గారణంబైన భవదీయ దైవమానుషయోగంబునకుఁ బరమానందంబు నొందుమని యిట్లు గోవిందుండు ధర్మనందనునకు నాశ్వాసం బొనరించె నని జనమేజయునకు వైశంపాయనుండు సెప్పుటయు.

134 స్రగ్ధర. సాయంప్రాతర్హుత ప్రజ్వలిత హుతవహాస్త్వైరనిర్ధూతజాడ్య
స్ఫాయ[1]చ్చేతః ప్రసాద[2] ప్రసృమరవిమలప్రౌఢ[3]బోధానుమోదీ

---

131 1. డైన సర్వేశ్వరుండు - పెక్కు ప్రతులు; డైయప్పరమేశ్వరుండు — శ.ప. 2. ప్రభావంబున — కొన్ని ప్రతులు.

133 1. యద్దేవుని — పెక్కు ప్రతులు; 2. లస్వస్థంబులును — కొన్ని ప్రతులు; లు విధ్వంసంబులు — కొన్ని ప్రతులు. 3. ప్రతాప పరాక్రమంబులనైనదిగాదు యిది — ఊ.ఐ.ఒ ఓ ఘ. 4. బరిభూతులం—పెక్కు ప్రతులు. 5. సంభవించుటకు—పెక్కుప్రతులు.

134 1. చ్ఛివత్రిసాద — కొన్ని ప్రతులు 2 దాస్పదవిమలతర — ప.స; దాపరిశమన విమల - శ; దాస్పద ధృతవిమల — ఐ.ఒ.ఓ ఔ.ఘ. 3. లీలానుమోదీ - కొన్ని

మాయా [4]వ్యాపారదూరా [5]మఖతతివిహృతినిర్మాణ సంపాద్యమానా
శ్రేయోరాజత్ప్రిలోకాశ్రిత జన[6]దురిత[7]క్షేపలీలా[8]విలాసా.

135 క. [1]సురనికరానందకరా
సురారికాంతావిలాస శోభాపహరా
కరుణాసక్తమనస్కా
సరిద్వరా బర్హిబర్హచారుశిరస్కా.

136 మాలిని. అకలుష [1]హృదయాభివ్యక్తసర్వోపయుక్తా
సకలనిగమవేద్యా [2]స్వాస్థ్యవిద్యోపపాద్యా
ప్రకృతివికృతిభావప్రాప్తసాంఖ్యప్రదిష్టా
సుకృతమయవిలాసా సుస్థిరానంద భాసా.

గద్యము. ఇది శ్రీ మదుభయ కవి మిత్త్ర కొమ్మనామాత్య పుత్త్ర
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతంబైన [1]శ్రీ
మహాభారతంబున సౌప్తికపర్వంబునందు సర్వంబును
ద్వితీయాశ్వాసము.

శ్రీమదాంధ్ర మహాభారతము నందలి సౌప్తికపర్వము సమాప్తము.

---

ప్రతులు 4. యోగాను - శ.ష 5. మధుర విహృతి – పెక్కు ప్రతులు.
6. ముదిత శ్రీవిలాసా విశాలా – క 7. క్లేశ హారివిహారి – ఎ. 8. విశాలా – పెక్కు ప్రతులు.

135 1. సురనికర కరణ భీకర, సురప రికాంతా విలాస శోభనహారా – శ

136 1. గుణసక్తా అంచితస్థానయుక్తా - ఈ.ఏ.గ.చ. 2. స్వస్తి - కొన్ని ప్రతులు ; స్వచ్ఛ - శ.ష.

137 1. శ్రీ మహాభారతంబున– పెక్కుప్రతులలో లేదు.

—:o:—

# శ్రీమదాంధ్ర మహాభారతము

## స్త్రీపర్వము - ప్రథమాశ్వాసము

—→o←—

1 క. శ్రీసాంగత్య విధాయి వి
కాసోల్లాసిత కటాక్ష కరుణామయ మూ
ర్తీ సార బోధ [1]భరిత
వ్యాసాది మనో[2]నివాస హరిహరనాథా.

2 క. దేవా జనమేజయ జగ
తీ వరుఁడు గుతూహలము మదిన్[1]మొల తేరం
గా వైశంపాయనవద
నావేశిత [2]దృగ్విలాసుఁడై యిట్లనియెన్.

3 వ. తన సుతుండును [1]సైన్యంబును బాండుసుతుల చేత [2]నట్లగుట సంజయు వలన విని ధృతరాష్ట్రుం డెబ్బంగి వర్తించె నశ్వత్థామ కృప[3]కృతవర్మ లా రాత్రి తమ చేసిన పరాక్రమంబు తెలుంగు దుర్యోధనుఁ కెఱింగించి పోయిరని వింటిఁ బదంపడి కరినగరంబు దెస కరిగి మగిడి రనియు నాకర్ణించితి వార[4]లట యెవ్వలనికిం జని[5]రేల మగిడి రశ్వత్థామ కృష్ణద్వైపాయ నాశ్రమంబునకుం బోవం దక్కిన యిరువురు [6]నెక్కడ వోయి రవ్విధంబున విజయంబు నొందిన ధర్మనందనుం డేమి యాచరించె నంతయుం బరిపాటిం దేటపడం జెప్పు మనిన నమ్మునివరుం [7]డిట్లనియె.

---

1 1. మహిత - ఇ.ఈ. 2. నిధాన - డ.

2 1. మొలువంగా - గ. 2. దృగ్విలోలుడై - డ.

3 1. తత్సైన్యంబును - ఈ.ఐ. 2. నీల్గుట - ఈ. చేతం దెగుట - ఏ.ఒ.గ. 3. కృత వర్మ - అ.ఉ. 4. లటనెవ్వలనికిం - ఐ.వీ.ష; లటయెప్పనికం; లటయేమి పనికిం - వ. 5. రెట్లు -- ఆ.ఇ. 6. నెందుబోయి - పెక్కుప్రతులు; నెందెందు పోయి - వ; రెక్కడెక్కడపోయి - అ.ఉ.క.గ.వ. 7. డు జనమేయున కిట్లనియె - అ డ ; డమ్మనుజపతి కిట్లనియె - క.

4 తరల. ధరణినాయక [1]యట్లు పుత్రశతంబు వైరికులంబుచే
నిరవశేష [2]తనొందుటఁ మహనీయ గౌరవహీనతం
బొరసి [3]కొమ్మలు దున్మ మ్రోడ్పడు భూరుహంబునుబోలె ని
[4]ర్భర విపద్వికలాత్ముఁడై ధృతరాష్ట్రుఁ డుల్లము [5]వమ్మగన్.

5 వ. చింతాభరంబున [1]నూరక యున్నం జూచి సంజయుం డతని కిట్లనియె.

6 ఆ. నీకు నితరు[1]లట్ల శోకింపఁ[2] దగునె యె
వ్వరిఁ దలంచి [3]యింక వనరువాఁడ
వీవు శోకమునకు నెయ్యది తుది [4]యిది
వలవ [5]దుడుగు [6]వినుము వసుమతీశ.

7 వ. పదునెనిమిది యక్షౌహిణులు సమసెఁ బితామహ పితృభ్రాతృ పుత్ర పౌత్ర [1]సఖి [2]సుహృత్సహాయులుం దెగి రందు వగపునకుం బని [3]గానివారలు గలరే యేది కోలందిగా వగచె దందఱకు నగ్నికార్యం[4]బు నిర్వర్తింపను దగిన వారలకుం దిలోదక [5]ప్రదానంబులు సేయను వలయుఁ [6]బొలిగలనికి [7]వెంచేయు మనుటయు.

8 క. విపులార్తిఁ [1]గూరి మనుజా
ధిపయాభూవల్లభుండు ధృతి [2]లేమిం జం
డపవన పతితం బగు [3]పా
దపంబు చందంబు దోఁప ధరణిం బడియెన్.

---

4 1. యిట్లు — ఈ.ఉ.ఔ.గ. 2. ముబొందుటన్ — పెక్కుప్రతులు ; తనొందనమ్మహా — గ.వ. 3. కొమ్ములు — అ ఇ.ఈ.ఉ.ఊ.వా. 4. ర్భరదశావికలాత్ములై — ట. 5. నొవ్వగ — అ ; వేపగాన్ — ఇ ; — ఇ ; తుంగగాన్ — ఈ ; వెమ్మఁగన్—వా.

5 1. నూరకుండుటం - ఔ ; నూరకుండుటకు — కొన్నిప్రతులు;

6 1. లట్లు — ఉ ; నట్లు — గ. 2. నగునె - ఆ ఉ.ఊ.ఏ ఒ. 3. నీవువనరువాఁడ వింక — పెక్కుప్రతులు. 4 మొదల్ — ఊ. 5. దుడుగవయ్య ఇ ఓ. 6. నీవు—ఈ.

7 1. బంధు — ట. 2. సుహృదాది — ఏ.ఐ. 3. లేని — గ. 4. బులు — ఆ.ఏ.ల. 5. పిండప్రదా గ చ. 6. బోరికలనికి — చ. 7. విచ్చేయుమనుటయు—చ.డ.ల ; విజయం చేయుమనుటయు — కొన్నిప్రతులు.

8 1. బొంది — ఈ; గూలి —క.వ. 2. లేమిని — ఆ.ఒ.ఔ. 3. పాదపమును — చ ; పాదపమగు — గ.

9 వ. [1]పడి యుండి తల దోర్చికొనుచు ని ట్లనియె.

10 వసంత తిలకము: [1]హా పుత్రవర్గ మిటు లాఱడిఁ బోవ దీప్త
వ్యాపార మేది మది [2]వందుచు దీనవృత్తిం
బ్రాపించి యన్యులకు[3]కృపం బరికింప నింకే
నోపన్ [4]భవం బెడలి యుండఁగ జీవి[5]తోడన్.

11 క. ఎఱుకలు విఱిగిన [1]గరుడుని
తెఱఁగునఁ దేజంబు సెడిన దినకరుగతి నం
దఱు బంధులు దెగి విభవం
బఱి వెలవెలఁబాఱు చునికి యది [2]బ్రదుకగునే.

12 సీ. సంధికిఁ [1]గృష్ణుండు సనుదెంచి పెక్కు భం
గులఁ [2]జెప్ప భీష్ముండు గుంభజుండు
నట్లు [3]హితార్థులై యంతలంతలు మాట
లాడిరి జామదగ్న్యాదులైన
మునివరు లవ్విధంబున [4]నొత్తి చెప్పి రా
బుద్ధులన్నియును దుర్బుద్ధి నగుటఁ
[5]బాటింప నైతి [6]లోభమునఁ బాండు నృపాలు
పాలు తత్సుతులకుఁ బంచి [7]యీని

తే. నాకతంబునఁ బొలిసిరి నందనులును జెలులుఁ
జుట్టంబులును సహాయులును ధైర్య
మెట్లు కలుగు [8]వైదికముల కెట్లు మనసు
గొలుపుఁ బ్రాణంబుతో నెట్లు నిలువవచ్చు.

---

9 ఇట్లుపడినయాంబికేయుని సంజయుండెత్తి శిశిరవీధులందేర్చిన — ఏ.ఒ.ఒ. 2. పోయుచు — ఈ.చ.వ.

10 1. అపుత్ర — ఊ.ఐ.చ. 3. వందురి — వ.పీ. 2. లుకృపం — ఆ.ల. 4. భరం బెడలి — వ. 5. తార్థిన్ — ఈ.

11 1. గరుడని — పెక్కుప్రతులు. 2. బ్రతుకగునే — కొన్నిప్రతులు.

12 1. కైకృష్ణుండు — ల. 2. జెప్పె — ఈ.ఊ.ఎ.ఏ.ఓ.క. 3. హితాత్ములై — గ.వ. 4. నోలిచెప్పి — జ; నొత్తిపలికి — కొన్నిప్రతులు. 5. బాలింప — వ. 6. లోభంబునఁబాండునిపాలుతత్సుతులకు — కొన్నిప్రతులు; లోభంబునఁపాండు నృపాలు భాగంబును బంచియీని — ల. 7. యీన — స. లౌకిక — ఈ ఊ.వ.

13 క. [1]నాకీడు దలఁప నేరక
[2]శ్రీకి నెడపి పాడి యింత సేయక పుత్రా
నీక సుహృద్బాంధవులం
బోకార్చితి బ్రదుకుటింకఁ బొసఁగునె చెపుమా.

14 వ. దైవంబు దుఃఖభాజనత్వం బొనర్చుటం బూర్వజన్మాచరితం బైన సుకృతంబు లేమిగాన నయ్యెడు వయఃపరిణా[1]మంబునఁ బంచభూతక్షయంబున దుర్వినయపరిపాకంబున సకలబంధునాశంబును సమయప్రాప్తంబు లయ్యె నింక బ్రహ్మపదప్రాప్తియ తగు నదియైయున్నది యది యాచరించుట [2]సంశితవ్రతపరాయణులైన పాండుసుతులు చూతురు గాక యనిన విని యజ్జనపతి శోకంబు శాంతంబు సేయుటకు సంజయుం డిట్లనియె.

15 క. శ్రుతులును శాస్త్రములు బహు
శ్రుతులవలన వింటి శాంతి చొప్పడవలదే
మృతికి నృపు [1]డలుదురె ధీ
యుతు లీవిధమునకు రోయ కుండుదురె నృపా.

16 వ. తొల్లి సృంజయుండు పుత్ర[1]శోకార్తుండైనమరముని సత్తముండగు నారదుం డుపన్యసించిన యితిహాసం బభిమన్యు మరణ [2]శోకసంతప్తుండైన ధర్మతనయునకుం బరాశతనయుండు సెప్పిన చొప్పునన యేనును జెప్ప నాకర్ణించితి గాదె సుహృజ్జనంబు లుప[3]దేశించిన మాటలు విననైతి నని నీవ చెప్పె దుమ్మలింపం బనియేమి నీకును నీకొడుకునకు మంత్రులు దుశ్శాసనుండును గర్ణుండును శకునియు నలె యేమి సెప్పఁగల దవధరింపుము.

---

13 1. ఆకొలఁది — ల. 2. శ్రీకైతగుపాడి — గ.శ.ష.స ; శ్రీకినడపి — స. కొన్ని ప్రతులు.

14 1. పాకంబున — క.గ. 2. సంశ్రితత్రాణ — ఆ ; శంసిత — వ; సత్యవ్రత - గ; సునీతి - చ ; సంభృత — జే.

15 1. లడలుదురె — అ.చ.వ.పీ.

16 1. శోకాయత్తుండైన — ఉ. 2. శోకాక్రాంతుం — ఏ.ఒ. 3. శింపనమ్మాటలు — కొన్ని ప్రతులు.

17 ఆ. కొఱత నులుకు గాని కొడుకెన్నఁడును గార్య
తంత్రమునకుఁ జొరఁడు దాని నీవు
మాన్పనొల్ల వతని మగఁటిమియును లావు
నచ్చి లోభ [1]మెదఁ బెనంగొనంగ.

18 క. ఆర్యులు దఱితోఁ దగియెడు
కార్యమనుష్ఠింతు రట్టుగా కప్పని మా
త్సర్యమునఁ దిగిచి పట్టి య
నార్యులు దుదిఁదూర వగతు రాపదయైనన్.

19 ఆ. జున్ను డెప్పరంపు జో[1]లైన చఱి నున్నఁ
జూచి విఱుగఁబడుటఁ జూడకాత్మఁ
దీపుఁగోరి యుఱుకు తిండికాఁడునుబోలె
నయితి వగచు టింక ననుచితంబు.

20 క. వగచినఁ బోయిన కార్యము
మగుడునె వగవంగ లోకమాన్యుం డగునే
వగ పుణ్యగతికి మూలమె
వగ [1]పెల్లవిధముల నుడుగవలయు నరేంద్రా.

21 మత్తకోకిల. తాన చుట్టు దగిల్చియగ్ని యుదగ్రతం దరికొన్నఁ [1]దా
పానుభూతికి నోర్వఁజాలక యప్రయోజనవాక్య సం
తాన శోషితవక్త్రుఁడై [2]యతిదైన్య మొందెడువానియ
ట్లైన నీదు విలాప మన్యుల [3]కాడఁ బట్టగు భూవరా.

---

17 1. యెడఁనఁ బెచ్చుపెఱుగ — జ శ.

19 1. జొంపనచఱి — జ ; జొప్పైనచఱే — త.

20 1. పెవ్విధమునను నుడగ — వ.

21 1. దావానుభూతి — చ.వ. 2. తుది — వ. 3. కాటపట్టగు — స. కొన్ని ప్రతులు.

22 ఆ. [1]నీవుఁ గొడుకుఁ బలుకు నిష్ఠురవచనంబు
లను సమీరగతుల నతిశయిల్లు
పార్థరోషవహ్ని పాల్పడి రథప నీ
వారలెల్ల నింక [2]వగవఁ [3]దగునె.

23 వ. అని యనేకభంగులం బలికిన సంజయు పలుకులకుం జెవి[1]యొడ్డి ధైర్యంబు చిక్కఁబట్టి యంకిలి [2]దేఱిన యవ్విభు నాలోకించి యేల [3]నేలంబడి పొరలెదు లెమ్మని పలికి విదురుం డిట్లనియె.

-: విదురుఁడు ధృతరాష్ట్రునకు దుఃఖోపశమనంబు చేయుట :-

సం. 11-2-1

24 క. పెరుఁగుట స్రగ్గఁగ [1]రుచులఁ
బొరయుట యసుచంబు గాఁగఁ బుట్టుట సావం
బెరయుట పాయఁ బదార్థో
త్కరముల [2]నైజ మది యెట్లు దప్పింపనగున్.

25 సీ. బిరుదులనైనను బిఱికివాండ్రను నైనఁ
జంపుచోఁ గడపఁడు జముఁడు నేర్పు
లావును మర్త్యుని చావు మాన్పఁగ లేవు
రణ మొనర్చినఁ గాని రాదె మరణ
మెయ్యది [1]యవధి యిందెల్లవారును దెగు
[2]వారకా కది గడవంగ వశము
గాదింత యమ్మలికం బేల యట్లును
గాక నీ సుతులు సంగ్రామ కేళి

22 1. నీదుకొడుకు — కొన్నిప్రతులు. 2. వనరఁజనుచె — వ. 3. జన్నె, జనునె — అని పాఠములు.

23 1. యొగ్గి — ఈ.ఎ.శ. 2. దేఱునవ్విభు — కొన్నిప్రతులు. 3. నేలంబొరలేదు — కొన్నిప్రతులు.

24 1. జవులం — న. కొన్నిప్రతులు. 2. నైజంబులెట్లు — కొన్నిప్రతులు.

25 1. నియతి — కొన్నిప్రతులు. 2. వారలేవిధిగడవంగవసము — జ.

తే. నలిపి యిందుని కతిథులై చనిరి యజ్ఞ
దానవిద్యాతపోలబ్ధ మానసీయ
గతులు సమరానివర్తన మృతుల యరుగు
నట్టి గతులకుఁ బాటిగా వంద్రుబుధులు.

26 వ. కావున వారికి వగవం బని లే దది [1]యట్లుండె సంసారంబున మాతృ పితృ సోదరదారపుత్ర సహస్రంబు లనుభవ గోచరంబు లయ్యె నం దెవ్వరికి వగచెద వని వెండియు.

27 తే. యౌవనంబును రూపంబు జీవితంబు
ద్రవ్యసంచయములు ననిత్యములుగావె
వీని హానికి వగపవివేక మగుటఁ
బండితులు వగఁగూరరు పౌరవేంద్ర.

28 వ. పాండిత్యసంపన్నుండ వగునీవు బంధు [1]జీవహానికి వగవం [2]దగునె వగవ కూరకునికి మే లాకర్ణింపుము.

29 ఇంద్రవజ్ర. చింతా [1]పరత్వంబునఁ జెందు దుఃఖా
క్రాంతత్వ మురీశ్వర కానఁ [2]గిడుం
[3]జింతింపఁ డార్యాత్ముఁ డచింతనుండై
యంతఃపరీతాపము నార్పఁ జాలున్.

30 క. ప్రియవస్తు వెడలుటయు న
[1]ప్రియంబు వాటిల్లుటయుఁ బరిజ్ఞాన విని
శ్చయహీనులైన యల్పా
శయులకు దుఃఖంబుఁ జేయు జగతీనాథా.

---

26 1. యెట్లంచేని – స. కొన్ని ప్రతులు.

28 1. జీవిత – కొన్ని ప్రతులు. 2. బని లేదు – కొన్ని ప్రతులు.

29 1. భర – జ.వ.శ. 2. నెప్డుం – వీ.శ.ష. 3. జింతింపకార్యుండ చింతనుండై – స.

30 1. ప్రియములు – కొన్ని ప్రతులు.

31 వ. పండితుల నవి గలంపం జాల వనిన విని ధృతరాష్ట్రుం డతని దెక్కు [1]మొగంబుగాంగం గూర్చుండి నీ సుభాషితంబులకతంబున [2]శోకంబు డిందు పడియెం బండితులు ప్రియాప్రియవస్తు వియోగ సంయోగంబు [3]వలన జనించు మానసదుఃఖంబుల నేమిటం జేసి పొరయ కుండుదు రది సెప్పు మనుటయు నమ్మనుజపతి కతం డిట్లనియె-

32 క. ఈ లోకము నిస్సారం
బాలోకింపంగ [1]ననంటియట్టుల యనితా
లోలతం బొందని పురుషుం
డేలా నెవ్వగలం [2]జెందనిచ్చు మనంబున్.

33 తే. అరయవచ్చినం దనమేను నెరవతనకు
వొండు రూపులు దక్కక యునికి యరుదె
యనుతలంపు [1]ధ్రువంబుగ నలవరించి
[2]బుధజనంబులు శోకంబుం [3]బొరయ రధిప.

34 సీ. ఒకయింట నుండి వేఱొక యింటి కరిగిన
[1]విధమును వస్త్రంబు విడిచి యొండు
వస్త్రంబు గట్టిన [2]వడువును నై యుండు
నొడలు దొఱంగి [3]యొండొక్క యొడలు
గైకొంట నృప వినుకడవకు సారెపై
నమర మృత్తిక యిడునపుడు విరియు
టయు వెరవారం బట్టంగ రాక [4]చెడుటయు
[5]వానియెత్తెడునెడ వ్రియ్యుటయును

---

31 1. కై కూర్చెండి — ఒ ఓ చ ; బుగాంగూర్చుండి–కొన్ని ప్రతులు. 2. నాశోకంబు — ఈ.చ. 3. బులవలన — కొన్నిప్రతులు.

32 1. నధిప — పీ. 2. జేరనిచ్చు — కొన్ని ప్రతులు.

33 1. దృఢంబుగ — పెక్కు ప్రతులు. 2. పండితులు వగం గూరరు పొర వేంద్ర — జ. 3. బొందరధిప — పెక్కు ప్రతులు.

34 1. విధమున — కొన్ని ప్రతులు. 2. వడుపువు — చ. వరుస నై యుండు నీయొడలు దొరంగి — చ. 3. గాక.థ. కొన్ని ప్రతులు. 4. దాని — ఓ.క ; వాని — వా. పెక్కు ప్రతులు.

తే. నెత్తియొకచోట డించిన నెడలుటయును
నెండి యవియుటయును నాప మిడినఁబరి
పోవుటయు వాడుజనులచేఁ బోలియుటయును
గలుగుగతి మేని కెట్లును గలుగుఁజేటు.

35 వ. అది యెట్లంటేని గర్భాధాన వేళయందును శుంభావస్థయందును బ్రసూతి మాత్రంబున బాల్యంబునను యౌవనంబునం బ్రౌఢత్వసమయంబునను వార్ధకంబునం గర్మానురూపం బగుచాశంబు శరీరంబునకు సంప్రాప్తం బగు నిదికొలందియని యెఱుంగరా దట్లగుటం దమతము సుకృత దుష్కృతంబుల తెరువు[2]లఁ బోయిన నీతనయాదులవలని వ[3]గలంబొగులం బ్రయోజనంబు లేదు ప్రాజ్ఞులు వివేకంబున సంసారంబు దుఃఖబహుళంబని యెఱింగి [4]తద్రూపగహనంబు గడచి శాశ్వత సుఖంబుఁ బడయుదురనిన విని యాంబికేయుండు సంసార దుఃఖబహుళతయును [5]దద్గహనత్వంబును నెఱింగింపు మనుటయు నవ్విభునకు విదురుం డిట్లనియె.

36 తే. కలసి శుక్లశోణితములు [1]కరుడుగట్టి
విను మమేధ్య మధ్యమునఁ బ్రవృద్ధిఁ బొంది
కాలవశత నప్పిండ మంగంబు లెల్లఁ
గలిగి శిశువయి మారుఁగతి యెలర్పు.

37 క. వెడలునెడ గాఢపీడం
బడినుడివడి యోని నొత్తువడి యొకభంగిన్
వెడలఁగ గ్రహాభూతముల
ప్పుడు [1]దొడఁగి యనేక దురితములు గల్పించున్.

38 వ అట్లు [1] జనియించి మనుజుండు.

---

35 1. దైయుండునది — కొన్నిప్రతులు. 2. లంబనినతనయు — కొన్నిప్రతులు, 3 వగలంబ్రయోజ — కొన్నిప్రతులు; వగలం బ్రయోజ — అ.జ.ఓ.చ. 4. తద్గహనంబు — ఈ.న. 5. తద్రూపగహనత్వంబు — కొన్నిప్రతులు.

36 1. కరడు — కొన్నిప్రతులు.

37 1. గణగి — వ.

83 1. జనియించిన మనుజుండు — కొన్నిప్రతులు.

39 క. బాలత్వంబున నవివే
కాలోలత శుచియు నశుచి యైనదియు సమం
బై లీల జుగుప్సిత[1]విధి
శీలత నొందంగ దుర్విచేష్టలఁ దిరుగున్.

40 క. యౌవనమున విషయపర
త్వావేశము దుఃఖకారి యై యలఁపఁగ నా
నావిధదుర్వ్యసనములకుఁ
దావలమై మెలఁగు నిందితప్రక్రియలన్.

41 మత్తకోకిల. వృద్ధుఁడై నతఁడిట్ల బలంబును వీఁకయుం దఱుఁగంగ దు
ర్బుద్ధి వాటిల గ్రమ్మి యిందిర్యముల్ విశక్తతఁ బొంద [1]దో
షోద్ధతిన్ రుజ లు[2]ద్భవింపఁగ నొందురూ పగుపాశసం
బద్ధుఁ జేసి జముండు [3]దివ్వఁగఁ బాయునబ్భవముం దుదిన్.

42 వ. కావున సంసారంబు దుఃఖబహుళం బగుట విస్పష్టం బది యట్లుండె లోభ
క్రోధ మదోన్మత్తులై దుర్మతు లింద రమింతు రిందలి [1]సుఖలేశంబునకై
యొండొరులం జెఱుపను జంపను జొచ్చి ధర్మపథంబు దప్పి యమకింకరుల
[2]చేతం బడుదు రిత్తెఱంగు బుధులవలనఁ దెలియ విని విమలస్వాంతులు
సన్మార్గంబున వర్తిల్లి నిత్యానందస్వరూపు లగుదురు దీని గహనత్వంబు
పెద్దలచేత వినినతెఱంగు సెప్పెద నాకర్ణింపుము.

---

39 1. విధిశీలత — కొన్ని ప్రతులు.

41 1. దర్పోద్ధతిన్ — కొన్ని ప్రతులు. 2. లుప్పతిలఁగ — కొన్ని ప్రతులు.
3. ద్రివ్వఁగ — ఈ.ఒ.బొ.చ.వ.

42 1. సుఖావేశంబుల — పెక్కు ప్రతులు. 2. చేతఁ బీడం బడుదు — కొన్ని ప్రతులు;
చేత బాధలంబడుదు — కొన్ని ప్రతులు.

—: విదురుఁడు ధృతరాష్ట్రునకు సంసారగహనంబు తెఱం గెఱింగించుట :—

సం. 11-5-1

43 తరువోజ. అతిదుర్గమ మగునరణ్యప్రదేశమున[1]నవనీసురుం డొకఁడరుగుచు నుండ
మితి లేని ఘోరంపు మృగములు శరభమృగపతిప్రముఖముల్ మిక్కిలిభయము
మతి కావహించుచు మార్గంబునందు మల్లడి గొనుడు నున్మార్గయానమున
ధృతి దూలఁ జన నవి తిరిగె [2]వెన్వెనుకఁ దెక్కలికాఱు దోఁతెంచి రాతనికి

44 వ. అట్టియెడ.

45 తోటకము. గరు[1]పాఱఁగ మేను ప్రకంపమునం
బోరిఁ దొట్రు వడం బదముల్ [2]దొలఁగం
జొర [3]నెచ్చోటు లేమి ననువ్యయభీ
భర మొందినఁ జేష్టుడు [4]భావముతోన్.

46 తే. దెసలు గలయంగఁ జూచుచు దిక్కు దనకు
నెవ్వరును లేమి [1]వెగడందు నెంతదవ్వు
సనిన [2]నడవికిఁ గడ లేమియును మృగవ్ర
జంబు పొదువుటయును గొందలంబు సేయు.

47 వ. అప్పు డాభీషణారణ్యంబున నేదిక్కు సూచినను దఱచుగా నొడ్డినయురులు
దోఁచె ఘోరాకార యగునొక్కయువిద యతనిం గాఁగి[1]లించుకొని యొం
బంచశి[2]రంబులును నగనిభంబులు నగునాగంబు లనేకంబు లవ్వనంబునం
గ్రందుకొనం దిరుగుచుండెఁ దత్ప్రదేశంబున నొక్క[3]యుదపానంబు వల్లి

---

43 1. నవనీశయొకనరుఁడరుగుచునుండ — పీ.స. కొన్ని ప్రతులు. 2. వెన్వెంటఁ దెక్కలి కాండ్రు — స. కొన్ని ప్రతులు.

45 1. పాఱడు - కొన్ని ప్రతులు. 2. దొరుగం - కొన్ని ప్రతులు. 3. నెచ్చటు - కొన్ని ప్రతులు ; నెచ్చట - శ ; నేర్పు (లు) ను - ఊ.జ. 4. భారము - ఊ.ఓ.

46 1. వెడగందు — ఆ.జ. 2. నతనికి — చ.

47 1. టంజేర్చికొని — పీ.శ.షు. 2. శిరస్కంబు — ఔ.గ.జ.వ ; శిరంబులగు నిభంబు లనేకం - అ.ఈ ప.చ. 3. యుదకస్థానంబు — వ ; యుధకావాసంబు — ఊ.జ.ఔ ;

వితానంబుచేత సంవృతంబై మీఁదఁదృణంబులు [4]వఱఁగి నిగూఢంబై యున్న నప్పు[5]రుషుం డానూతంబడి యొక్కబలుదీఁగం దవిలి తలక్రిందై వేలుచుఁ గొమ్మనున్న పనసపంటిచందంబున[6]నుండె నట్లయ్యవస్థ [7]నొందియు నక్కూపంబులో నొక్క భీమభుజంగంబు నాలుకలు [8]గ్రోయ నాఱుదలలును బండ్రెండు కాళ్లును గృష్ణశబల వర్ణంబును గల[9]మహాగజం బానూతిదరి నున్న తరువుఁ జేరం జనుదేర [10]నందు శాఖోపశాఖల నానావర్ణంబు లగు మధుకరంబులు మధుసంచయనం బాచ[11]రించి వర్తింప సితాసితంబు లగు [12]మూషికంబు లమ్మహీరుహంబు మూలంబు నఱుకుచుండ.

48 ఉత్సాహావృత్తము. ధరణినాథ వినుము మధువుధార లెల్లప్రొద్దునుం
దొరుఁగుచుండ నతఁడు వాని దోహలమున నానుచుం
బొరయఁడెప్డుఁదృప్తి [1]వగలప్రోక యైనయట్టి దు
స్తరపుటున్కి గొల్లఁబాటుఁ దన్కఁ డించుకేనియున్.

49 వ. ఇట్లున్న యతనికి నా [1]బహువ్యాళంబులం [2]దెక్కలికాఱుల యురుల వలనను నయ్యుగ్రకామినీకారణంబుననుం బంచశిరస్కంబులగు సామజంబుల సందడి నాకూపంబులో నున్న యద్దారుణదర్వీకరఁబుకతంబునను నూతిదరిం జరించునగ్గజంబు ఘోరత్వంబునం జేసియు మూషికంబుల తరుపతన హేతుభావంబునను [3]నాచంచలచంచరీకంబుల కారించుటనుం జేతో[4]వృత్తంబు [4]వికలతాయత్తంబై యుండ [5]నతండు జీవితాశయు విడువం డనిన విని విదురునకు ధృతరాష్ట్రుం డిట్లనియె.

---

ఉదకపానంబు — ఎ.క.చ. 4. వెరిగి — కొన్నిప్రతులు. 5. డాపురుషుండా — ఆ.ఈ.ఎ. 6. నొందెనట్లు — జ. 7. నుండియు — ఉ.ఓ. 8. గ్రోయుచుం(డె)డ నాఱు — కొన్నిప్రతులు. 9. యొక్కమహా — పెక్కుప్రతులు; మహానాగంబా— కొన్నిప్రతులు. 10. నందుల — కొన్నిప్రతులు. 11. రింపసితాసితంబు — అ.ఈ.ఐ. 12. మూషకంబు — పెక్కుప్రతులు.

48 1. గీడు — స. పెక్కుప్రతులు.

49 1. బహుముఖ — కొన్నిప్రతులు. 2. లవలనం — కొన్నిప్రతులు. 3. నాచంచరీకంబు — కొన్నిప్రతులు. 4. వృత్తి — క జ.వ. 5. నన్నరుండు — కొన్ని ప్రతులు.

50 క. మనమునఁ గృపవుట్టెడు న
ట్లనయముఁ గీడై నయునికి కాతం డెమ్మెఁ
గనియెను విదురుఁ డానిఁ
వినవలతుం జెప్పవే వివేక[1]నిరూఢా.

51 కవిరాజవిరాజితము. అనవుడు నిట్లను నన్నరపాలున కాతఁడు మోక్షము నర్థి[1]జగ
జ్జనులకుఁ బుట్టుట సన్మతిఁ గోరి విశారదు లాదరసంభృతులై
యనఘుసుదుస్తరమైనభవంబున కచ్చగు నీ యితిహాసము బో
ధనమహనీయ విధంబు[1]నఁ జెప్పిరుదాత్తగుణాశ్రయతామహితా.

52 వ. కావున నేతత్స్వరూపం బభివ్యక్తంబుగా వివరింప వలసి యుండు వినుము
చెప్పెద నాదు[1]ర్గంబు సంసారగహనంబు వాలుమృగంబులుఁ దెక్కలికా
ఱులు నురులు రోగంబులు కామినిజర పంచశిరస్కంబు లగుగజంబు లింద్రియ
[2]ప్రపంచంబు లా కూపంబున నున్న నాగం బంతకుండు తీఁగ జీవితాశకూ
పంబు నుపాంతంబున నున్న యవనీరుహంబాయువు దానిదెస[3] నడచు
సామజంబు సంవత్సరంబు తదీయశిరంబు లాఱును ఋతువులు తత్పాదం
బులు పండ్రెండు మాసంబులు [4]తరుమూలంబు నఱుకు నెలుక
లహోరాత్రంబులు మధుకరంబులు కామంబులు మధుధారలు
కామరసంబులు [5]మధుసంచయనం బాయువు వాని వలన మానవు లాసక్తు
లగుదు రిట్టిసంసారచక్రంబు పరివర్తనంబు బుధు లెఱుంగుదురు వారు
దీనిపాశంబులు ద్రెంపంజాలుదు రనిన విని యాంబికేయుండు విదురు
నకిట్లనియె.

---

50 1. నిభానా — ఓ.చ.

51 1. మదింజనులకు — అ ఈ.ఊ ఎ.చ. 2 గ — పెక్కుప్రతులు.

52 1. దుర్గమంబగు నరణ్యంబుసంసార — కొన్నిప్రతులు. 2. పంచకంబు — ఐ.క. జ వ. 3. దెసకునడచు — కొన్ని ప్రతులు. 4. తరువునఱుకు - కొన్నిప్రతులు. 5. మధుసంచయనం బాయువు — పెక్కుప్రతులలో లేదు. గమనిక — అవనీరుహం బాయువు'' — అనియీావచనమందే వెనుక చెప్పబడినది. ఇచ్చట ఆయువుప్రసక్తి లేకుండుట ఉచితము 5. వర్తనప్రకారంబు — కొన్నిప్రతులు.

53 క. హిత ముపదేశించితి వి
[1]వతినిర్మలచిత్తవృత్తి వగుట [2]సుజనసం
స్తుతగుణ యింకను జెప్పుము
ధృతికారకవచనపద్ధతిన్ విశదముగన్,

54 వ. అనుటయు విదురుం డవ్విభునకిట్లనియె.

55 కవిరాజ విరాజితము.
అనయము లోలతమై విషయప్రచయం బను దుస్తర పంకమునన్
మునుఁగుచుఁ దేలుచు నుండఁగ గాలము ముట్టి[1]రుజన్ జరనెవ్వగ పై
కొన దొర కొల్పి క్రమంబున నంగము క్రొవ్వును జెల్వును బాపి ప్రియో
జన రహితంబుగఁ జేసి యపాత్రపుఁ జావొనరించుఁ గురుప్రవరా.

56 వ. అని మఱియును.

57 క. తేరు శరీరము దానికి
సారథి సత్త్వంబు తురగచయ మింద్రియముల్
దారుణ[1]తర బుద్ధి [2]వ్యా
పారము లొనరంగ గనప పగ్గము లధిపా.

58 క. నరవర యేర్పడ విను మ
త్తురగంబుల పటురయంబుతో [1]ననుసరతం
దిరుగు పురుషుండు [2]సంసృతిఁ
బరువడి భ్రమియించు నవశభావ వ్యాప్తిన్.

59 క. వానిఁ దమఁయిచ్చ నెందుం
బోనీకుండంగ [1]నాఁగు పురుషుఁడు సంసా
రానేక దుఃఖ భాజన
తానిరసమునకు నేర్చు ధరణీ నాథా.

---

53 1. నీవతి — కొన్నిప్రతులు. 2. నుజన — కొన్నిప్రతులు.

55 1. రుజల్ — కొన్నిప్రతులు.

57 1. చరబుద్ధి — కొన్నిప్రతులు. 2. వ్యాపారంబులు దనరుజనుపపగ్గ — వి.శ.ప.స.

58 1. ననుసఱుతం — స. 2. సంస్కృతిపరుఁడై — కొన్నిప్రతులు.

59 1. జాలు — కొన్నిప్రతులు.

60 క. యముని యధీనం బిది దుః
ఖముల ననేకములఁ జేయఁగా నోపు నృపో
త్తమ యీరథ [1]మది యడఁతురు
విమల వివేకౌషధమున విను మార్యజనుల్.

61 వ. ఆ పగ్గంబులు శీలం బను వెరవుతో నలవరించి తద్రథ వేగం బార్యు లుడుపు దురు వారలు జనన[1]మరణాదుల వలని భయంబు నుజ్జగించి పరమసుఖంబు నొందుదు రింతయు నెఱింగి శాంతి నొంది పుత్రాది జ్ఞాతులకు నౌర్ధ్వదైహి కంబులు సేయించి సుఖివి గమ్మనిన విని యమ్మాట లన్నియుం బోవిడిచి తుదిం జెవి సూఁడి [2]నట్టి దయిసఁ బుత్ర[3]పరలోక క్రియావిషయం బగుమా టకు శోకం బతిశయిల్ల మూర్ఛిల్లె నట్టి సమయంబునం గృష్ణద్వైపాయనమునీం దుఁడ్రు డయ్యేడకు విజయంచేసిన విదుర[4]సంజయాదులు సంభ్రమంబున నెదురు వచ్చి [5]ప్రణతులై ధృతరాష్ట్రునకు శిశిరజలసేచన లలితవ్యజనవీజనంబుల నాచ[6]రించిన నతండు సేదదేరుటయు నతని కమ్మహాత్మునిరాక యెఱింగిం చిన నమ్మహీపతి [7]యతనికి దండ[8]నమస్కారంబు సేసి గద్గదిక నెలుగు రాలుపడ నిట్లనియె.

62 దోదకవృత్తము. [1]మానుషజన్మము మాన్యవివేకా
మానసదుఃఖ సమాజము నెల్లం
దాన ఘటించుచు దైన్యముదెచ్చుఁ
గాన భవంబిది గాల్పనే తండ్రీ

---

60 1. మవియింతురు – కొన్నిప్రతులు.

61 1. మరణభయంబు – పెక్కుప్రతులు. 2. నట్లయినపుత్రి – కొన్నిప్రతులు. 3. పారలౌకిక క్రియా – అ.ఊ. 4. సంజయులు – కొన్ని ప్రతులు 5. బునఃబ్రణతులై – పెక్కు ప్రతులు. 6. రింపనతండు – కొన్నిప్రతులు. 7. యతనికి – పెక్కుప్రతులలో వేరు. 8. ప్రణామంబు – కొన్నిప్రతులు.

62 1, 'తోటకవృత్తము' అని పెక్కుప్రతులలో కలదు.

63 మంజుభాషిణీవృత్తము. ధనమంతయుం బోలియ దారుణంబుగా
దన[1]యవ్రజంబు దెగ దైన్యమూరఁగాఁ
దనబంధులందఱు మృతంబుఁ బొందనె
వ్వనికైన శోక మను వహ్ని గాల్పదే.

64 ఉపజాతివృత్తము. మునీంద్ర నిర్భాగ్యత ముట్టిచావుం
గానేరదయ్యెం గడుగట్టిచిత్త
బనూనమూర్ఛం దెగటార్చెయుం దా
రానేర్చె నిమ్మేనికిఁ గ్రమ్మఱంగన్.

-: కృష్ణద్వైపాయనముని ధృతరాష్ట్రునకు దుఃఖోపశమంబు సేయుట :-

సం. 11-8-12

65 వ. ఇంక నేమిసేయువాఁడ నని పలికి యూరకున్న యన్నరనాథునకు ముని
నాథుం డిట్లనియె.

66 ఉత్సాహవృత్తము. నీవు ధర్మభంగి నెఱుఁగనేర్తు నీతికౌశలం
బావహిల్లు నీదుమనమునందు గాన నేనుశో
కావిలత్వ ముడుపఁబూని యరుగుదెంచితిన్ సుతా
భావజనిత దుఃఖవార్ధిపార [1]మెద్దియు పుత్రకా.

67 క. [1]భూతము లనిత్యములు నీ
వీతెరు [2]వెప్పుడును [3]విందహీనధృతిన్ నీ
చేతోగతి నలవరపుము
భూతానిత్యత్వ మదియ పుచ్చును వగలన్.

---

63 1. వ్రజంబునకు — వ.

66 1. మొందు — పెక్కుప్రతులు;

67 1. భూతంబు లనిత్యములని యీతెరు — ఎ. 2. నెప్పుడును విడువహీనధృతి మెయిం జేతోగతి — శ.ష.స. 3. విడువుమిద్ధధృతిన్ — వ.

68 ఆ. అరయ జీవలోక మధ్రువమన నరు
నొడలి[1]బ్రదుకుచావుఁ గడవదనఁగ
వినియునెల్లఁ గనియు వీతవివేకతఁ
బుత్రమరణమునకుఁ బొగులనగునె.

69 వ. అదియునుంగాక.

70 సీ. నీ వెఱుంగకయుండఁగా వచ్చెనే వైర
బంధంబు కౌరవపాండవులకు
[1]నీ పుత్రకుండ దీనికిఁ గారణం బిది
విధినిర్మితం బైనవిధము సువ్వె
కౌరవజాతిసంక్షయ మవశ్యంబుగాఁ
గలయది యై చెల్లెఁగాక క్రొత్త
యైనదియే బంధు లాజివిహారత
త్పరతమై సద్గతిఁ[2]బడసినారు

ఆ. వారి కేల యింతవగవ నట్లును గాక
[3]విమలబుద్ధి యైన విదురుఁ డిట్టు
[4]లగుట యెఱిఁగి బుద్ధి తగఁ జెప్పె నీకు జూ
దంబుసమయమునన దాని వినవ.

---

68 1. బ్రిదుకుఁజావు — వా. కొన్నిప్రతులు ; బ్రిదుకుచావు — ల.వీ శ.ష.

70 1. నీవుపుత్రకుఁడె — వ. 2. బడయువారు — చ. 3. చిత్తుడైన — పెక్కుప్రతులు. 4. తనరనెఱిఁగి నీకుఁదగఁ జెప్పెఁ గటజూదంబు — వ.

71 దోదకవృత్తము. [1]దేవకృతంబులు ధీరుఁ డ్కైనన్
భూవర మాన్పఁగ బోలునె [2]యెట్లుం
గావున శోకము [3]గాఁటియ దల్గం
గా వలదే [4]తుది గౌరవ మొప్పన్.

72 వ. దేవతలకుం గృత్యం బయినదానిఁ [1]దత్ప్రత్యక్షంబున వింటి నది నీకు మేలు గోరి చెప్పెద నాకర్ణింపు మే నక్రమంబున నెం దయినఁ జరింతు నొక్కనాఁడు దేవసభకుం బోయితి నందుఁ బురందరప్రముఖబృందారకులను నారదాది మునిబృందములనుం గాంచి సుఖగోష్ఠి నున్న సమయంబున భూదేవి యచ్చటికి వచ్చి యవ్విబుధులతో ని ట్లనియె.

73 క. మీరలు బ్రహ్మసభను మ
ద్భారము [1]మాన్పుటకు [2]నలిని బనిఁ బూనితి రె
క్కారణమునఁ దడసితి రొకో
యేరూపునఁ దలఁగుదాన నేను భరంబున్.

74 వ. అనిన విని సర్వలోక [1]నమస్కృతుం డగునారాయణుండు నవ్వుచు నవ్వే లంది కి ట్లనియె.

---

71 1. ఇది రుగ్మవతీవృత్తము — అని 'స' కొన్ని ప్రతులలోను, కలదు; తోటక వృత్తము అని కొన్నిప్రతులలో కలదు. ఈ పద్యము 'స' ప్రతిలో ఈ క్రిందివిధముగా నున్నది.

దేవకృత్యంబుల్ ధీరుల కైనన్
భూవర మాన్పంబోలునె యెట్లున్
గావుననీశోకంబు దొఱంగం
గావలదే నీ గౌరవమొప్పన్.

2. యెందున్ — పెక్కు ప్రతులు, 3. గాదుదొఱంగం — శ.ప. 4. మది — కొన్ని ప్రతులు ; యిది — కొన్నిప్రతులు.

72 1. బద్మనాభుని సమక్షంబునవింటి — వీ.శ.ప. కొన్నిప్రతులు.

73 1. వా(బా)పుటకు — కొన్నిప్రతులు. 2. నైనపని — చ.వ.వీ.శ.ప ; నతని — కొన్నిప్రతులు ; నజుని — వ.

74 1. శరణ్యుం డగు — అ.చ.వీ.శ.ప.

75 తే. వినుము ధృతరాష్ట్రుఁ డను రాజు [1]తనుజశతముఁ
బడయు దుర్యోధనుం డనఁ బరఁగు పెద్ద
కొడుకు నీభారమంతయు నుడుపు నతఁడు
తడయ కయ్యేడు నదివఁగఁ దక్కు మబల.

76 వ. ఎట్లనిన.

77 క. వానిం జంపను[1]గావం
బూని సకలరాజలోకమును నీసుమెయిన్
సేనాసముదయ[2]ములునుం
దానుఁ గురుక్షేత్రసమర[3]దారుణతఁ దెగున్.

78 వ. [1]సోదరసముదయసహితంబుగా నతండును మృతుం డగు దానంజేసి భవదీయ భారంబు వాయు నిశ్చింతంబునం [2]జనుము భూతధారణం బాచరింపు[3]ము పొమ్మని పలికి యద్దేవిని వీడుకొలిపెఁ బదంపడి సకలప్రజాసంహార[4]కారణంబై కల్యంశంబున దుర్యోధనుండు జనియించె నక్కుమారుండు.

79 తే ఒరులయున్నతి సయిరింప[1]నోపఁ డధిక
బలుఁడు క్రోధి [2]శూరత్వసంపన్నబుద్ధి
బుద్ధిసెప్పిన విని యెడు[3]ప్రోడగాఁడు
[4]గానవైరంబు విడువఁడు కౌరవేంద్ర

---

75 1. తనయ — పెక్కుప్రతులు ; తనుజచయము — వ.

77 1. గావను — పెక్కుప్రతులు. 2. ములతో దాను — చ. ధాత్రింగూలున్—వ ; ధారుణిని దెగున్ — జొ.

78 1. పదంపడిసోదర — వ. 2. జనుమని పలికి యద్దేవిని — చ. 3. మనిపలికి — పెక్కుప్రతులు. 4. కారణుండై — చ.వీ.

79 1. నొల్లఁడధిక — వ. 2. క్రూరత్వ — కొన్ని ప్రతులు. 3. పొడువుగాఁడు — వ ; పొడవుగాఁడు — కొన్ని ప్రతులు. 4. కండగర్వంబు విడుపఁడు — స ; వైర మెప్పుడు విడువడు కౌరవేంద్ర — వ. గానవైరంబు విడువడు మానవేంద్ర — వ.

80 క. తమ్ముఁడు శకునియుఁ గర్ణుఁడు
నమ్మానవపతికిఁ దగినయనుచరు లతనిన్
సమ్మదమునఁ గలసిననృపు
లమ్మెయి [1]వారలు వినాశమగు టేలుడుగున్.

81 తోదకవృత్తము. [1]తమతమ తప్పులఁ దా రెఱియంగా
విమలమతీయిటు [2]వీరికినై శో
కమున దహింపఁగఁగాదు మనంబున్
సముచిత మిత్తఱి [3]శాంతము సుమ్మీ.

82 వ. అని చెప్పిన నవ్విభుండు దనకుం బాండవాగ్రజుం డవమానం బాచరించు [1]ననుశంక నూని యునికి యమ్మహా[2]ముని దివ్యబోధంబునం [3]దేటపడి యుండుం గావున నత్తాపసోత్తముండు వెండియు ని ట్లనియె.

83 క. పాండవుల వలని[1]కీడో
క్కొండును లేదధిప [2]నీదుకొడుకులు ధరణీ
మండల మంతయు [3]మ్రింగిరి
పాండునృపతి భాగమునకుఁ [4]బాపిరి వారిన్.

84 వ. దానం జేసి యిట్లు సకలకౌరవ్యులకు నఖిలభూపతులకు నిఖిలప్రజలకును బొలియవలసె నిది యంతయు మున్న [1]యెఱుంగుదుఁ గావున.

---

80 1. వినువారు నాశమగు – గ.వ.

81 1. లలితపదవృత్తము, తోటకవృత్తము, తోదకవృత్తము – అని పాఠములు. 2. వీరలకై – కొన్ని ప్రతులు. 3. శాంతియ – ఈ; శాంతత – చ.వీ.ష; శాంతమ – శ.

82 1. నని – ఓ.ఔ.చ. 2. త్ముని – జ.వీ.ష. 3. దెలివిపడి – వ; దెలిసియుండు – ఊ.జ.

83 1. నఁగీడో – జ ల.వీ.శ.ష. 2. నీవుఁ గొడుకులు – జ. 3. మ్రింగితి – జ. 4. బాపితి – జ.

84 1. యెఱుంగుం గావున – అ.ఇ.ఉ.ఊ.చ.

85 ఉత్సాహావృత్తము వినుము నారదుఁడు దీని వినఁగఁ జెప్పె ధర్మనం
దనున కతనిమనము కరుణ[1]దవిలి యున్కి హింసకుఁ
గొనకొనంగఁ జోరమి నతఁడు కురుబలంబు[2]తోడ పాం
డునక వడఁడె [3]జగము మెచ్చఁదొడఁగి పెక్కుభంగులన్.

86 తే. ఏను నతనికిఁ జెప్పితిం గాన నాతఁ
డధికయత్నంబు సేసెఁ దా నంతవడియు
వైర [1]మెమ్మెయి మాన్పంగనేరఁ డయ్యె
నియతిఁ దప్పింప నేరికి [2]నేర నగునె.

87 క. ఏ నిది[1]యంతయు నెఱుఁగుదుఁ
గాన వృథాశోకవహ్నిఁ [2]గాలమికిని నీ
మానస[3]మునఁ గృపకలిమికిఁ
గా [4]నొడివితి దేవగుహ్యగతియుఁ దెలిపితిన్.

88 భుజంగప్రయాతవృత్తము. వినీతుండవై ధర్మ వేదిత్వ[1]బుద్ధిం
దన ర్పొందు నీ విట్లు దైన్యాతిరేకం
బునం బొంది [2]శోకాగ్నిఁ బొక్కంగఁ గుంతీ
తనూ[3]జాగ్రజుం డాత్మఁ దాఁ గుంద కున్నే.

89 క. డెందము తిర్యగ్యోనుల
గరుణాసమగ్రమై యుండు భవ
న్నందనుఁ డజాతశత్రున
కుం దచ్చరితంబు నీవుఁ గొంత యెఱుఁగవే.

---

85 1. దడసి - కొన్నిప్రతులు. 2, తోడి - పెక్కుప్రతులు: 3, బుధులు - ఏ.ఒ.

86 1. మెమ్మైన – జ.శ. 2. నెఱుఁగనగునె – ఐ.జ.

87 1. యెంతయు – అ.అ.శ. 2. గాగ్రిగుటగని – ఊ. 3. మునధృతి నిలువంగా – అ. 4. నొత్తిలి – కొన్నిప్రతులు.

88 1. భూతిం – కొన్నిప్రతులు. 2. శోకాగ్నిబొందంగ – చ. 3. జవగ్రిభుం – ఎ.ఓ.క.

90 మానినీవృత్తము. కావున నీదెసనాతనికిఁ విముఖత్వము గల్గదు భక్తిమెయిం
దావినయం [1]బెనయం గొనియాడుట దప్పదు కాంచెద వాతనిపై
నీవును నెయ్యముఁ గారుణికత్వము నెక్కొనఁ దమ్ములు నవ్విభుఁడు
న్నేవుర పెట్టుగ సంతతికల్మియ నీమది నిల్పుము పెం[2]పొలయన్.

91 తే. దైవకృతము నాపంపు చిత్తమునఁ బెట్టి
పుత్ర[1]శోకంబు విడు పాండుపుత్త్రు లధిప
తగరె నినుఁ గొనియాడి పుత్రత్వవృత్తిఁ
బరఁగ నది కీర్తిధర్మసంపాది గాదె.

92 వ. వనట యనియెడునగ్ని నెఱుక యనియెడు[1]నీటనార్పుము ప్రాణంబులు ధరియింపుము సముచిత[2]వృత్తిఁ జరియింపుమనిన విని చింతాక్రాంతుండై [3]కొండొకసేపూరకుండి ధృతరాష్ట్రుఁడు తేజోధనుండగు[4]నత్తాపసోత్తమున కిట్లనియె.

93 క. మును శోకానలతాపం
బున బొగులుట నొం దెఱుంగఁ బోలక దుఃఖం
బున మునుఁగ వలసె నీదువ
చనములు విని మునివరేణ్య శాంతుఁడ నైతిన్.

94 క. ధరియించెదఁ బ్రాణము మది
[1]నెరియక యుండంగ శోక మేఁ దొఱఁగెద ని
ర్భర బాంధవంబు నొందెదఁ
బురుషోత్తములైన పాండు[2]పుత్త్రకులదెసన్.

---

90 1. బెసగం — కొన్ని ప్రతులు. 2. పొనరన్ — కొన్ని ప్రతులు.

91 1. శోక ముడుగు పాండు — ఆ.ఇ.ఉ.

92 1. నీళ్ల — ఇ.ఐ.చ. 2. భంగి — పెక్కుప్రతులు. 3. కొంతసేపూర — కొన్ని ప్రతులు. 4.న త్తపోధనున — అ.ఎ.

94 1. యెరియక — కొన్ని ప్రతులు. 2. పుత్త్రులదెసకున్ — కొన్ని ప్రతులు.

95 వ. అనుటయు నమ్మహాత్ముం డట్లగుట మే లని పలికి యంతర్ధానంబుఁ జేసె నిట్లు ప్రబోధితుం డై యాంబికేయుండు గొండొక ప్రొద్దూరకుండి సంజయుం జేరుకొని పయనం బాయితంబు సేయుమని చెప్పి విదురుతో సీవు గాంధారిని గుంతినిం దక్కుఁగల కౌరవవధూవర్గంబును దోడ్కొని రావలయు మనము పొలికలనికిం బోవుచున్న వార మని యెఱింగించి వెలువరింపు మనిన నయ్యిరువురు [1]నట్లచేసిన.

*—: ధృతరాష్ట్రుఁడు సపరివారంబుగాఁ బొలికలనికిం బోవుట :—*

సం. 11—9-5

96 క. ఆరం గూరినశోకము
[1]భారంబున మేను దూలఁ బరవశగతి గాం
ధారి చనుదెంచె నవ్వసు
ధారమణునికడకు జనవితానము [2]వొగులన్.

97 వ. కుంతీప్రముఖం బైన కురువృద్ధనారీజనంబును బరివార[1]వనితాజనసహితంబుగాఁ దరతరంబ యరుగు[2]దెంచె నట్టియెడ.

98 సీ. చేతులు నడుదలసేర్చు టుత్కటశోక
మాకారములు దాల్చినట్టులుండ
విరిసిన[1] వేనలుల్ వెన్నులఁ బ్రక్కల
నెఱసి చూపఱ దృష్టి నీఱుసేయ
నందంద దొరఁగెడు నశ్రుజలంబుల
పెంపున మోములు ముంపఁబడఁగ
నేమియుఁ దొడవులు లేమిఁ బాడఱియున్న
యంగంబులందు దైన్యంబు నెఱయఁ
తే. బతుల నన్నలఁ దమ్ముల సుతుల హితులఁ
బేరుకొని [2]వాతులెండఁగఁ బ్రేముడించి

---

95 1. నట్లు — కొన్నిప్రతులు.

96 1. భారమ్మున మనముదూల — ఊ. 2. గొలువన్ — చ.

97 1. వనితా సమేతంబుగా — పెక్కుప్రతులు. 2. దెంచిరట్టి — ఊ.గ.చ.

93 1. వెంట్రుకల్ — కొన్నిప్రతులు; పెన్నెరుల్ — ఊ.గ.చ. 2. గోలు — ఊ.ట.

[3]పనవుపలుకులు వినువారి వనటఁ దేల్పఁ
గురుకుమారనారీజనకోటి వచ్చె.

99 క. చెలువై నఁ జూడఁ బయ్యెద
దొలఁగుటకును సిగ్గు వడువధూజనతతి య
త్తలయెదు రనేకవస్త్రం
బుతో[1]నంగమును వికృతిఁ బొందఁగ [2]నడచెన్.

100 క. కొండొకవగపున కేనియు
నొండొరువులఁ [1]దెల్చునట్టి యువిదలు చిత్తం
బొండొండ వనట మునుఁగఁగ
నొం డెవ్వ[2]రుఁ దెలుపలేక [3]యుండి రవశలై.

101 వ. అట్టియెడఁ బురంబున నచ్చటచ్చట.

102 తే. విపులహర్మ్యతలంబులు వెడలునట్టి
వెలఁది మొత్తముల్ వోల్పె [1]బల్వేఁటకాఁడు
పతులఁ జంపిన గిరిగుహాప్రతతి వెడలఁ
బాఱుసింగంపుఁ [2]బెంట్లకుఁ బాటియగుచు.

103 క. మున్నెన్నఁడు నెవ్వరికిం
గన్నుఁ లెదురఁ బడనియట్టికాంతలు జను లె
ల్లన్నిలిచి చూడ వెడలిరి
కన్నులు గమరఁగ సుహృన్నికాయంబులకున్.

---

3. పనుపు – పెక్కుప్రతులు.

99 1. నంగములు – పెక్కు ప్రతులు; నంగమును – వా. 2. నడలెన్ – కొన్ని ప్రతులు.

100 1. దేర్చునట్టి – కొన్ని ప్రతులు. 2. తెఁదలపలేక – కొన్ని ప్రతులు; దుఁదలపులేక – శ.సం. 3. యుడిగివశలై – కొన్నిప్రతులు.

102 1. బల్వేంట కాఁడు – జ. 2. బిండుకు – కొన్నిప్రతులు.

104 వ. అప్పుడు కురువీరాగారంబులయందు హాహాకారంబు లెసఁగ నిట్లు వనితా జనవ్రాతంబె తెంచి ధృతరాష్ట్రుపూరెల నాక్రందనధ్వను[1]లు సెలఁగ నిలిచె విదురుండు దగ్గుత్తికపడుచు నయ్యువిదల నూరార్చుచుఁ దగువారల సుచిత[2]వాహనంబులపై [3]నిడియె నర్ధగేణాఖుండు నిజయోగ్యయానం బునఁ జన దోడన యాతనుజుండును గాంధారీప్రముఖులం దోడుకొని సంజయసహితంబుగాఁ జనియెఁ జిన్నలుం బెద్దలునగు సకలపౌరలోకంబునకు శోకం బావహిల్లినం జెల్లెన రోదన[4]ప్రలాపంబుల పిక్కుటిలు పిక్కటిల్లెఁ బ్రళయకాలజ్వలనజ్వాలలం బొదువంబడు జంతువు లాక్రోశించు చందంబు దోఁచెఁ బురిఁ గలవైశ్య[5]శూద్రశిల్పి కర్మారతక్షక [6]కూరక స్వర్ణకారక రజకాదు లమ్మహీపతి వలని చని రిక్వంధంబునం గ్రోశమాత్రంబు [7]చని రాసను యంబున.

105 సీ. ఆచార్యసుతుఁడుఁ గృపాచార్యుఁడును గృత
వర్మయు నెదురుగా వచ్చి [1]రథము
లంతంత డిగ్గి శోకార్తినంగంబులు
దూల బాష్పంబులు దొరుఁగుచుండఁ
గా ధృతరాష్ట్రుని గాంచి గద్గదకంఠు
లగుచు నాతని కిట్టు లనిరి నీదు
తనయుండు భుజబలదర్పంబు దుర్వార
శౌర్యంబు మెఱయంగ సంగరంబు

తే. సేసి యింద్రాదిసురల మెచ్చించి వారి
[2]కతిథి యై చని పరమసుఖానుభవము
దగిలె నేము మువ్వురమును దక్క నమ్మ
హీశుతోడన సైన్యంబు లెల్లఁ జనియె.

106 వ. అనినఁ దదనంతరంబ.

---

104 1. లెసంగ — కొన్ని ప్రతులు. 2. యానంబుల — ఘ. 3. మనిచె — కొన్ని ప్రతులు. 4. ప్రలాపంబుల — ఓ.బౌ.వ. 5. శూద్ర — కొన్ని ప్రతులలో లేదు. 6. కూరత — కొన్ని ప్రతులలో లేదు. 7. నడచి — పెక్కుప్రతులు.

105 1. చేరు — పెక్కుప్రతులు. 2. కరిదియై — చ.

-: కృపాచార్యుఁడు గాంధారి నూరార్చిన ప్రకారము :-

సం. 11-10-5

107 తే. తనుజశోకార్త యైనగాంధారిఁ జూచి
యడలు తనదు[1]చిత్తంబున నతిశయిల్ల
నలఁతఁ [2]దేర్పంగఁ [3]దలఁచి తా నల్లఁ జేరి
యమ్మహాదేవితోడ నిట్లనియెఁ గృపుఁడు.

108 మణిమాలావృత్తము.
భవదీయసూను[1]లరిసైన్యపఙ్క్తిఁ గోని కాల్చి రెల్లఁ బోగడఁగ
వివిధాస్త్రశస్త్రమయసాంద్రవృష్టిఁ [2]దెగటార్చి పెంపు మిగులఁగ
దివి కేఁగి యందు మహనీయతేజ మెసఁగంగ హృద్య[3]బలభి
ద్భువి వ సౌఖ్యసంపదలు గాంచి సంతోషమునఁ [4]దేలి రేల వగవన్.

109 స్వాగతవృత్తము. అం దొకండును రణావని భీతిం
బొంద [1]కేటులను బోటుల డప్పిం
బొంది యైనఁ బొలి వోవఁ[2]డ దానం
బొంది యూర్ధ్వగతిఁ బుణ్యచరిత్రా.

110 వనమయూరవృత్తము. పోర నొడ లస్త్రపరిపూతముగ ధీరో
దారతఁ బిఱిందికిఁ బదం బిడక ధృష్య
ద్వైరితతి నొంచి తెగువా రగుట మేలు
ర్వీరమణకోటి కని వేదములు సెప్పున్.

111 క. దానాద్యుత్తమకర్మవి
ధానంబులఁ బడయుగతు లుదాత్తరణమునం
జా నేర్పు[1]వాని చనియెడు
మానితగతిఁ బోల వండ్రు మహనీయాత్ముల్.

---

107 1. చిత్తమున శోకమతిశయిల్ల - ఐ. 2. దీర్పఁగ - కొన్నిప్రతులు. 3. నిలిచి - కొన్నిప్రతులు.

108 1. తమాలావృత్తము - ఇ. 2. దగనాడి - కొన్ని ప్రతులు. 3. బహుళభువి - కొన్ని ప్రతులు 4 బొంది - కొన్నిప్రతులు.

109 1. చేటులను - కొన్నిప్రతులు. 2. డు - కొన్ని ప్రతులు.

111 1. వారు - కొన్ని ప్రతులు ; వానికనియెడు - జ.

112 వ. కావునం గురుకుమారుల మరణంబు సంభావనీయం బది దా నట్లుండెఁ బాండుకుమారులు గెలిచితి [1]మని సంతసింప శే దది యెట్లనిన.

113 నర్కుటవృత్తము. వినుము మరుత్తనూభవుఁడు విశ్రుతధర్మగతిం
జనక కురుక్షితీశ్వరునిఁ జంపె గదాసమరం
బున నది యే మెఱింగి చనిపోయిన రేయి గడుం
గనలున ముట్టి ముచ్చరముఁ గౌర్య ముదగ్రముగన్.

114 వ. పాండవశిబిరంబున.

115 బంధురవృత్తము.
[1] సకలరథములను నఖిలగజములుఁ సర్వహయంబులతో బెరయన్
శకలములుగ భటనికరమఖిలముం జావఁగ ద్రౌపదిపుత్రులలో
[2]నొకఁడును బ్రదుకక పొడిపొడియుఁగ నయ్యుర్వికి వారలమామలమ
స్తకములు కడమ వడక వడి బలిగా సంతస మందఁ బిశాచతతుల్.

116 వ. సమరంబు సేసితి మట్లగుట [1]నప్పాండవులవిజయంబు [2]వితథంబయ్యె[3]నిట యేముసేయం దలంచినదాని నెఱింగించెద [4]నాకర్ణింపు మే మట్టిసమయంబున [5]వారలాశిబిరంబున లేమింజేసి యాభంగి[6]పరాక్రమం బాచరింప నోపితిమి గాని యమ్మహాబలుల మార్కొన శక్తులము గా మవ్వీరు లట్లు దమతనయులు[7] మాతెగువం దెగటాఱుట విని శోకక్రోధాక్రాంతంబు లగునంతరంగంబులతో మమ్ము వెనుకొనుట దప్పదు [8]వారలబారికిం దప్పి పోవలయుం బోయెద మది [9]తలం పనుజ్ఞ యిమ్ము నీవు నమ్మలింప కుండు మని పలికి ధృతరాష్ట్రునుద్దేశించి దేవా ధర్మపుత్రాదులబారిం బడక తొలంగట [10]భీతు లగుమాకుం గర్తవ్యంబై యున్నయది [11]మీచేత ననుజ్ఞాతు

---

112 1. మనుసంతసంబు — ఈ.పీ.ప.స.

115 1. బంధూకవృత్తము — ఈ. 2. దొకరు;డు — జ.పీ.శ.ప.

116 1. టంజేసిపాండవుల — కొన్ని ప్రతులు. 2. విఫలం — ఒ.వ; వృథం — జ. 3. నది యట్లుండెనిట — కొన్ని ప్రతులు. 4. మాకర్ణింపుమట్టి — కొన్ని ప్రతులు. 5. పాండవులా — కొన్నిప్రతులు. 6. పరాక్రమింపనోపి — ఆ.ఐ.వ. 7. లట్లు — కొన్ని ప్రతులు. 8 వారలపారికిం — పెక్కుప్రతులలోలేదు. 9 తలంపునకనుజ్ఞ — కొన్ని ప్రతులు. 10. భీతులమగు — కొన్ని ప్రతులు. 11 నీచేత — కొన్ని ప్రతులు.

లము[12] నీ కింకదైవకృతం బలంఘనీయం బగుటఁ దలంచి వగ పుడుగు[13]మని యచ్చట నాకృపకృతవర్మాశ్వత్థామ లారాజునకు నుద్దేశికిం బ్రదక్షిణంబు[14]గాఁ వచ్చి మరలి మరలి వారలం జూచుచుఁ దేరు లెక్కి [15]భయంబున రయంబున నరదంబులు దోలుకొని గంగాతీరంబున కరిగి యచ్చట నన్యోన్యామంత్రణంబు సేసి పాసి రందుఁ గృపాచార్యుండు గరి[16]పురి కేతెంచెఁ గృతవర్మ నిజపురంబునకుఁ జనియె నశ్వత్థామ కృష్ణద్వైపాయనాశ్రమంబు[17] నాశ్రయించి గ్రక్కునం దపస్వి యయ్యెఁ దదనంతరంబ ధర్మజ భీమార్జునులు దాడిమై వచ్చి యతని ముట్టుకొని రావృత్తాంతంబంతయు నీవిన్నయదియ తరువాతికథ సెప్పెద విను మవ్విధంబునఁ గృపప్రముఖ రథికులు మువ్వురుం దన్ను విడిచి చనిన నాంబికేయుండు గ్రొత్తయైన[18] నెవ్వగ పెల్లునఁ జిత్తంబు విషాదవేదనాయుత్తం బగుచుండ నెడనెడ నిలుచుచుఁ జనుచుండె నక్కడ నయ్యజాతశత్రుండు గురునందనుశిరోరత్నంబు దెచ్చి యిచ్చి యట్లు పాంచాలి నూరార్చియున్నంత నట వోయిన జనంబుల వలన వైచిత్రవీర్యుండు [19]పొలిగలనికి వచ్చుచున్నవాఁ డనివిని తదభిగమనోన్ముఖుం డై.

-: ధర్మరాజు దమ్ములతోడ ధృతరాష్ట్రు నొద్దకుఁ బోవుట :-

సం. 11-11-1

117 తే. తనయు లందఱుఁ బొలియుట [1]వినినయడలు
మానసంబు దహింప నమ్మనుజవిభుఁడు
వాగులుచును [2]వచ్చెనను తలపోఁత సేసి
యుల్లసుక్కటికమున జొత్తిల్లుచుండ.

---

12. మైతిమినీనింక — ఙ.వ.వీ.శ.ప. 13. మీయని యెనాకృప, మీయనియాకృప— అని పాఠములు. 14. గావించి — చ. 15. భయంబునరథ్యంబులు — కొన్ని ప్రతులు ; రయంబునరథ్యంబులు — ఏ న. 16. నగరంబునకేతెంచె — పెక్కు ప్రతులు. 17. బాశ్రయించి — పెక్కుప్రతులు. 18. నెవ్వరఁజిత్తంబు — పెక్కు ప్రతులు. 19. పోరికలసితి — కొన్నిప్రతులు.

117 1. వినియునడలు—ఙ ; వినినయడరు—ల. 2 వచ్చె—వా ; వచ్చు — కొన్ని ప్రతులు.

118 క. వదనమున విన్నఁదనముం
గదురంగ హరిఁ జూచి రాజుఁగాన వలయు నా
కది యెట్లు నుడుగ వచ్చునె
కదలుం డని [1]పలికి చనియెఁ గలనివలనికిన్,

119 ద్రుతవిలంబితవృత్తము. చనఁగ [1]నాతఁడు సాత్యకి వాయునం
దనుఁడు గాండివి దమ్ములు సూరెలం
[2]జనిరి ద్రౌపది సంభృతశోక యై
చనియెఁ జుట్టపుఁజానలు సుట్టి రాన్.

120 వ. ఇట్లు మాత్స్యపాంచాలభామలు నరిగిరి తొలునాఁడు దుర్యోధనుండు మన్నించు మానవతులం గరినగరంబునకుం గొని చని యారాత్రి యందు నిలిచి ధృతరాష్ట్రుం బొడగానక రేపకడ మగిడి వచ్చి యున్న యుయుత్సుం డును నమ్మానవపతితోన చనియె నట్లు ధర్మసూనుండు సని సమరతలంబు దఱియునంతకు నయ్యెడకు నాంబికేయుండు నసుదెంచె నతనిముందటి [1]వలని వనితాజనంబు లక్కౌంతేయాగ్రజుం గనుంగొని కరంబు [2]లెత్తి యేడ్చుచు నెదుర్కొని.

121 సీ. ధర్మవేదిత్వ మీ ధరణీశ్వరునకు నెక్కడి
యది కృపయెందుఁగలదు తలఁపఁ
దండ్రుల మామలఁ దాతలఁ గొడుకులఁ
దోడఁబుట్టువులను ద్రుంచివైచెఁ
గ్రూరత [1]మెఱయంగ గురుజనంబులఁ గూల్చె
సఖుల సంబంధులఁ జంపె నదయుఁ
డని పల్కుదురు కొంద[2]ఱప్పార్థుఁ జేరి
గాంగేయుని ద్రోణునిఁ గెడయఁ [3]బొడువఁ

---

118 1. పనిచి – వ.

119 1. నప్పుడు – ఎ.ఓ,చ.వ. 2. జనఁగ – కొన్నిప్రతులు.

120 1. వలని – కొన్నిప్రతులలోలేదు. 2. లెత్తికొని – కొన్నిప్రతులు.

121 1. నెఱయంగ – కొన్నిప్రతులు. 2. వ్యూహుఁజేరి – కొన్నిప్రతులు. 3. బొదువ –

ఆ బనుపనెట్లు నేర్చి తని పల్కు-దురు గొంద
అకట సింధురాజు ననుజమగనిఁ
[4]దునిమి తేటిరాజ్య మని పల్కుదురు గొంద
అతఁడు మోము వాంచి యరుగు చుంద.

122 వ మఱియుం గొందఱు.

123 క. ఇందఱఁ జంపితి నని[1]యు
బ్బుం దీఱద ద్రుపదతనయపట్టుల నభిమ
న్యుం దెగటార్చితి మఱఁదుల
నదఱ మ్రింగితి విభూతి యన [2]నీ కెద్దీ.

124 వ. అని పలుకుదు రిట్లు బహుప్రకారంబులం బలుకుచుండం బలుకు వెలువరిం పక పుత్రశోకార్తుఁ డగునప్పాండురాజపుత్రుండు పుత్రశోకార్తింల బొగులు విచిత్రవీర్యపుత్రుకడకుం జని తత్పార్శ్వవర్తులచేత నావేదితుం డగుచు నాభూవల్లభుపాదంబులకుం బ్రణతుండగుటయు.

125 శుద్ధవిరాటివృత్తము. [1]ఉల్లం బప్రియ మొందఁ గ్రొత్త సం
ధిల్లఁ నెవ్వగ దీనవక్త్రుఁడై
యొల్లంబోవుచు నుచ్చె నవ్విభుం
డల్లం గౌఁగిట నాన్నృపాలకున్.

126 వ. ఇవ్విధంబున నాలింగనంబుసేసి [1]సాంత్వవచనంబుల [2]నుపచరించెఁ దదనంత రంబ భీమార్జుననకుల సహదేవులు సేరిన నతనియొద్దివారు వారిం బేరువేర నెఱింగించిన

---

కొన్నిప్రతులు. 4. జంపితేటి రాజ్యసంపదయందురు – వ.

123 1. యుబ్బంది దినాద్రుపద – చ. 2, నింకేదీ – కొన్నిప్రతులు.

125 1. మాత్రాయనవృత్తము – ల,

126 1. సాంత్వన – కొన్ని ప్రతులు. 2. నమూనయించె – కొన్ని ప్రతులు.

127 తే. భీముఁ డనుమాట విని యతిభీమ మైన
యలుక యనువహ్ని యవ్వీరుఁ డనువనంబు
దరికొనంగ నుంకింప నధర్మవిధికి
నాయితం బగునయ్యాంబికేయుఁ జూచి.

128 క. మన నెఱిఁగి హృషీకేశుఁడు
దనమనమున నిద్దురాత్మ్మతలఁ బొప్ప[1]దుసీ
యనుచుం బవనజు నద్దెసఁ
జన కుండఁగఁ బట్టి వీతసంభ్రమలీలన్.

129 వ. ధృతరాష్ట్రుం డిట్టివాఁడు గాఁగలవాఁడని తొల్లి యెఱింగి త్రికాలవేది యైన కృష్ణుం డయోమయంబుగా భీమప్రతిరూపంబు సేయించి సంగ్రహించి నిగూఢప్రకారంబునం దత్ప్రదేశంబునకు దెప్పించినవాఁడు గావున గ్రక్కున నయ్యనుపరూపజ్జగతీశ్వరుం జేర[1]నిలిపె నిలిపిన నది భీమసేనుండ కాఁదలంచి.

130 క. కోపం బుత్కట మై యా
రూపము నిరుగేలఁ బట్టి [1]క్రూరతఘోరా
టోపం బెసక మెసఁగ నా
భూపతి వెసఁ గౌఁగిలించి పొలుపఱ విఱిచెన్.

131 లయవిభాతి. పెరుఁగఁగ నిజాంగములు సరభసపరిస్ఫురణ
మరుదుగ జనావలులు నిరుపమవిధం బి
న్నరపతి బలంబనఁగఁ గరయుగముతో లవియ
నురము సదియం బెలుచఁ దొరఁగఁగఁ బొరిఁ నె
త్తురులు ముఖరంధ్రములఁ బరవశత మానసము
బొరయుటకుఁ జొచ్చియును సరిగొనఁగఁ గంటిఁ
[1]వరసుతున కిప్పు డనుపరమపదవిఁ మగుడఁ
గురునృపతి యాప్రతిమఁ బొరి నిటులు పుచ్చెన్.

---

128 1. దుసీ - కొన్నిప్రతులు.

129 1. నిలిపినది - పెక్కు ప్రతులు.

130 1. క్రూరత - స. పెక్కుప్రతులు ; రూఢత - వా.

131 1. వరసుతుల కిప్పుడనుఁ బరమమగు విందనుచుఁగురు - స.

132 వ. ఇత్తెఱంగున దశసహస్రసామజసమానబలుం డగునయ్యంధనృపతి గంధవహ
నందనప్రతిరూపంబు భగ్నంబు సేసి [1]పెంపున నెడఁద నిర్భరహర్షంబు
నొందియు [2]మెఱమెచ్చునకై భీమునిం బేర్కొని హాహాకారంబు లెసంగ
రోదనంబు సేసినఁ జిఱునవ్వునం దన వదనకమలం బొప్పం గమలనాభు
డతని కిట్లనియె.

133 తే. అడల నేటికి [1]నీచేతఁ బడఁడు భీముఁ
డిపుడు భంజింపఁబడినది యినుపరూపు
వినుము నీకోప మెఱిఁగియ వెనుకకతనిఁ
దిగిచి యేను నీముందట దీని నిడితి.

134 క. బలమున నీతో దొరయఁగ
నిల నెవ్వఁడు గలఁడు నీ మహితభుజశాఖల్
తలఁపఁగఁ బ్రళయాంతకుదం
ష్ట్రిలు వీనిం దగిలి వశమె [1]చాకుండంగన్.

135 వ. కావున.

136 ఉపేంద్రవజ్రావృత్తము. మరుత్తనూజుం [1]బరిమార్పఁ [2]జూచుం
బరిస్ఫురత్కోపని బద్ధుఁడై యు
ద్ధరా[3]విభుండం చిదితల్గనే సం
స్మరించి యా[4]కోపు నమర్చికొంటిన్.

137 తే. తనయశోకాతురుండవై ధర్మమెడలి
యనిలసుతుఁ దెగటార్చెద నని తలంచి
తట్టివని [1]యేల నీచేత నగు విధాత్రు
లీలఁ బరికింప [2]నేరక బేలవైతి.

---

132 1. పెంపుసెడ, పెంపుసెడత — అనిపాఠములు. 2. నెదిరిమెచ్చునకై — కొన్నిప్రతులు.

133 1. నీచేతఁబడి — జ-శ.

134 1. చావకయుండన్ — కొన్ని ప్రతులు.

136 1, బరిమార్ప - పెక్కు ప్రతులు; బోరిమాన్ప — వా, 2, జొచ్చుం — అ.ఓ
3. వరుం — కొన్ని ప్రతులు. 4. రూపు - పెక్కు ప్రతులు.

137 1. యేలనీచేతనగు - స. పెక్కు ప్రతులు. నీదుచేనేలయగు - వా. 2. కిక్లేల - ఊ.వ.

138 వ. అదియునుం గాక.

139 క. విను మొకని నేల భవదను
జనిపుత్రుల నెల్లఁ జంపఁ జొప్పడినను నీ
తనయులు మగుడఁగ [1]వత్తురె
యనయము పాపంబు సేసి తాఱడిఁబోవన్.

140 స్రగ్విణీవృత్తము. ఏము నీ పుత్త్రుచే నెన్ని యే భంగులన్
[1]వేమఱుం బాటు నీ[2]వెంట భావించుచున్
సామసంపాది వై సైఁపు మాతప్పులన్
[3]ధీమహత్త్వంబు సంధిల్లు [4]నీ కిమ్మెయిన్.

141 వ. అని [1]చెప్పెనప్పుడు ధృతరాష్ట్రపరిచారకు లతనియవయవంబులరుధిరంబు ప్రక్షాళనంబున నపనయింపం దలంచి జలంబులు దెచ్చి యొఱింగించిన నజ్జనపతి యప్పని యాచరించె నప్పుండరీకాక్షుండు వెండియు నవ్విభున కిట్లనియె.

142 సీ. జగతీశ వేదముల్ సదివితి శాస్త్రముల్
వింటివర్తిల్లితి వృద్ధగోష్ఠి
నఖిలపురాణ పర్యాలోచనము సేసి
తెల్లధర్మంబులు నెఱుఁగు దిట్లు
నీతప్పు దలఁపక నెవ్వఁగ బొందెదు
కనలెద వేచు శంతను సుతుండు
గురుఁడును విదురుండుఁ గూర్కొని కూర్కొని
చెవులఁ బోయమె సవిశేషకార్య

తే. వచనములు సంజయుఁడు పెక్కువరుస లుభయ
బలవిధంబులు దెలియఁగఁ బలుకఁ డెట్లు
నీకు నాబుద్ధు[1]లన్నియు నెమ్మనమునఁ
జేర్పఁబోలవ యిం కేమి సేయ వచ్చు.

---

139 1. నేర్తురె — క.వ.

140 1. బాములం బొందుటప్పాట భావించుచున్—ఊ బ.వ. 2. వింత—కొన్ని ప్రతులు.
3. భీమసేనాహితంబేల — ఏ. 4. నీకెమ్మెయిన్ — కొన్ని ప్రతులు.

141 1. పలికె — కొన్ని ప్రతులు.

142 1. లేమియు — కొన్ని ప్రతులు.

143 క. భీమార్జునుల రణసము
ద్ధామత్వం బెఱిఁగి యెఱిఁగి తగునే తొడరం
గా మనుజుల కప్వీరుల
నేమనఁ గల దింక నేల యీచందంబుల్.

144 క. [1]తనమేలుఁ గీడుఁ దా మదిఁ
గనుచు హితులు సెప్పుబుద్ధిఁ గైకొని శుభముం
గొనకొని నడపుపతికి వ
చ్చునె పశ్చాత్తాప మెట్టిచోట నరేంద్రా.

145 ప్రణవవృత్తము. నీయుల్లం బోకనియతిం గార్యం
బాయత్తంబుగ ననుసంధింపం
జేయం జాలవు చెడు[1]తెర్వుం బోఁ
బాయం [2]ద్రోవవు బలిమిం బుత్రున్.

146 తే. ద్యూతమున గెల్చి [1]నెపమున నుఱికి పుణ్య
కాంతఁ దల వట్టికొని సభాభ్యంతరమున
కీడ్చి [2]వలువ లొలుచుటయు నెఱిఁగి సుతులఁ
జంపె నని భీముఁ జంపఁ దలంప నగునె.

147 వ. నీయవినీతియుం గొడుకుల దుశ్చరిత్రంబునుం దలంచి శోకరోషంబు[1]లు విడిచి శాంతుండవై యుండు మనిన నుపేంద్రునకున న్నరేంద్రుం డిట్లనియె.

148 జలదవృత్తము. నీ పలుకెల్ల నిక్కము యనింద్య గుణా
యీ పురుషార్థహాని సుతులిల్గుటకుం
దాపముఁ బొంది తాల్మి దిగఁ ద్రావి మహా
కోపుఁడ నైనఁ బాటిలెఁ దగుం గినియన్.

---

144 1. తనమేలును గీడునుదాఁ/గనుగొని హితమతుల బుద్ధికైకొని — ఇ ఉ.గ.వ.

145 పణవవృత్తమని అ.క. 1. త్రోవం — కొన్ని ప్రతులు. 2. బులవు — పౌ.

146 1. నేపున — స. 2. వలువుల నొలుచుట యెఱిఁగి — స.

147 1. లుడిగి — కొన్ని ప్రతులు.

149 క. తెలిసితి నీ మాటలఁ బు
త్రులదెస నెవ్వగల నెల్ల దొఱఁగి యనుజపు
త్రుల నాకుఁ బ్రియ మొనర్పం
గలవారుగ నడచువాఁడ గంసారాతీ.

150 వ. అనుటయు నమ్మహాత్ముండు భీమార్జుననకులసహదేవులం [1]గానిపించినఁ గ్రమంబున నమ్మానవపతి వారలం గౌఁగిలించుకొని దీవించె నప్పు డాశ్రితవత్సలుం డగు శ్రీవత్సలాంఛనుండు యుయుత్సునకుఁ దదీయ సందర్శనంబు సముచితప్రకారంబున నడపె నట్లు గాంచిన వణిక్కన్యా జాతునెడం బొడమిన వాత్సల్యంబునవై చిత్రవీర్యుం డతనిఁ దిగిచికొని యక్కునం జేర్చికొనియెఁ దదనంతరంబ యద్ధరణీవిభుండు ధర్మపుత్ర [2]ప్రభృతు లగు నయ్యేవుర నుద్దేశించి మీరు గాంధారిం గనుం డని పంచిన నప్పాండవేయులు పద్మనాభపురస్సరంబుగాఁ జని వినయంబున వినతులైన నద్దేవి దీవింప నొల్లక యుల్లంబు నిజతనూజుల మరణంబునకుం దాపంబు నొంద శాపం బిచ్చునది యై యజాతశత్రు [3]నుద్దేశించిన నత్తెఱంగు సకలప్రాణి [4]చిత్తవృత్తంబులు దనదివ్యబోధంబునం [5]దేటపడం గనియెడువాఁడును మనోజవుండును సర్వలోకసంపూజ్యుండును నగు సత్యవతీసూనుం డెఱింగి తత్క్షణంబ సన్నిహితుం [6]డై యఖిల జనంబు లభివందనంబు సేయం గైకొనుచు నక్కోడలిం జేరి యోహో శపింపకు [7]శమింపు మని పలికి మఱియు ని ట్లనియె.

-: ధర్మజుని శపింపఁ బూనిన గాంధారిని వ్యాసుఁ డూరార్చుట :-

సం. 11-13-6

151 సీ. పాండవేయాగ్రజుపై నల్క మానుము
రాజసం బేల యీరాజు ధర్మ

---

150 1. గ్రిమంబునంగానుపింప నమ్మానవ – పెక్కు ప్రతులు. 2. ప్రిముఖు – కొన్ని ప్రితులు. 3. నుద్దేశించె – కొన్ని ప్రితులు. 4. జాతం (లం) బులచిత్త – పెక్కు ప్రతులు. 5. దెలివిపడం – వ. 6. హితుండై యఖిల – పెక్కు ప్రతులు. హితుండయ్యునఖిల – వా; హితుండయ్యెనఖిల – వీ.శ.ష. 7. శపింపకు మని పలికి – ఆ.ఎ.ఓ.ఔ.క.

పగుఁడు నీ విందుక పాటించి వినవమ్మ
చెప్పెదఁ గౌరవశ్రేష్ఠుఁ డనికి
జనుచుండి తల్లి దీవన యిమ్ము జయముగా
నాకని పలికిన నా కుమారు
తోడ నీపేర్మికి నీడుగాఁ గొడుక [1]యె
క్కడ[2]నుండు ధర్మమక్కడకు [3]జయము

ఆ. సేరు ననవె ఘోరఘోరయుద్ధంబున
గెలుపుగొనిరి గాన తలఁప ధర్మ
పరుల కాఁగవలయుఁ బాండుతనూజు ల
సూయ లేనిబుద్ధిఁ జూడు [4]మెట్లు.

152 మేదినీవృత్తము. విను మిటులేటికిం జనినవృత్త మూఁది యల్గఁగ
జనము నుతించు నీదుగురుసారధీరబుద్ధిఁగ
నిను నతిశాంతచిత్త [1]యని నిక్క మేనుఁ గందుఁగ
మనమున నిట్టి నీ కగునె మత్సరంబు వత్సా.

153 వ. ధర్మంబు పరిగ్రహించి నీ కొడుకులగు పాండవులదెస రోషంబు [1]నిగ్ర
హింపు మనిన గంధవతీనందనునకు [2]గాంధారరాజనందన యి ట్లనియె.

---

151 1. నెక్కడగల్గును ధర్మమక్కిడకు—స. 2. గల్గు—పెక్కు ప్రతులు. 3. జయంబు—కొన్ని ప్రతులు. 4. వీరి - కొన్ని ప్రతులు.

152 1. వని — కొన్ని ప్రతులు.

153 1. నీమదివిడువు — అ ; వలపదను గ్రహింపు — క.వ. 2. గాంధారి యిట్లనియె—కొన్ని ప్రతులు.

154 సీ. ఏ నసూయాగ్రస్తఁ గాను వీరలఁ జెడ
దలఁతునె[1] యెట్టు లుమ్మలికఁ జేసి
కలఁగితిఁ[2] గాక యికౌంతేయవర్గంబు
గొంతికె ట్లట్లు నాకును భరింప
వలదె దుర్యోధనుతులువతనంబున
శకునియుఁ గర్ణదుశ్శాసనులును
దుష్టాత్ము లగుటను ద్రుంగెఁ గౌరవకుల
మడరి పాండవులు గయ్యంబుపాడిఁ[3]

తే. జంపి రందఱు నదె మది నొంపఁజాల
దచ్యుతుఁడుసూడఁ గురుపతి ననిలసుతుఁడు
దగునె[4] గదపోర నాభికి దిగువ నొంచి
చంప[5] నత్తెఱఁ గుల్లంబు నొంప[6] కున్నె.

155 క. విడుతురె శూరులు రణమునఁ
బడునట్టియవస్థ తమకుఁ బాటిల్లినను
బుడమి నను స్త్రజనంబులు
నడపెదు తెఱఁ గలుక తప్పునకు రాకున్నె.

156 వ. అనిన భీముండు[1] భీతికంపితుండగుచు గాంధారికి వినతుండై వినయంబున నిట్లనియె.

—: *భీముడు గాంధారికిఁ గోపోపశమంబుగా నుత్తరంబు లిచ్చుట* :—

సం. 11—14—1

157 సీ. తలపోసి చూడంగ[1] ధర్మ[2] మయ్యో నధర్మ
మయ్యోనేఁ బ్రాణభయంబుకతన

---

154 1. దలఁచెద నెట్టు — పెక్కు ప్రతులు. 2. కనలితి — ఓ. 3. కయ్యంవుఁబాడి — కొన్ని ప్రతులు. 4. తివిరి — ఏ.ఓ. 5. చంపె — పెక్కు ప్రతులు.

156 1. డతిభీతుండగుచు — జ.వ.వీ.శ.

157 1. చూడనధర్మమయ్యోనో ధర్మమయ్యోనో — ల. 2. దగనాకునిధిధర్మ — ఔ.

నట్లు సేసితిఁ గృపయార [3]సై రింపుము
నీదుపుత్రుఁడు లావు [4]నేర్పుఁ గలఁడు
గావున [5]నమ్మ్మెయిఁగాని [6]యోర్వంగ రా
దదియట్టు లుండె ధర్మాత్మజునకుఁ
బాడితో వచ్చెనే పరిభవం బతనిచే
ద్రౌపది యేకవస్త్రయు రజస్వ
ఆ. లయునుగాదె యపుడు దయమాలి కొలువున
కీడ్చి తేరఁబంచి యేమియనియె
నతఁడు వినవె యూరు లప్పుణ్యకాంతకుఁ
జూపు జెఱుఁగవే విశుద్ధచరిత.

158 వ. తత్కాలోద్దీపితం బైనకోపంబున నెసంగు మనస్సంతాపంబు దాల్మి దహిం చిన దదూరుభంగంబు గదా[1]దండఁబునం జేయంగలవాఁడ నని యప్పేరోల గంబునఁ బ్రతిన వట్టితి నుత్తమక్షత్ర ధర్మజ్ఞులు ప్రతిజ్ఞాహాని నిందింతురు [2]గాన పూనిక నెఱపితి విను మానభలో నప్పుడ తొడలు పొడిసేసి యతనిం దెగఁ జూడఁ [3]దగియుండ నజాతశత్రు[4]నాజ్ఞ మిగులరామింజేసి యమ్మ హాత్ముచేసిన సమయంబు దప్పింపక యవ్విధంబున విపినంబున కరిగి యనేక [5]దుఃఖంబులంబడి [6]మగిడి యజ్జనపతి సంధిగోరి శౌరిం గౌరవసభకుం బుత్తెంచుటకుం దగుమాటలాడు నవసరంబున నేనును.

159 తే. అన్నదమ్ములమై యుండి యకట[1]మనల
నొరులు దల లెత్తి చూడ నొండొరులతోడఁ
బెనఁగ నేటికి [2]నీనేల పెద్దవారి
బుద్ధి విని పంచికుడుచుటపోల [3]దొక్కొ.

---

3. సైపుము — చ.వ. 4. నేర్పును — కొన్ని ప్రతులు. 5. నమ్మేన — వ.స; నమ్మైన — కొన్ని ప్రతులు. 6. నొంపంగ — జొ.

158 1. ఘాతంబునం — వీ.శ.ష. 2. గావునంబూనికె — పెక్కు ప్రతులు 3. దగవై యుండ — వ. 4. నాజ్ఞంజేసి — పెక్కు ప్రతులు. 5. దుఃఖంబులందియు — అ.జ.శ.ష. 6 పూనిదీర్చి మగుడివచ్చియు నజ్జన — ఏ.

159 1. మనకు — కొన్ని ప్రతులు; మనము — కొన్ని ప్రతులు. 2. నీనేలఁబెద్ద — వీ.శ.ష. కొన్ని ప్రతులు; నీసునఁబెద్ద — ల. 3. దొండు — స. కొన్ని ప్రతులు.

160 వ. అని నీకొడుకునకుం జెప్పి పుత్తెంచితి డానను శాంతిం బొందక యుద్ధు
[1]రాచారుండు చలంబున వైరంబుఁ జెనిచె నట్లగుట నవశ్యంబును ధర్మరాజు
నకు రాజ్యంబు [2]సేకొనుటయు నాకుఁ బ్రతిజ్ఞ దీర్చుటయుం గర్తవ్యంబు
లయ్యెంగావున [3]నేమిభంగినైనం బగదీర్చవలసె నీవును సువిచార వింతయు
విచారింపు మనవుడు నద్దేవి యతని కిట్లనియె.

161 క. ఆచావు సావఁదగున
న్నీచునకుఁ వానివలన నిక్కం బగయుఁ
నీ చెప్పినయన్నియుఁగల
వా[1]చెద్దుయుఁ దగవ నీకు నది యట్లుండెన్.

162 తే. వైరి ననిఁ జంపుదురుగాక వ్రచ్చినెత్తు
రెత్తికొని క్రోలు క్రూరాత్ము లెచట నైన
[1]నెన్నఁ డేనియుఁ గలిగిరే యీవు దక్క
నది వృకోదర వృకవిధ మసురభంగి.

163 వ. అనవుడు ననిలపుత్త్రుండు సుబలరాజపుత్త్రి కిట్లనియె.

164 జలధరవృత్తము. ఆసభలోని కట్లు ద్రుపదాత్మజఁదాఁ
[1]గాసిగనీడ్చి వల్వొలువఁ [2]గాఁ గినుకం
జేసినబాసకై పెదవిఁ జేర్చితి దు
శ్శాసను శోణితం బిది నిజం బరయన్.

165 వ. అదియునుంగాక విను మత్తని నేఁ బొదివినప్పుడు.

---

160 1. రాత్ముండు — ఏ.ల. 2. గైకొను — కొన్ని ప్రతులు. 3. నెబ్బంగి — కొన్ని ప్రతులు.

161 1. చేతయు — కొన్ని ప్రతులు.

162 1. నెవ్వరేనియు — కొన్ని ప్రతులు.

164 1. బైసిగ యీడ్చి వల్వలొలువం గినుకం — సీ.స, 2. గానలుకన్ — శ.ష. కొన్ని ప్రతులు.

166 క్రౌంచపదవృత్తము.
కౌరవ సేనావీరులు లావుం గడిమియుఁ [1]జలమును గడఁక [2]యెలర్పన్
ధీరతసొంపుం గ్రూరతపెంపుం దెగువయు నెఱపఁగఁ దెరలక వీఁకన్
బోరనఁ ద్రోవంగా రభసం బేపును గలితనమునఁ బొలుపు వహింపన్
వారు భయంబుం గూరుటకుం గావలసెను రుధిరము వదనము సేర్పన్.

167 వ. ఆరెండుపనులకై యట్లు ద్రావుటగా నటించితిం గాని.

168 తే. అన్యజనముల శోణిత మైనఁ ద్రావు
టధిక పాతక మని యిందు ననుజు రక్త
మాన నేనంత వెఱ్ఱినే యంత పాప
కర్ముఁడనె తల్లి యంత నిష్కరుణ మతినె.

169 వ. అనుటయు.

170 తే. అంధులకు నూఁత కోలగా నకట యొకని
నైన నిలుపక నూర్వుర నదయ వృత్తి
మ్రింగి తం దెవ్వఁ డేనియు మీకు నెగ్గు
లాచరింపని వాఁడు లేఁడయ్యె నయ్య.

171 క. ఒక్కరుని నీవు సంపక
తక్కిన [1]నంతటనె ప్రతిన దప్పునె విభవం
బెక్కఁగ మీ యన్న నతం
డెక్కటి రాజ్యంబు సేయ నీఁడె కుమారా.

172 వ. అని పలికి ధర్మనందను దెస మనసు నిగుడం బుత్రపౌత్ర వధ సంపీడితస్వాంత యగు నగ్గాంధారి క్రోధ పరుషాక్షరంబుల నమ్మహారా జెచట నున్నవాఁ డని[1]న నా భూపతి భయకంపిత గాత్రుం డగుచుం జేతులు మొగిచి సవినయంబుగా మెత్తని మాటల నిదె వచ్చితి దేవీ యేను బాండవాగ్రజుండ ననుచుం జేరం బోయి.

---

166 1. జవమును – వ. 2. యునొప్పన్ – ఊ వ.

171 1. యంతట – పెక్కు ప్రతులు.

172 1. యడిగిన – కొన్ని ప్రతులు.

173 క. నీపుత్త్రులఁ [1]జంపించిన
పాపాత్మునిఁ గ్రూరచిత్తుఁ బరివాదార్హున్
శాపంబునఁ బొలియింపుము
భూపాలకవల్లభాభిపూజిత [2]చరితా.

174 క. ధరణిం గల రాజులకుం
బరి[1]వారమ్మునకుఁ జావు పాటిల్లుట కై
పరుషత గైకొన్న యుధి
ష్ఠిరు దారుణదండకలితుఁ జేయం దగదే.

175 మత్తకోకిల. జీవ మేటికి రాజ్యమేటికిఁ [1]జెల్లుఁ జుట్టల బిడ్డలం
జావఁ జూచిన యట్టి ద్రోహికి సర్వభోగము లేటికిన్
నావుడున్ మఱు మాట లాడఁగ నాలు కాడక యుండి య
ద్దేవి యూర్పు నిగిడ్చె నష్టము దీర్ఘముం బరుషంబుగన్.

176 వ. ఇట్లు ధృతరాష్ట్రమహిషి యతనియుచితవచనంబులు విని యూరక యుండె నంత నంజలిపుటంబు ఫాలంబున మోపి యానతుండయ్యెఁ బట్టావృతనయన యగు నప్పతివ్రత దృష్టి పట్టంబునంచుసందునం జని యజ్ఞపతి పదనఖంబులం జెందిన నవి గందినం జూచి సవ్యసాచి జనార్దను వెనుకకుం జనియె సమీరసుతుండును మాద్రీసుతులునుం దిరుగుడువడి రప్పుడు గాంధార రాజనందన క్రోధంబు దక్కి ధర్మపుత్త్రాదులదెస మాతృభావం బలవడ [1]సాంత్వనస్వరంబునం గుంతీ సందర్శనంబు సేయరన్నా యని [2]పలికిన నప్పురుష సత్తములు చిత్తంబుల కలంక డిందు వడ నందఱు నొక్కటఁ గుంతి యున్న[3]దెసకుఁ [4]జన నక్కుంతిభోజనందన వారిం [5]గలయం గనుంగొని.

---

173 1. బొలియించిన — అ ; సనిఁజంపిన — వ. 2. చరితా — ఏ.ఒ వ.

174 1. వారంబులకు — కొన్ని ప్రతులు.

175 1. జెలుల — స. కొన్ని ప్రతులు.

176 1. శాంతస్వరంబునం — ఊ.త ; సాంత్వనవచనంబుల — కొన్నిప్రతులు. 2. నియమించిన—జ వీ శ ష ; పంచిన—వ. 3. యెడకుం—పెక్కుప్రతులు. 4. జనుచుండ—పెక్కు ప్రతులు. 5. గనుంగొని — కొన్నిప్రతులు.

-: పాండవులు కుంతీదేవికడకు గాంధారి పంపుచం బోవుట :-

సం. 11-15-9

177 అంబురహావృత్తము.
పెద్దయుఁ గాలము వారలఁ [1]జూడఁగ బ్రేముడించుచు [2]దుర్భరా
పద్దశ [3]నొందుట నమ్మహితాత్ములు[4]పట్టు లందఱుఁ ద్రుంగుటం
దద్దయు శోకమునంబొరి నశ్రులధార లొల్క[5]వగర్పుతో
నద్దురవస్థ కెఱుంగుగనుంగొని యంతకంటెను నార్తులై.

178 వ. చరణంబులు దొట్రిల్లం జని తచ్చరణంబులమీఁద వ్రాలి.

179 తే. ఓర్వ నందఱపైఁ జేతులిడుచుఁ బెలుచ
నేడ్చి యర్ధవి వారల నెత్తి వేఱు
వేఱ మేనులు [1]నివురుచు వివిధదారు
ణాస్త్రశస్త్రవ్రణవ్రచయములు గాంచి.

180 క. అచ్చోటులంటిచూచుచు
వెచ్చని[1]యూర్పులు నిగుర్చి [2]వేఁగుచుఁ బొగులుం
[3]గుచ్చి కవుంగిటఁ జేర్చును
వచ్చితిరే నృపకుమారవరులార యనున్.

181 సీ. అసమయంబున నప్పాండుభూపాల
పత్నికి శోకాగ్ని [1]ప్రజ్వరిల్లఁ
[2]దత్సమీపమునకు ద్రౌపది విన్నని
మోముపైఁ గన్నీరు మునుఁగు వడఁగఁ

---

177 1. జూడక — ...ఐ చ.ప. 2. నిర్భరా — జ. 3. నుండుట — కొన్ని ప్రతులు. 4. పట్టనందఱు — ఒ. 5. వెగు (గ) ర్పన్ — కొన్నిప్రతులు.

179 1. నిమురుచు — వ.

180 1. నిట్టూర్పులడర పేగుచు — పెక్కుప్రతులు ; నిట్టూర్పులడర వెసఁబొగులుచుదా— జ. 2. వెక్కుచు — చ. 3. గ్రుచ్చియుఁగౌఁగిట — కొన్ని ప్రతులు.

181 1. ప్రజ్వలిం (లిం) ప — కొన్నిప్రతులు. 2. దత్సమయంబున — కొన్ని ప్రతులు.

బదములు[3]నటు ద్రొక్కుపాటు వాటిల్లంగ
దైన్య మాకారంబు దాల్చినట్లు
తెఱఁగునఁ జనుదెంచి దేవి సౌభద్రుఁడాదు
లైన నీమనుమ లెం దరిగి రెంత

తే. యేనిఁ గాలంబు నినుఁ జూడ కిట్టి డీచటి
కేల రా రంచు నడుగుల మ్రోల నేల
వ్రాలె విగళాంగియై తెంచి వైన నెండ
దాఁకి [4]వందినతీఁగ చందంబు దోఁప.

182 వ. ఇట్లు మేదినింబడి రోదనంబు సేయు న[1]య్యుత్తరలికుంతలఁ గౌఁగిట దాపకుం బెద్దయెలుంగున నేడ్చి గ్రుచ్చి యెత్తి యక్కునం జేర్చి యూరార్చి యత్తన్వియుం దనయులుం దోడన చనుదేరఁ గుంతి గాంధారికడకుం [2]జనియె నప్పుడు ద్రౌపది యాధృతరాష్ట్రపత్ని పాదంబులకు మ్రొక్కి [3]యడలున వెక్కుచున్న యద్దేవి యమ్ముద్దియ నుద్దేశించి.

183 మత్తకోకిల. పుత్రి యిట్లగు నమ్మహాశోకముఁ బొంది [1]కుందుచు నున్న నీ
గాత్ర [2]మొండొకకీడు పాటిలఁ గందుఁ బాండుతనూభవుల్
పుత్రవర్గము గన్నచో నెరభూరి[3]తాపముఁ [4]బొందుదుం
బౌత్రహీనతఁ బడ్డగొంతికిఁ బాయనేర్చునె నెవ్వగల్.

184 క. [1]నిను నే నిట్లూరార్చెద
నను నీ వూరార్ప వలదె నా నీ తెఱఁగుల్
విను మొక్క రూప మనకే
మనఁ గలదు విధాత క్రూరుఁడై పఱుపంగన్.

---

3. నడ — పీ.ప ; నటు — అ.పి.క. 4. కందిన — ఇ.ఒ.న ; వాడిన — కొన్ని ప్రతులు ; నలిగిన — బొ.

182 1. నయ్యాలివేణి — జ. 2. బోయె — కొన్ని ప్రతులు ; చనునప్పుడు — జ. 3. యేడ్చి యడలున — వ.పీ.ప.

183 1. కందుచు — ఇ 2 మందాక — ఈ.చ. 3. శోకము — కొన్ని ప్రతులు. 4. బొందరే — కొన్ని ప్రతులు.

184 1. నినునేనిట్లూరార్పన — పెక్కుప్రతులు ; నినునేనిట్లూరార్చిన — వా.

185 ప్రహరణకలితవృత్తము. ఇది యిటు లగు టల్లెఱిఁగి [1]పలికె నా
విదురుఁడు సభఁ గోవిదులు వొగడఁగా
నది వినియును నే నడఁపను దురితం
బొదవె [2]గలఁక [3]సేటొలయ కుడుగునే.

186 వ. ఇట్లని యెదం గాక నాచేతఁ బోవునే యెవ్వరు నేమి సేయుదురు కాలవశం బున నవశ్యభావి యైనది యయ్యె నుపశమింపు మని పలికె నని యిట్లు పాండ వులు ధృతరాష్ట్రుని గాంధారిని [1]ననునయించిన తెఱంగెఱింగించిన నాభంగి నుపశమితక్రోధ యైన గాంధార రాజనందనపదంపడి యెవ్విధంబున వర్తించె ధర్మతనయు[2]ననంతర వర్తనం బెప్పాటఁ జెల్లె నని యడుగుటయును.

187 శిఖరిణీవృత్తము. తపస్స్వాధ్యాయా[1]దిక్షపితమలచిత్తప్రకలితా
విషజ్వాలజ్వాలా విరమణ సుధావృష్టి లలితా
జపా పుష్పక్షీర చ్ఛవికిరణసంసర్జనధురా
సపర్యానిర్వాహ [2]ప్రచుర కలన [3]స్థైర్య మధురా.

188 క. సాత్యవతేయాది మహా
మత్యవగమ్య ప్రకారమధురవిలాసా
సత్యత్వా[1]నంతత్వని
రత్యయ[2]శుభసారమయ సమగ్ర వికాసా.

189 మాలిని. సదసదనభిషిక్తా సంభృతానంద భక్తా
విదళితదుర[1]తాలీ విశ్వనిర్వాహ శాలీ
మదవదసురభేదీ [2]మానసానుప్రమోదీ
వదనజనిత విప్రా వైభవానంద దీప్రా.

---

185 1. పలుకఁడే — చ; పలుకునే - కొన్ని ప్రతులు 2. నకటసేటొలయ — చ.స. 3. టొదవ — ఆ.ఐ.ఓ.

186 1. ననుసరించిన — పెక్కుప్రతులు. 2. నుత్తరవర్తనం — గ.చ.

187 1. తిక్షపి — కొన్నిప్రతులు. 2. స్తవన — నీ.శ.ష. 3. నా — అ జ.

188 1. నంతత్వ — చ. 2. సుఖ — పెక్కుప్రతులు.

189 1. కారీవిశ్వనిర్వాహకారీ — కొన్నిప్రతులు. 2. మానిమానప్రమోదీ — ఇ గ.వ; మానినీయప్రమోదీ — చ; మానవాంసప్రమోదీ — కొన్ని ప్రతులు.

గద్యము. ఇది శ్రీమదుభయకవిమిత్త్ర కొమ్మనామాత్యపుత్త్ర
బుధారాధనవిరాజి తిక్కనసోమయాజి ప్రణీతం బైన
శ్రీమహాభారతంబున స్త్రీపర్వంబునందుఁ
బ్రథమాశ్వాసము.

—:౦:—

# శ్రీమదాంధ్ర మహాభారతము

## స్త్రీపర్వము – ద్వితీయాశ్వాసము

1 క. శ్రీమత్కీర్తి మదత్యభి
రామాకృతి [1]సద్గుణాభిరతిమత్పుణ్యా
గ్రామాకృతి [2]మత్సం[3]ప
త్త్యామోదితభక్తలోక హరిహరనాథా.

2 వ. దేవా వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె నట్లు పాంచాలి [1]నూఱడం బలికినయనంతరంబ పతివ్రతాశిరోమణియు మహాభాగయు సత్యవచనయు నగు నయ్యాంబికేయుభార్యకుం బారాశర్యమునీంద్రవరప్రదానంబునం బ్రాప్తంబై తాత్కాలికం బయిన దివ్యదృష్టివిభవంబున నిజవ్రతహాని లేనితెఱంగున సంగరతలం బఖిలంబును నధికవిస్తార [2]దూరప్రాప్తం బయ్యు [3]నాలోకనగోచరం బగుటయు.

3 మణిగణనికరము. గొడుగుల పఱియలు గుఱుకులు గొనుటన్
సిడములతునియలు సెదరి యునికి బెం
[1]దడిగలుఁ[2]బడగలు దఱచు మురియలై
పుడమిఁ గలయుటకుఁ బొగులు లోలయ మదిన్.

4 క. నుఱుమైన కాల్బలంబులు
నఱవఱ లయి యున్నయట్టి యరదంబులుఁ బెం
దఱ చగు[1]సూతాంగకములు
నొఱగిన రథ్యములుఁ గములు నుల్లమలంపన్.

---

1 1. మద్గుణా—ఇ క.ల. 2. నుత్సవమర్త్యామోదిత—స. 3. పాదామో-కొన్ని ప్రతులు.

2 1. నూరార్చి యనంత-ఐ.క. 2. దూరంబయ్యు-ఇ ఉ.గ. 3. నులోచనగోచరం-ప ఐ.ఒ.

3 1. దడబడిపడ-కొన్ని ప్రతులు; దొడలును బడగలుదునిసి-క.గ.ల. 2. యెడలును-ల.

4 1. శూరాంగ — ఉ.

5 లయగ్రాహి. రావుతులతుండమ్ములు [1]మావఁతులనుగ్గుఁ దుర
గావలిశవంబులు గజావయవరాశీ
భావభయదస్థలులుఁ బేర్వులును గండలును
బ్రోవులయి పెన్మెదడుపై విరిసి రక్త
స్రావమునఁ బెల్లయిన [2]శేవమునఁ జూడఁగడు
నేవ మగుపట్ల మృతభాగవతు లయ్యెన్
జీవములఁ బాయరొకొ నా వికచవక్త్రముల
తో వఱలురాజులు మనోవికృతి సేయన్.

6 లయగ్రాహి. హార[1]రుచులన్ హృదయహారి[2]తరమూర్తులగు
వారు హరినీలమణి [3]భారవిలసత్కే
యూరబహులాంశుచయ చా[4]తరరేఖులగు
వారు నవవజ్రరుచిరోరు ఘృణి మత్కో
టీరరమణీయు లగు వారు [5]గరుడాశ్మమయ
భూరికటకద్యుతివిహారపరిశోభా
స్ఫారు లగు వారలును బోరఁబడి నెత్తురులఁ
గూరుటఁ [6]గరంబెడఁద కారటము సేయన్.

7 లయగ్రాహి. అమ్ములును విండ్లుఁ బరిఘమ్ములును దోమరచ
యమ్ములును గుంతనికరమ్ములుఁ [1]గనత్ఖ
డ్గమ్ములు నహీనముసలమ్ములును జక్రనివ
హమ్ములును లోనగునసమ్మత[2]మహోగ్రా
స్త్రమ్ములును గండలును నెమ్ములుఁ గపాలములు
సమ్మిళితరూపశకలమ్ములయి సంగ్రా
[3]మమ్మతులదారుణవిధమ్మగుటఁ దెల్పు టధి
కమ్మగుకలంక హృదయమ్మున కొనర్పన్.

---

5 1. మావుతుల — కొన్ని ప్రతులు. 2. లేపమును — ల; తేవయును — గ.వీ.శ.

6 1. రుచులన్ — ఊ; రుచులున్ — వా. పెక్కు ప్రతులు. 2. వర. ల. 3. చారు- కొన్ని ప్రతులు. 4. తనురేఖులగు — గ.ల.వీ.శ; తనురేఖగల — చ. 5. గరుడాండ మయ — పెక్కు ప్రతులు. 6. కరం — ప.బ; ఁగరం — వా. పెక్కు ప్రతులు.

7 1. గదాఖడ్గ — ఇ; గనత్కాండమ్ములును — చ.ల. 2. మహాశస్త్రమ్ము — వ. 3. మమ్మ పుడు — వ.

8 లయగ్రాహి. కుత్తుకలబంటి యగునెత్తురులు దోయిళుల
నెత్తి [1]చవి గ్రోలుచును జిత్తములు [2]దృప్తిఁ
జొత్తిలి నితాంతమదమత్తములుగాఁ జటుల
నృత్తములు సేయుచుఁ జలత్తనువికారో
ద్వృత్తపటుహాసముల రిత్తలగు దుర్వచన
వృత్తులను నొండొరుల[3]నొత్తికొని మాంసం
బత్తి తినుటన్ వికటవృత్తులగు రాక్షసుల
మొత్తము పరిక్షుభితచిత్తత యొనర్పన్.

9 సీ. ప్రేవులు గండలు పెఱికి పేటాడి యం
గడఁగొని మెదళు ల[1]గల్చికొనుచు
రాగిలి రక్తంబు ద్రావుచు లోచన
గుళికల [2]నొలిచి మ్రింగుచును గుండె
[3]కాయ లాదట మెయిఁ గబళించుచును గ్రొవ్వు
దెమలిచి నమలుచు నెముకయూట
చవి గొనియానుచుఁ జావకయున్న రూ
పులు సచ్చుటకుఁగాఁగఁ బెలుచఁదన్ని

తే. కొనిన దెఱఁబాయఁ జాఱుచుఁ జెనకి తొడరి
కాటు లాడుచు నున్నసృగాలములును
గాకములు [5]కాపులుఁగులును గ్రద్దలును వృ
కంబులును మానసము వికలంబు సేయ.

10 వ. అగ్గాంధార రాజనందన [1]కలను గలయంగనుంగొనియెఁ దదవసరంబున సాత్యవతేయుండు కౌంతేయుల రావించి బంధుశవంబులకుఁ [2]గాలోచితా

---

8 1. నలిఁ - కొన్ని ప్రతులు. 2. ప్రీతిన్ - కొన్ని ప్రతులు. 3. నొత్తికొని – ఎ; నెత్తికొని - వా. పెక్కు ప్రతులు.

9 1. గప్పి – కొన్ని ప్రతులు. 2. డొలిచి – గ.చ.ష; దిగిచి – ఇ. 3. కాయలులావు మై – అ. 4. గాళ్ళ – గ. 5. రాఁ(రాం)బులుగు – కొన్ని ప్రతులు.

10 1. కలను - పెక్కు ప్రతులలో లేదు. 2. గాలోచితోపచారంబుగా - స; గాలోపచార

చార సహితంబుగా నగ్నిసంస్కారంబు సేయుం డని[3]పనిచి యంతర్ధానంబు సేసె వారు ధృతరాష్ట్రుం బొదివికొని వాసుదేవపురస్సరులయి యప్పనికిం జనుచుఁ గౌరవకాంతలఁ దత్ప్రదేశంబునకు నడపించిన నప్పుడఁతులు పతులను సుతులను సోదరులను పౌత్రులను మిత్రులను గుణపంబులై పడియున్నఁజూచి చెయ్వేది మేదినినొఱగువారును దావిడిచి యఱచు వారును బురపురం బొక్కువారును బడిపొరలుచుఁ బొగులువారును [4]వేనలులు వీడి వెన్నుల విరయం దిరుగువారును బలవించు వారును బేర్కొని యగ్గించువారును మ్రాన్పడువారును మోములుం దలలును మోఁదుకొనువారును నై రప్పు డాదుర్యోధనజనని జనార్దను[5]ం బేర్కొని చేరంబిలిచి పరమశోకార్త యగుచు నతని కిట్లనియె.

—: గాంధారి పాలికలను చూచి కృష్ణునితోఁ జెప్పి దుఃఖించుట :—

సం. 11-16-18

11 సీ. చూడము ధృతరాష్ట్రి కోడండ్రఁ గన్నార
వీరె కన్నీరు పై వెల్లిగొనఁగ
దీనతఁ బొందెడు నాననంబులవిప్ర
లాపంబులైన సల్లాపములను
నడలు చొండొరులకు నన్నలఁ దమ్ముల
రూపించి వేర్వేఱఁ జూపుటయును
బోరిమొగంబులు సూచి పురపురఁబొక్కుచుఁ
దలలల్లఁ దూలంగ నిలుచుటలును
తే. గలిగి [1]యలిగెడువారి కన్నులకుఁబండు
వగుచునున్నారు కాకులు మగల తనువు
లెక్కియున్నను చేష్టలు దక్కి కొంద
ఱడువఁజేయాడ కున్న వారంబుజాక్ష.

---

సహితంబుగా — అ.ఇ ఎ.క. 3. వలికి — గ.వ. 4. గొప్పమ్ముడులు — గ.వ.వీ.శ.ప.
5. నుం జేరం - కొన్ని ప్రతులు.

11 1. యల్లెడ — స.

12 **మాలిని.** కూలియుఁ [1]గాంతి యిగుర్పఁగఁ దేజముగుందక వహ్నులుగ్రూరశిఖా
జాల మడంగియుఁ [2]జాయ వెలింగెడుచందము నొందిరి శల్యుఁడు బాం
చాలుఁడుఁ గర్ణుఁడు జాపగురుండును శాంతనవుండు నిజంబున కే
కాలుఁడు వీరిప్రభం గడచెం [3]గుణభద్రునిఁ గంటె సుభద్రసుతున్.

13 ఆ. ప్రభువు లంతనంత [1]రాజిల్ల నెడనెడ
వీరయోధ[2]తతులు వెలుఁగుచుండ
గ్రహచయమునఁ దారకప్ర[3]కరంబునఁ
బోలుచు గగనతలముఁ బోలెఁ గలను.

14 సీ. అర్జున భీష్మ[1]చాపాచార్య భీమ క
ర్ణాదుల మహిత దివ్యాస్త్రవితతు
లాడిన నొండొకకీడు రానేరమి
వీతవికారమై వీరయోధ
చారుశరీరసంచయ ముండఁగా దీనిఁ
గంక శివాగృధ్రకాకకులము
లాదిగాఁ గలుగుక్రవ్యాదముల్ [2]పీఁకు వీఁ
కాడుట నెంగిలి యయ్యెనకట

తే. హంసతూలికాతల్పములందుఁ బొందు
భోగిజనముల మృదుగాత్రములు ముకుంద
కంటెఁబరుసని ధరణిభాగము[3]నఁ గూలి
యున్నయవి సూచువారల యుల్లము ముడుక.

15 క. చెవిని [1]సొగియించువీణా
రవమును గానంబు వేణురావము నిత్యో
త్సవముగ విను రాజులకడ
శివా[2]రుతము [3]చెలఁగుచునికి చిత్త మలంచెన్.

---

12 1. గాంతియుఁ గుర్వఁగ — జ.ల.శ; గాంతి యెలర్పఁగ — వ. 2. జాల — కొన్ని ప్రతులు. 3. గుల — కొన్ని ప్రతులు.

13 1. భాసిల్ల — వ. 2. వరులు — కొన్ని ప్రతులు. 3. చయం — కొన్ని ప్రతులు.

14 1. ద్రోణా — చ. 2. పీఁకి పంకాడుట — జ. 3. నవోరిగి — కొన్ని ప్రతులు.

15 1. కొసొగ — కొన్ని ప్రతులు. 2. రమయె సంగు — చ. 3. లెసఁగు — ఊ.స.

16 తే. [1]సారచందనహృద్యకస్తూరికాది
[2]లేపనాలిప్తి నుండెడు భూపవర్యు
[3]లకట శోణితపంకదిగ్ధాంగు లగుటఁ
గనుట [4]కోర్వ రాదయ్యెడుఁ గమలనాభ.

17 క. వనితలు మేలపుమెయి మెలు
పునఁదిగిచిన నొప్పుహారములు మొదలగు ప్ర
న్ననితొడవులు గ్రద్దలు దివి
య నరేంద్రులు గొంచఱునికి యచ్యుతకంటే.

18 క. ప్రాణంబులు విడిచియును గృ
పాణాదులు విడువకున్న భటులారయ స
ప్రాణులపోలెం బ్రధన
క్షోణికిఁ దొడవగుచు నున్కి చూడుము కృష్ణా

19 క. సూరెఁను [1]వందిజనము లిం
పారఁగ విను తింపనొప్పునట్టి మహీశుల్
నారీజనములు [2]సుట్టుం
జేరి పనవుచుండ నునికిసేసె నలంతన.

20 తే. [1]కూరు మొన పెట్టినట్టులు గొంద ఉజ్జ్వ
లాయుధములు గంకటములు నమర నున్నఁ
జూచి చావనివా రని [2]చూడు చేర
నరుగ కున్నవి కంక [3]గృధ్రాదు లనికి.

---

16 1. చారుచందన — కొన్ని ప్రతులు. 2. వేపనాలిప్తమొందెడు — ప ఐ.వ.స. 3. లధిక - పెక్కు ప్రతులు. 4. కోర్వంగరాదయ్యకమల — క.జ.వీ; కోర్వరా దయ్యె నాకు నోకమల — ల.

19 1. వందిజనము లింపారఁ గవినుతింపనొప్పు — పెక్కు ప్రతులు; ను వందిజను లింపారఁగ నుతియింపనొప్పు — వా.పీ.శ ష; నుండెడి జనులింపారఁగ నుతియింప — వ. 2. సుట్లం — కొన్ని ప్రతులు.

20 1. కూరుకుచున్న యట్టులు — వ.శ. 2. చూడఁజేర — కొన్ని ప్రతులు. 3. వృకాదు — కొన్ని ప్రతులు.

21 వ. ఇది యంతయు [1]నీచేసాధితం బైన [2]కార్యంబని పలికి వెండియు.

22 సీ. అట్టలకడ నుత్తమాంగముల్ గానక
యలమట నలుగడ [1]లరయువారుఁ
దలలు చేతులఁ గొని తనువు [2]లత్తలమునఁ
దఱచు పీనుఁగులలోఁ దడవువారు
శిరములు [3]మేనులఁ జేర్చి భావించి ని
జాస్యముల్ వ్రేసికొంచఱచువారు
తునియలు పెక్కైనఁ బనివడిగూర్చి రూ
పులు గనుంగొని మూర్ఛ[4] మునుఁగువారు.

తే. నైన కౌరవపాంచాల మానినీజ
నముల నచ్యుత చూడుము నాథజనక
పుత్రసోదరశవముల పొంత[5] కేఁగి
పెక్కుదురవస్థ లొందెద రక్క టకట.

23 తే. [1]అవయవములు [2]రూపఱఁగఁ [3]గ్రద్యాదభక్షి
తంబులై యున్కిఁ గొన్నిశవంబు లుపిద
లెంత సూచియు [4]నవి గొంద ఱెఱుఁగఁజాల
[5]రయ్యెదరు సూడు తమబంధు లగుటఁ గృష్ణ.

24 క. ఇట్టివి యెల్లను గనుఁగొను
కట్టిఁడితన మొంమనట్లుగా నేమొకొ తో
ల్పుట్టువునం జేసితి వీ
చుట్టల నిటు సూడకుండఁ జొప్పడ దయ్యేన్.

---

21 1. నీచేత — పెక్కు ప్రతులు. 2. శౌర్యం — ల.

22 1. నరయు—పెక్కు ప్రతులు. 2. లుత్తలమున—అ.ఊ. 3. మేనులుచేర్చి—ఇ ఒ.చ.
4. బోరయువారు — పెక్కు ప్రతులు. 5. జేరి — ఒ.

23 1. అవయవంబుల గృధ్రాదులరసి భక్షణంబు జేసినఁ గొన్నిశవంబు — ఊ.
2. రూపేది — ఓ.ఔ ; రూపెడలి — ల ; రూపెడల — క.న. 3. క్రవ్యాది — ఒ.వ.
4. నదె — పెక్కు ప్రతులు. 5. రయ్యాచూడుము తమ — ఒ.

25 క. అని [1]పలుకునపుడు దుర్యో
ధనుని కళేబరము దృగ్గతంబగుటయు న
వ్వనిత యిలఁ ద్రెళ్లె నటికిన
యనటిక్రియఁ మూర్ఛఁ జిత్తమవశంబై నన్.

—: గాంధారి దుర్యోధనుని కళేబరంబు చూచి పలవించుట :—

సం. 11—17—1

26 వ. ఇట్లు మూర్ఛిల్లి కొండొకసేపునకుం దెలిసి గాంధారి పరిచారిక లూఁదికొని పోవ నప్పుత్రశవంబుకడకుఁ బోయి.

27 తరల. విపుల వక్షము మీఁద నశ్రులు వెల్లిగొల్పుచు వ్రాలి యో
నృపతికుంజర కౌరవేశ్వర నేల నిమ్మెయి నీయుదా
త్తవపుశరీరముఁ బొందఁ బాడియె తల్లి వచ్చిన భక్తితో[1]
నుపచరింపక లాఁతివై యిటు లూరకుండుట యుక్తమే.

28 వ. అని మఱియు ననేక ప్రకారంబులం బలవించుచు హాహాకారంబు లెసంగ రోదనంబు చేసి యాసుబలనందన తన సమీపంబునకుఁ జనుదెంచియున్న యుపేంద్రున కిట్లనియె.

29 మంగళమహాశ్రీ వృత్తము.
ఈతఁడు రణంబునకు నెత్తిచనుచుండి[1]నను నెంతయును భక్తిఁ గని నాకుం
బ్రీతియెసఁగం బలికి ప్రేమ మొలయం బొగడి పెద్దయు వినీతినిరతుం డై
చేతులు మొగిడ్చి జయసిద్ధి[2]యుఁగ దీవన విశిష్టదయ నిమ్మనిన ధర్మం
బేతల ననూన మగునిద్ధజయ మాతలకు నెట్లయిన సిద్ధ మగు నంటిన్.

30 వ. ఇట్లన నేల యంచేని.

---

25 1. పలి (కె) కి – కొన్ని ప్రతులు.

27 1. మై – పెక్కు ప్రతులు.

29 1. నను – పెక్కు ప్రతులు ; యును వా.వీ.ష. 2. యగు దీవన – కొన్ని ప్రతులు.

31 **మానినీవృత్తము.** జూదము [1]నప్పుడు సర్వజనంబులు చూచి భయంపడి యిప్పనియి
మ్మేదిని సేనలకుం గురుకోటికి మృత్యువు గాని నిజం బరయం
బో దని యాడరె యమ్మెయి నాదగుబుద్ధికిఁ దోఁచిన సత్యము దా
మోదర పాటిలదే కొడుకంచుఁ బ్రియోక్తులు వల్కిన బెంపు సెడున్.

32 వ. వినుము దీవనకుం జొరక మధ్యస్థపుమాట లాడుటయ కాదు మఱి నే నప్పు
డతనితోడ.

33 తే. [1]ఆహవంబునయందు నీ వోహటించి
పోవ నడి వచ్చు నడికంటెఁ జావుమేలు
క్షత్రజీవి[2]తఁ బరలోక సౌఖ్య మనుభ
వింపు మమరత్వసంపద వెలయుమంటి.

34 క. అని చెప్పి [1]యుంటి నాచె
ప్పినయట్టు[2]లు సేసి యితఁడు పేరును బెంపుం
గని యుండఁగ నిట్లడలున
మునుఁగు టరయ గడుపుశోకమున పెంపునుమే.

35 ఆ. [1]అరివిమర్ది యితనికై వగ పేటికిఁ
బుణ్యలోకమునకుఁ బోయెననుచు
నుండ నోపెనేని నుల్లంబు ధృతరాష్ట్రు
దిక్కు లేమిఁ [2]దలఁచి పొక్కకున్నె.

36 **వ.** అని వెండియు.

---

31 1. చందము — పెక్కు ప్రతులు.

33 1. ఆహవాభ్యంతరముననీ — గ.వ ; ఆహవాగ్రంబునందునీ — ఒ.జ.శ ; ఆహవంబున
నీవటులోహటింప — ఊ.ఐ. 2. క — వీ.శ.ష.

34 1. యుండ — కొన్ని ప్రతులు. 2. ల — కొన్ని ప్రతులు.

35 1. 'ఊ' ప్రతిలో ఈ పద్యము ఈ క్రిందివిధముగా నున్నది.
"అరివిమర్దన యీతండు నరుగు పుణ్య
లోకమునకును నను చుండు రూఢిమీర
రమణ నుల్లంబునను ధృతరాష్ట్రునకును
దిక్కు లేమియు దలపోసి పొక్కుచుందు.
2. జూచి — ఒ.వ ; జేసి — జ.

37 సరసిజవృత్తము:

శ్రీరమ్యత్వంబారఁగఁ బెంపూర్జితముగ మణివిరచితమకుటములుం
దారుం జూడ౯ సారవిభూతి౯ ధరణిపు లనిమిషధవనిభు లగుచు౯
భూరిప్రీతిన్ [1]సూఱెలఁగొల్వ౯ భువనవినుత మగు పొలుపువెలయ ము
న్నీ రా జుండున్ దారుణదైవం బిటువఱచునె తుది నితనిఁ గటకటా.

38 తే. కనక[1]బహురత్నమయపీఠమున మృగాక్షు
లాలవట్టంబు లిడఁ జెలువమరునట్టి
కౌరవేంద్రుండు [2]పెనునేలఁ గంక[3]పక్ష
పవనహతుఁ డయ్యెఁ జూచితె పద్మనాభ.

39 క. ఈరాజు భీమసేనును
దారోగ్రపరాక్రమమున ధరణి నొఱగి దు
ర్వారమదవారణము కం
ఠీరవము విహారమునఁ బడినగతిఁ బొలిచెన్.

40 క. విదురుఁడుఁ దండ్రియుఁ దనకుం
బదివేలవిధములఁ జెప్పఁ బాటింపఁడు దు
ర్మదమునఁ దగియెడు బుద్ధులు
విధిమూఁడిన [1]మర్త్యుఁ డేల విను నుచితోక్తుల్.

41 క. పదునొకఁ డక్షౌహిణు [1]లే
పొదవఁగ నలిఁగొలువ నొప్పు నుర్వీశ్వరుఁడే
తుది నిష్పరివారుం డై
గదఁ జేకొని యొంటి పోరి కలనిం బడియెన్.

---

37 1. సూరుల — వా ; సూఱెల — పెక్కు ప్రతులు.

38 1. నవరత్న — ఊ. 2. చెడు — వ.శ. 3. గృధ్ర — ఊ.

40 1. మనుజుఁడేల — కొన్ని ప్రతులు.

41 1. లింపొదవగ బొదువంగనొప్పు — కొన్ని ప్రతులు ; లింపొదవఁ బొదువనొప్పు నట్టియుర్వీ — స.

42 తే. ధరణి గజఘోటకము లొప్ప ధార్తరాష్ట్రు
[1]తెల్లఁబోలుపారఁగాఁగంటినివ్వ[2]డవి వి
నాశ మొందినఁ జాడఁజీ నలిననాభ
[3]యది పరాధీనముగఁ జూచు నట్టిదయ్యె.

43 వ. అని దుర్యోధన[1]వల్లభ [2]నిరీక్షించి [3]మాధవు నుద్దేశించి [4]యిట్లనియె.

44 ఆ. కొడుకుచావుకంటెఁ గోడలి[1]యడలునఁ
బెరిగి శోకవహ్ని దరికొనంగ
నంతరంగ మిప్పు డగ్గల మెఱియంగఁ
దొడఁగె దీని కేదితుది యుపేంద్ర.

45 సీ. చూడు మిమ్ముద్ధియ సుతుఁ జూచి వదన మ
ల్లార్చుచుఁ బ్రాణేశునాననంబు
పైఁ జూడ్కి [1]యడరించి పాణితలంబున
నందంద [2]నెమ్మొగ మడిచికొనుచు
మరలఁ బుత్రునిదెస కరిగిన మనసు వే
రడలున మునుఁగంగ నతనిచెన్ను
మోమునఁ దనమోము మోపి మూర్ఛిల్లుచుఁ
దెలిసి వల్లభునురఃస్థలము [3]గ్రుమ్మ
తే. నుడుకుఁ[4]గన్నీరఁ దడియంగ [5]నొఱగుచును వి
చేష్టయై యూరకుండుచుఁ జెలులతోడఁ
దిరిగి పొగులంగ వేనలి [6]విరియ మేన
[7]నవులఁ దిరుగుచున్నది యక్కటకట.

---

42 1. తెలమి — కొన్ని ప్రతులు. 2. డడరి — కొన్ని ప్రతులు; చెమర — ల; విడిచి — వా. 3. యున్నవారల జూచితియుక్కుదక్క — ఈ.

43 1. వల్లభి — చ.జ.ల. 2. నుపీడించి — కొన్ని ప్రతులు; నుపలక్షించి — ఈ.ఐ. యగు భానుమతి నీక్షించి — న. 3. మఱియు మాధవు నుద్దేశించి — కొన్ని ప్రతులు. 4. యద్దేవి యిట్లనియె — కొన్ని ప్రతులు.

44 1. యలమట — ఇ.ఔ.వ.

45 1. వెట్టితాపాణి—ఇ.ఉ.గ.వ; పచరించి—జ.శ. 2. నెమ్మోమునడచి—కొన్నిప్రతులు. 3. గ్రమ్ము—కొన్నిప్రతులు. 4. గన్నీరువడియంగ—ల.వీ.శ.ష. 5. నొరలుచును—ఈ.ఊ. 6. నెరయ — కొన్నిప్రతులు. 7. వెదవులెండంగఁ దిరుగుచున్నది కట కట — గ.

46 వ. అని వెండియు

47 సీ. ఈసుమధ్యమ యిమ్మహీశ్వరు బాహు [1]త
లంబున [2]లలితోప లాలనంబు
నొంది రాగిల్లెడునుల్లంబుతో ముందు
నింకిట నిమ్ముగ్ధ నెట్లు సూడ
వచ్చుఁ గనుంగొన వశము [3]గాదిది యిట్టి
కొడుకును [4]మనుమండుఁ బుడమి నిట్లు
పడియుండఁ జూచెడు పాపజాతికి నిప్పు
డవియక [5]నిగ్గడి యైనయినుప

తే. గుండియకుఁ జేటు పాటింకఁ బుండరీక
నయన యెన్నఁడు లేమి [6]నిర్ణయముగాదె
యింత కోర్చెడు [7]నట్టివా రెన్నఁడేని
నుర్వి నెందేని గలుగుదురొక్కొ [8]యొరులు.

48 క. జననియు భార్యయు నేమై
న నేమి వేదములు బొంకునకుఁ జోరమి నిజం
బని పుణ్యలోక మగు నని
తనకార్యము సూచె నిట్లు తగునె యితనికిన్.

49 వ. అని యనేక[1]భంగుల విలాపంబు సేసి తక్కటితనయులదెస నాలోకించి
విష్ణుదేవునితో [2]నిట్లనియె.

---

47 1. బలంబున – ల. 2. లీలతో లాలనంబు – వ. 3. గానిదియట్టి – కొన్ని ప్రతులు. 4. మనముందు – చ 5. నిర్గతి యైన – ఇ.చ.వ ; కఠినంబునైన – ఊ ; నీగట్టి యైన – వ.శ. 6. నిశ్చయము – కొన్ని ప్రతులు. 7. వారు మున్నెవ్వరేని – వ. 8. జనులు – కొన్ని ప్రతులు ; నరులు – ఔ.ట.వ.

49 1. విధంబుల – కొన్ని ప్రతులు. 2. వెండియునిట్లనియె – కొన్ని ప్రతులు.

50 భాస్కరవిలసిత వృత్తము.

కౌరవన్నృపతి తనూజశతంబుం గంటె [1]పవనసుతుపటుభుజలీలా
ఘోరతం దడం[2]బడ మేదినిమీందం [3]గూలె వికటముఖకరచరణత్వం
[4]జేరి కయినం గనుంగొన్న విషాదం బెంతయు మది నొలయంగం బ్రియకాంతల్
చేరి విలపనము దద్దయు నార్తిం జేయంగ మునికి వనట [5]తిరిం బెట్టెన్.

51 తే. చందనార్ద్రకుట్టిమములం జరణతలము
[1]లొందుటకు నేవగించు నయ్యువిదలిపుడు
నెత్తురుల [2]రేవ మెక్కిన నేలం బొరలు
చున్నవా రేమి సెప్పుదు నుదుకుపేర్మి.

52 క. బాలలుం దరుణులు ప్రౌఢలుం
దూలెడు వికలాంగకములతో డెందములం
వాలిన విరహానలముల
పాలై వందురెద [1]రొక్కఖంగిన యకటా.

53 క. బలదర్ప ధైర్యశౌర్యో
జ్జ్వలు లగుధృతరాష్ట్రసుతుల సతులకు నిట్లా
కులత[1]మెయి వనటపెల్లునం
దలరవలసె దిక్కుమాలి దైవము [2]చెయిదిన్.

54 క. నిజభూషణాతపత్ర
ధ్వజకంకట [1]ఖండవేష్టితము లైనకురు
ప్రజగాత్రశకలములు వా
రిజనాభ కనుంగొనంగ రెట్టించె వగల్

---

50 1. యరెనిల - కొన్ని ప్రతులు. 2. ఒడ - కొన్ని ప్రతులు. 3. గూలి - కొన్ని ప్రతులు
4. జే కినిం గనుం గొనంగ - వ. 5. యుగిరించెన్ - స; తిరిం బెట్టెన్ - కొన్ని ప్రతులు.

51 1. నోవుటకు - స. 2. దే(వ) మయెక్కిని - కొన్ని ప్రతులు.

52 1. రనేకఖంగుల - ఈ.

53 1. మయి - వా; మెయి - కొన్ని ప్రతులు. 2. కతనన్ - గ.వ.

54 1. శ(స్త్ర) - జ.

55 క. జననియుఁ దండ్రియుఁ దొలుబా
మునఁ జేసిన పాపకర్మమునఁగాక సుయో
ధనుఁడు మొదలయిన నూర్వుర
ననఘుఁడు ధర్మజుఁడు నామమడఁపఁగ దగునే.

—: గాంధారి దుశ్శాసనుని కళేబరంబు చూచి విలపించుట :—

సం. 11—18—19

56 సీ. అచ్యుత [1]పిఁడెమహా[2]ఖిలభుజుఁ డగు
భీముగదాహతి భూమిఁ గూలి
యాతని చేత సర్వాంగంబులందును
గలుగు క్రొన్నెత్తురు కాంతుఁ ద్రావఁ
బడి మఱి తెగ[3]టారి పడియున్నవాఁడు దు
శ్శాసనుఁడీతండు సభకు ద్రుపద
పుత్త్రి నీడిచి తెచ్చి పొలువతనమ్మునఁ
బతులసన్నిధిఁ గురుక్షితివిభునకుఁ

తే. గర్ణునకుఁ జిత్తసంప్రీతి గాఁగ దూల
పుచ్చెఁ బెక్కువిధంబుల నొచ్చి యామ్మృ
గాక్షి యప్పుడు మారుతి యంతరంగ
[4]మేర్పఁ దలపించుదానన యింతవుట్టె.

57 క. ఆసభనమ్మోయి నీదు
శ్శాసనుఁ డప్పాండుపుత్త్రసతిఁ గ్రూరాత్ముం
[1]డై సంక లేక పెద్దయుఁ
గాసింబెట్టంగ నెటిఁగి [2]కలఁగినమదితోన్.

---

55 1. బ్రియులును — పెక్కు ప్రతులు.

56 1. కంటె — చ. 2. భుజబలుఁ డగు — ఈ.ఒ.వ. 3. టార్పఁ బడియున్న - జ.శ.ప.
4. మెరియ — పీ.ప.

57 1. డై సంకట పడఁ బెద్దయు - స ; డై సీర లొలువఁ బెద్దయు - డ.వ. 2. కనలిన - డ.

58 వ. ఏను [1]దుర్యోధనునితో ని ట్లంటి.

59 తరువోజ. [1]హరిచేత రక్షితయైన పాంచాలి కగునయ్య యిమ్మెయి నత్యంతనీచ
పరిభవదుఃఖంబు[2]పాల్ సేత మీఁదు పరికింప కున్నఁగీడ్పాటిల్లకున్నె
యరి[3]కంజ కుంజరుఁ[4] డగు[5]భీముఁ బల్కు లనుబరిగోలల నలఁచుటమేలె
వెరవిడి వేవేగ విడువుము గారవింపు మీవంశపవిత్ర నోపుత్ర.

60 క. క్రూరాత్ముఁడు నీచుఁడు గాం
ధారవిభునిఁదోఁడగు పాండుతనయులఁ బ్యా
ప్రారంభులఁ గూడి మనుము
కౌరవకుల మెల్ల బ్రదుకఁగా బోగ [1]డొందన్.

61 క. అని యెన్ని భంగులను జె
ప్పినఁ దా నప్పలుకు లెల్ల బెడచెవులం బె
ట్టె నుదగ్రుఁడు దగుకార్యము
[1]గనునె వశంబగునె దైవ[2]గతిఁ దప్పింపన్.

62 తే. నాఁటి మాట లుల్లంబున నాటియుండ
[1]నొవ్వుతోఁ దజి వేచినేఁ డివ్విధమునఁ
బఱిచె భీముండు నొప్పింపఁబడినత్రాఁచు
పాము పగసాటి తెగటార్చుభంగిఁ గృష్ణ.

---

58 1. దుశ్శాసను — ఎ ఐ.చ.

59 1. అరయక సభలోన నత్తోయ జాక్షి నమ్మెయి దయమాలి యత్యంత నీచ — స.
2. పాల్సేయ—కొన్ని ప్రతులు. 3. కుంజ—ట. 4. రంబగు, రమగు - అనిపాఠములు.
5. భీమసేను ననయంబు పలుకుల నలఁచుటమేలె — ఓ.

60 1. డంగన్ - కొన్ని ప్రతులు.

61 1. గనుగొననేరండు - కొన్ని ప్రతులు. 2. గతియట్లుండెన్ - ఊ.

62 1. నేపుతో — కొన్ని ప్రతులు.

63 క. తగుఁ బగ దీర్చుట యిమ్మెఁ
దగ వగునే నెత్తు రెత్తి త్రావుట భీముం
డు గడుఁ ఘోరము సేసెను
మగల కతిక్షుద్ర[1]వృత్తమా పొగ డొసఁగుఁ.

64 తరల. కరములుం జరణంబు[1]లున్ విరి గల్గి సాఁగి [2]వికీర్ణమై
యురము నిర్భరవైకృతంబుగ నుర్విఁ ద్రెళ్లి సుతుండు గే
సరినఖంబుల [3]ద్రవ్వఁబడ్డగజంబుచాడ్పున నుండఁగాఁ
గరుణ మాత్మకు [4]నింత మిక్కిలి గాక యున్నె జనార్దనా.

65 సీ. వీఁడె వికర్ణుఁడు వాఁడిమెఱుంగు మే
ఘంబులగములమధ్యంబునందుఁ
దేజరిల్లెడు [1]మాడ్కి రాజిలుచున్నవాఁ
డతిసాంద్రహస్తి[2]కాయములలోనఁ
గార్ముకజ్యాకి[3]ణకఠిన మై యున్న యి
బ్బాలుని ముంజేయి బాలగృధ్ర
[4]మోపదు కబళించియును జంచుపుటమునఁ
జీరంగఁ జూచితే శౌరి యితని

తే. రమణి పొరిఁబొరి గన్నీరు గ్రమ్మఁ జుట్టు
మెలఁగి కాకులఁ గ్రద్దలఁ దోలఁగ నడుచు
చున్న యది [5]పాసి యవివోవకున్న నిట్లు
సూతురే తల్లు లెందును సుతుల నకట.

---

63 1. వృత్తిమతియేమిటికిన్ - ఈ.

64 1. లున్నవి సాగిసాగి — కొన్ని ప్రతులు ; లున్ బరిగల్గి - స. 2. వివర్ణమై — ఎ.వ ; విశీర్ణమై — వ ; ముదీర్ణమై - ప ; విదీర్ణమై — ఊ. 3. ద్రెవ్వ — కొన్ని ప్రతులు. 4. మీద మిక్కిలి — ఊ.జ.వ.

65 1. చూడ్కి — ల. 2. చయంబు — ఓ.చ.వ ; కాయములనడుమ — గ.వ. 3. కీర్ణ— పెక్కు ప్రతులు ; కీర్ణకలితమై — వీ.శ.ప. కొన్ని ప్రతులు. 4. యొక్కటి — కొన్ని ప్రతులు. 5. దలఁగ — కొన్ని ప్రతులు. 6. గాని యవి వాయవన్న — కొన్ని ప్రతులు.

66 క. మారుతనందనునుగ్రపు
నారాచము లొడల నాటినం జచ్చియు న
వ్వీరకుమారుం డుజ్జ్వల
చారుత్వముఁ బాయ కున్న చందముఁ గంటే.

67 క. అని[1]మొన నెవ్వరికిని మా
ర్కొన రానిఘనుండు దుర్ముఖుఁడు భీమునిచే
[2]వినిపాతితుఁడై భూరజ
మున [3]బ్రుంగుడు వడ్డవాఁడు మురహర కంటే.

68 తే. నక్కతోఁడెలు వీనియాననముపగము
దిన్నయవి యట్లులయ్యెను నున్నయొప్పు
[1]దొరసి సప్తమినాఁటిచందురు[2]నిఁబోలె
చూడు భావించి దీపితశూరవం[3]శ.

69 మత్తకోకిల. శూరసేనుఁడు భీమసేననిషూదితుండయి చుట్టు నం
భోరుహానన లార్తి మూర్తతఁ బొందిన ట్లతిరూక్షహా
హారవంబులతోడఁ గ్రుమ్మర నల్లవాఁడె [1]వికారితా
కారుఁడై పడియున్నవాఁడు [2]వృకంబుఁ [3]బతులు జించినన్.

70 సీ. అంగంబు కోమల మంతరంగంబు చా
తుర్యనిరూఢంబు శౌర్యఘనుఁడు
వీఁడె గోవింద వివింశతి యాతండు
[1]సొబగుండు మెలఁతలు సుట్టు నెపుడు

---

67 1. నొరులెవ్వరి – కొన్ని ప్రతులు. 2. ననిపీడితుఁడై – కొన్ని ప్రతులు. 3. బ్రుంగిన వాఁడువాఁడె – కొన్ని ప్రతులు.

68 1. దొరసె – కొన్ని ప్రతులు; మెరసె – ఊ.ఓ. 2. నిఁబోలి – స; నిచెలువు – కొన్ని ప్రతులు. 3. వర్య – ఊ.వ.

69 1. విదారితా – కొన్ని ప్రతులు. 2. మృగంబు – కొన్ని ప్రతులు; వృకంబువశము – ఐ. 3. బతియు – కొన్ని ప్రతులు.

70 1. సొబగొందు – వ.

నప్సరోగణ మమరాధిపుఁ గొలిచెడు
చాడ్పునఁ బాయక సమ్మదంబు
చిగురొత్త నుండుదు రగరుకస్తూరికా
చందనాద్యనులేపశాలి యిపుడు

తే. గ్రద్దలును గాకులును జుట్టుఁ గదిసియుండఁ
దఱచు నెత్తుటఁ దోఁగిన తనువుఁ దాను
నున్నవాఁడు గానాకర్ణనోత్సుకుండు
నక్క లఱచెడుచేరువ నక్కటకట.

71 తే. కనకపుంఖశరావృతగాత్రుఁ డైన
దుష్ప్రహుఁడు చచ్చియుండియుఁ దోయజాక్ష
వికచనవకర్ణికారసంవేష్టనంబు
గలుగు శైలంబు తెఱఁగునఁ బొలిచెఁ జూడు.

*—: గాంధారి యభిమన్యుకళేబరంబు గనుంగొని ప్రలాపించుట :—*

సం. 11—20—1

72 వ. [1]అని మఱియు నిట్లనియె.

73 లయవిభాతి. అరయ నిది పెద్దయని [1]యరుల మొనఁ జిత్తమున
సరకుగొన కుగ్రమగుబరవస మెలర్పం
ద్వరితగతిఁ జొచ్చి కురువరుఁడు దలరం గవిసి
కరితతులుఁ దేరులనికరములుఁ దురంగో
త్కరములును గాల్బలము [2]నెరవులునుఁ గీటడఁగ
శరగురుఁడు గర్ణుఁడును గురుసుతుఁడు మద్రే
శ్వరుఁడుఁ గృపుఁడుం [3]బరవ బరగి దివిజుల్ వొగడ
ధరఁ బడి ముకుంద మన నరతనయుఁడొప్పెన్.

---

72 1. అని మఱియు - వా ; అని మఱియు నిట్లనియె - పెక్కు ప్రతులు.

73 1. పరుల — కొన్ని ప్రతులు. 2. నరవరులు — వీ.శ.ష.స. 3. బఱువ — వీ.శ.స.

74 ఆ. [1]పాడిమాలి తన్నుఁ [2]బలువురు పొదివినఁ
బోరి తద్ద డప్పిఁగూరి నిదుర
పోయెనొకొ సుభద్రపుత్రుండు మృతుఁడై నఁ
జెలువ మింతయేల కలుగ నేర్చు.

75 సీ. ఉత్తర యిక్కుమారోత్తము నురమున
వ్రాలిమోమునఁ దనవదనకమల
మందంద [1]చేర్చుచున్నది మున్ను గన్నంత
మెలఁగంగ నేరక చెలులమాటు
గొను సిగ్గుపెంపున వనట నిట్లయ్యె ని
ప్పుడు మాటిమాటికిఁ బొలఁతిప్రియుని
గనుఁగొని [2]బిగియారఁ గౌఁగిలించుచు శిర
మూరు[3]తలంబున నునిచి పాణి

తే. పల్లవంబున నానన మల్లనల్ల
దొడయుచును నిన్నుఁజూచుచుఁ దోడుతోడఁ
[4]బొడము పెల్లునఁ గన్నీరు దుడిచికొనుచు
నలఁత పెనువెల్లిఁ [5]దేలెడు నంబు[6]జాక్షి.

76 వ. వింటె యవ్వనితవిలాపంబు.

77 సీ. భద్రచారిత్ర [1]సుభద్రను నిర్జర
ప్రతిమానులగు పాండురాజసుతులఁ
బాసి యెం దరిగితి పార్థునిపట్టి న
చ్యుతుని యల్లుని సమరోర్విఁ జెనసి
పరిమార్పఁ [2]జాలి రెవ్వరు పెక్కుభంగుల
మాటలాడఁగ మఱుమాట లేల

---

74 1. పాడి దప్పి - ఔ.గ.చ.వ. 2. బదువురు - చ.

75 1. నేర్చు—వా; చేర్చు—పెక్కు ప్రతులు. 2. బిగియమార—ఊ. 3. తల్పంబున—ల.
4. బొడమవెల్లి గ — ఊ; బొడము పెల్లగు కన్నీరు — స. 5. దెరలెడు — చ.
6. జాక్షి — వ.

77 1. సౌభద్ర నిర్జరపతి ప్రతిమాను — కొన్ని ప్రతులు. 2. జాలరెవ్వరుఁ బెక్కు — స.

యాడవు నాతోడ నస్త్రగురుండుఁ ద
త్తనయుండుఁ గృపుఁడు రాధాసుతుండుఁ
తే. [3]బాడిమానసు[4]లంద్రదు నిన్ను నొకనిఁ
బొదివి రస్సిరొ [5]పెక్కంద్రు ప్రోడలిది యు
మగఁటిమియె క్రించుపనికిట్లు దెగినయప్పు
డుల్లములు వారలకు నెట్టులుండె నొక్కొ.

78 క. పాండవులును బాంచాలురు
దండిమగలు వారుసూడఁ దలఁకక నిన్నుఁ
ఖండనమునఁ బడవైవఁ[1]గ
గండు గలుగు టద్భుతఁబు గాదె తలంపన్.

79 క. తనలేనిచోటఁ బలువురు
నినుఁ జుట్టును ముట్టి యొక్కనిం [1]జేరి వధిం
చిన వంచనకు ధనంజయు
[2]మన మెమ్మొయి నరియునొక్కొ మన్మథమూర్తీ.

80 తరల. అరుల నెల్లను [1]గెల్చి మేదిని యంతయుఁగొని తేజముఁ
సిరియుఁ బెంపును గీర్తియుఁ విలసిల్లఁగా మనుచుండియుం
బురుషసింహులు పాండుభూవరపుత్రు లక్కట మోదముం
బొరయ నేర్తురె నిన్నుఁ గోల్పడిపోయి పుష్కరలోచనా.

81 క. నీమూర్తియందుఁ బ్రాణము
లేమిఁ దెలిసి యుండఁ జంచలింపక జీవం
బేమికతంబునఁ గలిగియొ
నామేను దొలంగి పోదు నాథ యెఱుంగన్.

---

కొన్ని ప్రతులు. 3. బాటి — కొన్ని ప్రతులు. 4. లందరుబాలు — కొన్ని ప్రతులు.
5. పెక్కంద్రు యోధులు గదియనదియు — ఓ.చ.

78 1. మగండు — కొన్ని ప్రతులు; నొకండు — కొన్ని ప్రతులు.

79 1. జెనసి — కొన్ని ప్రతులు; జేసి — ఇ.జ.వ. 2. మనసెమ్మొయి మురియు — స.

80 1. గూల్చి — కొన్ని ప్రతులు.

82 సీ. దేవలోకంబున [1]నీవిప్పు డెవ్వతఁ
దీపారుపలుకులఁ [2]దేర్చి కురులు
వుడుకుచుఁ దగ నన్నపోశ్రె[3]లోలాత్మగాఁ
జేయుచున్నాఁడవు చెలువు నేర్పు
మెఱయంగ నచ్చర తెఱవలమనములు
గలఁచి యాడుదు గాక యలఁతిఁ బోదెఁ
యంగనాగోష్ఠి నున్నపుడు నానడవడి
బుద్ధిఁ దలంతె [4]నిన్నొందఁ గాంచి

ఆ. యాఱునెలలు వోయె నంతియ యింతియై
కాని లేదె తొంటిమేనఁ జేసి
నట్టి మేలు మోహనాకార యభిమన్యు
వీర నిర్వికార [5]వినుతసార.

83 వ. అను చున్నది యిట్లు పలవింప విరాటనందనం దదీయ జననీప్రముఖ బాంధవస్త్రీజనంబు లచ్చటువాయం దిగిచి పొగులుచుం గొనిపోయిరి వారలం గనుంగొనుము.

84 కవిరాజవిరాజితము. గురునిశరంబులు దాఁకిన మేదినిఁ గూలి విరాటుఁడు పేరినవె త్తురుల మునింగిన మేనును దానును ధూళి సమీరుఁడు మోముపయిం బోరిఁబోరిఁ జల్లగ నున్కి గనుంగొని పొద్మగ నశ్రులు హా యనుచుం బురపురఁ బొక్కెద రెమ్మెయిఁ జోపినఁ బోవక మూఁగెడుఁ బక్షితతుల్.

85 క. అకటకట యుత్తరుఁడు గొం
డొక కాంభోజుండునుం గడుఁ బాలుఁడు వా
లిక కైదువు లాడిన నే
ల కొఱగియొప్పి రభిమన్యు లక్ష్మణుల క్రియన్.

---

82 1. దీపించుసెవ్వతె — ఈ. 2. దేర్చి — కొన్ని ప్రతులు. 3 లోభాత్మ — వ
4. నీపొందుగాంచి — ఈ. 5. విమతహార — జ ; వినుతశూర — క.డ.వ.

86 సీ. పాండుపుత్రుల భుజాబలమున [1]కులుకక
యెవ్వీరు పాఱిపున నెదురు నడచె
దుర్యోధనుఁడు గొంతి తొలుచూలి కెవ్వఁడు
హృదయశల్యంబయి నిదుర సెఱుచు
నట్టికర్ణుండు మదాంధసింధురము బ
లోద్ధత ద్విరద మహోగ్రవిక్ర
మమునఁ గీటడఁగినమాడ్కి నర్జును బలు
గడిమిచేఁ దెగటార్పఁ బడియె వీని

ఆ. బాహువిలసనమునఁ బడిన మహాయోధ
వరు లనేకు లితఁ డవార్యరోష
ధూషితుండు పరుషభాషణశీలుండు
[2]ధైర్యధనుఁడు దానశౌర్యశాలి.

87 వ. విను మవ్వీరోత్తముండు.

88 క పిఱుఁదం గురుధరణీపతి
నలచేతం బ్రాణములు [1]ఘనారాతిబలం
బులని తెగువ ముందటఁ బె
న్గొలుట చిత్తమునఁ బెట్టికొని విహరించెన్.

89 తే. ఇతనిచుట్టును గలకల మెసఁగరోద
నంబు సేయు పత్నీనివహంబులోనఁ
గంటె వృషసేనుతల్లి యగ్గలపుటడలు
[1]మూర్తియైన తెఱంగున నార్తిఁ[2]దూలె.

90 వ. ఈ రమణీరత్నంబు ధరణీతలంబునం బొరలుచు.

---

86 1. కలుకక — కొన్ని ప్రతులు ; కలుగక — కొన్ని ప్రతులు. 2. శౌర్యధనుడుగాఢ వీర్యశాలి — జ.వి.శ.ష.

88 1. గ నభియాతిబలం — కొన్ని ప్రతులు.

89 1. మూర్తమైన — ఏ.ఐ.ఓ.చ. 2. గూలె - కొన్ని ప్రతులు.

91 తే. పరశురాముని [1]శాపంబు బాణశక్తి
[2]గ్రాఁప బ్రాహ్మణ[3]శాపంబు రథము నిక్క
వఱుప గాండీవధరు చేతి మెఱుఁగుటమ్ము
మన్నిగొనియెనె యోకర్ణ మగలరాజ.

92 వ. అని మఱియుం బలు దెఱంగులం బలవించి యుత్థితయై యాలోకించి.

93 తే. కాకులును గ్రద్దలును దిన్నఁ[1]గడుసు ద్రెస్సి
యపరపక్షచతుర్దశి యమృతకరుని
కరణి నొప్పెడు కర్ణుమొగంబుమీఁద
వనిత యందంద మోపెడుఁ దనమొగంబు.

94 ఉత్సాహవృత్తము. వాఁడిమగఁడు నిద్రవోవు వాలు[1]మృగముఁ బోలె నై
వీఁడె బాహ్లికుండు వృష్ణి వీరచూడు చచ్చియుం
[2]బోఁడి దొఱఁగ కున్నయట్టిపొల్పుఁగా వెలింగె వె
న్నీఁడితండు [3]బలము లెన్నియేనిఁ బెల్లు ద్రోచినన్.

95 తే. మేనఁ బ్రాణము వాసినమీఁద మొగము
[1]బొఱసి యుండునె యొందు నిత్తెఱఁగుకాంతి
తోడఁ బున్నమనాఁటి చందురుని చంద
[2]మమరెఁ జూడు మిక్కురు వృద్ధునాననంబు.

---

91 1. కోపంబు - కొన్ని ప్రతులు. 2. దాఁవ - కొన్ని ప్రతులు. 3. కోపంబు - కొన్ని ప్రతులు.

93 1. గడమద్రెస్సి - పీ.ష.స.

94 1. మెకము – కొన్ని ప్రతులు. 2. పోఁడిమిం దొరంగకుండ – కొన్ని ప్రతులు; బోఁడిమెట్లు దొరగకున్న - కొన్ని ప్రతులు. 3. రిపుబలంబులెన్నియేనిఁ ద్రోచినన్ – పీ.శ.ష.స.

95 1. మెఱసి – పెక్కు ప్రతులు. 2 మమరెనిక్కురువృద్ధుని యాననంబు – కొన్ని ప్రతులు.

*—: గాంధారి సైంధవుని కళేబరము చూచి వాపోవుట :—*

సం. 11—22—7

96 సీ. [1]పల్కుతప్పమి నెఱపంగఁ దలంచి యు
త్సాహంబు వాటించి సవ్యసాచి
దుర్యోధ[2]నుండును దొరలు ననేక సై
న్యంబులు [3]నంతంత నడ్డపడఁగ
దెరలిచి [4]వడి మెడఁద్రెవ్వ నేసినఁ బడి
యున్నాఁడు సైంధవుఁ డుఱకద్రుపద
తనయఁ గాననమునఁ గొనిచన్న నాఁడతాఁ
దెగినాఁడు గాఁడె కౌంతేయు లపుడు

తే. దయదలిర్పంగ దుస్సలఁ దలఁచి యలుక
గ్రాఁచి మందల విడిచిరిగాక దైవ
కృతము తప్పింపరాకున్కి కతన నిపుడు
వారు విడిచి రిమ్ముద్దియవలని కరుణ.

97 తే. హృదయము[1]న వగలేచి యట్టిట్టునట్టుఁ
దిరుగు చున్నది దుస్సల వరుని శిరముఁ
గాన [2]కీకూఁతు నిమ్మోయిఁ గనుటకంటెఁ
దలఁప నెక్కుడు దుఃఖంబు గలదె కృష్ణ.

98 వ. [1]నాఁటిరాత్రి యరులు చేసికొనినప్రతిజ్ఞ వేగులవారిచేత దుస్సలవిని సైంధ
వునికి బుద్ధిచెప్పిన తెఱంగు లవి వినుము.

---

96 1. పలికితప్పమి — కొన్ని ప్రతులు. 2. నుఁడునొద్దిదొరలు — కొన్ని ప్రతులు.
3. నమ్మోయి — కొన్ని ప్రతులు; ననిమొన — చ; బలిమిని — ఈ.ఎ.ఐ.వ.
4. మెడఁద్రుంచి పోరిగొన్న వసమరిధరనున్నవాఁడు సైంధవుఁడు ద్రుపద — ఎ.ఓ.

97 1. గలంగఁ గలనను నిట్టునట్టు — వ. 2. దిక్కూతు — కొన్ని ప్రతులు.

98 1. ఈ వచనము పెక్కు ప్రతులలో లేదు.

99 సీ. [1]విజయు ప్రతిజ్ఞకుఁ ద్రిజగంబులోపల
నడ్డంబు లేదు సుమ్మధిపుఁ డంటిఁ
గురురాజుసైన్యంబు బిరుదు నమ్మకుమంటి
గురుఁడు పార్థునకు మార్కొనఁడ యంటి
నరు డాయ నొకనికైనను బుద్ధి గొన దంటి
సమరంబు నీకు నసాధ్యమంటి
ధర్మపుత్త్రుఁడు నిన్ను దయఁగాచుఁ బొమ్మంటి
నామాట వినఁగదె నాథయంటి

ఆ. రాజతిలక రాజరాజకంఠీరవ
రాజరత్న దివసరాజతేజ
రాజరాజ యనుచు రాజన్యు సైంధవ
రాజుఁ బనుపుచుండె నాజిలోన.

100 తే. తోడఁ బుట్టువు విధవయై తొలఁగి యునికి
కోర్చి చలమునఁ బతిఁ దెగటార్చి సంత
సించితిరె తండ్రులార మీరంచుఁ బాండు
పుత్త్రకుల దూఱుచున్నది పొలఁతి వింటె.

101 ఉత్సాహవృత్తము. తనయుఁ గాచు పనికిఁ బూని ధర్మపుత్త్రవాయునం
దనులుఁ గవలుఁ జేయఁగలుగు దండిమగలు సేనలం
గొని వడిం గడంగ నరకుగొనక నిల్చియొక్కఁడుం
[1]బెనఁగియాఁగె సైంధవుండు బిరుదు దకుఁడుం గదే.

102 తే. తప్పు సైంధవుపైఁ బెట్ట దగునొ తగదొ
పార్థుప్రతినకు నొక్కండ [1]పాత్రమయ్యెఁ
దాన యందఱు నాఁగుట తప్పుగాదె
యదియ సౌభద్రుమృతిహేతు వగుటలేదె.

---

99 1. ఈ సీసము పెక్కు ప్రతులలో లేదు.

101 1. బెనఁగనోపె — ఒ.ట.

102 1. పాస్త్రమయ్యె — వ.

103 తే. బోరగిలఁ బడ్డవాఁడు గపోలమొకటి
పుడమి మోచినయది మోము పొలుపు సెడదు
వీఁడె చూచితె శల్యుండు వెడలియున్న
జిహ్వ దిని యెడు వాయసశ్రేణి కృష్ణ.

104 క. ఇట్టపునె మాద్రితోడం
[1]బుట్టెననక యితని ధర్మపుత్రునకుఁ గడుం
బెట్టిదుఁడై చంపవలసెఁ
జుట్టపుఁ దనమేల రాజసుతులకుఁ గలుగున్.

105 క. [1]సెల్లుఁడు యమతనయునితో
నెల్లగుణంబులను జాల నెనయును నని తా
నుల్లమున నిశ్చయించుం
జెల్లం బోపోరఁ బగఱచే నిట్లయ్యెన్.

106 వ. అమ్మ[1]హావిభుండు.

107 భుజంగప్రయాతము. కురుక్షోణినాథుండు గోరంగ మైత్రీ
ధురం దాల్చి తా[1]నేర్పుతో సారథిత్వం
బరిశ్రేణి సంతాపసి వైపూని కర్ణుం
బరిక్షోభితుం జేసె భాషాస్త్రపంక్తిన్.

108 ఆ. అధిక పంక [1]పతితమై యున్న యాఁబోతుఁ
బోదివియున్న మొదవు [2]కదుపువోలె
నున్నవారు సూడు మువిదలు దైన్య మా
స్యముల నెలవుకొనఁగ శల్యు బలసి.

---

104 1. బుట్టువనక — స. కొన్ని ప్రతులు.

105 1. సెల్లుండు సుక్వేనీతో సెల్ల — ల.వ.శ.

106 1. హాభుజుండు కొన్ని ప్రతులు.

107 1. నేపుతో — చ.

108 1. మగ్నమై — కొన్ని ప్రతులు. 2. పదువు — కొన్ని ప్రతులు.

109 మత్తకోకిల. చూచితే భగ[1]దత్తు నితఁడు శూరతామహిమన్ నరున్
వీచిసన్నిభబాణ పంక్తుల [2]వెల్లఁజేసె మహేంద్రుతో
నేచి పోరుబలాఁడు వోలె సహింప కీతని నిట్లు గాఁ
జూచి తాతనిమీఁది నెయ్యము సొంపునన్ మురమర్దనా.

110 క. పులుఁగులును [1]మెకంబులునుం
దొలిచి తినిన [2]నెలవుదప్పి తొలఁగి[3]యుఁ గంటే
తల నున్న కనకదామము
పొలుపు దెగంబాయ దీన్నృపుం గమలాక్షా.

—: *గాంధారి శరతల్పగతుండగు భీష్మునుద్దేశించి శోకించుట* :—

సం. 11—23—14

111 సీ. బలశౌర్యములఁ దనపాటిగా నెందును
మానవు నొరుఁ జూప లేనియట్టి
శంతనుపుత్రుఁడే శత్రులబాహు ద
ర్పంబున రణభూమిఁ బడియెఁ దన్ను
వాలాయమును గెల్వ వచ్చునె [1]చంపి కొం
డని పాండుసుతులపై నగ్గలంపుఁ
గరుణ మర్మము సెప్పెఁగాక యెమ్మెయినైన న
నతినిష్ఠ యెప్పుడు నతనియందుఁ

ఆ. గలదు గాదె తండ్రి కార్యంబునకుఁ గాఁగ
రాజ్యముడిగి పూనె బ్రహ్మచర్య
మితనిఁ జెప్పి చెప్ప నితరుండు [2]పౌరుష
కలితసంభవుండు గలఁడె కృష్ణ.

---

109 1. దత్తునిన్దన — ఓ.చ.ష. 2. వేఁడిఁజేసి — స. కొన్ని ప్రతులు ; వెల్లిఁజేసి — ·

110 1. వృకం — గ.వ. 2. జెలువు - కొన్ని ప్రతులు ; జెలువు నెలవుదొంకియు —
3. గదుకంచే — కొన్ని ప్రతులు.

111 1. తనుజంపుఁడని — చ. 2 పురుషార్థకలిత — జ.

112 క. కురువంశ మెడల వచ్చినఁ
బరమోపాయమున మగుడఁ బడసెన్ మడిసెం
గురునికరము తోడన యి
ప్పురుషార్థసారభూషణుఁడు గదే.

113 క. [1]దేవుఁడు గా కితఁడు నరుఁడు
నా వచ్చునె నిష్ఠ పెంపునం బ్రాణంబుల్
తావలసినపుడ విడువం
గా వేడుక నునిచినాఁడు గాదె తనువునన్.

114 ఆ. తీవ్రబాణజాల దీప్తులు [1]పరగించి
[2]పాండుతనయ సైన్య బహుళతమము
లీలఁ బదిదినంబులోలి వినోదించి
[3]యకట భీష్మభానుఁ డస్తమించె.

115 క. శరవణమునందుఁ బొలుపుం
బొరసిన గాంగేయుతోడఁ బోల్పఁగ ననువై
శరతల్పంబునఁ దేజో
భరితుఁడు గాంగేయుఁ డొప్పెఁ బంకజనాభా.

116 తే. అర్జునుఁడు వెట్టె[1]నుతని కంపపాన్పు
నకుఁ దగంగ నిశాతబాణముల మూఁట
నలవరించినతలగడ యస్త్రజనిత
వారిఁ దృప్తునిఁ జేసె నవ్వీర[2]వరుఁడు.

117 క. వీరశయనమున గంగకు
మారుఁడు కల్పక్షయమున మార్తాండుఁడు సం
చార మెడలి ధరఁబడి యొ
ప్పారెడు చందమున వెలిఁగె నంబురుహాక్షా

---

113 1. దేవర — కొన్ని ప్రతులు.

114 1. నిగుడించి — వ. 2. పాండవేయసైన్య—ఆ.ఊ. 3. యనఘ — కొన్ని ప్రతులు.

116 1. నితనికిఁగంప — కొన్ని ప్రతులు. 2. రునతఁడు — కొన్ని ప్రతులు.

118 క. దేవవ్రతుండు గీర్వా
ణావాసంబునకుఁ జనిన యటు కురునికరం
బేవాని నడిగి తెలియు[1]నో
కో వికసిత ధర్మ సంప్రయోగవిధంబుల్.

119 సీ. పగవారి మొనలను [1]పల్లెరులం గాల్చి
మడిసెఁ గుంభజుఁ డనియెడు దవాగ్ని
యెన్ని యస్త్రము లింద్రుఁ డెఱుఁగు నన్నింటను
బరిణతుం డీతండు భార్గవునకు
నెట్లట్లు సువిధేయ మిమ్మహాత్మునకు ధ
నుర్వేద మితనికి సర్వవేద
ములుఁ బరిచితము లియ్యలఘుతేజుని శిష్యుఁ
గాదె పార్థుఁడు గార్ముకమున మేటి

ఆ. యయ్యిరువురకుఁ గౌరవాన్వయ [2]జాతులు
సాత్యకియును నిర్వికారబుద్ధి
నాశ్రయించుటను [3]మహాస్త్రవిత్తము లైరి
యోధు లింతవార లుర్విఁ గలరె.

120 క. వివిధమహాస్త్రంబులు గా
లవశతఁ జెడెఁ గాక శౌర్యలంపటు నియ్యో
ధవరు[1]నిఁ బగవారికిఁ జే
ర వశంబగు నెట్లు సంగరంబునఁ గృష్ణా.

121 తే. గురు[1]ని మున్నిడుకొని కాదె కురుకుమారు
లనికిఁ బిలిచిరి ధర్మపుత్రాదులయిన
వాలుమగల నట్లంతటివాఁడుఁ బగఱు
నఱకి వైచినఁ బడియున్న తెఱఁగుఁ గంటె.

---

118 1. దురోవిశ్రుత — క.వ.శ.

119 1. బల్కానసముఁగాల్చి — ఔ.స; ఒల్కారడవిఁగాల్చి — కొన్ని ప్రతులు.
2. జ్ఞాతులు — ఓ జ. 3. ఘనాస్త్ర — కొన్ని ప్రతులు.

120 1. నినెవ్వారికి — చ.

121 1. మున్నిడికొని-కొన్ని ప్రతులు ; మున్నిడుకొనిపోయి-జ.శ ; ముందటనిడికొని-[illegible].వ.

122 తోటకము. సతతంబును శిష్యులు సద్వినయా
న్వితులై ప్రణమిల్లెడు వీరిపద
ద్వితయంబు గడుం జెడఁ దిన్నవి సూ
చితె నక్కలు దైవముచెద్దుఁ గటా.

123 ఆ. ద్రుపదతనయుఁ డట్టె [1]ద్రోణునితలఁ గోయు
వాఁడు విధికి నెట్టివారి [2]నెట్టి
తెఱఁగు సేయరాదు [3]దీనికి నే మను
వార మిది యసంభవంబు గాదె.

124 సీ. కృపునితోఁ బుట్టువు కృపి తనభర్త ద్రో
ణాచార్యుపాల దైన్యంబు [1]విపుల
వేణియు మొగమునవెంట ముసుంగు వ
డంగ వాల్వడిన యెలుఁగుతోడఁ
బలవించి పలవించి బహుశిష్యులయ్యతి
రథవర్యు నస్త్రశస్త్రములు రథము
నవయవంబులును జితాకలనంబు సే
యుచు సామగాన సంయుక్తవదను

ఆ. లగుట సూచి సామమతికరుణంబుగాఁ
దాను బాడ జొచ్చె మానితాగ్ని
పొద నమర్చి యవ్విశుద్ధాత్ము నొండొక
యగ్ని వోలెఁ బెట్టి రందుఁ గృష్ణ.

125 క. [1]కృపి మున్నుగ శిష్యులు పొద
యపసవ్యముగాఁగ దిరిగి యరిగిరి శోకా
ర్తపు [2]టొడళులతో గంగకు
నపగతశరవిద్యయయ్యె నవని కటకటా.

---

123 1. ద్రోణుల — ఆ ఏ.చ. 2. కెట్టి — కొన్ని ప్రతులు. 3. దీనినే మనఁగలవార — కొన్ని ప్రతులు.

124 1. గదుర — స. కొన్ని ప్రతులు ; మిగుల — ట.

125 1. కృపియును శిష్యులునాపొద — వ. 2. మేనుఁతో — ల.

126 ఆ. సోమదత్త[1]సుతుని జూడుము సాత్యకి
దూష్యభంగి శిరముఁ దునుమ నొఱగి
యున్నవాఁడు గ్రద్ద[2]లొలిచి తినంగ నీ
సుకృతపరుని నిట్లు సూడవలెనె.

127 వ. సోమదత్తుఁడు పుత్రశోకాయత్తచిత్తుండై యుండి తన్ను సాత్యకి [1]గవిసి నప్పుడు తనకొడుకునెడ నతండు సేసిన యధర్మం బుగ్గడించి గర్హించిన విధంబు మృతుండైనను మొగంబునం దోఁచుచున్నది భూరిశ్రవు[2]తల్లి యది యతనిని వల్లభుని బోరఁబోరం గనుంగొనుచు గద్గదకంఠంబుతో నాసోమదత్తు నుద్దేశించి.

128 సీ. ఓరాజ కల్పవృక్షయోప మానంబగు
కౌరవజాతి సంతయము చూడ
కున్నాఁడ వధిక దానోజ్జ్వలు [1]బహుమహా
ధ్వరకర్త భూరిశ్రవసుఁడు నీదు
గారాబు పట్టి సంక్రందననందను
దుర్విక్రమంబునఁ దునుమఁ[2]బడిన
బాహువు సాత్యకి పాపకర్మంబున
సంఛిన్నమైన మస్తకము నైమ
ఆ. హీతలమునఁ బడియె నిష్పుణ్యసంతతి
దిక్కుసూడ వేల యొక్కమాటు
కొడుకుచుట్టు నేడ్చుకోడండ్ర యలమట
యరయ విట్లు దగునె యధిప నీకు.

---

126 1. తనయు — కొన్ని ప్రతులు. 2. లూచి — కొన్ని ప్రతులు.

127 1. గదిసి — కొన్ని ప్రతులు. 2. వసుతల్లి యతని — కొన్ని ప్రతులు.

128 1. మగుమహా — జ.

129 క. [1]పీ రేచురొంటి చీరలుఁ
దారును విరిదలలతోడఁ దద్దయు [2]నడలుం
గూరి [3]పలవించెదరు [4]నిను
సారసికల భీతిరుతుల చందము దోఁపన్.

130 ఆ. [1]ఆలమునకు వెడలు నప్పు డిచ్చితి నీకు
పసిఁడి గొడుగు సుతుఁడు లసిత విభవుఁ
డగుట కది[2]నికృత్తమై పడియున్నది
యక్కుమారు రథమునందు జూడు.

131 క. అని [1]పనువుచున్న యది య
వ్వనితను గోడండ్రఁజూడవశమే ఘనుఁ డ
ర్జునుఁ డిట్టినీచర్మం
బున కెట్టులు సొచ్చె[2]నో కుపురుషుఁడపోలెన్.

132 కవిరాజవిరాజితము.
విను మదిసాత్యకి చచ్చుట కోర్వక వీరవరుం డగుపార్థుఁడు సే
సిన తగ వైనను నయ్యోనతం డటుచే నఱుకఁ ముని యైనమహా
త్మునిఁగని యుబ్బుచు సాత్యకి యేమని త్రుంచె [1]శిరంబు కడంగి జగం
బున నొరు లింత నికృష్టపుఁగర్మము [2]పొంతను బోదురె చక్రధరా.

133 క. ఇక్కురువరు [1]నాండ్రురలో
నొక్క తడ యతిరమ్యమూర్తి యుత్సంగమునం
దక్కర మిడికొని పనవెడు
నెక్కుడువగ నూనియదె మహీధర కంటే.

---

129 1. జడ్డ – కొన్ని ప్రతులు. 2. పీరెవ్వ – కొన్ని ప్రతులు ; 3. నార్తి – కొన్ని ప్రతులు. 4. విలపించె – ఒ.ఔ.డ. 5. విను – కొన్ని ప్రతులు.

130 1. ఆహవమున కరుగు – కొన్ని ప్రతులు. 2. నికృత్తమై – కొన్ని ప్రతులు ; నివృత్తమై – వా.వీ.

131 1. వసరు–ఒ.వ ; యేడ్చు–ఊ ; పలుకు–ఓ.చ.వ. 2. నొక్కొ – కొన్ని ప్రతులు.

132 1. గడంగిశిరంబు కొన్ని ప్రతులు; దదీయశిరంబు – జ. 2. పొత్తున – క.చ.వ.

133 1. భార్యలలో – ఈ.వ ; నారులలో – కొన్ని ప్రతులు ; నాతులలో – క.వ.

134 సీ. [1]మెలుపారఁగాఁ బట్టి మొలనూళ్ల మణులు గ
దల్చుచుఁ దిగుచుచుఁ దగులొనర్చుఁ
జనుఁగవమీఁది [2]కల్లన వచ్చి లలిత వి
మర్దనంబున లజ్జ మరలఁద్రోచు
నాభి యూరులు జఘనము మెత్తమెత్తన
యొత్తి ముదంబున నుల్ల [3]మూన్చు
ననయంబుఁ దన్నని యనువున గనయంబు
పిర్రదులంగ మెలఁ[4]పి సొక్కుదవఁ జేయు

ఆ. నిక్కరంబు సెయ్యి మెక్కింప [5]నేరంగఁ
దగిలి [6]సంతతంబుఁ దలఁచునట్టి
భంగి మెఱయ గీడువఱుపంగఁ గొనియాడ
వలఁతి నీఱు సేయవలసె దీని.

135 ఆ. ఒరునితోడఁ బోర వారి నూడ సిగ్గఱి
యేసె విజయుఁ [1]దతని యేటు సభల
నమ్ముకుందుఁ [2]డెట్టు లగ్గించు నట్టివి
వ్వచ్చుఁ [3]డేమిభంగి మెచ్చుఁ దన్ను.

136 వ. అని యిట్లు విలాపంబు చేసి యూరకున్న దివ్యాకృతిం దక్కుటి యొలనాఁగ తేలిన దానిఁ బోలెఁ బొదివికొని యున్నవా రాలోకింపుము.

—: *గాంధారి శకుని కళేబరంబు గాంచి యతనిచేఁత లుగ్గడించి శోకించుట* :—

సం. 11-24-21

137 సీ. మేనల్లుఁ డగు నకులానుజు నేటులఁ
బడియుండి శకునుల పాలు వడ్డ

---

134 1. పొలు — వ. 2. కొల్లన — చ. 3. మాన్చు — కొన్ని ప్రతులు. 4. గి — పెక్కు ప్రతులు. 5. నెలతల — జ.శ. 6. సంతసంబు న. — కొన్ని ప్రతులు.

135 1. దట్టి — ఈ.చ. 2. దట్టులగ్గించునట్టి — న. 3. దెట్టి — కొన్ని ప్రతులు.

శకునిఁ జూచితె మురసంహార యితఁడు [1]మా
యాజాలమునకు నాఁ [2]డోజ సకల
మాయలు [3]నీచేత మడిసె దుర్ద్యూతంబు
నొనరించి రాజ్యంబు గొనియె ధర్మ
తనయునిచే నిష్ఠు దనచెయ్ది ఫలియించె
నని యనుజూదంబు నందుఁ బ్రాణ

ఆ. మోటు [4]పడియె నెత్తమాటకు నీతండు
గఱచు పెల్లఁ గురుని కాయనాశ
మునకు నయ్యె నీ నృపుఁడ కాఁడె పాండునం
దనులతోడి వైరమునకుఁ గర్త.

138 క. హిత మొనరించెద నంచుఁ
ధృతరాష్ట్ర తనూభవు[1]నకుఁ దెక్కలి కాఁడై
మృతి యొనరించెం దానును
మృతుఁ డయ్యెను భ్రాతృపుత్ర మిత్రయుతముగన్.

139 మత్తకోకిల. వార లస్త్ర హతాంగులై యనవద్య లోకము గాంచి రీ
వైరకర్తయు నట్లు గాంచెను వారి నల్ప విచారులం
బోరి కెత్తెడు నట్లుగాఁ దగఁ బొందె వెఱ్ఱులఁ [1]జేసె నీ
[2]క్రూరుఁ డందును నన్నదమ్ములకుఁ విరోధము సేయఁడే.

140 క. రుచిరాంగదు [1]శస్త్రనిచయ
నిచితాంగకునిం గళింగ నృపుఁ గంటె సమి
ద్విచరణ విహారణమున నితఁ
డచలిత ధృతి యగుట యెఱుఁగ నయ్యెడుఁ గృష్ణా.

---

137 1. మాయోపాయములకు – అ. 2. డొజ్జ - కొన్ని ప్రతులు. 3. నితనిచే - అ.ఈ.గ.వ. 4. పోయె - పెక్కు ప్రతులు.

138 1. లకు - కొన్ని ప్రతులు.

139 1. జేసియా - కొన్ని ప్రతులు. 2. క్రూరుఁడెందును - కొన్ని ప్రతులు; క్రూరుఁడిమ్మెయి - ల వ ; క్రూరకర్ముఁడు - ఊ.

140 1. శస్త్ర – ఎ.క.చ ; నస్త్ర - వా. కొన్ని ప్రతులు.

141 ఆ. ఇతని [1]చుట్టు నున్న యెలనాఁగ లడలునఁ
గూరి [2]వందియును ముకుంద యొప్పు
వాయ కున్న వారు బలితంపువడఁ బడ్డ
పుష్పదామకములపోలుపు దోఁప.

142 ఉత్సాహవృత్తము. మానినీ జనంబు సేరి మగధనాథుఁ డగు జయ
త్సేను చుట్టు నేడ్వ [1]నధిక దీన నాదములకు నా
మానసంబు సాంద్ర కరుణ మయతఁ బొందె మోహనం
బైన యిట్టి యేడ్పు లెందు నంబు జాక్ష వింటిమే.

143 సీ. కోసల నాథుండు భాసుర [1]మూర్తి బృ
హద్బలు చుట్టుఁ బ్రియాంగనాజ
నంబులు సేరి కంపంబు[2] తోడఁ జెమర్చు
కరముల నభిమన్యు కరవిముక్త
శరములఁ బెఱుకుచుఁ బొరి మూర్ఛఁ బొరయుచు
నప్పటి కప్పటి కతని [3]ముఖముఁ
దేటి చూచుచు విధిఁ దిట్టుచు శోకాగ్ని
నుల్లంబు లెరియంగ నున్న వారు

ఆ తునిమి వైవ నెండఁ దనికినఁ బెద్దయు
వంది చూడ్కి [4]దిగువ వలను కలిమి
దొఱఁగకున్న యట్టి తోయజంబుల చంద
[5]మయ్యెఁ జూడ వీరి యాననములు.

144 వ. ద్రోణ బాణ పరిపీడిత ప్రాణులై పడియున్న వారు ధృష్టద్యుమ్న నందనులు.

---

141 1. చుట్ల – ఊ.ఒ.వ. 2. కుంది – చ; కంది – ల.

142 1. మధురధీర – కొన్ని ప్రతులు ; మధురదీన – జ ; మధురగీత – ఇ.ఉ.ఎ.ఔ ట.వ. నధికశోక – ఊ.క.వ.

143 1. కీర్తి – ల. 2. బులు దేహంబు నొలయంగ శోకార్తి నున్న వారు – ఊ. 3. మోము – పెక్కు ప్రతులు. 4. దివియ – ఊ.ఓ.ఔ.చ. 5. మందమయ్యె వీరి – కొన్ని ప్రతులు.

145 మత్తకోకిల. అంగదంబులుఁ గంక[1]ణంబులు హారవల్లులు నాదిగా
నంగకంబుల భూషణంబులు హారికాంతి వెలుంగఁగా
సంగరాంగణ భూమికిం దమచారుభావ మలంక్రియా
సంగతిం గలిగింప నొప్పిరి శౌరి చూచితె వీరలన్.

146 నర్కుటము. త్వరిత రథాశ్వమారుత [1]గతస్ఫురితాకృతివై
శరబహుళార్చిరుద్గమవిశాలతఁ బొల్చు ఘను
ద్గురుఁ డను చిచ్చుపై శలభకోటి గతిం బడి భ్రమం
దిరిఁ గనుఁగొంటె యేవుర నుదీర్ణులఁ గేకయులన్.

147 క. పంచాననంబు చేతం
బంచత్వముఁ బొందియున్న బంధురకరిఁ బో
లించుటకుం దగి యొప్పెం
బాంచాలుఁడు ద్రోణు [1]కడిమిఁ బడి కంసారీ.

148 క. ద్రుపదనృపాలుని ధవళా
తపత్రమస్త్రంబులెచ్చోటుఁదాఁకక [1]జిగియా
రి పోలిచె శారద చంద్రుం
డుపమా పాత్రంబు గాఁగ నుర్వి యనుదివిన్.

149 తే. [1]వల్లభులును గోడండ్రు నీ వసుమతీశ్వ
రునకు నగ్నిసంస్కారంబు [2]నొనరఁ జేసి
యుమ్మలిక[3]మునఁ దద్దయు వెమ్మునంత
రంగములతోడ నరిగిరి గంగ దెసకు.

---

145 1. టం — కొన్నిప్రతులు.

146 1. జవ — శ.ష.స.

147 1. బలిమి — ఏ.జ.శ.

148 1. బిగి — ట.

149 1. వల్లిభలు — ఊ జ.ల వ ; వల్లభులు — వా. కొన్నిప్రతులు. 2. నొనర — వీ శ.ష, కొన్నిప్రతులు ; నొరయ — వా. 3. మూనవెంతయు — వ.

150 క. ద్రోణుఁడు [1]దలరం దలపడి
బాణకళావేది చేదిపతి యుజ్జ్వలత
ప్ప్రాణహతిఁ గూలి సమర
క్షోణి పరిష్కార మగుచు శోభిల్లెఁ గడున్.

151 తే. తలయుఁ గాళులుఁ దమయూరుతలములందు
బెట్టికొని వీనిభార్యలు బెట్టిదంపు
టడలుతాఁకునఁ[1]గడు బెగడారఁ గూరు
నుల్లములతోడఁ బలవించు చున్నవారు.

152 క. మానవనాథు లనేకులు
వీని భుజావిక్రమంబు వేఁడిఁ బడిరి నీ
మేనమఱఁది శిశుపాలుని
సూనుం డీ ధృష్టకేతుఁ జూచితె కృష్ణా.

153 ఉత్సాహవృత్తము. అతనినందనుఁడు సుకేతుఁ డల్లవాఁడె ద్రోణి[1]పా
తితుఁడు వీనిఁ జూడఁగా మదిన్ సుయోధనుండుఁ ద
త్సుతుఁడు దోఁచుచున్నవారు శోకవహ్ని [2]తాప మూ
ర్ఛితముగాఁగ బంధుజనుల చిత్తమెంత గుందునో.

154 తే. అల్లవారె యవంతీశు [1]లధికబాహు
బలులు విందానువిందులు బహుళభూష
ణోజ్జ్వలులు పడియున్నవా రుగ్ర[2]వాయు
పతిత కుసుమితనవ[3]సాలభంగి దోఁప.

155 వ. అని చూపి [1]యిట్లనియె.

---

150 1. దలరం — జ.పి.శ.ప.

151 1. బలువెగడార ; గడువడువగనార — స.

153 1. సాధితుఁడు — ట. 2. గూరియూ — జ.

154 1. లతుల — అ.ఉ.వ. 2. పవన — గ.వ. 3. పాదములభంగి — పాదపముల భంగి — ఐ.

155 1. చెప్పి వెండియు నిట్లనియె — కొన్నిప్రతులు.

156 సీ. శాంతనవుండు నాచార్యుండుఁ గర్ణుండు
భూరిశ్రవుఁడు గురుపుత్త్రకుండుఁ
గృపుఁడు సైంధవుఁడును గృతవర్మయును గురు
[1]రాజు సమానుషరథికవరులుఁ
గలయంగ నెన్నఁడు గోలఁదులవారె వా
రలిగిన జెడుదు రయ్యమరులైన
నట్టివీరుల[2]బారి కగపడి యుండియు
నేమియుఁ గారైతి రీవుఁబాండు

తే. తనయు లందఱు నీకూర్మితమ్ముఁడును
మహాద్భుతమ్మిది దలఁప భీష్మాదులైన
వారి నఱె పోర నిర్జింప వచ్చు నెట్టి
పనియు భరమె దైవమునకుఁ బద్మనాభ.

157 వ. దైవంబు దుర్యోధనాదు[1]లగు నూర్వురకు నొక్కెత్తున నిట్లగునే యని వెండియు.

158 తరువోజ. కురురాజు మొదలైన కొడుకులనెల్లఁ
గోల్పోవు టిప్పుడు గోవింద కలిగె
నరిగితి సంధిసేయఁగ రాక[1]యున్న
నటయప్డు నీ చెప్పుకైనది కాదె
పరవుహితంబుగఁ బలికిరి గంగ
పట్టియు విదురుండు పాటించి పెక్కు
వెరవుల [2]నొత్తినవినదైతి నావి
వేకుల [3]చూపేల వృథవోవనేర్చు.

159 వ. అని పలికి పశ్చాత్తాపదుఃఖంబు పెల్లున నొల్లంబోయి తెలిసి చిత్తస్థాయి యైన పుత్త్రశోకం బడరి యలంతి గానియలంతఁబెట్ట నూరకుండి యక్కౌరవరాజపత్ని పద్మనాభుదెసఁ గనుంగొని కోపోద్దీపితయై.

---

156 1. రాజును మానవరథిక — కొన్నిప్రతులు. 2. పోరి — వ.

157 1. లకు — జ.

158 1. మగుడనట్లొప్పుకీవప్పుడనినట్లకాదె — శ.స. 2. జెప్పినవినదయ్యె — ఈ.ప.ఐ.
3. మాఁటేల — శ.స.

160 సీ. ధృతరాష్ట్ర పాండుభూపతుల కుమారులు
తమలోన నీసున సమరమునకుఁ
దొడఁగిన నీవడ్డపడవైతి తగుచాలు
మానిసుల్ గలిగియు మానసీయ
వాక్యంబవయ్యును [1]శక్యసమస్త కా
ర్యంబునఁ జేర్కొనియును నుపేక్ష
చేసితి కురురాజుఁ జెఱుపన తిరిగితి
నిఖిలరాజులఁ దదనీకములను

ఆ. నామ మడఁచి తెల్లభూములఁ బాడయ్యె
నంతవట్టు ఫలము ననుభవింపు
మేపడంగ నిన్ను శాపానలజ్వాల
దగ్ధమూర్తిఁ జేయుదాన వినుము.

—: *గాంధారి శ్రీకృష్ణునకు శాపంబిచ్చుట* :—

సం. 11—25—36

161 సీ. పూని పాతివ్రత్య[1]పుణ్యఫలంబున
సంపాదితంబైనసార[2]తపము
బలిమి సాధనముగాఁ బలికెద నుత్తమ
జ్ఞాతులఁ దమ[3]లోని సంగరమునఁ
బొలియఁ జేసితి గాన పొలియుదు రన్యోన్య
ఘాతుకులై భవద్జ్ఞాతిజనులు
నీవును దప్పక నేఁడాదిగా ముప్ప
[4]దాఱగు నేఁడైన యద్దినమున

---

160 1. వశ్య — ఙ.

161 1. మునఁబొలుపెసగంగ — గ.వ. 2. ఫలము — ఔ.వ.స. 3. లోని — ఇ.వ; లోన — వా. పెక్కు ప్రతులు. 4. దాఱవ యేడగు నద్దినమున — స.

తే. [5]నరయ దిక్కెవ్వరును లేని [6]యగ్గలంపుఁ
గుత్సితంపుఁ దెఱంగునఁ గూలువాఁడ
విట్లు మీ[7]వధూజనములు నేడ్చువారు
పతుల సుతులను బంధులఁ బనవి పనవి.

162 క. అని ఘోరంబుగఁ బలికిన
విని [1]విపులమనస్కుఁ డైన విష్ణుఁడు చిఱునన
వ్వున [2]నానన మొప్పఁగ న
వ్వనితకు ని ట్లనియె గౌరవస్తుత్యముగన్.

163 తే. మున్న కాదె యాదవులకు మునివరేణ్య
కలితదారుణశాపంబు గలదు నీకు
నేల చర్వితచర్వణ మిట్లు సేయ
దీన నీవేమి తప్పితి దానిఁ జెపుమ.

164 క. యదువంశ [1]జాతులకుఁ ద
ప్పదు నాశము వారి సురలుఁ బరిమార్పఁగ తే
దది కారణంబు [2]గాఁగఁ దె
గుదు రొండొరుచేత [3]రణము ఘోరత్వమునన్.

165 తే. అనిన పలుకులు విని పాండుతనయు లెదలు
వెఱపు పెంపున గంపింప విహ్వలించి
యాత్మజీవితముల [1]దెస నాస లపుడు
వదల విడిచిరి కౌరవ వంశవర్య.

166 వ. ఇట్లు పలికిన యచ్యుతుం డద్దేవి నుద్దేశించి లేవమ్మా మృతులైన సకల
బంధు మిత్రులకు నగ్ని కార్యంబులు సేయింప వలయు నని వెండియు[1].

---

5. నరయఁగాదిక్కు దెసలేని యవసరమున — వ. 6. యగ్గతమున - జ. 7. బంధు - జ.

162 1. విమల - వ. 2. వదన కమల మొప్పఁగ వనితకు - జ.

164 1. జనితులకు - కొన్ని ప్రతులు. 2. గాన — జ. 3. గరము — అ.

165 1. యందునాశ — ఇ.ఒ.

166 1. నిట్లనియె - కొన్ని ప్రతులు.

167 సీ. వినుము గాంధారి నీ తనయుండు చేయు దు
ర్నయము లెఱుంగవె నాకు నీకు
శాంతనవునకు నాచార్యునకు బాహ్లి
కునకుఁ దండ్రికి మాన్పఁ గొలఁది గాని
[1]దుర్మానమున నట్లు దొడరి యిట్లయ్యె మీ
యపరాధమున వచ్చినట్టి కీడు
నకు నింత నొవ్వంగ నను బల్కఁ దగునె యు
మ్మలికంబు ధృతిఁ బట్టి మాన్పుమింకఁ

తే. జేటునకుఁ జావునకు వగఁ జెందు జనుల
కినుమడింపదె మానసమున నలంత
రాచ కూఁతుండ్రు సుతుల సంగ్రామ నిరత
హృదయు లగువారిఁ గాంచఁ గొరుదుర కాదె.

168 వ. అని చెవి సూఁడి నట్లు పలికిన విని నిరుత్తరయై గాంధారి యూరకుండె నట్టి యెడ ధృతరాష్ట్రుండు ధర్మనందనుతో నీవు మన మొనలం గల జనులకొలంది యెఱుంగుదు చచ్చినవారి లెక్క దలంతేని నా కెఱింగింపు మని [1]పల్కిన విను మెఱుకపడ్డవా రుత్తమ జనంబులు డెబ్బదియాఱు కోట్లు నిరువది వేలును మ్రుక్కడి మూఁక యిరువదినాలుగువేలు [2]మున్నూటయిరు వ్రుదుఁ దెగి రని చెప్పిన నమ్మనుజపతి వీరిందఱు నేగతికిఁ బోదురనుటయు.

169 తే. ఎవ్వరాత్మ దేహములు సమిద్ధమైన
యస్త్ర వహ్ని వేలిచిరి వా రమర లోక
మునకుఁ జని [1]నిర్జరాంగనాజనవిలసితుఁ
డైన యమరేంద్రునకుఁ బూజ్యు లగుదు రధిప.

---

167 1. దుర్మార్గమున – జ; దుర్మానియట్టులుదొడరి – స; దుర్మదంబుననట్లు – ల.

168 1. యడిగిన – కొన్ని ప్రతులు. 2. నన్నూట – జ.

169 1. నిర్భరాదరంబుగవిలసితు – జ.స; నిర్భరానందము ననులసితు – అ; నిర్భరానంద జననశీలు – వ.

170 క. తఱచుగ శస్త్రాస్త్రంబులు
నెఱకులు దూఱినఁ జలించి నిజధైర్యంబుల్
మఱచి తెరలి చచ్చిరి కొం
దఱు గుహ్యాక గతికిఁ బోవఁ దగుదురు వారల్.

171 క. సమరమున నెత్తెఱంగున
సమసిననుం గీడు తెరువు [1]చన రుత్తమలో
కమునకు పోదురు జనములు
ప్రముదితులై యంద్రు [2]బుధులు పౌరవముఖ్యా.

172 క. అనిన విని నాథవంతులు
ననాథులును నైన వీరి కందఱకుఁ గృపా
ధనలోల చేయఁగావ
చ్చున కాదే యగ్ని కార్యశోభనముఁ దగన్.

173 వ. అని పలుకుటయు ధర్మనందనుం డిట్లను నీ యఖిల జనంబులు నా హితా గ్నుల [1]యట్ల యట్లుం గాక వీర లిందఱు కుదకదహన క్రియాకరణయోగ్యులును లేరు మన మేది కొలఁదిగా నిప్పని సేయుద మని పలికి తారజ్ఞాత వాసంబు నిర్వహించి సముచిత ప్రకారంబున విరాటాదులచేతం బరిజాతులైన సమయంబున సంగతుండై యది మొదలుగాఁ జెల్లెడు శాంతిక పౌష్టికాది శ్రౌతస్మార్తక్రియాకలాపంబులు నడపుచుం దమయొద్ద నున్న ధౌమ్యు నాలోకించి విదురుని సంజయు[2]నిఁ గనుంగొని మీరు భరతకులులకుం [3]దక్క ననాథవంతులైనవారలకు [4]విధ్యుక్తంబుగా నగ్ని సంస్కారంబు సేయుం డని పనిచి యత్తెఱంగునకుం దోడుపడుటకై సూతజనంబులను దత్కాల సమాగతులైన కరిపురజనంబులోనం దగువారి [5]నిరూపించి మున్న తెప్పిం చిన చందనాగురుఖండ క్షౌమవసన కస్తూరికా కుంకుమ ఘృత [6]తైలప్రభృతు లగు వలయు వస్తువు లాధౌమ్య ముఖ్యుల కొప్పించిన వారయ్యవసరంబునం

---

171 1. చనరు మరుల్లో — అ.స. 2. మునులు — ట.

173 1. రట్లుగాక — ఓ.ఔ. 2. యుయుత్సుని - పీ.శ.ష. 3. దక్కినవారలననాథ — జ; దక్కనుం గలుగు ననాథ — గ. 4. విధియుక్తంబుగా — పెక్కు ప్రతులు. 5. నియోగించి — కొన్ని ప్రతులు. 6. తైలతండుల ప్రభృతులగు — డ.ల.

గూడికొనిన బహుబ్రాహ్మణ సంఘంబులతోఁ జని దుర్యోధన దుశ్శాసన కర్ణశల్యాదులకు నభిమన్యు ఘటోత్కచ విరాట ధృష్టకేతు ప్రముఖులకును దక్కను జేరెఱుకపడు నానా దేశాధీశులకుం బ్రచురకాష్ఠ సంచయంబులను భగ్న రథావయవ ధ్వజధనుశ్శరకుంతాదులను సొదలు [7]వేర్పించి పితృమేధ క్రియలు నడపి చిచ్చునం జొనిపి యనాథవంతులైన భూకాంతుల ననేక సహస్ర సంఖ్యలం బ్రోవులుగాఁ బెట్టించి సమగ్రదారుసముదయంబు [8]లమర్చి యగ్ని యిచ్చి రప్పుడు ఋగ్యజుః పఠన రవంబులును సామగాననాదంబులును రమణీరోదన ధ్వనులును రోదసీకుహరంబు [9]నిండె ధూమంబున దిక్కులు పిక్కటిల్లెఁ జేతన భూతంబుల కెల్ల విపుల విషాదం బావహిల్లె నవ్విధంబునం దగవు నడపించి.

*-: కుంతి ధర్మజునకుఁ గర్ణుండు దన కొడుకగుట దెలుపుట :-*

సం. 11-27-1

174 సీ. భూవర కురువంశపుంగవుం డగు ధర్మ
తనయుండు ధృతరాష్ట్రు వినయ మొప్ప
మున్నిడుకొని యాఁడు మొత్తంబుఁ దోడ్కొని
బంధుజనంబులు బలసి రాఁగ
నరిగి గంగాస్నాన మాచరించి తిలోద
కప్రదానము సర్వ కౌరవులకు
[1]నయ్యాంబి కేయుఁడు నక్కురు భార్యలు
ననుజులుఁ దానును నధిక నిష్ఠఁ

ఆ. చేసి రతని కడకు నా సమయంబున
[2]నడలు నెమ్మనమున నడరి క్రమ్మ
కన్ను నీరు మొగము గప్పంగఁ జని కుంతి
యెల్ల వారు వినఁగ నిట్టులనియె.

---

7. వెట్టించి — అ వీ.ష. 8. లొనర్చి — కొన్ని ప్రతులు. 9. నిండి — కొన్ని ప్రతులు.

174 1. నాంబికేయుండును నక్కురు — జ.పి. 2. నడలు శోకవేదనములు గ్రమ్మ — అ. (అఖండయతి)

175 తరల. వినుము కౌరవ [1]కోటికిం దన విల్లు పెట్టని కోటగా
నని యొనర్చి భవద్బలంబుల నన్నిటిన్ మిము నేపురం
దనిపి యంబరచారులెల్లను దన్ను మెచ్చి నుతింపఁ బా
ర్థునిమహాస్త్రము బల్విడిం [2]దలద్రుంపఁ గూలిన కర్ణునిన్.

176 క. జనులెల్లను రాధేయుం
[1]డనుటను మీరలును వాని నట్లులకా నె
మ్మనమునఁ దలంతు రటుగా
దనఘ [2]మదీయాత్మజన్ముఁ డాతం డరయన్.

177 ఆ. మీకు నగ్రజుండు [1]నాకుభాస్కరు[2]దంశు
లలితకవచకుండలములతోడఁ
బుట్టినాఁడు గానఁ బోయంగ వలయుఁ ది
లోదకంబు లమ్మహోన్నతునకు.

178 వ. అని తదీయ జన్మ[1]ప్రకారంబును దివాకరు [2]ప్రసాద ప్రభావంబును జెప్పుటయు దుస్సహంబు లగు నమ్మాటలు చెవులు సూఁడినట్లయినఁ బాండవులు పరమదుఃఖావేశంబు నొంది రందు [3]భీమాదులు [4]నివ్వెఱపడియుండ ధర్మనందనుండు దల్లడిల్లుచుం దల్లితో నిట్లనియె.

---

175 1. సేనకుందన — కొన్ని ప్రతులు. 2. దను — ల.

176 1. డనవినిమీరలును — ఓ.ఔ ; డనుటయు మదిమీరువాని — వ ; డనుటయు మీరెల్ల వాని — వ. 2. మదీయాగ్రసూను — ట.

177 1. మేటి — వ. 2. నకు — ఔ.ట.

178 1. కాలంబును — కొన్ని ప్రతులు ; కారణంబును — జ. 2. వర ప్రకారంబును — పెక్కు ప్రతులు ; ప్రసాదకారణంబును — వీ.శ.ష ; వరప్రసాదంబును — ల. 3. భీమార్జునులు — కొన్ని ప్రతులు. 4. నివ్వెఱగంది — కొన్ని ప్రతులు.

179 సీ. అనిలజార్జునుల మాఱ్కొన నేర్చె నెవ్వని
యుత్సాహమూఁది సుయోధనుండు
వైదేహ పౌండ్రాది వసుధేశు లెవ్వని
కడిమి సొంపున నరిగాఁపులైరి
మన సైన్యకోటి యెవ్వని బాహు [1]వీర్య సం
పద కోడి యంతంత నొదుఁగుచుండు
నద్భుతం బొనరించె నమరుల కెవ్వాని
యసమాన వివిధ దివ్యాస్త్ర మహిమ

తే. మమ్మునందఱ నెవ్వాని మహితశక్తి
యెక్కుడై [2]సంగరంబునఁ జిక్కువఱిచె
నట్టి కర్ణునిఁ గొంగున నగ్నిదాఁచి
నట్టు లెమ్మెయి దాఁచితో యమ్మ చెప్పుమ.

180 క. అర్జునుఁ [1]డొకరుఁడు దక్కను
పార్జిత [2]శౌర్యమున నమ్మహాబాహుని వి
స్ఫూర్జిత రథమున కెదురై
గర్జిల్లఁగ రథికుఁ డెందుఁ గలుగునె జననీ.

181 తే. కర్ణుఁ డొలుచూలుగా నేల కంటి [1]తల్లి
నీదు [2]మంత్రంబు పరమ విషాదకారి
యయ్యె మాకెల్ల [3]నట్టి మహాబలైక
గణ్యుభ్రుంగుడు పఱచుట కారణమున.

---

179 1. ధైర్య — ఉ ; బలముబో — బో. 2. సంతతంబును — గ.

180 1. పొక్కఁడు — కొన్ని ప్రతులు. 2. విఖ్యాతినమ్మహా — కొన్ని ప్రతులు.

181 1. వకట — ఊ. 2. మంత్రబలంబు విషాద — కొన్ని ప్రతులు. 3. నట్టిబలైక గణ్యుఁగర్ణు బ్రుంగుడు — జ.వీ.శ.స ; నట్టిమహాత్మశౌర్యసారుఁ గర్ణునిబఱచుట—ఊ.వ.

182 తరువోజ. భానుపుత్రునిచావు బంధుల నెల్లఁ బరమ సంతాపంబు పాల్పడఁ జేసె మానితబలుఁ డభిమన్యుండు పోర మడిసినప్పుడు నిట్టి మఱుకువ నాత్మ మానదు ద్రౌపదేయుల నాశమునకు నుడుక దిక్కి విధమున నుల్లంబు ద్రుపద సూనులుధృతరాష్ట్రసుతులును[1] ద్రుంగుచొప్పున కిమ్మెయిఁ[2] జొర దడల్ జాల.

183 ఆ. అతఁడు మాకు నన్న యని మున్న [1]యెఱుఁగఁగఁ
గన్నఁ గురుబలంబు గలఁగఁ [2]బడక
[3]మనుదు మట్టులైన మనుజ[4]లోకమునకుఁ
[5]గలుగ దడలు మాకుఁ గలుగ దడలు.

184 వ. అని విలాపంబు సేసి విషాద[1]శిథిల వర్ణంబులతో గోత్ర నామంబు లుగ్గడించుచు నమ్మార్తాండ నందనునకుం దిలోదక ప్రదానంబు సేసెఁ దదనంతరంబ భీమార్జున నకుల సహదేవులుం జేసి రట్లుకర్ణుండు పాండవాగ్రజుండగుట యెఱింగి గురువధూజనంబు [2]లార్తనాదంబు లెసంగ నాక్రందించిరి ధృతరాష్ట్రుండును గాంధారీ కుంతీ పూర్వకంబుగా నతనికి నుదకకర్మం బాచరించె నయ్యజాత శత్రుండా [3]దినేశ పుత్రుని వలని సౌభ్రాత్రంబు వలనఁ బరిచారికానమేతంబు గాఁ దద్భార్యల రావించి గారవించి యతనికై యనేకవిధపుణ్యకర్మంబులు భూరిదక్షిణంబులుగా ననుష్ఠించి కృతకృత్యతానందంబు నొంది సకలబంధు సహితంబుగా గంగాసముత్తరణం బాచరించె నని యిట్లఖిలజనాభినందితుం డగు ధర్మనందనుండు గర్ణుం దమయన్న యని యెఱింగిన తెఱంగు వైశంపాయనుఁడు జనమేజయున కెఱింగించిన నజ్జనపతి కురు[4]వంశ్యుం డగు నయ్యుధిష్ఠిరు వర్తనం బట మీఁద నెట్లు సెల్లెనని యడుగుటయు.

---

182 1. దెగిన — పెక్కుప్రతులు. 2. జొరదిట్టియడలు - వ ; జొరదు మది యడలు — కొన్నిప్రతులు.

183 1. యెఱుఁగుట గలుగునేని కులముగలఁగఁ — ఊ.వీ.శ.ష.స. 2. కుండ — కొన్ని ప్రతులు ; కుండు — ఇ ఎ క.ల. 3. గొనుదు మెపుడు జయము మనుజలోకంబున - ల. 4. లోకమునన - స. పెక్కుప్రతులు 5. కాదు మఱియు నెందుఁగలదె యడ(రు)లు — వీ.శ.ష.స ; కాదు నాకు నెదురుగలదె యెందు — కొన్ని ప్రతులు ; కాదు నాకు నెందు గలదె యెదురు — కొన్ని ప్రతులు.

184 1. వేదనాయత్తంబగు చిత్తంబున దీనవదన వివర్ణంబులతో గోత్ర - వీ.శ.ష. 2. లుహాహాకారంబు లెసంగ — కొన్ని ప్రతులు. 3. రవిపుత్రుని - పెక్కు ప్రతులు. 4. వంశవరుండగు — కొన్ని ప్రతులు ; వంశకరుండగు — కొన్ని ప్రతులు.

